శ్రీ శుభమస్తు.

# శ్రీగర్గభాగవతము

ఇయ్యది

సికిందరాబాదు పురవాసియు, బాలనీత్యాద్యనేక గ్రంథకర్తయు నగు

బ్రహ్మశ్రీ

## చివుకుల అప్పయ్యశాస్త్రిచే

రచియింపఁబడి

గుంటూరు కన్యకా ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు 1,000 ప్రతులు.

1926.

[illegible]స్వామ్యసంకలితము ] [ వెల రు. 3-0-0

శ్రీగర్గభాగవత బాలనీత్యాద్యనేక గ్రంథకర్త.



చిప్పకుల అప్పయ్యశాస్త్రి.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ గర్గభాగవత
# విషయసూచిక.



| విషయము. | | | పుట. |
|---|---|---|---|

—♦ బృందావనఖండము ♦—

విషయము. | | పుట.
---|---|---

## మాధుర్యఖండము



## మధురాఖండము.

| విషయము. | | పుట. |
|---|---|---|
| యజ్ఞతీర్థకపిటంకాది తీర్థమాహాత్మ్యము | ... | 3౬౧ |
| గోపీభూమీ మాహాత్మ్యము | ... | 3౬౨ |
| సిద్ధాశ్రమ మాహాత్మ్యము | ... | 3౬౫ |
| రుక్మిణి మొదలగువారు రాధను బ్రశంసించి సత్కరించుట ... | | 3౭౦ |
| శ్రీకృష్ణుండు రాధాష్టభార్యాదులంగూడి రాసక్రీడంగావించుట | | 3౭3 |
| ద్వారకాపురీ వర్ణనము | ... | 3౭౬ |
| ద్వారకా ద్వితీయదుర్గవర్ణనము | ... | 3౮౦ |
| ద్వారకా తృతీయదుర్గ ప్రశంస | ... | 3౮౧ |

—♦ విశ్వజిత్ఖండము ♦—

| | | |
|---|---|---|
| మరుత్తోపాఖ్యానము | ... | 3౮౫ |
| నారదముని బహులాశ్వునకు రాజసూయవృత్తాంతంబు జెప్పుట | | 3౮౮ |
| యాదవులు దిగ్విజయార్థంబై వెడలు ప్రద్యుమ్నునభిషేకించి బహుమతులిడుట | | 3౮౯ |
| ప్రద్యుమ్నుండు సేనాసహితంబుగాఁ గచ్ఛాదిదేశంబుల కరుగుట | | 3౯౪ |
| ప్రద్యుమ్నుఁడు చేదిదేశంబు గెలుచుట | ... | 3౯౮ |
| తలిదండ్రులు శిశుపాలునకు హితోపదేశం బొనరించుట | ... | ౪౦౦ |
| శిశుపాలుఁడు ప్రద్యుమ్నునిపై దండెత్తుట | ... | ౪౦౧ |
| ద్యుమచ్ఛత్రులు యాదవసేనతోఁ బోరి సాత్యకి కృతవర్మలచే నీల్గుట | | ౪౦౨ |
| రంగపింగులు యాదవబలంబుతోఁ దలపడి భానునిచే హతులగుట | | ౪౦౪ |
| ప్రద్యుమ్నుండు శిశుపాలునితోఁబోరి యోడించుట | ... | ౪౦౬ |
| ప్రద్యుమ్నుండు కొంకణదేశాదులం గెలుచుట | ... | ౪౦౭ |
| దంతవక్త్రుఁడు మన్మథునితోఁబోరి యోడుట | ... | ౪౦౯ |
| మన్మథుఁడు విదర్భాదిదేశంబులు గెలుచుట | ... | ౪౧3 |
| మన్మథుం డగస్త్యమహామునింగాంచి జ్ఞానోపదేశంబు బొందుట | | ౪౧౪ |
| ప్రద్యుమ్నుండు పరశురాముని దర్శించుట | ... | ౪౨౧ |
| మన్మథుం డంగవంగాదిదేశంబుల కరుగుట | ... | ౪౨౨ |
| మన్మథుఁడు మిథిలాదేశంబున కేగుట | ... | ౪౨౫ |
| బ్రహ్మచారివేషంబునవున్న ప్రద్యుమ్నుండు ధృతిచేసిన సత్కారంబులకు మెచ్చి నిజరూపంబుతోఁ బ్రసన్నుండగుట | | ౪౨౬ |
| ప్రద్యుమ్నుఁడు మగధదేశంబునకుఁ జని జరాసంధునితోఁబోరి యోడించుట | | ౪౨౮ |
| ప్రద్యుమ్నుఁడు కురుదేశంబులం గెలుచుట | ... | ౪3౪ |
| యాదవ కౌరవ యుద్ధవర్ణనము | ... | ౪3౬ |
| రామకృష్ణులువచ్చి యాదవ కౌరవులకు సఖ్యంబుగూర్చుట | | ౪3౯ |

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# ఉపోద్ఘాతము.

శ్లో॥ నూతనజలధరరుచయే గోపవధూటీదుకూలచోరాయ
తస్మై కృష్ణాయ నమస్సంసారమహీరుహాస్యబీజాయ॥

**గుణగ్రహణచణులారా !**

ధర్మము శ్రేయస్సాధనమనియు, నధర్మంబు తద్భిన్నహేతువనియు మీకుఁ దెలియనిదికాదు. మంచిపని ధర్మంబనియుఁ జెడ్డపని యధర్మంబనియు నెఱుంగఁ బడుచున్నది. ఈ ధర్మాధర్మంబులను నిర్ణయించుటకు శ్రుతిస్మృతిపురాణేతిహాసంబులు ప్రబలప్రమాణంబులు. శ్రుతు లపౌరుషేయంబులనియు, వానియభిప్రాయంబులను మాత్రము వ్యక్తీకరించి త్రికాలజ్ఞులును నిగ్రహానుగ్రహసమర్థులు నగు మహర్షులచే నాయాయుగంబుల కనుగుణంబుగా వ్రాయఁబడినవి స్మృతులనియు ద్విజులకుమాత్రం బివి పాఠ్యంబులనియు, వానియాశయంబులు సులభగ్రాహ్యంబగునట్లు మహానుభావుల చరిత్రంబుల నుపబలంబుగాఁ జూపుచురచింపఁ బడినవి పురాణేతిహాసంబులనియు, నివి స్త్రీశూద్రాదులకుఁ బాఠ్యంబులగుననియు ఇవి యొకటితరువాత నొకటి ప్రమాణంబగుననియుఁ దెలియనగును. ఇవి విధించిన విధులను మానవు లేమాత్రమును మీఱఁగూడదు. మీఱి యథేష్టంబుగా సంచరించువాఁ డైహికాముష్మికసుఖదూరుం డగునని శ్రీకృష్ణుండు భారతాంతర్గతమగు భగవద్గీతయందు

శ్లో॥ యశ్శాస్త్రవిధిముత్సృజ్య। వర్తతేకామకారతః
న స సిద్ధిమవాప్నోతి। నసుఖం న పరాం గతిం
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే। కార్యాకార్యవ్యవస్థితౌ॥

అను శ్లోకంబుల మూలమునఁ జెప్పియున్నాఁడు. ఇంక నా శ్రుతిస్మృతిసూత్రపురాణేతిహాసయథార్థభావంబులను జక్కఁగా నెఱుంగుటకై వ్యాసవశిష్ఠపరాశరశంకరాచార్య విద్యారణ్యాదిమహానుభావు లనేకగ్రంథంబులను రచించియున్నవారు. అవి చూడఁదగును. కాని యేవో రెండు కావ్యశ్లోకంబులం జదివికొని వేదాదుల కర్థంబుఁ జెప్పఁబూనఁగూడదు. చెప్పఁబూనినచోఁ బరమేశ్వరద్రోహి యగును. వేదపరమేశ్వరులకు భేదం బేమాత్రంబును లేదు. ఇట్లే సర్వగ్రంథంబులందును జెప్పంబడియున్నది. వేదవేదాంగ మీమాంసాదిశాస్త్రాధ్యయనంబు చక్కఁగాఁ గావించి

తదుక్తకార్యాచరణనిష్ఠాగరిష్ఠుండగుటయ కాక సత్సహవాసప్రవర్తనంబులు గలిగి నిర్మలంబగు మనంబుతో సంచరించు యోగ్యుండే యావేదంబున కర్థంబుఁ జెప్పుట కర్హుండు. ఇట్టివారు మనకు లభింపనితఱిఁ బూర్వోక్తగ్రంథరాజంబులనే ప్రమాణంబులనుగా గైకొనవలెను. ఇట్లుచేయక కొందఱు మహర్షుల మనియు మహాత్ములమనియు నింకనేవేవియో పేరులం దగిలించుకొని బయలుదేరి యిచ్చ వచ్చినట్లు వేదాదుల కర్థంబులం దెల్పి ధర్మం బధర్మంబుగాను నధర్మంబు ధర్మంబుగాను బోధించి జగంబును జీకాకుపరచునపుడెల్ల సచ్చిదానందుండును, బ్రహ్మాండమండలనాథుండును దయాకరుండును నగు పరమేశ్వరుండు గమనించి యవతారంబుల నెత్తెదనని

శ్లో॥ పరిత్రాణాయసాధూనాం। వినాశాయ చ దుష్కృతాం

ధర్మసంస్థాపనార్థాయ। సంభవామి యుగేయుగే.

యదాయదాహిధర్మస్య। గ్లానిర్భవతి భారత

అభ్యుత్థానమధర్మస్య। తదాత్మానం సృజామ్యహం॥

అని భగవద్గీతాముఖంబున నుడివియున్నాఁడు. అట్లెత్తిన యవతారంబులు పెక్కులు. అవి యంశాంశాంశకలావేశపూర్ణ పరిపూర్ణతమావతారంబు లని యాఱు తెఱంగులుగా నున్నవని వ్యాసాదులు నిర్ధారించియున్నారు. అందు శ్రీరామకృష్ణావతారంబులు పరిపూర్ణతమంబులు. ప్రస్తుత ప్రస్తావనీయంబు శ్రీకృష్ణావతారంబు. ఇద్దానిం గూర్చి మీరు భారతభాగవత హరివంశ బ్రహ్మవైవర్తపద్మపురాణ విష్ణుపురాణాదులందును నుపనిషత్తులందును జదివి యుండవచ్చు. వాని యన్నిఁటియందు శ్రీకృష్ణచరిత్రంబు సమగ్రంబుగాఁ జెప్పఁబడియున్నదని తలంచి యుండవచ్చును. కాని బ్రహ్మమానసపుత్రుండును, జ్ఞాననిధియును రాధారమణనామపారాయణపరాయణుండును, దేవమౌనీంద్రుండును నగు నారదుం డొకప్డు గర్గాచలంబునం దపంబుఁ జేసికొను శ్రీగర్గమహర్షి సమీపమునకుం బోయి "వ్యాసాదులు విడిచిపెట్టిన శ్రీకృష్ణచరిత్రంబును జక్కఁగాఁ జెప్పి రచింపుమనియు నీ గ్రంథంబే మిథిలాధినాథుండగు బహులాశ్వునకుఁ జెప్పి వాసికిఁ దెచ్చెదననియు" నుద్బోధింప నతండు ధన్యుండనైతినంచు నెంచుచు నంగీకరించి తత్కృష్ణపవిత్రచరిత్రంబు ద్వాదశసహస్రశ్లోకపరిమితంబుగా "గర్గసంహిత" యను పేర నూత్నగ్రంథం బొండు రచించె. ఏతద్విషయం బింక నెఱుంగ నెంచువారిద్దాని మాహాత్మ్యమునం జూడం గలరు.

## గర్గసంహిత.

ఇద్దానియందు గోలోక బృందావన గిరిరాజ మాధుర్య మధురా ద్వారకా విశ్వజి ద్బలభద్ర విజ్ఞానములను నవఖండంబులు గూర్పంబడియున్నవి. ఇందు

వ్యాసాద్యనుక్తవిషయంబులు విపులంబుగను, తదుక్తప్రధానవిషయంబులు క్లుప్తంబుగను రచింపఁబడినవి. పండ్రెండువేల శ్లోకంబు లున్నవని యీవఱకుఁ జెప్పంబడియె. ఇందు ముఖ్యంబుగా గోలోకఖండంబందలి గోపికల పూర్వచరిత్రంబులును, కంసదిగ్విజయంబును, రాధావతారవర్ణనంబును, ఉత్కచపూతనాది పూర్వజన్మ వృత్తాంతంబులును, రాధాకృష్ణ వివాహమహోత్సవంబును, శ్రీకృష్ణుం జూచి దుర్వాసుండు భ్రాంతుండగుటయు బృందావనఖండంబందలి గోవర్ధనపర్వతచారిత్రంబును, యమునానదీచరిత్రంబును, వత్సబకాదిదైత్య పూర్వజన్మ వృత్తాంతంబులును, రాధాకృష్ణ ప్రీతివర్ణనంబును, గిరిరాజఖండంబందలి గోవర్ధనోత్పత్తివిభూతిపూజావిధిమాహాత్మ్యంబులును, మాధుర్యఖండంబందలి పెక్కు గోపికల చరిత్రంబులును, యమునాపంచాంగంబును, మధురాఖండంబందలి కుబ్జావాయక సుదామచాణూరాది కంసానుజాష్టక పూర్వజన్మ వృత్తాంతంబులును, ద్వారకాఖండంబందలి ద్వారకాగమన హేతునిరూపణంబును, తత్పురీతీర్థమాహాత్మ్యంబులును, ద్వారకాదుర్గప్రశంసయు, విశ్వజిత్ఖండంబందలి మరుత్తోపాఖ్యానము, మన్మథదిగ్విజయంబును, శ్రీకృష్ణపుత్రసామర్థ్యంబులును, శ్రీకృష్ణుండు పుత్రసహితుండై హిరణ్యాక్షుపుత్రులగు శకుని మొదలగు రాక్షసులం జంపుటయు, వేదనగర వృత్తాంతంబును, హిమాలయప్రాంతంబున మన్మథుని సుందరి వరించుటయు, నుగ్రసేనుండు రాజసూయంబు జేయుటయు, బలభద్రఖండంబందలి దుర్యోధన ప్రాడ్విపాకసంవాదంబును, జ్యోతిష్మత్యుపాఖ్యానంబును, బలభద్రరాసలీలయు, బలభద్రపంచాంగంబును, విజ్ఞానఖండంబందలి వ్యాసోగ్రసేన సంవాదంబును మొదలగు నవి నూతన విషయంబులు, పూర్వోక్తనవఖండంబులతోడనే యీ గర్గసంహిత పరిపూర్తియైనట్లు తన్మాహాత్మ్యమునందుఁ జెప్పంబడినది. ఇవిగాక అశ్వమేధఖండంబనునది మఱియొకటి ఇందునఁ జేరలేదు. అం దుగ్రసేనుండు నారదప్రేరితుండై శ్రీకృష్ణసమ్మతిమీఁద నశ్వమేధయాగంబుఁ జేయఁబూనుటయు, ననిరుద్ధుండు దిగ్విజయంబునకై బయలుదేరుటయు లోనగు పెక్కువిషయంబులు గలవు. గర్గుం డీ ఖండంబు సంహితనంతయు రచించిన తరువాతఁ గొంతకాలంబునకు రచించిన ట్లా ఖండాదియందే చెప్పియుండుటవలన నీ సంహితాగ్రంథంబునకు నా యశ్వమేధఖండంబునకు నంతగా సంబంధములేదని తెలియుదురుగాక. ఐనను దానిని సగమువఱకుఁ దెనిగించితి.

## విచారణీయాంశములు.

ఇందు శ్రీకృష్ణుండు ద్వాపరకలియుగ సంధికాలమం దవతరించినట్లు తెలియుచున్నది. ఇది భాగవతాది సర్వగ్రంథసమ్మతంబు. భాగవతాది గ్రంథంబులందుఁ జెప్పినట్లు శ్రీకృష్ణుండు జనించిన దివసంబు శ్రావణబహుళాష్టమి యని లిఖింపక భాద్రపద బహుళాష్టమియని యీ సంహితయందు గర్గమునీంద్రుండు వ్రాసియున్నాఁడు. దీనికిఁ గారణం బేమో విజ్ఞులు విమర్శించి నిర్ణయింతురుగాక.

మఱియు నిందు ద్వారకాఖండంబునం దక్రతీర్థమాహాత్మ్యసందర్భంబునందు గజేంద్రమోక్షణకథ వచ్చును. అందుఁ గరిమకరంబులకు నేఁబదియైదేండ్లమాత్రమే పోరుజరిగినట్లు తెలియుచున్నది. ఇఁక భాగవతమందన్ననో యొక వెయ్యిసంవత్సరంబు లారెంటికి దంటపోరైనట్లు వ్రాయంబడియున్నది. కాన నిదియు విమర్శకులు విచారింతురుగాక.

ఇంక నిందు నిట్టివే యీషద్భేదంబులుగల విషయంబులుగలవేమో పరిశీలించి యథార్థంబును దెల్పుదురుగాక.

వెండియు నిందుఁ జెప్పంబడు వైకుంఠలోకాదులేకాక అజితలోకము, గోలోకము, శ్రీలోకము, రమావైకుంఠాధోవైకుంఠోర్ధ్వవైకుంఠలోకంబులు మొదలగునవి మీఁకుఁ గ్రొత్తవిగాఁ గనుపడ వచ్చును. కాని యివి శ్రుతియందును, భారతభాగవతములందు సంగ్రహించియు బ్రహ్మవైవర్తమహాపురాణంబునందు విస్తరించియుఁ దెల్పంబడినది.

ఇందితరగాథలు పెక్కులు మనోహరంబుగానుండినను బ్రధానంబుగా శ్రీరాధాకృష్ణ గోపికా చరిత్రంబులున్నవి. కాన వీరింగూర్చి యిచ్చటఁ గొలఁదిగా వ్రాయఁదలఁచితి.

రాధ

శ్లో॥ అనయారాధ్యతేకృష్ణో। భగవాన్ హరిరీశ్వరః
లీలయా రసవాహిన్యా। తేనరాధాప్రకీర్తితా॥

శ్లో॥ రాధికాపి పరాశక్తిః। కృష్ణే చానందరూపిణీ
నిత్యా చ నిత్యసత్యస్మిన్ ।స్వాధారేపురుషోత్తమే॥ (బృహద్బ్రహ్మసంహిత.)

శ్లో॥ రమయాతురకారస్యా। దాకారేఽస్త్యాదిగోపికా
ధకారోధరయాహిస్యా। దాకారోవిరజానదీ॥

అను శ్లోకములనుబట్టియు, నీ గర్గసంహితలోని గోలోకఖండమందు శ్రీరాధాకృష్ణ వివాహంబు జరిపింపఁ బురోహితుఁడుగా వచ్చిన బ్రహ్మదేవుం డవ్వారిని స్తుతించు సందర్భమునుబట్టియు,బ్రహ్మవైవర్తమహాపురాణమందలి రాధికాఖ్యానమునుంబట్టియు మఱియు నితరోద్గ్రంథంబులనుబట్టియు నా దేవి పరాశక్తి యనియు త్రిగుణాత్మిక యనియు, నిత్యయనియు విష్ణ్వనపాయనియు శ్రీకృష్ణభక్తిస్వరూపిణియనియు దెలియుచున్నది. ఆజగదంబయంశంబువలననే వాణీ మంగళదేవతా సర్వమంగళ లుద్భవించిరనియు నీ జగదంబ శ్రీకృష్ణునకు దన యష్టభార్యలకంటెను, గోపికామణులకంటెను ప్రియతమయనియు "రాధాకృష్ణ" యని యుచ్చరింపవలెగాని విడదీసి పల్కఁగూడదనియు, భేదబుద్ధితో విడదీసిపల్కినవారలు రౌరవాదినరకంబులం బడుదురనియు వ్యక్తంబగుచున్నది. దీనింబట్టి యా లోకమాతనుగూర్చి సామాన్యయనియు

శ్రీకృష్ణుని యుంపుడుకత్తెయనియు వ్రాయు నజ్ఞులపలుకులు నింద్యంబులనియు నిరాకరంబులనియు మనము గట్టిగా నమ్మవచ్చును. ఇంక నీ రాధాదేవింగూర్చి తెలిసికొనందలంచినవారీ గర్గసంహితాగ్రంథంబును సమగ్రంబుగాఁ బఠింతురుగాక.

## శ్రీకృష్ణుఁడు

### కృష్ణశబ్దముంగూర్చి

శ్లో॥ కృషి ర్భూవాచక శ్శబ్దో । న శ్చానందవిధాయకః
సదానందసమావేశః । కృష్ణ ఇత్యభిధీయతే॥

శ్లో॥ సచ్చిదానందరూపాయ । కృష్ణాయాఽక్లిష్టకారిణే
నమో వేదాంతవేద్యాయ । బ్రహ్మణే పరమాత్మనే॥ (బృహద్బ్రహ్మసంహిత.)

శ్లో॥ సద్యఃప్రాణిపవిత్రాణి । జగతాం మంగళాని చ
కకారః కమలాకాంతః । ఋకారో రామ ఇత్యపి॥

శ్లో॥ షకారః షడ్గుణపతిః । శ్వేతద్వీపనివాసకృత్
ణకారో నారసింహోయ । మకారోహ్యక్షరోగ్నిభుక్

శ్లో॥ విసర్గా చ తథాహ్యేతౌ । నరనారాయణావృషీ
సంప్రలీనాశ్చషట్పూర్ణా । యస్మిఞ్ శబ్దే మహామునీ

శ్లో॥ పరిపూర్ణతమే సాక్షా । త్తేన కృష్ణః ప్రకీర్తితః
శుక్లోరక్త స్తథా పీతో । వర్ణోఽస్యను యుగంధరః॥ (గర్గసంహిత గో.అ. ౧౫.
అని చెప్పఁబడినది. దీని యాంధ్రీకరణము జూచిన విశదము కాగలదు.

శ్లో॥ శేషో నాగో భవేద్రామః॥కృష్ణో బ్రహ్మైవ శాశ్వతం॥ అధర్వణీకృష్ణోపనిషత్తు.

ఇట్లనే ఛాందోగ్యోపనిషత్తు, తైత్తిరీయోపనిషత్తు, గోపాలోత్తరతాపనీయోపనిషత్తులలోఁగూడఁ జెప్పఁబడి యున్నది. ఏతత్కారణంబున శ్రీకృష్ణుండు పరాత్పరుండనియు వేదాంతవేద్యుండనియు, సర్వశక్తిసంపన్నుండనియు, వ్యూహావతారంబగు పరిపూర్ణతమావతారుఁడనియు నెఱుంగఁబడుచున్నది. కాని కొందఱు లౌకికులు గ్రంథపరామర్శ చేయక గోపికావస్త్రాపహరణ జలక్రీడా రాసక్రీడాదిస్థలములందైనను యథార్థంబును గుఱ్ఱెఱుంగక యా యోగేశ్వరుండు చోరుండనియు, జారుండనియు, మాయలమారియనియు వారివారి ఇచ్ఛవచ్చినట్లెల్ల వ్రాయుచున్నారు. ఇది నింద్యంబు.

ఈ మహామహుండు పూర్వాధునిక స్వదేశీయ విదేశీయ పండితాఖండలుల విమర్శనంబులందు నిలిచి జగత్పూజ్యుండనియుఁ బరమేశ్వరుండనియు వాసిఁగాంచుటం బట్టి నే నెక్కువగా వ్రాయవలసిన యవసరంబు గాన్పింపదు. మఱియు వ్రాయుటకు శక్తియులేదు.

### గోపికలు.

“ గో ” అనగా నింద్రియము. ఇంద్రియంబులను వశపఱచుకొనిన వారలు గోపులనియు, గోపికలనియుఁ గాఁగలరు. అనగా జితేంద్రియులని యర్థము. ఆజితేంద్రియులే మునులు. ఈ మునులు శ్రీరామచంద్రవామనాద్యవతారంబులను బరాత్పరుం డెత్తినపుడు ప్రార్థించి వరంబులం గైకొని గోపికలుగాఁ బుట్టి తమ మనోరథంబులం దీర్చికొనియున్నవారు. కాని వారు కామాంధలగు గొల్లెతలుకారు. ఈ యభిప్రాయంబును నాథర్వణీ కృష్ణోపనిషదాదులును, బ్రహ్మవైవర్తాది మహాపురాణంబులును, గర్గసంహితయందలి గోలోక బృందావన మాధుర్యఖండంబులును, బలపరచుచున్నవి. సీతారామాంజనేయసంవాదమందలి ప్రథమాశ్వాసంబులోని “సలలితేంద్రియ ” అను పద్యంబునైతము పూర్వోక్తాభిప్రాయంబునే విశదీకరించినది. కాన శ్రీరాధాకృష్ణగోపికామణులంగూర్చి మనము దెలిసికొని యున్నాము. ఇఁక

### గర్గసంహితాగ్రంథకర్త

నుగూర్చి తెలిసికొనవలసియున్నది. ఈగ్రంథకర్త పేరు గర్గాచార్యులు. వీరు వేదవేదాంగపారీణులును మహర్షులును గవివరులునునై మిక్కిలి ప్రసిద్ధిఁజెందినవారు. వీరితో సమానుఁడగు జ్యోతిశ్శాస్త్రవేత్త యింతవఱకు లేఁడని బుధులు పల్కుచున్నారు. ఈ మునీంద్రుండు జ్యోతిషమునందు “గర్గసంహిత, గర్గమనోరమ” మున్నగు కబ్బంబులను, రచించియున్నాఁడు. ఈ మహామహుండు శ్రీకృష్ణచంద్రునకుఁ బురోహితుండనివచించినప్పు డాతని పూర్వపుణ్యప్రభావతపస్సామర్థ్యంబులం జెప్ప నప్ఫణీంద్రుండుసైతం బశక్తుండని నాయాశయము. కాన నీవిషయమును విడిచి దీని యాంధ్రీకరణముగూర్చి యించుక నిట ముచ్చటించుచున్నాను.

### ఆంధ్రీకరణావశ్యకము.

ఇద్దానియం దితరగ్రంథంబులందులేని పెక్కు మనోహర నూతనవిషయంబులుండుట, శ్రీరాధాకృష్ణగోపికలనుగూర్చి సంశయంబులం దీర్చి సంతోషంబుగూర్చు సద్భావంబులు నెలంగుట, ఇదివరకెవ్వరు దీని నాంధ్రీకరింపకయుండుట, నవలలను నాటకములను వ్రాయువారలకుఁ గొన్ని చిత్రకథ లుండుటయు హేతువులు. దీనికి గర్గసంహితయను నామంబునకు మాఱుగా నా యాంధ్రీకరణంబునందు

గర్గభాగవతము

అని నామకరణంబు గావించినాను. ఇందు భగవచ్చరిత్రంబును, భక్తులచరిత్రంబులు నుండుటం బట్టియు సామాన్యలోకంబు “ గర్గసంహిత ” యను దాని కర్థంబు గ్రహింపఁజాలదనియు గర్గభాగవతం బన్నచో సులభంబుగా నందలి కథ దెలుపంగఁ గలదనియుఁ దలంచి యట్లునామంబుంచితి. ఈ భాగవతంబునందుఁ గొన్నితావుల చేర్పు మార్పులు సమయోచితంబుగాఁ గూర్పఁబడినను మాతృకాభిప్రాయంబునకు

విరుద్ధంబుగా నుండనేరదు. సంస్కృతకృతిలోని యమునా బలభద్ర సహస్రనామ స్తోత్రంబు లిందు వ్రాయఁబడలేదు. వానిని నాంధ్రీకరింపక ప్రత్యేకంబుగా ముద్రించిన బాగుగ నుండునని యెంచితి. ఆంధ్రభాషలో లేని యీ నూతనగ్రంథరాజంబు నాంధ్రీకరించుటకు గొల్లపూడి ఆంజనేయశాస్త్రిగారు తమ జీవితకాలములో నాకొనరించిన హెచ్చరికయే యని కృతజ్ఞతతో మీకుఁ దెల్పుకొనుచున్నవాఁడను. నా కవిత్వములోని గుణావగుణములు విమర్శించి నన్ను ధన్యునిగాఁ జేయ సుధీమణులగు మిమ్ములను వేఁడుచున్నవాఁడను. ఇందు ముఖ్యంబులగు తప్పులు గొన్ని సవరించి తుదిని ముద్రించితి. మిగిలినవి మీరే దిద్దుకొని క్షమింపఁ బ్రార్థితులు. ఇందునే విషయంబందునైన నెంతమాత్రమేనిఁ దోడ్పడిన బ్రహ్మశ్రీ పైడిమఱ్ఱి రామమూర్తి మొదలగు సుజనుల కందఱకును గృతజ్ఞుఁడనై భుక్తిభక్తిముక్తుల నొసంగుటకు శ్రీరాధాకృష్ణునిఁ బ్రార్థించుచున్నవాఁడను.

రెండవకూర్పున విస్తరించి వ్రాయఁదలఁచి యిప్పు డతిసంగ్రహంబుగా నీ యుపోద్ఘాతమును వ్రాసినందులకు మన్నింతురుగాక.

శా॥ ఏరెట్లన్నను దీనినిం గుఱిచి శ్రీ ♦ కృష్ణార్చనాలోలుపుల్  
ధీరుల్ దీనదయాళురుఁ రసికులుఁ ♦ ధీమంతులుఁ భూమిలో  
లేరే? చూడరె? మెచ్చరే? యిఁకను జా ♦ లింబొంద నాకేటికా  
శ్రీరాధారమణుండు పూర్ణదయహ ♦ క్షించుఁ గదా యెట్టులేఁ.

క॥ ఎందాఁక సూర్యుఁడుండునొ, యెందాఁక సుధాకరుండు ♦ వెసఁగునొ తారా  
బృందంబెందాఁకను దివిఁ, జెందునొ యందాఁక నిది వ ♦ సించుత భువిలోఁ.

అక్షయవత్సర శ్రీరామ  
నవమీ సౌమ్యవాసరము.  
గుంటూరు.

భవద్విధేయుఁడు,  
చివుకుల అప్పయ్యశాస్త్రి.  
(సికింద్రాబాదు.)



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ గర్గ భాగవత మాహాత్మ్యము.



గరుడధ్వజకులగురు
నాగమసర్వార్థవేది ♦ నవ్యయమహిమున్
యోగీశవంద్యచరణుని
శ్రీగర్గాచార్యకవిని ♦ సేవింతు మదిన్. ౧

శా॥ బోధాకార్యధురీణ! మౌనితిలకా! ♦ పూర్విన్ బురాణంబులన్
బోధింపన్ జెవులార వింటి మఘుని ♦ ర్మాలంబునుం గంటి మా
రాధామాధవసత్కథాగ్రథితగ ♦ ర్గప్రౌఢసత్సంహితా
సాధిమ్నత్వమహాత్వసత్వరచనా ♦ సామర్థ్యముల్ దెల్పవే! ౨

ఉ॥ ఈవిధి శౌనకుం డడుగ ♦ సిద్ధపురాణపరాయణుండు వే
దావళితత్వనిర్ణయమ ♦ హాత్ముఁడు సూతుఁడు మౌనిసం
భావితగర్గసంహిత ప్ర ♦ భావము నారదుచేత వింటి మున్
భావములందు నాఁటునటు ♦ బల్కెద మీరిపు డాలకింపుఁడీ! 3

వ॥ తొల్లి విమలంబును వివిధవిధఫలపుష్పవిరాజితంబును నగు కైలాస
శిఖరంబునందు సాంద్రంబగు నొక్కవటభూరుహాధఃప్రదేశంబునఁ బ్రేక్షకమనోభి
రామంబగు నొండుమండపమున యక్షరక్షస్సిద్ధసాధ్యకిన్నరకింపురుషనిషేవితుండై
సహస్రప్రభల వెలుంగుచు లోకశంకరుండగు శంకరుండు సింహాసనాసీనుండగుట
శర్వాణి యవలోకించి నిజమనోరథమును మనోనాయకునకు నివేదించుకొనఁదలంచి
సర్వమంగళసంపన్నురాలై సమీపించి సన్నుతించి సాంజలియై యిట్లనియె. ౪

చ॥ సతతము నేదొ ధ్యానమును ♦ సల్పుదు రేలకొ? దాని నిశ్చయ
స్థితి జనికర్మమర్మములఁ ♦ జెప్పఁడు విష్ణుసహస్రనామముల్
శ్రుతపడెఁ దొల్లి యిప్డల య ♦ శోదకిశోరుని పూతజీవితం
బతులముగా వచించుటకుఁ ♦ బ్రార్థనచేసితిఁ బ్రాణనాయకా! ౫

వ॥ అన విని శర్వుండు శర్వాణి కిట్లనియె. ౬

గీ॥ సర్వమంగళ ! రాధేశు సచ్చరిత్ర, గర్గసంహిత యందునఁ గ్రాలుచుండె
ననఁగ నగజాసతీమణి తనదువిభుని, తోడఁ దిరిగియు నిట్లు మాటాడఁదొడఁగె.

చ॥ కలవుగదా పురాణములు గావ్యములున్ మఱి సంహితాదులున్
గలవుగదా త్రివేదములు గ్రాలునుగా నితిహాససంచయం
బులు నివియెల్లవీడి యొక మూలవసించెడి గర్గసంహితన్
దలఁచితి రేలకో ? యది వినంగఁ గుతూహల ముప్పతిల్లెడిన్. ౮

చ॥ ఇదియునుగాక గర్గకవి యీకృతి నెవ్వరిబోధఁ జేసెనో
ముదమొదవించు శ్రీహరి య మోఘవిలాసము లెట్లు నింపెనో ?
యిది వినినట్టివారు సుఖ మెట్టి ఫలంబుల నొందనుందురో ?
యిదివఱకెవ్వరు దీని విని వృద్ధినిఁ జెందిరో ? వీనిఁ దెల్పుఁడీ ! ౯

చ॥ ఇటులఁ బ్రియావచస్సుల గి రీశుఁడు వించుఁ బ్రసన్నచిత్తుఁడై
కటువిబుధప్రకాశితస భన్ గని శీతలగోత్రపుత్రి ! సం
కటహరశౌరిరాధల ప్ర కర్ష మహత్త్వను గర్గసంహితో
త్కటమహిమంబుఁ బల్కెదను దత్పరతన్ వినుమా ! యుమాసమా ! ౧౦

వ॥ తొల్లి భగవానుఁడగు హరి స్వచరిత్రంబుఁ బ్రచురింప బ్రహ్మదేవునిచేఁ బ్రార్థితుండై భూతలంబున కరిగి యరసి రాధాదేవికిఁ జెప్పి గోలోకంబునకుఁ జన నచట ననంతునిచే వందితుండై యాతని వేఁడికోలుమీఁదఁ బవిత్రంబగు తన చరిత్రంబు సంపూర్ణంబుగా శేషున కుపదేశించె. అంత నా యనంతుం డా యనంత శయానుజీవితంబు విరించికిని విరించి ధర్మునకును, ధర్మువు దనకుమారులకు నుపదేశించుచు వచ్చిరి. పిమ్మటఁ దత్కథాసుధను నరుఁడు గ్రోలి నారాయణు నకును, నారాయణుఁడు భగవత్సేవాపరతంత్రుండగు నారదమహర్షికి నుపదేశించె. అంత నా మహర్షి త్రికాలజ్ఞుండగు గర్గాచార్యునకు భక్తినిక్షేపంబును బరమజ్ఞాన మానితంబునగు శ్రీకృష్ణచరితంబుఁ జెప్ప నా గర్గుఁ డందలి మహిమం బాలోకించి యుపదేశకుండగు నారదమహర్షిని హర్షోత్కర్ష మనస్వియగుచు సన్మానింప సంత సించి యా నారదుండు గర్గున కిట్లనియె. ౧౧

ఉ॥ దోసము కింతలేనిదియు స్తుత్య మభీష్టద మవ్యయుం బనా
యాససుఖప్రదంబు గమ లాక్షపదాంబుజభక్తిదంబునై
వాసినిఁగన్న కృష్ణభగ వానుని కీర్తిని సంగ్రహించి నీ
కీసమయంబునందు వచి యించితి విస్తర మిద్దిసల్పుమా ! ౧౨

చ॥ విరివిని సల్పినట్టియిన విశ్వమునం దిదియే ప్రసిద్ధికిన్
సరగున వచ్చునై వడిని శక్తికొలంది నొనర్తు వ్యాసుఁడీ

వరకు మదాజ్ఞచేత నల ♦ భాగవతంబును సల్పె దానిని౯
మరుగువనుంచి నీకృతియె ♦ మా బహులాశ్వునకు౯ వచించెదన్. ౧౩

చ॥ అనవుడు గర్గమౌని విన ♦ యావనతుండయి వీనులారఁగా
విని మునినాథ! మీ నుడులు ♦ విశ్వహితంబులె కాని మాకు నం
దని వటులైన మీ కరుణఁ ♦ దాల్చితిరేని రచించెద౯ జుమీ
యనవుడు నారదుండు ముద ♦ మందెను డెందమునందుఁ బార్వతీ! ౧౪

వ॥ అంత దేవర్షియగు నారదుండు సంతోషావేశంబున వీణాతంత్రియుల నవరించుచు శబ్దించుచు నాడుచుఁ బాడుచు యోగీశబృందారకబృందవందితంబగు బ్రహ్మలోకంబున కరిగె. గర్గాచార్యుండును గర్గనామంబునం బరగు నొక్క యచలంబున నిశ్చలస్వాంతంబున నారదోపదేశంబున విన్నవియుఁ దాను గన్నవియు నింక నెన్నన్నియొ తెన్నుల నెన్నియున్న యా వెన్నునిమహిమంబులను, విచిత్రచరిత్రంబులను, నారదబహులాశ్వసంవాదంబును నిరూపించుచు శ్రీకృష్ణభక్తివివర్ధనకరంబగు నొక్కశాస్త్రంబు ద్వాదశసహస్రశ్లోకపరిమితంబుగా రచించియుండె. అంత దానికి గర్గసంహితయను నామంబు ప్రసిద్ధంబయ్యె. ౧౫

ఉ॥ ఈ కృతి విన్నమాత్రన న ♦ భీష్టములెల్ల ఫలించు నిక్కమీ
వాకున నొక్కసత్కథను ♦ బల్కెదఁ గల్కిరో! వజ్రపుత్రుఁడు౯
ప్రాకటజీవితుండు ప్రతి ♦ బాహుఁడు మాలిని నాఁగ నాలితో
శ్రీకరకృష్ణపాలితపు ♦ రి౯ మధుర౯ నివసించె నయ్యెడ౯. ౧౬

ఉ॥ సంతతిలేమిఁ జింతలఁ గృ ♦ శత్వమునందుచు సంతుకై తపో
వంతులకు౯ సువర్ణపశు ♦ వస్త్రధరాప్రభృతిప్రదానముల్
సాంతపనాశ్వమేధముఖ ♦ సర్వమఖంబులఁ జేసియు౯ మన
శ్చింతయొకింతయు౯ విడక ♦ చిక్కుచు నిట్లు విచార మొందెడి౯. ౧౭

మ॥ ధనమా లోపములేకపోయె నిఁక మా ♦ దాంపత్యసంబంధమా
యనుకూలంబు బలంబు నత్యధికమే ♦ యారోగ్యమా యోగ్యమే
ఘనరాజ్యంబు నయాన్వితంబు గొఱతల్ ♦ గాన్పింప వెచ్చోటఁ ద
త్తనయాభావమె భావశల్యమయి చిం ♦ తావార్ధి న౯ ముంచెడి౯. ౧౮

చ॥ పితరులు తర్పణోదకము ♦ వెగ్గలి కోష్ణముగా గ్రహించి భూ
షతి ప్రతిబాహు పిమ్మటను ♦ బాలుఁ డొకండును లేకపోవుట౯
గతు లిఁక మాకు లేవనుచుఁ ♦ గన్నుల నీరును నించుచుందు రా
స్థితిఁగని యూరకుండవల ♦ సె౯ మఱి యేమియొనర్తు దైవమా! ౧౯

చ॥ తురగము లున్న నేమి బహు ♦ దుందుభిబృందము లున్న నేమి చి
త్రరథము లున్న నేమి ధన ♦ రాశులు యోధులు నున్న నేమి ధీ

వరసచివుల్ పురోహితులు ♦ బంధువులున్ గవు లున్న నేమి నే
ర్పరితనమున్న నేమి యొక ♦ బాలుఁడు నాకు జనింపనప్పుడున్. ౧౦

ఉ॥ దేవమహర్షి సంతతి పి ♦ తౄణములన్నిఁటిఁ దీర్చివేయు మ
జ్జీవిక సార్థకంబని వ ♦ చింపఁగ నైహికపారమార్థిక
ప్రావితసౌఖ్యముల్ గడవ ♦ నల్పితి నంచుఁదలంప స్వార్జిత
శ్రీవిభవంబు మంచిదని ♦ చెప్పఁగ నర్హుఁడు పుత్రవంతుఁడే. ౧౧

ఉ॥ వ్యాకరణంబునన్ గిరయు ♦ బాధమదంబునఁ గుంజరంబు రా
కాకువలాప్తుచేత నిశ ♦ కంజనికాయముచేఁ దటాకమున్
వ్యాకరణశ్రుతిస్మృతిన ♦ యాదివిదగ్రణులన్ సభాస్థలం
బాకస మభ్రవంక్తిని వ ♦ రాత్మజుచేఁ గులమొప్పు నెప్పుడున్. ౧౨

ఉ॥ సంతతిలేని గేహమును ♦ జన్మము వ్యర్థములౌటఁ బ్రాజ్ఞఁ డా
సంతును వృద్ధిఁ జేసికొని ♦ సౌఖ్యములన్ గననౌనటంచు నిం
తింతనరాని చింతలను ♦ నేడ్చెడి నా ప్రతిబాహుభూవరుం
డంత స్వకీయమూర్ధజచ ♦ యార్జునతన్ గని యాశ వీడెడిన్. ౧౩

తే॥ భార్యతోఁగూడ నిట్టులఁ ♦ బ్రబలదుఃఖ, మొందుచుండిన ప్రతిబాహు ♦ నొక్కనాఁడు
మధురయందున శాండిల్య ♦ మౌని వేడ్కఁ, జూడ నేతెంచె గిరిజ! వి ♦ శుద్ధచరిత! ౧౪

చ॥ మునిపతిరాక గన్గొనుచు ♦ ముందుగ లేచి నమస్కరించి య
ర్చనల ననేకముల్ సలిపి ♦ రంజిలఁజేయ మునీశ్వరుండు న
మ్మనమునఁ గౌతుకంబు గని ♦ భూతలనాథ! కుటుంబరాష్ట్రపా
లనములఁ జక్కనుంటివె? సులక్షణసౌఖ్యము లబ్బుచున్నవే? ౧౫

చ॥ అని యడుగంగ తేఁడు స ♦ లార్థవిదగ్రణి! పూర్వజన్మసం
ప్రణిహితదోషలబ్ధనిజ ♦ బాధ యనిర్వచనీయమయ్యె నే
మని వచియింతు? రాష్ట్రమున ♦ నన్వయమందునఁ బట్టణంబునం
దున సుఖముండినట్టులుగఁ ♦ దోఁపదు మీరిది గుర్తెఱుంగరే? ౧౬

చ॥ మన ప్రతిబాహ్వనంతరము ♦ మంచిగఁ బాలనఁజేయువాఁ డొకం
డు నిచట లేఁడటం చెదఁగ ♦ దుర్జ వెతనందుచునుండ్రు నా ప్రజల్
గనులకుఁ బండువౌ సుతుఁడు ♦ గన్పడుగా యని నాదు భార్య నే
నును బితృదేవతల్ సతము ♦ నొచ్చెను మేమియొనర్తుఁ? జొత్తెటన్. ౧౭

ఉ॥ నాగతి యిట్టులుండె దయ ♦ నా పయిఁ గూర్చుచు దివ్యదృష్టిచే
బాగుగఁజూచి పుత్రుఁగను ♦ భాగ్యము నాకొనఁగూడఁజేయుఁడీ!
యోగికులావతంస! విన ♦ నువ్విళులూరుచు నుంటి నింక నా
[illegible] ♦ యొనంగఁ జెపుఁ డనెన్ మహేశ్వరీ! ౧౮

క॥ నావుడు శాండిల్యుండును, భూవర ! బహుళప్రదానముల మునుమీరల్
గావించియుంటి రందునఁ, దావకభావార్థసిద్ధి ◆ దనరక పోయెన్. ౨౯

ఉ॥ ఐన శుభప్రదంబును మ ◆ హామహిమోత్తమ ముత్కటవ్యథా
దీనహృదబ్జమిత్రమును ◆ దివ్యకథామృతపూరితంబు సం
తానఫలప్రదం బహిత ◆ దారుణమౌ నల గర్గసంహితన్
మానిని మాలినిం గలిసి ◆ మంచితనంబున నాలకింపుమా ! ౩౦

చ॥ ధనమునుగోరువారలును ◆ ధర్మముఁగోరెడివారు విద్యలా
ర్జన నొనరించువారు జెఱ ◆ సాలలనుండి విముక్తిఁగోరువా
రును గులదీపకాత్మజుసు ◆ రూపముఁగాంచఁదలంచువారలీ
ఘనమగు గర్గసంహితను ◆ గర్ణములార వినంగనౌ విభూ ! ౩౧

చ॥ క్రతువులు సత్రయాగములు ◆ గాశి గయా మధురా ప్రయాగతీ
ర్థతతిగమంబులన్ గలుగు ◆ ధన్యతకంటెను గర్గసంహితా
కృతి వినుటన్ లభించు కృత ◆ కృత్యత నుత్యము గాన దీనిఁ బం
డితుఁడును బామరుండును గ ◆ డించి వినందగు నెన్నిభంగులన్. ౩౨

చ॥ సతులును బిన్నపెద్దలును ◆ సర్వకులంబులవారుగూడ స
న్మతిఁ బఠియింపవచ్చును వి◆నందగు నట్లొనరింప వారని
ర్మితియును వేళలే దిది య ◆ మేయపురాతనజన్మపుణ్యసం
తతిలభియించుఁగాని వెఱ ◆ దారులఁ జిక్కదు నిక్క మేలికా ! ౩౩

ఉ॥ పాపు లవైష్ణవుల్ జగద ◆ బాంధవులున్ గురుభక్తిహీనులున్
దోపిడికాండ్రు నాస్తికులు ◆ ధూర్తులు గర్వులు గర్గసంహితా
ప్రాపణమం దనర్హు లిఁకఁ ◆ బ్రాణు లనిత్యము లౌటచేత జే
పేపని యెట్టులౌనొ యిపు ◆ డియ్యదివించు సుపుత్రుఁ గాంచుమా ! ౩౪

చ॥ భవనము శుద్ధిసల్పి బహు ◆ వర్ణవిచిత్రితరంగవల్లులన్
బవణలతోడఁ బెట్టుచు శు ◆ భప్రదమౌ కదళీవిభాసుర
ప్రవిమలమండపంబున ను ◆ పల్లవపంచకవారిపూర్ణమై
భవయుతకుంభ ముంచి గజ ◆ వక్త్రున కర్చలఁదొల్తఁ జేయుమా ! ౩౫

ఉ॥ నమ్మి నవగ్రహంబుల క ◆ నంతరమందునఁ బూజ సల్పి శ్రా
వ్యమ్మగు గర్గసంహితకు ◆ భక్తిని నర్చ లొనర్చి సేవ్యదా
ర్థ్యమ్ముగొలంది దక్షిణగ ◆ హైమము వెండినొ వక్తకిచ్చి యో
గ్యమ్మగు తద్ఘటంబున మ ◆ హమ్మగు శ్రీఫలముంచవౌ విభూ ! ౩౬

ఉ॥ అంతట భక్ష్యభోజ్యపర ◆ మాన్నఘృతాధిక లేహ్యచోష్యముల్
శాంతి మహానివేదనము ◆ సల్పుచుఁ దత్తులసీదళంబు ల

త్యంతము బూజజేసియు శు ♦ భార్తిక మిచ్చి ప్రదక్షిణంబు లా
యంతిమవాసరంబున స ♦ మర్గళరీతి నొనర్పనా ప్రభూ! ౩౭

సీ॥ పండితపుత్రుఁడై ♦ భారతకథలని, ముసలమ్మకతలను ♦ మూల్గువాని
శ్రీరంగనీతులఁ ♦ జెప్పఁచు దొమ్మతి, గుడిసెలలో దూరు ♦ కొంటెవాని
దబ్బఱ నొరులను ♦ దబ్బిబ్బు నొనరించి, లిబ్బులఁగాఁజేయు ♦ లేకివాని
వైష్ణవుండనటంచు ♦ విష్ణుమిత్రుండైన, శివు నహర్నిశము దూ ♦ షించువాని
తే॥ కామకోపాదివైరిష ♦ ట్కంబువలనఁ, బరగువానిని హఠశఠ ♦ వాదములను
జేయువానిని వక్తగఁ ♦ జేయరాదు, గాన నందున జాగ్రత్త ♦ కాశ్యపీశ! ౩౮

చ॥ హఠశఠవాదియై జనుఁ ♦ డార్తిని గూర్పఁగ గర్గసంహితా
కథనము భంగమౌనటులఁ ♦ బల్కుఱు యత్నమొనర్చువాఁడు దా
జఠరము బద్ధలై మడియు ♦ సందియ మిందున లేమి నెవ్వఁడేఁ
శఠహఠహీనుఁ డౌచు గురు ♦ శౌరులభక్తిని నుండనా విభూ! ౩౯

చ॥ వరమగు బ్రహ్మచర్యవిధి ♦ వర్తిలి ప్రత్యహ మేకభుక్తముఁ
జొరవగఁ జేసియేని పరి ♦ శుద్ధహవిష్యమొ కందమూలమో
పెరుగో ఫలంబో పూరికలో ♦ పిండియొ భక్ష్యములే గ్రసించుచుఁ
ధరను బరుండి తొమ్మిదిది ♦ నంబులఁదాఁక వినంగనౌ కథన్. ౪౦

చ॥ ఎవఁడు సమస్తశాస్త్రచణుఁ ♦ డెవ్వఁడు సద్గురువంశసంభవుం
డెవఁడు కృపాకరుండు మఱి ♦ యెవ్వఁడు మాధవభక్తిపూరితుం
డెవఁ డఖిలప్రజావిశయ ♦ హింసకుఁ డెవ్వఁడు సాధుబోధనా
వివరణదక్షుఁ డెవ్వఁడు వి ♦ వేకి యతండె ప్రవక్తయయ్యెడిన్. ౪౧

ఉ॥ ఉక్తవిధిన్ బ్రవక్తను ని ♦ యుక్తుని జేసినమీఁదటన్ యథా
శక్తిగ వేఁడి బాడబులఁ ♦ జక్కని ద్వాదశవర్ణమంత్రమున్
యుక్తజపంబు సల్పి సక ♦ లోత్కటవిఘ్నము లంతరింపఁగా
రక్తి స్వమిత్రబాంధవులు ♦ రా నొనరించి గ్రహింపనౌఁ గథన్. ౪౨

వ॥ అంత సయ్యాచార్యవర్యుచేఁ బ్రత్యవరోధవిహీనంబుగాఁ బ్రత్యహంబు మూఁడు జాములు గర్గసంహితను నొకఖండంబుచొప్పునఁ బ్రాగల్భ్యగళంబునఁ జెప్పింపనగు. ఈనిర్ణీతయామత్రయకాలంబున లఘుశంకాదికృత్యంబుల నిర్వర్తించి పాణిపాదముఖప్రక్షాళనంబు లాచరించుటకుఁగా నెక్కడనేని గ్రంథాంతమం దాపించి రెండుమారు లావాచకునకు విశ్రాంతి నీయందగు. ఇట్లు సక్రమంబుగాఁ బారాయణంబుఁ జేయించుచుఁ దొమ్మిదవదినంబున నవమంబగు విజ్ఞానఖండంబున గర్గసంహితాగ్రంథంబు నావాహనాదిషోడశోపచారంబులఁ బూజించి పిమ్మట సాధుబోధనాచతురుండగు నబ్బోద్ధనుగూడ శ్రద్ధమెయి నర్చింపనగు. కథావిశ్రామంబైనతఱి విష్ణు

భక్తిపరాయణులగు స్త్రీపురుషజనంబులతోఁ గూడఁ గాంస్యశంఖమృదంగాదిసమన్వితంబుగా నలుగడల నాట్యంబు సలుపుచు జయజయధ్వానంబులతో భగవన్నామసంకీర్తనంబు సేయందగు. అనంతరంబునం దా గర్గసంహితాకృతి స్వర్ణసింహాసనంబందుంచి సదక్షిణగా నాచార్యుని కర్పింపఁదగు. ఇట్లాచరించినవా రైహికసౌఖ్యం బనుభవించి యంతిమంబున శ్రీహరిం బొందుదురు. ఇక్కలియుగంబున నిదియే చక్కని సులభోపాయంబై యఘనిర్మూలకంబై యనంతసుఖప్రదంబై యలరారుచున్నయది. ఇట్టి గర్గసంహితాశ్రవణంబుకంటె భుక్తిముక్తిప్రదంబగు నన్యం బేమియున్నదని వినవలతువో వచింపుమని ప్రతిబాహుభూవరు నడుగ నతఁ డవనతశిరస్కుఁడై ప్రసన్నుండగుచు శాండిల్యమహర్షి కిట్లనియె. ౪౩

ఉ॥ కంటిని మిమ్ము నిమ్మెయిని ♦ గన్నులపండువగా మునీశ్వరా!
వింటిని సంహితామహిమ ♦ వీనుల విందుగఁ బాపనాశముం
గంటిని మీరు సెప్పినప్ర ♦ కారము కార్యములన్ ఘటింప నే
నుంటిని నన్ సపుత్రుఁగ నె ♦ టో యొనరింపు మటంచు వేఁడెదన్. ౪౪

తే॥ అంత శాండిల్యమౌనియు ♦ నభిమతించి, సర్వమంగళప్రదగర్గ ♦ సంహితాకృ
తిన్ బ్రబోధింపఁగాఁ బ్రయ ♦ త్నించి యమున, గట్టునన్ మండపముఁ గట్టి ♦ గ్రమవిధిని.

ఆ॥ అవల మధురయందు ♦ నమరిన జను లది
యాలకించి యచటి ♦ కరుగుదెంచి
రంత వేఁడును పఠ ♦ నాద్యంతముల బ్రాహ్మ
ణులకు నన్నదాన ♦ ముల నొసంగి. ౪౫

తే॥ హస్తి రథ హయ డింగరా ♦ నర్ఘ్యమణి సు
వర్ణ గో ధనరాశులఁ ♦ బరమభక్తి
నల్ల శాండిల్యముని కిడె ♦ నంత మునియు
గర్గసంహితాకృతిఁ జెప్పి ♦ కౌతుకమున. ౪౬

తే॥ ఆసమయమందె నీకుఁ బల్కాడినట్టి, హరిసహస్రనామంబుల ♦ నధికకరుణఁ
జెప్పె నేఁ డంతమున ముని ♦ సెప్పినటుల, భువనమోహను శ్రీకృష్ణు ♦ బుద్ధినిల్పి.

మ॥ మురళీగానమనోహరా! విబుధసం ♦ పూజ్యా! జగన్మోహనా!
కరుణాభూషణ! దైత్యశోషణ! జగ ♦ త్కల్యాణకృత్త్రాణ! యో
దరహాసాంచితపూర్ణచంద్రసుముఖా ♦ ధారాధరాభప్రభా!
దరచక్రాదిధరా! నగేంద్రధర! రా ♦ ధామాధవా! భూధవా! ౪౭

మ॥ అని ప్రార్థించి నమస్కృతుల్ సలుపఁగా ♦ నా దేవదేవుండు వం
శిని వేత్రంబును దాల్చి పీతపటముల్ ♦ సెల్వారగాఁ గోటిమా

రవిభుండై యనుకంపతో నగుచు నా ♦ రాధాసతింగూడి యా
తన్నిమ్మోర్లన్ దెసలున్ వెలుంగఁదగ నా ♦ స్థల న్నేత్రపర్వంబుగాన్. ౧౦

వ॥ ఇట్లు ప్రాదుర్భవించిన జగన్మోహనాకారుండగు శ్రీకృష్ణుని శాండిల్య మహర్షియుఁ, బ్రతిబాహుభూపతియుఁ, బట్టమహిషియగు మాలినియు గాంచి ప్రత్యుత్థానం బొనరించి నమస్కరించి యిట్లని వినుతించిరి. ౧౧

సీ॥ శ్రీవత్సలాంఛనా! ♦ శ్రీగజపోషకా!, శ్రీగళమిత్ర! చ♦క్రీ! జోహారు
గోలోకనాయకా! ♦ గోపలీలాన్వితా!, వైకుంఠలీలాప్ర♦వర! జోహారు
దేవర్షివందితా! ♦ దివ్యరూపాంచితా!, గిరిరాజపతిమనో♦హర! జోహారు
బృందావనవిహార ♦ బృందారకకదంబ, రక్షక! రాధేశ్వ♦రా! జోహారు
తే॥ నందనందన! నారాయ♦ణా! జోహారు
దానవాంతక! మానవో♦త్తమ! జోహారు
సచ్చిదానంద! యింద్రాను♦జా! జోహారు
కృష్ణ! రోచిష్ణు! జిష్ణు! హ♦రీ! జోహారు. ౧౨

ఉ॥ అంతట శ్రోతలెల్ల హరి ♦ కైదుపదుల్ బొనరించి శ్రీపతీ!
సాంతము మాదు తప్పులను ♦ జక్కఁగ మన్ననసేయుచున్ సుధీ
మంతుని వంశకర్త సుకు♦మారుఁ గుమారుని తేని కిచ్చి మా
కంతము లేని బత్తి తమ ♦ యందున నుండ ననుగ్రహింపుమా! ౧౩

చ॥ గిరిజ! యిటుల్ నుతింపఁ గని ♦ కృష్ణుఁ డఖండఘనస్వరంబునన్
వరముని! పౌరులార! బహు ♦ భక్తిని నిప్డు మదీయవాక్యముల్
సరిగ వినుండు! గర్గకృత ♦ సంహిత కామచతుష్టయప్రదం
బరిహరణంబు విన్నఁ దమ ♦ యర్థితవాంఛ ఫలించితీరెడిన్. ౧౪

చ॥ ఎవ రెవ రెట్టికోరికల ♦ నేరియు గోరియు గర్గసంహితా
శ్రవణము నాచరించెదరొ ♦ సంశయ మింతయు లేనియట్టుల
య్యవి యవి వారివారికిని ♦ హత్తునుగా యని కోర్కెలిచ్చి మా
ధవుఁడు నదృశ్యుఁ డయ్యెను ము♦దంబును నందరు బొందిరో యుమా! ౧౫

క॥ మునివరశాండిల్యుండును, ఘనమధురాబ్రాహ్మణులకు ♦ గౌరవపక్కిన్
ధన మిడి ప్రత్యేకముగా జననాయకు నూఱడించి ♦ చనియె మృడానీ! ౧౬

ఉ॥ మాలిని మానినీమణి స♦మంజసభూషణకమ్రమై విభున్
లీలల సోలి చూలు నవ ♦ లీలఁగఁ బొందియు నూతికాలమం
దోలి సుపుత్రుఁ గాంచె నిజ ♦ యుక్తకృతిప్రతతిన్ జనేశుఁడున్
మేలని యిచ్చెఁ బాఱులకు ♦ మేదిని గోగజహేమవస్త్రముల్. ౧౭

తే॥ ప్రాజ్ఞ దైవజ్ఞనాజ్ఞ సుబాహువనఁగ, నామకరణంబు సల్పి యనంతరమునఁ
బాలితోషిక మతనికిఁ గోరినటుల, నిడుచు సంతృప్తుఁ జేసి తా నిట్లు తలఁచె. ౫౮

ఉ॥ వేసిన సత్రముల్ప్రపలు వేసిన వాపితటాకకూపముల్
జేసిన యజ్ఞయాగములు జేసిన గోధనభూమిదానముల్
జేసిన దేవపూజ ఫలి యించి యొకుమ్మడి సిగ్గుఁజెందు నా
కీసమయంబునన్ దనయుఁ దేర్పడ సల్పుటఁగంటి ధన్యతన్. ౫౯

క॥ ఏవంవిధముదితుండై, భూవరుఁడా గర్గమౌని బోధితగాథా
శ్రావిత సౌఖ్యములందుచు, శ్రీవిభు గోలోకమునకుఁ జివరన్ జేరెన్. ౬౦

చ॥ ధనగృహరాజ్యపుత్రసుఖ తన్వియశస్సుకృతప్రభావవా
హనపరమార్థముల్ గలుగు నట్లు రచించును గర్గసంహితా
మనన మటంచుఁ బార్వతి కు మాపతిబల్కియు మిన్నకుండుటన్
గని మును లూరకుండుటయుఁ గాంచి యపర్ణ వచించె నిట్టులన్. ౬౧

సీ॥ గంగాధరా! శౌరి గాథాసమన్విత, గర్గసంహిత బలుకంగవలయు
నావుడు శ్రీగళుఁ డా విష్ణుచరితంబు, సర్వంబు వినిపించి సంతసించి
గౌరిరో! కలియందు గంగకుఁ గుడివైపు, రెండుక్రోశములం దఖండితముగఁ
బెంపువహించెడి బిల్వకేశవనానఁ, జెందిన శ్రీకర సిద్ధపీఠ

తే॥ మందు గోలోకవైష్ణవబృందసహిత, నాచు శ్రీ భాగవతసంహితాదికోశ
ములను విందువటంచుఁ దా నిలుపుదలను, సల్పె నీయితిహాసంబు శౌనకుండ!

చ॥ గిరిజ ప్రసన్నురాలగుచుఁ గృష్ణకథార్థిని యయ్యెఁ దత్కలిన్
సురసదియామ్యభాగమున సొంపుదలిర్చెడి సిద్ధపీఠమం
దరుసున సర్వమంగళ య టంచు వచింప సురూపమొంది శ్రీ
హరికథలన్ విన న్జనన మందును శౌనక! మౌనినాయకా! ౬౩

క॥ ఇది వినిపించిన వినినను, జదివించినఁ జదువువారి సర్వార్థంబుల్
గొదకొనుఁ బాపములన్నియు, సదమదమౌ విష్ణుపదము జక్కఁగఁ జిక్కున్.

గద్య. ఇది శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రి ప్రణీతంబును, సమ్మోహనతంత్రాంతర్భూతంబును నగు శ్రీగర్గసంహితా మాహాత్మ్యంబు సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ
శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీ రాధాకృష్ణపరబ్రహ్మణే నమః

# కృతజ్ఞత.

## పోషకులు.

మ. రా. శ్రీ. నెల్లుట్ల నరసింహారావుగారు, దేశముఖ్, మక్తేదార్,
జనగాం, నైజాం.

" మహాలక్ష్మీ సుబ్బయ పుత్రుండును, వేంకటసుబ్బమ్మ భర్తయునగు చివుకుల రామకృష్ణయ్యగారు, మన్నూరు, ఒంగోలుతాలూకా.

" మారేమండ నరసింగరావు పంతులుగారు, బి. ఏ., అసిస్టంటు ఆడిటరు, హెచ్. ఇ. హెచ్. ది నైజాము రైల్వే, శికింద్రాబాదు.

" (పిసుపాటి వెంకటరంగయ్యగారి జ్ఞాపకార్థము) వెంకట్రాయశర్మగారు, వేదశాస్త్రాంగ్లపాఠశాలాసంస్థాపకులు, నిర్వాహకులు, హానరరీ బెంచిమేజస్ట్రేట్, జమ్మవరం ఎస్టేటు ప్రొప్రయిటర్లు, కరవది,
ఒంగోలు తాలూకా.

" పరచ లక్ష్మమాంబానంతరామ ద్వితీయపుత్రుండగు రామేశ్వరరావుగారు, మక్తేదారు, కారేపల్లి, ఇల్లెందులపాడు తాలూకా.

" రుమాళ్ళ కుమారస్వామి సాహుకారుగారు, శికింద్రాబాదు.

" చీకోటి వీరన్నగారు, కంట్రాక్టర్సు అండ్ జనరల్ మర్చంట్సు, శికింద్రాబాదు.

" బూర్గు విశ్వనాథం బ్రదర్సువారు, బ్యాంకర్సు, అండు గోల్డు మర్చంట్సు, శికింద్రాబాదు.

మ. రా. శ్రీ. జనగాం వర్తకసంఘమువారు, జనగాం.

,, చిటిమెళ్ళ నరిసిములుగారు, జనగాం.

,, నెల్లుట్ల రామలింగుగారు, షాపురము సంస్థానము మేనేజరు, నెల్లుట్ల.

,, గాదె చినకోటిరెడ్డిగారి కుమారుడు రామకోటిరెడ్డిగారు, భూస్వాములు, సరస్వతీగ్రంధాలయ ప్రతిష్ఠాపకులు అండ్ మేనేజరు, తాలూకా కోఆపరేటివ్ సూపరు వైజింగ్ యూనియన్ డైరక్టరు, కోఆపరేటివ్ సొసయిటి ప్రెసిడెంటు, ఫారెస్టు పంచాయితి రిజర్వు ప్రెసిడెంటు, చంద్రాజుపాలెం, సత్తెనపల్లితాలూకా, గుంటూరుజిల్లా.

,, నాగారెడ్డి దొరవారు దేశాయి (జమీందారు) యల్లారెడ్డితాలూకా, నిజాంబాద్ జిల్లా.

ఈ యుదారశిరోమణు లేతద్గ్రంథంబునకు పోషకత్వము వహించి తగినట్లు ద్రవ్యసహాయ మొనరించి నన్ను సఫలమనోరథుని గాఁ జేసినందులకు బ్రహ్మాండనాయకుండగు శ్రీరాధాకృష్ణుం డాయు రారోగ్య భాగ్య పుత్రపౌత్రాభివృద్ధులు కలుగునట్లు రక్షించుగాక !

ఇట్లు,
☞ గ్రంథకర్త.

శ్రీ రాధాకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీగర్గభాగవతము.





## ఇష్టదేవతాస్తుతి.

లావణ్యసుధాసముద్రవిలస ♦ చ్ఛ్రీమంతు నామ్నాయవీ
థీలోకోత్తరసంచరిష్ణు విబుధ ♦ ధ్యేయాత్ము గంగాకరు
వ్యాళేంద్రాంచితదేహు విష్ణుని బర ♦ బ్రహ్మంబు గోపాలకు
లీలామానుషరూపు శంకరుని నే ♦ నిత్యంబు సేవించెదన్.

ఉ॥ ఐదుపదుల్ బొనర్చెద న ♦ ఘావళిభేదికి నంతరాయవి
చ్ఛేదికి వేదవేదికి వి ♦ చిత్రతరోందురురాజసాదికిన్
మోదకఖాదికిన్ ద్రుహిణ ♦ భూతపతిప్రముఖప్రశంసనా
మోదికి సుప్రసాదికిఁ గు ♦ బుద్ధినిషూదికి సాధువాదికిన్॥ ౨

ఉ॥ తోయరుహాసనుండు నఘ ♦ తూలధనంజయుఁ డుత్తమశ్రుతి
ధ్యేయుఁ డనాదివేదమయుఁ ♦ డీశుఁ డుదారుఁడు ధీరుఁడున్ జగ
ద్గేయుఁడు భారతీవిభుఁడు ♦ దేవమునీంద్రనుతుండు బ్రహ్మ దీ
ర్ఘాయువు సత్కళాప్రతిభ ♦ నచ్ఛయశంబు నొసంగి ప్రోచుతన్॥ 3

చ॥ జ్వలనుఁడు పావకుండు రవి ♦ చంద్రులు వస్తునుసాధకుల్ మునీ
శు లతిధు లద్రి వంటయిలు ♦ శుద్ధసురాపగ తోయదాత్రి వే
ల్పుల మొనకాఁడు కార్యపరి ♦ పూర్ణవిచారకుఁ డన్నపూర్ణ దా
నలలితగాఁగ విందుల ఘ ♦ నంబుగఁ జేయు మహేశుఁ డోముతన్. ౪

ఉ॥ శంకర! భక్తితత్పరవ ♦ శంకర! నిర్జితధర్మదూరదు
స్సంకర! సర్వలోకపృథు ♦ శంకర! దర్పకదర్పశైలనా
శంకర! జిష్ణువిష్ణుముఖ ♦ సన్నుతిపాత్రసుధాంశుశేఖరా! ౫
సంకటరాజిఁ బాపి ననుఁ ♦ జల్లనిచూపులఁ జూడుమా! కృపన్.

శా॥ బ్రహ్మా! కొల్చెద గర్గభాగవతమున్ ♦ హస్తంబునన్ బూని యాం
ధ్రమ్మున్ సెప్ప ననల్పయత్నమున నే ♦ దైవాఱుచుంటిన్ సుశ

బ్దముల్ బల్కుమ! మద్రసాగ్రగతవై ♦ బ్రాహ్మీ! కృపాంభోనిధీ!
సమ్మోదావృతభారతీ! భగవతీ! ♦ సంగీతరంగస్మతీ! ౬

శా॥ అంబా! సర్వసుపర్వనాథచతురా ♦ స్యాంభోజకాసారకా
దంబా! యంబుజకీరపుస్తకసము ♦ ద్యన్మాలికాంచత్కరా
లంబా! తుంబురునారదాదిముని సం ♦ శ్లాఘార్హవీణాకళా
లంబా! నంబర మింబుగా నిడి వచ ♦ శ్శ్లాఘ్యున్ నన్ను సల్పవే. ౭

శా॥ పూతా! నీచెయిదమ్మినున్న పటికం ♦ పుం బూసలమాలన్ నఖ
వ్రాతోగ్రప్రచయప్రభిన్నమును గీ ♦ రం బాస్థగాఁ జూచి సం
జాతామోదమనోగతిన్ గరకబీ ♦ జభ్రాంతిఁ జంచూపుట
స్ఫూర్తిన్ లాగ నదల్చునట్టి దరహా ♦ సం బెప్డు నన్ బ్రోచుతన్. ౮

ఉ॥ దుర్గమమార్గవర్గయుత ♦ తుంగతుషారశిలోచ్చయాత్మజా!
దుర్గతదుర్గతిస్థితివి ♦ దూరకృతిప్రథితాష్టమూర్తి సం
సర్గ! విచిత్రసర్వవిధ ♦ సర్గనిదాన! సువర్ణదుర్గ! నా
కర్గళహీనసత్కవిత ♦ యబ్బునటుల్ బొనరింపుమా! దయన్. ౯

ఉ॥ రాణిని మామమామతొలి ♦ రాణిని బోషితదేవతాసుర
శ్రేణిని నారదాదిముని ♦ సేవ్యమనోహరవాణి సైకత
శ్రోణిని భృంగవేణిని ద్రి ♦ శుద్ధిగ శ్రద్ధను గొల్తు నిత్యక
ల్యాణము బచ్చతోరణము ♦ నర్థ మనారతమొంది యుబ్బగాన్. ౧౦

ఉ॥ ఏకలికిన్ వరించి హరి ♦ యిద్ధనరోత్తముఁడయ్యె మన్మథుం
డేకమలాక్షికిన్ గలిగి ♦ యెల్లెడ రూపసియయ్యె దూష్యదో
షాకరుఁడేమెతోడగుట ♦ స్తవ్యసుధాకరుఁడయ్యె వార్థిర
త్నాకరమయ్యె దేనిఁగన ♦ నట్టి హరిప్రియ నన్నుఁ బ్రోచుతన్. ౧౧

## సంస్కృతకవీంద్రస్తుతి.

ఉ॥ నాకనివాసినిత్యనుత ♦ నారదబోధితుఁడై కళానిధి
శ్రీకరుణాతిరేకమునఁ ♦ జిత్రకవిత్వము "మానిషాద" సు
శ్లోకముఖానఁబుట్ట రఘు ♦ శూరచరిత్రము వ్రాసినట్టి వా
ల్మీకిమహర్షి కాదికవి ♦ మిత్రులకే నొరిగల్ బొనర్చెదన్. ౧

చ॥ నవనవభావభావితము ♦ నైగమసూక్తినియుక్త మద్భుత
ప్రవిలసితంబు సత్పురుష ♦ పావనజీవితభాసితంబుఁ బా
పవిమలతాలవిత్రమును ♦ భద్రనదీనదచిత్రచిత్రితం
బు వినుతమౌ పురాణతతిఁ ♦ బూనిక వ్రాసిన వ్యాసుఁ గొల్చెదన్. ౨

చ. కవనము జాహ్నవీఝరము ♦ కైవడిఁ జాలఁ నుతింతు గర్గునిన్
గవివరకాళిదాసుని జ ♦ గద్గురుశంకరు బాణ దండి భా
రవి జయదేవ శూద్రక ధ ♦ రావిభు భోజుల రాజశేఖరుల్
గవిభవభూతి మల్హణునిఁ ♦ గల్హణ బిల్హణ జల్హణాదులన్. 3

## ఆంధ్రమహాకవి ప్రార్థనము.

ఉ. మోదముతోడ మ్రొక్కెదను ♦ ముద్గలగోత్రజు నన్నయార్యు మా
వైదికవంశదీపకు న ♦ పారతపఃఫలధన్యు నష్టభా
షాదయితున్ సుమత్యమర ♦ సద్గురునిన్ నిగమార్థవేది నాం
ధ్రాదికవీంద్రు భారత మ ♦ హాగమసత్కృతిసంవిధానునిన్. ౧

ఉ. కక్కురితిన్ బదంబులను ♦ గైకొనకుండఁ దెనుంగు బాసలోఁ
జిక్కిన శబ్దజాలము సు ♦ శీలురు మెచ్చఁగ సేకరించి పే
రెక్కిన భారతంబు బదు ♦ నేనుకృతుల్ రచియించి కైతలన్
దిక్కన వన్నెకెక్కు కవి ♦ తిక్కన కేను నమస్కరించెదన్. ౨

ఉ. కన్నులనీరు నీరధిగఁ ♦ గాఱ్చు సరస్వతిఁ గాంచి "యమ్మరో
బన్నపడంగనేల"యని ♦ భాగవతాహ్వయకోశరాజమా
పన్నదయాభిరామునికి ♦ భక్తిని నంకితమిచ్చి యామె యా
పన్నతఁ బాపినట్టి కవి ♦ బమ్మెరపోతన కేను మ్రొక్కెదన్. 3

మ. వినుతింతున్ ఘనశంభుదాసకవినిన్ ♦ భీమన్న సోమన్నఁ గే
తన శ్రీనాథుని మారనాఖ్యుఁ గవితా ♦ ధన్యాత్ముఁ బెద్దన్నఁ ది
మ్మన సూరన్నల రామరాజకవినిన్ ♦ మల్లన్న శ్రీకృష్ణరా
యనరేంద్రుల్ మఱి ప్రస్తుతాంధ్రకవితా ♦ వ్యాపారపారీణులన్. ౪

## కవివంశానుక్రమణిక.

తే. దేవదేవ! రాధాకృష్ణ! ♦ యీవసుధను, నీకుఁ దెలియని దె ♦ య్యది నీరజాక్ష!
యైన నాచరితంబు నీ ♦ వవధరింపు, మాత్మనుతియని యెంచక ♦ యబ్జనాభ! ౧

సీ. విద్వదగ్రణియు భా ♦ రద్వాజగోత్రుండు, నారాయణాఖ్యుండు ♦ నాదు తాత
గీతాధ్యయనకృతి ♦ పూతచరితుఁడైన, కామయ్యసూరి నా ♦ కన్నతండ్రి
సకలసాధ్వీమణీ ♦ సంస్తవమెంతయు, గనిన కోటమ్మ నా ♦ కన్నతల్లి
విధిగుండికాతట ♦ ప్రథితమౌ నందిపాడ్గ్రామోత్తమంబు నా ♦ కన్నచోటు

తే. చివురులయని గృహాఖ్యయుఁ ♦ జెలఁగు కృష్ణ!, నిద్ది ననుఁగని యైదేడు ♦ లేగువఱకుఁ
బెంచినట్టివారల కుల ♦ వృత్త మింక, దత్తుఁగైకొన్నవారి వృ ♦ త్తాంతము విను.

సీ॥ చివుకుల కులవార్ధి ♦ శీతకరాప్పయ, నామకబుధుఁడు పి ♦ తామహుండు
స్కంధత్రయాత్మక ♦ జ్యోతిషధీర సు, బ్రహ్మణ్య విబుధుండు ♦ వరజనకుఁడు
దానధర్మప్రియా ♦ నూనాచరణరత, యైన లక్ష్మీదేవి ♦ యమలజనని
ధరఁ జిత్రపూరు సీ ♦ తారామనామక, వ్యాకరణజ్ఞుండు ♦ వరగురుండు

తే॥ గోత్ర మరయ భారద్వాజ ♦ గోత్రమె సుమి, వాసమెన్నఁగ హైదరా ♦ బాదుపరిస
రాంచితంబును ధార్మిక ♦ ప్రాంచితంబు, పరమునైన శికిందరా ♦ బాదుపురము.

తే॥ పిదప నక్కఁ బెంచుకొని బహు ♦ ప్రీతిఁ గనెడి
లక్ష్మిదేవమ్మ దయతోడ ♦ లలితరీతిఁ
బెరిగి ప్రాక్తనార్జితపుణ్య ♦ విధిని ధనము
విద్దె బుద్ధియు యశమబ్బఁ ♦ దద్దనుంటి. ౪

ఆ॥ తత్పరంబునందు ♦ ధారాకులోద్భవ, నన్నపూర్ణఁ బెండ్లి ♦ యాడియుంటి
నద్ది కొంతకాల ♦ మగుడు గారినిఁ గొల్వ, దివికిఁ గదలిచేర ♦ తిరిగి నేను. ౫

క॥ ఇంగొలు వెంకటసుబ్బయ, వెంకమ్మల మనుమరాలు ♦ వినుతచరితయౌ
వెంకట అప్పయ రుక్మిణి, పంకజనేత్రలకు బిడ్డ ♦ వరయగు దుర్గన్. ౬

తే॥ ప్రీతిఁ జేపట్టియుంటిని ♦ వేదవిధిగ, రాధికాకృష్ణకరుణచే ♦ రమణమీాకు
పుత్రుఁడొక్కఁడు మాకిప్పు ♦ పుట్టియుండె, నవని వాఁడు సుబ్రహ్మణ్యుఁ ♦ డనఁగ నెగడు.

సీ॥ వ్రాసితి గద్యలో ♦ బాలనీతియనంగ, భారతకథలతోఁ ♦ బరగుకృతిని
నాంధ్రీకరించితి ♦ నాదిశంకరకృత, నరసింహనుతి ధ ♦ న్యతఘటిల్ల
గావించితిఁ దెల్గు ♦ గాళిదాసరఘాంగ, దూతకావ్యంబు సం ♦ తోషమొదవ
విరచించియుంటిని ♦ వేంకటేశ్వర సువి, జ్ఞప్తి లోకస్థితి ♦ సరిగఁ దెలియ

తే॥ మఱియు వర్ణవ్యవస్థ స ♦ మంజసవిధి, వ్రాసియుంటి రజస్వలా ♦ పరిణయదృఢ
ఖండనకృతి రచించితిఁ ♦ గాంచి బుధులు, బళిర! యనిమెచ్చ శ్రీకృష్ణ! ♦ పరమపురుష!

ఆ॥ ఇట్టినేను దొలుత ♦ నిష్టదేవాచార్య, జనకసూకవినుతుల ♦ సల్పి నాభ
వంబు సార్థకముగ ♦ భక్తితో నీకంకి, తముగఁ గృతిరచింపఁ ♦ దలఁచినతఱి. ౭

## ప్రకృతకృతిప్రశంస.

సీ॥ నిత్యమై మానిసం ♦ స్తుత్యమై శ్రీకృష్ణ, నుత్యసద్వృత్తనా ♦ న్నత్య మగుచు
గేయమై పండిత ♦ జ్ఞేయమై సజ్జన, ధ్యేయమై దీనాళి ♦ దేయమగుచు
స్వాద్యమై విరచిత ♦ పద్యమై యదువీర, విద్యానవద్యతా ♦ హృద్యమగుచు
శ్రావ్యమై విబుధసం ♦ సేవ్యమై నవరస, భావ్యమై ముఖ్యస ♦ త్కావ్యమగుచు

తే॥ వేదతుల్యంబునయి జగ ♦ ద్విదితమగుచు, గర్గమునికృతమైనట్టి ♦ గర్గసంహి
తాహ్వాయేతిహాసము దెల్గు ♦ నందు లేక, చెలఁగ సంస్కృతమం దని ♦ చెవికి సోఁక.

తే॥ జనకుఁ డాత్మజుఁ గైకొని ♦ సర్వకళల, శోభ జెందెడి చంద్రునిఁ ♦ జూపఁజూచి
జనక! యది దెమ్ము తెమ్మని ♦ యనెడి బాలు, భావమును బోలు చిత్రభా ♦ వంబుతోడ.

మ॥ కని యా కబ్బముఁ దెల్గుసేయు మదిలోఁ ♦ గౌతూహలం బొంది భ
క్తిని వాణీకృపఁ గోరి తోఁచినటులన్ ♦ దెల్గింప నేనుంటిఁ గా
వున నీవీకృతియందునిల్చి దయఁ ద ♦ ప్పుల్ వాపి యొప్పుల్ సదా
తనరం జేయ నమస్కరించెదను రా ♦ ధాకృష్ణ! కృష్ణప్రియా! 3



## శ్రీగర్గభాగవత కృతిపతి.



శ్రీరాధాకృష్ణులు.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ గర్గభాగవతము



## గోలోకఖండము.





రమణీ మనోహరవి • శేషమనోజ్ఞపదారవిందముల్
శారదఫుల్లపద్మరుచి • సామ్యములుఁ మునిభృంగజుష్టముల్
నీరజవజ్రచిహ్నముఖ • నిస్తులముల్ హతభక్తతాపముల్
భూరివికారనూపురవి • భూషితముల్ మదిలోనఁ జేర్చెదన్.

చ॥ ఎవనిముఖాంబుజంబున వ • రేతురసాధికరుచ్యమాద్యముల్
దివిజమనోజ్ఞమై వెడలు • దివ్యసుధన్ గడుపారఁగ్రోలి సం
స్తవము బుధుల్ వొనర్తురల • సాత్యవతేయుఁడు విష్ణురూపుఁడుల్
బ్రవిమల బాదరాశ్రమని • వాసుఁడు నాకృతి దిద్దిప్రోవుతన్. ౨

శ్రీ గర్గాచార్యుండు నైమిశారణ్యమున కేతెంచుట.

క॥ ఒండొకవేళను యోగా, ర్యుండతితేజస్వి, జ్ఞాని • కులతిలకుఁడు గ
ర్గుండల నైమిశవనమున, నుండెడి శౌనకునిజూడ • నొగినేతెంచెన్. 3

తే॥ శౌనకుండును వచ్చిన • శాంతిదాంతి, సంతతానంద భరితుడు • సర్వవిదుఁడు
నైన మునివరుఁగనిలేచి•యధికభక్తి,నర్చలన్ సల్పి మునియుక్తుఁ•డగుచు మ్రొక్కి.

చ॥ అలఘుచరిత్ర ! మాయెడకు • నక్కటికంబున మీరు వచ్చుటల్
సులభమె ? యార్యచర్య ! గృహి • శోకముమాన్పదె ! ధ్వాంతమూడ్చు త
మ్ములచెలికంటిలోని పరి • పూర్ణతమంబును బాపదే ! యహా !
పలుకఁగఁ జాల నిందలిప్ర • భావములెల్ల మునీంద్రచంద్రమా ! ౫

వ॥ పండితప్రకాండులు బహుభంగుల వర్ణించుచుండు బ్రహ్మాండ నాయకావతారంబులంగూర్చి నాసందేహంబులు దీరునట్లుగా విశదీకరింపుఁడని సవినయంబుగా, సానందంబుగా నడుగ సంతసించి యాగర్గాచార్యుం డతని కిట్లనియె.

ఉ॥ ఓ యమలాత్మ! వింటి నిపు డుత్తమ తద్భగవత్ప్రశంసనుఁ
బాయక యిద్ది శ్రోతలకు వాచక పృచ్ఛక లేఖకాళికిన్
శ్రేయముగూర్చు నిందులకు జెప్పెద నే నితిహాస మొండు నే
దేయెడ విన్నమాత్రమున నెల్లయఘంబులఁ బాపఁ జాలునో. ౭

బహులాశ్వుఁడు నారదమునిని సత్కరించి ప్రశ్నించుట.

చ॥ తొలుతఁ బ్రతాపవంతుఁడు వి ధూతమదుండును గృష్ణభక్తిస
ల్లలితుఁడు శాంతమూర్తి బహు లాశ్వుఁడు నా మిథిలాధినాయకుం
డలరు నతండు పుష్కరస మాగతనారదమౌనిఁ గాంచి పూ
జల నొనరించి పీఠము నొ సంగి కృతాంజలియౌచు నిట్లనెన్. ౮

చ॥ ప్రకృతిపరుం డనాది భగ వంతుఁడు బూరుషుఁడున్ మహాత్ముఁడున్
సకలహృదంతరస్థుఁడయి సన్నుతి సెందినవాఁడు పాంచభౌ
తికతను వొందె నెందులకు దీర్ఘచరిత్ర! దయాపయోనిధీ
సకలము దెల్పుమా యనఁగ సమ్మతి నారదుఁ డిట్లు సెప్పెడిన్. ౯

నారదుండు బహులాశ్వునకుఁ బరమాత్మావతారంబులంగూర్చి తెలుపుట.

చ॥ నటుఁడు స్వలీల మోహము గ నం జనఁ డన్యుఁడ నంచు నెంచఁబోఁ
డటులఁ బరాత్పరుండు స్వక శాతిశయమ్మున వేదసాధుగో
పటలధరామరావన మ వారిగఁ గోరుచు జన్మమెత్తు న
క్కట మది లాతివారు గని తల్లడ మొందుదు రయ్య భూవరా! ౧౦

చ॥ అనవుడు మేదినీశుఁడు మ హాముని! సజ్జనరక్షణార్థమై
నెనరున నెన్నిమాఱు లటు నీరజలోచనుఁ డెత్తె జన్మముల్
వినఁ దొర నుంటిఁ గాన దయ వీనులవిందుగఁ దెల్పవన్న నా
జనకుని కబ్జయోనిజుఁడు సక్క వచింపఁ గడంగె నిట్టులన్. ౧౧

వ॥ శ్రీహరి సాధుసంరక్షణార్థంబై యెత్తిన యవతారంబు లంశంబులనియు, నంశాంశంబులనియు, నావేశంబులనియుఁ, గళలనియుఁ, బూర్ణంబులనియుఁ, బూర్ణతమంబులనియు నాఱుతెఱంగులుగానుండునని యింతకుమున్నె వ్యాసాదులు నిర్ధారించియుండిరి. ఆయవతారంబు లెత్తినవా రెవరెవరన? అంశములవలన బ్రహ్మాదులును, నంశాంశములవలన మరీచ్యాదులును, నావేశములవలన భార్గవాదులును, గళలవలనఁగపిలకూర్మాదులును, బూర్ణమువలన శ్రీనృసింహుండును, శ్వేతద్వీపాధిపతియగు హరియు,వైకుంఠుండును,యజ్ఞుండును, నరనారాయణులును, బూర్ణతమము వలన సకలభువననాయకుండై యత్యుత్కృష్టధామంబగు గోలోకంబున విరాజిల్లు శ్రీకృష్ణుండు నుద్భవిల్లిరనిచెప్పంబడు. కార్యాధికారు లంశావతారులనియుఁ, దత్కార్యాధికారుల యాజ్ఞలకుఁ లోఁబడి తోడ్పడువా రంశాంశావతారులనియుఁ, బర

మాత్మ పెఱవారి యంతఃకరణంబులం జొచ్చి యగణ్యంబులును, మాన్యగణ్యంబులునునగు పుణ్యకర్మంబుల నిర్వర్తింపఁ జేసి నిర్గమించినవాఁ డావేశావతారుం డనియుఁ, బ్రతియుగంబున ధర్మచ్యుతి యగుచున్నప్పుడెల్ల నారసి తద్ధర్మం బుద్ధరించి చనినవాఁడు కళావతారుండనియుఁ, జతుర్వ్యక్తులును, నవరసములును, బహుబలంబులును గలకార్యంబు లెవనియందు శోభిల్లుచుండునో యట్టివాఁడు పూర్ణావతారుం డనియు, సర్వచరాచరతేజోరాశి దేదీప్యమానంబగు స్వతేజంబునం గలియ వెలుంగునో యట్టి పరంధాముండు పరిపూర్ణతమావతారుండనియు నెఱుంగునది.

క॥ అరయఁగ శ్రీకృష్ణుండే, పరిపూర్ణతముండు లాఁతి ♦ వారలు గారా
హరి యొక కార్యము సేయఁగ, నరుదెంచి యనేకకృతుల ♦ నక్కఱఁ జేసెన్. ౧౩

చ॥ ఎవఁడు పరాత్పరుండొ పురు ♦ షేశ్వరుఁ డెవ్వఁడొ పూర్ణుఁ డెవ్వఁడో
యెవఁడు పురాణుఁడో మఱిఁ బ ♦ రేశుఁ డెవం డలవాని నాస్వయం
భువు నలసద్గుణాకరు న ♦ మూల్యకృపాకరు నామహాత్ము నా
ప్రవిమలు నాపరాత్పరుని ♦ భక్తిఁ గడున్ శరణంబు వేడెదన్. ౧౪

ఉ॥ శౌనక ! ఱేఁడు నారదవ ♦ చస్సుల నిట్టుల వించు మోదబా
ష్పానమితాక్షుమల్ దుడిచి ♦ యామునికిట్లను శ్రీరమేశుఁడ
న్యూనతమావతారమును ♦ నొందుట లెందుల కట్టి ద్వారకా
ఖ్యానగరంబునన్ భరత ♦ ఖండమునన్ విలసిల్లు టేలకో. ౧౫

ఉ॥ ఆకమలాక్షుఁ డెట్లొ యిల ♦ కాగతుఁ డయ్యెను గాక వాని గో
లోకచమత్కృతుల్ సుజన ♦ లోకహితార్భకబాలలీల లయ్యసం
ఖ్యాకములైన కార్యములు ♦ గౌరవభాజన జీవితంబు నీ
నాకు విన్ బ్రియం బలరు ♦ నారద ! చెప్పుము తప్పకుండఁగాన్. ౧౬

ఆ॥ నూరుపుట్టువులను ♦ భూరిపుణ్యక్షేత్ర, పర్యటనతపముల ♦ భక్తి సలుపు
మానవుండు సుజన ♦ మైత్రిని బొందెడిఁ, నతఁడె ముక్తి కర్హుఁ ♦ డగును దలఁప.

ఉ॥ ఎన్నఁడు బోసికొందుఁ జెవిఁ ♦ గృష్ణకథామృతచారుధార లిం
కెన్నఁడు జూతునో సురము ♦ నీశ్వరబాడబముర్ల బాద్య నిం
కెన్న డొనర్తునో సరసి ♦ జేక్షణదాసపదాబ్జసేవ నిం
కెన్నఁడు బాయునో కలుష ♦ వృద్ధినిబద్ధమదీయపద్ధతుల్. ౧౭

వ॥ అని నానావిధంబుల నువ్విళ్ళూరు నాజనకాపరనామక బహులాశ్వ
రాజేంద్రుంగని నారద మునీంద్రుం డిట్లనియె. ౧౮

ఉ॥ ఇష్టుఁడు భక్తవత్సలుఁడు ♦ కృష్ణుఁడు నీకిట దర్శనంబిడన్
గష్టమటంచు నెంచక సు ♦ [illegible]

భీష్మముదీరు ధన్యతయు ◆ వే ఘటియించును విప్రదేవుఁడున్
విష్టపనాథుఁడైన హరి ◆ విశ్రుతు నిన్నుఁదలంచు ద్వారకన్. ౧౦

ఉ॥ భూవరవర్య! మీ సుకృత ◆ ముల్ బహుళంబులు గావె యెవ్వరే
నీవిధి యాపరాత్పరుని ◆ యెన్నిక కందిరె? యమ్మచెల్ల! యే
మీ! విబుధాళిభాగ్యదశ ◆ యెన్నట ధాతకు వాని తాత కా
శీవిష నాయకాగ్రణికిఁ ◆ జెల్లునె? యెన్నటికేనిఁ జాగురే. ౧౧

ఉ॥ వాకునుబొందియున్ బ్రణుతి ◆ పాత్రుఁ బవిత్రచరిత్రుఁ గృష్ణునిన్
వాకొనఁడేనిఁ దన్నరుఁడు ◆ పాత్రమునం దిడియున్న యన్నమున్
జేకొనునట్టి వానివలె ◆ సిద్ధముజేసిన ముత్తినిచ్చినన్
గైకొని యెక్కనట్టిజను ◆ కైవడి వీటిడియై నశించెడిన్. ౧౨

చ॥ క్రమముగ మాధవాగమన ◆ కారణ మాడెద నీ వరాహక
ల్పమునను తొల్లిఁ గాశ్యపి, ఖ ◆ లప్రభుదానవదైత్యనారభా
రము దలఁదాల్పలేమిని శ ◆ రణ్యములేమిని గుంది గోస్వరూ
ప మమర దేహమున్ వణఁక ◆ బ్రహ్మసమీపము జేరి భక్తితో. ౧౩

చ॥ కని వినుతించి మ్రొక్కు లిడఁ ◆ గంజజుఁ డాయమ నాదరించి యే
మని యిటు లిందుఁ జొచ్చితివొ ◆ యద్ది వచింపుమ భూసతీమణీ!
యనవుడు తద్వసుంధర క ◆ రాంబుజముల్ ముకుళించి గద్గద
స్వనమున దాను బొందు బహు ◆ బాధలఁ జక్కఁగ విన్నవించుడున్. ౧౪

చ॥ విని యతఁ డమ్మరో! వగపు ◆ వీడుము శక్తికొలంది సాయమే
నొనరుతునమ్మ! రమ్మని సు ◆ ధోదనపంక్తి సమేతుఁడై త్రిలో
చను సహకారిగాఁ గొనుచుఁ ◆ జక్రి గృహంబును భక్తసన్నుతం
బును ననపద్య మవ్యయము ◆ ముక్తిద మొంది తదంతరంబునన్. ౧౫

చ॥ సిరిచెలినిన్ జతుర్భుజు సు ◆ శీలుని గాంచి నమస్కరించి రా
కరహిని విన్నవింప విని ◆ కంజదళాక్షుఁడు భీతధాతృశం
కరముఖదేవరాజిఁ దమ ◆ కంబునఁ గన్గొని యూఱడించి ఖే
చరవరులార! నానుడులు ◆ శాంతముతో విని యాచరింపుఁడీ. ౧౬

మ॥ గణనాతీత విలాసలోలుభుని సా ◆ క్షాత్సర్వసంపూర్ణునిన్
బ్రణవాకారు స్వయంభువున్ భృతబహు ◆ బ్రహ్మాండు శ్రీకృష్ణునిన్
దృణరీతిన్ గని వీడినన్ బనులు య ◆ త్కించిత్తు గావందునన్
బ్రణుతంబున్ విశదంబునవ్యయము ద ◆ త్స్వామిస్థలం బొందుఁడీ. ౧౭

వ॥ అనవిని సర్వసుపర్వపరీవృతుండగు విరించనుండు విష్ణుపున కిట్లనియె. ౧౮

శా॥ స్వామీ ! మీరలుగాక యన్యవిభుల ♦ స్మద్దృష్టిలో లేర ? యే
మేమీ ! మిమ్ముల్మించు పూర్ణతముం డు ♦ న్నే ? యున్న నవ్వానిదా
ధామం బెచ్చట ? నెట్టివాతని చరి ♦ త్రల్ ప్రేమతోఁ దెల్పఁగా
మేమిమ్మర్థి నుతించుచుంటి మన ల ♦ క్ష్మీనాయకుం డయ్యెడన్. ౨౯

బ్రహ్మదేవుండు దేవవాసుదేవసహితంబుగా గోలోకంబున కేగుట.

వ॥ బృందారక బృందపరీవృతుండగు శతానందున కానందంబు ఘటిల్ల సకలబ్రహ్మాండశిఖరంబున కూర్ధ్వభాగంబునవిలసిల్లు తద్గోలోకమార్గంబుజూపించి,తోడురా నవ్విరించి గాంచి మేలు మేలని మెచ్చి తలపంకించి యాతెన్నున నడచుచు శ్రీవామన వామపదప్రదేశినీనఖంబున విభిన్నంబైన బ్రహ్మాండాగ్రభాగంబును,బ్రహ్మరసమయంబునగు బిలంబునందు జలద్వార మార్గంబునుండి బయలువెడలుసురానీకంబును,నభోభాగంబునఁ గూఁకటిమూఁగయను పక్కివలెఁ జక్కనై వెల్గు భూనభోగోళాదికంబును, మఱియు నజ్జలంబునం దింద్రాయనఫలంబులకరణి నిటులటులఁ దొరలుచుండు లెక్కకుఁ జిక్కని బ్రహ్మాండంబులనుగాంచి భీతులైన వారితీరున విస్మితులగుచుఁ గోట్లకొలంది యోజనంబులదాటి యట భర్మవినిర్మితంబులగు రమ్యహర్మ్యంబులతోడను, నభేద్యంబులగు ప్రాకారంబులతోడను, నూత్నంబులగు రత్నంబులతోడను, సాంద్రంబులగు భూరుహంబులతోడను, విరాజిల్లు నెనిమిదిపట్టణంబులం జొచ్చి యిచ్చమెచ్చి యవి గడవఁ జని ముందట. 30

గోలోకవర్ణనము.

సీ॥ హార నీహారసాం ♦ బాట్టహాసై రావణక్షీరధవళవ ♦ ర్ణంబుతోడ
స్నానాగతప్రజా ♦ సంఘసంరక్షణోద్గతకరని భతరం ♦ గములతోడ
జ్వరకఫవాతాది ♦ సకలరోగనివార, కస్వచ్ఛరుచ్యోద ♦ కంబుతోడ
ధగధగద్ధగిత ర ♦ త్నప్రభాసంతాన, బంధురసోపాన ♦ పటలితోడ
తే॥ సకలకళ్యాణసూచక ♦ శకుని మధుర, కలకలంబులతోడుతఁ ♦ జెలఁగుచుండు
విరజయన్ నది దరిజేరి ♦ వింతలెన్నొ, నయనపర్వముగాఁగని ♦ నడచె నవల. 3౧
తే॥ కోటిసూర్యనిభంబు స♦కుంఠితంబు,నగుమహాగ్లోకమునుబొంది ♦ యాస్థగములు
మిఱులు గాఁగని హరియాజ్ఞ ♦ సరసిజజుఁడు, దన్మహముప్రొక్కి వినుతించె ♦ దానిలోన.
శా॥ శాంతాకారమనోహరంబు బుధసం ♦ స్తవ్యంబు ధామంబు ని
శ్చింతన్ గన్గొని దానియందున మహా ♦ శేషున్ సహస్రాస్యు శ్రీ
మంతున్ దీర్ఘ మృణాలతుల్యధవళున్ ♦ మాంద్యు న్విలోకించి ధీ
మంతుల్ ధాతృముఖాది నిర్జరు లసా ♦ మాన్యంబుగా మ్రొక్కుచున్. 33
సీ॥ సకలచరాచర ♦ సంభవస్థితిలయ, హేతుభూతులమంచి ♦ యిక్కయెద్ది
స్వర్గాదినాయక ♦ శక్రాదిదిక్పతి, కామ్యప్రదంబైన ♦ ధామమెద్ది

వాతాంబుపర్ణాశ • నాతీతసంసార, మునిరాజ హృద్గమ్య • మూలమెద్ది
మాయామనోబుద్ధి • మమకారచిత్తమ, మహత్తత్త్వవికృతి సం • హారమెద్ది
తే॥ య్యఖిలమాన్యుల కీశ్వరుం • డనఁగ నెద్ది, లోకనుతమయ్యె నద్దిగో • లోకమనఁగఁ
జెల్లుచుండు మహాలోక • మల్ల శేషు, పృథుతరోత్సంగమందు వీ • క్షించి మఱియు.

మ॥ అరరే! యిట్టిహిరణ్యరత్నమయ గే • హద్వారబంధంబు ల
య్యారె! యీరుచ్యజలాన్వితహ్రదములా • హా! యీయదృచ్ఛావిహా
రరహస్స్థానము లౌర! యీమణిగణ • ప్రాప్తోరుపణ్యంబుల
ద్దిర! యీగోవ్రజసంపదల్ వనము లీ • ధీరుల్ ప్రశంస్యుల్ బళీ. ౩౫

చ॥ ఇటుల నుతించి వేల్పులుర • హిన్ మొగసాలను జేరునంతలో
జటులవిలాసమన్మథులు • శ్యామశరీరులు కృష్ణపార్షదుల్
దటుకున వచ్చి నిల్వుఁడు కు • తంత్రము మానుఁడు మానుడుల్ వినుం
డిటుల మమున్ శరించి యెట • కేఁగఁదలంచితి రీరలియ్యెడన్. ౩౬

ఉ॥ ఎవ్వరు మీరు! మీదు కుల • మెయ్యది? యెట్టిది మీచరిత్ర? మీ
కివ్విధిఁ బైనమున్ సలుప • నేమిగతం బెది మీప్రదేశ మీ
దవ్వననుండు గోపదవి • దండకువచ్చుట కేమి కారణం
బొవ్వనో? వీనికుత్తరము • లొయ్యన మాకిడి లోనికేగుఁడీ. ౩౭

ఉ॥ నావుడు దేవతల్ విని ఘ • సప్రతిభోన్నతులార! మాదియా
దేవకులంబు నాకము స్వ • దేశము వీరలు బ్రహ్మవిష్ణుదు
ర్గావిభులేము వాసవ ము • ఖత్రిదివేశుల మొందుకోర్కితో
శ్రీవనమాలి దర్శనము • సేయఁగవచ్చితిమయ్య నావుడున్. ౩౮

ఉ॥ మానులు ద్వారపాలకులు • మాధవపార్షదు లాలకింప వా
ర్తానివహంబెఱింగియుఁ బ • రంబగు నంతిపురంబు సొచ్చి గో
స్థానవిభున్ గుఱించి సుర • సంగతిఁదెల్పఁ దదాజ్ఞనొందు చం
ద్రానన, రమ్యపీతపరి • ధానము వేత్రము దాల్చి పెల్చనన్. ౩౯

ఉ॥ వచ్చి వియచ్చరుల్ గని కృ • పామతి నిట్లనె వేల్పులార! మీ
రెచ్చటనుండి యిచ్చటికి • నెందుల కాగతులైతి రింక మీ
యిచ్చను నచ్చు లేక చెపుఁ • డీద్రుహిణాండ వినేతలయ్య వా
క్రుచ్చుఁడు ముచ్చటించెద ము • కుందున కన్నఁ దదాదితేయులున్. ౪౦

ఉ॥ అండము లెన్నియుండినవొ • యయ్యవి యెవ్వొ యెఱుంగ మొందు బ్ర
హ్మాండ మిదే యెఱుంగుదు మ • హా భవదుక్తిచయంబు చిత్రమై
యుండెడి నండ మన్య మిఁక • నుండ దటంచు వచింతు మమ్మ! యో
యండజయాన చంద్రిముఖి! • యంచు సురల్ నుడువంగ నామెయున్. ౪౧

శా॥ ధాతా! యండము లిందుఁ గోట్లకొలఁదిన్ ♦ దైవాళు లిద్దానినే
భాతిన్ మీరు మెలంగుచుం బ్రదటు ప్రతి ♦ బ్రహ్మాండమందున్ సుర
వ్రాతం బుండును వేఱువేఱుగ నిజ ♦ గ్రామాభిధానంబులన్
జాతిన్ దెల్పఁగలేక స్థాణుగతి నీ ♦ చాయన్ జనం దెవ్వఁడున్. ౪౨

ఉ॥ దోమలు మేడిపండులను ♦ దోర్లుచు నన్యమెఱుంగజాలన
ట్లీమెయి నొక్కయండమున ♦ యీర లెఱింగి వసింత్రు కాని యిం
కేమియు గుర్తెఱుంగరుగ ♦ యిట్లు గృహంబును వీడకుందురే
మీమతిపోయెనో ముదిమి ♦ మేకొనెనో యిది మంచిరీతియో. ౪౩

చ॥ అని యుపహాస్యమున్ సలుప ♦ నాయమరుల్ విని మానమూనుటన్
గని హరి, వారి భీతులుగ ♦ గాంచి యిటుల్ వచియించె భూవరా!
ఘనుఁడగు బృశ్నిగర్భుఁ డటఁ ♦ గ్రాలెనొ యెద్ది త్రివిక్రమావతా
రనఖరభిన్నమా నల వ ♦ రస్థలినుండుము మందయానరో. ౪౪

ఉ॥ ఈవిధి నిందిరావిభుఁడు ♦ హృద్యముగాఁ బలుకంగ నల్ల రా
జీవదళాక్షి విం చతనిఁ ♦ జేరి నుతించియు లోని కేగి రా
ధావిభునాజ్ఞ గొంచుఁ ద్వరి ♦ తంబుగ గ్రమ్మఱ వచ్చి యట్టి లే
ఖావళి కద్ది దెల్పి చన ♦ నాత్రిదశుల్ జని రయ్యె లోనికిన్. ౪౫

ఉ॥ నాకులు గాంచి రంతట న ♦ నశ్వరకల్పలతాప్రకృష్టగో
లోకము ధూతదేవరిపు ♦ లోకము వర్థితరాధికాధవా
లోక మధఃకృతత్రిదశ ♦ లోకము రక్షితగోపగోపికా
లోకము నాకమున్ విహిత ♦ లోక సుగమ్యమనోజ్ఞలోకమున్. ౪౬

వ॥ వెండియు.

శా॥ సౌందర్యోజ్జ్వలితుల్ త్రిమూర్తిముఖు ల ♦ స్వప్నుల్ విలోకించి రా
నందస్యంది విదూరదేశభవర ♦ త్నస్నిగ్ధసోపాన స
త్సందోహాన్వితతీరభాసుర, యద్ద్ర ♦ చ్ఛాయానవిభ్రాజితన్
బృందిష్టోర్మిమనోహరన్ వరనదిన్ ♦ గృష్ణన్ గళిందాత్మజన్. ౪౭

మ॥ వరబృందావనపట్టనోన్నతదళల్ ♦ వాసంతలక్ష్మీవిలా
స రుచుల్ చిత్రపతత్రినైకవిధసు ♦ శ్రావ్యస్వనంబుల్ మనో
హరరంభావట నారికేళఖదిరా ♦ మ్రాదిద్రుమంబుల్ మహా
త్తరగోవర్ధనపర్వతంబుగని యా ♦ ధామంబునన్ వేడ్కతో. ౪౮

ఉ॥ కాంచిరి సౌధవీథులను ♦ గాంచిరి భాసురరాసమండలుల్
గాంచిరి నూత్నరత్నకన ♦ కద్యుతిరాజితచంద్రశాలలన్

తనుత్రాణంబులందాల్చి నిల్చి పగతుఱ రూపుమాపఁజాలుభటవర్యులు జయజయని నాదంబులుసలుప, నిర్వక్రపరాక్రములగు దేవకాక్రూర, కంసాదివీరులు సల్గడలఁ బరివేష్టించికొలువఁ బరిజనంబులు ఛత్రచామరంబులంగేలంబూని యుభయపార్శ్వంబులందునిలువ, నభఃపీఠంబున విరాజిల్లు తరణికరణి, సర్వార్థప్రదాతయగు చింతామణిపైఁదనరారు సురపతిసరణిని, సింహాసనంబునఁజెలంగు యదువిభుండును, నిగ్రహానుగ్రహాసమర్థుండునునగు నుగ్రసేనుండు తనచెంగటకేతెంచు నాబ్రహ్మవాది వర్యుని ౨౮౩

ఉ॥ కాంచుచుఁ గన్నులారఁ దన ♦ గద్దెను డిగ్గన డిగ్గి శీర్షముల్
వంచి నమస్కరించి యదు ♦ వర్యులఁగూడి తదంఘ్రియుగ్మమ
ర్చించి సుభద్రపీఠిని వ ♦ సింపనొనర్చి స్తవంబు భక్తిఁగా
వించి నతోత్తమాంగుఁడయి ♦ వేఱగు పీఠినిఁ దాఁజెలంగఁగాన్. ౨౮౪

## దేవకీవసుదేవ వివాహవర్ణనము

ఉ॥ గర్గబుధోత్తముండు గని ♦ కౌతుకమొంది ప్రియంబుతోఁజతు
ర్వర్గమొసంగు దీవనల ♦ బాగుగఁ జేసి యదూత్తమా! భవ
ద్వర్గమునందు సేమమొకొ? ♦ పాడియుఁ బంటయుఁ జక్కనున్నవే?
దుర్గమముల్ సుఖంబులొకొ? ♦ తోషణమొందుచునుందురే! ప్రజల్. ౨౮౫

చ॥ అని సుఖమడ్గి తత్సవిధ ♦ మందు వసించిన దేవకాఖ్యుని
గ్గని వినుమోయి దేవక! య ♦ నంతను నారయ యాదవాన్వయం
బున వసుదేవుఁబోలిన సు ♦ బుద్ధి మఱొక్కఁడులేఁడు గాన నీ
తనయను నాదుమాటవిని ♦ తద్బలి కీవిడి పెండ్లిసేయుమా! ౨౮౬

వ॥ అనవుడు నాతండు సరియనియొప్పి స్వజనహితసహితంబుగా దేవకీవసుదేవులకు వివాహంబు శాస్త్రవిహితంబుగా నొనర్చి దాసీసహస్రంబును, హయనియుతంబును, గజాయుతంబును, గోలక్షద్వయంబును, రథనియుతంబును పారిబర్హంబుగా సమర్పించి భేరీమృదంగఢక్కావీణావేణుగోముఖాది నానావాద్యంబులు శ్రావ్యంబుగా మ్రోఁగుచుండ నల్లునితోఁ దన కూఁతును బయనంబుసేసి సర్వాలంకృత్యలంకృతంబగు నరదంబు రప్పించి దానిపైఁ దన్మిథునంబునెక్కించి యనుపుచుండుతఱిం గంసుఁడు తన చెలియల యుల్లంబు సంతసిల్లంజేయఁ దద్రథంబధిరోహించి రథ్యంబుల రశ్ములంబట్టి వినోదంబుగా నడుపుచున్నంత.

ఉ॥ అంబరవాణి, యీమె కను ♦ నష్టమగర్భము నిన్నుఁ జంపు స
త్యంబిపుడీవు మిక్కిలి ద్రు ♦ తంబున మావులఁబట్టి త్రోలుచున్
సంబరమొందుచుంటివిఁక ♦ స్వాంతమునం బరికింపుమా! యటం
చింబుగఁ బల్కెఁ గంసునకు ♦ నెట్టఱ నయ్యదివించు నాతఁడున్. ౨౮౭

ఉ॥ చెట్టలఁగూడువాఁడగుటఁ ♦ జెల్లెలటంచనకుండఁ గొప్పునుం
బట్టుచు వాఁడివాలుఁగొని ♦ భావమునన్ దయవీడి చంప మో
పెట్టుటఁగాంచి పార్షదులు ♦ భీతిని జెందిరి కుందిరందఱున్
గట్టడికర్మమంచనిరి ♦ గౌరవభాజనులెల్ల రయ్యెడన్. ౨౮౯

మ॥ వసుదేవుం డల కంసుఁబట్టికొని బా ♦ వా! భోజవంశంబునన్
బసఁగాఁ జేసెడివాఁడవై బలుఁడవై ♦ బాణాఘభౌమాదులన్
గసిమై నల్పి సుకీర్తిచే నలరి శ్లా ♦ ఘ్యప్రక్రియాకారివై
స్వసయౌ నీమెను బట్టి కొట్టుటిది సా ♦ జన్యంబె? మాన్యంబొకో? ౨౯౦

చ॥ అదియునుగాక నాకిపుడె ♦ హాయిగఁ బెండిలి సల్పి యీవిధిన్
సదమదముం బొనర్చెడి వి ♦ చారణఁ జేయుట గూడదయ్య! నీ
యెద దయఁ బూనవయ్య! శుభ ♦ మెంతయు నీకు ఘటించు నీమెపై
మదమును జూపకయ్య! యభి ♦ మానము మానకుమయ్య! యియ్యెడన్. ౨౯౧

ఉ॥ చిన్నది సుందరీమణి సు ♦ శీలయుఁ గావున వీడుమంచు నె
న్నెన్నియొ తెన్నులన్ వినయ ♦ మెంతయుఁ దోఁప వచింప నాతఁడా
యన్నిటి నాలకింపక ద ♦ యారహితుండయి యామెఁ జంపఁగా
నున్నఁ, గడంగి క్రమ్మఱను ♦ యుక్తవిధిన్ వసుదేవుఁ డిట్లనెన్. ౨౯౨

ఉ॥ చక్కనియుక్కుఁడీఁడ! నినుఁ ♦ జంపెడి దష్టమగర్భ మేకదా
చక్కఁగనున్న దొక్కనుడి ♦ సాంతముగా విని యద్ది చేయుమా!
యిక్కమలాక్షియర్భకుల ♦ నెప్పటికప్పుడె తెచ్చి యిచ్చెదన్
నెక్కొని చంపుమా! భయము ♦ నెట్టుమ! చెల్లెలిఁ బ్రోవుమా! దయన్.

ఉ॥ నావుడుఁ గంసవీరుఁడును ♦ నాకు భయంబిఁక లేదటంచుఁ దా
నా వసుదేవసూక్తి విని ♦ యంతట స్వీయగృహంబు సేరె. నా
దేవకితోడఁ గూడి వసు ♦ దేవుఁడు గూడ స్వధామమొందె భీ
త్యావృతమానసుండయి ధ ♦ రాధిపమౌళిమణీ! సుధీనిధీ! ౨౯౪

తే॥ అట్టులా కంసుఁ డిలు సేరి ♦ యస్త్రశస్త్ర, ధరులఁ బదివేల జోదులఁ ♦ దత్క్షణమునఁ
బంప వారలు వసుదేవ ♦ భవనమొంది, ముట్టడించిరి పరుగిడి ♦ పోవకుండ.

క॥ ఆవసుదేవుఁడు పిమ్మట, దేవకియందష్టసుతుల ♦ దివ్యులఁ గనియున్
గేవలమాయను గన్నగ, శేవనుగనె వానిరీతి ♦ కవి వచింతున్. ౨౯౬

ఉ॥ ఆదినిఁ గీర్తిమంతుఁడను ♦ నర్భకునొక్కనిఁ గాంచి కొంచతం
డాదను గంసుమ్రోల నిడ ♦ నాతఁడు గన్గొని యిచ్చమెచ్చి యో
యాదవ! వీఁడు నన్నడఁపఁ ♦ డష్టమగర్భము క్రుంతుఁ గాన వే
మోదముతోడఁ బీనిఁగొని ♦ పొమ్మని చెప్పె. విదేహనాయకా! ౨౯౭

క॥ అంతట వసుదేవుండును, సంతసపడి కొడుకుఁగూడి ♦ చని స్వగృహమునన్
వింతలుగద ! యరయఁగ దు, శ్చింతక వాక్యంబులంచుఁ ♦ జెలఁగుచు నుండెన్.

ఉ॥ అత్తఱిఁ గంసవీరవరుఁ ♦ డథ్రిపథంబున వచ్చునాకు నా
యత్తముసేసి యర్ఘ్యము ప ♦ దాబ్జయుగంబున కర్చసల్పి యో
సత్తమ ! నీదు భావమును ♦ సత్వరమే వచియింపుమన్ననేఁ
జిత్తము హర్షమొందునటు ♦ సెప్పితి నాతనికిట్లు లోవిభూ ! ౨౯౯

తే॥ దేవతలు దేవకీముఖ ♦ దివ్యసతులు, దేవులెల్లరు తద్వసు ♦ దేవముఖులు
నష్టవసువులు నందాదు ♦ లట్టి బుక్కు, లెల్లగోపికలై యుండి ♦ రిలను గంస.

చ॥ మఱి వృషభానునామముఖ ♦ మాన్యులు వేల్పులు, నట్టి దేవకీ
తరుణికి నేడుగర్భములు ♦ దైవవశంబునఁగల్గు. నాయనం
తరమున నష్టముం బమరి ♦ తప్పక నిన్వధియించునంచు ని
ర్జరులని, రద్ది నీకిపుడు ♦ చక్కఁగ జెప్పితి గుర్తెఱుంగుమా ! ౩౦౧

చ॥ ఇటుల మదాశయంబునిడి ♦ యేగితి దానిని విన్న కంసుఁడు
త్కటమగు కోపమొంది యదు ♦ కాండము నంతయుఁ జంపఁబంతమున్
దిటముగఁబట్టి యట్టి వసు ♦ దేవుని, దేవకి, బంధనంబునం
దటమటనెంద సంకెలల ♦ హస్తములన్ దగిలించి యుంచియున్. ౩౦౨

ఉ॥ దేవకి పెద్దబిడ్డఁగొని ♦ తీక్ష్ణతరంబుగ నొంచుబండపైఁ
జేవను గొట్టె నిట్టులనె ♦ చిత్తమునందలి విష్ణుభీతి నా
దేవకి పుత్రషట్కము వ ♦ ధించెఁ గ్రమంబుగ; నుగ్రసేనధా
త్రీవరుఁ డిద్దివించు వసు ♦ దేవుని రక్షణసేయు పూన్కితోన్. ౩౦౩

ఉ॥ ఆగ్రహావహ్ని మండ సభ ♦ యందువసించిన శత్రుపుత్రు దు
ష్టాగ్రణిఁ గంసవీరుఁ గను ♦ లారఁ గనుంగొని యడ్డగింప నా
యుగ్రబలుం డెదుర్కొనుచు ♦ నుద్ధతిఁజూపఁగ నుగ్రసేనయో
ధాగ్రణు లుగ్రశస్త్రముల ♦ నంది యవక్రపరాక్రమంబునన్. ౩౦౪

ఉ॥ కాచి స్వకీయసైన్యములఁ ♦ గాల్చిరి కంసుని సేనఁ దత్థినర్తిన్
జూచిన కంసవీరు లరి ♦ శూరబలంబుల మాయఁజేయఁగా
లేచి మహాస్త్రశస్త్రముల ♦ లీలఁగవేయఁదొడంగి రంతటన్
ద్రోచుకొనం గడంగిరి య ♦ దుప్రవరుల్ మఱిఁ గంసయోధులున్. ౩౦౫

తే॥ ద్వారదేశమునందు నుభయుల సైన్య,ములును బోరాడె నాశుగ♦ములఁ గఠారు
లను బరస్పరజయకాంక్ష ♦ దనరెనందు, జనులుపదివేలుమడిసిరి ♦ శక్తిలేక.

తే॥ అంత నాకంసవీరుఁ డ♦య్యాహవమునఁ, దండ్రిసేనలఁ గనుఁగొని ♦ తత్క్షణమున
రోషరోహితమూర్తియై ♦ రుద్రమార్ద్రి, వైరిమత్తేభహారి గదఁ ♦ బట్టి కొట్టె.

ఉ॥ కొందఱు ఛిన్నపాదులును ♦ గొందఱు ఛిన్నలలాటకుల్ మఱిం
గొందఱు భిన్నకంఠులును ♦ గొంద ఱధోముఖు లూర్ధ్వగాత్రులుల్
గొందఱు వీతవస్త్రిలయి ♦ కూలిరి గొందఱు బాఱి రందునన్
గొందఱు నెత్రుఁ గ్రక్కిరికఁ ♦ గొందఱు మూర్ఛితులైరి వెండియున్. 3౦౮

ఉ॥ కాయములందు గాయములఁ ♦ గాఱెడి నెత్రున సండె నుగ్రసే
నాయతగోష్ఠి; చూపఱుల ♦ హా యని చింతిలి రంతఁగంసుఁడున్
బాయక యుగ్రసేన విభుఁ ♦ బట్టుచు గద్దియనుండి నీడ్చి యా
సాయము సేయువారిని, వె ♦ సన్ జెఱఁబెట్టెను ద్రాళ్ళఁగట్టియున్. 3౦౯

ఆ॥ మఱియుఁ గంసవిభుఁడు ♦ మధు శూరసేన దేశములగడనఁ జేసి ♦ స్వర్ణపీఠి.
నెక్కి మిగుల నిక్కి ♦ చెల్ల యాదవులను, బాధపెట్టుచేలెఁ ♦ బార్థివేంద్ర. 3౧౦

తే॥ యదువరులు, వాని హింసల ♦ కాగలేక, దేశకాలపాత్రములిటఁ ♦ దికమకలుగ
నుండెనని యెంచి దూరమం ♦ దున్నస్వీయ,బంధుగృహముల కేగిరి ♦ ప్పట్టునందు.

బలరామావతార వర్ణనము.

తే॥ దేవకీసతి కేడవ ♦ దివ్యగర్భ, మధికహర్ష శోకములతో ♦ నతిశయింప
యోగమాయ, దానిని గొని ♦ యుక్తరీతి, రోహిణీకుక్షిఁ గూర్చెని ♦ రూఢశక్తి.

తే॥ అంత మధురాపురీ ప్రజ ♦ లరరె! యేమి! దేవకీగర్భమేమయ్యె ♦ దివ్యశక్తి
నెటకుఁ బోయెనో? యేవిధి ♦ యెఱుకపడదు, చిత్రమయ్యెడి నని లలిఁ ♦ జెప్పుకొనిరి.

తే॥ అవల రోహిణీ గర్భమై ♦ తొమ్మిదినములైన పిమ్మట దేవకీ ♦ మానవతియు,
నందమందిరమెంతయు ♦ నానెమైన, ప్రభల వెలుఁగంగ భవ్యమౌ ♦ వ్రజమునందు.

తే॥ ఐదు గ్రహము లుచ్చస్థితి ♦ నలరుచుండఁ, దులనుస్వాత్యుడు బుధవార ♦ కలితమైన
భాద్రపదశుద్ధషష్ఠినిఁ ♦ బట్టపవలు, కులవధూమణియౌ నామె ♦ బలునిఁగనియె.

ఉ॥ వేల్పులు, పూలగుత్తులను ♦ బెల్లుగఁ జల్లిరి, వారిదోత్కరం,
బల్పతుషారముం గురిసె, ♦ నావల, నందుఁడు, బిడ్డకున్ బ్రయో
జల్పిత జాతకర్మమును ♦ సల్పి ధరామరపంక్తి కాల న
స్వల్పముగా నొసంగి హిత ♦ బాంధవ గోపుల గౌరవించియున్. 3౧౬

ఉ॥ గాయకవర్యులన్ మిగుల ♦ గానమొనర్పఁగఁ జేసె నప్డు ద్వై
పాయన దేవరాత గురు ♦ వర్య వసిష్ఠులు నేను దేవలుం
డాయెడకేగి సత్కృతుల ♦ నంది ముదంబును బొందియుండ ద్వై
పాయనుతోడ నందుఁడతి ♦ భక్తిఁగరంబుల మోడ్చి యిట్లనెన్. 3౧౭

శా॥ ఆర్యా! సుందరుఁడైన బాలకుఁడు పం ♦ చాహంబులన్ బుట్టె నీ
యార్యాణిన్ బరికింపఁ జిత్రములలో ♦ నత్యద్భుతంబయ్యె నీ

కార్యం బెచ్చటనైనఁ జూచితివె యో ♦ కారుణ్యరత్నాకరా!
స్థైర్యంబుం గలిగింపవే! మఱియు నా ♦ సందేహముం బాపవే! ౩౧౮

చ॥ అని యడుగం బ్రసన్నుఁడయి ♦ వ్యాసుఁడు నందునకిట్లు చెప్పె వీఁ
డనుపమసుందరుం, డహీశకు ♦ లాధిపుఁడే బలియౌచు దేవకీ
వనితనుఁజేరియుండ హరి ♦ పంపున సొంపుగ యోగమాయ, గై
కొని యల రోహిణీలలనఁ ♦ గూర్చెను నెవ్వరెఱుంగనట్లుగాఁ. ౩౧౯

ఉ॥ నంద! భవన్నికేతనము ♦ నం గనియుంటివి వీని నయ్యరే!
యిందుదివాకరేంద్రముఖు ♦ లిద్ధమునుల్ గనఁజాలిరే! మఱే
మందుము నీదుభాగ్యము న ♦ హా! యతనింగన వచ్చియుంటిమే
మిందుల; కిప్పుడా శిశువు ♦ నేర్పడఁ జూపుము! కోర్కెఁ దీర్పుమా. ౩౨౦

మ॥ అనినన్ నందుఁడు వానిఁజూపఁదమి నా ♦ వ్యాసాదులుంగాంచి చి
ద్ఘనరూపాయ, నమోస్తు తే, భగవతే, ♦ కంసానుజారాతయే,
ఘన నీలాంబర ధారిణే, సలిలజా ♦ కర్ణాంతనేత్రాయ నం
దనిశాంతాంతర భాసురాయ గురవే, ♦ ధర్మజ్ఞనేత్రే నమః. ౩౨౧

పంచచామరము.

బలీ! హలీ! ధరాధరా య ♦ పారధైర్యసాహసా!
ప్రలంబఘాతకా! సురాసు ♦ ర ప్రధానవిక్రమా!
కలాలవాల! గౌరవర్ణ ♦ కమ్రరూప మోహనా!
సులక్షణోజ్జ్వలద్ఘనా! య ♦ శోమతీసుతాగ్రజా! ౩౨౨

సీ॥ నీ వజేయుండవు ♦ నీవె ధ్యేయుండవు, దుర్జనలోకైక ♦ భర్జనుండ!
కూపకర్ణారివి ♦ కుంభాండవైరివో, తీర్థయాత్రాసక్త ♦ దివ్యచరిత!
బిల్వలారివి నీవ, ♦ ద్వివిదారివీవయో, హస్తినాపురకర్ష ♦ ణాతిచతుర!
నీవె పూర్ణుండవు ♦ నీలాంబరుండవు, భీమదుర్యోధన ♦ విభుగురువర!

తే॥ రుక్మిధేనుకకూటవి ♦ రోధివీవె, దేవదేవుండవీవెయో ♦ రేవతీశ!
రౌహిణేయుండ వీవె ప♦రాత్పరుండ, వీవె మావందనములొంది♦కావవయ్య!

చ॥ జయజయ కామపాల! యదు ♦ సంతతిసాగరజాతచంద్రమా!
జయజయ దేవకీతనయ! ♦ సత్యదయాశుచిసారమేదురా!
జయజయ నిర్మలాత్మ! వ్రజ ♦ సంభవ గో జన గోపికా ప్రియా!
రయమునఁ గాంచి రామ! బల ♦ రామ! దయం మము రక్షసేయుమా!

తే॥ ఇది పఠించిన మానవు♦లెల్ల పాప, ములను ద్రోసి యష్టైశ్వర్య♦ములను బొంది
హరిపదంబుఁగాంచెద రంత♦వ్యాసముఖులు, నతులఁజేసి సరస్వతీ♦నదికిఁజనిరి.

## శ్రీకృష్ణజననకథాప్రారంభము.

క॥ మఱిఁ బరిపూర్ణతముండును, బురుషోత్తముఁడైన కృష్ణ ♦ మూర్తి జగచ్ఛం
కరుఁడయి వసుదేవ మాన, స్సరసీరుహమందుఁ జొచ్చె ♦ జనకనరేంద్రా! ౩౨౬

తే॥ అది మొదలుకొని వసుదేవుఁ ♦ డర్కచంద్ర, వహ్నులను మించు తేజున ♦ వఱలి యింద్ర
తీరునన్ వెల్గె. నర! యా ♦ దేవకియును హరిని గర్భంబునం దాల్చె ♦ నార్ష మతిని.

తే॥ తాల్చినది మొదల్కొని యట్టి ♦ తన్వి మేఘ, మందుఁ జంచలయై వడి ♦ నాలయమున
వెలుఁగఁ దొడఁగె నా కంసుండు ♦ గలయఁ జూచి, యడలుకొని యనుకొనెఁ దన ♦ యాత్మ నిట్లు.

సీ॥ లేదు నిస్సత్త్వ ♦ లేదు ఖేదము లేదు, కడుపున నొప్పి యో ♦ కరులు లేవె,
తొంటిపీడయు లేదు ♦ తోఁపక యుండుట, లేదెట్టి చెట్టల ♦ వాదు లేదె,
యన్నముపై రోఁత ♦ యందుచుండుట లేదు, చిక్కిపోవుట లేదు, ♦ చీడ లేదె,
గృహకృత్యములనొందు ♦ గ్రేణి సేయుట లేదు, మంచినడవడియు ♦ మాన లేదె.

తే॥ అశుచి, లేదింతచింతయు ♦ నంద లేదు, నాదు నిర్బంధము స్వేద ♦ లే దయారె!
యిలను గర్భిణులెందఱో ♦ కలరుగాని, యిట్టి గర్భిణి నెచ్చోట ♦ నేను సూడ. ౩౨౯

ఉ॥ అంచితకాంతిసంయుత, శు ♦ భాంగిని, దేవకిఁ, గూర్చి యాతఁ డ
ల్లించి, కటా! కటా! యకట! ♦ యేసిఁకఁ దక్కనటంచు, నెంతొ చిం
తించి, భయాకులుండగుచు ♦ దేవకి! నన్ను వధించు గర్భ, మే
తెంచెను. గానఁ బుట్టఁగ వ♦ధింతు నటంచనె నా కతాయమై. ౩౩౦

చ॥ పలికి యటుల్ యదుప్రభుఁడు ♦ భ్రష్టమనంబున నింటికేగి యా
వలమురి తాలు పెద్ద నను ♦ బట్టి వధించునొ యంచు దిక్కులన్
గలయఁగఁ జూచు, నూఁచుఁ దలఁ, ♦ గ్రాఁగును, వాఁగును, గ్రొవ్వు, నవ్వు, మీ
సలఁ బలుమాఱు నువ్వు, నిఁకఁ ♦ జచ్చితి నీహరిచేత నంచనున్. ౩౩౧

తే॥ అట్టి వేళను గంగాధ ♦ రాబ్జయోని, ముఖనిలింపులు, నేమును ♦ మునులఁ గూడి
వచ్చి వసుదేవు చెఱసాల ♦ పై నినిల్చి, పుట్టఁబోయెడి శ్రీకృష్ణ ♦ మూర్తి కెఱఁగి.

సీ॥ స్వప్నాద్యవస్థలన్ ♦ నల్పఁ గారణుఁడయ్యు, నొండెడఁ గాక యే ♦ యుండు నెవఁడు
యోగీంద్రులకుఁ జిక్క ♦ కుండియు భక్తజనతతికిం జిక్కుసు ♦ కృతి యెవండు
పంచభూతంబులన్ ♦ బరిఢవిల్లఁగఁ జేసి, యవ్వాని నడపెడి ♦ నధికుఁ డెవఁడు
స్థావరజంగమ ♦ సకలసృష్టికి మూల, కందమై సుఖముగాఁ ♦ గ్రాలు నెవఁడు

తే॥ మాదృశామర్త్యులందఱ ♦ మనుచు నెవఁడు, దుష్టశిక్షకుఁ డెవ్వఁడు ♦ శిష్టరక్ష
కుండు నెవఁడగు నీవె గా ♦ దొక్క? నిన్ను, సన్నుతినిసల్పఁగలమొకో ♦ శరణు శరణు.

తే॥ వీతిహోత్రుని యందున ♦ విస్ఫులింగ
గణము పొరరానికై వడిఁ ♦ గ్రతుభుజులును

ఋషులు రాజులు మహాదాదు ♦ లెవనియందుఁ
జొరఁగ వీల్గాదొ యా నీకు ♦ శరణు లివిగొ. ౩౩౮

చ॥ బలుల బలుండవై సుజన ♦ వశ్యుఁడవై యుపకారకారివై
యిలకు విభుండవై శ్రుతుల ♦ కింతయుఁ జిక్కనివాఁడవై మహా
ప్రలయమునన్ వెలుంగు భగ ♦ వంతుఁడవై పరిపూర్ణమూర్తివై
చెలఁగెడి నిన్నిదే శరణు ♦ సెందితిమో వసుదేవనందనా! ౩౩౯

స్రగ్విణీవృత్తము.

రాధికావల్లభా! ♦ రమ్యరూపాన్వితా!, సాధుబృందారతా! ♦ సత్యశోచాయతా
గోధనాధీశ్వరా! ♦ గోపవేషోన్నతా!, శ్రీధరానాయకా! ♦ చిత్తజాతాత్మజా.

తే॥ ఆదిమధ్యాంతరహిత! యో ♦ యప్రమేయ! నిత్యశుద్ధబుద్ధావ్యయ♦ నిర్వికల్ప
నిర్గుణానందఘనమూర్తి! ♦ నిన్ను మేము, శరణుసెందితి మియ్యదే♦శరణు శరణు.

వ॥ మఱియు గతాగతంబులగు కల్పంబులందును, యుగంబులందును, మన్వంతరంబులందును, నంశాంశాంశకలావేశపూర్ణ పరిపూర్ణావతారంబులం గల్పించి జగంబు సృజించి యందుఁ గర్తవై భర్తవై హర్తవై చెలంగి పరిపూర్ణతమావతారంబెత్తి దుష్టశిక్షణంబును, శిష్టరక్షణంబునొనర్ప బద్ధకంకణుండవై శ్రీకృష్ణనామంబునం బెరుగఁ బోవునీకు మే మొనర్చిన నమస్కారంబులమే లెంచిమాపయి దయనించి గ్రహించి యధర్మమడంచి ధర్మంబుద్ధరింపుమని ప్రార్థించి వెండియు.

ఉ॥ మ్రొక్కెదమేము నీదుపద ♦ ముల్ దలఁదాల్తుము పాదధూళి, సొం
పెక్కిన విగ్రహంబు నెద ♦ నెప్పుడు సంస్మరియింతు మాఖ్యయున్
జక్కఁగ నుచ్చరించెదము ♦ సత్వరమే దయచేసి మార్తురన్
దుక్కనరింపవయ్య! హరి! ♦ తోయజపత్రవిశాలలోచనా! ౩౩౯

తే॥ ఇట్లుప్రణుతించిబ్రహ్మాదు♦లిద్ధమునులఁగూడి ముదమునహరిఁ గొని♦యాడుచాత్మ
గేహములకేగి, రంత శ్రీ♦కృష్ణమూర్తి, జననమందెడి సమయము♦దనరెనపుడు.

శ్రీకృష్ణావతార ఘట్టము.

చ॥ దెసలు ప్రసన్నతంగనెను ♦ దేజముదాల్చెనభంబు భూమియున్
బసదనమొందె, సంద్రము ల ♦ భంగురలీలనుబొంగెఁ, దారకల్
మిసమిసలాడె, వాహినుల ♦ మేయముగాఁ బ్రవహించె వేడ్కతోఁ
బసులు పయస్సులన్ బిదికెఁ ♦ బద్మములున్ వికసించె వెండియున్. ౩౪౧

సీ॥ పరిమళంబునుగూడి ♦ బాధలఁబోఁగొట్టు, మలయవాతము, వీచె ♦ మందగతిని
జింతలఁబోఁద్రోచి ♦ చెవులకునింపుగా, గాయకుల్, బాడిరి ♦ క్రమరీతి
గాసిఁదొలంగించి ♦ కర్ణపేయముగాఁగ, శారికాదులు, గూసె ♦ సౌఖ్యదశను
భేరీమృదంగాది ♦ వివిధతూర్యంబులు, మ్రోయఁగాఁ దొడఁగెఁ బ్ర ♦ మోదవిధిని

తే॥ వాసనావాసితంబగు ♦ పౌష్పరజము, వ్యాప్తిసెందుచు నుండె న ♦ పారసరణిఁ
దేంట్లు పాటలు వాడెను ♦ దివ్యశక్తి, జలధరంబులు వర్షించె ♦ స్వల్పరీతి.

ఉ॥ దేవగణంబు పూవులను ♦ దివ్యముగా వెదచల్లె నగ్రజుల్
భావములన్ భయంబు విడి ♦ వహ్నుల వ్రేల్చి ముదంబు సెందిరా
పావకుఁడున్ మహోజ్జ్వలత ♦ భాసిలెఁ బౌరులుఁ, బల్లెవాండ్రు, సా
ఖ్యావహమార్గముంగనిరి ♦ హర్షముసెందిరి సుందరీమణుల్. ౩౮౩

క॥ ఆడిరి రంభాదులు దమిఁ, బాడిరి తత్కిన్నరులును, ♦ బహువిధనుతులన్
వేఁడిరి చారణసిద్ధులు, గూడిరి గంధర్వజనులు ♦ గొనియాడుటకై. ౩౮౪

తే॥ జయజయారావముల్ సల్పి♦సర్వజనులు, మునులు దీవెనలం జేసి♦మురియుచుండ
యాదవేంద్రులు సభయులై ♦యులరుచుండఁ, బారిజాతాదికుసుమముల్♦బైన్రివాల

తే॥ అర్ధరాత్రంబునందింకఁ ♦ డభ్యుదయము, సెందినను గనుచీఁకటి ♦ జెలఁగహర్ష
యోగ, బుధవార, రోహిణీ ♦యుక్తమైన, భాద్రకృష్ణాష్టమిని వృష♦భంబునందు.

ఆ॥ అరణియందు నగ్ని ♦ కరణిని దేవకీ, దేవియందుఁ గృష్ణ ♦ దేవవిభుఁడు
వుట్టె మంచివారి ♦ మోములు వికసింప, వికటుల మొగములును ♦ వెల్లఁబాఱ.

సీ॥ చిత్రమౌనట్టి వెల్గు ♦ శ్రీవత్సచిహ్నితోఁ, గమనీయతారహా ♦ రములతోడఁ
గనుల పండువు సేయు ♦ కౌస్తుభమణితోడ, మధుభృదన్వితపద్మ ♦ మాలతోడ
బంగరుంబు కుడించు ♦ పట్టుపుట్టముతో, సరసనాదమనోజ్ఞ♦ మురళితోడఁ
గనదగ్నిశుభములౌ ♦ కంకణంబులతోడ, మించునుహాసియించు ♦ కాంచితోడఁ

తే॥ బరిధివర్తులమంజీర ♦ బాహుదముల, తోడ బాలప్రభాకర ♦ తుల్యమకుట
కుండలములతో, నల్లముం♦గురులఁ జెలఁగు, మొగముతో నొప్పుచుండెడి♦ముద్దుకృష్ణు.

చ॥ సరసిజపత్రనేత్రు, ఘన ♦ సామ్యమనోహరరూపునిన్ మహో
ద్ధురరుచిధూతసంతమసు, ♦ దోర్బలుఁ, గోటిమనోజమోహను,
న్సురుచిరపత్రమండితు, ఘు♦ణున్, బరిపూర్ణతమావతారు, శ్రీ
హరినిఁ, బరాత్పరున్, సుతుగ ♦ నానకదుందుభి సూచి వేడ్కతోన్. ౩౮౫

తే॥ అట్టి పురుటింటిలోపల ♦ నగ్రజులకు, నిచ్చనిడె లక్షగోవుల ♦ నెడదనడలు
విడిచి యాదివ్యపుత్రుని ♦ విశ్వమయుగ, నెఱిఁగి బద్ధకరుండయి ♦ యిటుల వేఁడె. ౩౮౬

## దేవకీవసుదేవు లావిర్భవించిన శ్రీకృష్ణుని వినుతించుట.

సీ॥ వాస్తవంబున నీవు ♦ వఱలుదు వొకఁడవై, ప్రకృతిగుణంబున ♦ బహుళమైతి
వఖిలలోకములకు ♦ నాదిమకర్తవై, భర్తవై హర్తవై ♦ ప్రబలుచుందు
వట్లయ్యు దేహావ ♦ ర్ణాముల స్ఫటికంబు, బోలె నేమంటక ♦ క్రాలుచుందు
వాకాశ, విశ్వంభ♦రాంత, ర్బహిస్సులఁ, గర్మసాక్షివియాచుఁ ♦ గడలుకొందు

తే॥ వవనిభారముఁ దీర్పంగ ♦ నలరితీవు, పూరుషోత్తముఁడవునాకుఁ ♦ బుత్రుఁడవుగఁ
బుట్టియుంటివి ధన్యతఁ ♦ బొందినాఁడఁ, గంసభయమునుమాన్పి న ♦ న్గావవయ్య.

చ॥ అని వసుదేవుఁడావిధిని ♦ నాపరిపూర్ణతమావతారుఁ గృ
ష్ణునిఁ గొనియాడి మ్రొక్కులిడఁ ♦ జూచి పరాత్మయటంచెఱింగి నం
తన యలదేవకీసతి ము ♦ దంబునఁ జేతుల బాలకృష్ణునిన్
గొని తమి ముద్దువెట్టుకొని ♦ కోమలసూక్తుల వేఁడె నిట్టులన్. ౩౫౨

శా॥ వైకుంఠా! గరుడధ్వజా! సురవరా! ♦ భక్తాబ్జమిత్త్రోదయా!
లోకగ్రామణి! పూరుషోత్తమ! హరీ! ♦ లుంటాకఘోరాంతకా!
శ్రీకృష్ణా! యదునందనా! యదువరా! ♦ సేవింతు నిన్నానవే
నాకంసప్రభుభీతివీడి కుతుకం ♦ బాదంగ రక్షింపుమా! ౩౫౩

క॥ అనవుడు భగవంతుండ, ల్లననగి తలిదండ్రులన్ సు ♦ లక్షణయుతుఁడై
కనుఁగొని కరుణామతి నిటు, ఘనమగువాక్రుచ్చె నమృత ♦ ఘటితమృదూక్తిన్.

మ॥ జననీ! పృశ్నియనంగ సాధ్వివయి ప్రా ♦ గ్జన్మంబునందుంటివో
జనకా! శ్రీ సుతపాఖ్యఁ బొందియుఁ దనూ ♦ జాతార్థివైయుంటి వీ
వును, నీయమ్మయు, బ్రహ్మయాజ్ఞఁ దపమున్ ♦ భుక్త్యంబువుల్ వీడి శ్ర
ద్ధను మన్వంతరమాచరించితిరిసూ! ♦ తాదాత్మ్యభావంబునన్. ౩౫౫

ఉ॥ అంతట నేఁ, బ్రసన్నతను ♦ నందుచు మీదరికేగుదెంచి మీ
స్వాంతగతేప్సితంబులను ♦ సత్వరమే వచియింపుఁడన్న ని
శ్చింత, భవాదృశాత్మజునిఁ ♦ జెందెడి భాగ్యముగల్గఁ జేయవే!
సంతసమానుమాకన, నె ♦ సంగితిఁ దద్వరమేను బిమ్మటన్. ౩౫౬

చ॥ కమలభవుండు దంపతులు ♦ గా మిముఁగూర్చెను దద్వరంబునన్
క్రమముగ మత్సమాత్మజుఁడు ♦ గాఁదగునంచుఁ దలంచి యెల్లెడన్
నెమకితిఁగాని యెచ్చటను ♦ నేను గనుంగొనలేక మీకునం
తిమమున విశ్రుతుండన న ♦ తిప్రమదంబునఁబుట్టితిన్ జుమీ. ౩౫౭

చ॥ మఱుసటి జామునం దదితి ♦ మానిని నా మఱిఁ గశ్యపుండనన్
వఱలెడి మీకుఁబుట్టితిని ♦ వామననామముతోడ, నిప్డిటుల్
దిరిగి జనించితిన్గనుకఁ ♦ దెప్పున నన్గొనిపోయి నందమం
దిరమున నుంచి యందుఁగల ♦ దివ్యశిశుంగొని యిందుఁ జేరుమా! ౩౫౮

చ॥ అని వచియించి దేవకియు ♦ నానకదుందుభి కన్నులారఁగాఁ
గనుఁగొనుచుండఁగా నతఁడు ♦ గందువుతీరుగ మాఱెనయ్య! నం
త నతఁడు నాశిశుంగొనుచుఁ ♦ దర్లఁదలంపఁగ; నాయశోదకు
న్దనయఁగ యోగమాయ జన ♦ నంబును సెందెను గోకులంబునన్. ౩౫౯

సీ॥ అప్పుడడ్డంబుగా ♦ నాబిడ్డఁ గైకొని, యల్లనల్లన ♦ నడుగులిడుచు
యోగమాయాశక్తి ♦ నుక్కుబీగంబులు నర్గళశృంఖల ♦ లట్టియూడ
దిట్టమౌతలుపులు ♦ దెరువంగఁబడఁ గను, మాటాడు లోకంబు ♦ మాటుమణఁగఁ
గావలివారలు ♦ గాఢనిద్రను జెంద, నంధకారంబులు ♦ నంతరింప
తే॥ వేయిమొగములఁ జిలువయు ♦ వెంటనంటి, దీర్ఘఫణములఁ గృష్ణుపైఁ ♦ దెరచిపట్టి
వానపడకుండఁ గావంగ ♦ భయదయమున, బాట తనమధ్యమంబునఁ ♦ బరఁగనిడఁగ.

వ॥ నందుని వ్రజంబునకుం గ్రమంబుగాఁ జేరి గాఢనిద్రింబోయిన వేళను దిలకించుచు హరియోగమాయాప్రభావంబున నడ్డుపాటులేక యశోదశయ్యకడకుంజని తన కొమరునిం బరుండఁబెట్టి యందున్నఁ జిన్నిపాపను గ్రహించి యటనుండి వెడలి యమునం దాటి నిజకారాగృహంబునకు వచ్చి యాబిడ్డను దనసతీమణికిచ్చి యినుపగొలుసులం దనకాళ్లకుఁ దగిలించుకొని యేమియు నెఱుంగని వానికరణిఁ గునుకుపడి బెదరుగల వానిపోలికను నదరుచు గంభీరచిత్తంబున నుండె. ఆరేయి గాఢనిద్రం జెందిన యశోదకు, వసుదేవుం డానల్లనయ్యను దనశయ్యను బరుండఁబెట్టుటయుఁ దనబిడ్డను గొనియేగుటయుఁ దెలియకుండెనని యెఱుంగుము. ౩౬౧

చ॥ ఇఁకఁ జెఱసాలలోన సిసు ♦ వేడ్చెడి సవ్వడి నాలకించి ర
క్షకులు ద్రుతంబునన్ జనియుఁ ♦ గంసుని కయ్యది సెప్ప నాతఁడున్
దికమకఁ బొంది యా చెఱను ♦ దేవకిబిడ్డను లాగఁబోవఁగా
స్వకరము నడ్డువెట్టి తన ♦ భ్రాతకునిట్లనె నామె దీనయై. ౩౬౨

శా॥ అన్నా! చంపకుమన్న! యీసుతను, నీ ♦ కాయుష్య, మారోగ్య, మ
త్యున్నత్యంబును, గల్గఁ గాన విడు నా ♦ కాత్మోద్భవుల్లేరు; నీ
కన్నన్ దీనదయాళు రెవ్వరిల నీ ♦ కన్నెన్ మఱెన్నన్ననో
యన్నా! ప్రోవుము నీకుఁ జేసెదను సా ♦ ష్టాంగప్రణామంబులన్. ౩౬౩

తే॥ అరయ నవమాసములు మోసి ♦ యఖిలకష్ట, ములనుబడి నేనుగనినట్టి ♦ పుత్రవరుల
నార్వురను జంపియుంటివో ♦ యన్న! నీకుఁ, గీడు సేయని యీకన్నెఁ ♦ గృపనుగనుమ!

ఉ॥ కన్నులనుండి నీర్వడిచి ♦ కన్నియ, చిన్నది యన్నుమిన్న యా
పన్నయు నా కుమారికను ♦ బాహులఁ గప్పి నిజాగ్రజన్ము నె
న్నన్నియు తెన్నులన్ వినయ ♦ మెంతయుఁ దోఁపఁగ వేఁడు దేవకిన్
దన్నుచు నాపలం దఱిమె ♦ దైత్యవరుండగు కంసుఁ డక్కటా! ౩౬౪

తే॥ దేవకీదేవి యిటుఁ గంసు ♦ దిగులుతోడఁ, గడుపు గడ్డముఁ గాళ్ళను, ♦ గరయుగంబుఁ
బట్టుకొని బ్రతిమాల నా ♦ చెట్ట, నెట్టి పట్టుపట్టి యాబిడ్డను ♦ బట్టి యీడ్చె.

ఉ॥ దుష్టుఁడు యాదవాధముఁడు ♦ తుంటరులన్ బలుదంట మేదినీ
కష్టకృతిప్రదాయకుఁ డ ♦ కారణ వైరసమార్జనుం, డఘు

స్పష్టుఁడు కంసుఁ డంత నల ♦ పట్టిని గాళ్ళనుబట్టి బండపై
నష్టము సేయఁ గొట్టుచు ఘ ♦ నంబుగ నెట్టుడు యోగమాయయున్. ౩౬౭

ఉ॥ కంసుని వీడి పైకెగసి ♦ కాంతిమదాయుధముల్ ధరించి ద్వి
ధ్వంసకృతిప్రశస్తశత ♦ పత్రసహస్రతురంగసంగతం
బంసలపార్శ్వదావృతము ♦ నచ్ఛముఁ జామరయుక్తమౌ రథో
త్తంసము నెక్కి యష్టభుజ ♦ దండములొంది శతార్కభాసయై. ౩౬౮

చ॥ ఘనరవమొప్ప నిట్లనియెఁ, ♦ గంస! నినున్వధియింప నింతకున్
మునుపె పరేశ్వరుండు నఘ ♦ మూలవినాశకుఁడైన కృష్ణుఁడే
జననము నొందె వ్యర్థముగ ♦ శక్తి యొకింతయు లేని దీనులన్
గని వెతఁబెట్టుచుంటి విది ♦ గౌరవకృత్యమె ? వీరమత్యమే?. ౩౬౯

తే॥ యోగమాయ, కంసునకిట్లు♦యుక్తరీతిఁ, జెప్పివింధ్యాచలమ్మునఁ♦ జేరియచట
బహుళనామంబులన్ బొంది♦వఱలుచుండె,నోయి బహుళాశ్వభూవరా!♦యుచితచరిత!

ఉ॥ పిమ్మట నుగ్రసేనజుఁడు, ♦ విస్మితుఁడై యల యోగమాయ వా
క్యమ్ముల చాలఁగాంచి చెలిఁ ♦ గ్రాలెడివారల వీడి వారి పా
దమ్ముల వ్రాలి పాపుడను ♦ దప్పుడు వాఁడను, పాపకర్ముఁడన్
మిమ్ము నయారె! యిందున న ♦ మిత్రుఁడనై వెతఁబెట్టితిం గదా. ౩౭౧

మ॥ భగినీ! మన్మథరూపులైన సుతులన్ ♦ బల్మాఱునేఁ జంపి ని
న్నగచాట్లం గడుఁబెట్టియుంటి, దయ న ♦ మ్మా! నన్ను మన్నింపుమా!
పొగరుంబట్టిన వాఁడనైతి ఖలసం ♦ బుద్ధుండనైతిం జుమీ
వగపుం జెందక కష్టమోర్చి యెటో బా ♦ వా నన్ను రక్షింపుమా ! ౩౭౨

ఉ॥ కాలము ముంచుఁ బ్రాణులను ♦ గాలమె తేల్చెడిఁ బ్రాణిరాశి, నా
కాలమెవండెఱుంగు? ఘన ♦ కాండము, నిశ్చలమైన, గాలికిన్
దూలెడి లీలఁ గాలగతి ♦ దుష్టుఁడనై వెలిపల్కనమ్మి మి
మ్మోలిఁగఁ గష్టపెట్టితిని ♦ నోర్చుఁడు, తీర్చుఁడు నాదు తప్పులన్. ౩౭౩

ఉ॥ అష్టమగర్భమాస్థ నిను ♦ నంతమొనర్చునటంచు మిన్ను సు
స్పష్టముగా వచించె నది ♦ సత్యముగాక చెలంగె నిప్పుడీ
యష్టమగర్భమౌ యబల ♦ యైజనియించెను యోగమాయ నన్
నష్టముసేయువాఁడు జన ♦ నంబును నొందెనటంచు వాకొనెన్. ౩౭౪

ఉ॥ వాఁడెటనుండెనో మఱియు ♦ వాఁడెటులుండెనో నాకునెప్పుడే
కీడులు మూడునో యెవరు ♦ గేకిసలన్ దమిఁగొట్టనుందురో
జాడనెఱుంగనైతి నెటు ♦ సంచరణంబొనరింతుఁ గొల్తు నా
పోఁడిమి నూడఁగొట్టకుఁడు ♦ బ్రోవుఁడు సోదరి! సోదరీపతీ! ౩౭౫

తే॥ ఉగ్రసేనాదు లెల్లచ్చి ♦ యుచితరీతి, దేవకీవసుదేవుల ♦ దిగులువాపి
మెఱఁగి యంకట నిలుసేరెఁ, ♦ గృష్ణునమ్మ, వారికే శుభమెట్లుసే♦కూరదయ్య!

చ॥ పదపడిఁ గంసవీరుఁడు ప్ర ♦ భాతమునందున మేలుకాంచి దు
ర్మదమున నా ప్రలంబముఖ ♦ రాక్షసులన్ బిలిపించి యోగమా
య దెలిపినట్టి వాక్యముల ♦ నన్నిఁటి వారికిఁ జెప్పి పిల్లలన్
సదమదముం బొనర్పుఁడు ర ♦ సాతలమందుఁ గసాయివారలై. ౩౭౭

వ॥ అని బెట్టిదంబుగా నాజ్ఞాపింప నాచెట్టలువిని దేవా! నీవు దేవాసుర ద్వంద్వయుద్ధంబందుఁ జేరెక్కియుక్కుమిగిలి ధనుష్టంకారం బొనరింప నన్నిలింపులు సైతము గంపంబునెంది కాళ్ళోలందిఁ బాఱరే? ఇఁక బాలురవలననా మనకు భయంబు గలుగునది? ముఖ్యంబుగా నీకు వైరియగు నమ్మహాశేషికి గో, విప్ర, సాధు, శ్రుతి, ధర్మాదులు, తనువులైయుండు. అవ్వానియందే యాతండుద్భవిల్లుంగానఁ దదవ్ధోపాయం బాలోచించి యానతిమ్మని విన్నవించుకొన నయ్యుగ్రసేనియు యోచించి యంతుల కురరీకరించె. అంత నా దేవానాం ప్రియు లత్యుత్సాహంబుతో వెడలి నలుగడలఁ దిరిగి తిరిగి పుర, గ్రామ, జనపద, వన, వనధులఁ, దత్తత్కాలోచితంబుగాఁ గామరూపధరులై సర్పంబు లాఖువుల రంధ్రంబులం దూరుమాడ్కిఁ జొచ్చి చొచ్చి, చూచి, చూచి, పశు, పక్షి, మృగ, నరసమూహంబు లందలి తల్లిచనుఁబాలు వీడఁజాలనివియై, మనోహరంబుగా నుండు లేఁగలను, గ్రుడ్లను, బసికూనలను, బిడ్డలను భూతబేతాళురంబోలి చంపఁ దొడంగి క్రమక్రమంబుగా నిర్వీర్యులగుచు సంచరించుచుండిరి. అంత నావ్రజంబునందు. ౩౭౮

నందుండు పుత్రోత్సవంబుజేయుట.

సీ॥ నందుఁడు వఱువాత ♦ నందనోత్సవమును, జరుపంగఁ దలఁచి భూ ♦ సురులఁబిలిచెఁ
బిలిచి తత్పదపద్మ ♦ ములకు షోడశవిధు, లను బూజలన్ భక్తి ♦ దనరసలిపె
సలిపియు లక్షగో ♦ వులను దక్షిణలతో, ధాన్యముతోఁగూడ ♦ దానమిచ్చె
నిచ్చి వారొనరించు ♦ నీప్సితార్థంబులఁ, గలిగించు దీవెనల్ ♦ దలను గొనియెఁ

తే॥ గొనియు భేరీ మృదంగాది ♦ నినదముఖల
దిశల మ్రోఁగ సువాసినుల్ ♦ దివ్యభక్తి
మంగళారతులెత్త న ♦ మందగతిని
జాతకర్మంబు నొనరించె ♦ జనక! మఱియు. ౩౭౯

చ॥ తిల గుడ తైల తూల ఘృత, ♦ దివ్యమణీ ధరణీ, సువర్ణ వ
స్త్రలవణసప్తధాన్య ఫల ♦ దానములన్ వసుధాతలామరేం

ద్రులకు విధేయుఁడై యొసఁగి ♦ తోఁచినరీతిని బైనిదక్షిణల్
బలుమఱు నిచ్చె నందుఁడన ♦ వద్యసుతోత్సవబద్ధచిత్తుఁడై. ౩౮౦

సీ॥ గాత్రమూలముగాఁగ ♦ గాయకుల్ గానంబు, గావించి రవ్వాణి ♦ గానసరణి
క్షేమవస్త్రముల సిం ♦ గారంబుగావించి, సానివాండ్రాడి ర ♦ చ్చరలకరణిఁ
గర్ణపర్వమౌనట్లు ♦ కావ్యముల్ గవులును, వ్రాసిరి తద్బాద ♦ రాయణిరహి
విజయసూచకములౌ ♦ ధ్వజినీపతాకముల్, జెలఁగె నాస్కందుని ♦ సేనఁబోలె
తే॥ శంఖ దుందుభి వీణాది♦సకలవాద్య, యంత్రములు గడుమ్రోసెనా♦యభ్రగతిని
నింద్రజాలంబులన్ జేసి ♦ రైంద్రజాలికు, లల శౌరిపుట్టిన వేడు♦కలకు, మఱియు.

సీ॥ సందులగొందులఁ ♦ జదుకంబులందునఁ, జిమ్మి వాసితవారిఁ ♦ జికిలించి
పంచలాడలందు ♦ వాఁకిళులందున, నలికించి రంగ్వల్లు ♦ గ్గులనలర్చి
వీడుల వాడల ♦ మేడల గోడలఁ, జిత్తరువుల్ వ్రాసి ♦ చెలువునింపి
మండప తోరికా ♦ మండలప్రాంగణం, బుల సర్వవిధములఁ ♦ బొల్పు నల్పి
తే॥ దేవతాగారసత్రాది ♦ దివ్యభవన, ములను దత్తదుచితకృత్య ♦ ములను వలయఁ
జేసి బుజజులఁగలశముల్♦నెలఁగఁ జేసి, నందనోత్సవమున్ సల్పె♦నందుఁడలరు.

ఉ॥ బంగరుశృంగముల్ బసుపు ♦ పచ్చనిపుచ్ఛముఁ జిత్రధాతులన్
ఖంగున మ్రోఁగు గంటలను, ♦ గాంతిలచేతులగు ఖురుల్, మనో
జ్ఞాంగము, రక్తకంబళము ♦ లగ్నములైన, సువర్ణహారముల్
హంగగు వత్సముల్, గలిగి ♦ యావులు రాజిలె నప్పుడచ్చటన్. ౩౮౩
తే॥ అంత వృషభానువర్యుఁడా ♦ యవసరమున,నందనందనోత్సవమహా♦నందవార్త
విని కళావతీయుక్తుఁడై ♦ జనులుగొల్వ, సౌరుగౌరున నక్కట ♦ త్సదనమొందె.

చ॥ మఱి నవనందవర్యులును, ♦ మాన్యులు శ్రీవృషభానుమట్కము
ద్ధుకు లుపనందులున్ జెలిమి ♦ తోఁ దిరుగాడెడి భూపవర్యులున్
సరసతరాత్మబంధువులు ♦ శాస్త్రపురాణనయప్రవీణతా
విరతయశోదయాఢ్యులును ♦ వే సనుదెంచిరి నందునిక్కటన్. ౩౮౪
సీ॥ ఉత్తమాంగంబుల, ♦ నుష్ణీషములఁ దాల్చి, వానిపై దండల ♦ వలలఁజేసి,
పచ్చబొందళముల ♦ గ్రిచ్చలఁ ధరియించి, తోళసిదళంబులన్ ♦ దోడవులొంది
పిల్లనగ్రోవులఁ ♦ బెదవులనులగించి, బెత్తములన్ జేతి ♦ వ్రేళ్ళఁబట్టి
గురిజలంగట్టిన ♦ క్రొమ్ముడియుంగల్గి, నెమ్మిలపురులను ♦ నెఱయఁగట్టి
తే॥ మోమునందునఁ బొట్టిడి ♦ పుత్రకులను, గూడి వేడుకతోఁడుత ♦ గోపకులును
జిన్నికృష్ణునుత్సవమును ♦ గన్నులారఁ, ! గాంచవచ్చిరి నందు ని♦క్కటునరేంద్ర.
క॥ పురమున నుండెడి వారొం, డొరులును శ్రీనందపుత్ర ♦ కోత్సవమునకున్
సరగునఁ బోదము రండని, సరసముగాఁ జెప్పికొనుచుఁ ♦ జనిరచ్చటికిన్. ౩౮౫

మ॥ కమనీయాంగద తార హార తరల ♦ గ్రైవేయ కావాపకా
సమచూడామణి హేమ హీర నవవ ♦ స్త్రక్షౌమ చీనాంశుక
ప్రమదారత్నమదేభ గో వృధురథ ♦ భ్రాజత్తురంగంబులన్
గ్రమమొప్పన్ గొని తెచ్చి యిచ్చి రతిథుల్ ♦ కంజాక్షు పై వేడ్కలోన్. 3౮౮

తే॥ దధియు,క్షీరంబు,ఘృతముహ♦స్తములఁబూని, కజ్జనోక కేలఁగైకొని♦గళములటుల
నిటులఁద్రిప్పుచు గోపక♦వృద్ధులింక, బాలురేగిరి కృష్ణోత్స ♦ వంబుఁజూడ. 3౮౯

ఉ॥ నందుఁడు పుత్రకోత్సవము ♦ నం గల రాజుల బంధుపాళి నా
నందముతోడఁ గాంచి నయ ♦ నంబుల బాష్పములొల్క వారికిన్
విందులొనర్చి సత్కృతుల ♦ వేములు సల్పుచు హాయినుండ వా
రందఱు నందరాజుఁ గొని ♦ యాడిరి పాడిరి సంతసంబునన్. 3౯౦

తే॥ ఓ వ్రజేశ్వర!యోనంద!♦యోగ్యచరిత!,ధీర సుకుమారసుకుమారు♦దివ్యదేహుఁ
గనుట ధన్యతగంటిమి ♦ కాలకాల, ముఁగనుండెడి నీకోర్కె ♦ ముగిసెనేఁడు.

చ॥ అనవుడు నందుఁ డిట్టులను ♦ నర్థవిదగ్రణులార ! నాపయిన్
నెనరిడి మీరు వల్కునడి ♦ నిక్కమవమే యని మీ యనుగ్రహం
బునను ఘటిల్లె మద్వ్రజముఁ ♦ బొందిన గోపుల యాజ్ఞఁబూని యే
ననిశము సంచరింతుఁ గద ♦ యయ్యది మీరలు గుర్తెఱుంగరే. 3౯౧

ఉ॥ అయ్యెడ గోపికల్ వ్రజము ♦ నందలి నందసుతోత్సవంబుఁ దా
మొయ్యన నాలకించుచు నొ ♦ హో యని యబ్బురమొంది చంకలన్
జయ్యన బొట్టెలం గొని స్వ ♦ సద్మకృతుల్ విడనాడి గుంపుగా
నెయ్యముతో వ్రజేశ్వరుని ♦ సిర్వ్రతమొందఁ దలంచి నెమ్మదిన్. 3౯3

సీ॥ మంజుమంజీరముల్ ♦ మంజులధ్వని సేయఁ, గాంచికాఘంటికల్ ♦ ఖంగనంగ
దారహారంబులు ♦ దాఱుమూఱాడఁగఁ, గరకంకణములు గల్ ♦ గల్లనంగ
గబ్బిగుబ్బలు పైఁటఁ ♦ గ్రాలి పింపిసలాడఁ, జెమ్మట నెమ్మేను ♦ సెమ్మగిల్లఁ
గుసుమహారంబులు ♦ గురులనుండియుఁ బ్రాలఁ, గస్తురిచేర్చుక్క ♦ గరగుచుండ

తే॥ నూడిపోయెడి చీరల ♦ ప్రీడఁబట్టి, కొంచు మైదీగె మించును ♦ మించి వెలుఁగ
నందరాజ గోకులమును ♦ బొంది దాని, సుందరత విచిత్రంబుగాఁ ♦ జూచుచవల.

ఉ॥ ఆ విమలాంగ బాలకుని ♦ యాస్యమునుండి పదంబులంటఁగా
నావల నల్లయావల, య ♦ వాదుల నుప్పును, నెట్టనీళులిం
కేవియొ దృష్టిదోషము శ ♦ మింపఁగ మాటికిఁ దీపివేసి బ
ల్దీవనఁ జేసి పల్కిరిటు ♦ దియ్యఁదనంబున నయ్యశోదకున్. 3౯౪

ఉ॥ అమ్మ ! యశోద ! మంగళము ♦ లబ్బెఁగదమ్మ ! సుతుండు నీదు భా
గ్యమ్మున్నఁ గల్గెనమ్మ ! చిర ♦ కాలమునుండియు నోఁచు నోములే

యిమ్మెయిఁ బండెనమ్మ! కృత ♦ కృత్యవునై తిగదమ్మ! మాకు మో
దమ్ము ఘటిల్లెనమ్మ! ప్రమ ♦ దమ్మున వీనిని బెంపవమ్మరో! ౩౯౬

ఉ॥ ఆపయి నా వధూమణి వ ♦ రాంగనలార! సుతుండు నాకు మీ
ప్రాపునఁ గల్గెఁగాని యిత ♦ రక్రియఁ గాదిది నెమ్మిఁజూడఁడం
చోపికఁబల్కి రోహిణిరో! ♦ యోగ్యచరిత్రల వెల్లు వీరికిన్
సాఁపడఁజేసి సత్కృతుల ♦ సల్పుమ! యేమియు లోటులేనటుల్. ౩౯౭

చ॥ అనవుడు నట్టి రోహిణియు ♦ సచ్చరిత్రమనోజ్ఞ గోపికా
జనుల సుచేలధారిణుల ♦ సాఁపడఁజేసి సపర్యలాచరిం
చెను మఱి మర్త్యలోకమున ♦ శ్రీహరి, నందుని కాత్మజాతుఁడై
జననము నొందెనంచు జయ ♦ శబ్దములంతట నిండె. నావలన్. ౩౯౮

తే॥ గోపికా గోపకులుగూడి ♦ కుతుకమతుల, వీరి మున్వారఁబోలిన ♦ పెద్దవారు
లేరులేరని దధి ఘృత ♦ క్షీరములను, బోయఁదొడఁగిరా వ్రజమంత ♦ బురదగాఁగ.

చ॥ నరహరి యుత్సవంబును గ ♦ నన్ బెదదొడ్డులు గొందఱందు వే
యురుగుచు గోఁచులూడఁగని ♦ యుయ్యాలి దోపుచుఁ గమ్మఁజిమ్మటల్
బోరిఁబోరి రోఁజుచాగుచును ♦ బూన్కి మఱిన్ జనసాగి జట్టున
న్జలజలజాఱి యన్యహాస ♦ నంబున కాస్పదులైరి భూవరా! ౪౦౦

చ॥ మఱియును వందిమాగధులు, ♦ మాన్యులు, సూతులు, వేదశాస్త్రవి
త్సరసులు నైతిహాసికులు ♦ జక్కనిమాటలనాడ నందుఁడున్
గరమరుసంబుబొంది మమ ♦ కారముతో నవభూషణాంబరో
త్కరకరిగోసహస్రతుర ♦ గంబుల నిచ్చెను వారి కోలిమై. ౪౦౧

తే॥ భుక్తి ధనవృద్ధి సంసిద్ధి ♦ శక్తులెలమి, వాడవాడల నూరూర ♦ భవనభవన
ములను సంపూర్ణముగఁగల్గి ♦ మూల్గుచుంట, నిద్ది కావలయుననుట ♦ యెఱుఁగఁబడదు.

ఉ॥ బంగరు రంగుమైమెఱుఁగు ♦ బంగరుబొజ్జయుఁ బైఁడిపోగులున్
బంగరు పాగయున్ గలిగి ♦ ప్రాఁబలుకుల్ దన నాల్గుమోములన్
ఖంగునఁ బల్క మేటియయి, ♦ క్రాలుచునుండెడి బ్రహ్మ భార్యతోఁ
బొంగుచు నంచనెక్కి వ్రజ ♦ మున్ జని వెన్నునిఁ జూచు వేడ్కతోన్. ౪౦౩

ఉ॥ ఆతని వెంట నీశుఁడల ♦ యాంగ్రుల పోతుచు, నగ్ని మేఁకనున్,
వాతము ఖంజనంబునున్, ప్రభా ♦ కరుఁడున్ బెదతేరునున్, బలా
రాతి మదద్విపంబు, యమ ♦ రాజును దున్నను, జంద్రుఁడిట్టి, పా
శ్నాతురుఁడున్ మయూరము, హరు ♦ లాహుటి నెక్కియు నేగి రిట్టులే. ౪౦౪

కవిరాజవిరాజితము.

వరుణుఁడు నక్రము, వైశ్రవణుండని ♦ వార్యగతిస్ఫుత పుష్పకమున్
గురుఁడును గృష్ణముఁ, గోడిని సౌమ్యుఁడు ♦ క్రోతిని భౌముఁడు శుక్రుఁడును
ద్ధురగవయంబు, విధుంతుదుఁ డుష్ట్రిముఁ, ♦ దోయజమిత్రకుమారశనై
శ్చరుఁడును నక్రము, జయ్యన నెక్కిరి ♦ సాగిరి నందగృహంబునకున్. ౭౦౫

చ॥ సిరియు సుపర్ణు, దుర్గయును ♦ సింగము, నైచికియాపుఁ గన్న యా
స్థిరయు విమానరాజమును, ♦ దీర్ఘకృపాణముఖాస్త్రయష్టులన్
గరములఁ గొన్న షష్ఠి, శిబి ♦ కన్, మఱి డోలఁబదార్వు రమ్మలున్
మురిపెముతోడ నెక్కి వ్రజ ♦ మున్ జనసాగిరి మాధవార్థమై. ౭౦౬

చ॥ సనకసనందనాదిముని ♦ చంద్రులు, నేను, యథార్థపద్ధతిన్
వనజదళాయతాక్షుని గ ♦ నన్ విధితోడుత గోపగోపికా
జననినదప్రయుక్తమగు ♦ సర్వశుభాస్పద నందమందిరం
బునుగని ప్రీతిపూరిత సు ♦ బుద్ధులఁ జేరితిమో నరేశ్వరా! ౭౦౭

ఉ॥ అందఱమందఁ జేరి హరి, ♦ నాపరిపూర్ణతమావతారు, గో
విందునిఁ గాంచి మ్రొక్కితిమి, ♦ వేదవచస్సుల వేఁడియుంటి, మా
నందు సపర్యలందఱి మ ♦ నర్థము లేగెనటంచు నెంచి యా
నందముఁ బొంది క్రిమ్మఱి చ ♦ నన్ సమకట్టితి మేము మైథిలా! ౭౦౮

తే॥ అందఱేగిన తరువాత ♦ నందరాజు, మథురయందలి వసుదేవ ♦ విధముగాంచి
పుత్రకోత్సవముం జెప్పి ♦ భూపతియగు, కంసునికిఁ గప్పముంగట్టి ♦ గదలిపోయె. ౭౦౯

పూతన కంసప్రేరితయై గోకులంబున కేతెంచుట.

ఉ॥ ఆతరువాతఁ గంసవిభుఁ ♦ డా హరిజన్మము నాలకించి వే
ఘాతముసేయఁ బూతనను ♦ తోత్రముతో ననుపంగ, నామహా
ఘాతము, ఘర్ఘరస్వనముఁ ♦ బోలిన నాదముతోడ, ఘోష సం
ఘాతము గ్రామముల్ పురులఁ ♦ గాంచుచుఁ దిర్గుచు నట్టకేలకున్. ౭౧౦

సీ॥ కందుకంబులఁబోలు ♦ గబ్బిగుబ్బలు పైఁటఁ, గులుకుచు క్షీరము ♦ లొలుకుచుండ
నిండుజాబిల్లిని ♦ నివ్వెఱఁబడఁ జేయు, నెమ్మోముకళలచే ♦ నగడుచుండఁ
దామరతూండ్ల వి ♦ ధంబున డంబైన, భుజములు భూషలన్ ♦ బొల్పుగాంచ
మెలిమిజాళువా ♦ లీలనుగ్రాలెడి, నెమ్మేను దొడవుల ♦ నీటు సెంద

తే॥ మల్లెమొల్లల హసియించు ♦ తెల్లపుట్టములను గట్టి పదాఱుడ్లు ♦ గలుగు కలికి
వాతెనుండెడి రూపంబు ♦ బొందినంత, వ్రజము సొచ్చెను శ్రీకృష్ణ ♦ బాలుదునుమ.

వ॥ అంత. ౪౧౨

మ॥ రతియో రంభయొ వాణియో శచియొ దు ♦ ర్గాసాధ్వియో లక్ష్మియో
శతసంఖ్యాకలఁ జూచియుంటె మిటు ల ♦ స్మద్దృష్టిలో లేరటం
చతిరేకంబుగ మెచ్చి రోహిణి, యశో ♦ దాద్యంగనల్ లోనిక
ద్భుతరీతిన్ జననించు పూతనను జే ♦ ద్రోయంగ లేదా పెయిన్. ౪౧౩

ఉ॥ రోహిణి నాయశోదను ని ♦ రోధ మొనర్చి కరంబులన్ జగ
న్మోహనుఁ జిన్నికృష్ణుఁ గొని ♦ ముద్దిడి స్వీయకుచంబులందు న
వ్యాహతనాశకృద్విషము ♦ నక్కఱ నింపుచు నంకమందు నా
రోహితుఁ జేసి స్తన్యము న ♦ రుచ్యము నా చినిపాపకిచ్చెఁగా. ౪౧౪

చ॥ హరియుఁ బయోధరంబులను ♦ నాస్యము నందిడి కృత్రిమంబులో
నరసి పయఃప్రయుక్త విష ♦ మంత నసృగ్ధృథమాంసశల్యసం
కరముగఁ గ్రోల, నాయసురి ♦ గర్వము వీడి కుమార ! వీడుమా
పిరివిడునంచుఁ జాటినను ♦ వీడమిఁ బూతన యంతిమంబునన్. ౪౧౫

చ॥ అచలము లేదునన్ బృధుగు ♦ హావళితోడఁ బలితధ్వనింప, నీ
యచల, చలింప, సాగరము ♦ లన్నియు ఘూర్ణిలుచుండ, దిక్ప్రిభు
ప్రచయము దల్లడిల్లఁ బలు ♦ బాధలఁ గెవ్వునఁ గేకవేసి త
త్కుచరితమెల్లఁ దెల్లముగఁ ♦ గూలె భయంకరరూపయు క్తయై. ౪౧౬

ఉ॥ అత్తటి నాఱుక్రోసులకు ♦ నంతరమందునఁ గల్గు చెట్లపె
న్మొత్తము చూర్ణమాయె. నల ♦ పూతన యొక్క శరీర సౌష్ఠవం
బత్తరలేక్షణల్ వ్రజము ♦ నందలి గోపగణంబు సూచి బ
ల్తత్తరమొంది చిత్తరువు ♦ లన్ మఱపించుచు నిల్చి రంతటన్. ౪౧౭

ఉ॥ చిన్నతనంబునన్ జెలఁగు ♦ శ్రీహరి, పూతనపాలు గ్రోలి వే
మన్ననఁ గల్చి సందియము ♦ మాయుటకై యెటనేని ప్రాణమొం
దున్నదొ యేమొ యంచు నొడ ♦ లూరక చూచెడి వానిమాడ్కి న
భ్యున్నతి దానిపైని నగు ♦ మోమున నెల్లెడ దోఁగి యాడుటన్. ౪౧౮

## శ్రీకృష్ణ కవచము.

ఉ॥ గోపులు గాంచి యచ్చెరువు, ♦ గూర్మిభయంబులు, గల్గుచుండ, నీ
పాపఁడు నెగ్గనేరఁడని ♦ పాణుల లాగిరి రోహిణీయశో
దాపతిపత్నులా కొమరుఁ ♦ దత్క్షణమందు నురంబునందిడన్
గోపిక లాకుమారుని క ♦ కుంఠిత రక్షనొనర్చి రిట్టులన్. ౪౧౯

తే॥ తొల్తనఘహారకాళింది ♦ తోయములను, ధేనుపుచ్ఛభ్రమణముల ♦ ధేనుమూత్ర
గోమయంబులనాచిన్ని ♦ కొడుకు జలక, మాడఁజేసిరి దొలిమిన్నక ♦ లాడినట్లు.

సీ॥ శ్రీకృష్ణుఁడీనీదు ♦ శిరము గాచుత, గళము వైకుంఠుండు ♦ గాచుఁగాత
దెలిదీవి తేఁడు నీ ♦ నొసలును బ్రోచును గాత, ముక్కును యజ్ఞుండు ♦ బ్రోచుఁగాత
నరసింహమూర్తి నీ ♦ నయనముల్బ్రోవుత, రాముండు నాలుక ♦ నోముఁగాత
నరుఁడు, నారాయణుం ♦ డరుదైన యోష్ఠముల్, ముద్దులకుద్దిగాఁ ♦ బ్రోచుఁగాత
తే॥ హరికళాభవసనకాదు ♦ లాకపోల, ములను బ్రోచుత గపిలస♦న్ముని,చిబుకము
రక్షసేయుత శ్వేతవా ♦ రాహమూర్తి, ముదముతోడుత ఫాలంబు♦బ్రోచుఁగాత.
తే॥ ఉరము దత్తయోగీశ్వరుఁ♦డోముఁగాత, మూఁపులనుబుషభుండును♦బ్రోవుఁగాత.
కరముల్ల మత్స్యమూర్తియుఁ♦గాచుఁగాత, భుజయుగంబునుబృధురాజు♦బ్రోవుఁగాత.
తే॥ కడుపుఁ గమఠుండుబ్రోవుతఁ ♦ గరుణతోడ, నాభిఁగావుతనట్టి ధ ♦ న్వంతరియును
మోహినీదేవి గుహ్యంబుఁ ♦ బ్రోవుఁగాత, గటినివామనమూర్తియు♦గాచుఁగాత.
తే॥ ఓమురల్వెన్ను భార్గవ ♦ రాముఁడూరు, వులను బాదరాయణముని♦ ప్రోచుఁగాత
గావుతల్గాళ్లఁగల్కిపి♦క్కలను జంఘ, ములను దయను బ్రోతురుగాత♦బుద్ధబలులు.
తే॥ ఇట్లు శ్రీకృష్ణ కవచంబు ♦ నెట్టిఁగిచదివి, సర్వరక్షలఁ జేసిరి ♦ చతురమతుల
నిద్ధిభగవంతు డావిధి ♦ కెలమిఁ జెప్పె, నతఁడు శివునకుఁబల్కఁగా ♦ నతఁడు మరల
తే॥ కనికరమున దుర్వాసుఁడల్♦మునికినని యె,నతఁడు శ్రీయశోదకుఁ జెప్పె♦నదియొవంతు
నిత్యమునుప్రభాతంబున♦నిశ్చలమతిఁ, జదువునో వాఁడుపాపముల్♦ జనుపు జనక!
తే॥ అంత రోహిణియుల్ యశో♦దాంగనయును, రక్షసేసినపిమ్మట ♦ బ్రాహ్మణులకు
వివిధదానముల్సల్పి ♦ పిల్లనికినిఁ, బాలుద్రాగించి హాయిగా ♦ వఱలిరయ్య!
తే॥ అవల నందాది గోపకు ♦ లామధురను, వీడి తమ టుంకిక్కిదిర్గి ♦ వేడ్కఁ జేరఁ
వచ్చుచుండంగఁ బూతనా♦భయదవపువుఁ, బధినిగాంచికుఠారముల్♦వరుసఁగొనుచు
క॥ రక్కసియొడలును ముక్కలు, ముక్కలుగాఁ జేసి యమున ♦ పొన్నరిదరిని
మిక్కిలి చితులను బేర్చుచుఁ, జక్కఁగ దహనంబు జేయ ♦ సాగిరి పిదప. ౭౫౯
ఉ॥ కాలినదానినుండి పొగ ♦ కల్మషనాశకమై పవిత్రమై
యేలకికాయలా యగరు ♦ నిద్ధలవంగముల్ బటీరముల్
బోలు సువాసనల్ వెడలెఁ. ♦ బూతన యుత్తమలోక మొంద నా
శ్రీలలనేశుఁడే సలిపెఁ ♦ జిత్రమనం జనకుండు నిట్లనెన్. ౭౬౦

పూతనా పూర్వజన్మ వృత్తాంతము.

ఉ॥ పూతన, బాలఘాతిని య ♦ పూర్వవిమస్తని దుష్టశీల యా
నాతికి నెట్లు స్వర్గము జ ♦ నార్దనుఁ డిచ్చెను? బూర్వజన్మమం
దేతలిదండ్రులీయమకు, ♦ నెట్టిది దీనిచరిత్ర సర్వమీ
రీతఁజెప్పి చిత్తమును ♦ నింపున నింప నుతింతు నారదా! ౭౬౧

చ॥ అనవుడు భూతలేంద్ర ! యది ♦ యాదిమజన్మమునన్ బలిప్రజే
శునిసుత, రత్నమాల, యన ♦ శోభిలితండ్రి సవంబునందు వా
మనుఁడనుపేర నొప్పెడి ర ♦ మాపతినింగని పుత్రమైత్రితోఁ
దనరుచు నిట్టి పుత్రకుఁడు ♦ దాఁగానిన్ జనుఁబాల నిత్తుఁగా. ౪౩౨

చ॥ అని మనమందునం దలఁచె ♦ నాబలి స్వప్రియభక్తుఁడౌట నా
తనిసుతయంచు వత్సలతఁ ♦ దద్వర మాహరి యామె కిచ్చని
చ్చెనుజామి యంత నావనిత ♦ శ్రీహరిసూక్తిని నా విధానఁ బూ
తన యనుపేర సిద్ధగణి ♦ ద్వాపరమేగిన మీఁదఁ బుట్టితాన్. ౪౩౩

చ॥ హరిని స్పృశించి స్తన్యమును ♦ నాస్థనొసంగి నశించి వెంటనే
పరమపదంబు సొందెఁగద ♦ పార్థివ! పూతన మోక్షసత్కథా
సరణిఁవిన్న వ్రాసినను ♦ జక్కఁబఠించిన దోషరాశి చె
చ్చెరవిడి తత్త్రివర్గ ఫల ♦ సిద్ధులు గల్గును నెట్టివానికిన్. ౪౩౪

వ॥ అని యిత్తెఱంగున శ్రీగర్గాచార్యుండు శౌనకునకు వచింప నతండు పరమానందభరితుండై మహాత్మా! శ్రీకృష్ణచరితంబు వినిపించి నాజన్మంబు సఫలంబు గావించితిరి. మఱియు శాంతిదాంతివిశ్రాంతస్వాంతుండును, శ్రీకృష్ణభక్తశిరోమణియునగు నాబహులాశ్వుం డా నారదమహర్షిం గాంచి యావల నేమని పృచ్ఛించె నది యానతిండని ప్రార్థించుటయు గర్గుం డిట్లనియె. ౪౩౫

తే॥ అంగులకు జనకుండెద♦హర్షమొంది, "అద్యధన్యోస్మినారద"!♦యచ్యుతాంఘ్రి
నిహితమతులకు నెల్లెడి ♦ నెగ్గకుండుఁ, జిన్ని వెన్నునికతఁ బైనిఁ ♦ జెప్పుమనుచు.

ఉ॥ నారదుఁ డిట్లనెన్ జనక ♦ నాయక ! యొక్కదినంబునందు నా
శౌరిభవోదయుత్తతిథి ♦ సంఘటిలంగ యశోద గోపగో
పీరమణీయులై మిగుల ♦ వేడుకఁజేయఁదలంచి భూమిబృం
దారకబృందమున్ బిలిచి ♦ దానములన్ బొనరించి యంతటన్. ౪౩౬

చ॥ సురుచిరమైన రూపమున ♦ శోభిలు బాలుని ముద్దుకృష్ణునిన్
బరిమళయుక్తవారుల న ♦ వారిగ స్నానమొనర్పఁజేసి త
త్సరసిజనేత్రయుగ్మమునఁ ♦ జక్కఁగఁ గాటుకదిద్ది రోహితాం
బరములఁగట్టి బొట్టునిడి ♦ బంగరుసొమ్ములఁబెట్టి సొంపుగాన్. ౪౩౭

తే॥ డోలికారత్నమందునఁ♦ బూలపాన్పు, పైనిఁగూర్చుండఁ బెట్టఁగ ♦ మానవతులు
మంగళారతు లెత్తి యు ♦ భంగభంగిఁ, బాటఁవళినిఁ బాటలఁ ♦ బాడి రవల.

స్రగ్విణీవృత్తము.

లాలి శ్రీమాధవా ♦ లాలి దేవస్తుతా, లాలి కేళీప్రియా ♦ లాలి గోపీప్రియా
లాలి నారాయణా♦లాలిస్మేరాననా, లాలి కృష్ణాహ్వయా♦లాలి నందాత్మజా.

చ॥ అని యిటు లాలిజోలలను ♦ నందము చందము నెంద సుందరీ
జనములు వాడుటల్ వినుచు ♦ సంతసమంది యశోద, చిన్నిప
ట్టిని శయనింపఁజేసి తన ♦ టెంకికి వచ్చినవారి గౌరవం
బును బొనరించు తొందరను ♦ బుత్రుని విస్మృతిఁజెందె నయ్యెడన్. ౪౪౧

బాలకృష్ణుం డుత్కచాద్యసురవధంగావించుట.

తే॥ అంతకాఁడగు తత్కంసు ♦ నాజ్ఞ వెడలి, గంధవహనిభదేహుఁడు ♦ త్కచాసురారి
యొండుబండినిఁ గొనివచ్చి ♦ దండితోడఁ, బండినట్టి శ్రీహరిపైని ♦ బడియె నపుడు.
క॥ హరి యాఁకొనుచును గిదుకుచుఁ, గెరలుచును నడుమనడుమఁ ♦ గెవ్వునఁ గేకల్
బోరిఁబోరి వేయుచుఁ బొరలుచుఁ, జరణంబును జాచుచల్ల ♦ శకటముఁ దన్నెన్.
తే॥ పిదపఁ దద్ధతి నాబండి ♦ పెళపెళపెళ, విఱిగి పాడఱె నందలి ♦ సురరిపువును
నీల్గి నెత్తురూపుఁగని హరి ♦ కెరఁగి గోజ, గమున కరిగె శతాశ్వర ♦ థంబునెక్కి.
ఆ॥ అమహార్తమున య ♦ శోమతీనందాది, గోపగోపికలల ♦ కూలినట్టి
బండిరొదనువించు ♦ దండినివిడనాడి, పనులమాని యటకు ♦ వచ్చియరయ.
తే॥ అల్ల పిల్లనికడనున్న ♦ యర్భకతతి, యందఱము మేముగుమిఁగూడి ♦ యాడుతఱిని
బాలుఁ డాఁకొని యేడ్చుచుఁ ♦ బదమున నొక, బండినిం దన్నెనని చెప్ప ♦ వారలు విని.
మ॥ అరరే యీతఁడు మూడుమాసములవాఁ, ♦ డాబండి నేదండితోఁ
జరణంబున్ గొనితన్నె? వీని హతికే ♦ సర్వార్థముల్ వ్యర్థమై
పరగంగా నదినింగికేగి పుడమిన్ ♦ బాతంబుగాఁ జాలెనా?
యరయన్ బాలకులాడు మాట నిజమే ♦ నా? యద్భుతంబయ్యెడిన్. ౪౪౭
ఆ॥ అని విచిత్రమొంది ♦ రవలయశోదయుఁ, బిల్లవాని యేడ్పు ♦ వినుచువచ్చి
పాలు గుడువవయ్య ♦ గోలఁజేయకుమయ్య, యంచు జన్నుఁ గుడిపె ♦ నవలఁ బ్రేలు.
చ॥ చిడిముడిపాటునన్ జెలఁగు ♦ చీడలఁ బీడల నూడఁగొట్టఁగా
విడిముడి నిచ్చి జన్నముల ♦ విప్రులచే నొనరింప సల్పి చే
పడెడి పిశాచ బాధయును ♦ బాడువడన్ బొనరించిరయ్య! నా
వుడు మునినాథ! మున్నునల ♦ పోకిరి యేఁడటుఁ బొందె మోక్షమున్. ౪౪౯

ఉత్కచాసుర పూర్వజన్మ వృత్తాంతము.

T 2049

చ॥ అని యడుగంగ మాని ముద ♦ మందుచు నిట్లనె నోనరేశ్వరా!
మునుపు హిరణ్యలోచనుని ♦ పుత్రకుఁ డుత్కచనాముఁడై శుభా
యనమగు లోమశాశ్రమము ♦ నర్గి యటన్ గలచెట్లఁ గొట్టివే
సె నదియు లోమశుండు గని ♦ భీయని యిట్లు శపించె వానినిన్. ౪౫౦
ఉ॥ దుర్మతి! యుత్కచా! తరుల ♦ దుంపలతోడుత నూడఁబీకి నీ
దుర్మదమంతఁ జూపితివి ♦ తోడ్తన దుష్కృతరీతి సర్పముల్

వర్ణము వీడునట్లొడలు ♦ వాయువు నీల్గుమనంగ వాఁడు త
న్మర్మము గుర్తెఱింగి యల ♦ మౌనిపదంబుల వ్రాలి యిట్లనెన్. ౨౫౧
తే॥ మౌనిచంద్ర! కృపాసింధు! ♦ మాన్యచరిత, నీదువి స్తృతమహిమము ♦ నేనెఱుంగ
నాదు తప్పుమన్నించి ♦ నయనములను, జల్లఁగాఁజూచి మోక్షము ♦ సంగు నాకు
తే॥ పిదపమౌనీంద్రుఁడెదమెచ్చి ♦ విధి నెఱింగి, యుత్కచా! వాయురూపమ్ము ♦ నొందిచాలు
మంబుసనుమీఁద వైవస్వ ♦ తంబునందు, హరిపదస్పర్శమోక్షమ్ము ♦ నందఁగలవు.
తే॥ అని కరుణతోడఁబల్కెనో ♦ యనఘ! సుజన, కోపమేక క్షణంబున్న ♦ శాపమూడ్చి
యైహికాముష్మికసుఖంబు ♦ లందఁజేయుఁ, గానిపెదదారిఁబోవదో ♦ క్ష్మాత్యధీశ!
తే॥ ఇట్టివరమున నుత్కచుం ♦ డట్టిరీతి, వాయువిగ్రహుఁడైహరి ♦ పాదమంటి
పరమధామము నెందె న ♦ వక్రవిక్ర, మక్రమా! మీఁదిహరికథ ♦ మఱియు వినుము!

బాలకృష్ణుండు తృణావర్తునిం గూల్చుట.

చ॥ ఒకపరి నాయశోద తన ♦ యూరువునందున నాటలాడు బా
లకు స్మితవక్త్రు లాలనము ♦ లర్థిబొనరించెడిలోన నట్టి పు
త్రకుఁడచలేంద్ర భారుఁడయి ♦ తారసిలన్ వెరవేమి లేకయో
పికధరఁబెట్టి భీతిలుచు ♦ వీఁడెటు పర్వతభారుఁడయ్యెనో! ౨౫౬
తే॥ ఇలను బాలకులెందఱో ♦ కలరుగాని, యిట్టిబిడ్డను నేనెప్పు ♦ డెందుఁజూడ
ననుచు ముక్కున వ్రేలిడి ♦ తనరునంతఁ, గంసునాజ్ఞఁదృణావర్త ♦ కర్బురుండు.
తే॥ నందు వ్రజమొంది సుడిగాలి ♦ నాల్గుదెసల, బిట్టువీచుచుఁగన్నుల ♦ మట్టిఁగొట్టి
జగము నంధకారంబుగా ♦ సల్పిఘోర, శబ్దముం జేసి కృష్ణుని ♦ సంగ్రహించె.
చ॥ ఇటు ఘటికాద్వయంబు గను ♦ లింతయు విప్పఁగ రానియట్లు చీఁ
కటులును దుమ్ముగ్రమ్ము సుడి ♦ గాలి, సెలంగుటఁ గాంచలేక పి
మ్మట వడితో యశోద, స్వకు ♦ మారుని నెల్లెడఁజూచి మూఢి యె
చ్చటఁ గనలేక కన్నులను ♦ జల్లల నశ్రువులొల్క నిట్లనెన్. ౨౫౯
ఉ॥ నాయన! కృష్ణ! యేభవ ♦ నంబున నుంటివో యెట్టులుంటివో
యే యెదకేగితో సుజను ♦ లేరయినన్ నినుజూచియుందురే
నా యెద నిల్వలేదకట! ♦ నాగతియెట్లొకొనంచు నెంతోవా
పోయియుఁ జూచుచుండె సుర ♦ భుల్ మృతవత్సముఁగాంచు చాడ్పునన్. ౨౬౦

వ॥ అనంతరంబునందు గోకులంబందలి సుందరీ మణులా యశోదార్తోదనంబు వినిరోదిరో పుట్టిమున్గెనని యెంచి పఱతెంచి యామెవలన హరి వృత్తాంతం బంతయు నాలించి చింతించి యోచించి విచారించుచుండ బ్రహ్మాండనాయకుండగు నబ్బాలకుండును తృణావర్తుండను రక్కసునితో వియన్మండలమందు లక్షయోజనంబులుజని క్రమంబుగా మేరుధరాధరతుల్యభారుండై వాని మూఁపునందు

పాదుండగీఁడు. ౪౬౧

ఉ॥ మోయఁగలేను వీని నిఁక ♦ బొట్టెగదా యని యొప్పియుంటి న
బ్బో యచలేంద్రమంచు విడఁ ♦ బోవుట కృష్ణుఁ డెఱింగి కంఠమా
హాయనుచట్టిపట్టుకొన ♦ నా యసురుండు నయో! యయో! యయో!
యోయికుమార! నన్నువిడు ♦ మూపిరు లుంపుమటన్న వెన్నుఁడున్. ౪౬౨

చ॥ మెడ బిగఁబట్టి యాయసురు ♦ మింటనె చంపఁగ వానిజోలి య
ప్పుడె ఘనుసిన్ దటిత్తువలెఁ ♦ బొందెఁ దదచ్యుతునందు నంత దై
త్యుఁడు దివినుండి కృష్ణసహి ♦ తుండయి తుండెములౌనటుల్ శిలన్
వడిఁబడెఁ దద్ధ్వనిన్ గదలఁ ♦ బాఱె వసుంధర మ్రోఁగె దిక్కులున్. ౪౬౩

ఆ॥ అంత గోపకాంత ♦ లదిగాంచి యరుదెంచి, సంతసించి కృష్ణు ♦ సంగ్రహించి
యందునున్న నంద ♦ సుందరినిం బిల్చి, యెలమితోడనిచ్చి ♦ యెంచిరిట్లు. ౪౬౪

ఆ॥ పూర్వభవములందుఁ ♦ బుణ్యవ్రతంబులఁ, జేసినామొ, నిజమె ♦ చెప్పినామొ
సాధుసేవ, భక్తి ♦ సల్పినామో కాని, యాశవిడిన వీఁడు ♦ హాయిదొరకె.

చ॥ అని ముదమొంది గోపసతు ♦ లమ్మ! యశోద! ప్రమాదముం ద్యజిం
చి సిసువుఁ బెంపవమ్మ! పరి ♦ శీలనఁ జేయఁ గుమారునోరు దూ
పను వెలిబాఱెఁ బ్రత్తిపువు ♦ భాతిని గావునఁ బాలనిచ్చి డో
ల నితని నిద్రపుచ్చి పను ♦ లన్ మఱిఁజూడుము గూడదాలమున్. ౪౬౬

ఉ॥ ఈవిధినిన్ వచించి తమ ♦ యిండ్లకు నేగిరి బాలుహాయి గో
పావళి యాలకించి ముద ♦ మందెను బిమ్మట సూనునిన్ యశో
దావనజాక్షి యంకమునఁ ♦ దారిచియున్ జనుఁబాలనిచ్చి మో
హావృతయాచుఁ గోకఁగొని ♦ యశ్రువులద్దుచుఁ జాల జాలితోన్. ౪౬౭

ఉ॥ రోహిణి! దైవమొక్క కొమ ♦ రున్ దయనిచ్చెను గాని పుత్రసం
దోహము నీయలేదు గద ♦ తుష్టినిఁ జెందుదుమన్న వీనికే
సాహసికాపకారములు ♦ సర్వము గల్గెడి నెప్డు ప్రాణసం
దేహమె కాని తిండిఁదిని ♦ తేటగనుండఁడె ప్రస్తుతంబునన్. ౪౬౮

ఉ॥ మిత్తిమొగంబునుండి విడి ♦ మేదిని కీతఁడువచ్చె నారయన్
జిత్తము దత్తరిల్లెడిని ♦ జేయుట కేమియుఁ దోఁపలే దెటన్
జొత్తు, నిఁకెందు నుందు, విధి ♦ సూడ నదృష్టము కృష్ణుఁడుంట నా
విత్తము, వస్త్రముల్, బ్రతుకు, ♦ వేశ్మములన్నియు నున్నవయ్యెడిన్. ౪౬౯

ఉ॥ ఈ కొడుకే యరిష్టముల ♦ నేమియుఁ జెందకయున్నచో ధరా
నాథుల కర్థదానముల, ♦ నవ్యగృహంబుల దేవతాళికిన్

శ్రీకమలేశపూజలను, ♦ జేసెదనమ్మరో! నేను వీనినిన్
గైకొని "యంధయష్టి" వలెఁ ♦ గాలము యాపనసేయ నుంటిఁగా. ౪౭౦

## బ్రాహ్మణులు శ్రీకృష్ణునికి రక్షసేయుట.

చ॥ అని యనునంతలోన ద్విజు ♦ లందఱు సుందరనందమందిరం
బున కరుదెంచి నందుఁడిడు ♦ పూజల నోజ గ్రహించి దీవనల్
బొనరిచి యయ్య! మీ సుతుఁడు ♦ బొందఁ డనర్థము, సౌఖ్యసంపదల్
గనుఁ, జిరజీవియై యలరుఁ ♦ గావునఁ గుందకుఁడంచుఁ బ్రీతితోన్. ౪౭౧

చ॥ నవకుశ పల్లవంబులను ♦ నవ్యజలంబులఁ గర్ణ పేయ సం
స్తవముల, వేదసూక్తులను, ♦ స్వస్తివచస్సుల, సామగీతులన్
సవము యథావిధిన్ జరిపి ♦ చక్కఁగ నగ్నికి నర్పనల్పి మా
ధవునకు రక్షసేసిరిటు ♦ దానవిధానవిదగ్రణీ! గుణీ! ౪౭౨

వ॥ దామోదరుండు చరణంబులను, విష్టరశ్రవుండు జానువులను, శ్రీహరి యూరువులను, శ్రీకృష్ణుండు నాభియు, రాధికాధవుండు కటిభాగంబును, పీతాంబరుం డుదరంబును, బద్మనాభుండు హృదయంబును, మధురానాథుండు ముఖంబును, ద్వారకారమణుం డుత్తమాంగంబును, నసురాంతకుండు పృష్ఠంబును, శ్రీపరాత్పరుండు సర్వప్రదేశంబులను రక్షించుగాకయని యా పాపని దీవించిరి. ౪౭౩

ఉ॥ అంతట నందుఁ డాద్విజుల ♦ కావులు లక్షను, లక్షవస్త్రముల్
వింతలగొల్పు రత్నములు ♦ వేయి, దశాధికలక్షవిత్త, మ
త్యంతవిధేయుఁడై యొసఁగి ♦ యంపి స్వబంధుసుమిత్రలోకమున్
సంతసమొందఁజేసె మణి ♦ జాలసువర్ణధనాంబరంబులన్. ౪౭౪

తే॥ అని వచింపఁగ జనకుండు♦హర్ష మొంది, నారదా! తృణావర్తుఁడ♦నశ్వరుఁడగు
హరిని లీనమైపోయెఁద♦దాదిమజని, నెవ్వఁడైయుండునోయాతఁ♦డెఱుఁగఁ జెప్పుము!

## తృణావర్త పూర్వజన్మవృత్తాంతము.

చ॥ అనవుడు నారదుండనియె ♦ నాతఁడు పాండుధరాధిపుండు య
జ్ఞనిరతుఁడచ్యుతాంఘ్రి జల ♦ జస్థితచిత్తుఁడు ధర్మనిష్ఠుఁడున్
ఘనబలుఁడున్ వదాన్యుఁడు గఁ ♦ గ్రాలియు రేవతటంబునందు వే
కనులను గల్గి వేసతులఁ ♦ గాముకుఁడై వసియించె నయ్యెడన్. ౫౭౬

తే॥ అటకు దుర్వాసుఁడన్ముని♦యరుగుదెంచె,నప్పుడాతఁడుగనియుసా♦ష్టాంగనతుల
సల్ప లేదది గన్నయా ♦ సంయమి గని, మచ్చరీ! యసురుండవై ♦ మలయుమిలను.

వ॥ అని శాపంబు నొసంగ నొచ్చి మదియం ♦ దాపాండుభూపాలుఁ డో
మునినాథా! భవదీయ పాదముల నా ♦ మూర్ధంబునన్ దాల్తు వే

నను రక్షింపు మటంచు వేడ ముని యా ♦ నారాయణస్పర్శచే
తను మోక్షంబును జెందనుండు మనియో ♦ ద్ద్రీతి నా భూపుఁడున్. ౪౭౮

తే॥ ధరఁ దృణావర్త నామక ♦ దానవుఁడును, గట్టితనమునఁ దిర్గుచుఁ ♦ దుట్టతుదను
నట్టి నందునిపట్టిని ♦ నంటి యట్లు, ముక్తిఁ బొందెను బహులాశ్వ ♦ భూవరేణ్య!

వ॥ అంత నొక్కనాఁడు యశోదాదేవి. ౪౮౦

సీ॥ కనకమణి ప్రభా ♦ కనదురుడోలికా, రత్నమందుఁ బరుండి ♦ క్రాలువాని
దృష్టిదోషము వాపు ♦ తిలకంబు వానిని, జిన్నారి పొన్నారి ♦ చిన్నవాని
నంతము లేనట్టి ♦ వింతలు గలవానిఁ, గాలి వ్రేల్గుడుచుచుఁ ♦ గదలువాని
నల్లవానిని జిన్ని ♦ నగుమోము వానిని, గాటుక గలతమ్మి ♦ కనులవాని

తే॥ కృష్ణచంద్రుని సూనుని ♦ కృష్ణతోడఁ, గాంచి తనతోడఁ గూర్చుండఁ ♦ గా నొనర్చి
పాలనిచ్చి ప్రమోదముఁ ♦ జాలజెందు, చుండ హరి యావులించుచుఁ ♦ జూపె జగము.

తే॥ అద్దియా మెయిఁ గన్గొని ♦ యరరె యేమి!, బ్రహ్మముఖులైన దేవతల్ ♦ వఱలి రహహ
యర్కుఁడే విశ్వమంతయు ♦ నగపడెడిని, ననుచు వింతతోడుతఁ దన ♦ కనులమూసి.

తే॥ పిల్లఁ డెటఁ బోయెనో యను ♦ భీతిచేత, కనులఁ గ్రమ్మఱఁ దెఱచియుఁ ♦ గాంచలేక
సొమ్మసిల్లెను నందుని ♦ సుదతి తపము, నలఁతి వర్ణింపఁ దరమా నె? ♦ యవనినాథ!

యశోదానందుల పూర్వజన్మవృత్తాంతము.

క॥ అనవుడు నారద! నందుఁడు, దనసతితోఁ గలిసి యెట్టి ♦ తపమొనరించెన్
ఘనుఁడగు శ్రీహరి వారికిఁ, దనయుండయి కల్గుటేల ♦ తప్పక చెపుమా! ౪౮౪

తే॥ అనఁగ మౌనియు నిట్లనె ♦ నష్టవసువు, లందు మేల్బంతియైన ద్రో ♦ ణాహ్వయుండు
ధరయనెడి భార్యతోఁ గూడి ♦ హరిని గొల్చు, చుండి సుఖముగా దివమేలు ♦ చుండెఁ గాని.

ఉ॥ బిడ్డలు లేని కారణము ♦ పెల్లుగఁ జింతలఁ బెట్ట నాతఁడా
గడ్డుపనిన్ నివారణము ♦ గా నొనరింపఁ దలంచి యాలితో
నడ్డులేక మందరకు ♦ లాచలమొంది విరించిఁ గూర్చి చే
పడ్డ ఫలానిలాంబువులఁ ♦ బర్ణములన్ క్షుధఁ దీర్చు చొక్కెడన్. ౪౮౬

ఉ॥ పుట్టలు వెట్ట ఘోరతప ♦ ముల్ బొనరింపఁగ నర్బుదాబ్దముల్
నెట్టన బ్రహ్మ వచ్చి యత ♦ నిం గని ద్రోణ! తపంబు మెచ్చితి
న్దిట్టవె కాని యేవరము ♦ నీవడుగన్ మదినెంచియుంటివో
గట్టిగఁ జెప్పి కైకొని సు ♦ ఖంబును గాంచుమటన్న ద్రోణుఁడున్. ౪౮౭

చ॥ ధరయను భార్యతోఁ గలిసి ♦ తత్క్షణమందున మీఁదిపుట్టలన్
సరగున నెట్టు చా విధికి ♦ సాగిలి మ్రొక్కి దయాపయోనిధీ!
సురకులశేఖరా! కరుణఁ ♦ జూచి జనార్దనుఁ డాత్మజుండుగాఁ
బొరయు నటుల్ ఘటించి ప్రియ ♦ పూరితభక్తిని మాకొసంగుమా! ౪౮౮

ఉ॥ ఇయ్యది తప్పవేఱొకటి ♦ యెద్దియు వల్దని వేడ బ్రహ్మ యో
యయ్య! యలభ్యమౌ వరము ♦ నడ్గితి వైన మఱొక్కజన్మమం
దియ్యది సెందనుందువని ♦ యేర్పడఁ జెప్పి తిరోహితుండుగాఁ
జయ్యన ద్రోణుఁడుర్వ ధరయు ♦ సంతసమందుచు నేగిరింటికిన్. ౪౮౯

తే॥ అంత ధర, యశోదయనంగ ♦ నవనియందు, ద్రోణుఁడుర్వ నందుఁడనఁబుట్టి ♦ తుష్టినుండ
బ్రహ్మవాక్యంబు నిజము స♦ల్పంగ మధుర, నుండి వారికిసుతుగ ♦ శ్రీశుండు సనియె.

చ॥ మధుకముకంటె, యుక్తవిధ ♦ మాఁగిన మామిడిపండు కంటె నా
మధుపునకంటె, నాచెఱకు ♦ మాధురికంటెను, ద్రాక్షకంటె, నా
మధుసుధకంటెఁ, దియ్యనయి ♦ మాటికిమాటికిఁ గోర్కెఁజేయు నీ
మధురిపుసత్కథామృతము ♦ మంగళదంబయి యుంట నాదిలోన్. ౪౯౧

మ॥ హరి, శృంగాచలమందు నాకొసఁగె, నే ♦ నాపైన నద్దాని నా
నరనారాయణమౌనివర్యులకు నా ♦ నందంబుతోఁ జెప్పి యీ
పరి నీకాడి కృతార్థతన్ జెలఁగితిన్ ♦ భ్రాజత్ప్రభావోదయా!
మఱి యీవేమివినంగఁ గోరెదవొ? యా♦మాటల్ వెసన్ బల్కుమా! ౪౯౨

క॥ ఏతద్రీతిని నడుగఁగ, నేత, యలరి కృష్ణుఁడచట ♦ నిసువయి యేమే
సేఁతలఁ జేసెనొ యాకత, నీతఱి ననుకంపను వచి ♦ యింపు సురర్షీ! ౪౯౩

తే॥ అనఁగ నారదుఁడిట్లనె ♦ నవనినాథ! యట్టి వసుదేవుపంపున ♦ నరమున యదు
కులపురోహితుండైన గ♦ర్గుండు వ్రజము, సనఁగ నందుండు పూజించి ♦ సన్నుతించి.

గర్గుండు గోకులంబునకేగి రామకృష్ణులకు నామకరణంబులఁ గావించుట.

ఉ॥ ఓమునివర్య! నావ్రజము ♦ నోఁచుటచేతఁ బవిత్రమయ్యె నీ
యే మిపుడే కృతార్థులము ♦ నీయనువంశము ధన్యమయ్యె మీ
రీమెయి నా కుమారులకు ♦ నీ సుకుమారుల కాదరంబునన్
నామములన్ ఘటించి కరు♦ణన్ గృతిగా నను జేయ వేఁడెదన్. ౪౯౫

చ॥ అని వినుతింప నామునియు ♦ నట్టులె చేసెద నంచు నొప్పి నం
దునిఁ గొనిపోయి యొంటరిగ ♦ దుర్నయకంసుఁడు సేయఁబోవుబా
ధను వివరించి యియ్యది మి ♦ ధస్థలమందునఁ జేయునొనటం
చు నుడివి యావ్రవేశుఁడు, య ♦ శోదయు, వేడ్కను జూచుచుండఁగాన్. ౪౯౬

చ॥ తొలుత నవిఘ్నమస్తనుచు ♦ ధూర్జటినందనుఁ బూజసల్పి య
వ్వలను నవగ్రహంబులకు ♦ భక్తిని నర్చలొనర్చి యంత బా
పలకు సమగ్రదక్షిణ ల ♦ పారముగానిడఁజేసి దేవతా
వలికి నమస్కరించి యిటు ♦ వల్కెను నందుని కోనరేశ్వరా! ౪౯౭

ఉ॥ రోహిణి కాంచినట్టి కొమ ♦ రుండు, మునీంద్రహృదబ్జపంక్తి న
వ్యాహతమౌ విహారము ప్రి ♦ యంబున సల్పుటచేత, భక్తిస
న్నాహసమేతులన్ నిజగు ♦ ణంబులలో రమియింపఁజేసి యా
యైహికపారమార్థికము ♦ లందు రమించుట రాముఁడయ్యెడిన్. ౯౯

తే॥ గర్భసంకర్షణమున సం ♦ కర్షణుఁడన, రేవతికి భర్తయగుటను ♦ రేవతీశుఁ
డనఁగ బలశాలులందున ♦ నతిశయుండు, నగుటఁ బట్టియు బలుఁడన ♦ నతిశయిల్లు.

క॥ నందా! మఱిసుతుపేళ్ళు, నందంబుగ వినుము శోభ ♦ నప్రదముల్ ద
ద్బృందారక వందితముల్, సందేహనివారకములు ♦ సద్గతిదంబుల్. ౧౦౦

సీ॥ కమలావిభుఁడగుఁగ ♦ కారంబుచేతను, శ్రీరాముఁడగును ఋ ♦ కారమునను
షడ్గుణయుక్తుఁడౌ ♦ స్వచ్ఛసితద్వీప, కాంతుండునగును ష ♦ కారమునను
నారసింహుఁడగు ణ ♦ కారంబుచేతను, నల యకారంబుచే ♦ నగ్నిభుక్కు
నగు విసర్గముచేత ♦ నల నరనారాయ, ణాఖ్యమునీంద్రులు ♦ నగుదురందు

తే॥ వలనఁ గృష్ణాభిధానమె ♦ లలితమౌను, గానఁ బెట్టితిని యుగయు ♦ గంబులందు
ధవళరక్తపీతరుచులఁ ♦ దత్తదుచిత, రీతిఁ దాల్చుచు జగతి వ ♦ ర్తిల్లునయ్య! ౧౦౧

చ॥ అదియునుగాక ద్వాపరయు ♦ గాంతమునన్ గలియాదికాలమం
దుదయము సెంది కృష్ణతను ♦ నొందుటబట్టియుఁ గృష్ణనామమే
కుదిరెడి, నీసుపుత్రకున ♦ కున్, వృషభానులలాము గీమునం
దొదవిన రాధకున్ బతిగ ♦ నుంట నితండగు రాధికేశుఁడున్. ౧౦౨

తే॥ వసువులను నింద్రియంబుల ♦ వఱలు దేవ, తలమనంబులఁ దగుచుఁ బ ♦ నులను నెల్ల
నాచరించుట వాసుదే ♦ వాఖ్యగూడఁ, గలుగు నీ కుఱ్ఱనికి ముంద ♦ నిల ప్రజేశ!

ఉ॥ శ్రీకరుణాకరుండును, న ♦ శేషజగత్పతి శేషశాయి, గో
లోకనివాసియైన హరి, ♦ లోలుభుఁడై యిట నాత్మజాతుఁడై
నీకుఁ జెలంగెఁ గంసముఖ ♦ నిర్జరవైరుల రూపుమాప స
ల్లోకముఁ బ్రోవ భూభరము ♦ లుప్తముగా సలుపంగ; దేవరా! ౧౦౪

ఉ॥ ఆపరమేశు లీలలును ♦ నాఖ్యలు సూడఁగ వేదగుహ్యముల్
పాపవినాశకంబులయి ♦ భ్రాజిలుఁ ద్వద్గృహమందు నాతఁడే
పాపఁడుగా జనించెఁగద! ♦ భాగ్యమదేమని సన్నుతింతు నీ
వే పరిపూర్ణధన్యుఁడవు ♦ వింతలుగా వని యేగె భూవరా! ౧౦౫

గర్గుండు వృషభానుని దరికరిగి రాధాకృష్ణ ప్రశంసఁ జేయుట.

ఉ॥ నందుఁడునున్, యశోద, నిజ ♦ నందను లీలలఁ జూచి చూచి యా
నందము వొందుచుండి రల ♦ నైష్ఠిక గర్గమునీంద్రుఁ డల్ల శా

ళింది తటంబునందున వె ♦ లింగెడి నా వృషభానుపట్టణం
బొంది చేరం దదాలయము ♦ నెయ్యునఁ దద్వృషభానువర్యుఁడున్. ౧౦౬

సీ॥ శ్వేతాతపత్రంబు ♦ వేయుటచే నిర్జ, రేంద్రుఁబోలుచునుండు ♦ నిద్ధభోగి
దండంబుఁ బట్టుట ♦ ధార్మికవరుఁడైన, ధర్మునిఁబోలు న ♦ దభ్రతనువు
బ్రహ్మతేజంబుచు ♦ బలముగాఁ బొందుట, సూర్యునింబోలెడి ♦ నార్యవర్యు
బుస్తకమేఖలా ♦ శస్త్రహస్తుండౌట, బ్రహ్మకైవడినుండు ♦ బ్రాహ్మణవరు

తే॥ తెల్లపుట్టంబులంగట్టి ♦ తేజరిల్లు, చుంట విష్ణునికైవడి ♦ నొప్పుచుండు
గర్గమునివరు భక్తితోఁ ♦ గాంచిలేచి, మ్రొక్కి గద్దియనిడి పాద ♦ పూజసల్పి.

ఉ॥ ఉత్తమలోకపర్యటన, ♦ మర్విని శాంతినిఁగూర్చి సర్వలో
కోత్తరమై మనుష్యముల ♦ మూఢ్చి పవిత్రముజేసి తీర్థసం
పత్తురచించి దివ్యమగు ♦ పదరేణుండ నొనర్చునప్డు నా
చిత్తగతాఘపుంజములఁ ♦ జెండుట చిత్రమె మౌనినాయకా! ౧౦౭

చ॥ మునివర! నాకు రాధయను ♦ ముద్దియ యొక్కతె కల్గె దాని నే
ఘనునకొసంగుమన్నఁ దమిఁ ♦ గానలవానికి నిచ్చెదన్ జుమీ
యనవుడు తన్మునిప్రవరుఁ ♦ డా వృషభానునిఁ దోడుకొంచు ని
ర్జనయమునాతటస్థలిన ♦ రాసరి జేరి వసించి యిట్లనెన్. ౧౦౮

ఉ॥ ఓ వృషభాను! గోపకుల ♦ నుత్తముఁడై భగవంతుఁడై మహా
దేవముఖాదిదేవుఁడయి ♦ దివ్యజగత్ప్రభుఁడై పరేశుఁడై
గోవిభుఁడై వ్రజాధిపున ♦ కుం దనయుండయి వెల్గు కృష్ణుఁడే
యీ వనితామతల్లికకు ♦ నాత్మవిభుండగునట్లొనర్పుమా! ౧౧౦

క॥ అందులకతఁ డానందముఁ, బొందుచు శ్రీకృష్ణమూర్తి ♦ పుట్టగ నేలా?
నందుని నందనుఁడై వ్రజ, మందుండుటయేల? నుడువు ♦ మా! యన మునియున్.

మ॥ అవనీభారముఁ దీసి వేయుటకుఁ గం ♦ సాదిద్విషద్ధింసకై
సవముల్ప్రోవఁగ బ్రహ్మ వేడ హరి యా ♦ జన్మంబు సెందెన్ దదీ
యవధూరత్నముతన్నిశాంతమున రా ♦ ధాభిఖ్యతోఁ గూడి సం
భవముంబొందెఁ బ్రధానమేయదిగ నా ♦ వాక్యమ్ము లాలింపుమా! ౧౧౨

చ॥ అనవుడు బాగుబాగనుచు ♦ నావృషభానుఁడు స్వీయభార్యతో
ఘనముగ యోచనల్ సలిపి ♦ కాఁగల కార్యముఁగూర్చి మోద బా
ష్పనికర మొల్కఁ గృష్ణుని న ♦ పారతపఃఫలధర్ముఁడైన యా
మునివరుతోడ నిట్లనియె ♦ మోడ్చి కరంబుల మైథిలేశ్వరా! ౧౧౩

తే॥ ఈవు సెప్పినరీతి శ్రీ ♦ కృష్ణమూర్తి, కిచ్చి పెండ్లిని నొనరింతు ♦ నిద్ధిపీదు
దయఘటిల్లెను గావునఁ ♦ దదుపయమమ్ము, మీరె చేయుట బాగని ♦ కోర మునియు.

వ॥ ఈ రాధాకృష్ణవివాహంబు నిర్వహించి నేను సేయింప సమర్థుండను గాను. మఱియేమంటివేని యమునాధునీతటంబున విలసిల్లు బృందావనంబునకుఁ జెంగటనున్న భాండీరంబను వనంబున నిర్జనంబయి నయనపర్వంబొనర్చు నొక్క ప్రదేశంబున సురాధినాథుండగు నప్పితామహుండే వచ్చి తత్పరిణయంబు సేయించు. మఱియుఁ దద్దుహితను శ్రీకృష్ణార్థాంగిగా గుర్తెఱుంగుము. త్వద్భవిష్య జ్జామాతయగు శ్రీకృష్ణుండు గోలోకంబున నివసించు పరమేశ్వరునిగాఁదెలిసి కొనుము. వీరాఱల్ల రాలోకంబునుండియే యాగతులైతిరి. ఇదియంతయు నీ రాధాదేవి సంకల్పజనితంబని భావింపుము. ఎవరి దర్శనంబు, నరామరముని వరులకు దుర్లభంబై దుర్ఘటంబై యున్నదో యట్టివారు నీ నట్టింట గోపికాగోప సహితులై విరాజిల్లఁగలరని పలుక నాయాలుమగలు పెల్లుమోదిల్లి శ్రీరాధాకృష్ణ ప్రభావం బెఱింగి క్రమ్మఱ రాధాశబ్దనిర్వచనంబు సేసి తత్తత్త్వమంతయుఁ దెలిపి కృతార్థులఁ జేయవే యని ప్రార్థించుచు నతండిట్లనియె. ౹౹౧౹౹

ఆ॥ రమ రకారమయ్యె ♦ రాజిల్లు నాకార, మాదిగోపియయ్యె ♦ నా ధకార
మా ధరిత్రియయ్యె ♦ నాకార మావిరజాభిధాన,సతియు ♦ నయ్యె ధీర! ౹౹౧౬

ఉ॥ ఈ విధి గంధమాదనమ ♦ హీధరమందున సామవేదపుం
భావమటంచు మాధవుఁ ♦ వక్త్రిమురుండియె వింటిఁగృష్ణుఁడన్
దేవుని తేజునాలుగగు ♦ తెన్నులుగానయి లక్ష్మి, భూమి లీ
లా విరజాహ్వయంబులఁజె ♦ లంగి లయించెను రాధలోపలన్. ౹౹౧౭

తే॥ దానిచే రాధ పరిపూర్ణ♦తమ యగుటను, రాధికాకృష్ణుఁడంచు వి♦రతియు లేక
శాంతి దాంతి సమేతులౌ♦శాస్త్రవిదులు, జపముసల్పుచునుంద్రుని♦శ్చంచలముగ

క॥ రాధాకృష్ణాయనునది, బోధపడన్ దలఁచుచున్న ♦ పురుషులు శుభముల్
సాధుజనమైత్రిఁ గని యా, గోధామముఁ జేరఁ గలరు ♦ కువలయ నాథా! ౹౹౧౯

క॥ అనవుడు నావృషభానుం
డును జిత్రమువొందియుండు ♦ డున్ శ్రీగర్గుం
డును వృషభానుని పూజలఁ
గొని నిజధామమున కేగె ♦ క్షోణీనాథా! ౹౹౨౦

తే॥ ఒక్కదినమందు శ్రీనందుఁ♦డొయ్యనొయ్య,నాత్మభవునంకమందుంచి♦యాలఁద్రోలు
చల్ల యమునా నదీతట♦మందునున్న, వాయుకంపిత భాండీర♦వనికిఁబోయె. ౹౹౨౧

## నందుండు నందనునింగొని భాండీరవనంబున కేగుట.

ఉ॥ అత్తఱిఁ గృష్ణు నిచ్చ మొగు ♦ లాకసమందున నుండఁ బయ్యరల్
జిత్తము తత్తఱిల్లునటుఁ ♦ జెట్టులు గూలెడిరీతి వీవ నం

ధా త్ధరి త్రి గా మఱి మ ♦ హా భయదంబయి కన్పడంగ నె
త్తెత్తుచుఁ గుఱ్ఱఁడేడ్చుట వి ♦ జేశుఁడు గర్గుని భీతభీతుఁడై. ౧౨

తే॥ అంకమండలి పుత్రకు ♦ నాతురమునఁ, బట్టుకొని చిత్తమందునఁ ♦ బరమభక్తిఁ
బతితపావను, భగవంతుఁ, ♦ బరమపురుషు, నమ్మి శరణువాంఛించు కా ♦ లమ్ములోన.

ఉ॥ కోటికళానిధి ప్రభల ♦ గోటను మీఱెడి తేజుగల్గి లా
లాటికమాస్యమందిడి ల ♦ లంతికఁ, గంకణ, తార, హారముల్
హాటకభూషలన్ మెఱసి ♦ శ్యామల వస్త్రములన్ ధరించి బ
ల్మీటుగనుండు రాధయను ♦ లేమ, సమక్షమునందు భాసిలన్. ౧౪

చ॥ అదరి యతండు ప్రొక్కులిడి ♦ యంజలిఁగూరిచి యాకుమారుఁడే
గద యలవిష్ణు, వీవితని ♦ కాంతల యందున ముఖ్యురాలవై
కుదిరితి గాదె! గర్గముని ♦ కుంజరుఁ డెంతొరహస్యమంచు ని
య్యది వచియించె వీనిని మ ♦ దంకమునుండి గ్రహింప వమ్మరో! ౧౫

ఉ॥ వారిదభీతుఁడైనటుల ♦ వర్తిలు వీని గ్రహించి క్రచ్చరన్
జేరిచి నాగృహంబునకుఁ ♦ జేసెడి నానతులందుకొమ్ము రా
ధారమణీమణీ! యనఁగఁ ♦ దద్వనితామణియిట్లు పల్కెనో
ధీరవరేణ్య! నీవినుతి ♦ తృప్తి ఘటించుట దాని నొప్పితిన్. ౧౬

ఉ॥ నావుడు నందుఁడీ వటుల ♦ నాకుఁ బ్రసన్నతఁబల్కుచున్నచో
భావుక యుష్మదంఘ్రియుగ ♦ పద్మనిబద్ధసుబుద్ధినిచ్చి భ
క్తావళిమైత్రి యెప్పుడగు ♦ నట్టుల దేవిరో! చేయుమన్న రా
ధావనితాలలామయుఁ "ద ♦ థా స్తు" ని యాతని యంకమందునన్. ౧౭

ఉ॥ సూరునితీరు వెల్గెడి య ♦ శోదకిశోరుని నాత్మభర్తను
న్గౌరవరీతిఁ గొంచు, నల ♦ నందుఁడు గన్గొని ప్రొక్కియేగ, భాం
డీరవనాంతరంబునఁ గ ♦ డింది ప్రియంబునఁ జేరి నిశ్చయా
కారము దాల్చి నద్దెసలఁ ♦ గాంతులఁ బర్వుచునుండు నంతలోన్. ౧౮

శ్రీరాధాకృష్ణులకు వివాహమహోత్సవంబు రహస్యంబుగా జరుగుట.

శా॥ గోలోకంబుననుండి భూమి, యటకున్ ♦ గోమేధికాదిప్రభా
హేలా భాసురహేమరూపమును నెం ♦ తేన్ దాల్చి యేతెంచె నీ
చీలీలోల్ల సదర్కపుత్రి, కనక ♦ శ్రీ రత్నశోభాంచితో
ద్వేలారోహణ సౌధముల్ గలిగి దీ ♦ ప్తిన్ జెందె హర్షంబుతోన్. ౧౯

ఉ॥ దేవతరూత్కరంబు, వ్రత ♦ తివ్రతతుల్, ఫలపుష్పసౌరభో
జ్జీవిత శీతవాతములుఁ ♦ జిత్రఖగోద్గతకర్ణపేయ నా

నానావిధకూజితంబులు, న ♦ నంతకళల్ సెలువారమీఱు బృం
దావన మన్ని తెన్నుల ను ♦ తంబయి యచ్చటఁ జొచ్చి ముచ్చటల్. ౧౩౦

తే॥ రత్నశిలలును, సెలయేళ్లు♦గాలి సొగసు, నింపుగుహలను బంగరు♦నీటుగలుగు
శిఖరముల్ గల్గి మెల్లెడఁ♦జిత్రరుచులఁ, బర్వి గోవర్ధనాద్రియుఁ ♦ బరఁగ నచట.

సీ॥ కాసారదీర్ఘికా ♦ ఖాతపద్మాకర, కూప ఘటీయంత్ర ♦ దీపితంబు
ప్రాకారకుట్టిమ ♦ ప్రాంగణ చత్వర, సౌధవీధీ సభా ♦ సంయుతంబు
శారికాపరభృత ♦ కీరపారావత, శ్రవణపర్వధ్వని ♦ సంగతంబు
హైమపతాకాధ్వ ♦ జాలంబ సౌత్సుక్య, భటవర్యనికరవి ♦ భ్రాజితంబు

తే॥ బరిమళత్పుష్పవాసనా ♦ వాసితంబు, మత్తషట్పద ఝుంకృతి ♦ మానితంబు
భవ్యవాసంతమాధుర్య ♦ భాసురంబుఁ, గుశలదంబైనయొండు ని ♦ కుంజమలరె.

తే॥ అందు నా యచ్యుతుండు పీ ♦ తాంబరములఁ
దాల్చి కౌస్తుభరత్న వే ♦ త్రిమురళులను
గొని వినీలమేఘప్రభఁ ♦ దనరి కోటి
మన్మథాకార రమ్యుఁడై ♦ మంగళమతి. ౧౩౩

మ॥ విలసద్భూషణ వామబాహువున సం ♦ ప్రీతిస్మితాస్యంబుతో
లలనారత్నము రాధికన్ గొనుచుఁ ద ♦ ల్లాజాహరిద్రాంబుభృ
త్కలశాలంకృతి కుంకుమాక్షత కుశ ♦ క్షౌమాదివైవాహికా
ర్థలసన్మండపమందుఁ జేరి యలరెన్ ♦ దత్సింహపీఠంబునన్. ౧౩౪

క॥ ఇరువురు సింహాసనమున, వఱలినతఱి విద్యుదంబు ♦ వాహములవలెన్
మెఱసిరి పిమ్మట నటకా, పరమేష్ఠియు వచ్చి మ్రొక్కి ♦ ప్రణుతించె నిటుల్.

ఉత్సాహ॥ హరి! యనాదిమధ్య నిధన ♦ యప్రమేయ! యవ్యయా
వరద! పరమ! నిర్వికల్ప ♦ భక్తకల్ప! రాధికే
శ్వర! యగణ్య భువననాథ ♦ చక్రపాణి! శార్ఙ్గి! నే
శరణు నిన్ను జెందుచుంటిఁ ♦ జక్కఁ జూచి ప్రోవుమా. ౧౩౬

శా॥ లీలా లోలుఁడవై చెలంగెడితఱిన్ ♦ లీలావతీనామయై
గోలోకంబున నీమె యామతిలు వై♦ కుంఠాధినాథుండవై
క్రాలన్ లక్ష్మియనంగ నీజనని వి ♦ భ్రాజిల్లు రాముండవౌ
కాలంబందున నీమె సీతయగు నో ♦ గ్రావోత్తమోద్ధారకా! ౧౩౭

క॥ హరివిగ జన్మించిన తఱి, నరవిందాలయగఁ బుట్టు ♦ యజ్ఞుండనఁగన్
బరఁగుతఱి దక్షిణాఖ్యను, వఱలును గద యీమె భక్త♦వత్సల! కృష్ణా. ౧౩౮

తే॥ నరునిఁ గలిసి నారాయణ ♦ నామకుఁడవు
గాఁగ నీసతిమణి శాంతి ♦ నాఁగ ఛాయ

భాతిన్ నరహరివియై ♦ పరఁగుతఱి ర
మాహృది యనంగనొప్పు వ ♦ లాహకాభ ! ౧౩౯

సీ॥ ఎప్పుడు బ్రహ్మవై ♦ యెసఁగెద వపుడీవె, పరఁగుఁ దటస్థయౌ ♦ ప్రకృతి కృష్ణ !
యెప్పుడు కాలమై ♦ యెసఁగుచుందువొ యప్పు, డీవె ప్రధానమౌ ♦ సిద్ధచరిత !
యెపుడు శరీరప్ర ♦ వృద్ధవిరాట్టువో, యపుడీవె ధారుణి ♦ యగును దేవ !
యెపుడు చతుర్విధ ♦ వృద్ధాంతరాత్మవో, యపుడు లక్షణవృత్తు♦లగును తండ్రి
తే॥ యెపుడు జగదంకురాదిమ ♦ హేతువైన
పృథుమహత్తువై యుందువో ♦ యీవె యపుడు
సగుణ మాయయై రాధ నా ♦ జన్మమొందు
నందనందన ! సుందర ♦ కుందరదన. ౧౪౦

తే॥ గౌరమేచక కాంతులఁ ♦ గలిగి రెండు, విధములౌ మహత్తును నీవె ♦ విశ్వయోని!
మఱియు గోలోకపతివీవె ♦ శరణొనర్తు, శరణుజేసెద నాయనా ! ♦ జలజనాభ.

మ॥ కరుణాభూషణ ! సత్యభాషణ ! జగ ♦ త్కల్యాణ కృత్ప్రాణ ! నే
ర్పరి వాద్యుండవు కేవలుండ వికనీ ♦ రాధాసతీరత్నమో
పరమై నిర్విడలేనిదై ప్రకృతియై ♦ భాసిల్లు. మీరిద్దరి
త్తఱిఁ బెండ్లాడుట లోకసంగ్రహము గా ♦ దా ! భక్తకల్పద్రుమా ! ౧౪౧

తే॥ ఇప్పుడిట మీకుఁ బెండ్లి జే♦యింప నన్ను, బిలిచితిరి లోకవిధి వింత♦గొలిపె సద్గు
ణాప్రతిమ! "యథా రాజా త ♦ థా ప్రజా" య,నియెడి నానుడి గననయ్యె ♦ నీరజాక్ష!

ఆ॥ కాన మీ యనుమతి ♦ నేను వేదోక్త ప
ద్ధతిని మీకుఁ బెండ్లిఁ ♦ గుతుక మతిని
జరుగునట్లు జేయఁ ♦ జాలుదునని యల్ల
ఘనవివాహ వేదిఁ ♦ జనియె నవల. ౧౪౨

ఉ॥ మంగళవాద్యముల్ శ్రవణ ♦ మాధురిగా మొఱయన్ సరస్వతీ
సంగుఁడభంగురాభరణ ♦ జాలలసద్వృషభాను పుత్త్రికా
మంగళకంఠమం దవని ♦ మండలనాటకసూత్రధారిచే
మంగళకార్యకారియగు ♦ మంగళసూత్రము గట్టఁజేసియున్. ౧౪౩

చ॥ చని మిథునంబు ముంగలఁ గృ ♦ శానుని బ్రజ్వలితున్ బొనర్చి యిం
ధనఘృతతండులంబుల య ♦ థావిధి హోమమొనర్పఁజేసి రా
ధనుఁ గమలాక్షుఁ గైకొని ప్ర ♦ దక్షిణముల్ దగ సల్పఁజేసి వే
ద్యను నిగమోక్త సప్తపది ♦ కార్యముగా నొనరించి పిమ్మటన్. ౧౪౪

చ॥ హరి యురమందు రాధకర ♦ మూ హరి హస్తము రాధమూర్ధ్మునన్
వఱలఁగఁ జేసి మంత్రములఁ ♦ బాఠమొనర్పఁగసల్పి హార మా

పురుషవరేణ్యు కంఠమునఁ ♦ బొల్తుక యా జలజాతుఁ డా సతీ
వరగళమందు వేయునటు ♦ బల్మఁగొనర్చి ముదన్వితాత్ముఁడై. ౧౪౭

ఉ॥ దంపతు లట్టి వహ్నికిఁ బ్ర ♦ దక్షిణముల్ మఱిఁజేయఁ జేసి బ
ల్సొంపుగనున్న గద్దియను ♦ సుస్థితులన్ బొనరించి వారు ధ్యా
నింపఁగ నైదు మంత్రముల ♦ నేర్పుగఁ జెప్పుచు రాధఁ జక్రికే
తెంపులులేక తండ్రివలె ♦ దానమొనర్చియు నొప్పగించుదున్. ౧౪౮

ఉ॥ మంగలికోళ్ళ గీతముల ♦ మాటికి మాటికి శోభ సెందె దే
వాంగన లాటపాటలను ♦ హర్షము సెందిరి దిట్టలైన మా
ర్దంగికపాణివాదులును ♦ దాళము వేసిరి మంచిపూల వా
నంగురియించి రంబరము ♦ నన్ విబుధుల్ బహులాశ్వ భూవరా! ౧౪౯

క॥ అంతట సదయుఁడు రాధా
కాంతుఁడు సంతోషమొంది ♦ కని యవ్వాణీ
కాంతుఁ దన పురోహితాగ్రణి
సంతసమున నిట్లుపలికె ♦ జనకనరేంద్రా! ౧౫౦

తే॥ కలుగఁబోవు ననర్థముల్ ♦ దెలిపి శ్రుతులు
వలుకురీతిని మెలఁగుచు ♦ మెలఁగఁజేసి
యైహికాముష్మికసుఖంబు ♦ లంది యందఁ
జేయువాఁడె పురోహితుఁ ♦ డోయి నలువ! ౧౫౧

ఆ॥ అట్టివాఁడవీవు ♦ హర్షించితిన్ గోర, వ మెటునీకుఁజేయ ♦ వలెనొ చెపుమ
యన్న నతఁడు మొ్రక్కి ♦ యచ్యుతా! నీపద, పద్మములను దలఁచు ♦ భక్తినిమ్ము.

తే॥ కాని మీసలపైనుండు ♦ తేనెలవలెఁ
జెలఁగు నైహికసుఖములు ♦ వలదు వలదు
జన్మమును గోరువారె యా ♦ సౌఖ్యములను
గోరవలెఁగాని యన్యుండు ♦ గోరరాదు. ౧౫౩

చ॥ అనఁగ రమేశ్వరుండును "త ♦ థాస్తు" ని పల్కఁగ బ్రహ్మ వందనం
బునిడి స్వమందిరమును ♦ బొందె ననంతరమందుఁ గుంజమం
దున హరి, రాధపెట్టిన చ ♦ తుర్విధదివ్యమనోహరాన్నముల్
గొని కడుపారఁగాఁ గుడిచి ♦ కోడిగమాడుచుఁ వేడ్కఁబోఁదులన్. ౧౫౪

చ॥ తములము రాధకియ్య నల ♦ తన్వి గ్రహించి గ్రసింప నా త్రివి
క్రముఁడు కరంబుచేఁ బ్రియ క ♦ రంబునుబట్టి విహార మందునన్
గ్రమముగఁ జేసె నిర్వురు జో ♦ కారముగా సరసోక్తులాడుచున్
దమకముఁ బొందు చూడుచును ♦ దాఁకుచు నుండిరి కృష్ణుఁ డావలన్. ౧౫౫

మ॥ వరబృందావననామదైవిక వన ♦ ప్రాబల్యసాఫల్యమ
చ్చెరువొందన్ గని, చూపి, మేచకరుచి ♦ స్నిగ్ధోర్మికాధోరణీ
సరసధ్వానవిభాసురోరుయమునా ♦ సంపత్తునుం గాంచి త
త్తరుణీరత్నము సూడనట్టు లచటన్ ♦ దబ్బాటునన్ దాఁగఁగన్. ౫౫౬

చ॥ ప్రియసతి యిట్లటుల్ వెదకి ♦ వృక్షముపై నొకకొమ్మచాటునన్
నియతిగనుండు భర్తఁగని ♦ నివ్వెఱపాటున నవ్వి పుట్టముల్
రయమునఁబట్టి లాగికొని ♦ క్రమ్మఱఁ బెన్మిటిఁ గాంచనట్లు ని
ర్భయమున నా నికుంజమునఁ ♦ బాఱుచు డాఁగె రహస్థలంబునన్. ౫౫౭

చ॥ తదుపరి మామమామ, వని ♦ తామణి రాధఁ గళిందపుత్రికా
నదిదరిఁ గుంజమందుఁ గని ♦ నవ్వి చెఱఁగును బట్టిలాగి వా
రిదము తటిల్లతన్ మెఱయు ♦ రీతిఁ దమాలము హైమవల్లిచే
గొదకొని వెల్గుమాడ్కిఁ జెలిఁ ♦ గూడుచు శోభిలె నో మహాప్రభూ! ౫౫౮

శా॥ ఆధిక్యప్రియరాసకేళులను బ ♦ హ్వానందమానట్లు శ్రీ
రాధాకృష్ణులు సల్పఁగాఁ దొడఁగి రా ♦ భ్రాజచ్చతుశ్శాలలన్
సౌధాగ్రంబుల, శారికాశుకపిక ♦ శ్రావ్యస్వనాంచద్వనీ
వీధిన్ వాసితపుష్పశయ్యల మఱిన్ ♦ బృందావనం బందునన్. ౫౫౯

ఉ॥ అర్థిసమూహకల్పతరు ♦ వైన రమాపతి రాధతోడ గో
వర్ధనశైలసానువులఁ ♦ బల్మఱు క్రీడలఁదేలి సత్కళా
వర్ధితలక్షపత్రయుత ♦ పద్మము నెచ్చెలి కేలునుండి లీ
లార్థముగా గ్రహించి యము ♦ నాపగ చెంతకుఁబాఱె నవ్వుచున్. ౫౬౦

ఉ॥ అత్తటి రాధ వెంటఁబడి ♦ యాహరి పచ్చని పట్టుపుట్టముల్
బెత్తము, వంశిఁ, గైకొనఁగ ♦ వెన్నుఁడు సూచి చెలీ! యిదేమి! నీ
చిత్తము భ్రాంతమయ్యెనొకొ? ♦ సిబ్బితి నూడఁగ బీక నేనటన్
జొత్తును నవ్వరొక్కొ నను ♦ జూచి జనుల్ దయనిమ్ము వానినిన్. ౫౬౧

చ॥ అన విని యామె యో ప్రియుఁడ! ♦ యందముగా నొక దండితామరన్
గొని కరమందుఁబెట్టుకొనఁ ♦ గోడిగమాడుచు నీవు దాని నేఁ
గనని విధిన్ గ్రహించి మఱిఁ ♦ గాలికొలందిఁగ బాఱుచుంటివే
ఘనమొకొ యిద్దిఁ గాన నివి ♦ కంజమొసంగిన యప్పు డిచ్చెదన్. ౫౬౨

ఉ॥ నావుడు నందపుత్రుఁ డల ♦ నాతిని గన్గొని కొమ్మ! కొమ్మరో!
యీ వరపద్మమందు నిడ ♦ నింతియు గైకొని వంశివేత్రముల్
శ్రీవసనంబు నిచ్చియు వి ♦ శేషముదంబును బొందె హాయిగా
నావనినట్టు లిర్వురు వి ♦ హారము సేసిరి రాజశేఖరా! ౫౬౩

ఉ॥ శ్రీరమణుండు పిమ్మట న ♦ శేషసుఖాకరమై చెలంగు భాం
డీరవనంబునందగి క ♦ డిందిముదంబున భార్యకెంతొ శృం
గారసుపత్ర భంగమిడి ♦ కన్గవఁ గాటుక దిద్ది సొమ్ములి
వ్వారిగఁ దొడ్గి పూవులను ♦ బాగుగఁగూర్చె ననంతరంబునన్. ౧౬౪
చ॥ కుతుకము సెంది రాధికయుఁ ♦ గూర్మిని భర్తకలంకరింపఁగా
యతనము సేయులోన నతఁ ♦ డాత్మ కిశోరత, వీడి తోనఁ జి
న్నతనము నొంది భూస్థలిని ♦ నాకుచు దొర్లుచుఁ గొట్టి కొంచు న
ద్భుతముగ నేడ్వసాగఁగద ♦ పూర్వనిజాకృతిఁ దెల్పుచున్ ప్రభూ! ౧౬౫
చ॥ అదిగని రాధ, భీతిపడి ♦ యయ్యరె! యెట్లు కిశోరతాకృతిన్
వదలె, నెటుల్ శిశుత్వమున ♦ వర్తిలె! నీ హరి; యో మనోహరా!
వదలితివేల? గోలనుగ ♦ ప్రాణములెట్లిఁక నిల్పఁజాలు! నా
బ్రదుకొ భవద్వశంబుగ, కృ ♦ పన్ ననుఁజూడవె యిద్ది వీడవే! ౧౬౬
చ॥ అని వెతనొందుచుండు సమ ♦ యంబున నంబరవాణి, యో సతీ!
వినుము భవిష్యమందితఁడె ♦ పెన్మిటి నీకగుఁగానఁ బూర్తిగా
వనటను మాను మన్న నల ♦ భామినియున్ సరియంచు నా హరిన్
గొని యల నందగేహమును ♦ గోరికఁ జేరి యశోద కిట్లనెన్. ౧౬౭

రాధ శిశువైన హరిని తిరిగి గోకులంబునకుఁ జేర్చుట.

క॥ అమ్మా! మును నీపతి పన, నమ్మధికమ్ముగను వీవ ♦ నా కిడ వీనిన్
నెమ్మదిఁ జూచుచుఁ గ్రమ్మఱ, సమ్మదమునఁ జేర్చు నాదు ♦ సదనంబునకున్.
తే॥ అని నుతింపగదానికే ♦ నభిమతించి, నాఁటగోలెఁ గాపాడుచు ♦ లోటులేక
తిరిగి తెచ్చితిఁ గొనుము నీ ♦ దివ్యపుత్రుఁ, బెట్టుపోఁతల జక్కఁగాఁ ♦ బెంపవమ్మ!
చ॥ విని యది యామె హర్షమున ♦ బిట్టుకవుంగిలిఁ గొంచు నమ్మ! యీ
దినము శుభప్రదం బెడఁద ♦ దిట్టముగాఁ దొడఁగెన్ మదీయ పు
త్రునినిడి వేడ్కఁ గూర్చితి ను ♦ తుల్ నినుఁ జేయఁగ శేషుఁడాగునే?
యని బహుపూజలన్ సలిపి ♦ యంప స్వగేహము సేరె రాధయున్. ౧౭౦
చ॥ ఇటుల రహస్యమై యలరు ♦ నీ కమలాపతి సత్కథాస్థితిన్
దిటముగ విన్నవారలును, ♦ దివ్యముగాఁ బఠియించువారు, ను
త్కటముగ వ్రాయువారు నిజ ♦ కల్మషశైలము లెల్లఁ గూల్చి యం
తట హరిధామ మొందుదురు ♦ తథ్యము పథ్యము భావరాగ్రణీ! ౧౭౧

శ్రీకృష్ణ బాలలీల.

వ॥ అంత నా వ్రజంబునందా మాయామానుష విగ్రహులగు రామ కృష్ణులు గౌరనీలవర్ణంబుల విరాజిల్లుచు రోహిణీయశోదల పెట్టుపోఁతల దినక్రమం

బున శుక్లకళానిధివోలె వర్ధిల్లి పదంబులయందలి యందియలు గల్లుగల్లని మ్రోఁగ దోఁగి యాడుచుఁ దల్లుల యంకంబుల నధిరోహించి నయనంబుల విలాసంబులఁ జూపించుచుఁ గ్రీడించుచు నెక్కొక్కమాఱు సూపఱు లచ్చెరువొంద ఫణంబు విప్పిన నాగసర్పంబుమాడ్కి శిరంబునిక్కించి భుజపాదంబులఁబాఱుచు వచ్చుచుఁ బోవుచుఁ జిఱునగవు మొగంబున మొలకలెత్త మనోహరులై వసియించుచు సింగంపుఁ గొదమలై వడి నిర్భయంబుగా బాలలీలలం గావించుచు నీలపీతాంబరంబులం గట్టి కండ్లఁగాటుక మెఱయ నవరత్నఖచితభూషణంబులుఁ బొలుపార ముజ్జగంబుల ముద్దులకుఁ బెన్నుద్దులై తద్దయు వెలుంగు కుమారులను, దల్లులును, గోపికలును, గాంచుచు నిజగృహకృత్యంబులనైనను మఱచుచునదలఁజాలక యచ్చటనే నివసించి పెల్లుమోదిల్లుచుండిరి. ఆ నందుండును నిజమందిరంబునందు సింహశాబకసదృశుండును, నందనుండునునగు చిన్నికృష్ణుని లీలలం గాంచుచు నానందించుచుండె. అవల నా యశోదాదేవి దృష్టిదోషంబాపఁ గొంపోవుతఱి గోపిక లామె కిట్లనిరి. ౫౭౨

ఉ॥ అమ్మ; యశోద! యెప్పుడు త్వ ♦ దాత్మజు నాటలకై గ్రహించి బా
హ్యమ్మున కేగవల్దు సుతుఁ ♦ డయ్యెను దుగ్ధముఖుండు వీని శీ
ర్షమ్మునఁగాకపక్షము వి ♦ రాజిలెడిన్ బయిపండ్లు రెండు నూ
ర్ధ్వమ్మున వీనికుండుటఁ గ ♦ ఠంబగు గండము మేనమామ కౌ. ౫౭౩

తే॥ మేనమామయు వీనికి ♦ మెలఁగఁడయ్యెఁ, గానఁ దోషము వీనికే ♦ కలుగుఁ గనుక
హాని తొలఁగుట కొఱకయి ♦ దానములను, భూసురామరగోవేద ♦ పూజసలుపు.

చ॥ అనఁగ యశోద, రోహిణియు, ♦ నందుల కొప్పి సుతోల్లసార్థమై
ధన మణి, సౌరభేయ, వసు ♦ ధా, ఘృత, వస్త్ర, సువర్ణ, దానముల్
బొనరిచి దేవ, గో, నిగమ ♦ భూసుర పూజలసల్పి రాసుతుల్
గొనకొని హేలఁదప్పటడు ♦ గుల్ ధరఁబెట్టుచు సింహదృష్టితోన్. ౫౭౫

తే॥ తద్ద సరిసమానులగు శ్రీ ♦ దామ, సుబల, ముఖసఖులఁగూడి ఖేలనం ♦ బుల నొనర్చి
వేడ్క నుద్యానవనముల, ♦ విమలయమున, పులినముల విహారములను ♦ సలిపిరవల.

ఉ॥ బాల విలాసహాసముల ♦ భామిను లెంతయు సంతసంబుతో
సోలునటుల్ వొనర్చి యటు ♦ సూచి యిటుల్ సని మిత్రయుక్తుఁడై
పాలను, వెన్న మీఁగడను ♦ బాగుగఁ బేరిన జిడ్డుపెర్గు, గో
పాలుర యిండ్లఁదూఱుచు న ♦ వారిగ శ్రీహరి గోల్చుచుండెఁగా. ౫౭౭

ఆ॥ ఒక్క దివసమందు ♦ నుపనందు సుందరి, యగు ప్రభావతి తన ♦ యాలయమునఁ
గృష్ణుఁ డట్లుతస్కరించుటఁ బలుమాఱు, గనుచుఁ గనలి వ్రజము ♦ కడకువడిగ.

## శ్రీకృష్ణ దధిచౌర్యలీల.

చ॥ అరిగి యశోద కిట్లనియె ♦ నమ్మరో! నీదయ నాకు నీవలెన్
బెరుఁగును బాలువెన్నయును ♦ బెల్లుగఁ గా నవిహోయ భాండముల్

త్వరఁగొని వచ్చులోన నెటొ ♦ వచ్చుచు నీ కొమరుండు వానినిన్
చిఱునగవొప్పు మోమున గ్రి ♦ సించెను గించను నేను గాంచఁగాన్. ౧౨౯

ఉ॥ ఇట్టుల నెన్నిమాటులనొ ♦ యీతఁడు చౌర్యముఁ జేసెఁగాని వీఁ
డట్టి వ్రజేశ్వరాత్మభవుఁ ♦ డౌటను నీపయిఁ గూర్మిఁ గ్రమ్మఱన్
దిట్టుటఁగూడలేదు సుద ♦ తీ మణిరో! యన నాయశోదయున్
బట్టికి బుద్ధిసెప్పియుఁ బ్ర ♦ భావతితోడ నిటుల్వచించెడిన్. ౧౩౦

ఉ॥ ఓసి ప్రభావతీ! యిటు ల ♦ నుత్తమగోవులు కోటియుండెడిన్
నా సదనంబు పాల్పెరుఁగు ♦ నవ్యఘృతంబుల మున్నితేలు వీఁ
డే సమయంబునందు నవి ♦ యేమియుఁ దాకఁడె యెట్లు నీ బసన్
మోసముజేసి త్రాఁగె; నిది! బుద్ధికిఁ దోఁపదు గాని యేమనన్. ౧౩౧

ఉ॥ నీగృహమందు నెంత నవ ♦ నీతము పాలును బెర్గు నోయెనో
యాగతిఁ ద్రిగ్గి నావలన ♦ నయ్యవి చయ్యనఁ దీసికొమ్ము బా
గోగుల నీదు పుత్రికుని ♦ నోర్చిన యట్టుల వీని నోర్చుమా!
నాగలబన్ విడన్ సలిపి ♦ నాపయిఁ గూర్మిని వీడకుండుమా! ౧౩౨

చ॥ మఱియును నీగృహంబునకు ♦ మాకొమరుం డరుదెంచి యా
పెరుఁగును బాలు మీఁగడను ♦ వెన్నను దొంగిలి మ్రింగునప్పు ని
వ్వరుణను వాని నీడ్చికొని ♦ చయ్యన నాదరికేగుదెంచినన్
బరికెను దూఱుచున్ మిగుల ♦ బాఁదెద నెట్టెద గుంజఁ గట్టెదన్. ౧౩౩

చ॥ అనఁగఁ బ్రభావతీసతియు ♦ హర్షము నెంది స్వధామమొందె నో
జనకవిభూ! మఱొక్కతఱి ♦ సంగడికాండ్రను గూడి యేపునన్
వనరుహలోచనుం డల ప్ర ♦ భావతి యింటనె దొంగిలింపఁగాఁ
జని తలుపుల్ గవాక్షము ల ♦ సాధ్యవిధంబున మూసియుండుటన్. ౧౩౪

ఉత్సాహ॥ కంటఁ గాంచి నేస్తకాండ్ర ♦ కైలమీఁద నెక్కి యా
యింటిప్రక్క గోడఁజేరి ♦ యేరు సూడకుండ న
ట్టింట దూఁకి యుట్టి నున్న ♦ యెల్లగోరసంబులన్
గొంటకై కరంబులెత్తఁ ♦ గొంచెమేని నందమిన్. ౧౩౫

ఉ॥ ఱోలును వేసి దానిపయి ♦ రుంద్రసుపీఠమువైచి దానిపై
బాలుర నిల్వఁబెట్టి మఱి ♦ వారలపై వడి నెక్కి పూర్తిగాఁ
గాలును నెత్తి చేతుల సు ♦ కంబుగఁ జాఁచిన నందకుంట గో
పాలక బాలకృష్ణుఁడు న ♦ పారరుషన్ గని యాఁచి శీర్షమున్. ౧౩౬

ఉ॥ దండముఁగొంచు నుట్టి దృఢ ♦ తన్ బ్రహరించెను దానిచేత నా
భాండములెల్ల బ్రద్దలయి ♦ పాలును బెర్గును వెన్నముద్దలున్

దండిగ ధాత్రిపైఁ బడుటఁ ♦ దద్ధరియుర్ గని యవ్వ్రగోలెఁ ద
ద్భాండరవంబులోఁగల ప్ర ♦ భావతియున్ విని వచ్చి వెంటనే. ౫౮౭

ఉ॥ పాఱెడి బాలురంను హరి ♦ పాణిని గట్టిగఁబట్టి భీతి దై
వాఱగ లోచనంబులను ♦ బాష్పము లొల్కఁగ నందుమన్కికిన్
జేరిచి నిల్వఁబెట్టి వ్రజ ♦ శేఖరు ముంగలఁజూచి లజ్జతోఁ
జీరను మోముఁ గప్పికొనె ♦ శ్రీహరి చింతిలె స్వాంతమం దిటుల్. ౫౮౮

తే॥ ఈమె సెప్పిన నా తల్లి ♦ యెఱిఁగియెఱిఁగి, నన్నుఁ బడఁదన్ను గాననే ♦ నున్నరూపు
వదలి యీ పెఱుమారుని ♦ వలెఁజెలఁగినఁ, జెడుగు లేదని యారూపు ♦ సెందియుండె.

ఉ॥ అంతఁ బ్రభావతీవనిత ♦ యాగ్రహనిగ్రహబద్ధబుద్ధి గే
హాంతరమందునన్ జెలఁగు ♦ నట్టి యశోదను బిల్చి యమ్మరో!
వింతగనున్నదమ్మ! యిది, ♦ పెర్గుఘటంబులఁ గూలఁగొట్టి తా
నంతయుఁ ద్రాఁగె నమ్మ! యిపు ♦ డన్నములోనికిఁ గూడ లేనటుల్. ౫౯౦

క॥ మఱియొకపరి నీబుడుతఁడు, మఱుదెరువున నేగుదెంచి ♦ మాయింటను బా
ల్పెరుగుల, మస్తుప్పు, దినుతఱి, నరిగిన నాయత్తునూపి ♦ హాసియించి చనెన్.

క॥ ఇఁక నొకపరిసి బెరడున జ, లక మాఱెడి నాదుకడకు ♦ లంభించుచు నీ
దుకుమారుం డరుదెంచుచు, నకటా! నాకట్టుకొరక ♦ హరియించి చనెన్. ౫౯౨

ఆ॥ చెప్పరాని పనులఁ ♦ జేయఁగారాని సేఁ, తలను గోకులమునఁ ♦ గలకలంబు
గలుగ నీవిధమున ♦ సలుపుచు నుండెఁగా, యేమిసేయవలెనొ ♦ యెఱుఁగఁజెపుమ.

ఉ॥ ఇట్టులఁ జేయుఁ గాపురము ♦ నెట్టులఁ జేసెదమమ్మ! యిట్టి యి
క్కట్టులు మీకుఁ గల్గుతఱిఁ ♦ గష్టము సౌఖ్యము మీకుఁ దోఁచు, ని
పెట్టులఁ దోఁచునమ్మ! యిట ♦ నేమిఁక నుండగలేము వీఁడునుం
బాట్టెమె? రామరామ! యది ♦ వొందగ నేరదు వీనియందునన్. ౫౯౪

చ॥ అనవుడు నాయశోద యధి ♦ కాగ్రహమొందుచు నో ప్రభావతీ!
గనులను గంతదీసి యిటుఁ ♦ గాంచుము నీవు వృషాపవాదమున్
నెన రెదపీడి వాడితినె? ♦ నీతనయుం డవి తస్కరింప నా
తనయుఁడు సంగ్రహించెనని ♦ తెంటగఁ బల్కుట పాడియేమొకో? ౫౯౫

చ॥ అదివిని యాప్రభావతి, ము ♦ ఖాంబరముం దొలఁగించి పుత్రు ని
ష్పదుఁ గని యబ్రమొంది యెటు ♦ వచ్చితి విచ్చటికయ్య యింటికీ
యదనున రమ్మ పోవుద మ ♦ టంచుఁ దదర్భకుఁ గొంచు నేగ న
య్యాది గని నంద గోపబలు ♦ లావ్రజవాసులు నవ్విరంతటన్. ౫౯౬

చ॥ హరి, దొలిరూపునన్ జెలఁగి ♦ యాయమ వోమెడి బాటకడ్డమై
తరుణి! మదంబ కింకనిటు ♦ తప్పక చెప్పెదవేని నీమనో

హారపరరూప మొంది పరి ♦ హాసమొనర్చెద నంచుఁ బల్కు నా
సరసిజనేత్ర సిగ్గున స్వ ♦ సద్మముఁ జేరెను మైథిలేశ్వరా! గీ౯౭

తే॥ ఈపద్భావతి గతివిన్న ♦ యెల్లగోపి, కలును గృష్ణునిఁబట్టక ♦ గౌరవముగఁ
జూడ సాగిరి క్రమముగా ♦ శుక్లచంద్రుఁ, బోలికృష్ణుఁడు వృద్ధిని ♦ బొందుచుండ.

చ॥ క్రమముగ వృద్ధిసెందు హరిఁ, ♦ గంజదళాక్షుని నీలవర్ణునిన్
విమలుని దివ్యవిగ్రహుని ♦ వేడుకఁగాంచుచు నెల్ల వ్రేతలున్
దమిఁగొని ముద్దువెట్టుకొని ♦ ధామములందున నాట పాట లం
దముగ నొనర్ప సాగిరి గ ♦ దా యని పల్కు నరేంద్రుఁ డిట్లనెన్. గీ౯౯

తే॥ నారదా! నవనందోప ♦ నందనామ,ములను షడ్వృషభానుల ♦ పూతనామ
ములను మఱివారు సేయు ప♦నులను దెలుప,వేఁడుచుంటి ననంగ, నా♦విబుధమౌని.

నారదుఁడు నందోపనంద వృషభాను లక్షణంబులం దెలుపుట.

తే॥ రంగవల్లీశ రంగోజి ♦ మంగళులన, శ్రీశమంగళాయనులన ♦ శ్రీధరుఁడన
దేవనాయక విమలులన్ ♦దివ్యజనులు, భూమి నవనందులనుందు♦పూతచరిత!

తే॥ సాంబనీతిహస్రాగ్నిభు ♦ క్యాంతగోప,తి శ్రుతశ్రీకర వ్రజ ♦ దేవపావ
నులను పేళ్ళతో నుపనంద♦లిలను జెలఁగు, మందరని నీవెఱుంగుమో♦యుర్వినాథ!

తే॥ మఱిఁ బతంగుఁడు శుక్లుఁడు ♦ మార్గదుందు, దివ్యవాహనగోపేష్ట ♦ దివ్యనీతి
విదులనంగ షడ్వృషభాను♦లొదవఁగలరు, వారికుండు పె త్తనముల♦వరుసవినుము!

వ॥ శ్యామలాకారమనోహరులై హస్తంబులందు వేత్రంబులం దాల్చి శ్రీగోలోకనికుంజప్రధానద్వారంబు నాశ్రయించి యా శ్రీకృష్ణుని యనుగ్రహంబును సంపాదించు మహాత్ములు నందులనియు, వంశీబర్హంబులు సెలంగ సర్వాంగసుందరులై తన్నికుంజతోరణాంతికంబున విరాజిల్లు గోకోటులను బరిపాలించువా రుపనందులనియు, దండపాశంబులంగైకొని తల్లోకద్వారషట్కంబునందుండి తద్దుర్గంబులను, గాపాడు సమర్థులు వృషభానులనియు నెఱుంగుము. అంత ౧౦౪

చ॥ హరినుడి వారలందఱు ర ♦ యంబున గోజగముం ద్యజించి యీ
ధర కరుదెంచి తద్వ్రజము ♦ దార్కొని వెల్గిరి వారి శక్తి యం
దఱు పరమైన నెన్నఁగల ♦ మా! యల బ్రహ్మయుఁ బల్కు నాగునే
సురుచిరకృష్ణలీలలను ♦ జూచినవారె కృతార్థులో విభూ! ౧౦౫

శ్రీకృష్ణ మృద్భక్షణ లీల.

చ॥ నరవర! యొక్కనాడు యము ♦ నాతటినీతటమందుఁ జేరి త
త్సరసిజపత్రలోచనుఁడు ♦ సందియమేమియు లేక మట్టినిన్
బొరిఁ బొరిఁ జేతులంగొనుచుఁ ♦ బొక్కుట నబ్బలి నూచి యబ్బ! శ
ర్కరవలె నిద్దిబొక్కెదవె! ♦ కమ్రిపదార్థము లెన్నొయుండఁగాన్. ౧౦౬

తే॥ చాలుఁ జాలు నిసీయిసీ♦సరగ రార,సోదరా! యంచుఁ బిలిచినఁ♦జూచియతఁడు
రాక యాకరణిని బొక్కు♦రహించుచుంట, నెఱిఁగిబలుఁడు యశోదకు♦నరిగి చెప్పె.

ఆ॥ అంత నల్ల ముగుద ♦ యాత్మజుండింటికి, వచ్చినంత వాని ♦ పాణిఁబట్టి
పట్టి! యుక్కుపట్టు ♦ బాసినప్పటినుండి, సలుపుపనులు నాకుఁ ♦ దెలిసెఁగదర.

ఉ॥ అన్నములేకయా! మనకు ♦ నాఁకలిదీర, గుడంబులేకయా
యెన్నిన క్రమవస్తువుల ♦ నేమియులేకయ యేలకో యిటుల్
మన్నును దింటివయ్య! మఱి ♦ మాటవచింప వబద్ధమన్న నీ
యన్న గనుంగొనెంగదర ♦ యాగడమింతగఁ గూడునే సుతా! ౬౦౯

చ॥ అడుగఁగ నిట్టులట్టి కమ ♦ లాయత లోచనుఁడుర్ నిజాంబకే
బుడుతను గాను నాకును బు ♦ భుక్షయులేదు గృహంబునందు ద
ధ్గుడముఖ క్రమవస్తువులు ♦ గూడక పోవుటగాదు, కాని మీ
నుడువు లబద్ధముల్, గనుము ♦ నోటను వాసన యెట్టులున్నదో. ౬౧౦

క॥ చెప్పెడు మాటలు నీటును, దప్పక తెచ్చనను సామె ♦ త నిజంబౌ న
ట్లెప్పుడు ననుఁ బ్రహరింపఁగ, నప్పిన్నలు నీకుఁజెప్పి ♦ రమ్మా! రమ్మా. ౬౧౧

విశ్వరూప ప్రదర్శనము

క॥ అని తన మహాద్భుతాస్యాం, బును జూపఁగ నామె వాని ♦ భూధరతటినీ
వనవనధిభువన సురనర, దనుజాది సమేత వక్త్రి ♦ తామరసంబుల్. ౬౧౨

మ॥ కని యారా యఖిలార్ణవంబు లిచటన్ ♦ గన్పట్టె నాపట్టునన్
వనముల్ గన్పడుఁ నాదెసన్ నగములున్ ♦ వర్తిల్లు నీవెపునన్
మనుజుల్ దానవరాజులున్ దివిజులున్ ♦ మాగోపకుల్ గోవులే
నును నాభర్తయు నుంటి మిద్ది నిజమా ♦ నో కాదో! యేమాయయో. ౬౧౩

ఉ॥ కాఁడు సుతుండు నాకితఁడు, ♦ జ్ఞానపరీతపరాత్మ గానిచో
వీఁడు చరాచరప్రవృత ♦ విశ్వముఁ జూపఁగఁ జాలునే! యటం
చాడి యథార్థతత్వమని ♦ యక్కలి వాయ విరాగబుద్ధితో
వేఁడు యశోదరున్ గొలిపె♦ వెన్నుఁడు వైష్ణవమాయ భూవరా! ౬౧౪

ఉ॥ గోకులమందుఁ బ్రత్యహము ♦ గోపికలెల్లను లేచి వేకువన్
శ్రీకమలేశ సచ్చరిత ♦ రీతులఁ దద్ధిమంధనంబులన్
వాకొనుచుందు రందముగఁ ♦ బార్థివ! యొక్కదినంబునన్ యశో
దాకువలాక్షి పాడుచటుఁ ♦ దద్ధిఁ ద్రచ్చెడి కాలమందునన్. ౬౧౫

యమళార్జున మోక్షము.

చ॥ త్వరఁ దన పుత్రుఁ డమ్మ! చనుఁ ♦ బాలిడు వెన్ననొసంగుమంచు నూ
పురములు గల్లు గల్లనఁగఁ ♦ బోవుచు గంతులువేయు చట్టులి

ట్లురుగుచు వచ్చుచుర్ నగుచు ♦ నార్చుచుఁ జేతులఁజూపి గిట్టున
న్దిరుగుచుఁ గ్రమ్మఱన్ జనుచు ♦ నెట్టెను నెట్టన నట్టిమంథనిన్. ౬౧౬

చ॥ పగులఁగఁ ద్రోసి యట్లు పడెఁ ♦ బాలు కుమారునిఁ గాంచి వా
నిగతిని బట్టి యామె జన ♦ నేర్చిన నాతఁడు సిక్కకుండె దే
వగణమునీంద్రయోగి జన ♦ పంక్తికినెల్ల సలభ్యుఁడైన యా
యగణిత దివ్యమూర్తి యొక ♦ యంగన కెట్టులఁ జిక్కు భూవరా! ౬౧౭

చ॥ అటు దన తల్లి వెంటఁబడి ♦ యక్కలి మిక్కలి బొందుచుండుటన్
దటుకున భక్తవశ్యుఁడగు ♦ తద్ధరి గన్గొని చిక్కె నేమిరా!
యటమట నన్ను బెట్టినటు ♦ లంరఱఁ బెట్టుచు నుందువంచు ను
త్కటమగు కిన్కరేగి సుతుఁ ♦ గట్టఁగ ఱోటఁ దలంచి నెమ్మదిన్. ౬౧౮

చ॥ గుణమునఁ గట్ట బోజననది ♦ గొంచెము దక్కువగాఁగ లాఁతిదా
గుణమునఁ గట్టినన్ గొఱఁత ♦ గూడుట వేఱొకత్రాటఁ గట్టఁగా
నణువు కొలంతయయ్యె నిటు ♦ లన్నిగుణంబులఁ గట్టదయ్యె నా
గుణముల దాటు చక్రి యెటుఁ ♦ గూర్కొన నొప్పెడి నీగుణంబులన్. ౬౧౯

తే॥ అట్టులన్ ద్రాడులన్నియుఁ ♦ గట్టికట్టి, విసివి నొచ్చెడి తల్లిపై ♦ వీక్షణంబు
బఱపి భక్తవత్సలతఁ ద♦ద్బంధనంబు, స్వయముగాఁజెందె నారాజ♦చంద్రమౌళి.

చ॥ అరయఁగ నీప్రసాదము మ ♦ హాత్ముల కవ్యభిచారబుద్ధి సం
భరితమహానుభావుల క ♦ పార తపఃఫలధన్యమానిరా
ద్వరుల కభిజ్ఞయోగిజన ♦ పాళికి శూలికిఁ దమ్మిచూలికిన్
సిరికినిగూడ నెప్పుడును ♦ జేకురలేదని గుత్తెఱుంగుమా! ౬౨౧

ఉ॥ అత్తతి గోపికాలలన ♦ లయ్యెడకుం జనుదెంచి యాదిలోఁ
దుత్తుమురైన కుండఁగని ♦తోడనె మిక్కలి త్రాళ్ళ ఱోటికిన్
గుత్తముగాఁ గట్టఁబడి ♦ కొంకుచు జంకుచు నున్నవెన్నునిన్
జిత్తము దత్తరిల్లఁగని ♦ చెచ్చెరఁ బల్కి రిటుల్ యశోదకున్. ౬౨౨

తే॥ ఓయశోదమ్మ! మా యిండ్ల♦నురక యెపుడు, పెరుఁగుకుండలనిట్టులే♦పెల్లఁగొట్టు
చున్న మేము నీపట్టిని ♦ బిన్నవాఁడ, టంచుఁ దిట్టము కొట్టమో ♦ మించుబోఁడి.

క॥ లాలనమున దోషంబులు, బాలురకుఁ గలుగునెడి ♦ ప్రథవిని నీవీ
లీలను దండించితివో, గోల! యితం డెల్లఁబోటి ♦ కుఱ్ఱఁడు గాఁడే. ౬౨౪

క॥ అదరింపుము బెదరింపుము, కుదిరింపుము మంచిబుద్ధి ♦ గూర్మిని గానీ
కిదుకుచు నాడెడి బాలుని, గదియుచు బ్రహరింపవలదు ♦ కాంతామణిరో!

చ॥ పెరుఁగుఘటంబు పోయెనని ♦ పిల్లని నీవిధిఁ ద్రాళ్ళతోడ ని
ష్కరుణను గట్టియుంటి విది ♦ చాలదె జాలిని మాలి యిట్టులన్

పొరిఁబొరిఁ గొట్ట వత్తు విధి ♦ వోలు నెవీరును జాలుఁజాలు లే
నరగఁదోలంగు మన్న నల ♦ సాధ్వియుఁబోయెను లోని కింతటన్. ౬౨౬

చ॥ కమలదళేక్షణుండు బహు ♦ కాలమునుండియు మద్దిజంటయై
యమునదరిన్ జెలంగుట ద ♦ యామతిఁ గన్గొనిపోయి వాని మ
ధ్యమమున నాయులూఖలము ♦ నడ్డముగా మరలించియుండ నా
యమళమహార్జునంబు లిల ♦ యందు దళద్ధ్వనిఁ గూలె వేళ్ళతోన్. ౬౨౭

తే॥ అతుల నిర్మూలముగఁ బడి ♦ నట్టి రెంటి, సాలములనుండిఁ ద్రుటిలోనఁ ♦ గిలికిల
లుద్గతంబగు లైవడి ♦ నురురుచులను, సిద్ధులిద్ద ఱుద్గతులైరి ♦ సిద్ధిగనుచు ౬౨౮

ఉ॥ శ్రీదయితాంఘ్రియుగ్మగత ♦ శేముషి! వారటుబుట్టి యట్టి దా
మోదరుఁడైన బాలునకు ♦ మ్రొక్కి శిరంబున దీనరక్షకా!
నీ దయ మేము ధన్యులము ♦ నేఁటికిఁ బ్రాప్తనమౌనిశాపమున్
బేదఱికంబు బొందెఁగద ♦ విశ్వమయుండవు కాక బిడ్డవే. ౬౨౯

ఆ॥ ఎట్టిపాపియైన ♦ నేవిధంబుననైన, నాదికారణుఁడవు ♦ నక్షరుఁడవు
నైన నిన్నుఁ దలఁచె ♦ నేని దివ్యుండయి, పుణ్యలోకగంబుఁ ♦ బొందుఁగాదె. ౬౩౦

చ॥ ధనజనయౌవనాది జని ♦ తంబగు గర్వము లేశమేనియున్
గననివిధంబు భూసురులఁ ♦ గాని బుధావళిఁగాని చూచినన్
వినయవిధేయతల్ గలిగి ♦ వేమఱు గౌరవమాచరించు రీ
తిని మఱి నీ పదాబ్జములఁ ♦ దీరని భక్తి నొసంగుమో హరీ! ౬౩౧

ఉ॥ శ్రీదయితాయ ధూర్జటివి ♦ శేషసఖాయ నిరంజనాయ తే
సాదితపూతనాయ ఘన ♦ సారమృగీమదభాసితాయ హా
రాదివిభూషితాయ హరి ♦ హార్షితమౌనిజనాయ భూమిదే
వాదికులాశ్రయాయ అమ ♦ రాదినుసద్గురవే నమోనమః. ౬౩౨

చ॥ అని యిటు లారమాధిపతి ♦ నగ్గలిక స్నుతిసల్పి యుత్తరం
బునఁగల స్వస్థలంబులకుఁ ♦ బోయిరి నందుఁడు దొట్టివేలు త
ద్ఘనతరుపాతసస్వనము ♦ తత్పవిరావమటంచుఁ దత్థ్సలం
బున కరుదెంచి భీతి నటు ♦ మూలలఁ గన్గొన యెంతొ వింతతోన్. ౬౩౩

క॥ పవియూ పడలేదిటఁ బృధు, పవనంబా వివలేదు ♦ బలులెవరిందున్
దవులుచు గొడ్డట నఱికిన, నవనియు లేదెట్లు లిట్టి ♦ శాఖులు వడెనో. ౬౩౪

క॥ అని యందఱన్ని తెన్నుల, ఘనముగ శంకించుచుండు ♦ కాలమున నటన్
దనరిన బాలకులందఱు, వినియిట్టులఁ జెప్పిరయ్య! ♦ పృథ్వీనాథా! ౬౩౫

తే॥ అయ్యలార! యానందుని ♦ యాత్మభవుఁడు, వీసనాదున ఱోలును ♦ వేగమసరి
యడ్డముగ ముందుకీడ్వ నీ ♦ యవనిజములు, వడియె సిద్ధయుగంబిందు ♦ వెడలి చనియె

ఆ॥ అని వచింపఁ గొందఱా పల్కు లనృతంబు,లనిరి గొందఱునిజ మనిరి సంది
యంబు గొందఱందిరంత నందుఁడు నిజ,నందనుండు చెట్ల క్రిందఁబడక.

ఉ॥ పోఁడిమినున్న దానికిఁ బ్ర మోదముఁ బొందుచు వందయావులన్
దూడలతోడ బాపలకుఁ ద్రొక్కిలకుండ నొసంగి పట్టి క
ట్టూడఁగఁ దీయ నట్టి కప గోరుకుమారుఁడు దాను కోపు నా
జాడలు వారెఱుంగనటు సల్పెను జూపుల నాటపాటలన్. ౬౩౮

క॥ అనవుడు బహులాశ్వుఁడిటు, లనె నారద! వీరలిరువు రరయఁగ నెవరో
వనమాలి దర్శనంబెటు, దనరెనో వచియింపుమనఁగ దయఁ దన్మునియున్.

యమళార్జున పూర్వజన్మ వృత్తాంతము.

వ॥ భూపా! తొల్లిఁ గుబేరుని కుమారులగు నలకూబర మణిగ్రీవు లొక్క నాఁడు నందనవనంబుఁ జెంది మందాకినీతీరంబున నచ్చరలతోడ నిచ్చకువచ్చినయట్లు విచ్చలవిడిగా విగతవస్త్రులై విహరించుచు రమించుచు నాడుచుఁ బాడుచు వారుణీ మదిరాపానోన్మత్తులైయుండిరి. ఇయ్యెడ నయ్యెడకు దేవలమహర్షివరేణ్యుండు యాదృచ్ఛికంబుగాఁ జనుదెంచె. అట్టిపట్టున వారిరువురు నిజవయోధనబలరూ పంబుల గర్వించి యమ్మహామునిని లెక్కసేయరైరి. అద్దానింగన్న నామహానివరుండు మీరిరువురు దుష్టశీలురై ధనయౌవనమదాంధబంధురులై నిర్లజ్జులై వృక్షంబులఁ బగిది విహరించుచున్నవారు. కావునఁ బెక్కువర్షంబులు జనుదాఁక వనోకహంబులై యుండి ద్వాపరాంతంబున యమునాతీరంబుననుండు మహావనసమీపమునందుఁ బరిపూర్ణతమావతారుండును,గోలోకనాయకుండును,దామోదరుండునగు శ్రీకృష్ణుం గాంచి సంచితపాపవిముక్తులై మీయుక్తరూపంబులం బొందగలరని యనుగ్రహించి చనుడు వారలిద్ద ఱిద్ధరణినిఁ ద్రుదీతి నిరుమద్దులై జన్మించి తద్గోవిందసుందరపదార విందపరిస్పందంబున విగతపాపులై తదగాకారంబులం ద్యజించి పూర్వాకారంబులం దాల్చి యుత్తరదిశయం దలరారు నలకాపురియను నిజస్థానంబునకుఁ బోయిరని యెఱుంగుమని చెప్పి వెండియు నిట్లనియె.

దుర్వాసుండు గోకులంబందలి నందనందనునింగాంచి మోహంబుజెందుట

తే॥ ఒక్కసమయంబునందునన్ యోగివర్యుఁ,బరుఁడుఁ బరిపూర్ణతముఁగృష్ణు భక్తవత్స
లునిఁ గనంగ దుర్వాసుఁడన్ మునివరుండు, వేగవ్రజమండలంబునకేగుదెంచి.

ఉ॥ అవ్వలఁ బాలురంగలిసి యా యమునాపులినంబులందు బ
ల్జివ్వలఁజేసి ఖేలన వి చిత్రములన్ బొనరించి పోటిగా
నెవ్వడిఁ బాటి వచ్చి నగి నేలను దొర్లి దిగంబరుండునై
మవ్వపుమాటలాడు చిని మాణవకున్ గని కొంతిదప్పునన్. ౬౪౨

చ॥ కనఁగనఁగా మనంబునను ♦ గాఁ డితఁడా హరి, కాని వీఁడు నం
దునికొడుకై వసించునని ♦ తోఁచెడి నిశ్చయకృష్ణుఁడైనచో
గునగునఁబాఱి బాలకుల ♦ కూఁకటిఁబీకునె ? గెలిసేయునే !
యని తమిఁబొందె నంతఁ గమ ♦ లాక్షుఁడు తన్మునిచంద్రుఁ బ్రీతితోన్. ౬౮౩

ఉ॥ కాంచి స్వయంబుగాఁజని సు ♦ కంబుగ నామునియంకమొంది యే
తెంచుచుఁబోవుచున్ నగుచు ♦ దివ్యమృగేంద్ర విలోకనంబులన్
మించి మనోహరోక్తుల న ♦ మేయముగాఁ బలుకాడి తిర్గితో
తెంచి సమక్షమందు బహు ♦ దీప్తులు వెల్వడ నిల్చె నవ్వుచున్. ౬౮౪

ఉ॥ ఆ సమయంబునందు నగు ♦ నా హరిలోనికిఁ బూజ్యుఁడైన దు
ర్వాసుఁడు శ్వాసమూలమున ♦ బ్రాఁతిగఁబోవుచు నిర్జనాటవీ
భాసితలోకమొండుగని ♦ ప్రాప్తమిదెట్టుల నయ్యెనంచు నే
వేసటలేక తద్వనిని ♦ విస్మితుఁడై చరియించువేళఁదాన్. ౬౮౫

చ॥ అజగరవక్త్రిమందుఁబడి ♦ యందున సప్తజగద్బిలాన్వితం
బజిత మథఃప్రపంచమును ♦ నంతఁ గనుంగొని దానియందునన్
గజిబిజిగా భ్రమించి తెలి ♦ గ్రానముఁజేరి తపంబుఁ దత్ప్రభున్
భజనముసేయుచున్ సలిపె ♦ వత్సరముల్ శతకోటిదాఁటఁగాన్. ౬౮౬

వ॥ అంత నమ్మునికాంతుం డంను నైమిత్తికప్రలయంబు సంభవించి యఖిలార్ణవంబులేకముఖంబై యీక్షోణిని ముంచివేయుటం గని యవ్వాని నీఁది యీఁది విసివి తదంతంబుగానక స్మృతిదప్పి సహస్రయుగంబు లందే వసించి క్రమ్మఱలేచి యజ్జలంబులందుఁ దిరిగి యందు మఱియొక బ్రహ్మాండంబుఁగని సంచరించుచు నొక్క రంధ్రంబునం దూఱి యందలి సృష్టివిచిత్రం బెల్ల నాలోకించి సంతోషించి తదగ్రభాగంబున విరాజిల్లు నిర్ద్రుహిణాయు వెంతయు భ్రమించుటంగాంచి యందుఁ బ్రవేశించి శ్రీహరిని ధ్యానించి తదండంబునుండి నిర్గతుండయి మరల సలిలరాశింగని యందుఁ బొందుపడియున్న యనేకబ్రహ్మాండంబులను గాంచి చిత్రపడి యమునాపగాంతంబుసేరి తత్పులినంబులను, గోలోకగోవర్ధనంబులను జూచి గో, గోపికా, గోపక, కోటులతో నీటుగానుండెడి నొండుదండినికుంజంబునం జేరి. ౬౮౭

ఉ॥ నైకదివాకరద్యుతిక ♦ నత్స్పృథువేదిని లక్షపత్రకో
భాకర పద్మమం దలరు ♦ పంకజనాభుని రాధికేశు గో
లోకవిభున్ బ్రపూర్ణతము ♦ లోలుపతన్ గని క్రమ్మఱిల్లి యా
శ్రీకమలేశు శ్వాసమునఁ ♦ జిత్రముగా వెడలెన్ మహాప్రభూ ! ౬౮౮

చ॥ వెలువడి మౌని యట్లతనిఁ ♦ బిల్లని దివ్యకళిందజాపగా
లలిత వనంబునందుఁ జెలు ♦ లన్ లలిఁగూడుచు నాడువానిఁ, గ

న్నులఁగని యా పరేశుఁగన ♦ నూనముగా మదినెంచి ప్రొక్కులర్
బలుమఱు సల్పి సల్పి భయ ♦ భక్తులతో నిటు వేఁడె సాంజలిన్. ౬౪౯

దుర్వాసుండు వాసుదేవునిం గీర్తించుట.

మ॥ అనఘా! నిన్ను నలంతివానిఁగ మనం ♦ బందెంచి కాంచంగ నీ
ఘనతేజంబును నీ మహామహిమ నీ ♦ కాయంబు నీ సద్గుణం
బును నీసృష్టిచసుత్కృతుల్ జగములున్ ♦ బూర్ణంబుగా నాకు నీ
వనుకంపన్ దెలియంగఁ జూపితివిగా ♦ దా! భక్తచింతామణీ! ౬౫౦

క్రౌంచపదవృత్తము.

వారిదకేశా! స్మేరవిలాసా! ♦ భవభవభయహర! ♦ భవికదహస్తా
హారమనోజ్ఞా! ధీరసులభ్యా! ♦ యఖిలసుగుణనిధి! ♦ యమృగకరాస్యా!
సారసనేత్రా! భీరుశరణ్యా! ♦ సకలభువనధర! ♦ జలరుహనాభా
శ్రీరమణీయా! శ్రీరమణీశా! ♦ శివసఖ! కరముల ♦ శిరమునఁ గూర్తున్. ౬౫౧

తే॥ ఇట్లు శ్రీకృష్ణుఁ గొండాడి ♦ ఋషివరుండు, బదరికాననమొందె నో ♦ పార్థివేంద్ర!
యని జనకునకు నారద ♦ ముని వచించె, నదియె మీకిటుఁ బలికితి ♦ నమఁగమలుల.

ఉ॥ శౌనకమౌని గర్గముని ♦ సత్తముఁగూర్చి యిటుల్వచించె నో
మౌనివరా! రమేశుకథ ♦ మాధురి నీదయఁ గ్రోలియుంటి నా
పైని విదేహదేశపరి ♦ పాలకుఁడా ఋషివర్యు నారదున్
బూనిక నేమి యడ్గె నన ♦ బుద్ధిమదగ్రణి గర్గుఁ డిట్లనెన్. ౬౫౩

చ॥ మునివర! శౌనకా! వినుము ♦ భూపుఁడు నారదుతోడ భక్తి ని
ట్లనియె శుభప్రదంబు సక ♦ లాఘపయోధరతీవ్రమారుతం
బునగు నుపేంద్రసచ్చరిత ♦ మున్ మతి యా యవతారకృత్యముల్
వినరు మనంబునందునిచి ♦ నీవు వచింపుము మౌనిరాణ్మణీ! ౬౫౪

తే॥ అవలఁ దన్మునివర్యుఁడో ♦ యనఘ! తగిన
ప్రశ్న మొనరించియుంటివి ♦ పాపతాప
ఖండనసమర్థగోలోక ♦ ఖండమిపుడు
వింటివాపైనిఁ దత్కథన్ ♦ వినుము భక్తి. ౬౫౫

ఉ॥ దేవ! మహానుభావ! వసు ♦ దేవభవా! భవధాతృవంద్య! బృం
దావనరమ్యపర్యటన ♦ తత్పర! సత్పురుషాగ్రగణ్య! రా
ధావనితామనోజ్ఞ! దధి ♦ తక్రపయోనవనీతచోర! యిం
ద్రావరజా! ప్రపూర్ణతమ! ♦ యంబుజలోచన! పాపమోచనా! ౬౫౬

మాలినీవృత్తము॥ శ్రుతివిదిత సుకీర్తీ! ♦ సూర్యబింబస్థమూర్తీ!
హితవిహిత సమృద్ధా! ♦ వృద్ధిసిద్ధిప్రసిద్ధా!
రతిపతివిధుతాతా! ♦ రాసకేళీ సమేతా!
చతురతరవిలాసా! ♦ సచ్చిదానందభాసా!

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చివుకుల కులజలధికళానిధి, కోటమాంబాకామయ తనయ, లక్ష్మీదేవీ సుబ్రహ్మణ్య దత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వనిశ్చయ, సుజనవిధేయ, శ్రీనివాసాపరనామధేయాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన శ్రీగర్గభాగవతంబందలి గోలోకఖండము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ
హరిః ఓంతత్సత్
శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ గర్గ భాగవతము.

## బృందావన ఖండము.




రామానుజ వర్యా!
నీరజపత్రాయతాక్షు! ♦ నిఖిలసురేశా
ధీరసమర్చితపాదా!
ప్రారూఢజ్ఞానరూప! ♦ రాధాకృష్ణా! ౧

వ॥ అని యిట్లు చెప్పందొడంగె. భూపా! నందుండొక్కసమయంబందు నవ నందుల, నుపనందుల, వృషభానువులను, సహాయకారులను, మిత్రులను, గప్ట సుఖముల యం దాఱితేఱిన గోపవృద్ధులను బిలిపించి మహాసభం గావించి యందు నవ్వారల నుద్దేశించి తన రాష్ట్రంబునంగలుగు పూతనాతృణావర్తశకటాగమనతరు పాతాద్యుపద్రవంబులను వెలిబుచ్చి ప్రతిక్రియల నడుగ నాలకించి యందు దీర్ఘదర్శి యగు సన్నందుండను గోపవృద్ధుండు సకలజనమనోహారులగు రామకృష్ణులంగొని తనయంకమందిడి నందుని కిట్లనియె. ౨

### సన్నందుండు నందునకు బృందావనంబును వర్ణించి చెప్పుట.

ఉ॥ ఎందున నేయుపద్రవము ♦ లేమియు నుండవొ యట్టిదేశముం
జెందినఁగల్గు సౌఖ్యము సు ♦ శీలుఁడు నీకొమరుండు వీఁడె మా
యందఱ జీవనంబు సుమి! ♦ యర్థము ప్రాణము సమ్మదంబు నీ
నందను మించి యుండవని ♦ నమ్ముము నెమ్మనమందు నందుఁడా! ౩

క॥ అందున మనమందఱమూ, బృందావన రాజమునకు ♦ నిత్తఱిభార్యా
నందనసఖ గృహపరికర, బృందముతోఁబోయిన సుఖ ♦ యింపుఁగలముగా. ౪

క॥ అనవుడు నందుండిట్లనె, ననఘా యిదియెంతవఱకు ♦ నలముకొనెనొ యం
దునఁగల వీశ్రేట్టివియో, ఘనముగ జెప్పంగనిన్నుఁ ♦ గాంక్షింతు సుధీ! ౫

చ॥ అనవుడు ప్రాగుదగ్దిశల ♦ యందల బర్హిషదంబు దక్షిణం
బున మధురాపురంబును బ్ర ♦ మోదదశోణపురంబు పశ్చిమం
బునఁదగ నద్దియొప్పు నది ♦ పూర్తిగ నెన్బదినాల్గుక్రోసులన్
దనరును సార్ధయోజనము ♦ తద్విపులం బని పల్కె వెండియున్. ౬

ఉ॥ అంబరచుంబి భర్మమయ ♦ హర్మ్యములన్ నవరత్నదివ్యపీ
తాంబరహైమపణ్యముల ♦ సజ్జనవాలయహంసరమ్యవే
యాంబులసత్తటాకముల ♦ నందముబొందె ప్రయాగతీర్థరా
జంబునఁ బూజితంబయి ప ♦ సందగుఁ దన్మధురాపురంబహో! ౭

ఉ॥ ఆవిధి నొప్పు నామధుర ♦ యందిక లో వనరాజమౌచు బృం
దావనమొందు వర్తిలెడిఁ ♦ దద్వని సర్వమనోజ్ఞ కృష్ణలీ
లావని యుండు నందున వి ♦ హారముఁ జేసెడి వారిదైన భా
గ్యావధి నిర్ణయింపఁగల ♦ మా! వినుమా! యటచుండు సౌఖ్యముల్. ౮

క॥ ఇరువదినాలుగుక్రోసుల, వలుసున వ్యాపించినట్టి ♦ వనములు నందీ
శ్వర గోవర్ధన నగములు, మఱియు బృహత్సానుగిరియు ♦ మట్టుకొనెనటన్. ౯

తే॥ మలయమారుతం బాత్మీయ నులమునొంది, యమునపమీఁపగ నరుదెంచి హాయిపడుచు
సుమపరిమళంబులం గొని ♦ సురతరతులు, విరతులన్ స్వస్థపడునట్లు ♦ వీచుచుండు.

చ॥ మఱియు నికుంజసైకత స ♦ ముంజనవేదికలుండు వానిలో
సరసులు ప్రేలుప్రేతలు స ♦ జ్జనము క్రీడల సల్పుచుంద్రు మీ
రరుసమునన్ విహారముల ♦ నందునఁ జేయఁగ వచ్చుఁగానఁ జె
చ్చెర నిటనుండి లెండటకుఁ ♦ జేరుఁడు మీఱుఁడు సౌఖ్యపద్ధతిన్. ౧౧

తే॥ పసులకుంగావలసినంత ♦ కసవుగలదు, జలమె పీయూషతుల్యమై ♦ చెలఁగునచట
నంచు సన్నందుఁడన నతఁ ♦ డద్దియెపుడు, తీర్థరాట్పూజఁబొందెనో ♦ తెలియఁజెపుమ

చ॥ అనవుడు గోపవృద్ధుఁడిటు ♦ హర్షముతో వచియించె నో ప్రభూ!
మునుపు నిమిత్తజప్రలయ ♦ మున్ జనుదెంచినవేళ శంఖుఁడన్
ఘనసురవైరి వేదగణ ♦ కంటకుఁడై యొకఁడుండు వాఁడు దే
వనికరమున్ బరాజిత మ ♦ పారముగా నొనరించి యేర్తెలన్ ౧౩

చ॥ జలరుహయోనిలోకము నె ♦ స్సంజని నిద్రను గుజ్జువెట్టు నా
నలువను గాంచి పూతమగు ♦ నైగమవైదికలౌకికార్థికో
జ్జ్వలతరసంగతుల్ దెలుపఁ ♦ జాలిన ప్రాఁజలుకుల్ హరించి త
జ్జలనిధిలోనికిం జనియె ♦ సర్వదివౌకసు లక్కలింబడన్. ౧౪

ఉ॥ వేల్పులు గుందుచుండ నల ♦ విష్ణుప యజ్ఞవిభుండు గాంచి య
స్వల్పరఘుపాకృతిన్ జెలఁగి ♦ వాసికి నెక్కె సముద్రమును న

స్వల్పవిధంబునం దిరుగు ♦ శంఖసురారినిఁ జూచి వానితో
సల్పె సమిత్తు భీతికర ♦ శౌర్యధురంధరపూర్ణమూర్తియై. ౧౫

చ॥ సరగున వాఁడు స్వభ్రుకుటి ♦ సాల భయంబునుగొల్ప శూల మా
హరి నొసటన్ బడన్ విసరె ♦ నంతట నాహరి చక్రధార నూ
ర్పులియలు దానిఁజేయ నల ♦ రక్కసి యక్కమలాక్షు వక్షమం
దురవడిఁ గొట్టె దానికిని ♦ నోర్చి పరాత్పరుఁ డాగ్రహంబునన్. ౧౬

చ॥ గదఁగొని దైత్యపృష్ఠమునఁ ♦ గండలకావర మూడనైవ దు
ర్మదసురవైరి వ్రాలి నెత ♦ మగ్గి మఱిన్ వడిలేచి ముష్టితో
నుదురున గ్రుద్దెఁ జక్రియుఁ గ ♦ నుంగొని స్వీయసుదర్శనంబునన్
గుదిరిచి వానిగట్టి తలఁ ♦ గొట్టె నిలింపులు సంతసింపఁగాన్. ౧౭

తే॥ శంఖసమరూపు నసురునఁ ♦ సాధ్వసబలుని, శంఖనాముకు నిట్టులఁ ♦ జదిపి శ్రుతులఁ
గొనుచుఁ గడలిని వెల్వడి ♦ కావలఁ కుంబు, మీఁదికే తెంచె శ్రీహరి ♦ మేదినీశ!

ఉ॥ అంతఁ జతుర్భుజుండు సక ♦ లామరసార్థముగాఁ బ్రయాగరా
ట్ప్రాంతము జేరి వేదముల ♦ బ్రహ్మకొసంగి సవంబుఁ జక్కఁగా
నంతమొనర్చి యావలఁ బ్ర ♦ యాగునిఁబిల్చుచుఁ దీర్థరాజుగాఁ
జింతదొలంగి సంతసము ♦ నొందగఁ జేసెను గోకులేశ్వరా! ౧౮

చ॥ పదపడి తీర్థనేత, యొక ♦ ప్రక్కఁ గళిందసుపుత్రియున్ మఱో
క్కదెసను జహ్నుపుత్రికయుఁ ♦ గ్రాలి స్వకీయతరంగచామరా
లదరుచుఁ బట్టి వీవఁ దల ♦ నక్షయసద్వట మాతపత్రమై
కుదురుగ నుండ భాసిలెడి ♦ గోపకనాయక! నందనామకా! ౨౦

ఉ॥ అంతట సర్వతీర్థము ల ♦ నగ్గరితిఁ బ్రయాగతీర్థరా
ట్ప్రాంతముసేరి జోతములఁ ♦ బల్కుచొనర్చి భయానఁబన్నుల
త్యంతము గట్టి క్రమ్మఱి స్వ ♦ ధామములం జని నంత నట్టి శ్రీ
కాంతుఁడు నిర్జరాన్వితము ♦ గా నరిగెన్ దన మన్కికిన్ సుధీ! ౨౧

ఉ॥ ఆసమయంబునందె కల ♦ హ ప్రియుఁడైన సురర్షివర్యుఁడా
యాసములేక తత్స్థలికి ♦ నాగతుఁడై నుతుఁడౌచు రమ్యసిం
హాసనమందు భాసిలు ప్ర ♦ యాగునిఁ దీర్థపతిన్ గుఱించి సం
తోసముతోడ నిట్లనియె ♦ ద్రోణముఘాసముజప్రభూత్తమా! ౨౨

చ॥ ఇలఁగల యెల్లతీర్థము ల ♦ హీనత మీకుఁ గరంబులిచ్చి పూ
జల నొనరించి యిప్పుడిట ♦ సాగెను తీర్థవిభుండవైతి వం
చలరితిఁగాని తన్మధుర ♦ యందలి తీర్థ మొకండురాక మి
మ్ములను దిరస్కరించెన్ సలుపఁ ♦ బూనుటఁ జింతిలుచుంటి దేవరా! ౨౩

తే॥ అంత నాప్రయాగుండు మ ♦ హాగ్రహంబుఁ, జెంది తీర్థంబులంగూడి ♦ శ్రీనివాస
లోకమున కేగి వినతు ల ♦ నేకములను, జేసి బద్ధాంజలుఁడయి వ ♦ చించె నిట్లు.

ఉ॥ దేవ! భవద్దయన్ గలిగెఁ ♦ దీర్థవిభుత్వము గాని యట్టి బృం
దావనమాది తీర్థములు ♦ తద్విధి నీడకు రాక బిట్టు వ
న్నెవపడెన్ సుమీ యకట! ♦ యియ్యది యంతము లేని చింత నా
భావమునందుఁ గూర్చెడిని ♦ వచ్చితి దీనిని నీకుఁ దెల్పఁగన్. ౨౫

చ॥ అనవుడు విష్ణుమూర్తి విని ♦ యయ్య! ప్రయాగ! ధరాతలంబునన్
దనరెడి సర్వతీర్థములఁ ♦ ద్వద్వశముం బొనరించియుంటి నై
నను మధురావ్రజంబులకు ♦ నాథుగ నిన్ఘటియింపలేను గా
వున నవి యేగుదెంచ విఁకఁ ♦ బూన్కిని వచ్చిన త్రోవఁ బట్టుమా! ౨౬

చ॥ అల మధురావ్రజంబనఁగ ♦ నల్పమటంచుఁ దలంచితే మొకో
లలితజగత్త్రయాధికను ♦ లక్షణలక్షితమున్ బరమ్మునన్
బ్రబలయవిభాసురంబును బ్ర ♦ భారుచిరంబయి నాగృహంబుగాఁ
జెలఁగు నటంచు నెంచుమని ♦ చెప్పఁ బ్రయాగుఁడు విస్మితాత్ముఁడై. ౨౭

ఆ॥ మాధవునకు మ్రొక్కి ♦ మాధురమండలి, కేగి పూజఁ జేసి ♦ యాత్మగేహ
మునకుఁబోయె నిద్ది ♦ మున్ను భూగర్వంబు, మాయఁ జేయు నట్లు ♦ సేయఁబడియె.

తే॥ అన వ్రజేశుఁడు గోపవృ ♦ ద్ధా! మహాత్మ! యెటుల భూగర్వనాశన ♦ మెవని చేతఁ
జేయఁబడె మును పయ్యది ♦ సెప్పుమయ్య, యనఁగఁ గ్రమ్మఱ సన్నందుఁ ♦ డనియె నిట్లు.

వారాహావతార వర్ణనము.

తే॥ తొల్లి వారాహ కల్పమం ♦ దున జనార్దనుండు వారాహరూప వి ♦ నోదుఁడగుచు
నా రసాతలంబున నుండి ♦ నవనిఁ గోఱ, లందునం దాల్చి నిల్పెనో ♦ యనఘ! యపుడు.

చ॥ వలమురి తాల్పు దంతముల ♦ పైని వెలింగెడి భూమి యామృతో
సలిలపరంపరల్ గడచి ♦ సాగెడి తద్భగవంతుఁ గూర్చి తాఁ
బలికె నిటుల్ మహాత్మ! నలు ♦ ప్రక్కలు మిక్కిలి వెక్కసంబుగా
జలములు నిండె నన్నిఁకను ♦ జక్కఁగ నెక్కడ నుంతువో కదా. ౩౦

చ॥ అచల యటు ల్వచింప విని ♦ యచ్యుతుఁ డాయమ కిట్లనెన్ ధరా!
యెచట మహీరుహంబులు ప్ర ♦ వృద్ధము లౌనో? జలస్థితద్రుతం
బెచట నణంగునో యచట ♦ నే నిను నిల్పెదఁ గాన నీవు వృ
క్షచయముఁ జూచుచుండు మనఁ ♦ గాశ్యపి గ్రమ్మఱ శంకితాత్మయై. ౩౧

చ॥ పురుషవరేణ్య! స్థావర స ♦ మూహము నాకు జనించు నీచరా
చరముల మోయ నేనెకద ♦ సంతతమున్ దగియుందు నిప్పుడీ

కరణిని బల్కుచుండుటకుఁ ♦ గారణ మెయ్యది? యన్యధాత్రియుల్
వలెనె నటంచుఁ దోఁచెడి న ♦ బద్ధము సత్యము నాకుఁ దెల్పుమా! 33
ఆ॥ అని యడిగెడిలోన ♦ నాజలంబులయందు, రమ్యవృక్షరాజి ♦ రాజిలంగఁ
జూచి ధరణి యిట్లు ♦ శ్రీచతుర్భుజుఁగూర్చి, మానరహితయగుచు ♦ మరలనడిగె.
చ॥ కిసలయపత్రపుష్పఫల ♦ కీలితమై సుమనోమనోజ్ఞమై
యెసఁగిన వృక్షసంతతుల ♦ నేఁ గనుఁగొంటిని నవ్వి యెచ్చటన్
బొసఁగునొ యద్ది దెల్పి మదిఁ ♦ బొందిన సందియముల్ జనంగ సం
తసము ఘటింపవే యనఁగఁ ♦ దక్కిరియాపుఁ డిటు ల్వచించెనిల్. 3౫
తే॥ క్ష్మామతల్లిక! మాథుర ♦ మండలంబు, ముందురాఁగల దయ్యది ♦ భూరిలయము
నందునం జెక్కుచెదరక ♦ పొందియుండు, ముజ్జగంబుల సొంపును ♦ మొనసియుండు.
ఆ॥ అదియుగాక నాకు ♦ నాకరంబుగ నద్ది, యెసఁగు సాటి దాని ♦ కేది లేద
టంచు నెంచవమ్మ! ♦ యనవుడు బుడమియు, బిగువువిడిచి హరికి ♦ వినతిజేసె.
తే॥ ఇటు ధరాగర్వభంగంబు ♦ నెంతొసల్పి, గోజగమునుండివచ్చిన ♦ క్షోణిఁగూడి
ప్రలయమందున మిక్కిలి ♦ ప్రబలుచుంట, నద్దియన్నిఁటమించెనో ♦ యాలఘుచరిత.
మ॥ అనినన్ నందుఁడు వల్కె నిట్టుల మహా ♦ త్మా! శౌరిగాథావిధిన్
వినఁగాఁ జేసితి వింక విష్ణుకథలన్ ♦ విజ్ఞుండవై యుండు నీ
వని గోవర్ధననామశైలభవమా ♦ హాత్మ్యంబుఁ, గాళిందివా
హిని జన్మంబును, దన్మహత్త్వ దయ వా ♦ చింపంగ నే వేఁడెదన్. 3౯
క॥ అనవుడు సన్నందుండో, యనఘా! యొకతటిని హస్తి ♦ నాహ్వాయపురమం
దునఁ బాండువిభున కా శంతను తనయుఁడు సెప్పినట్లు ♦ తద్ద వచింతున్. ౪౦
చ॥ పురుషవరుండు నీశుఁడు ప్ర ♦ పూర్ణతముండు రమావిభుండు నా
హరి సుజనావనార్థము ధ ♦ రాధికభారనివారణార్థమున్
విరసనిరాసనార్థము భు ♦ విన్ ప్రభవింపఁదలంచి రాధతో
నరమున భూమికీవరుగు ♦ మా! యని వాక్కొన నామె యిట్లనెన్. ౪౧
తే॥ ఎచట బృందావనము లేదొ ♦ యేస్థలంబు,నందు నుత్తుంగ గోవర్ధ ♦ నాద్రిలేదొ
యెందుఁ గాళిందియున్ లేదొ ♦ యందు నేను,వాసముం జేయఁజాల నో ♦ పరమపురుష!
తే॥ అంత శ్రీకాంతుఁడాక్షణ ♦ మందు వేడ్క, నిలకు నెన్బదినాల్గుకో ♦ సులను జెలఁగు
భూమి గోవర్ధనాద్రియుఁ ♦ బుణ్యయమున, నాత్మధామమునుండి తా ♦ నంపె నవల.

గోవర్ధనపర్వత చారిత్రము.

చ॥ ఎనుబదినాల్గుకోసులను ♦ నిర్వదినాల్గు మహావనంబులన్
దనరుచు సర్వవంద్యయయి ♦ ధారుణి యుద్ధరఁజేరె గోప్రవ
ర్ధనగిరి ద్రోణశైలకుల ♦ తస్వికి భారతవర్ష పశ్చిమా
శనుగల శాల్మలిస్థలిని ♦ జన్మము సెందెను నందనామకా! ౪౪

తే॥ అట్లు పుట్టిన గోవర్ధ • నాద్రిపైన, విరులవానలఁ గురిసిరి • సురలు మేరు
శీతనగరాజములువచ్చి • శీఘ్రము లిల,సోకఁగా మ్రొక్కి భక్తితోఁ • జుట్టివచ్చి.

శా॥ శైలేశా! పరిపూర్ణ మాధవ నివా • సంబాధ్యమున్ గోపికా
జాలాభీరపరీవృతంబు సురభి • స్ఫాతిప్రతీతంబునౌ
గోలోకంబున బృందకావనమునన్ • గోవర్ధనాఖ్యన్ గళా
లీలాశోభితశైలరాట్టువయి హా • భిన్ వెల్గు దీవే కదా! ౪౬

తే॥ మధురబృందావనాంకాయ•నుహిత సర్వ, శైలపాలాయ గోలోక•మౌళికే ప్ర
పూర్ణశమలసచ్ఛత్రాయ • పూతవిగ్ర, హాయ గోవర్ధనాయ తు • భ్యం నమోస్తు.

చ॥ అని కొనియాడి స్వీయనిల • యంబుల కేగెను మీఁద నానగం
బు నిఖిలశైలనాథుఁ డను • పూర్ణయశంబును బొందె నొక్కవే
శ నఖిలతీర్థము లని పు • లస్త్యమునీంద్రుఁడు గోప్రవర్ధనా
ద్రి నసితరూపు ద్రోణసుతుఁ • బ్రీతిని గన్గొని చొచ్చి యచ్చటన్. ౪౭

సీ॥ అల్లిబిల్లిగనల్లి • యుల్లాసముంగూర్చు, మల్లెలమొల్లల • నెల్లఁజూచి
మొలకెత్తుఁ బెరుఁగుచుఁ • దళితళలాడెడు, పచ్చికబైళ్ళను • హెచ్చుమెచ్చి
తియ్యని నీటిచేఁ • జయ్యన జబ్బులన్, దీర్చెడి సెలయేళ్ళ • తీరుఁగాంచి
చిలుకల వానకో • యిలల కోయిల కమ్మ, చవిగల్గు పల్కుల • నవధరించి

తే॥ మంచిమెకములసొరును • గాంచి మిగుల, వింతలీనెడి రంగుల • నెంతయుఁ గని
మేలుబంగారుచివరల•చాలు నోలిఁ, బాగడి మేలిడు నిదియని•బుద్ధిఁదలఁచి. ౪౯

చ॥ మఱి యిది జ్ఞానసత్స్థలము • మంగళహేతు వమూల్యరత్నసం
భరితము శ్యామసుందర మ • పారతపశ్చరణానుకూలమం
చరుదుగ నెంచి తజ్జనకు • నండకుఁజేరి తదర్చనానమ
స్కరణి గ్రహించి దీవనల • నల్పి యిటు ల్వచియించెఁ బ్రీతితోన్. ౫౦

తే॥ ద్రోణ! మలతేఁడ వీవు గి•ర్వాణనికర,సన్నుతుఁడవు దివ్యౌషధీ•సంయుతుఁడ వు
దారుఁడవు సర్వలోకస్థ•నారజీవ, నప్రదాతవు నీవె య • నర్వ్యుఁడవు. ౫౧

ఉ॥ కావున నర్థిసిన్ మునిని • గాశినివాసుఁడనైన నేనిటుల్
దావక పార్శ్వమొందితిని • ద్వత్సుతవర్యుని గోప్రవర్ధన
గ్రావవిభున్ బిడాన నిడి • కౌతుకమున్ ఘటియింపవయ్యా! యిం
కేవిధి నేరిచేఁ గొలఁది • యే నుపయోగము లేదు భూధరా! ౫౨

సీ॥ రంగదభంగత • రంగసంగతగంగ, విష్ణుపాదోద్భవి • వెలుఁగు నెచట
మృత్యుంజయుండయి • నిత్యశంకరుఁడగు, విశ్వేశ్వరుండును • వెలయు నెచట
సుందరవదనార • వింద్రుఁడౌ శ్రీబింధు, మాధవస్వామియు • మలయు నెచట
మూర్తిత్రయప్రాజ్య • పురగత చిత్రముల్,బురడించు వింతలు • వొలయు నెచట

తే॥ నెట్టి పాపిష్ఠుదోషంబు ♦ లేగునెచటఁ, జరమదశఁ గర్ణమంత్రంబు ♦ శంభువలనఁ
గలుగునెచట నా కాశిఁద్వ ♦ ల్లలిత తనయు, గోప్రవర్ధనగిరి విభుఁ ♦ గుదుర నిడెద.

చ॥ ఇటు లటనుంచి పల్గురుల ♦ వృక్షములన్ బెనుపొందియున్న త్వ
చ్చటులకుమారుపైఁ దపము ♦ సల్పి యభీష్టము లొందనుండు న
చ్చట మఱిఁ జుట్టుప్రక్కలను ♦ శైలమొకండును లేదు గాన నీ
వటమటఁ జెందకుండ సిడు ♦ మా! మఱుమాటల మానుమా యిఁకన్. ౫౬

తే॥ అనుపులస్త్యునిఁగాంచిద్రో ♦ ణాచలపతి, యిటులనిటుపల్కె మునివరా! ♦ సరసుఁబ్రియుని
వీని విడనాడి బ్రతుకను ♦ గాని మీఁదు, శాపభీతి నీతనికి సూ ♦ చన నొనర్తు.

తే॥ నాయనా! గోప్రవర్ధనా! ♦ నగకులేశ!, శుభము త్రైవర్గ్య ఫలసిద్ధి ♦ యుభయవృత్తి
గలుగు భారతకర్మభూ ♦ ములకుఁ దొరఁగ, నీమునీంద్రుని వెనువెంట ♦ నేగవయ్య!

చ॥ అని జనకుండు పల్క నల ♦ యద్రివిభుండగు ద్రోణపుత్రుఁడున్
విని యయిదామడల్ గలుగు ♦ విస్తృతి యోజనయుగ్మమెత్తు నిం
కనిడివి యెన్మిదామడలు ♦ గ్రాలిన నన్నిటుఁ గొంచు నే దెసన్
జనెదవొ యల్లై పొమ్ము! ముని ♦ సత్తము! యన్నఁ బులస్త్యుఁ డిట్లనెన్. ౫౭

పంచచామరము॥ గిరిప్రభూ! బిఱాన నాదు ♦ కేల హాయి నెక్కినన్
గరంబుగా వహించి నిన్నుఁ ♦ గాశిచెంతఁ జేర్చెదన్
బరీక్ష జేయు మీవనంగఁ ♦ బర్వతేశ్వరుండు సం
బరంబునన్ మఱిన్ వచించె ♦ బద్ధశస్తహస్తుఁడై. ౫౮

ఉ॥ ధీవర! పోవువేళ నెట ♦ దించెదవో యటనుండుఁ గ్రమ్మఱ
న్లేవను నాప్రతిజ్ఞ యిది ♦ నీదయవచ్చిన యట్లొనర్పుమా
నావుడు దత్పులస్త్యముని ♦ నాథుఁడు శాల్మలి నాఁగ దీవిలోఁ
బావిత కౌశలస్థలికిఁ ♦ బ్రక్కఁగ దించెద డించ మధ్యలోన్. ౫౯

క॥ ఏవంవిధశపథంబున్, గావింపఁగ శైలవిభుఁడు ♦ గన్నీరొల్కన్
వేవినతుల్ జనకునకున్, గావించి పులస్త్యసవ్య ♦ కరమున నెక్కెన్. ౬౦

ఉ॥ ఎక్కినతోడ మౌనివరుఁ ♦ డేగఁ దొడంగెను దిన్నఁదిన్నగా
నక్కుధరంబు మానసము ♦ నందిటు బాటను జింతిలెన్ బళీ
యిక్కడ నల్ల సర్వభువ ♦ నేశ్వరచక్రి భవిష్యమందునన్
నెక్కొని దాన మాన శిశు ♦ నిర్మలకేళుల సల్పుఁగావునన్. ౬౧

ఉ॥ కాంచి కృతార్థతన్ బొరసి ♦ కాల్కదలింతును గాని పోవ నం
చెంచి శరీరభారమును ♦ నెక్కువగా నొనరించె నంత యో
గాంచితమౌని యాభరము ♦ హస్తమునందు వహింపలేక వే
దించి వ్రజంబునందు విర ♦ తిన్గొని విస్మృతి నెందె పంతమున్. ౬౨

ఉ॥ శౌచము దీర్చి తానమును ♦ సల్పి మఱిన్ మలఁజేరి యోగిరీ!
లేచి బిడాన రమ్మని ల ♦ లిన్ బ్రియ మాడుచు లేప లేవమిన్
జూచి మహాత్మసత్వములఁ ♦ జూపుచుఁ బూర్తిగ హస్తయుగ్మమున్
జాఁచియు నెత్త నంగుళము ♦ సాగక పోవుట గాంచి ధీరతన్. ౮౩
తే॥ ఓగిరీంద్రుఁడ! నామాట ♦ వేగ వినుము, లెమ్ము రమ్ము నావెనువెంట ♦ లేవమికిని
గారణంబునుదెలుపుమా ♦ కదలకుండు, కరముభర మొందఁబోకుమా ♦ కఠినహృదయ!
చ॥ అన గిరి, తప్పు నాయెడల ♦ నల్పమునేని జెలంగలేదు గా
పున ననుఁ దూలనాడకుము ♦ పూర్వపు పంతము జ్ఞప్తిదెచ్చికొ
మ్మన మునివర్యుఁ డాగ్రహము ♦ నందుచు నోష్ఠము లల్లలాడఁగాఁ
గనులెఱఁగా శరీర మతి ♦ కంపము నొంద శపించె నిట్టులన్. ౮౪
తే॥ ఓయి గోవర్ధనాచల! ♦ యుగ్రుఁడవయి, నామనోరథ భగ్నంబు ♦ నాటఁజేసి
యుంటినందునఁదిలమాత్ర ♦ మొయ్యనొయ్యనొడలుదఱుగంగ క్షీణించు ♦ చుండుమయ్య
క॥ అంతఁ బులస్త్య మునీంద్రుఁడు, చింతన్ శ్రీకాశిపురికిఁ ♦ జేరెను గిరి ను
వ్వంతగ నంతకు నంతకు, వంతన్ గృశియించు చుండె ♦ వఱలెను నందా! ౮౫
శా॥ రంగత్తుంగతరంగసంగతమహా ♦ రంహఃప్రవాహోల్లస
ద్గంగావాహిని యెంతదాఁకఁ దగునో ♦ గ్రావేశగోవర్ధనో
త్తుంగుం డుండునొ యంతదాఁకఁ గలి, సం ♦ స్తుత్యప్రభావంబులన్
బొంగున్ గాని మఱొక్కరీతి మనునే? ♦ భూతు ల్విరాజిల్లునే? ౮౬
మ॥ ఇది గోవర్ధనశైలజీవితము నెం ♦ తేన్ భక్తితో వ్రాసినన్
జదువన్ బాపము లేగుఁ బుణ్యమొదవున్ ♦ సందేహమావంతయున్
గుదురన్ లేదని పల్కి తిర్గి యమునా ♦ కూలంకపాజీవితం
బు దయాళుండయి గోపవృద్ధు వలుకం ♦ బూనెన్ విదేహాధిపా! ౮౭

## యమునానదీ చరితము.

ఆ॥ వె॥ నంద! యాకళింద ♦ నందన, గోలోక, మందునుండి శ్రీశునాజ్ఞ ♦ నవనిఁజేర
దలఁచి తొలుత సర్వ ♦ ధారణీ భర్తకు, హరికి మ్రొక్కియిట్లు ♦ ధరణిఁజొచ్చె.
తే॥ అందు బ్రహ్మద్రవోద్భవ ♦ మైనగంగ, విరజయన్ నదిరెండును ♦ విలయమొందె
నంద! పరిపూర్ణతమయా క ♦ ళిందతనయ, కృష్ణు ముద్దురాణి గా ♦ నెఱుఁగుమయ్య!

వ॥ అట్టి యమునాస్రవంతి మహత్తరంబగు వేగంబున విరజాధునీ వేగంబు నధఃకరించి యనేకబ్రహ్మాండంబులం జొచ్చి క్రచ్చఱ నచ్చటనుండి వెల్వడి భాగీరథీ నదిం జేరి స్వవేగంబునం దత్ప్రవాహజవంబును ధిక్కరించుచు వామనవామ పాదాంగుష్ఠనఖభిన్నబ్రహ్మాండమస్తకంబును బ్రహ్మరసమయంబును నగు బిలంబు సొచ్చి యందలి విష్ణుపదితోఁగూడి యజితంబును దుష్ప్రాప్యంబునై ధ్రువలోకంబున

కనతిదూరంబున నుండు వైకుంఠపురంబుఁ బ్రవేశించి మించి యటనుండి వెడలి బ్రహ్మలోకంబునకుం జని యందునుండి నధోభాగంబున బ్రాలి వందల కొలఁది బృందారకుల యందంపుఁతావులఁజొచ్చి చొచ్చి చూచి చూచి మెచ్చి చెచ్చెర మేరుశైలశిఖరాగ్రభాగంబునం బడి వెల్వడి తత్ప్రాంతంబుల దంబువహించు ధరాధరంబులకూటంబుల నుల్లంఘించి గండశైలంబుల నతిక్రమించి తన్మేరుదక్షిణభాగంబున కేగ నుద్యమించి తననుండి సురనిమ్నగను బ్రత్యేకింప నది హిమాలయంబున కరిగె. తదుపరిఁ దరణితనయాతరంగిణి నయనపర్వంబగు వర్ణంబులం జెన్నుమీఱు కళిందనామకశిలోచ్చయంబధిరోహించి కాళింది యనంబరఁగి తత్సానుగండశైలంబులు చూర్ణీకృతంబులుగాఁ బ్రవహించి కృష్ణవర్ణంబును నమోఘద్రుతంబును గలిగి భూఖండంబుననుండు దేశంబుల కేగుదెంచి వానిం బవిత్రీకరించి ఖాండవవనంబునకుం జనుదెంచి యందు గోవిందునాజ్ఞ దివ్యరూపంబు ధరించి తపం బొనరించి నిజజనకుండగు సినునిచే వినిర్మితంబైన హర్మ్యంబునందు నివాసంబొనరించి కొలఁదికాల మగుడు మగిడి వ్రజమండలంబు సేరి యందు మంగళాయనంబును, భూమండలమండనాయమానంబునునగు మధురాపురంబునకుఁ జేరువనున్న బృందావనంబందలి మహావనంబునందుండు రమణీయసైకతప్రదేశంబునఁ జిత్రంబగు గోపికాయూథంబొండు నిర్మించుకొని గోకులంబుననున్న శ్రీకృష్ణునితోడి రాసక్రీడకై వసతి యొనర్చి యానందబాష్పములొల్కఁ బశ్చిమవాహినియై తద్వ్రజమండలంబునకు ముమ్మారు మ్రొక్కి యందలి దేశంబులను శుద్ధపరచి తీర్థరాజంబగు ప్రయాగను బొంది తిరిగి సురనిమ్నగంగూడి నిలింపులు విరులుగురియ సరిత్పతింగలిసి యం దనుయాయినియగు గంగాదేవికి గద్గదవాణితో నిట్లనియె. ౭౨

శా॥ అమ్మా! విష్ణుపదంబునం గలిగి బ్ర ♦ హ్మాండంబులం బూర్ణపూ
తమ్ముగ్నల్పి సమస్తలోకసతపా ♦ దద్వంద్వవై యీశశీ
ర్షమ్మం దెక్కి యశేషతీర్థమణివై ♦ సౌశీల్యసంపన్నవై
యిమ్మాడ్కిఁ జరితార్థవైతివిగదా ♦ యీరేడులోకంబులన్. ౭౩

తే॥ అమ్మ! హరిలోకమునకిదే ♦ యరుగుచుంటి, నవల నీదయవచ్చిన ♦ యట్టులేగు
మమ్మ! నానుడులందున ♦ నల్పములగు, తప్పులున్నను మన్నించి ♦ దయనుగనుమ.

మ॥ అనినన్ జాహ్నవి సంతసంబుగని యో ♦ యమ్మా! కళిందాత్మజా!
ననుఁ గొండాడుట న్యాయమెుక్కో ? హరి మా ♦ న్యంబైన వామాంసమం
దున జన్మించి ప్రపూర్ణురాలవయి సం ♦ స్తుత్యప్రభావంబులన్
దనరన్ సర్వజగత్పవిత్రవయి తీ ♦ ర్థశ్రేష్ఠవై యుంటివే. ౭౪

క॥ మఱిఁ బరిపూర్ణతముండగు, హరికిన్ సతివైతివమ్మ! ♦ యనఘ చరిత్రా!
యరిగెదఁ బాతాళమునకు, నెరసుల క్షమియింపుమమ్మ! ♦ నెమ్మిని గనుమా!

తే॥ మనుజఖేచరమానులు ♦ గనఁగ రాని, నీవు నాకంటఁబడి మఱేఁ ♦ బోవుచుంటి
వందులకుఁ గుందెదను మఱి♦నల్ల వ్రజము,నందు యాదవంబుతో రాస♦మందుఁగనెద.

క॥ ఇటులఁ బరస్పరమొరిగలఁ, జటులమ్ముగఁ జేసికొనియు ♦ జాహ్నవి దా ను
త్కటగతిఁ బాతాళమునకుఁ, దటములఁ బొఁద్రోసికొనుచుఁ♦దరలియు వరుసన్.

ఉ॥ భోగవతీవనస్థలిని ♦ భోగవతీవిదితాఖ్యయై మహా
నాగపరీతవిస్తృత పి ♦ నాకి శిరంబునఁ జేరి భాసిలన్
సాగెఁ గళిందజానదియు ♦ సప్తసముద్రలసజ్జగంబుపై
వేగఘనప్రవాహముల ♦ విశ్రమమొందక పాటి పిమ్మటన్. ౭౯

శా॥ లోకాలోకనగంబు స్వర్ణమయమున్ ♦ లోకస్తుతంబొంది యా
లోకంబున్ బొనరించి సానుతటము♦ ల్గాలంగఁ బెంధాటి స్వ
ర్లోకం బేగి సమస్తలోకముల నా ♦ లోకించుచున్ దిర్గి గో
లోకశ్రేష్ఠముఁ బొందె సర్వవిబుధు ♦ ల్మెప్పంబులన్ జల్లఁగాన్. ౮౦

క॥ ఇది యమునా శుభచరితముఁ, జదివిన వ్రాసినను నఘము♦సదమదమొందున్.
గొదకొను పురుషార్థంబులు, మదమూడును శాంతమొదవు ♦ మాన్యచరిత్రా!

నందుండు యాదవసహితంబుగా బృందావనంబున కరుగుట.

క॥ అని సన్నందుఁడు వల్కఁగ, విని నందుఁడు దలఁచి చూచి ♦ బృందావనమున్
జన యత్నించి స్వపురమున, జనులకు సాటింపఁ జేసె ♦ జనకనరేంద్రా! ౮౨

ఉ॥ సారథివీథితో విబుధ ♦ సంతతితో రథరథ్యపంక్తితో
వీరులతో శిశుప్రకర ♦ వృద్ధులతో వ్రజగోపగోపికా
వారముతోఁ గుమార బల ♦ పంకజనాభులతోడ రోహిణీ
నారి యశోదలం గలిసి ♦ నవ్యరథంబున నెక్కి చక్కఁగాన్. ౮౩

చ॥ ఘనముగ గాయకోత్కరము ♦ గానమొనర్పఁగ శంఖదుందుభి
స్వనములు నొప్ప గోగణము ♦ భాసిల స్వస్తిదవాచనంబులున్
దనరఁగఁ బూజ్యనందవసు ♦ ధాతలనాథుఁడు బృందకావనం
బున కరిగెన్ మఱిన్ వసన ♦ ముం బొనరించెను భూతలేశ్వరా! ౮౪

తే॥ మఱియు వృషభానునరుఁడునుమహిషితోడ, గజమునెక్కి రాధికనునంకమునునుంచి
గాయకులును మార్దంగికుల్♦గమ్మగతుల, వాద్యమొనరింపబృందకా♦వనముఁబొందె.

క॥ నందులు నుపనందులు బే, రొందిన వృషభాను షట్క ♦ ముత్తమగతితోఁ
బొంది పదార్థసహితులయి, బృందావనమొందె మిగుల ♦ వేడుకతోడన్. ౮౫

చ॥ పిదపఁ బదాఱు కోసులను ♦ వెల్గుమనుండు ప్రదేశమందునన్
సదన సభా కుటీర వన ♦ సౌధ చతుష్పథ రాజవీథులున్

గుదిరిన యేడుద్వారములు ♦ గోటలు పేట లగడ్తలుం శుభ
ప్రదమగు వేయికుంజములు ♦ భాసిలఁ బట్టణ మొండు గట్టియుం. ౮౭

ఉ॥ అందున నందరాజు నను ♦ యాయులునుం వృషభాను షట్కముం
నందులు గోపులందఱు ఘ ♦ నంబుగ వాసములం బొనర్చి రా
నందుని సుందరాలయము ♦ నం వృషభాను గృహస్థబాలురం
బొంది యశోద, గోపికలు, ♦ మోదము సెందఁగ నాడువేడుకం. ౮౮

చ॥ చతురులు లోకసమ్మతులు ♦ సర్వకళాకరు లప్రమేయు ల
ప్రతిములు దివ్యులుం బతిత ♦ పావనులుం గుసుమాస్త్ర రూపులుం
సితరుచినీలవర్ణులు వి ♦ నీల హరిద్వసనాంచితుల్ జగ
త్పతులగు రామకృష్ణులట ♦ ప్రాఁతినిఁ బూనుచుఁ బాశుపాల్యముం. ౮౯

సీ॥ ప్రొద్దునసే లేచి ♦ చద్దిమూటలఁగొంచుఁ, గోడెకాండ్రను వేడ్కఁ ♦ గూడుచుండ్రు
కూడి వత్సములెల్ల♦గుంపులుగాఁగూర్చి, కేల వేత్రము లొంది ♦ త్రోలుచుండ్రు
త్రోలియు నెట్టన ♦ దోషవినాశక, యమునాసరిత్తట ♦ మరుగుచుండు
రరిగి తత్పులినంబు ♦ లందున భూమలు, గల్లుగల్లని మ్రోయ ♦ గంతులిడుదు

తే॥ రిడియు ముచ్చటలాడుచు ♦ నెసఁగుచుండు, రెసఁగిచద్దులమూటల ♦ వెసనువిడుతు
రువిడి మక్కువ మెక్కుదు♦రు మఱిమెక్కి, వంశివాదనక్రముల్లై ♦ వఱలుచుండ్రు.

శ్రీకృష్ణుండు వత్సాసురుని వధించుట.

చ॥ ఒకదినమందు నొక్కతఱి ♦ నొక్కనిశాటుఁడు కంసుబోధచేఁ
బ్రకటితవత్సరూపమున ♦ రామరమేశులు ద్రోలు దూడలం
సుకముగఁ జేరి వత్సముల ♦ శోషిలఁ జేసియు గోపులం గడుం
దికమకసల్ప వారల గ ♦ తిస్థితులం గని పాఱి రంతటం. ౯౧

ఉ॥ వంచకకంసచోదితుఁడు ♦ వత్సనిశాటుఁడు దోఁక నెట్టి బా
డించి రమేశుమూఁపున వ ♦ డిం బ్రహరింపఁగఁ దోడి బాలురే
తెంచ జనార్దనుండు గని ♦ ధీరత నాతని కాళ్ళఁబట్టి హిం
సించి కపిత్థవృక్షమునఁ ♦ జేతులఁ ద్రిప్పుచుఁ బాఱవేయుచుం. ౯౨

ఉ॥ కూలెను నట్టి వృక్షమది ♦ కూలియు నన్యకపిత్థభూజముల్
రాలిచె వాని తేజు కమ ♦ లాపతియందున లీనమయ్యె నా
వేలుపులెల్లఁ బుష్పముల ♦ వేమఱుఁ జల్లిరి పిల్లలెల్లరుం
జాలు బళీ! బళీ! యనిరి ♦ సంతసమందఱు వొందిరో విభూ! ౯౩

వత్సాసుర పూర్వజన్మ వృత్తాంతము.

చ॥ పదపడి తేఁడిటుల్ పలికెఁ ♦ బంకజనాభకథాప్రవీణ! నా
రదమునివర్య! యీ యసుర ♦ రాజెవఁడో యల కృష్ణు లీనమై

కుదిరె నెటు ల్వాచింపుమని ♦ కోరఁగ నట్టి యమర్త్యమౌని స
మ్మదమున వాని తొల్లి కత ♦ మానవనాథున కిట్లు వాకొనెన్. ౯౪

చ॥ మురసుతుఁ డాసురుండు గ్రతు ♦ భుఘ్నుని క్షేత ప్రమీలనామకుం
డరుసమునన్ వసిష్ఠముని ♦ యాశ్రమ మొందియు నందినీమహా
సురభినిఁ జూచి కైకొనఁ ద్రి ♦ శుద్ధిగ నెంచి ధరామరాకృతిన్
వఱలి యొసంగు మద్దియని ♦ ప్రార్థనఁ జేసెను తన్మునీంద్రునిన్. ౯౫

చ॥ వినిన వసిష్ఠుఁ డేదియును ♦ వెల్లడి జేయకయుంట నల్లనం
దిని, గని యోరిదైత్య! కుమ ♦ తీ! మునిధేనువు నన్ను సంగ్రహిం
ప నిటకువచ్చి మోసమున ♦ బాపని వేసము వేసి యాచనన్
బూనరుతువే యిసీ! వెసను ♦ బొమ్మిఁక వత్సవికారమొందుమా! ౯౬

చ॥ అని శపియింప నా యసురుఁ ♦ డప్పుడు వత్సతఁ జెంది మౌనినం
దినుల నమస్కరించి సుమ ♦ తిన్ నను రక్షణసేయుమంచుఁ బ్రా
ర్థన మొనరింప నా సురభి, ♦ ద్వాపరపుందుద బృందకావనం
బున హరి ద్రోలు వత్సములఁ ♦ బొందిన ముక్తిఘటిల్లు దానవా! ౯౭

తే॥ అనుచుఁ గరుణింపఁ దత్ప్రమీ ♦ లాసురుండు
తద్విధిన్ వత్సరూపంబుఁ ♦ దాల్చి ద్వాప
రాంతమునఁ దద్వనమునందు ♦ నల్ల వత్స
ములను గలిసి హింసలఁ జెంది ♦ కలిసె హరిని. ౯౮

క॥ ఇందునఁ జిత్రము లేదని, డెందమునం దెఱుఁగుమయ్య ♦ శ్రీవిని నేర్గో
విందునిఁ దలఁతురొ వా రా,నందంబునఁ బరమ మొందుదు ♦ నారవరేణ్యా! ౯౯

క॥ సమయాంతరమందున హరి, క్రమముగ బలరామమిత్ర ♦ రాజియుతుండై
ప్రముదితసురభులఁ ద్రోలుచు, యమునారమణీయతటము ♦ నరిగిరి పిదపన్.

## శ్రీకృష్ణుండు బకాసురుని జయించుట.

తే॥ అందు వజ్రతుండంబు బృ♦హత్పదములు, శ్వేతశైలాభరూపంబుఁ♦ జెలఁగితిరుగు
బకనిశాటుఁ డొక్కండు త♦త్పద్మనాభుఁ,గని గుటుక్కన మ్రింగె ని♦ష్కరుణ నపుడు.

ఉ॥ కాంచిన తోడియర్భక ని ♦ కాయము భీతి మహాత్ములార! యీ
వంచకుఁ డెవ్వఁడో కద య ♦ పారవికారశరీరియౌచు మా
పంచకు వచ్చి మా చెలిని ♦ బాలునిఁ గృష్ణుని మ్రింగె నయ్యో! మీ
గ్గాంచరె? దిక్కులే దిచటఁ ♦ గారుణికంబున మమ్ముఁ గావరే! ౧౦౨

తే॥ అంచు విలపింపఁగా నిలిం♦పాధిపుండు, పిన్నలార! మీరింతయు♦ వెఱవవలదు
వచ్చుచుంటి నం చఖలదే♦వతలఁగూడి, సర్వశస్త్రాస్త్రయుక్తుఁడై♦ సరభసమున.

ఉ॥ వచ్చి మహాసురేశ్వరుఁడు ♦ బాధ బలిష్ఠుఁడునైన వానిపైఁ
గ్రచ్చుఱ వజ్రముల్ విసర ♦ రక్కసియుల్ బడి లేచి యంతగా
నొచ్చక తిర్గి కొట్టుమిఁక ♦ నుంగొనినట్టి పితామహుండు బ
ల్మెచ్చిన బ్రహ్మదండమున ♦ నీసునఁగొట్టె ననంతరంబునన్. ౧౦౪

చ॥ పుడమి నతండు తద్ధతిని ♦ మూర్ఛము పూర్తము సొమ్మసిల్లి వే
యొడలు విదల్చి పెచ్చన స ♦ మర్థితుఁడై ఘనసామ్య నిస్వనం
బడలఁగఁజేసి ధిక్క్రియను ♦ నావిధిఁ గ్రమ్మఱఁ గొట్టకుంట రు
ద్రుఁడు గని స్వత్రిశూలమును ♦ రోసముతోఁగొని వేసె వానిపై. ౧౦౫

తే॥ తద్ధతిన్ బక్షమొక్కటి ♦ దఱుఁగ బడిన, వాఁడు ప్రాణముల్ విడలేదు ♦ పవనుఁడద్ది
గాంచి స్వీయాస్త్రముల్ వేయఁ ♦ గా నతండు, గదలికదలనియట్టులఁ ♦ గ్రాలెనవల.

చ॥ యముఁడు స్వచండదండముఁ ద ♦ దాసురుపై నిడె నద్ది చండవి
క్రముఁడగు వానిఁ జంపమియె ♦ కాక కడున్ జెడిపోయె నంత న
ర్యముఁడటులన్ హతిన్ గనక ♦ హాయిగనుండెడి దైత్యుఁజూచి రో
సముపడి నాటవేసెను వె ♦ సన్ జనహులిశాతశతాశుగంబులన్. ౧౦౬

చ॥ దనుజుఁడు వాని కించుక వె ♦ తన్ గనకుంటట గుహ్యకేశుఁడున్
గనుచుఁ గృపాణముల్ విసరఁ ♦ గా నలవాని ద్వితీయపక్షముల్
జనియెనుగాని నీల్గఁ డది ♦ చంద్రుఁడు గాంచి కసిన్ హిమాస్త్రమా
తనిపయి వేయ శైత్యమునఁ ♦ దాళక సొమ్మను బొందె వెంటనే. ౧౦౭

ఉ॥ ఆయసురుండు లేచి తిరు ♦ గాడుచునుండుట జూచి యగ్ని, యా
గ్నేయమహాస్త్రమేయ నల ♦ నీచుని నెమ్మెయి నున్నరోమము
ల్బ్రాయెనుగాని డమ్మనఁడు ♦ లొంగఁడు నొవ్వఁ డెదుర్కొనండు వే
దాయఁడు దూలనాడఁడు గ ♦ దా! యలదైత్యుఁడదేమి చిత్రమో! ౧౦౯

చ॥ వరుణుఁడు తత్త్వనితింగనుచుఁ ♦ బాశముతో నల వానిఁ గట్టి యా
ధరణిని నీడ్చినప్పటికిఁ ♦ దద్బలుఁ డీల్గక గాయమొందెఁ ద
త్సరణినిఁ గాంచి కాళి, గదఁ ♦ జట్టునఁ గైకొని కొట్ట నాతఁడున్
శిరమున గాయమైన మృతి ♦ నెందఁ డదెంతటి గట్టియాయువో. ౧౧౦

ఆ॥ అవల శక్తిధరుఁడు ♦ నరుదెంచి శక్తి నా, యసురవరుని నఱుకఁ ♦ గసిని విసర
నతఁడు గాలుదెగిన ♦ మృతిని జెందకయుండి, నెల్ల వేల్పులఁగని ♦ యుల్లమందు.

తే॥ ఇట్టు లూరక యున్నచో ♦ నింకనన్నుఁ, జంపుదురుగాపునన్ నాదు ♦ శక్తికొంతఁ
జూపనగునని యెంచి త ♦ త్సురలలోనఁ, జొచ్చి పెనుగాలి కై వడి ♦ మచ్చరమున.

ఆ॥ రక్తనేత్రుఁడగుచు ♦ శక్తియుక్తుండయి, నిర్జరులను బట్టి ♦ నెట్టికొట్టి
వారు దనదు బాధ ♦ బడలేక నింగికి, బరుగులెత్తఁ దఱిమి ♦ తఱిమి మరల.

చ॥ వరయమునాతటంబునకు ♦ వచ్చి హరిద్దళకంబు మ్రోయఁగా
నఱచి చరించుటంగని సు ♦ రర్షులు బ్రహ్మబుషుల్ మహామునుల్
సురలును బ్రాహ్మణుల్ బ్రథిత ♦ సూరులు తత్ప్రలి కేగుదెంచి త
త్సరసిజపత్రనేత్రు హరి ♦ సన్నుతి జేసిరి భక్తితో నిటుల్. ౧౧౪

తే॥ దీనరక్షణ తత్పరా! ♦ దేవదేవ!, వాసుదేవ! కేశవ! శివ ♦ పరమమిత్ర!
మిత్రజై వాత్స్యకాక్షు! వి ♦ చిత్రచరిత!, భువనమోహన! శ్రీకృష్ణ! ♦ పుణ్యపురుష!

తే॥ అయ్య! మావిన్నపంబిద్ది ♦ యాలకించి, మిగుల నీకోసమై యిందు ♦ వగచుచిట్టు
లెదురు చూచు నీపిన్నల ♦ నీవువచ్చి, కరుణఁ గావుము నీకగుఁ ♦ గాత శుభము.

వ॥ అంత. ౧౧౭

చ॥ బకవపునందునున్న హరి ♦ వారల ప్రార్థన మాదరించి పూ
నికఁ దన దేహ మెర్కుపగ ♦ నేర్పున నల్పఁ దదాసురుండు దా
ళక క్షుతకంధరుండయి యి ♦ లఁ గమలాపతిఁ గ్రక్కెఁ గ్రక్కి పా
యక మఱలఁ హరింగొఱక ♦ యత్న మొనర్చి మహాగ్రహాగ్రుఁడై. ౧౧౮

తే॥ తీవ్రతుండంబుభాసిల్లఁ ♦ దీవ్రగతిని, జనియె నంతటఁ గృష్ణుఁడా ♦ దనుజునిగని
వాలముంబట్టి కొట్టుచుఁ ♦ గేల నాస,గజము గొమ్మను విఱిచినక్రరణి విఱిచె.

చ॥ అవల ఖగేశ్వరుండగు బ ♦ కాసురుఁ డంతము నెందె వేడ్క దే
వవితతి శ్రీహరీ! జయము ♦ బాగు బళీ! యను గెల్పుఁదెల్పు వా
ద్యనహముతోడఁ బుష్పతతి ♦ నిక్క వెదఁజల్లిరి నెచ్చెలుల్ హరిక్
బ్రవణముతోఁ గవుంగిళులఁ ♦ బల్మఱు జేసి నుతించి రెంతయుక్. ౧౨౦

ఉ॥ మృత్యుముఖంబునుండి నిల ♦ కెవ్వరిటుల్ మని వచ్చిరొక్కొ? సం
స్తుత్యుఁడ వీవెయంచు విబు ♦ ధుల్ గొనియాడెడి లోన దైత్యనా
న్నత్యకళల్ వ్రజాధిపతి ♦ నందనకృష్ణునిలోన లీనమై
నిత్యతఁజెందె నంత హరి ♦ నెచ్చెలులక్ దగి సంతసంబుతోక్. ౧౨౧

తే॥ రమ్యవత్సముల్ ద్రోలుచు ♦ రాగములను, మురళితోడుతఁబాడుచు ♦ ముద్దులొలుక
వసతిఁజనులోనఁ దోడియ ♦ ర్భకులు ముందు, జేరి యిండ్లకు నలకృష్ణు ♦ సేతఁదెలుప.

తే॥ పౌరులందఱు విస్మిత ♦ భావులైరి, జనక! నావుడు నాలించి ♦ సాహసాంక.
శౌర్యధనమిధిలేశుఁడు ♦ శాంతిదాంతి,యుక్త నారదముని కొక ♦ యుక్తిఁబలికె.

ఉ॥ దూబఱతిండిపోతగుచుఁ ♦ దోయజలోచను మ్రింగి డింకి గా
రాబున వాని లీనమయి ♦ రాజిలుచుండెడి వాఁడెవండొ? యా
పోబడి దెల్పుమంచు స్తవ ♦ ముం బొనరింపఁగ మౌనినాయకుం
డా బకదైత్య పూర్వకథ ♦ నంతయు తేనికి నిట్లు వాకొనెక్. ౧౨౪

## బకాసుర పూర్వజన్మ వృత్తాంతము.

ఉ॥ భూవర! యీ బకాసురుఁడు ♦ పూర్వపుజన్మమునందునన్ హాయ
గ్రీవనిశాటపుత్త్రకుఁ డ ♦ కృత్యపరాయణుఁ డుత్కలాఖ్యుఁడై
దేవతలన్ జయించి యిటు ♦ దెమ్మని కైకొని వారి ఛత్త్రిమా
దేవతలంబు నేలె నొక ♦ దివ్యశతాబ్దము లర్థవంతుఁడై. ౧౨౫

ఉ॥ అల్ల నిశాచరేశుఁడు క ♦ శాకరనాకమునందు వీఁకతోఁ
జెల్లుబడిన్ జరించు చొక ♦ సింధుపయోనిధిసంగమస్థలిన్
బల్లన నొక్కనాడు జని ♦ యందికలోఁ గల జాజలాఖ్యు ప
ర్ణోల్లసదాశ్రమం బరిగి ♦ యుద్ధతి మీనులఁబట్టు కోర్కతోన్. ౧౨౬

ఆ॥ అందుఁ జెలఁగు మడుఁగు ♦ నందు గాలము వేసి, నిజమనోరథంబు ♦ నెఱపదునటు
సల్పుకొనుచునుండ ♦ జాజలమౌనియుఁ, గాంచి జాలిఁజెంది ♦ కరుణతోడ.

క॥ తగుదునని వచ్చి యిచ్చటి, కగచాట్లనుబెట్టి వీని ♦ హరియించెదవే?
తగదిది దగదిది నీకో, మగవాఁడా వినుము నాదు ♦ మాటలఁ బోపో. ౧౨౭

క॥ లేరే శూరులు ధీరులు, లేరే భూపాలకులును, ♦ లేరే మల్లుల్
లేరే దుర్మతు లిల నీ,శూరతఁజూపింపఁ జంప♦ స్రుక్కింపఁగుఫ! ౧౨౮

క॥ ఇతరుల జోలికిఁ బోవక, సతతము దగినట్లు గసవు ♦ జలములఁగొని స
న్మతివృత్తి నీమడుఁగునన్, బ్రతికెడి నీర్ఝషము లడపఁ ♦ బాడియెఁ జెపుమా!

తే॥ అని హితోపదేశముసేయ♦నట్టిచెట్ట, వినియు విననట్లు జెలఁగు చా♦పనిని విడువ
కుండె నిల దుండగీంద్రకు ♦ దండిబుద్ధి, యేమిలేనప్డు జెప్పిన ♦ నెట్లువచ్చు. ౧౩౧.

ఉ॥ జాజలమౌని యంత సుర ♦ శత్రునిఁగన్గొని యోరిదుష్ట! నీ
తేజు విడన్ బకత్వము న ♦ తి త్వరితంబుగఁ జెందుమన్న నా
యోజఁ దదాసురుండు దన ♦ యుత్తమతేజము వీడఁ గొంగయై
రాజిలఁజూచి యట్టి ముని ♦ రాజునుజేరి నమస్కరించుచున్. ౧౩౨

చ॥ మునివర! జాజలా! యెఱుఁగ ♦ క్రొక్కెదఁ దప్పు క్షమింపుమయ్య! మీ
ఘనమగు సంగమం బఖిల ♦ కల్మషహారము మిత్రశత్రులం
దున ఘననీచులందు సుఖ ♦ దుఃఖములందునఁ బొన్నుమన్నులం
దున మిముబోటి యోగులకుఁ ♦ దోఁపదు భేదము గానఁ గావుమా! ౧౩౩

చ॥ మఱియును మీదు దర్శనము ♦ మాకు లభించుట బట్టి దోషముల్
దొలఁగెను బుణ్యముల్ గలిగె ♦ దుష్కరయోగకృతార్థ! నీదయన్
బరము ఘటిల్లుఁగాదె యిఁక ♦ నన్నుభరించుట నీకసాధ్యమే?
సరగునఁ బ్రోవుమా యనుచు ♦ సన్నుతులం బొనరించె నంతటన్. ౧౩౪

తే॥ సరిగ షష్టిసహస్రవ ♦ ర్షములఁ దాఁకఁ, దపముఁ జేసిన జాజల ♦ తత్త్వవిదుఁడు
గినుక వీడి ప్రసన్నుఁడై ♦ దనుజనాయ, కునకు నిట్టులఁ బలికె నో ♦ జనకరాజ!

తే॥ ఇరువదెన్మిదవ యుగమం ♦ దెసఁగుచుండు, ద్వాపరాంతమునందున ♦ భరతఖండ
మందు వైవస్వతంబున ♦ నలరు మాథు,రవ్రజమున బృందావన ♦ రాజ ముండు.

ఉ॥ అందల నందనందనుఁడు ♦ నాపరిపూర్ణతముండు నట్టి గో
విందుఁడు వత్ససంతతులఁ ♦ బ్రీతినిఁ ద్రోలెడివేళ వైరముం
జెందుచుఁ గృష్ణుతోఁ గలిసి ♦ చెన్నువహింతువు సందియం బిటుల్
బొందదు స్వర్ణనేత్రముఖ ♦ పుణ్యజనుల్ బగఁజేరరే హరిన్. ౧౩౭

తే॥ అటులఁ బలుకఁగఁ నుత్కలుం ♦ డిటుల బకతఁ,జెంది బృందావనంబునఁ ♦ జేరి శౌరి
మ్రింగి శత్రుత నార్జించి ♦ మృతినిబొంది,కలిసె హరిని సన్మైత్రి స♦త్ఫలదముగద

## శ్రీకృష్ణుం డఘాసురునిం బరిమార్చుట.

క॥ అంతట హరి వత్సము ల,త్యంతముగాఁ ద్రోలుకొనుచు ♦ నాత్మసఖుల్ రా
వంతులఁ గాళిందీనది, చెంతకు నొకసమయమందుఁ ♦ జేరెను జనకా! ౧౩౯

ఉ॥ అత్తఱిఁ బాముఱూపున న ♦ ఘాసురుఁ డొక్కఁడు క్రోశదీర్ఘుఁడై
యెత్తిమొగంబు నోర్దెఱచి ♦ హెచ్చిన శైలమువోలె బాటలో
మత్తతఁ బండె నద్ది గన ♦ మాథురకాననసంచరిష్ణు గో
పోత్తములెల్ల రేగ సల ♦ యుక్కరి డక్కున మెక్క గక్కునన్. ౧౪౦

ఉ॥ వారిని రక్షసేయ బల ♦ భద్రయుతుండయి వానిలోనికా
శౌరి సనన్ నిశాచరులు ♦ సంతసమందిరి గుందిరెల్ల బృం
దారకు లార్తనాదములు ♦ తత్ప్రియమండలిఁ గల్గె నంత ల
క్ష్మీరమణుండు యోచనము ♦ జేసి తదాసురదేహ మందునన్. ౧౪౧

తే॥ తన శరీరంబు బెద్దగఁ ♦ దద్దఁజేసి, వాని ప్రాణంబులల్లాడఁ ♦ బట్టి తలను
భిన్నముగఁ జేసి స్వజనగో ♦ వితతిగూడి,వచ్చె నీవల కాదైత్య ♦ వరుఁడు సచ్చె.

ఆ॥ అంత వానితేజు ♦ హరియందుఁ జంచల, ఘనమునందుఁ గలియు ♦ కరణిఁగలిసె
విరుల నెల్లసురలు ♦ గురిసిరి నరవరా!, యనఁగ నతఁడు మునిని ♦ నడిగె నిట్లు.

## అఘాసుర పూర్వజన్మ వృత్తాంతము.

ఉ॥ వీఁడెవఁడో కదా యెటుల ♦ విష్ణువునందున లీనమయ్యె వీఁ
డెదవసించుఁ బ్రాగ్జనిని ♦ నెట్టిది వీనిచరిత్ర! శ్రీహరిన్
వేఁడక వైరరూపమున ♦ వింటెగఁ జొచ్చెను నెల్లబో! యీ
జాడ నెఱుంగఁ గోరితిని ♦ సత్వరమే వచియింపు నారదా! ౧౪౪

ఉ॥ ఆవలఁ దన్మునీంద్రుఁ డిటు ♦ లాడెను భూవర! వీఁడు శంఖుఁడన్
దేవగణారిపుత్రకుఁడు ♦ దీర్ఘబలుం డఘనామధేయుఁడున్

యౌవనదర్పితుండు మద ♦ నాకృతిభాసురుఁ డన్యనిందకుం
డావిలభావభావితుఁడు ♦ నై తొలిజన్మమునందునం దగున్. ౧౪౫
క॥ మలయాచలమున నాతం, డలఘుతపంబాచరించు ♦ నష్టావక్రున్
లలితశరీరిఁ గురూపిని, నలయక యొకతటినిఁజూచి ♦ హాస్యమొనర్చెన్. ౧౪౬
క॥ హాసముఁ బొందిన తన్ముని, రోసముతో నోరిదుష్ట! ♦ రూఢిగ నీకా
యీసడము నిడెడి సప్పపు, వేసము దగుగాతమని శ ♦ పించెను జనకా! ౧౪౭
చ॥ పదపడి నాతఁడల్ల ముని ♦ పాదములన్ బడి భక్తివేఁడ స
ద్హృదయుఁ డతండు నెమ్మిఁగని ♦ దేవవిభుండగు కృష్ణుఁడెప్డు నీ
యుదరమునందునన్ జెలఁగి ♦ యుక్కడగించునో యట్టివేళ నీ
వదిర! యనంగ దివ్యమగు ♦ నాకృతి జెందెద వోరి యాసురా! ౧౪౮
క॥ స్పష్టముగ నట్లు జెప్పఁగఁ, గష్టోరగరూప మతఁడు ♦ గని క్రమ్మఱ నా
విష్టపనాథునిఁ గలిసెఁ ద్రి, విష్టపవాస్తవ్యు లంద ♦ వీక్షానివిధిన్. ౧౪౯
తే॥ వత్సబకశంఖదైత్యాఘ ♦ వక్త్రిములను, జొచ్చి క్రచ్చఱ నీవల ♦ వచ్చిమనిన
కృష్ణుసంగతిఁ గ్రమముగాఁ ♦ దృష్ణతోడ, విని యశోద దిగులుపడి ♦ వేగపడుచు
తే॥ నగరవాసుల నందోప ♦ నందవరుల, నందు వృషభాను గోపక ♦ బృందములను
రోహిణిం గళావతిఁ గృతి ♦ వాహకులను, బెద్దలను బిన్నలను బిలి ♦ పించి చేర్చి.
చ॥ మనవ్రజమం దుపద్రవ మ ♦ మందముగా జనియించె నంచు వే
మనము మనంబునం దలఁచి ♦ మంచిదటంచు వచింప నీస్థలం
బున కరుదెంచియుంటి మది ♦ వోయిన యట్టులఁ దోఁప దిందునన్
గనుక నిఁకేమిసేయనగుఁ ♦ గట్టిగ యోచనజేసి చెప్పుఁడీ! ౧౫౨
ఉ॥ నాతనయుండొ చంచలుఁ డ ♦ నారతమాడెడివాఁడు పిల్లలో
యాతత మర్కటాభులు గ ♦ దా! యిఁక నాడుటొ దూరమందు నా
చేఁతలొ ప్రాణహారములు ♦ సిక్కఁడు వాఁడిఁక నేమొనర్తు మీ
ర్చాప్రీతిగఁ గాంచి సత్పదముఁ ♦ బల్కుఁడి ప్రేముడిఁబట్టిఁ బ్రోవుఁడీ. ౧౫౩
చ॥ కొలఁది దినాల క్రిందటను ♦ గుత్సితుఁడొ బకదానవుండు నా
లలితకుమారుఁ జంపఁగ వి ♦ లక్షణతుండముతోడఁ బైకి రా
నలవిధి వానిఁ దప్పకొని ♦ యాయువుతోఁ దగెనంట వత్సు బా
ధలఁ దొలఁగించుకొంచు నెటొ ♦ ధారణిలో మనెనంట నక్కటా! ౧౫౪
తే॥ మఱి యఘాసురహింసల ♦ మాన్పుకొంచు, బ్రతికిబ్రతుకనియట్టులఁ ♦ బరఁగెనంట
బ్రతిపదంబున నీరీతి ♦ బాధలెల్ల, గలుగు చుండఁగ నిచట నే ♦ కరణి నుందు?
తే॥ ఇదిమొదలు వత్సములఁ గావ ♦ నేను నాదు, కొడుకు వెలుపలకంప నో ♦ గోపులార!
యనుచు నేడ్చుయశోదను ♦ గనుచు నందుఁ, డాశ్వసించియు నిట్టుల ♦ ననియె జనక!

ఉ॥ నెచ్చెలి! గర్గసూక్తుల ము ♦ ని ప్రకరోక్తుల బ్రాహ్మణోక్తులన్
గ్రచ్చుల విస్మృతింబొరయఁ ♦ గ్రాలితివో! భ్రమజెందియుంటివో!
హెచ్చిన పిచ్చిజెందితివొ! ♦ యేమియొకాని సుతుండు గీడులన్
విచ్చును గాన దానములఁ ♦ బ్రీతినొసంగుము మంగళార్థమై. ౧౫౭

చ॥ అనఁగ యశోద పాలులకు ♦ నర్ఘధరానవరత్నదానముల్
బొనరిచి స్వీయభూషణస ♦ మూహము సాగ్రజుఁడైన యాత్మపు
త్రునకిడె లక్షధేనువుల, ♦ స్థూలవృషాయుతమున్, ద్విలక్షమూ
ల్యనయవరాన్నరాశుల న ♦ నర్గళ రీతి నొసంగె నందుఁడున్. ౧౫౮

## శ్రీరామకృష్ణులు పాశుపాల్యం బొనరించుట

వ॥ పదపడి గోపకాఙ్ఞ నవ ♦ భావజరూపులు బాపతాపదా
ర్మదరహితుల్ మనోహరులు ♦ రామరమేశులు పాశుపాల్యమున్
వదలక చక్కఁగా సలుపు ♦ పద్ధతి నొప్పుచు నీడుజోడునం
గుదిరిన వారినిం గలిసి ♦ గోవులఁ ద్రోలఁగసాగి రంతటన్. ౧౫౯

తే॥ సర్వకల్యాణకరములౌ ♦ సౌరభేయులు నిరుప్రక్కల ముంగల ♦ వెనుకఁజెలఁగి
నందనందనబలరామ ♦ సుందరవద, నారవిందముల్ జూచుచు ♦ సౌరుమీఱె.

సీ॥ చిన్నారిపొన్నారి ♦ పొన్నున రవలను, బన్నిన దండలు ♦ ప్రభలనీన
సపరంజిచిఱుగజ్జె ♦ లందియల్ మొదలైన, సొమ్ములఝుంకృతుల్ ♦ గ్రమ్ముకొనఁగ
విన్నవాఁకను నంచ ♦ వెల్లగుల్లమ్ముఁజెౌ, దంతిని మించిన ♦ కాంతు లలర
బలిసినప్రక్కలు ♦ జెలువంపు నడుమును, నడవడి రూపును ♦ గడలుకొనఁగ

తే॥ రెండుతూములపాలను ♦ బిండఁగలుగు, మంచిపొదుఁగు వెలుంగఁగ ♦ మలయుచుండు
దొడ్డగిడ్డులు వెన్నుని ♦ తోడఁగూడి, నల్లవలువతాల్పుఁగనుచు ♦ నడవఁదొడఁగె.

తే॥ అందు నెట్టని బొట్టుల ♦ నరుణపాద, ములను బచ్చని శోఁకలఁ ♦ బొట్టికొమ్ము
ల మఱి కైలాసనిభశరీ ♦ రమును గొప్ప, కోడెలనుగల్గు నావులు ♦ గొన్నియుండు

చ॥ మఱియును గొన్నిధేనువు ల ♦ మందఘనద్యుతిభాసురాకృతి
న్వఱలును గొన్నిపాటలము ♦ నన్ హరితంబునఁ గొన్నియాలు బం
గరువలె మేరుపర్వతము ♦ కైవడిఁ గొన్నియుఁ గొన్ని వింతమై
న రుచుల వెల్గుఁ గొన్ని యరు ♦ ణంబున రాజిలుచుండు వెండియున్. ౧౬౩

తే॥ కపిల వర్ణమునంగొన్ని ♦ కపిశవర్ణ, మందుఁ గొన్నియు నుండును ♦ సుందరమగు
గంగడోలునుబొల్పారఁ ♦ గ్రాలుఁగొన్ని, బొడుగుకొమ్ములఁగొన్నియుఁ ♦ బొల్పుఁగాంచు

తే॥ వక్రశృంగంబులన్ గొన్ని ♦ వఱలుహరిణ, శృంగసమశృంగములఁగొన్ని ♦ సెన్నుమీఱు
గుంభికుంభసమాన క ♦ కుదముల బల, మునను జెలఁగు నాఁబోతులు ♦ దనరు నందు.

చ॥ అభయముగాఁగ రామహరు ♦ లావుల గోవులఁ ద్రోలువేళలన్
నభమున సర్వవిష్టపము ♦ నప్రతిభాప్రపమలై జగన్మహా
విభులయి రమ్యపంకజకు ♦ వేలసతీమణి జీవితేశులై
ప్రభవము గాంచి మించు రవి ♦ రాజులభంగి వెలింగి రోవిభూ! ౧౩౬

చ॥ ప్రతివనమందునం జెలఁగు ♦ పచ్చనిపచ్చిక బైళ్ళఁజొచ్చి స
మ్మతమున మెక్కి తృప్తిపడి ♦ మంచి జలంబులఁ గ్రోలి స్వీయవ
త్సతతులఁగూడి నిక్కి బల ♦ శౌరుల చుట్టునుముట్టి అంకెలన్
సతతము వేయుచున్ బఛిని ♦ సాగును గిడ్డులు వెండి గిబ్బలున్. ౧౩౭

వ॥ అంత గోపాలకుండగు శ్రీకృష్ణుం డాత్మసఖులం గూడి యమునాతీర విభాసురంబును, దాలహింతాలతమాలప్రవాల రసాల సురసాల నక్తమాలనింబ జంబు జంబీర కపిత్థాశోక పున్నాగ నారికేళ నాగరంగనీప కదంబ కదళాశ్వత్థ బిల్వఖర్జూర భూర్జక్రముక ఖదిర పిచుపిచుల కుందారమందార కోవిదార దేవదారు పలాశప్లక్షాది నానావిధ ఫలవృక్షసమాకీర్ణంబును, మాధవ్యాదిసకల లతాసంభృతంబును, మధురాంబుపూరితనిర్ఝరదరీయుత గోవర్ధనాచలేంద్ర విరాజమానంబును, జతుర్వింశదారామపరీవృతంబును, నేత్రపర్వంబును నగు బృందావనంబునం జొచ్చి యచ్చటఁ జెలంగు శుకపికశారికాపారావత కోకిల పుంస్కోకిల కోక మరాళ మయూర మత్తమధులిడాది కలనాదంబుల హాయి నాలించుచుఁ బారిజాత పాటల చంపక హరిచందన కుందసౌరభంబుల నాఘ్రాణించుచు మెడవంచ నక్కఱ లేనియట్లు పెచ్చుపెరిగి యిచ్చను గలిగించు లేపచ్చికబయిళ్ళ నాలంద్రోలుచు రమణీయంబు లగు సైకతంబులఁ గ్రీడించుచు మధువనంబునను, దాలవనంబునను, దివ్యకామవనంబునను, గుముద్వనమందును, నందీశ్వరాచలప్రాంతస్థవనంబునను, గుశవనంబునను, లతాజాలసంపన్నంబై మహాపుణ్యాకరంబై భాండీరోద్యానోపవనంబై దైవాఱు భద్రవనంబునను, లోహార్గళవనంబునను, మఱియుఁ దత్పరిసరస్థితవనోపవనంబులం దెల్లెడలను నేకకాలంబున నొక్కపగిది గోపాలనం బనేకాకృతులం దాల్చి యొనరించుచు సాయంకాల మగుడు నాలను మందగాఁ గూర్చి కేలం బెత్తముచు, శీర్షంబునం బింఛంబుచు, విశాలవక్షంబునఁ దారహారములును వెండియుఁ దత్తదవయవోచితాలంకారంబులు దళతళలాడ రాకాపూర్ణేందుసుందరంబును, నిందిరానందసంధాయకంబును, నగు నగుమోమునం జెలువాఱి బింబంబును, దినావసానాంచితదినమణిబింబంబును, హసియించు శోణవర్ణంబున వెలుంగు నోష్ఠంబులందు సకలాపశబ్దాబ్రప్రభంజనవంశిని లగించి మించి జగన్మోహనుండై మోహనరాగంబు విరాగులకు సయితం బనురాగంబు గలుగునట్లు బాడుచుఁ

గ్రమ్మఱి గోరజంబు లాకాశంబునం బర్వ నందరాజవ్రజంబునకు వచ్చుచున్న
వృత్తాంతంబు గోపకాంత లెఱింగి యాతురంబున. ౧౬౮

తే॥ గృహమునందలి కష్టముల్ ♦ గెంటుటకును, సంతసంబును బొందఁగా ♦ స్వాంతమందు
మఱువరానట్టి కృష్ణుని ♦ మఱలఁ జూడ, నెంచి హరియున్న చోటికి ♦ నేగి రంత. ౧౬౯

ఉ॥ సందుల నాలఁ ద్రోలుచును ♦ సాహసికుండయి సింహదృష్టితో
బందుగులున్ దమిన్ గనఁగ ♦ బాలకరీంద్రవిలాసయానుఁడై
యందముచందము న్గలిగి ♦ యట్లిట్లులన్ దిరుగాడు ముద్దుగో
విందుని నందనందనుని ♦ వీక్షణతృప్తిఁ గాంచి రాసతుల్. ౧౭౦

ఉ॥ ధేనురజోవిరాజితుఁడు ♦ దివ్యఘనద్యుతిభాసురుండు జాం
బూనదతారహార మణి ♦ భూషితుఁడున్ గనకాంబరుండు వం
శీనినదాంచితుండు సర ♦ సీరుహనేత్రుఁడు భాసుఖోరుసం
ధానచణుండు కృష్ణుఁడు స ♦ తంబును మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. ౧౭౧

తే॥ తొలుత శ్రీహరి బుధవార ♦ కలితకార్తి, కసితపక్షాష్టమీతిథిన్ ♦ బసులఁ బ్రోవ
గుదురుటంబట్టి యయ్యది ♦ గోపకాష్ట,మియని బుధులంద్రు గుణసాంద్ర! ♦ మేదినీంద్ర!

చ॥ అమృతముగాఱు మోముగల ♦ యచ్యుతుఁ డొక్క దినంబునందు నే
మమున స్వమిత్రు లన్నయును ♦ మైత్రిని వెన్కనఁ ద్రోలు చల్ల గో
సమజముఁ దాలకాననము ♦ సన్నిధికేగెను గాని దాని మ
ధ్యమమున ధేనుకుం డనెడి ♦ దానవుఁడుండెఁ బ్రచండశక్తితోన్. ౧౭౩

## రామకృష్ణులు ధేనుకాసురుని జంపుట.

చ॥ అల హరిమిత్రు లద్దివిని ♦ యందునఁ జేరక పోయి రంతటన్
బలి హరియన్నయైన బల ♦ భద్రుఁడు రౌద్రము సాహసంబునున్
గలుగఁగ దానిలోనికి సు ♦ కంబుగఁ జేరుచుఁ దాలసత్ఫలం
బులఁ గొనుకోర్కి నల్లెడలఁ ♦ బూర్తిగఁ దిర్గి చెలంగి యొక్కెడన్. ౧౭౪

ఉ॥ నల్లనిపట్టుపుట్టముల ♦ నాణెముగాఁ గటిఁ గట్టి తాళ్ళనున్
గొల్లలుగాఁ జెలంగు ఫల ♦ కోటు లిలంబడ రెండు చేతులన్
బెల్లుగఁబట్టి యూపఁ బృథి ♦ వీస్థలి నయ్యవి రాల వానిఁ గొం
చుల్లస మొంది బొబ్బవిడె ♦ నుర్వి వణంకఁగ గుండె నీరుగాన్. ౧౭౫

ఉ॥ అంతఁ బతత్ఫలారవము ♦ లావనినుండిన కంసమిత్రుఁ డ
త్యంతబలుండు క్రూరుఁడు ఖ ♦ రాకృతియుక్తుఁడు ధేనుకుండు ఘ
స్రాంతరమందు నిద్రిలు మ ♦ హాసురుఁడెంతయు వించు నట్టి లో
కాంతకకోపరూపుఁడయి ♦ యాఁబలుఁ గన్గొని దువ్వి మీసలన్. ౧౭౬

ఉ॥ చేరుచుఁ బక్షిమాంఘ్రులను ♦ సీరియొదర్ వడిఁగొట్టి సారెకున్
సారెకు గార్ధభస్వనము ♦ సల్పుచుఁ బాఱుచుఁ బైకివచ్చుటల్
సీరియుఁగాంచి లీల నొక ♦ చే నల దానవపక్షిమాంఘ్రుల
వ్వారిగఁబట్టి రోసమునఁ ♦ బాఱఁగ వైచెను దాలశాఖపై. ౧౭౭

చ॥ విసరినవెంటఁ దత్పృథుల ♦ వృక్షముగూలెను దానిరాపిడిన్
బసచెడి ప్రక్కచెట్టు లిల ♦ పైఁబడ నద్భుతమయ్యె ధేనుకుం
డసమునఁ దిర్గి లేచి హరి ♦ హస్తములం గొని యామడన్ బడన్
విసరె గజంబు లాతికరి ♦ వీఁకను నెట్టినయట్లు భూవరా! ౧౭౮

చ॥ తదుపరి రౌహిణేయుఁ డల ♦ దానవునిం గొని త్రిప్పి భూమిపై
సదమదమొంద బాఁదె నల ♦ సంహతిఁ దద్దనుజుండు శీర్షముం
జదియఁగ సొమ్మసిల్లి త్రుటిఁ ♦ జట్టనఁ గ్రమ్మఱ లేచి చూచి దు
ర్మదపరిపూర్తమూర్తియయి ♦ మండి మహత్తరతన్మృధంబునన్. ౧౭౯

చ॥ శిరమున నాల్గుకొమ్ములను ♦ సృష్టినొనర్చుచు గోపబాలురన్
బొరిఁబొరిఁ గ్రుమ్మిక్రుమ్మి పలు ♦ పోకలఁ బోయెడు వారిఁ గాంచి స
త్వరగతి డాయుచున్ బొడిచి ♦ బాధలఁ బెట్టుచుఁ గొట్టి చట్టనన్
ధరఁ బడఁ నెట్టఁగాఁ దొడఁగె ♦ ధార్మికవర్య! యనంతరంబునన్. ౧౮౦

తే॥ నైకటికులును హరిసఖుల్♦నయచణులును, దంటలైనసుబలుఁడు,శ్రీ♦దాముఁడింక
స్తోకుఁడును నితరు లాతని♦ముండగముకు,గాంచి పరికరంబులఁ గొంచుఁ♦గదలి రంత.

క॥ శ్రీదాముఁడు దండమునన్, బాఁదెను సుబలుండు ముష్టి ♦ వానిని మొట్టెన్
మోఁదెన్ స్తోకుఁడు ద్రాటను, నాదట నంశుండు నతని ♦ నడుగునఁ దన్నెన్.

తే॥ మఱియుఁ దేజస్వినామకో♦ద్ధురబలుండు,రహిని నర్ధచంద్రప్రహా♦రముల శాస్త్ర
చోదితంబగు విధమున♦సలిపి బలిమి,వెంటనంటెను మిక్కిలి♦వంటుతోడ. ౧౮౩

తే॥ అర్జునుండను గోపకుం♦డతనిఁ ద్రోసెఁ,బాదమున విశాలర్షభ♦బలుఁడు గొట్టె
బంతితోడ వరూథపుఁ♦డతిబలమునఁ,దద్దనుజవర్యుఁ బ్రహరించెఁ♦దత్పరమున.

క॥ సావాసంబునఁ జేవను, నావెన్నుని మెప్పుగాంచి ♦ యుండనుగల యా
దేవప్రస్థుండా దు,ర్భావాన్వితదైత్యు చెంప ♦ లఁ వాయించెన్. ౧౮౫

చ॥ పదపడిఁ గృష్ణచంద్రుఁడు న ♦ పారబలంబున రెండుచేతులన్
త్రిదశరిపున్ గ్రహించి సొరి ♦ దిన్ బయికెత్తుచు దించి క్రిందికిన్
మద మణగంగఁ ద్రిప్పి పలు ♦ మాఱులు నెట్టన గోప్రవర్ధనా
ఖ్యాదనరు కొండపై విసరె ♦ నంతట ధేనుకదానవేంద్రుడున్. ౧౮౬

తే॥ రెండుగడియలు గడఁబట్టి ♦ లేచి మఱల, మేను జాడించుకొని హాతి♦మిళితమైన
మోముఁ దుడుచుచుఁ బొగరునఁ♦బూర్ణదీర్ఘ, శృంగములఁ గృష్ణుఁగైకొని♦నింగిఁ జేరె.

చ॥ తదుపరి లక్షయామడలు ♦ దాఁటినమీఁదట నాతఁ డందునన్
గదనము గృష్ణుతో సలుపఁ ♦ గా నతఁ డాతని రెండుచేతుల
న్గదియఁగఁబట్టి భూమిపయి ♦ నాడులు చూర్ణముగాఁగ మూర్ఛిలన్
గొదకొని నెట్టె నంత నల ♦ కొంటెయు వెంటనె లేచి కంటునన్. ౧౮౮

ఉ॥ శృంగములన్ హరిన్ బొడిచి ♦ చిత్రతరంబుగ గోప్రవర్ధనో
త్తుంగనగంబు మూలముల ♦ త్రోడఁ బెకల్చియుఁ గృష్ణునత్తిపై
ఖంగన వైచెఁ దోడుతనె ♦ కంజదళాక్షుఁడు దానిలాగికొం
చంగుగఁ దిర్గి వానితల ♦ యందునఁ ద్రోసెను ధారుణీశ్వరా! ౧౮౯

చ॥ మఱల నిశాటుఁ డావల స ♦ మర్ధతఁ గైకొని వేసెఁ గృష్ణుపైఁ
దిరిగి తదబ్జనేత్రుఁ డల ♦ దివ్యగిరిన్ గొని పూర్వరీతిఁగ
ర్బురశిరమందు వైవ నల ♦ పుణ్యజనుండును దిర్గి కిన్కఁ ద
ద్గిరిఁగొని శౌరిపై విసరి ♦ కేరుచు నార్చుచుఁ బాటి తివ్వనన్. ౧౯౦

ఉ॥ హేతిసమస్వశృంగముల ♦ నిద్ధబలున్ బలుఁ గ్రుమ్మి పాదసం
ఘాతములన్ హతిన్ సలుపి ♦ కంధులు ఘూర్ణిల సర్వనిర్జరుల్
భీతిల భూమిమండలము ♦ వెట్టె వకావకలై చెలంగఁ బెం
గూతను వేయ నా ముసలి, ♦ కోపపరీతమనస్వియై వెసన్. ౧౯౧

చ॥ గడుసున ధేనుకాసురుని ♦ గట్టిగఁ జేతులఁబట్టి భూమిపైఁ
బెడఁబడఁ గొట్టి సొమ్మసిలఁ ♦ జేసి మఱిన్ గొని వజ్రకల్పమౌ
పిడికిట మొట్ట దమ్ముపయె ♦ వేల్పులు నందనజాతపుష్పముల్
దడదడఁ జల్లసాగిరిగ ♦ ధైర్యపరాక్రమసాహసాంచితా! ౧౯౨

తే॥ మృతకళేబరమందున ♦ మేఘమందు, మెఱుపు నరణిని నగ్ని యా ♦ పరునియందు
నఖిలజగములు జనియించు ♦ నట్టు లొకఁడు, వింతగా బైలుదేరి బ ♦ ల్వేడ్కతోడ.

సీ॥ చామనచాయయుఁ ♦ జక్కని పుట్టముల్, పద్మమాలలు సాలఁ ♦ బరఁగుచుండ
వేయిచక్రంబుల ♦ విరవముల్ దగ వేయి, ధ్వజములు మిక్కిలి ♦ భాసిలంగ
బంగరుసొమ్ములు ♦ ప్రభలుమించెడి గొప్ప, రతనముల్ మిక్కిలి ♦ రాజిలంగ
లక్షపార్షదులును ♦ లక్షచామరములుఁ, బదివేలగుఱ్ఱముల్ ♦ వఱలుచుండ

తే॥ దివ్యయోజనవిస్తీర్ణ ♦ దేహమొంది, స్రగ్వియై మనోయాయియై ♦ రౌహిణేయ
హరులకుం బ్రణమిల్లియు ♦ నప్పు డచట, ఘనరథం బెక్కి గోలోక ♦ మునకుఁ జనియె.

ఉ॥ ఈగతి ధేనుకాసురునిఁ ♦ గృష్ణబలుల్ వధియించి తమ్ము నా
గోగణగోపకోత్కర మ ♦ కుంఠితరీతినిఁ బ్రస్తుతింపఁగా
వేగమ వారిసిం గలిసి ♦ వేడుక నిండ్లకుఁ జేరసాగిరో
యోగిజనప్రమోదకర ♦ యోగ్యచరిత్ర విభూషితప్రభూ! ౧౯౫

క॥ నావుడు జనకుం డిటులనె, నోవిబుధా! ధేనుకాఖ్యుఁ ♦ డుత్తమగతి నే
యేవిధిఁ జెందెనొ తొలి జని, లోవిఁ డెవ్వండొ దయఁ బ♦లుకుమా! తెలియన్.

క॥ అనవుడు నారదముని యిట్లనియెను నో జనకరాజ! ♦ యాదిమజని నీ
దనుజుఁడు జరిపిన వృత్తము, వినుమా! యనుమానమేల? ♦ వినిపింతుఁజుమీ!

## ధేనుకాసురపూర్వజన్మ వృత్తాంతము.

చ॥ ఉలిపి విరోచనాసురకు ♦ లోద్భవుఁడున్ బలిపుత్రకుండునై
నలిగ వసించు సాహసిక ♦ నామకుఁ డీతఁడు గంధమాదనా
చలమున వాసమున్ సలిపి ♦ సమ్మదుఁడై పదివేల లేముల
న్గలిసి మనోజరంగమున ♦ నాట్యము సల్పెడి కాలమందునన్. ౧౯౮

ఉ॥ భామల నూపురంబుల ర ♦ వంబులు మ్రోయ, గుహాంతరంబునన్
నేమముతోడ నుండెడి ము ♦ నిప్రవరుండగు దుర్వసుండు స్వీ
యామితయోగభంగుఁడయి ♦ యంఘ్రులఁ బాదుకలన్ ధరించి ని
ర్ధూమ కృశానురూపమును ♦ దూఁకొని యష్టినిఁ గేలఁ బట్టియున్. ౧౯౯

క॥ మీసల మెలియం బెట్టుచు, రోసమునన్ వాని డాసి ♦ రూక్షోక్తుల నో
వేసరి! ఖరరూపము నీ, కీసమయము నందునె ఘటి ♦ యించుతఁ బలువా!

తే॥ కానిచో నీవు తపమునఁ ♦ గ్రాలు వాని, నన్ను వ్యర్థు నొనర్తువే ♦ నయనములకుఁ
గావరం బెక్కియుండెనే ♦ ఖరనిశాట!, దుర్వసుండని యెఱుఁగవే ♦ త్రొక్కి విడుతు.

క॥ అనవుడు సాహసికుండును, విని తన్ముని పాదములను ♦ వేఁ బ్రాలి నన్
నెనరున నా యపరాధము, లను నోరిచి ప్రోవుమోయి ♦ లావిబుధేంద్రా!

ఉ॥ ఈరహిఁ వేఁడ మౌనివరుఁ ♦ డిట్లనె నాలుగులక్షలేండ్లుగా
భారతవర్షమం దలరు ♦ పావితమాధురమండలస్థిత
శ్రీరమణీయతాళవనిఁ ♦ జెందెడి శౌరిసమేతసీరితోఁ
బోరి నశించి నిక్కముగ ♦ ముక్తిని జెందెద వోరి యాసురా! ౨౦౩

తే॥ అతుల ముక్కోపియైన మ ♦ హాతపస్వి, మరలఁ గరుణింప నాదైత్య ♦ వరుఁడు గార్ధ
భాకృతిం బొంది ధేనుకా ♦ హ్వాయముఁ దాల్చి, యుక్కరుల లోన మేటియం ♦ చుగ్గడింప.

క॥ తాలవనంబునఁ జేరుచుఁ, గాలంబును గడపుచుండి ♦ కమలాక్షోక్తిన్
నీలాంబరకరముఖమున, నీలిగి యటు ముక్తి జెందె ♦ నిరవద్యవిభూ! ౨౦౪

క॥ హరి స్వయముగఁ జంపమికిన్, వరకారణమేది యనినఁ ♦ బ్రహ్లాదున కో
"వరచరితా! నీకులమే, తరుణమునన్ జంప ననుచు ♦ దయవరమిడుటే"

## శ్రీకృష్ణుండు కాళియ మర్దనంబు జేయుట.

చ॥ మఱియొక కాలమందున ర ♦ మా విభుఁడన్నను రామువీడి త
త్సురభులఁ ద్రోలుచున్ జెలుల ♦ తోఁ దగి యట్టి కళిందజా తటం

బరమునఁ జొచ్చెఁ దన్నది వి ♦ షావృతవారులఁ గ్రోలి వెంటనే
పరవశతన్ బశుల్ వడిమె ♦ వ్రాలిరి తద్ధరిమిత్రు లద్దరిన్. ౨౦౭

క॥ ఆపుండరీకనేత్రుఁడు, గోపాలక గోగణంబు ♦ గూలుట గని సం
తాపింపక దయఁ బ్రోచెను, నాపోఁడిమి విస్తరింతు ♦ ననఘా వినుమా! ౨౦౮

ఉ॥ ఎప్పుడు మిత్రగోప్రతతు ♦ లేమి యెఱుంగక యందుఁగూలెనో
యప్పుడు శౌరి వారు గడు ♦ పారఁగఁ ద్రాగిన వారిలో విషం
బొప్పుటగాంచి పుష్టినుల ♦ నొద్దికఁగట్టుచు నెక్కి నీపమున్
దెప్పునఁ దత్తరంగిణిఁ ♦ దేఁకున దూఁకె గుభాలునన్ విభూ! ౧౦౯

తే॥ తత్పతనమునఁ దన్నద్యు ♦ దకము గలఁతఁ, బాఱె నల్లడలందునఁ ♦ బర్వె నప్పు
డంసఁగల కాళియాహిగృ ♦ హంబునొకనంబుగాఁ దోడంగెను తల్ప ♦ రంబునందు.

ఆ॥ కాళియోరగుండు ♦ గనలుచు వంద భోగముల విప్పి విషముఁ ♦ గ్రక్కియక్క
మలనయను దాసి ♦ యలఘుదంష్ట్రిలతోడఁ, గొఱికి బాహువులను ♦ నెఱిగఁ గప్పె.

ఉ॥ అంత ఘనాఘనాభుఁడు ని ♦ జావఘనంబు ఘనంబొనర్చి య
త్యంతబలంబుతోడ నల ♦ వ్యాళము కప్పును డుల్చి కేలఁ బు
చ్ఛాంతముఁబట్టి గిర్గురున ♦ నౌర! యహా! యనఁ ద్రిప్పిత్రిప్పి యా
వంతను ద్రొక్కి శాతశత ♦ బాణముల్ బఱపెన్ నరేశ్వరా! ౨౧౨

ఉ॥ ఆనలఁ గాళియుండును భ ♦ యంబును గొల్పుచుఁ దిర్గి రేఁగి యా
శ్రీవిభు వామహస్తముఁ గ ♦ సిన్ గ్రహియించె ననంతరంబునం
దావన జేతుణుండు గుడి ♦ హస్తముతోఁ దనుపీడ దానినిన్
జేవను గొట్టె తార్క్ష్యవలెఁ ♦ జేకొని యేఁచుచుఁ ద్రోసెఁ దన్నదిన్. ౨౧౩

చ॥ పదపడి తద్భుజంగపతి ♦ పంతముతోఁ జనుదెంచి శ్రీరమే
శు దరికి నేగ నా ఘనుఁడు ♦ సూచి రయంబున దాని వాలమున్
విదిలిచి త్రోసి రోసమున ♦ భీమునిశాతశతాశుగంబులన్
గొదకొని నైవ నాతఁడును ♦ గొంకక క్రమ్మఱ నమ్మహాత్మునిన్. ౨౧౪

ఉ॥ దాయుచుఁ గోఱల్ గఱచి ♦ ధావనమెత్తెడి లోన నట్టి నా
రాయణమూర్తి పూర్ణబల ♦ రాజితుఁడై యల కాళియాహి నా
హా! యనఁ జేతఁబట్టి తన ♦ యాయతముష్టిని మొట్టె దానిచే
నా యురగంబు తన్నిమిష ♦ మందునఁ దాళక పొంది సొమ్మనున్. ౨౧౫

తే॥ వందమొగములఁ గ్రిందికి ♦ వంచి తనకు, నభిముఖంబుగఁబడుట బ్రహ్మాండనాయ
కుఁడగు హరి గాంచి తన్మణి ♦ కోటిరుచిర, ఫణములం దెక్కి మురళినిఁ ♦ బట్టె నంత.

ఉ॥ నాటకరంగమం దలరు ♦ నర్తకుకైవడి వేషమున్ జగ
న్నాటకసూత్రధారి హరి ♦ నవ్యవిధంబునఁ దాల్చి సుస్వరం,

బాట, లయల్ సెలంగ విబు ♦ ధావళి మెచ్చుచుఁ బుష్పవర్షమే
లోటును లేనటుల్ గురియ ♦ లోలుభతన్ గడుఁ బాడ వంశితోన్. ౨౧౭

ఉ॥ వెండియు మాధవుం డటుల ♦ వేడుక గానము సేయుపట్టునన్
దాండవసన్మహోత్సవగ ♦ తప్రతిభాఢ్యమహానటాభుఁడై
దండి లయాదియుక్తగతిఁ ♦ దద్దఁ బదంబులవేసి భోగముల్
జెండఁ గడంగ నచ్చిలువ ♦ చెల్వాలు వల్వాల నశ్రు లొత్తుచున్. ౨౧౮

కాళియపత్నులు శ్రీకృష్ణుని నుతించుట.

క॥ చని యల హరిపదములఁబడి, వినవే చెవియొగ్గి మాదు ♦ విన్నపము దయన్
గనవే చల్లని చూపునఁ, గొనవే మావందనముల ♦ గోపాలమణీ! ౨౧౯

క॥ విన్నారము నీ మహిమముఁ, గన్నారము గన్నులారఁ ♦ గరుణాభరణా!
యున్నారము నీ కృపకై, యన్నారము మమ్ముఁ గావు ♦ మని జగదీశా! ౨౨౦

క॥ ఘననిభ! యభయశుభప్రద!, వనమాలీ! కనకచేల! ♦ వంశీలోలా!
వనజాతపత్రలోచన!, వనజాసనమదనజనక! ♦ వననిధిశయనా! ౨౨౧

ఉ॥ జిష్ణుముఖామరప్రతతి ♦ సేవ్యపదాంబుజ! యంబుజోదరా!
జిష్ణుముఖస్వబంధుహిత ♦ శేఖరపోషక! కౌస్తుభాదిరో
చిష్ణు! యలంకరిష్ణు! బహు ♦ చిత్రచరిత్రమనోజ్ఞ! ప్రాజ్ఞ! శ్రీ
కృష్ణ! కృపామతిం గనవె ♦ యీవిఁకఁ బ్రోవవె మమ్ము మా పతిన్. ౨౨౨

ఉ॥ చూచితి మాత్రిలోకములఁ, ♦ జూచితి మేదుసముద్రము, ల్మరిన్
జూచితి మేదుకొండలను ♦ జూచితి మెల్లధునీవతంసముల్,
జూచితి మెల్లచోట్ల, జిత ♦ సూర్యశశిద్యుతి! నీవు దప్ప నే
ర్పొప్పిచెడివారు లేరు సుమి ♦ ప్రోవుము! మా పతియైన కాళియున్. ౨౨౩

క॥ పతిభిక్ష మాకుఁ బెట్టుచు, ద్రుతమున రక్షింపుమయ్య ♦ ద్రుహిణాండసమా
హితవిపులోదర! యని సంస్తుతిఁ జేసిరి కాళియుండు ♦ సూచి నతుండై. ౨౨౪

క॥ దీనజనావనతత్పర!, నానెరసు క్షమించి రక్ష ♦ ణము సేయుమ! రా
ధానాయక! యనివేఁడఁగ, నా నలినాక్షుండు వల్కె ♦ ననుకంప నిటుల్.

తే॥ కాళియాహ్వాయభోగీంద్ర! ♦ కౌతుకమున, మిత్రపుత్రకళత్రస ♦ మేతుఁడవయి
లెమ్ము రమణకద్వీపంబుఁ ♦ బొమ్ము నీకు, నెట్టిలోపంబు లేదని ♦ యెఱుఁగు మందు.

ఉ॥ తత్పతగేంద్రబాధ లటఁ ♦ దప్పక కల్గునటంచు నెంచెదో
తత్పరితాపమొందకుము ♦ తద్బలి, త్వద్వనితా స్తవోల్లస
న్మత్పదపద్మలాంఛనస ♦ మంచితమంచుఁ దలంచి మెచ్చి యా
పత్పథమందుఁ ద్రోయఁడవి ♦ భావమునందున నమ్ముమో ఫణీ! ౨౨౭

ఉ॥ అంతటఁ గాలియోరగము ♦ నా హరికిన్ గిడిగిళ్ళొనర్చి వే
కాంత, స్వబంధువుల్ మొదలు ♦ గాఁ గలవారలఁగూడి యల్ల ద్వీ
పాంతరమొందె నంత ఫణి ♦ యందు ముకుందుఁడు సిక్కికొన్న వృ
త్తాంతము విన్న నందముఖ ♦ తద్వ్రజవాసులు సర్వు లాదటన్. ౨౨౮

వ॥ తద్బాలకృష్ణుం డున్న ప్రదేశంబున కరిగి తద్యమునాతరంగిణీ నిర్గతుండై యద్దరిపైఁ బెద్దనిద్దురవోయిన చెలికాండ్రను లేపి ముద్దుమొగమునం జిఱునగవొప్ప నవ్వారితోఁ గూడి ముచ్చటాడుచు వచ్చెడి నచ్చిన్ని వెన్నునిం గన్నులపండువగాఁ గాంచి హర్షించి కౌఁగిలించి చుంబించికొనిరి. వెండియు నందుండును, దత్సుందరియుఁ, దమ నందనున కభయశుభవిభవంబులు లాభింపఁ బరమానందంబుతో భూబృందారకబృందంబునకు వందనపూర్వకంబుగా ననేకదానంబు లొనర్చిరి. అంత నిజవక్షోజంబులం దక్షిణంబుగా క్షీరంబు స్రవింప యశోదాదేవియు. ౨౨౯

చ॥ హరిఁ గొని ముద్దువెట్టుకొని ♦ హర్షముఁ బొందెను నెల్లవ్రేలు, వ
య్యర గడుహాయిగా విసర ♦ నక్కలిఁదీర్చుకొనంగఁ దన్నదీ
పరిసరమందుఁ దామసిని ♦ బాగుగ నిద్దుర వోవ సాగిరా
త్మరమణులున్ సుతుల్, సఖులు, ♦ దమ్మునుజుట్టి శయింప నంతటన్. ౨౩౦

## శ్రీకృష్ణుండు దావాగ్నిపానం బొనర్చుట.

చ॥ నడినిసి వేణుఘర్షణము ♦ నన్ జనియించిన కారుచిచ్చు బ
ల్వడిఁ బ్రలయాగ్నితుల్యమయి ♦ పండిన గోపకులన్ దహింప రా
నడలుచుఁ జూచి వారలు ని ♦ రాశ్రయులై బలరామయుక్త కృ
ష్ణుఁడుగల చోటి కేగి పలు ♦ జోతములం బొనరించి భక్తితోన్. ౨౩౧

తే॥ కృష్ణ! శ్రీకృష్ణ! మమ్ములఁ ♦ దృష్ణతోడఁ, గావుమియ్యదె కార్చిచ్చు ♦ కనులుమిఱులు
సెందునట్టుల వచ్చెడిఁ ♦ బొందు లివిగో, పోవుచున్నవి దేవరా ♦ ప్రోవవయ్య!

చ॥ అనఁగ సరోజలోచనుఁ డ ♦ ఘావళితూలధనంజయుండు వి
ఘ్నుఁడు బరాత్పరుండు నరి ♦ దారణధీరుఁ డుదారుఁడాదితే
యనుతుఁడు నైన కృష్ణుఁడు త ♦ దార్తులఁ గన్గొని గోపులార! యిం
కను భయమొందఁబోకుఁ డిది ♦ గ్రచ్చఱ నార్పెద మూయుఁడీ కనుల్. ౨౩౩

తే॥ అనుచుఁ గ్రమముగ దాయు దా ♦ వాగ్నినోట, గ్రమింగెనందాదిగోపకుల్ ♦ మిగులవింత
నొంది ప్రొద్దున మేల్కాంచి ♦ యూరి కేగ, సాగిరో మిథిలేశ్వర! ♦ జనకరాజ!

క॥ అని వచియింపఁగ దేడును, విని వింతలఁబొంది మరల ♦ విన నుత్సాహం
బును జూపుచు నారదముని, ఘనునకు వాక్రువ్వఁదొడఁగెఁ ♦ గౌతుకమతితోన్.

చ॥ ఎవనిపదాబ్జయుగ్మరజ ♦ మీపదునాల్గు జగంబులందు జ్ఞా
నవిభవవృద్ధులెన్నొ జన ♦ నంబుల నెత్తియుఁ జెందలేక మా

న విరతులైరో యట్టి చర ♦ ణంబులె యిత్తఱిఁ గాళియాహిపై
నివెలిఁగెఁ జూడఁ దత్క్రియలు ♦ నివ్వెఱపాటును గల్గఁజేయవే? ౨౩౯

క॥ ఈయురగేంద్రుఁడు ప్రాజ్ఞని, నేయేరీతులఁ జెలంగె ♦ నెఱిఁగింపుమ ధీ
రా! యన నామునియాతఁడు, స్వాయంభువ కాలగ భృగు ♦ వంశభవుండై.

తే॥ వేదశిరుఁడను పేరొంది ♦ పెరిగి వింధ్య, యనెడి పర్వతరాజంబు ♦ నందు నెక్కి
నిశ్చలంబుగఁ దపమును ♦ నియతితోడ, జనులు లేనట్టి చోటున ♦ సల్పుతఱిని.

## కాకభుశుండిముని కథ.

ఆ॥ తపముఁజేయ నెక్క ♦ తలిసి యశ్వశిరోహ్వ,యుండునట్టి వింధ్య ♦ యుచితమంచు
నెంచి యేగుదెంచ ♦ నెక్కతంబుననొప్ప, వకసమేతుణములఁ ♦ బఱపి నెఱిఁగ.

చ॥ తపమును జేయఁగా నిచటఁ ♦ దావు ఘటిల్లదు హాయిలేదు నా
దుపలుకులన్ గ్రహించి చను ♦ తోడ్తన వేఱుస్థలంబు మీబృహ
త్తపమునకై కనుంగొనుము ♦ తర్లుము నిల్వకు మిం దనంగ నా
తపసియు నిట్లు వాకొనియెఁ ♦ దావకృశానుసమాననేత్రుఁడై. ౨౪౦

చ॥ ఇది పరమేశుభూమిగద ♦ యెవ్వరిపెత్తన మేమిలేదె యిం
దిదివఱ కెందఱో మును ల ♦ హీనతపం బొనరింపరే? యిటన్
గుదిరి తపంబు నే సలుపు ♦ కోర్కిని వచ్చితి నింతమాత్రకే
పదరుచు నాపయిన్ బుసలఁ ♦ బర్వెడి సర్పముమాడ్కి వత్తువే? ౨౪౧

ఉ॥ వచ్చితి వక్కతంబున సు ♦ పర్ణభయంబు ఘటింపఁ బాముపై
క్రచ్చఱఁబొమ్ము పిమ్మట న ♦ ఖండుఁడు వేదశిరుండు ధూర్త! నీ
యిచ్చ దురాశయప్రచుర ♦ ౦చుక తప్పున కింతఁజేసెదే?
చొచ్చి క్రియార్థివై యిచట ♦ సూటులఁ బోటుల మాటలాడెదే? ౨౪౨

ఉ॥ కావునఁ గావుకావనెడి ♦ కాకివి గమ్మనె నంత నిద్దరున్
జేవచెడన్ వెతన్ బడుచు ♦ శ్రీహరి దిక్కని నమ్మియుండ రా
థావిభుఁ డేగుదెంచి యల ♦ తాపసులన్ గని ప్రీతిపూర్వకో
క్త్యావళి నూఱడించి ముద ♦ మందఁగ నిర్వురకిట్లు వాకొనెన్. ౨౪౩

ఉ॥ ఏమి పరస్పరం బిటుల ♦ నిప్పుడు శాపము లిచ్చుకొంటి రా
హా! మితిమీఱు కోపమును ♦ నందుట మానుల కర్హ మొక్కొ? మీ
రీమెయి శాంతిఁ బొందుఁడిఁక ♦ నిర్వురు మత్ప్రియభక్తులౌట మీ
క్షేమముఁ గోరి వచ్చితిని ♦ జెప్పెడి నానుడు లాలకింపుఁడీ! ౨౪౪

ఉ॥ నానుడి రిత్తసేయ యత ♦ నంబును జేసెదఁగాని భక్తసం
తానవచస్సమూహ మన్య ♦ థంబుగ సల్పను నిద్ది నావ్రతి

జ్ఞానియమంబు వేదశిర ♦ సా! యటులైనను నీశిరంబునన్
బూనిక మత్పదంబులిడి ♦ ముక్తునిఁ జేసెదఁ దార్క్ష్యభీతి పోన్. ౩౪౫

ఉ॥ ఆకుల మొందఁబోకు మిఁక ♦ నశ్వశిరా! వినుమయ్య! నానుడుల్
గాకత నీవు సెందినను ♦ గారుణికంబున జ్ఞానమిత్తుఁ ద
త్ప్రాకృతవికారకార్యములు ♦ గ్రాలవు నీయెడ నయ్యెడన్ మహా
ప్రాకట శుద్ధమత్త్వలిని ♦ రాజిల నుందువు నిక్కువంబుసూ. ౩౪౬

తే॥ ఇట్లు కరుణించి శ్రీహరి ♦ యేగె నవల, నశ్వశిరుఁడు నీలాద్రిని ♦ నాత్మఘోష
మగుచు జ్ఞానియై రామభ♦క్త్యంచితుఁడయి, శ్రద్ధ రామాయణంబును♦జదువుచుండె.

ఆ॥ గరుడుఁ డొక్కయెడను♦గాంక్షింపఁ దత్పృచ్ఛ, పుస్తకస్థతత్త్వ♦మును వచించి
తపముఁ జేయసాగెఁ♦దాదాత్మ్యభావంబుతోడ జనకరాజ! ♦ త్రోసి చింత. ౩౪౭

కాళియ వ్యాళోపాఖ్యానము.

తే॥ ఇఁకను వేదశిరోవార్త ♦ నీవు వినుమ, రహిని జాక్షుషమన్వంత ♦ రంబునందు
నల్ల దక్షప్రజాపతి ♦ యాత్మసుతలఁ, బదునొకండ్రను దక్కఁ గశ్య ♦ పమునికిచ్చె.

తే॥ అల్లవ్రజమందు వసుదేవు♦నాలియగుచు, హాలినిఁ గనినట్టి రోహిణి,♦యట్టిసతుల
యందునన్ గద్రువ యనంగ♦నలరి కోట్ల,కొలఁదిఁ జిలువలన్ గాంచెను♦గోర్కెదీర.

ఆ॥ అట్టి కాద్రవేయు ♦ లందు హాలాహల,కలితములును రత్న ♦ లలితములును
నమలపంచశతఫ ♦ ణాంచితములునైన, పన్నగములు కొన్ని ♦ వఱలు మఱియు.

తే॥ విషధరములును శతఫణా♦న్వితములు మణి, గణమనోజ్ఞములైన నా♦గములుగొన్ని
గలవు తద్వేదశిరసుఁ డీ ♦ చిలువలందుఁ, గాళియాఖ్యను మేటియై ♦ క్రాలె నవల.

ఆ॥ ఎల్లసర్పములకు ♦ నల్ల శేషుఁడు నాథుఁ, డయ్యె నతఁడె యచ్యు ♦ తాగ్రజుఁడన
రాముఁడనఁగ రోహి ♦ ణీమహిళన్ బుట్టె, వెండి యింతకుఁ దొలి ♦ విషయము విను.

చ॥ ఒకసమయంబునందునఁ బ ♦ యోరుహనాభుఁడు పద్మనేత్రుఁడున్
బ్రకృతిపరుండు విష్ణుఁ డల ♦ పన్నగనాథునిఁ గాంచి యిట్లనెన్
సకలజనోపకారముగ ♦ సర్వజగత్పృథుభారమున్ దల
న్దికమకలేక మోయుటకు ♦ నీవె సమర్థుఁడవో ఫణీశ్వరా! ౩౫౪

తే॥ ఈవు దప్పిన వేఱువా♦రెందు లేరు, కాన నాయాజ్ఞ నిదిమోయఁ♦గడఁగుమయ్య!
యంతులేనట్టి బలము నీ♦ కలరుటను న,నంతుఁడను పేరుగల్గె ఫ ♦ ణాధరేంద్ర!

చ॥ అనవుడు శేషుఁ డిట్లనియె ♦ నచ్యుత! నాకిది సంకటంబెయై
నను భవదాజ్ఞ భూభరము ♦ నా తలఁ దాలుతుఁగాని యెంతదాఁ
కనొ మొటు మోయసానొ; యది ♦ యంతయుఁ బూసను గ్రుచ్చునట్లుగాఁ
గనికర ముంచి నాకుఁ బలు ♦ కన్ నిను వేఁడెద లోకనాయకా! ౩౫౬

ఉ॥ అంత ననంతశాయియు న ♦ నంతఫణీశ్వర ! నీవచస్సులన్
జింత దొలంగ సంతసముఁ ♦ జెందితి నీవిఁక మద్గుణంబు ల
త్యంతముఁ దెల్పు పేరుల స ♦ హస్రముఖంబుల వేలువేలుగా
సంతత ముచ్చరించుచు ర ♦ సాధురమున్ దల మోయుచుండుమా ! ౨౧౭

క॥ ఎప్పుడు నానామములున్, జప్పగనై పోవునో ర ♦ సాధరము నన్నీ
వప్పుడు వీడుము శేషా !, యొప్పును నీకదియ నాకు ♦ నూరీకృతమా. ౨౧౮

వ॥ అంత శేషం డురరీకరించి తిరిగి శ్రీహరి కిట్లనియె. ౨౧౯

క॥ ఆధేయంబుల కెల్లను, నాధారుఁడ నగుదుఁగాని ♦ యాధారుఁడనా
నా ధురమున కేధీరుం, డాధారుండగు వచింప ♦ వయ్య రమేశా ! ౨౨౦

ఉ॥ నావుడు దేవకీసుతుఁడు ♦ నాగకులేశ్వర ! నేను కూర్మమై
చేవను నిన్ను మోసెదను ♦ జెందకు మిందున సందియంబులన్
గావునఁ బొమ్మటంచుఁ బలు ♦ కన్ భుజగేంద్రుఁడు లేచి భక్తితో
శ్రీవిభు మ్రొక్కి పూజల వి ♦ శేషముగాఁ బొనరించి వెంటనే. ౨౨౧

తే॥ లక్షయోజనముల క్రింద ♦ లలిని వెలుఁగుచుండు పాతాళలోకంబు ♦ నొంది బహుళ
భువనమండలభారంబుఁ ♦ బూనిచేతఁ, దలను బెట్టుకొనెన్ జండ ♦ బలముతోడ.

తే॥ ఆదిశేషుఁడు పాతాళ ♦ మరిగినపుడు, సర్వఫణులును జనుదెంచి ♦ సత్వరగతి
బ్రహ్మయాజ్ఞను సేవించి ♦ భక్తితోడఁ, దత్ఫణీంద్రాజ్ఞఁ గొనియోలిఁ ♦ దరలి యచట

వ॥ కొన్ని యతలంబునకుఁ గొన్ని వితలంబునకునుఁ గొన్ని సుతలంబునకును గొన్నితలాతలంబునకుం గొన్ని పాతాళంబునకుం గొన్ని రసాతలంబునకుం జనె. అందు రసాతలమందునుండు రమణకద్వీపంబా కాళియాదివ్యాళంబుల కునికిపట్టుగాఁ జెలంగుఁగాదె. వెండియు నేమి వినవలతువో తెల్పుమన నా బహులాశ్వుండు మునీశ్వరా ! ఇతరసర్పంబులకు లేని భీతి యా రసాతలాంతర్భాతరమణకద్వీపస్థిత కాళియదీర్ఘపృష్ఠంబున కేల గలిగెనో యానతిండని వేఁడ దేవమునీంద్రుం డా రాజేంద్రునితో నిట్లనియె. ౨౨౪

క॥ గరుడుం డల ద్వీపమునన్, విరివిగ ఫణులుండు నంచు ♦ విని చని కని యా
యురగంబులఁ బ్రతిదినమును, గరుణను విడి కుడువఁ దొడఁగెఁ ♦ గడుపార సుధీ !

తే॥ స్వార్థపరుఁడయి యటు దమ్ముఁ ♦ జంపుచుంటఁ
గాంచి యచ్చటి యెల్ల నా ♦ గములు గుమిగఁ
జేరి యోచించి యాతని ♦ చెంతకేగి
వందనములను గావించి ♦ భయముతోడ. ౨౨౬

మ॥ గరుడీ ! గాలిని మేసి మూలల నెటో ♦ కాల్పోకున్న మమ్మిట్లు త
త్కరుణాసాగరపద్మనాభరథమున్ ♦ ద్వన్మాతృభక్తుండవున్

వరశాయుండవు పక్షినాథుఁడవునై ♦ బాధించుటల్ నీకుఁ బెం
బరువా? పాడియ? పగ్గెయా? సుకృతమా? ♦ పల్కంగదే ధీనిధీ! ౨౬౭

తే॥ స్వార్థపరత మీబోఁటి ధీ♦శాలురకును, నున్నచో నెల్ల లోకంబు♦లోక్కసారి
ధ్వంసమైపోవె కావవే! ♦ పరమకరుణ, నక్కరణిఁ గానిచో విను♦ మొక్కమాట.

చ॥ ప్రతిదినమిట్లు మమ్ములను ♦ బట్టి గ్రసింపకయున్న, మేము స
మ్మతిఁ బ్రతిమాసమందునను ♦ మాంసవనస్పతిశోణితాన్నసం
యుతముగ నొక్కసర్పమును ♦ నుక్కల చాలుగ మీకు నిత్తు మీ
వితమున నొప్పి పొమ్మని ♦ వేడఁగఁ దార్క్ష్యుఁడు వల్కె నిట్టులన్, ౨౬౯

ఉ॥ ఒప్పితిఁ గాన మీరలిఁక ♦ నుక్కలచాలుగ మాసమాసమున్
సప్పముఁ గొంచు నాకడకుఁ ♦ జక్కఁగ వచ్చిన లెస్సయౌ; మఱిన్
దప్పిన నష్టపూర్తికయి ♦ నామది నచ్చినయట్లు మిమ్ము నే
నుప్పన చప్పనల్ గనక ♦ యూరక మెక్కెద నంచు నమ్ముఁడీ! ౨౭౦

తే॥ ఇట్టి తీర్మాన ముభయులు ♦ నేర్పడంగఁ, జేసికొని రంత ఫణులును ♦ జెప్పినట్టు
లిండ్లచాలుగ బలులిడు ♦ చెదలు వెఱపు, విడిచియుండిరి పిమ్మట ♦ వినుము భూప!

తే॥ క్రమముగా నిండ్లవరుసను ♦ గాళియూహి, సద్మమున కట్టియేర్పాటు ♦ సంభవింప
నతఁడు దా మేటి యనినిక్కు ♦ చందటివలె, బలినిఁ గొని యేగకుండె నా♦పట్టునందు.

మ॥ వినతాపుత్రకుఁ డట్టి గొప్పబలినే ♦ వీక్షించి వీక్షించి గ్ర
క్కునఁ గాలోగ్రసమానుఁడై యరిగి త ♦ త్కుంభీనసశ్రేష్ఠుపై
ఘనపాదంబులు సంచలించు నటులన్ ♦ గావించె నద్దానికా
యనిలాహారి సహింపలేక పడి మూ ♦ ర్ఛాక్రాంతుఁడై క్రమ్మఱన్. ౨౭౩

చ॥ తెలివిని లేచి బుస్సలను ♦ దీక్ష్ణవిధంబునఁ గొట్టి నాల్కలన్
బులుఁగులతోని నాకి తన ♦ భోగశతంబును విప్పి కోఱలన్
బలుమఱుఁ గంటుతోఁ గఱవఁ ♦ బక్షివిభుం డను దానిఁ బట్టి తె
క్కలఁ గడు బాఁది తుండమునఁ ♦ గైకొని మేదిని మోఁదె భూధవా! ౨౭౪

చ॥ బరువడిఁ గాళియోరగము ♦ పట్టఁగరాని మహాగ్రహంబునన్
గరుడుని నిట్టటుల్ గవిసి ♦ కానని కైవడి తార్క్ష్యు నాసికన్
ద్వరగతితోడఁ దప్పుకొని ♦ తత్పదయుగ్మము నట్టె చుట్టుచున్
బారిఁ బొరిఁ బీకి క్ష్వేళమును ♦ మోములఁ గార్చుచు లాగె తెక్కలన్. ౨౭౫

ఆ॥ అపుడు గరుడి తెక్క ♦ లంసు మయూరక, నీలకంఠములును ♦ నోలిఁ బుట్టె
నాశ్వయుజమునందు ♦ నాదిపక్షదశమి, వాని దర్శనంబు ♦ భద్రకరము.

ఉ॥ పిమ్మట వైనతేయుఁ డతి ♦ భీకరలోచనుఁడౌచుఁ దీక్ష్ణతుం
డమ్మునఁ గాళియున్ గొని త ♦ టాలున నేలను గూలఁగొట్టి దే

హమ్మును జీల్పఁబూను తఱి ♦ నాఫణి గన్గొని యాగనంచుఁ బా
దమ్ము గొలందిఁ బాఱె నల ♦ తార్క్ష్యుఁడు సైతము వెంటనంటఁగాన్. ౨౬౭

చ॥ క్రమముగ నాపృదాకు పటు ♦ ఖండము లేడును గొప్పవైన గ్రా
వములను సాగరంబులను ♦ వాఁకల దీవుల దివ్యసప్త లో
కములను జొచ్చి చొచ్చి యటఁ ♦ గ్రాలెడివారల వేఁడివేఁడి పృ
ష్ఠమున ఖగేశ్వరుం డగుప ♦ డంగ భయంబును బొంది టక్కునన్. ౨౬౮

చ॥ మరల నధోజగంబున క ♦ మందగతిన్ జని యేరిఁ గోరినన్
హరి భయ మిందుఁ గల్గునని ♦ యందఱు నూరకయుంటఁ గాంచి యా
పరముఁడు దేవవంద్యుఁడును ♦ వ్యాళవిభుండును నైన శేషు డ
గ్గరి వినుతించి మ్రొక్కి తమిఁ ♦ గద్గదవాణిని వేఁడె నిట్టులన్. ౨౬౯

ఉ॥ దోషమదేభకేసరివి ♦ తోయజలోచనశయ్య వర్వి సం
తోషకృతిప్రవీణుఁడవు ♦ ఘాతవిరోధివి సర్పరాజ వో
శేష! ఖగేశ్వరుం డిపుడు ♦ చెండఁగ వచ్చెడిఁ గాళియాఖ్యు న
న్బోషణ మెంతయున్ సలిపి ♦ పుణ్యముఁ గైకొను మో కృపానిధీ! ౨౭౦

మ॥ అని ప్రార్థింపఁగ శేషుఁ డిట్లనియె నో ♦ వ్యాళేశ్వరా! నానుడుల్
వినుమా యిచ్చటఁ జుట్టుప్రక్కలను ని ♦ న్భీతిన్ విదన్ బ్రోవఁగా
మొనకాండ్రెవ్వరు లేరటంచు మదిలో ♦ ముమ్మాటికి న్నమ్ము మై
నను నీపైనిదయున్ రహస్యమగు స్థా ♦ నంబున్ వచింతున్ జుమీ! ౨౭౧

తే॥ మునుపు సౌభరియను ముని ♦ ఘనుఁ డొకండు
యమునదరినున్న బృందావ ♦ నాంతరమున
నయుతవత్సరముల్ దాఁటు ♦ నటులఁ దపము
జలమునందున నిలుచుండి ♦ సలుపుచుండె. ౨౭౨

ఉ॥ ఆతఱి నజ్జలంబుల ఝ ♦ షాధిపచర్యను గాంచి మౌని సం
ప్రీతిని బొంది డెందమునఁ ♦ బెల్లు గృహస్పృహయాళుఁ డౌచు మాం
ధాతృసుతాశతంబును య ♦ థావిధిఁ జేకొని శ్రీశసద్దయన్
భూతినిఁ బొంది మామ ముద ♦ ముం గన హాయిగ నుండె వారితోన్. ౨౭౩

ఆ॥ అంతఁ గొంతకాల ♦ మగుడు తత్సౌభరి, మౌనివర్యుఁ డచల ♦ మానసమునఁ
దపముఁ జేయఁదలఁచి ♦ తద్యమునాశైవ, లినికిఁ బోయి దాని ♦ వనమునందు.

చ॥ తపనునిఁబోలి తేజమునఁ ♦ దద్భవబంధవిముక్తికోసమై
తప మొనరింపఁగా నిలిచి ♦ తత్ఖగనాథుఁడు స్వచ్ఛదంబులన్
దపతపకొట్టకుండఁ దన ♦ దాఁపున వ్రాలి చరించు సర్వమీ
నపతిని మ్రింగుటన్ ఝషగ ♦ ణంబులు దానికిఁ గుందుచుండుటన్. ౨౭౪

చ॥ కని కడుఁ గ్రుద్ధుఁడై విహగ ♦ కాంతుని గన్గొని యోరిధూర్త! వా
రిని గసర్పుఁ గ్రసించి పర ♦ రీతుల జోలికిఁబోని మీనవా
ధుని వృథ మ్రింగియుంటి విది ♦ దూష్యముగాదొకో? హింస శంసయే?
చనుమిఁక దీని మెట్టితివొ ♦ చచ్చెదవంచు శపించె నందునన్. ౨౮౬

చ॥ గరుడుఁడు సొచ్చనేరఁ డటఁ ♦ గావునఁ గాళియనాగ! నీవు స
త్వరగతితోడ సార్థసుత ♦ భార్యుఁడవై చని తత్కళిందజాం
తరముననుండుమా పిదపఁ ♦ దత్ఫణి, యా రహి ధైర్యముప్పఁగా
నురవడిఁ బోయి తద్ద్రమున ♦ నుస్కి నొనర్చె విదేహనాయకా! ౨౮౭

ఆ॥ ఇటులఁ గాళియుఁడు ఖ ♦ గేంద్రున కాడిన, పలుకు నంగవించి ♦ భయమెకాక
ప్రాణవిశయమొందెఁ ♦ బరికింప "సత్యమే, వజయతి"యను పల్కు ♦ వట్టిదగునె?

తే॥ అంత కృష్ణుఁడు యమునాప ♦ గాంతికంబుఁ, జొచ్చినప్పుడు తద్దంద♦శూకమదము
నుడిపి కరుణించి యాదీవి ♦ నడలులేని, వరముసంగుచుఁ గ్రమ్మఱ ♦బనిపెజనక!

క॥ కాలియమర్దన కథయిది, పాలసులే న్వినిన మిగులఁ ♦ బావనులై గో
పాలునిఁ జూతురు మఱి భూపాలక! నీవేమి వినఁగ ♦ వలతువొ చెపుమా!

చ॥ అటుపయి భూపుఁ డిట్లనె సు ♦ రాళి సుధన్ గడుపారఁ గ్రోలియున్
జటులవిలాసలోలలగు ♦ చానల మోవినిఁ గోరునట్లు ము
చ్చటగలతేంట్లు మత్తకరి ♦ సంతతి దానముఁ ద్రాగి పద్మ మె
చ్చటయని కోరుమాడ్కి హరి ♦ సత్కథఁగోరరె? భక్తులోమునీ! ౨౯౧

ఉ॥ కావున శ్రీరమావిభుని ♦ గాథల నింకొక గాథఁ దెల్పవే?
యీవలఁ గీరు రాధయను ♦ నింతి దమిన్ శిశువున్ బరేశుఁడౌ
దేవకినందనుంగొని ప్రశు ♦ తిస్థితపద్ధతిఁ బెండ్లియాడి బృం
దావనిలో విహారమును ♦ దద్దయు నొంటిగఁజేయ నెంటనే. ౨౯౨

చ॥ హరి, దమి నామెతో విడువు ♦ మూర్తి భవిష్యమునందు నీకు నే
వరునిగనుండి రాసములఁ ♦ బల్మఱునర్తునటంచుఁ బల్కె నం
చరుసముతో వచించితివె? ♦ యావిషయంబుల నానుపూర్విగాఁ
గరముగ నిప్డుసెప్పవె? య ♦ కారణకారణికత్వ మేర్పడన్. ౨౯౩

## శ్రీరాధాకృష్ణ ప్రీతి వర్ణనము.

చ॥ అనవుడు నారదుండు మిథి ♦ లావని నాథున కిట్లు వాకొనెన్
జనకనరేంద్ర! ప్రశ్న బహు ♦ సమ్మతమై శుభదంబు నయ్యెడిన్
ఘనము త్రిలోకదుర్లభము ♦ గాదె రమాదయితామనోభిరా
మునికత నీవు విన్ముమన ♦ ముం బెఱపోకలఁ బోవనీకయే. ౨౯౪

మ॥ జలజాక్షుం డొకనాఁడు బింబతులితో ♦ ష్ఠంబందు నందంబుగాఁ
గలనాదాంచితవంశినిం జొనిపి సం ♦ గీతంబుతోఁ దిర్గు నె
చ్చెలులన్ గూడుచుఁ బాడుచున్ నగుచు గో ♦ శ్రేణిన్ దమిన్ ద్రోలు చా
జలజాతాప్తసుతాతటిన్ జన విరా ♦ జన్మూర్తి కాముండనన్. ౨౯౭

తే॥ అతఁడు వోయిన బాటల ♦ నలరు జనప, దముల వృషభానుపురమునఁ ♦ దద్ద వెలుఁగు
వెలఁదు లందఱు దమిఁ బొంది ♦ వింత నొంది, తాళఁజాలక నేలపై ♦ వ్రాలి రయ్య.

ఆ॥ అట్టి నందసుతుని ♦ యాకృతి ప్రతిభాది, విషయములను సరిగ ♦ వినిన కనిన
రాధ నెచ్చెలులును ♦ రమణీయగాత్రలు, నగు విశాఖ లలిత ♦ లాతురమున.

చ॥ చిలుకల ముద్దుపల్కులును ♦ జిందముచందము మీఱునట్టి ద
మ్ములకెనయైన కన్గవయు ♦ బుణ్యసుధాకరతుల్యవక్త్రముల్
దళతళలాడు మించువలెఁ ♦ దద్దవెలింగెడి మేను బెళ్కుకు
లుక్కులుగల రాధికాంగనను ♦ గొంకక చేరి వచించి రిట్టులన్. ౨౯౮

మ॥ నవలామిన్నరో ! మానుడుల్ వినుమ వి ♦ న్నాణంబుగా నేఁడు త
న్నవలీలారతుఁడైన కృష్ణుఁడు దివా ♦ నాథాత్మజాతీరమున్
నవకందర్పుఁ డనంగ సాగి మురళీ ♦ నాదంబు వోల్పార థే
నువృషశ్రేణులఁ ద్రోలుచున్ జనె నిటే ♦ నోరూరఁగాఁ జూపఱుల్. ౨౯౯

ఉ॥ తేఁటులదాఁటు నెక్కురులు ♦ దేనియలొల్కెడి మోవి బంగరున్
మీఱెడి వల్వ లబ్జముల ♦ మించు కనుంగవ నిండుచందురున్
మాఱెడి నవ్వు నెమ్మొగము ♦ మల్లియమొగ్గలగేరు దంతముల్
వాటపు చూపులున్ గలిగి ♦ వాఁడలరుం గద ! ముద్దుగుమ్మరో ! ౩౦౦

సీ॥ ముఖముఁ జూపించెనా ♦ పుణ్యంబు సేకూరుఁ, గన్నెత్తిచూచెనా ♦ కలుగు మేలు
వక్కన నవ్వెనా ♦ పండువన్నెలగాయుఁ, గలిసిమాట్లాడెనా ♦ కలుగుఁ జెలిమి
వేణువు నూఁదెనా ♦ విశ్వంబు మ్రాన్పడు, డాసెనా మదనుండు ♦ డాయుచుండుఁ
గరముఁ జేపట్టెనా ♦ కంతుకాఁక లుదీరుఁ, గోపించెనా వైరి ♦ కోటి గూలు
తే॥ గరుణఁ బఱపిన మోక్షంబు ♦ గల్గుఁగాదె, యా మహాత్ముండు నీహృద ♦ యంబునందుఁ
దలఁచుచుండినవాఁ డెకా ♦ జలజనేత్ర, పాదపంకజయుగసక్త ♦ బంభరంబ !

ఉ॥ వేఱువ బాలురం గలిసి ♦ వేడుకపాటలఁ బాడుచున్ జగ
చ్ఛ్రీకరగోసమూహములఁ ♦ జేర్చుచు లీలగఁ ద్రోలుచున్ మనో
జాకృతివచ్చు నా హరియె ♦ యర్హుఁడు వంద్యుఁడు దర్శనీయుఁడో
హో కమలాక్షి ! యన్న విని ♦ యుబ్బుచు రాధ వచించె నిట్టులన్. ౩౦౨

క॥ చెలులారా ! మీ రిప్పుడు, పలికిన ఘను రూపు నిందు ♦ వ్రాయుఁడు కని యా
వల నాతనిఁ దెలిపెద నని, పలుకఁగ నా చెలులు నేర్పు ♦ బలిమినిఁ గమ్మన్. ౩౦౩

ఉ॥ నందకుమారసౌష్ఠవ ము ♦ న్నప్రతిమన్ విలిఖించి యామె కా
నందముతో నొసంగ నల ♦ నవ్యలతాంగియు దానినిం గరం
బందు ఘటించి కాంచి కను ♦ లార మతిన్ మనసారఁగోరి వీని నే
మందు మనోహరుండనియె ♦ యందును బొందెదఁగాక తొందరన్. ౩౦౪

చ॥ అని మనమందునం దలఁచి ♦ యట్లనె చూచుచు మోహవారిధిన్
మునిఁగె ననంగఁ గూరుకును ♦ బొంది యదాటున బృందకాటవిన్
ఘననిభుఁడున్ శుభాంగుఁడును ♦ గాంచనచేలుఁడు నైన శౌరి వే
డ్కను దనతోడఁ గూడినటు ♦ గాంచి యొకానొక స్వప్న; మాదటన్. ౩౦౫

తే॥ మేలుకొని భామణోత్కర ♦ కీలితుఁడగు, హరి వియోగంబు నైపక ♦ యాకులతను
బొంది కలఁదనకబ్బిన ♦ ముచ్చటలను, దలఁచి తలఁచి కన్నులనుండి ♦ జలములొలుక.

సీ॥ ఈముఖపంకజా ♦ మృతము నే నెన్నఁడు, ద్రావుభృంగంబనై ♦ తనరఁగలనొ
యీముఖపూర్ణేందు ♦ కౌముదియెప్డునా, పైఁబడ నాకాంక్ష ♦ బాపఁగలనొ
యీముఖజీవన ♦ జామోదముల్ బర్వ, నెన్నఁడు మూర్కొని ♦ హెచ్చఁగలనొ
యీముఖసుఖపీఠి ♦ నెన్నఁడు నామోము, దామర నేనుంచి ♦ తనియఁగలనొ

తే॥ యీమనోహరాంగునిఁగూడి ♦ యెన్నఁడేను, సూనశరశరబాధల ♦ మానఁగలనొ
యీసుముఖుని నేనె త్తి ♦ నాసతోడ,సుముఖుగాఁజేసికొని వేడ్కఁ ♦ జూడఁగలనొ

క॥ ఎన్నఁడు చేతులార ! భువ ♦ నేశ్వరు దేహ మలంకరింతునో
యెన్నఁడు సుందరుండయిన ♦ కృష్ణు ముద్దులఁ బెట్టికొందునో
యెన్నఁడు వాని పెన్నురము ♦ నెక్కి రతిన్ రతిఁ దేల్చుచుందునో
యెన్నఁడు తత్కరంబుఁగొని ♦ యిట్టటులన్ వని సంచరింతునో. ౩౦౬

క॥ అని చింతించుచు నా ఘనుఁ, గనుఁగొనఁగాఁ దలఁచి తోఁచక ♦ చరించుటఁగాం
చిన యా చెలికత్తియ లా,వనజాక్షుని జాడఁ దీయ ♦ భావించి యెదన్. ౩౦౭

ఉ॥ చూచిరి సందుగొందులను ♦ జూచిరి సర్వచతుష్పథంబులన్
జూచిరి సర్వగోష్ఠములఁ ♦ జూచిరి రథ్యలఁ జుట్టుప్రక్కలన్
జూచిరి గాని యెచ్చట య ♦ శోదకిశోరుఁడు లేమిఁ దిర్గిపోఁ
జూచెడిలోన నెల్లకడఁ ♦ జూచిరి వచ్చెడి గోపడింభకున్. ౩౦౮

తే॥ కనిన యా చెలికత్తెలు ♦ గాంచి ముదము,
ముందుగాఁ బోయి రాధాస ♦ ముఖమున కిటు
పల్కిరోయమ్మ ! రమ్మత ♦ త్పంకజాక్షుఁ
డాలఁ ద్రోలుచు నిటువచ్చు ♦ నోలిఁ గనుమ ! ౩౦౯

క॥ అన నాయమ పెన్నిధిఁగాం, చిన పేదరహిన్ జెలంగి ♦ చెలికత్తెలతోఁ
జని సౌధాంతరమందునఁ, దనరెడి వాతాయనంబు ♦ దాపునఁ దగుచున్.

మ॥ కనవే! యేమది ధూళిపుంజమెసఁగెన్ ♦ గంజాక్షుఁ డేతెంచునా?
ఘనముల్ గ్రమ్మినయట్టు లంబరమణిన్ ♦ గ్రమ్మెన్ జుమీ యాదెసన్
వినవే మంజులవంశినాదములు నీ ♦ వీన్దోయిఁ జొప్పించి, యే
దనవేమీ చెలిరో యదేవినదమో ♦ యాలించి వాక్రువ్వుమా! ౩౧౩

మ॥ ఎవరో డాయుచునుండి రట్లు గనుమీ ♦ యిందిందిరప్రోల్లస
న్నవసూనాంచితమాలికాధరుఁడు పీ ♦ నస్కంధుఁ డాజానుబా
హువృతుండున్ వరచేలధారుఁ డదిగో ♦ యుంకించి కాంచంగ మా
ధవుఁడే యంచుఁ దలంతు నిక్కవమె కా ♦ దా యో సఖీబృందమా! ౩౧౪

వ॥ అని వీక్షించుచు యోచించుచు ననుమానించుచు నాతురపడుచుఁ బృచ్ఛింప నాసఖు లౌనౌనని యలరుచుఁ దలలూచి సంకోచపథంబునుండి మిత్రతారకలందు నిందునికైవడి నొప్పారుచు నాలం ద్రోలుచుఁ గ్రమక్రమంబుగా సమీపించెడి శ్రీకృష్ణునిం జూపుడువ్రేలునం జూప నాయంగనామతల్లిక యొక్కసారిఁ గన్నులార సోరణగండ్లనుండిఁ గాంచి ౩౧౫

సీ॥ దర్శనీయంబులన్ ♦ దర్శనీయముగాదె, యీమహామహుముఖం ♦ బింతులార!
పేయంబులందునన్ ♦ పేయంబుగాదె యీ, శౌరి యధరసుధ ♦ చానలార!
స్పర్శనీయంబులన్ ♦ స్పర్శనీయముగాదె, యీ మాధవుని మేను ♦ లేమలార!
గేయంబులందునన్ ♦ గేయంబుగాదె యీ, ఘను దివ్యచరితంబు ♦ కాంతలార!
తే॥ జ్ఞేయములయందు జ్ఞేయమీ ♦ తోయజాక్షు
వర్తనముగాదె సతులార! ♦ ప్రార్థ్యములను
ప్రార్థ్య మీ జగన్మోహను ♦ పరమసంగ
మంబుగాదె నారీతిల ♦ కంబులార! ౩౧౬

క॥ అని తన చెలులకుఁ జెప్పుచుఁ, గనుఁ దెప్పను వాల్పక హరిఁ ♦ గనుచిల మూర్ఛి
ల్లె నతండు నోరచూపులఁ, గని యామెను దలఁచె నిటులఁ ♦ గౌతుకమతితోన్.

సీ॥ కచములా యివిగావు ♦ ఘనముఖాంబుజసుధన్, గ్రోలుభృంగముల ♦ గుంపుగాని
వేణియా యిదిగాదు ♦ వెరుకలరక్షించు, భయమిడు కృష్ణస ♦ ర్పంబుగాని
వక్త్రమా యిదిగాదు ♦ బహులోకానంద, కరపౌర్ణిమా నిశా ♦ కరుఁడుగాని
హాసమా యిదిగాదు ♦ హర్షంబుగూర్చెడి, దివ్యరాకేందుచం ♦ ద్రికలుగాని
తే॥ కనుల యివిగావు గండుమీన్ ♦ గవయుకాని, కంఠమా యిదికాదు శం ♦ ఖంబుగాని
కుచములా యివిగావు వా ♦ న్గొప్పగిండ్లు, గాని మైదీఁగె యిదిగాక ♦ కాదె చపల,
మ॥ భువిలోనన్ దివిలోన దీనికెనయా ♦ పూఁబోఁణి లేదెందు నీ
స్తవనీయద్యుతిభాసురన్ ఘనకచన్ ♦ దారుణ్యలావణ్యవై

భవవిభ్రాజిత నిర్జితస్మరసతిన్ ♦ భాగ్యాంచితన్ శ్రీమతిన్
దవులన్ లేని నరుండు వ్యర్థుఁడుగదా ♦ తర్కింప భావంబునన్. ౩౧౯

తే॥ కాన నీ చానతోఁగూడి♦కరుణఁదొలఁగి, విరతిలేకుండ శరముల♦వేయు మదను
మదను సదమద మొనరించి♦ముదము నేను,గాంచ నానని యింటికే♦తెంచె నంత.

చ॥ లలితయు, రాధఁజేరి యిటు ♦ లన్ బలుకాడఁదొడంగె నమ్మరో!
పలుకవు రావు నవ్వవు సు ♦ భక్ష్యయుతాన్నముఁ గ్రోల వేదియున్
దలఁపవు మంచినూనియలఁ ♦ దద్దయు రుద్దుచు దువ్వి దువ్వెనన్
దలను నలంకరింపవు య ♦ థార్థము నాకిపు డీవు సెప్పవే! ౩౨౦

చ॥ హరిని మదిన్ మనోవిభుగ ♦ నన్నివిధంబుల నెంచియున్న స
త్వరగతి వాని నెయ్యమగు ♦ పద్ధతిఁజూడుము నీకు మేలగున్
ధరణికి మంచియగా నిఁక వ్య ♦ థాజ్వాలనుం డల కుంభకార వ
హ్ని రహిని భగ్గుభగ్గుమని ♦ నిన్నిసుమింతయుఁ గాల్పఁ డో చెలీ! ౩౨౨

ఉ॥ పిమ్మట రాధికామహిళ ♦ వేడుకతోఁ దన పద్మపత్రనే
త్రమ్ముల విప్పి చూసి లలి ♦ తా! మునినిర్జరపూజితాంఘ్రి యు
గ్మమ్ముగలాఁడు ముద్దులను ♦ గాల్చెడు వాఁడును నైన యచ్యుతుం
డిమ్మెయి రానిచో నిచటి ♦ కే నిదె దేహముఁ బూదిఁ జేసెదన్. ౩౨౩

ఉ॥ ఇట్టుల గద్గదోక్తి వచి ♦ యింపఁగ నాసఖి వించు నోచెలీ!
యెట్టులొ పట్టుకొమ్మదను ♦ నేనెరవేర్చెద నీదుకోర్కి నీ
పట్టున నంచు నల్ల వృష ♦ భానుపురంబును వీడి తోడనే
యట్టి కళిందజానదికి ♦ నందిక లోఁగల బృందకాటవిన్. ౩౨౪

తే॥ మాధవీముఖవల్లరుల్ ♦ మలయువివిధ, విహగకలకలారావముల్ ♦ వినపడంగఁ
గడిమి చెట్టుచాయను నొంటిఁ♦గా వసించు, పసిఁడిపట్టముతాల్పు పా♦ర్శ్వమునఁ జేరి

ఉ॥ శౌరి! త్రిలోకసుందరియు ♦ సాధ్వియుఁ దద్వ్రృషభాను పుత్రియై
మీతొడి రాధ నా రమణి ♦ మిమ్ములఁజూచిన నాఁటఁగోలె మీ
సౌరు దలంచి గోడపయిఁ ♦ జక్కఁగ వ్రాసిన బొమ్మకై వడిన్
మాఱుచు నోర్మదల్ప దది ♦ మాయయొ యేదియొ చెప్పలేనుగా. ౩౨౬

చ॥ వినుఁ గనుమాయుఁ గాంచుఁ జను ♦ వెన్కకు వచ్చును గూరుచుండు ని
ల్చును బడు లేచు మిన్నుగను ♦ సొమ్మసిలున్ దెలివొందు శ్రీహరీ!
యనుఁ బ్రణమిల్లు నేడ్చు నగు ♦ హా యని వేసరు నిట్టులన్ క్షణం
బునకొకతీరుచేయు నది ♦ బుద్ధికిఁ దోఁపదు లోకమోహనా! ౩౨౭

చ॥ సుమలతి బాణజాలముగ ♦ సోముఁడు హాలహాలోరుమూలకం
దముగ సుగంధి దుమ్మకటు వి ♦ ధంబుగ సొమ్మెలనిప్పుతునకఁగాఁ

గమలినశోక భార్యముగఁ ♦ గ్రాలెడి రాధకు, నందుచేత నా
యమ పెదమేడ పాడుపడి ♦ నట్టులఁదోఁచెడి పద్మలోచనా ! 3౨౮

ఉ॥ కావున నొక్కమాఱు మమ ♦ కారముతోఁ జనుదెంచి యట్టి రా
ధావనితామతల్లికకు ♦ దర్శనమిచ్చి సుఖంబు గూర్పవే ?
నీవెకదా సమస్తధర ♦ ణీ జననస్థితినాశనంబులన్
దేవుఁడవింక సర్వమున ♦ దిక్కుగునాఁడవు రమ్ము శ్రీహరీ ! 3౨౯

చ॥ అని పరమేశ్వరుం గుఱిచి ♦ యాలలితాలలనాలలామ నే
ర్పున మనవింబొనర్చుకొనఁ ♦ బూతచరిత్రుఁడు కృష్ణచంద్రుఁడున్
విని ఘనవాణి నిట్లనియె ♦ భీతమృగాక్షిరో ! నీమనోహరో
క్తినిఁ జెవులార వింటి నల ♦ స్త్రీ యటుసేయుట ప్రేమునన్ సుమీ ! 330

ఉ॥ ప్రేమ మనోవికారమగు ♦ ప్రేమ గృహస్థశుభప్రదంబగున్
ప్రేమయె సృష్టిమూలమగుఁ ♦ ప్రేమయె పోషణముఖ్యహేతువౌఁ
ప్రేమ వినాశకంబగును ♦ ప్రేమయె ధర్మనిదానమయ్యెడిన్
ప్రేమయె సర్వవశ్యమగుఁ ♦ ప్రేమనుమించిన లాతియున్నదే ! 33౧

ఉ॥ ఈరహిఁ ప్రేమయాట నల ♦ యింతియు నట్టులఁ జేయుచుండెఁగా
క్షీరమునందుఁ దత్స్థితరు ♦ చిస్థితి భేదములేని రీతిగా
నారయ నాకు నామెకును ♦ నంతరమింతయు లేదు మున్ను భాం
డీరవనిన్ విహారము గ ♦ డించిగ నైనటు లిప్డు మాకగున్. 33౨

ఉ॥ రాధకు నాకు భేదము గ ♦ రంబుగఁ గూర్చి జగంబునందు నే
ర్బోధలు సల్పుచుందు రల ♦ పుణ్యజనుల్ యమపాశబద్ధులై
బాధలఁ బొందుచుందురని ♦ భావమునందు నెఱుంగు మిట్టులన్
సాధులు భేదదూరులయి ♦ సన్నుతి సల్పరె ? ముక్తిఁగాంచరె ? 333

ఉ॥ కావున లెమ్ము పొమ్మలఁతి ♦ కాలములోపల నేను వచ్చెదన్
నావుడు తల్లతాంగియును ♦ నమ్రత నాతని యాజ్ఞఁగొంచు బృం
దావని వీడి రాధ సవి ♦ ధంబునకుం జనుదెంచి యొంటిగా
భావమునం దలంచుచెదొ ♦ వర్తిలు నామెకుఁ బల్కె నిట్టులన్. 33౪

శా॥ అమ్మా ! రాధరొ ! శౌరిఁ జేరి కనఁగా ♦ నవ్వానిపై నీకు మో
హమ్మెట్టుల్ వసియించెనో యటుల నీ ♦ యందాతఁడున్ బూర్ణమో
హమ్మున్ బొంది వసించె నం చెఱుఁగుమీ ♦ యవ్వానికిన్ నీకు భే
దమ్మావంతయులేదు మీర్జగమునన్ ♦ ద్వైవిధ్యమై యుండ్రుగా. 33౫

తే॥ కొలఁది కాలములోపలఁ ♦ గూర్మి నాతఁ
డిటకుఁ జనుదెంచునని యెంతు ♦ నెడఁద నయిన

వాని రాకకు సత్కార్య ♦ పాళి పాళిఁ
జేయుచుండుము నీకిష్ట ♦ సిద్ధియగును. ౩౩౮

ఉ॥ ఈగతిఁ జెప్ప నామె స్వమ ♦ ఖేందురుచిన్ నయనోత్పలంబులున్
బాగుగ విప్ప నిట్లు మఱిఁ ♦ బల్కెఁ జెలీ! యలవానిరాకకై
యేగతి నెట్టికార్యముల ♦ నే నొనరింపఁగ నౌనొ యెట్టి య
భ్యాగతిదేవతీర్థముల ♦ యర్చలఁ జేయఁగ నౌనొ? చెప్పుమా! ౩౩౯

తే॥ మఱియు మాగురువును ముని ♦ వరుఁడునైన, గర్గుఁడీ యిష్టసిద్ధికే ♦ కార్యములను
జెప్పెనో వాని నాకు వ ♦ చింపుఁ డిప్డు, ప్రో చెలియలార! యనికోరె ♦ నుర్వరేశ!

తే॥ అట్టి సమయంబునందుఁ ద ♦ దాళిపాళిఁ, జతురయైన చంద్రాననా ♦ ప్వాంతమందు
మిగుల యోచించి యమ్మరో!♦మీ సెలవున,నొక్కసత్క్రియఁ జెప్పెదఁ♦జక్క వినుము

తులసీవ్రత మాహాత్మ్యము.

చ॥ వరదము మంగళప్రదము ♦ భాగ్యదమున్ దనయప్రదంబునున్
బరమము మారిజాడ్యముఖ ♦ వారకమున్ గులదీపకంబు దు
ష్కరహరిదర్శనప్రథమ ♦ కారణమున్ బహుపావనంబునున్
సిరి కెనయైన తత్తులసి ♦ సేవను భక్తిని జేయుచుండుమా! ౩౪౦

క॥ తులసినిఁ జూచినఁ దాఁకినఁ, బలికిన శ్రుతి శాస్త్ర విహిత ♦ పద్ధతితోఁ బూ
జలఁ జేసిన మఱిఁ దత్కథ, నలఁతిని వినినంతమాత్ర ♦ నఘము లణంగున్.

తే॥ నవవిధాత్మకభక్తి న ♦ నారతంబు, దులసి నమ్మిన వారలు ♦ దోషములను
విడిచి పుణ్యాత్ములై యొక ♦ వేయియుగము,లరుగునందాఁక వైకుంఠ ♦ మందునుంద్రు.

చ॥ కనులకుఁ బండువౌ తులసిఁ ♦ గైకొని యెవ్వఁడు మంచిచోటు గ
న్గొని యొక యాలవాలమును ♦ గోర్కెనొనర్చియు నందు నాటి క
మ్మని యుదకంబు ప్రత్యహము ♦ మప్పితమౌనటుపోసి గొప్ప వృ
ద్ధిని గనునట్లు జేయునొ య ♦ దేవిధి వాఁడును వృద్ధిఁబొందుఁగా. ౩౪౩

సీ॥ సారంబు గల్గిన ♦ చక్కని నేలలోఁ, జదుకంబుగా నుండు ♦ స్థలముఁగాంచి
యందునఁ గుందార ♦ మందార పున్నాగ, చూతాదితరువులఁ ♦ జుట్టుబెట్టి
యవల మరంద ని ♦ ష్యంది నానావిధ, పుష్పభూరుహములఁ ♦ బొందుపఱచి
పదపడి సౌరభ ♦ పర్యాప్తవాసిత, మల్లికాదిలతల ♦ నల్లఁ జేసి

తే॥ చుట్టుఁ గొలఁది చోటును విడి♦శుభ్రపఱచి, చిన్నచిన్న సరస్సులు ♦ సెలఁగనడుమఁ
గళలకుం దల్లి యిల్లగు ♦ తొళసికోట, వైచు పుణ్యుండు వైకుంఠ ♦ వాసి యగును.

శా॥ భాస్వత్ప్రసూనమాంచితోరు తులసిన్ ♦ బ్రహ్మాపకాలంబునం
దే స్వాపంబును లేచి చూచు జనులో ♦ దీర్ఘాయురైశ్వర్యదే

హాస్వాస్థ్యంబులు గల్గి పుణ్యాతములై ♦ యా స్వర్గలోకంబునం
దస్వప్నుల్ వినుతింప నుండఁగలరో ♦ యంభోజపత్రేక్షణా! ౩౭౯

సీ॥ అన్నసత్రంబుల ♦ నమరిచినంగూడఁ, దులసినాటుఫలంబు ♦ దొరకునొకో
ఫలపుష్పతరువనుల్ ♦ బ్రబలఁ వేయించినన్, దులసినాటుఫలంబు ♦ దొరకునొకో
వరజలయుతములౌ ♦ చెఱువులన్ ద్రవ్వినన్, దులసినాటుఫలంబు ♦ దొరకునొకో
షోడశదానముల్ ♦ సొరిదిఁ గావించినన్, దులసినాటుఫలంబు ♦ దొరకునొకో

తే॥ దశవిధములగు దానముల్ ♦ విశయరహితుఁ, డగుచు సల్పినంగాని య ♦ జ్ఞాశ్వమేధ
శతము నాచరించినఁగాని ♦ సకల శుభద, తులసినాటుఫలంబు ♦ దొరకునొకో?

తే॥ కన్నులారంగఁ దులసినిఁ ♦ గాంచఁడేనిఁ, జేతులారంగ దులసి న ♦ ర్చింపఁడేని
నోరు నొవ్వఁ దులసికథన్ ♦ నుడువఁడేని, వాని జన్మంబు మిక్కిలి ♦ వ్యర్థమమ్మ!

చ॥ తులసిదళంబులన్ సకల ♦ దోషవిదూరులు వేల్పులెల్లరున్
వెలుఁగుచునుండు, రవ్వి సర ♦ విం గొని శ్రీహరిపాదపంకజం
బులకు విధేయతాఘనితిఁ ♦ బూజల సల్పిన వాని జన్మమే
వెలగల దర్థవంతము న ♦ భిజ్ఞనుతంబును ముక్తియుక్తమున్. ౩౮౦

సీ॥ ఏవీడు తులసిచే ♦ నెసఁగియుండఁగలేదొ, వీడుగాదది వట్టి ♦ బీడు గాని
యేవాడ తులసిచే ♦ నెసఁగియుండఁగలేదొ, వాడగాదది వల్లె ♦ కాడు గాని
యేయిల్లు తులసిచే ♦ నెసఁగియుండఁగలేదొ, యునికిగాదది పెద్ద ♦ యొలికి గాని
యేతోట తులసిచే ♦ నెసఁగియుండఁగలేదొ, తోటగాదది చేటు ♦ చోటు గాని

తే॥ తులసిలేనట్టి చోటులఁ ♦ జెలఁగుజనము, జడమగునుగాని యయ్యది ♦ జనముగాద
టంచు నెఱుఁగుచుఁ బూజల ♦ నహరహంబు, సల్పుచుండుమ తులసికి ♦ శ్రద్ధతోడ.

తే॥ తులసి వాయువు లేయింటఁ ♦ జెలఁగుచుండు
నట విషూచిమశూచికా ♦ ద్యామయములు
నించుకేనియుఁ జొరఁబడవం ♦ చెఱుఁగవమ్మ!
కాలుఁ డా యింటివారలఁ ♦ గనులఁ గనఁడు. ౩౯౦

తే॥ తులసిదళమంజరిం గొని ♦ తలను దాల్చి, ప్రాణముల్ విడిచిన వాఁడు ♦ బాధపంచ
పాతకంబుల సల్పినన్ ♦ బావనుఁడయి, యముని దండనమొందఁడో ♦ యన్నుమిన్న!

క॥ తులసీ కాష్ఠజ గంధము, డలఁ బూసినఁ బాపమెదియు ♦ డకొనదమ్మా
తులసీవనిగల గేహం, బులు పుణ్యక్షేత్రములుగఁ ♦ బొల్పారుఁగదా. ౩౯౧

తే॥ నూఱు బారువలైన బం ♦ గారు మఱియు, నాల్గువందల బారువ ♦ లల్లు వెండి
దానమిచ్చిన ఫలమెంత ♦ దనరు నంత, ఫలముగల్గు నిట్టి తులసి ♦ పాలనమున.

తే॥ తులసిపాదునఁగలనీరు ♦ దలనుజల్లి,న గృహి, యమురాపగాముఖ ♦ స్నానఫలముఁ
బొంది నీటఁ జెలంగి ము ♦ భువన మంట,ని జలజముమాడ్కి భవభీతి ♦ నింగనఁడుగ

తే॥ తులసినీడను శయనింప ♦ దోషమడఁగుఁ, దులసిపూసలఁదాల్చినఁ ♦ గలుగు శుభము
తులసిఁ బైవిధిఁ బూజల ♦ సలుప హరియుఁ, బ్రీతిఁ బొందును దులసి వ ♦ ర్ణింపఁదరమె.

తే॥ తులసియుండిన శ్రాద్ధముల్ ♦ ఫలదములగు,
దులసిఁ బెంచిన వంశముల్ ♦ బొలుపుఁగాంచు
దులసి మాహాత్మ్యమెన్నుట ♦ సులభమొకొ ?
త్వరగ నీవును దులసి సే ♦ వలను సలుపు. ౩౫౬

చ॥ అని తులసీ ప్రభావము మ ♦ హాద్యుతితో నుడువంగ రాధికా
వనితయు నాలకించి భయ ♦ భక్తులఁ దత్తులసీవనంబు స్థా
పన మొనరింప నెంచి తగు ♦ పద్ధతులం గమనించి కేతకీ
వన మనుకూలమైనదని ♦ భావమునందుఁ దలంచి వెంటనే. ౩౫౭

వ॥ తద్వనంబునందు మధ్యప్రదేశంబు రమ్యంబని యెన్ని యందు బహురమణీయంబగు నూరుమూరల చుట్టుకొలతగల చోటును గొని యాస్థలంబున బంగారు గోడలనెత్తుగఁగట్టించి పద్మరాగమణులతోఁ దటంబు నిర్మింపించి కాంచనధ్వజంబుల నెల్లెడ నెత్తించి యందుఁ బ్రేక్షకమనోభిరామంబగు తులసీమందిరం బలరునట్లు బొనరించి తన్మందిరాంతరంబున సర్వదోషహారంబై పచ్చనిపల్లవంబులఁ బొలుపారు శ్రీతులసీవనంబు స్థాపించి యవ్యాజంబగు నిశ్చలమనంబున సమాహూతుండును వేదవేదాంగ విదుండును బురోహితుండు నగు గర్గాచార్యుండు మంత్రపూర్వకంబగు తంత్రం బుపదేశించుచుండ నభిజిన్నక్షత్రయుతశుభముహూర్తంబున శ్రీకృష్ణప్రీతికై పరమభక్తిసంభరితయై తత్సేవాపూజాదులఁ జేయ నారంభించి యాశ్వయుజ శుద్ధపూర్ణిమాదివసంబున దీక్షవహించి చైత్రపూర్ణిమాపర్యంతము నారాధించి పంచామృతంబులను నిక్షురసంబునను నామ్రరసంబునను ద్రాక్షారసంబునను నారికేళరసంబునను శుద్ధోదకంబునను నభిషేకించి ప్రత్యేకంబుగాఁ బ్రతిపూర్ణిమాతిథియందు విశేషోపచారంబులం గావించుచు వైశాఖశుద్ధప్రతిపద్దినమందు దద్వ్రతోద్యాపనం బొనరించి రెండులక్షలబ్రాహ్మణుల నన్నముఖదానంబులతోఁ దృప్తులం గావించి యామలకప్రమాణంబులును వర్తులంబులును నమూల్యంబులును నగు లక్షభారమౌక్తికంబులను గోటిభారదివ్యస్వర్ణంబును నాచార్యునకు దానం బొసంగి ఖేచరులు దుందుభులు మ్రోఁగించి కీర్తించి జయజయారావంబులుఁ సల్పుచు బుష్పవృష్టినిఁ దత్తులసీమందిరంబుపైఁ గురియం గని యానందమందు రాధికాసుందరి సముఖంబున. ౩౫౮

సీ॥ మించును మించిన ♦ మేనిపైఁ దళతళ, లాడు బంగరు చీర ♦ లమరుచుండఁ
దమ్ములఁ దమకు వే ♦ తమ్ములఁగాఁజేయు, కన్నుల నమృతంబు ♦ గాఱుచుండఁ
నల్లనిపెంద్రాచుఁ ♦ జిల్లరగాసల్పు, పెంజడ పిఱుదులఁ ♦ బుంజిమూడఁ
దామరతూండ్లను ♦ దాఁటు చౌచేతుల, బంగరుసొమ్ములు ♦ వరఁగుచుండ

గీ॥ హైమకుండలమకుటంబు♦లలరుచుండ, వెలుఁగుచుండుపదాత్తేండ్ల♦వెలఁది యగుచు
గరుడగతహేమపీఠిపైఁ ♦ గ్రాలి తమ్మి, కంటివాల్గంటి తులసి వే♦డ్కను వెలింగె.

చ॥ కనుపడి యట్టు లామె తమ ♦ కమ్మున రాధను గౌఁగిలించి యి
ట్లనియెను నోసతీతిలక ♦ మా! భవదర్చలచేఁ బ్రసన్నతన్
గని యిట కేగుదెంచితిని ♦ గానఁ బ్రిశుద్ధిగ నేవరంబు నీ
వనయము గోరుచుంటి వది ♦ యక్కఱవచ్చి ఫలప్రదంబగున్. ౩౬౦

చ॥ మఱి సుభగత్వమున్ వఱల ♦ మంచిదటంచుఁ బ్రసిద్ధురాలవై
ధర మనుచుండువమ్మ! యిది ♦ దప్పదు భూతలసంగ్రహార్థమై
కరముగ నిట్లు గోరితివి ♦ గాదె! యనంతరమందు నామె సం
బరమున బ్రొక్కి నాకుఁ బతి ♦ భక్తి నహైతుకి నిమ్ము బృందరో! ౩౬౧

చ॥ అనఁ దులసీమహేశ్వరియు ♦ నట్టులె నీకగుగాక యంచుఁ దాఁ
జని నటుమీఁద రాధ నిజ ♦ సద్మముఁ జేరెను మైథిలేశ్వరా!
యనవుడు ఱేఁడు వల్కె శర ♦ దబ్జమరందముఁ గ్రాగి తేంట్లు తృ
ప్తినిఁ గనునట్లు లీకథన ♦ తృప్తిని జెందఁగఁ జాల నారదా! ౩౬౨

తే॥ కాన మఱి హరికథను బ♦ల్కంగ వేఁడుచుంటిఁ దద్రాధికాదేవి♦యుత్తమవిధిఁ
దులసి నర్చించెఁగద దానఁ ♦ గలిగినట్టి, ఫలములన్ జెప్పవేఁడెద ♦ బ్రహ్మపుత్ర!

❧ శ్రీకృష్ణుండు మాయాగోపికయై రాధ దరికేగుట. ❧

ఉ॥ నావుడు దేవమౌనియు న ♦ నంగడఁగెన్ మిథిలాధినాథ! రా
ధావధు వావిధిన్ మిగులఁ ♦ దత్తులసీవ్రత మాచరించుటన్
శ్రీవిభుఁ డాలకించియుఁ బ ♦ రీక్ష నొనర్పఁ దలంచి తోడనే
యావృషభానుపట్టణము ♦ నర్గి బ్రమోదముఁ బొందు చందునన్. ౩౬౩

ఉ॥ కంకణ తార హారములు ♦ గమ్మలు నందెలు నత్తు కాంచియున్
గింకిణులున్ దగన్ గనక ♦ నిర్మల వస్త్రములన్ ధరించి బ
ల్పొంకపు కేశపాశమును ♦ బూని యహో యన గోపికాకృతిన్
జంకక తాల్చి తత్సదన ♦ సన్నిధికేగి మదేభయానయై. ౩౬౪

మ॥ వసుసన్ ద్వారసమాశ్రితాంజననిభే ♦ భశ్రేణులన్ బ్రోల్లస
త్పరిఖావప్రసభాలయాంగణచతు ♦ ర్ద్వారంబులన్ ఛత్రచా
మరహారాన్వితసింహపీఠముల ధ ♦ ర్మస్థానముల్ దివ్యహ్మా
న్మసుదాపమ్యజవాంచితాశ్వములఁ బ్రే ♦ మన్ జూచి యా పిమ్మటన్. ౩౬౫

ఆ॥ వత్ససహిత ధేను ♦ వారమహోక్షముల్, గన్నులారఁగాంచి ♦ కరమునందు
బెత్తమొప్ప మంచి ♦ పిల్లనగ్రోవితో, నసిగఁ బాడు గోప ♦ సమితిఁగాంచి,

క॥ శ్రీరాధాంతఃపురమును, జేరి కవాటాలయాది ♦ చిత్రంబులనున్
భూరిసభాస్థలములలోఁ, గోరిక వర్తించుచుండు ♦ గోమలులఁ గనెన్. 3౬౮

ఉ॥ కృత్రిమ గోపికామణి మ ♦ ఱిన్ వృషభానుకుమారికిన్ ద్రివా
చిత్రముఖంబునన్ మిగులఁ ♦ దేటగఁ దెల్లమొనర్చు గోపికల్
చిత్ర విచిత్ర పుష్పములఁ ♦ జేకొని వేడుకతోడఁ జెంగనా
లాత్రములేక వేయుటను ♦ నాస్థను గన్గొని మెచ్చి యంతటన్. 3౬౯

తే॥ కుందమందార దాడిమీ ♦ కోవిదార, మాలతీ కేతకీ బృంద ♦ మాధవీప్ర
భృతి ధరారుహోపేతంబు♦వివిధవిహగ, కలితమగు నుపవనమొండు♦గాలు నందు

సీ॥ కల్పవృక్ష సుగంధ ♦ క్రమంబు మధుమత్త, షట్పద ఝంకృతి ♦ సంయుతంబు
గంధార్త శీత జ ♦ గత్ప్రాణ యుక్తంబు, శుకముఖఖగరవ ♦ శోభితంబు
ననిలాల్ప ధూత స ♦ హస్ర దళాంబుజ, భాసురం బఖిల పు ♦ ష్పాశ్రితంబు
కూపవాపీసరః ♦ కుల్యామనోజ్ఞంబు, బుష్పశయ్యావళి ♦ భూషితంబు

తే॥ న్యక్కృతామర నాయక♦నవ్యసౌధ, రమ్య మమర నుతము నైన♦రాధికాస
తీమణీదివ్యకుంజంబు ♦ దేజరిలుట, గాంచి యెదమెచ్చి యందునఁ ♦ గౌతుకమున.

తే॥ వజ్రిలు మేఘమందిరమందు♦బాలతరణి,కుండలాంచితల్ దత్కార్య♦కుశలలు సుము
ఖులును పరవస్త్రధరలు నౌ♦చెలిమికత్తె,లలరుచుండుటఁ గని కొంచె♦మవల నరిగి.

ఉ॥ కుంకుమపుష్పవన్నెలను ♦ గూర్చిన సన్నని పట్టుబట్ట లి
ర్వంకలఁ గట్టియుండ సుమ ♦ వారులు జల్లఁగ నెల్లచోటులన్
సంకుముదైణనాభిఘన ♦ సారపటీరసువాసనల్ దగన్
వంక యొకింతలేని యటు ♦ భాసిలు రాజగృహంబునుం గనెన్. 3౭3

ఉ॥ అందునఁ జేటికాసహిత ♦ లౌ చెలికత్తెలఁ గోటిచంద్రులన్
డిందొనరించు తేజలరి ♦ శివిగ నుండెడి కావిమోవినిం
జెంది సతీలలామయు సు ♦ శీలయు నైనుతిఁబొందు రాధికా
సుందరి యెద్దియో తలఁచు ♦ చున్ బదమున్ గదలించుటం గనెన్. 3౭౪

ఉ॥ అత్తతి రాధికాసతియు ♦ నట్లు క్రమంబుగ, డాయు గోపికా
త్యుత్తమఁ గాంచి కౌఁగిళుల ♦ నొంది పదంబుల క్షాళనంబుకై
యుత్తమలోకరీతి జల ♦ మొయ్య నొసంగియుఁ బీఠమిచ్చి లో
కోత్తరమైన పద్ధతిని ♦ నొద్దకుఁ బోయి వచించె నిట్టులన్. 3౭౫

తే॥ అమ్మ! స్వాగతమియ్యదే♦యందవమ్మ!, మాగృహంబున కీవిపు♦డేగుదెంచ
ధన్యతమనైతి నోయమ్మ! ♦తప్పకుండ, నర్ఘ్యమొంది నాయాతిథ్య♦మందవమ్మ!

## మాయాగోపికారాధికా సంవాదము.

చ॥ ఇది యెటనుండిరాక మఱి ♦ యెక్కడి కేగఁ దలంచియుంటివో
యెది భవదీయవాస మిఁక ♦ నెట్టిదొ నీచరితంబు నేటికీ
యదనున నాసమీపమున ♦ కాగతవైతివొ చెప్పు మవ్వ నా
కుఁ దగినవైనఁ జేసెదను ♦ గొంకక పద్మదళాయతేక్షణా! ౩౭౭

ఉ॥ భూతలమందుఁజూడ నినుఁ ♦ బోలినరూపము గోచరింప దే
వ్రీతిగ నిన్ను జూతు రల ♦ పెద్దలు ధన్యత గాంచకుందురే
యేతఱి నీపదాబ్జముల ♦ నెచ్చటఁ ద్రొక్కెద వద్ది యత్తఱిన్
పూతమహాపురంబగుచుఁ ♦ బొల్పువహింపదె? గోపికామణీ! ౩౭౮

క॥ అమ్మా! శుభదము వాంఛా, దమ్ముగను నఘజాలశైల ♦ దంభోళియు నై
సమ్మదకరమగు మీ నా, మమ్మును వినఁగోరుచుంటి ♦ మాన్యచరిత్రా! ౩౭౯

క॥ కృతిచే, స్మితిచే, ద్యుతిచే, గతిచేఁ, గరుణాకటాక్ష ♦ కలితస్థితిచే,
మతిచే, వచనముచే, శ్రీపతివలె భాసిల్లితీవు ♦ భామామణిరో! ౩౮౦

ఉ॥ మిమ్ములఁ జూచినం గొలఁది ♦ మేరను మీఱు ప్రియంబు డెందమం
దిమ్మెయిఁ గల్గుచుండెడి, ర ♦ మేశునకున్ మఱి మీకుఁ దారత
మ్యమ్మది గోచరింపదుగ ♦ యందున నేను ననాందగా మిమున్
నమ్మి తలన్ వహించుచు ఘ ♦ నంబుగఁ దప్పక సత్కరించెదన్. ౩౮౧

చ॥ మఱియును మీరు నిత్యమును ♦ మానక యిచ్చటి కేగుదెంచి మీ
దరిసెన మియ్యఁ గోరితిని ♦ దద్విధి వీలొనఁగూడదేని మీ
వర గృహ మెచ్చటన్ గలదొ ♦ పల్కుము వచ్చెదఁ బ్రత్యహంబు ని
ద్దర మొకచో నెటో కలిసి ♦ తద్దయు ముచ్చట లాడనా సఖీ! ౩౮౨

క॥ నావుడు మాయా యువతియు, శ్రీవిభుఁడున్ దేవుఁడైన ♦ శ్రీకృష్ణవిధుం
డా వనజాక్షికి రాధిక, కావశ్యకభక్తి నిటుల ♦ ననియెను జనకా! ౩౮౩

ఉ॥ ఊరెది యన్న నందపురి ♦ నొందిన నందుని యిక్కప్రక్కఁ గా
చేరదిశన్ బ్రభాపటలి ♦ వెల్గెడి గోకులమౌ చెలంగు నా
పేరిఁక గోపదేవియని ♦ విశ్వమునన్ విదితంబు రాధ! నీ
సౌరును జేటియా లలిత, ♦ సక్కవచింపఁ గనంగ వచ్చితిన్. ౩౮౪

చ॥ నవనవపుష్పవాసనల ♦ నవ్యలవంగలతాదిసంతతిన్
నవకపుఁ దేంట్ల పాటలను ♦ నాణెముగా ఫలియించు చెట్టులన్
నవనవలాడు నీవనము ♦ నా కనులారఁగఁ గాంచియుంటి వా
సవఘననందనోపవని ♦ సైతము దీనికి సాటివచ్చునే? ౩౮౫

ఉ॥ ఇట్టుల నిర్వురుం గలిసి ♦ యేవియొ ముచ్చటలాడి కొంచటన్
జెట్టులచాటుచోటులను ♦ జేరుచు నాడుచుఁ బాడుచున్ మఱిన్
నెట్టుచుఁ బాయుచున్ నగుచు ♦ నివ్వెఱసెందుచు బంతియాటలన్
బెట్టుగఁ జేయుచున్ మిగుల ♦ వెల్గుచునుండిరి మైథిలేశ్వరా! 3౮౬

ఉ॥ అంతట గోపదేవత మ ♦ హాద్భుతితో సఖి కిట్లువల్కె నో
యింతులమేలుబంతి! యిఁక ♦ నేగెదఁ బ్రొద్దదెగ్రుంకెఁ దిర్గి నీ
చెంతకు నేఁ బ్రభాతమునఁ ♦ జేరెద మద్గృహ ముందు దవ్వునన్
జింతను వీడి యాజ్ఞయిడి ♦ చెచ్చెరఁ బంపుము గోపికామణీ! 3౮౭

చ॥ పలుకఁగ నిట్లు రాధిక య ♦ పార విచారపయోధిమగ్నయై
యిలపయిఁ గూలు రంభవలె ♦ నేమియెఱుంగక సొమ్మసిల్లె నె
చ్చెలు లదిగాంచి శీతల వి ♦ శేషకృతుల్ బొనరించుచుండి రా
వల నల గోపదేవి వృష ♦ భానుకుమారికఁ బ్రక్కఁ జేరుచున్. 3౮౮

ఉ॥ గోగణగోరసాగ్రజులఁ ♦ గూరిమి యెక్కువయాట దప్పకే
నేగవలెన్ జుమీ యనుచు ♦ నెట్టులొ రాధిక నాశ్వసించి గో
పీగణ మాస్థ మ్రొక్కి సర ♦ విన్ వృషభానుపురంబు వీడి బ
ల్వేగమ చేరె నందపుట ♦ భేదనసంగతగోకులంబునన్. 3౮౯

క॥ మాయాంగనయా హరి యట, రేయిని జని నిద్రవోయి ♦ రేకం బుదితుం
డై యలరెడి లో మఱి రా, ధాయతనం బొందె నామె ♦ యాత్రిని బాపన్.

వ॥ అంత.

ఉ॥ వచ్చిన గోపి నామె గని ♦ భక్తిని ఫుల్లసరోజనేత్రయై
యిచ్చి సువర్ణపీఠకను ♦ నెంతయు నెయ్యము దోఁప నమ్మరో!
యిచ్చట నిన్న నన్నువిడి ♦ యేగితి వప్పటినుండి నీరహిన్
హెచ్చిన శోకతాపముల ♦ నెబ్బెటికంబును జెందితిన్ జుమీ! 3౯౧

చ॥ తొఁలుత నపథ్యసేవ బహు ♦ తుష్టిని గూర్చి యనంతరంబునన్
సిలుగు ఘటించు నట్టులగు ♦ చెట్టల కూడిక యిద్దిగాక శి
ష్టుల సహవాసమొంటఁ దొలి ♦ శోకముఁ బొందుట లయ్యె నిష్టమి
మ్ములఁగను భాగ్య మొందితిని ♦ బోయిన ముల్లియఁ బొందు చాడ్పునన్. 3౯౨

చ॥ అనవుడు గోపదేవత త ♦ దార్తి యథార్థమటం చెఱింగి తా
నును వెతఁగన్న దానివలె ♦ నోరు మెదల్పకయుంట రాధికా
వనితయు గాంచి స్వీయులగు ♦ భామలచే నడిగించి మైత్రియే
ఘనము వొంది తాను దము ♦ కంబున గోపకదేవి కిట్లనెన్! 3౯౩

ఉ॥ ఓలలనాలలామ! వగ ♦ పొందెదవేలొకొ? నీకు నెట్టి తం
టా లొనగూడలేదుగద! ♦ టక్కరులెవ్వరు నిన్నుబాటలో
గోల నొనర్పలేదుగద! ♦ కొంప మగండె యధోముఖంబునన్
నీలగఁగొట్టలేదుగద! ♦ నీతలిదండ్రులు దన్నలేదుగా. ౩౯౪

చ॥ మఱియు ననాంద యత్తయును ♦ మామయు జుట్టల నేరు మర్దనం
బఱిముఱి సల్పలేదుగద ♦ యధ్వపరిశ్రమ మేమిలేదుగా
దురుసుగ నిన్నుఁగూర్చి సవ ♦ తుల్ బలు కొండెములాడి కొట్టస
ల్పరుగద! యేదొ వాకొనినఁ ♦ బాపెద వానిని యుక్తియుక్తనై. ౩౯౫

ఉ॥ కోరెదవేనిఁ గొమ్మవిగొ! ♦ కోటలు పేటలు దోటలున్ గళా
చారుతరాభ్రచుంబిపృథు ♦ సౌధములున్ నునుపట్టుపుట్టముల్
హీరము లర్ఘమున్ మణులు ♦ నేన్గులు గుఱ్ఱము లాలచాలు శృం
గారలసత్సఖీజనము ♦ గ్రాలుచు నుండెడి గోపదేవతా! ౩౯౬

చ॥ ధనమునొసంగి దేహమును ♦ దప్పక యొప్పుగఁ బ్రోవ నౌను ద
త్తనువునునిచ్చి మానము య ♦ థావిధి రక్షనొనర్ప నౌను ద
ద్ధనుతనుమానముల్ మిగుల ♦ దానమొనర్చి సుమిత్రకార్య మె
గ్గునఁ బడకుండఁగాంచి యనుః ♦ కూలముగా నెరవేర్పనౌఁగదా. ౩౯౭

చ॥ కపటము వీడి మిత్రవరు ♦ కష్టసుఖంబుల నొక్కరీతిఁ దో
డుపడి హితంబులం బలికి ♦ కొంపులఁబాపి యశస్సుగూర్చి నే
రుపున నెవండు వర్తిలునొ ♦ రూఢిగ వాఁడె ధరన్ గృతార్థుఁడై
యపగతపాపుఁడౌచు హరి ♦ యవ్యయధామముఁ బొందు నెచ్చెలీ! ౩౯౮

ఆ॥ ఆప దబ్ధి నీఁద ♦ ననువైననౌకయు, సౌఖ్యసాధమెక్కఁ ♦ జక్కని యధి
రోహిణి మదకామ ♦ మోహాభయాద్యద్రి, వజ్రముగద జగతిఁ ♦ బరమసఖుఁడు

తే॥ పాపములఁబాపు హితవెంచు♦భవ్యగుణము, వెల్లడించు దుర్గుణముల♦డొల్లఁజేయు
గుహ్యమును దాఁచు నక్కఱన్♦గోరినదిడు, విడుములన్ విడఁడుగ! సుమి♦త్రుఁడుదలంప

తే॥ తనకు నుండిన ధనమెల్ల ♦ దానమిచ్చి, యైనఁ జెలి ప్రాణముల రక్ష ♦ నహరహంబు
సేయవలెనని పెద్దలు♦సెప్పుచుండ్రు, గాన నీకష్ట మేదొ ప♦ల్కంగఁ దగును

చ॥ విసమును లోన నింపుకొని ♦ ప్రేముడి వెల్లడిఁ జల్లి మైత్రి సం
తసమునఁ జేయు మానవుఁడు ♦ దండధరాజ్ఞను గింకరాగ్రణుల్
గసిఁ బ్రహరింప బాధలను ♦ గాచెడి వారలులేక కాంచఁడే?
వసుధఁ గుశీలుఁడౌ నటుని ♦ భాతిని నిందలఁ బొందఁడే చెలీ! ౪౦౨

తే॥ కానఁ జెలినైన నాకు నీ ♦ కష్ట మెఱుఁగఁ, జెప్పవేఁడితి బైన నీ ♦ చిత్తమమ్మ!
యనుచుఁ బ్రార్థింపఁగా గోపి యా♦హరియు నగుచు, నల్లనల్లన రాధ కి♦ట్లని యొజనక!

తే॥ సతిరో! గోవర్ధనాచల ♦ సానువులను, వింతలనుగొల్పు నిఋరైన ♦ వీధులందు
బెరుఁగురుండను దల నిడి♦విక్రయింప, సంచరించుచు నుంటిఁ ద♦త్సమయమందు.

ఉ॥ పిల్లనఁగ్రోవిఁ బెత్తమును ♦ బింఛము సన్ననిపట్టుపుట్టముల్
మెల్లని చూపు, జిర్నగవు, ♦ మేఘమనోహరవర్ణ మొప్ప భా
సిల్లెడి నందుపట్టి, నను ♦ సిబ్బితి వీడుచు నడ్డగించి నా
యుల్లము జల్లనన్ గరము ♦ నొంధి కరంబిడి డాసి ప్రైసుకన్. ౪౦౫

ఉ॥ పెండిలిఁ జేసికొమ్మ నను ♦ వేఱుగ నెంచకుమంచుఁ బల్కె నో
మొండిశిఖండి! నవ్వఁదువుఁ ♦ బుద్ధి యొకింతయు లేదె, దూరమం
దుండు, స్వయంభువుర్ బెరుఁగు ♦ దొంగను నిన్ను వివాహమాడ నీ
కుండరె చెల్లెలమ్మలు? న ♦ వోధను నన్నిటులంటఁ బాడియే? ౪౦౬

చ॥ అనఁగ నతండు నాపయిని ♦ న్నాగ్రహమెంతయుఁ జూపి పెర్గుకుం
డను బగులంగఁ గొట్టి దధి ♦ డగ్గఱి త్రాగి యురీయవస్త్రముల్
గొని కడువేగ నందివర ♦ గోత్రకకుప్పున కేగఁ గాంచి తో
డ్త నతనిఁ జిక్కఁ జేసికొన ♦ దవ్వననుర్ జని వచ్చితిన్ వృథా. ౪౦౭

చ॥ అదిసుత, వాని పేరు మన ♦ మందుఁ దలంపను జూడ నాతఁడో
యదుకులజుండు, నిర్ధనుఁడు, ♦ నల్పుఁడు రూపసిగాఁడు, దేబె, గా
న దయితుగా గణింపనుగ ♦ నానుడి సత్యమటంచు నమ్మి నీ
వెద నల కృష్ణు భర్తగ గ్ర ♦ హింపకు మమ్మ! సఖీవతంసమా! ౪౦౮

చ॥ పగఁ జెళి యిట్లు బల్కి వృష ♦ భానుకుమారిక యాలకించి బ
ల్వాగపును నబ్బురంబుఁగని ♦ బాపురె! యంచు సరస్వతిన్ స్వవా
క్యగతి ఘటించి యాదృతిని ♦ నాసఖ కిట్లనె గోపదేవతా!
యిఁగ నిటు రిత్తమాటలను ♦ నెక్కడ నీవనకమ్మ! యారయన్. ౪౦౯

చ॥ ఎవనిఁ గనుంగొనన్ విధిమ ♦ హేశముఖుల్ దప మగ్నిఁ జేసిరో
యెవని పదాబ్జధూళిని వ ♦ హింప శుకాసురిదత్తు లాస్థ యో
గవిధి సమాధినుండి రల ♦ కైటభమర్దను నాదిపూరుషున్
బ్రవిమలునిన్ బ్రపూర్ణతము ♦ వైరముతోడ వచింతువే? సఖీ! ౪౧౦

ఉ॥ ధర్మము లుద్ధరింపఁగ, న ♦ ధర్మములన్ నశియింపఁజేయ, స
త్కర్మము నిల్ప, వేదములఁ ♦ గావ, సుశీలురఁ బ్రోవ, ధారణిన్
శర్మముఁగూర్ప, దుర్జనులఁ ♦ జంప, దయాదులఁ బెంపుజేయ నే
మర్మము లేక పుట్టిన ర ♦ మాపతి దూఱుదువే యటుల్ చెలీ! ౪౧౧

ఉ॥ శ్రీరమణీయగోపులు వి ♦ శేషవిధంబుగ నాలఁ గాచుటన్
గోరస మెప్డు గ్రోలుటను ♦ గోతతి నామములన్ జపించుటన్

గోరజమూనుటల్ దలల, ♦ గోసుముఖంబుల నెవ్వుఁజూచుటల్
వారలె శ్రేష్ఠు లాకులమె ♦ వర్ణ్యమటంచు నెఱుంగుమో చెలీ! ౪౧౨

చ॥ మునుపు మహేశ్వరుండె హరి ♦ మోహనరూపముఁజూచి మోహకం
ధినిఁబడి తన్నుఁ గొంచు దరి ♦ తెన్నులు దోఁచక యెంతొ వెఱ్ఱి యె
త్తినజను కైవడిన్ దనదు ♦ దివ్యముఖంబు సెడంగఁ బాములన్
బునుకల బూదిఁ బెంజడలఁ ♦ బొంది విసంబును ద్రాగఁడే? ప్రియా! ౪౧౩

చ॥ నరసురయక్ష సిద్ధముని ♦ నాయకు లెవ్వని పాదపద్మముల్
శిరమునఁదాల్చి మ్రొక్కులిడి ♦ శ్రీ గలుగన్ భయభక్తులన్ బలిన్
సరగునఁ దెచ్చియెవ్వనికి ♦ సందియ మందక యిచ్చుచుందురా
సిరిచెలి నిర్ధనుండనుచుఁ ♦ జెప్పఁగరాని నుడుల్ వచింతువే? ౪౧౪

చ॥ వికటకృతి ప్రవీణులయి ♦ విశ్వముఁ బాడొనరించు ధేనుకున్
బకు నఘు బూతనాసురిని ♦ వత్సనిశాచరు వ్యోమదైత్యునిన్
శకటసురారినిన్ మఱి ని ♦ శాటుల నెందఱనో వధించి సౌ
ఖ్యకరవిధానముల్సలిపి ♦ క్రాలెడి నాహరియున్ వినింద్యుఁడే! ౪౧౫

చ॥ అల హరిభక్తిలేనియెడ ♦ నాతఁడు బ్రహ్మయుగాని యిందిరా
లలనయుగాని మూఁడు కను ♦ లన్దగు నీశుఁడుగాని యేరుగా
ని లలితకృష్ణరూపము స్వ ♦ నేత్రములన్ గనరమ్మ! భక్తవ
త్సలుఁడుగదా! చెలీ! పలుకు ♦ తాదృశనిందకు వాఁడు పాత్రుఁడే? ౪౧౬

చ॥ పరమదయానిధిన్ బతిత ♦ పావను విద్రుమబింబసన్నిభా
ధరవిలసత్ప్రియధ్వనిన ♦ దన్మురళీరతునిన్ ధరామనో
హరు స్మితపూర్వభాషి నిగ ♦ మాదినుతున్ జగదేకసుందరున్
హరిని ననాదిమధ్యలయు ♦ నట్టుల దూఱుట దోషమౌసుమీ! ౪౧౭

క॥ గోలోకనాకధాత్రీ, పాలున్ గరుణాలవాలు ♦ స్వర్ణసుచేలున్
బాలున్ బుధనుతసద్గుణ, జాలున్ లీలావిలోలు ♦ శపియింపకుమా. ౪౧౮

ఉ॥ ఆహరినిన్ భజించు పతి ♦ తాధములైనఁ బవిత్రులౌచు నా
యైహికపారమార్థికము ♦ లందలిసౌఖ్యము లొందకుందురే?
మోహముతోడ నావిధిని ♦ ముచ్చట లాడితివైనఁ దిర్గి నీ
యూహఁదలంపుమా! యనఁగ ♦ నొయ్యన నాయమ రాధ కిట్లనెన్. ౪౧౯

చ॥ చెలి! భవదుక్తి ధోరణి వ ♦ చింపఁగ శక్యమె? యాబృహస్పతిన్
బలుకుల కల్కిఁబోలి శ్రుతి ♦ పద్ధతి నొప్పుచు నన్నుఁ దృప్తిగా
సలిపెను సత్యమమ్మ! యిఁకఁ ♦ జక్రధరుం డిట నల్పకాలమం
దలరుచు నీ యభీష్టములు ♦ నన్ని యొసంగు నటంచు నెంచెదన్. ౪౨౦

ఉ॥ అంతట రాధ, వేడ్కపడి ♦ యమ్మురో! యాహరి ప్రేమతోడ నీ
పొంతకు వచ్చి నట్టయినఁ ♦ బొల్పుగ నేమి యొనర్చినాను ప
రాంతరమందు రానియెడ ♦ నాక్షణమందున నీకు నా ధనం
బంతయు నిచ్చి కానకుఁ బ్ర ♦ యాణము సల్పెద నంచు భక్తితోన్. ౪౨౧

ఉ॥ కన్నుల మోడ్చి గద్దెపయిఁ ♦ గంజదళాక్షుని భావపద్మమం
దెన్నుచునుండ శ్రీహరియు ♦ నిందునిభానన దివ్యభక్తి సం
పన్నను స్వేదసంయుతను ♦ బాష్పసమేతను రాధఁజూచి యా
పన్నదయాళుఁడౌచు స్వక ♦ పౌరుషదేహముఁ దాల్చె భూవరా! ౪౨౨

చ॥ పిదప సఖుల్ గనన్ ఘనగ ♦ భీరగళంబున శౌరిఁ రాధికా
సుదతికి నీరహిన్ బలికె ♦ సుందరి! యోకరభోరు! యిందుస
ద్వదన! వ్రజేశ్వరీ! తరుణి! ♦ పంకజగంధి! చెలీ! భవజ్జపం
బెద లలిమెచ్చి వచ్చితిఁ ద్వ ♦ దీక్షణయుగ్మము విప్పి చూడుమా! ౪౨౩

ఉ॥ నీవిటుఁ "గృష్ణ! రమ్మ"నుచు ♦ నిశ్చలభక్తిని బిల్వ వించు నా
గోపుల, గోపులన్, యమున ♦ కూలమునన్ విడి యందునుండి నీ
భావగతేప్సితంబుల న ♦ వారిగ నిచ్చి ముదంబుఁగూర్చ నే
ధావనముల్ బొనర్చి యిట ♦ దండిగ నుంటినిఁ గంటఁగాంచుమా! ౪౨౪

ఉ॥ ఇత్తతి నిందునుండి నొక ♦ యిందునిభానన లేచి వెంటనే
తత్తఱపాటుతోఁ జనియెఁ ♦ దత్సతి, దేవియ దయ్యమా మదో
న్మత్త నిశాంచరాంగనయ ♦ మానవనారియ యేరొ పల్కుమా
యుత్తరకాంక్షులన్ మదిని ♦ నెంతయు నమ్మట బాము నమ్మకే. ౪౨౫

ఉ॥ కావున నేరిమాటలను ♦ గాదని నానుడు లెల్ల నమ్మచున్
నీవిఁకఁజూడు లేనియెడ ♦ నేనిటు వచ్చుట వ్యర్థమౌ సుమీ
నావుడు రాధ వేగ నయ ♦ నంబుల విప్పుచుఁ గృష్ణుఁజూచి యా
శ్రీవిభుఁ గౌఁగిలించుకొని ♦ చెందె ముదంబు విదేహభూవరా! ౪౨౬.

తే॥ ఇట్టి శ్రీకృష్ణసత్కథ ♦ నెవ్వరు విను, చుందు రవ్వార లిద్ధర ♦ నొంది సుఖము
లంతమందున గోలోక ♦ మందు నలరి, సకలసుఖములఁ గాంతురు ♦ జనకరాజ!

చ॥ అనవుడు మైథిలేశ్వరుఁడు ♦ హర్షపరీతమనస్వియౌచు నో
మునివర! కృష్ణచంద్రుఁడటు ♦ బూన్కిని నావృషభానుపుత్రి ప్రే
మ నొగిఁ బరీక్షసల్పి యను ♦ మానము మానుచుఁ బ్రీతి ద
ర్శన మిడి యాత్మలీలఁ దొలి ♦ సల్పినకార్యము సెప్పుమా! యనన్. ౪౨౮

ఉ॥ నారదుఁ డిట్లనెన్ జనక ♦ నాయక! మాధవుఁ డంత మాధవీ
వీరుధముల్ గ్రహించి కడు ♦ వేడుక మాధవమాసమందు బృం

దారమణీయకాననము ♦ దర్పకుఁ డమ్ముల వేయు రాసకే
ళీ రచనేశుఁడై చని స్వ ♦ లీలలఁ జూపఁగడంగెఁ బొంగుచున్. ౮౨౯

## ❧ రాసక్రీడా వర్ణనము. ☙

క॥ వైశాఖ మాస పంచమి, శ్రీశుఁడు చంద్రోదయంబు ♦ నెసఁగన్ శ్రేమా
వేశముతో రాధాసతి, నాశుగతిన్ బోయి కూడె ♦ యమునోపవనిన్. ౮౩౦

వ॥ దేవా! యని యెట్లంటవేని వినుము. మున్ను గోలోకంబునుండి వెన్నుని యానతిఁ గొంతదివ్యప్రదేశం బిద్ధరాస్థలంబున కాగతంబైనదని వాక్రుచ్చితి. అందుఁ బద్మరాగమయంబై కామధుక్ద్రుమంబులను మాధవీముఖవల్లరులను బుష్పసుగంధంబులను దివ్యంబగు రూపంబు ధరించి నందనవనంబు విడంబించుచు బృందావనం బలరారు. దివ్యరత్నఖచితసోపానసంపన్నంబై వివిధవిహాగపరీవృతంబై పుండరీకమండితంబై యమునాధునీరాజంబు ప్రవహించు. రత్నకూటవిభాసురంబును రత్నధాతుమయంబును ఫలపుష్పలతాసమాకీర్ణంబును నై సుందరంబులగు బిలంబులను మధురాంబుపూరితంబులగు నిర్ఝరంబులను శ్రావ్యంబులగు బంభరఝంకారంబులను జెలఁగి కరీంద్రంబుపగిది వెలుఁగు గోవర్ధనాచలేంద్రంబు దేజరిల్లు. ఉప్పరవీధి నొరయు నుప్పరిగలను వాటంబులగు కొలువుకూటంబులను బొంకంబులగు నంకణంబులను నింబునుగొల్పు కంబంబులను గెల్పునుదెల్పు నిక్కినటెక్కియంబులను జక్కనిచదుకంబులను మధుమత్తంబులై శ్రీరాధాకృష్ణగాథాగానం బొనరించుచు నర్తించు మధువ్రతంబులను శుకపికశారికాముఖవిహంగకలకలనాదంబులను సంగతంబై శ్వేతపీతారుణపుష్పసందోహబంధురంబులగు నికుంజంబులు పుంజిమీఱు. మఱియు సహస్రదళసరోజరజంబుల సారెసారెకుఁ దూలించుచుఁ బుష్పసౌరభగ్రహణం బొనరించి చల్లనిపిల్లవాయువు లల్లలన వీచుచుండఁ జెలఁగు కుంజంబులును జెన్నుమీఱు. అందు నాసమయంబున శీలరూపవయస్సంపన్నలై విరిపాన్పు లమర్చు వెలఁదులు గొందఱును శృంగారకార్యకరణప్రవీణలగు శృంగారవతులు గొందఱును ద్వారపాలికలగు నారీమణులు గొందఱును బార్షదలగు భామలు గొందఱును ఛత్రచామరంబులం బట్టి మిసమిసలాడు మెలఁతుకలు గొందఱును బూలసొమ్ముల రచింపఁ జాలిన పొలఁతులు గొందఱును బృందావనపాలికలగు సుందరదనలు గొందఱును గోవర్ధనాచలనివాసినులగు కోమలాంగులు గొందఱును వీణావేణుమృదంగపాణివాదవిధానవిజ్ఞాననిధులగు మిటారులు గొందఱును విరాజిల్లిరి. మఱియు నందు నర్తితి నర్తామరసాక్షుసమీపంబున రాసక్రీడార్థంబు ద్వాదశయూథంబులును బ్రవర్తిల్లె. వెండియు నటకు ౮౩౧

క॥ నల్లనివర్ణంబొప్పఁగ, నల్లనిచీరల్ ధరించి ♦ నవమణి భూషల్
వెల్లుగఁదాల్చియు యూథం, బల్లనఁగొని కమలనేత్ర ♦ యగు యమున సనెన్.

తే॥ తెల్లవన్నియ చెన్నారఁ ♦ దెల్ల కోక, వెలుఁగ ముక్తాభరణములు ♦ సెలఁగయూథ
యుతయు సుందరవదన శ్రీ ♦ మతియునైన, గంగ వేడుకతోఁ నుతఁ ♦ గదలిచనియె

తే॥ అంత శ్రీరమాదేవియు ♦ నరుణవసన, ములను దగి విధువిద్యుతి ♦ లలితయగుచుఁ
బద్మరాగవిభూషలు ♦ బరఁగ మంద, హాసమున యూథసహితయై ♦ యరిగె మఱియు

తే॥ పూలతోడవులఁ బెట్టి యం ♦ భోజరుచిని, దనరి తెల్లనిపుట్టంబు ♦ దాల్చి యూథ
మొందఁ శ్రీమధుమాధవి ♦ నందనంద, నసతి దమితోడ నేగె న ♦ నంతరమున.

తే॥ వరహరిద్వస్త్రముం గట్టి ♦ సరసవాక్య, చతురయై గౌరసందీప్తి ♦ సహితయగుచు
రత్నభూషల ధరియించి ♦ రాణమీఱు, విరజ యూథంబుఁ గైకొని ♦ వెడలిచనియె.

తే॥ మాయ, లలిత, విశాఖలు ♦ స్వీయములగు, భూషణాంబరశోభలు ♦ బొలుపుగొలుప
యూథములతోడ రమ్యబృం ♦ దోపవనము, రాసలీలార్థ మేగిరో ♦ రసికవర్య!

తే॥ అంత యూథసమేత హ ♦ ర్యష్టభార్య, లరిగి రంతట నష్టారి ♦ యష్టసఖుల
యూథములు నేగె షోడశ ♦ యూథములును, బోయె ముప్పదిరెండన్ని ♦ మొత్తమునకు

చ॥ చదలున రిక్కలం గలిసి ♦ చందురుఁ డుండిన మాడ్కి వంశినిం
బెదవులఁ బెట్టి పాడుచును ♦ బెత్తముఁ గైకొని పచ్చపుట్టముల్
గుదురుగఁగట్టి పింఛమును ♦ గూకటిఁదాల్చి మనోజ్ఞరీతి ము
ప్పది మఱిరెండు యూథముల ♦ భామలఁగూడి యుపేంద్రుఁడొప్పెఁగా. ౪౩౯

చ॥ రతిని రతీశ్వరుండు దగి ♦ రాజిలుచాడ్పున రాసమందు శ్రీ
పతి యల రాధతోఁగలిసి ♦ భాసిలి వంశిని దివ్యరాగసం
తతులను బాడుచున్ యమున ♦ దాపున కేగి ప్రియాకరాంబుజం
బఱిశయకోమలస్వకక ♦ రాబ్జమునన్ గొని సైకతస్థలిన్. ౪౪౦

తే॥ కూరుచుండి బృందావని ♦ సౌరుఁగనుచు, సరస సల్లాపముల్ దమి ♦ సలిపి నగుచు
లేచి కుంజమంజంబున ♦ లీలఁదిరిగి, టక్కున్ సతి కేల్విడి ♦ డాఁగె నెటనో.

చ॥ అటుపయి రాధికాలలన ♦ యాతనిఁ గన్గొన భ్రమఁకు భ్రమఁకునం
దటవిని సంచరించి కని ♦ యంతిమ మం దొక కొమ్మనున్న శ్రీ
చటులవిలాసు స్వప్రియునిఁ ♦ జట్టనఁ గాంచుచుఁ బట్టి నవ్వి య
చ్చట నెటొ యొక్కశాఖకుఁ ♦ జాటునఁ దానును డాఁగెఁ జక్రియున్. ౪౪౨

ఉ॥ ఏమఱుపాటునన్ స్వసతి ♦ యేగుచు డాఁగిన చోటు మార్గణం
బేమఱకుండఁజేసి తుద ♦ నెంతయుఁ గుంజములందుఁ బాఱు రా
ధామహిళన్ ధరారుహము ♦ దాపునఁ గన్గొని కేల్గ్రహింపఁగా
నామె స్వహస్తముల్ గొనుట ♦ కట్టిటులన్ గదలించె నత్తఱిన్. ౪౪౩

సీ॥ కాకినల్పును మించు ♦ చీకటి భ్రమఁకులు, బంగారు తీవియఁ ♦ బరఁగి నట్లు
నాణెముగా నుండు ♦ నల్లనిమబ్బులు, వెలిఁగెడి మించునఁ ♦ జెలఁగి నట్లు

నీలాచలేంద్రంబు ♦ నిగనిగలాడెడి, బంగరుగనుల వె ♦ లింగి నట్లు
నేరేడుపండును ♦ మీఱిన నెమ్మేను, బచ్చని పచ్చల ♦ వఱలి నట్లు
తే॥ కృష్ణుఁడా రాధికాసతిఁ ♦ దృష్ణతోడ, మదనమోహనుఁడై రతి ♦ సుదతిఁగూడు
మన్మథుండన బృందయఁ ♦ మధురవనిని, రాసరంగంబునందున ♦ రాణమీఱె

ఉ॥ ఎందఱు గోపికల్ గలరొ ♦ కృష్ణుఁడు నందఱి కన్నిరూపులన్
బొందుచు రెండు ప్రక్కలను ♦ ముద్దులగుమ్మలు వెల్ల నంతరం
బందునఁ దా వసించి నటు ♦ నట్టుల నాట్యమొనర్చె ప్రేతలా
నందముతోడఁ బాడుచును ♦ నాట్యము సల్పిరి దివ్యవైఖరిన్. ౪౪౫

క॥ నించెను దమి మది హరి, నవ్వించెను బరిహాసవచకముల ♦ నింపుగ నాశ్లే
షించెను సర్వవిధుల మెప్పించెను రాసముల గొల్ల ♦ యింతుల నెల్లన్. ౪౪౬

తే॥ ఇంద్రుతోఁగూడి సురభామ ♦ లెల్ల కేలమి, నలరినట్టుల గోపికల్ ♦ హరినిఁగూడి
వెలిఁగి రిట్టులఁ గృష్ణుఁడు ♦ లలితరాస, ములను సలిపెను గాళింది ♦ పొంత, నంత.

మ॥ జలకేళీరచనాకుతూహలముతో ♦ సంఫుల్ల పద్మేక్షణుం
డల యక్షీజనమందు యక్షవిభు చా ♦ యన్ ప్రీతిబద్ధాత్ములున్
జలజాతాయతపత్రనేత్రలగు ఘో ♦ షాయోషలన్ వెల్గుచా
జలజాతాప్తసుతాతటంబు నరుగన్ ♦ సాగెన్ నిరాతంకుఁడై. ౪౪౭

ఆ॥ అప్పు డాదియందు ♦ నాభీరసుందరీ, గణములు తటినిలోఁ గ్ర ♦ మముగఁ దిగుచుఁ
దరఁగలను కరములఁ ♦ దమ్ము నాశ్లేషింప, నరుగుదెంచు యమున ♦ నాదరించి. ౪౪౮

తే॥ చనులబంటిని జని నిల్చి ♦ శౌరి గని క, రేణువులఁగూడి కరియాడు ♦ రీతిఁ జనుచు
నగుచు నీర్గొంచు డాయుచొ ♦ మగువలగుమిఁ, జల్లుచున్ గౌఁగిలించుచు ♦ జనుచునుండు.

క॥ అత్తఱి నత్తరళాక్షుల, నెత్తావులుగల్గు వస్త్ర ♦ నివహము దేలెన్
దత్తరణికుమారిక తల, హత్తిన యుష్ణీషమనఁగ ♦ నవనీనాథా! ౪౫౧

ఉ॥ ఇట్టుల సర్వగోపికలు ♦ కృష్ణుని రాసవిహారమందు నే
నట్టులు లేనియట్టుల మ ♦ నంబున నుండెడి వాంఛ లన్నిటిన్
బెట్టుగఁ బొందిరా పటహ ♦ వేణుమృదంగవిపంచికాదు లి
ట్టిట్టన నట్లు మ్రోసె జగ ♦ దీశ్వరకీర్తిని జాటెనా యనన్. ౪౫౨

తే॥ యక్షచారణవిద్యాధ ♦ రాంగనలును, సిద్ధగంధర్వకిన్నర ♦ చేటికలును
రాసరంగంబు వీక్షించి ♦ రతినిమీఱి, ప్రశ్లథన్నీవులైరి యో ♦ పార్థివేంద్ర!

తే॥ వేల్పు లారాసరంగం బ ♦ నల్పరీతిఁ, గాంచి తత్సురాంగనలతోఁ ♦ గలిసి పూల
వానఁ గురిసిరి పిమ్మటఁ ♦ బద్మనాభుఁ, డా విధమున జలక్రీడ ♦ లాడి వేగ. ౪౫౪

ఆ॥ ఎల్ల ప్రేతలఁ గొని ♦ యల్ల గోవర్ధన, గిరికి నరిగి యందు ♦ వఱలుచుండు
శుద్ధరత్నఖచిత ♦ సిద్ధబిలంబునన్, రాసకేళిఁ జేసి ♦ రాధతోడ. ౪౫౫

తే॥ అల్లనల్లనఁ దిరుగాడి యచట గొప్ప, గొప్ప పూలగద్దియపైని గూరుచుండి
పర్వతస్థసౌదామినీ భాసురాభ్ర,మువలెఁ బొల్పారె భూవరా! యవల వినుము!
చ॥ అతిశయకాంతికాంతమగు నా పెనుగద్దియ నున్న రాధికన్
గుతుకముతోడ నెచ్చెలులు కుంకుమసంకుమదైణనాభి పు
ష్పతతిపటీరకజ్జలసు వర్ణమణిప్రసృతోరుభూషణ
ప్రతతి నలంకృతుల్ సలిపి భాసిలఁజేసి రనంతరంబునన్ ౪౫౭
చ॥ యమున, నవప్రసూనరస మ్మున విధంబున మీఁదఁ జల్లి యా
యమకు విధిప్రకారముగ నర్చల సల్పియుఁ బ్రేమకాళిసే
త్రములకు విందొనర్చు నవ రత్నవిభాసురనూపురంబులన్
క్రమముగఁ బారితోషికము గా నిడి కౌతుకమొందెఁ బిమ్మటన్. ౪౫౮
ఉ॥ గంగదభంగతుంగబహు రమ్యతరంగవినోద యైన శ్రీ
గంగయుఁ, గీర్తినందిని క న్యామభక్తిపరీతచిత్తయై
ఖంగను గజ్జియ ల్లలిగి కన్నుల పండువ సేయుచుండు పా
దాంగద మొందు కాన్కగ స మర్పణముం బొనరించె నావలన్. ౪౫౯
చ॥ విరజయు, గోటిచంద్రసమ విద్యుతిసంయుత చంద్రహార, మిం
పార, వరకింకిణుల్, మధుమ తీసతి, యంగదయుగ్మ మేకదా
శి, రుచిరకంకణంబులను శ్రీమధుమాధవి, హారమున్ విశా
ఖ రతనాలకంటె మఱిఁ గమ్మలు బంధి, యొసంగెఁ బొంగుచున్. ౪౬౧
తే॥ అంగుళీయకమణులఁ జంద్రాననసతి, లలిత కంచుకరత్నముల్ జెలువమిన్న
యైన యానందిభామ, యర్ఘ్యఫాల, తోరణంబు నొసంగె సంతుష్టితోడ.
ఆ॥ బాలభానుతుల్య ఫాలపుష్పంబును, చంద్రకన్య, యిడెను సంతసమునఁ
బద్మపూర్ణ, శీత భానుభాసమ, భాలతిలకబిందు వోలి నొసఁగె. ౪౬౨
తే॥ మఱియుఁ బద్మావతియు ఘ్రాణ మౌక్తికంబు,
బాహుపురులను శతచంద్ర వక్త్రి, యింక
వరశిరోమణిన్, సుందరీ భామినియును,
భక్తితోడుత నిచ్చె నో పార్థివేంద్ర. ౪౬౩
క॥ బృందావననాయికయగు, బృందాసతి, రమ్యరత్న వేణిని, మఱి యా
నందదచూడామణి నా, నందముతోడ వృషభాను నందన కిచ్చెన్. ౪౬౪
తే॥ కృష్ణచంద్రుండు ప్రేముడి నెసఁగి యిట్లు, రమ్యశృంగారసంస్ఫుర ద్రాధతోడఁ
గూడి గిరిమీఁద నొప్పెను గోర్కితోడ, యజ్ఞుఁడా దక్షిణాసతి నలరినట్లు. ౪౬౫
తే॥ ఎలమి గోవర్ధనాద్రియం దెచట జక్రి, రాసరంగంబు నిర్మించి రాధతోడ
రాసకేళుల సల్పుచు రాణమీఱె, నచట శృంగారమండలం బలరె, భూప!

ఉ॥ పిమ్మట స్వప్రియుల్ గలిసి ♦ వెన్నుఁడు చంద్రసరోవరంబు వే
గమ్మునఁ జేరి దానియుద ♦ కమ్ములలో గజపంక్తిఁ గూడు నా
గమ్ము విధాన నాటలను ♦ గ్రాలఁ గళానిధి, చంద్రకాంతర
త్నమ్ముల రెండుగొంచు నిడ ♦ తద్వ్రజభానుకుమారి కాస్థతోన్. ౪౧౮

తే॥ వేయిదళములు గల రెండు♦తోయజంబు,లొంది యొక్కటి రాధకు♦నొకటి హరికి
నిచ్చి చనియెనుఁ దరువాతఁ♦గృష్ణుఁడెలమిఁ, బరమ బృందావన శ్రీని♦సరిగఁ గనుచు,

ఉ॥ భూరుహవల్లరీయుతము ♦ బుణ్యసరోవరభూషితంబు నా
నారుచిరమ్యబాహులవ ♦ నంబున కేగియుఁ దిర్గి చెమ్మటల్
గాఱఁ జరించునెచ్చెలుల ♦ గాంచి సమంచితవంశి, మేఘమ
ల్లారమనోజ్ఞరాగ మతు ♦ లంబుగఁ బాడె విదేహభూమిపా! ౪౧౯

ఉ॥ అంచితరాగ మట్లు విని ♦ యభ్ర మదభ్రముదంబుఁ బొంది వ
ర్షించె సువాసనారుచిర ♦ శీతలవాతము వీచె గోపికా
సంచయముల్ వ్యథల్ విడిచి ♦ సంతస మందియుఁ గృష్ణచంద్రు ధ్యా
నించుచు సద్గుణంబులను ♦ నెమ్మిని గానముఁ జేసె నంతటన్. ౪౨౦

చ॥ హరి యటనుండి లేచి తన ♦ యంగన లెల్లను వెంటనంట స
త్వరగతి నేత్రపర్వమగు ♦ తాలవనంబున కేగి యందు సం
బరమున రాసకేళులను ♦ బాడుచు సల్పఁగడంగె నింతలోఁ
గరము వ్రజాంగనాతతి ద ♦ గన్ దగి చెమ్మట గ్రమ్మ నిట్లనెన్. ౪౨౧

శా॥ శ్రీకృష్ణా! హృదయేశ్వరా! వినుము! మా ♦ రీతుల్ దగ న్నాలుక
ల్బీర్పన్ సాగెను దూరమయ్యె నల కా ♦ ళిందీనదీరాజ మి
ట్లేకాండంబుగఁ గాఱుచుండెఁ జెమటల్ ♦ సృష్టిస్థితిధ్వంసముల్
జోర్పన్ సల్పెడివాఁడ వీవె యిపుడా ♦ శుద్ధాంబులం దాడనా. ౪౨౨

చ॥ అని వినయంబుగాఁ బలుక♦ నాకమలేక్షణుఁ డాలకించి గొ
బ్బునఁ దనవేత్రదండమున ♦ భూమిని బాఁదె ననంతరంబునం
దున నట వేత్రగంగ యన ♦ దొడ్డధునీమణి పుట్టె దాని స్ప
ర్శనమున బ్రహ్మహత్యలు గ ♦ రంబు నశించుఁ బరంబుఁ గల్గెడిన్. ౪౨౩

ఉ॥ అంత ననంతలోకపతి ♦ యా హరి రాధను గోపికాజనం
బంతయుఁగొంచుఁ దజ్జలము ♦ నందు యదృచ్ఛగఁ గ్రీడలాడి బల్
సంతసమొంది యద్ది విడి ♦ సాగి లతాతరుపంక్తితోడ నా
పొంతఁజెలంగుచుండిన కు ♦ ముద్వనముల్ జన మైథిలేశ్వరా! ౪౨౪

ఉ॥ అచ్చట నచ్యుతుం డలరి ♦ యాయళిఝుంకృతు లాలకించుచున్
మెచ్చుచు రాసరంగమును ♦ నిర్మితిఁ జేసి సఖీజనంబులన్

జొచ్చియు రాసమ్ముఁ సలిపె ♦ సొంపుగ రాధయు మండనంబు లా
పచ్చనిపట్టుపుట్టముల ♦ భాసిలు సామి గొనర్చెఁ దత్స్థలిన్. ౪౭౭

సీ॥ సౌరభవాసిత ♦ చంపకసుమములఁ, గరము గట్టిన నడి ♦ కట్టు గలిగి
వేయిదళంబుల ♦ వెలుఁగు పద్మంబుల, సొంపును నింపిన ♦ శ్రుతులఁబొంది
కనులపండువసేయు ♦ గల్హుకడిమిపూల, డంబు సెలఁగు కిరీ ♦ టంబుఁబొంది
యందంబుగా నుండు ♦ మందార కుసుమంబు, లమరిన యుత్తరీ ♦ యంబు నొంది
తే॥ మోహినీమాలఁదాల్చి యం ♦ భోజయష్టిఁ, గేలఁగైకొని మల్లికా ♦ కేతకీ కు
సుమములన్ వెల్గు హారము ♦ సొరిది వేసి, తులసితోఁ గూడు తోమాలఁ ♦ జెలఁగు చక్రి.

వ॥ సర్వర్తుకాంతుండగు వసంతుం దొప్పిన చొప్పున స్వప్రియచే నట్లు కుముద్వనంబునం బుష్పంబులచే నలంకరింపంబడి తేజరిల్లఁ, దద్వ్రజాంగనాజాలం బాలోకించి వీణావేణుమృదంగనాదంబులం బొనర్చి మనోహరంబు లగు భైరవ మేఘమల్లార భూపాళ హిందోల బంగాళ మాళవీ దీపక కోశల మోహన పున్నాగ శ్రీరాగాదులను వేఱువేఱుగా గానంబొనర్చి యష్టతాళంబులను, షడ్జమధ్యమ గాంధారంబు లనెడి మూఁడు గ్రామంబులను, స, రి, గ, మ, ప, ద, ని, యను సప్త స్వరంబులను, హావ, విభావ, భావానుభావసంభావితంబులును హృదయంగమంబులును నగు నృత్యంబులం గావించి జగన్మోహనులగు శ్రీరాధాకృష్ణులను సంప్రీతులం జేయఁ దత్సుందరీబృందపరీవృతుండగు నాహరి, యటనుండి వెడలి మురళీగానంబు కర్ణపేయంబుగా సల్పుచు వికచన్మాలతీమాధవీముఖలతావిద్యోతితంబును, దివ్యవృక్షసమావృతంబును, శారికాకీరాదివిహగకలరవసంభృతంబును, నిర్జనంబును, సకలజనమనోభిరామంబు నగు మధువనంబున కేగి యందు నందనవనంబున బృందారకేంద్రుం డింద్రాణీసహితుండై యానందంబుఁ జెందినట్లు గోపీగణంబులతోఁ గ్రీడించి పెల్లుమోదిల్లి యందునుండి వెడలి

ఉ॥ కుందవనంబు నామ్రవనిఁ, ♦ గోమలమాలతిసద్వనంబు, నా
నందదనాగరంగవని, ♦ నవ్యకదంబవనంబుఁ గేతకీ
బృందవనంబు, దీర్ఘవట ♦ విస్తృతసద్వని, దాడిమీవనిన్
సుందరపిప్పలావని, న ♦ శోకవనిన్ గని తిర్గి పిమ్మటన్. ౪౭౮

చ॥ వకుళ కరీల్ల కుంజ పిచు ♦ బాదర నింబ తమాలసద్వన
ప్రకరముఁ బొంది కాంచి మఱి ♦ ద్రాక్షల కానకు, నేగి శ్రీఫల
ప్రకటవనంబుఁ జొచ్చి యటు ♦ పైఁగదళీవనిఁ జూచి కోవిదా
ర కుటజ దేవదారువన ♦ రమ్యముఁ గన్గొని యుల్లసంబునన్. ౪౭౯

క॥ తులసీవనమునఁ జొచ్చియు, బొలుపును గని యంతఁగల్ప ♦ భూరుహవనిలోఁ
లలితంబుగఁ దిరిగియు నా, స్థలమును విడనాడి సంత ♦ సంబున వేగన్. ౪౮౦

ఉ॥ కామవనంబుఁ జేరి యటఁ ♦ గ్రాలు గిరీంద్రమునందు గోపికా
స్తోమముతోడ నాడి నగు ♦ చున్ మధురాధరలగ్నవంశితోఁ
బ్రేముడి గానమున్ సలుప ♦ వ్రేతలు మోహపయోధిమగ్నలై
యేమియు గుర్తెఱుంగనటు ♦ లిద్ధర వ్రాలిరి మూర్ఛతో విభూ! ౪౮౧

చ॥ మఱియు నమర్త్యభామలు వి ♦ మానములన్ మదనాస్త్రభిన్నలై
సురలను గూడి కశ్మలత ♦ సోలుచు వీడిడి పోకముల్లతో
వఱలిరి నర్దెఱుంగులగు ♦ ప్రాణులు స్థావరరాజితోడ సొ
మ్మ రహిని బొందె నిల్చె నది ♦ మండలి యార్ద్రితఁ జెందె శైలముల్. ౪౮౨

ఉ॥ కామవనంబునం దలరు ♦ గ్రావము శ్రీహరి పాదచిహ్నితం
బై మెఱపొందె నందెవఁడు ♦ పానముఁ దానము నాచరించునో
యామనుజుండు ధన్యతను ♦ నందును భూవర! యంత శౌరి గో
పీమహిళాన్వితుండగుచు ♦ వేడ్కను జేరుచు నందిశైలమున్. ౪౮౩

చ॥ కడునిడుపైన సానువులఁ ♦ గ్రాలుచు రాసము సల్ప నుండి నా
పడఁతులు నాన యెక్కువగ ♦ భావములందునఁ బొంది వెంట రాఁ
దొడఁగక పోవుటన్ గనుచుఁ ♦ దోడ్తనె రాధికతోడఁగూడి య
క్కడనె యదృశ్యుఁడయ్యెఁగద ♦ కాంతలు ముగ్ధలుగారె! యారయన్. ౪౮౪

## గోపీ విరహ వర్ణనము.

ఉ॥ అంతట గోపికాలలన ♦ లాత్మమనోహరుఁజూడ వాఁడు త
త్ప్రాంతమునన్ వసింపమిని ♦ బాష్పము లొల్కుచునుండ భీతితో
నెంతయు నిట్లటుల్ దిరుగు ♦ నిట్టివలెన్ వనమందు నింక నా
చెంతలఁ దిర్గిరో జనక! ♦ చెప్పఁగరాని యనంతచింతలన్. ౪౮౫

క॥ కురరులు కురరముఁ జూడఁ, కరణినిఁ గరినాథుఁగరులు ♦ గానని భంగిన్
హరిఁగనఁ జాలక వెట్టిని, వఱలిన రహి వారు దిరిగి ♦ ప్రశ్నించి రిటుల్. ౪౮౬

సీ॥ మధుకంబ! కంటివే ♦ మధురిపుఁ గానవే, మధురసా! మధురిమ ♦ విధితవచను
బ్రహ్మణ్య! కంటివే ♦ రక్షిత బ్రహణ్యు, క్షీరికా! కానవే! ♦ క్షీరచోరు
నర్జున! కంటివే ♦ యర్జునసన్మిత్రుఁ, గుందమా! కానవే! ♦ కుందరదనుఁ
బూతనా! కంటివే ♦ పూతనాఘాతకు, భూరుండి కానవే ♦ భూరమణుని

తే॥ హేమపుష్పిక! కానవే ♦ హేమచేలుఁ, దిలకమా! కానవే! బుధ ♦ తిలకుఁగనిన
నెనరు మాపయి నించి యీ ♦ నిముసమందుఁ,జూపి రక్షింపరే మమ్ము ♦ శోకమూడ

సీ॥ మన్మథ! కానవే ♦ మన్మథ మోహను, మందార! కంటివే ♦ మందహాసు
పున్నాగ! కానవే ♦ పున్నాగ వందితుఁ, జిత్రక! కంటివే ♦ చిత్రచరితు
సహకార! కానవే ♦ సజ్జనసహకారిఁ, గితవంబ! కంటివే ♦ కితవరిపుని
శ్రీఫలా! కంటివే ♦ శ్రీరమణీశ్వరుఁ, గృష్ణలా! కంటివే ♦ కృష్ణచంద్రుఁ

తే॥ సకలవృక్షమ్ములార! మా♦సకల భువన, నాయకుని గాంచినం గరు♦ణాళువులయి
యెచట నుండిన వార్త మా♦కెఱుఁగఁ జెప్పు, వేఁడుచుంటిమి శిరముతో♦వినతిఁ జేసి

చ॥ వనవనమందు నిట్టుల న♦పారముగా హరివర్ణనంబులన్
బొనరిచి సర్వవృక్షముల♦ముంగల కేగి కరంబులన్ మహా
వినయముతోడ మోడ్చి బహు♦వేదన వేఁడిన, నవ్వి సెప్పమిన్
వనటను గృష్ణ! కృష్ణ! యని♦పల్కుచు నాహరి నమ్మియుండుదుర్. ౪౭౯

ఉ॥ గోపిక లంద ఱబ్రముగఁ♦గోమలి యాకృతులం ద్యజించి ల
క్ష్మీపతిరూపముల్ భ్రమర♦కీటవిధంబునఁ జెంది తత్పదా
రోపితభూమిపైఁ దగి ని♦రూఢిగఁ గాంచియుఁ గాంచలేక రా
ధాపదయుర్ దుదన్ గనిరి♦తత్పదచిహ్నితదివ్యదేశమున్. ౪౮౦

క॥ నావుడు మిథిలేశుండో, దేవమునీ! చక్రి, రాధఁ♦దేఁకువఁ గొని తా
నేవిధి నెచటఁగుఁ జనియెనో, యేవిధి మఱి గోపికలకు♦నెట నగుపడెనో? ౪౮౧

చ॥ అని యడుగంగ మౌని, జన♦కా! వినుమా హరి, రాధతోడ ని
ర్జనము, రహస్యమైన వట♦సాలసమీపమునందుఁ జేరి గొ
బ్బునఁ దనరాణినిన్ గబరి♦పుష్పులచేత నలంకరించె నం
త నల ప్రియాలలామయు ము♦దంబు మనంబునఁ బొంది డంబునన్. ౪౮౨

తే॥ చక్రిసీలకుంతలముల♦సంగ్రహించి, మెలియఁ బెట్టి సువాసనా♦మిళితతైల
ములను బూయుచు దువ్వి సు♦పూర్ణ చంద్ర,ముఖమునం బత్రభంగంబుఁ♦బూని సల్పె.

ఉ॥ అంతట రాధికాచ్యుతులు♦నావటము న్వీడి భద్రకానన
ప్రాంతముఁ జెంది యంత ఖది♦రప్రకటాటవి కేగి తిర్గుచున్
సంతస మొంది బిల్వవనిఁ♦జక్క భ్రమించియుఁ గోకిలాటవిన్
వింతలఁ జూచి పాడుచును♦వేడుకఁ జెందుచునుండిరో విభూ! ౪౮౪

చ॥ అరయుచు వ్రేత లట్టులఁ ద♦దచ్యుత పాదసుచిహ్నితావనీ
సరణినిఁ బట్టి పోవుతఱి♦స్వస్తిక, చక్ర, ఝషా, ష్టకోణ తో
యరుహా, ఘట, త్రికోణ, విశి♦ఖాంకుశ, కేతన, శంఖ, నీల గో
ఖుర, సమచంద్ర, వజ్ర, యవ♦గుంఫిత రేఖలఁగాంచి వెంటనే. ౪౮౫

చ॥ ఘనముగ నున్న ఛత్ర యవ♦కంబు సుచక్ర గదార్ధచంద్ర జీ
వనజ కుశాంకు శాసన ల♦వంగ లతా ధ్వజ బిందుయుగ్మ మ
త్స్య నగ శతాంగ శక్తి విల♦సద్వర రేఖలఁ జూచి రాధికా
వనిత పదంబు లివ్వి యని♦వాకొని రా వ్రజకాంత లంతటన్. ౪౮౬

చ॥ ఒకయెడ నిల్చి మార్గమున♦నోచెలులార! రమేశ్వరుండు రా
ధికను గ్రహించి యీపథినిఁ♦దిన్నగ నేగెను గాంచ నానటం

చకయుతభక్తిఁగోకిలము ♦ హాటవిఁజేరిరి తత్ప్రివేశసూ
చకరవ మావనిం దిరుగు ♦ శౌరియు వించల రాధ కిట్లనెన్. ౪౯౮

తే॥ కోటిచంద్రప్రతీకాశ! ♦ కువలయాక్షి!, రాధికా! ప్రియ! గోపికల్ ♦ రా మొదలిడి
నిన్నుఁ గొంపోవఁ గలరిఁగ ♦ నీవు వేగ, నరుగుదెంచుము నాతోడ ♦ ననియె నవల. ౪౯౯

ఉ॥ మానవతీలలామయు, స ♦ మంజసయానవరూపశీలకా
లీనమనోజ్ఞ రాధిక, బ ♦ లిప్రభువైరి నచించు సూక్తిసం
తానము నాలకించి ప్రియ! ♦ తాళను నే సుకుమారిఁ జెమ్మట
ల్మెన స్రవించెడిన్ గదల ♦ లే నిఁక నన్నెటుఁ గొంచు నేగెదో! ౫౦౦

ఉ॥ ఇట్టులఁ జెప్పఁగా సరసి ♦ జేక్షణుఁడున్ విని స్వీయమైన హ
స్తంబట్టున వ్రేలు పుట్టునును ♦ బట్టి స్రవించెడి స్వేద మార ని
క్కట్టులు సట్టన్ విడువఁ ♦ గాఁ దగినట్టుల వీచి దేవి! యీ
పట్టున లెమ్ము రమ్మనుచుఁ ♦ బాణిఁ బట్టుచుఁ బల్కె నామెయున్. ౫౦౧

చ॥ పెడచెవిఁ బెట్టి యూరకొనెఁ ♦ బిమ్మట లచ్చిమగండు తిర్గి యా
పడఁతికి నిట్టులన్ బలికె ♦ మానినిరో! మనముండుపట్టు ని
ప్పుడు గనిపెట్ట గోపికల ♦ మొత్తము వచ్చెడి, నిందు వారిని
న్విడి యెటకేని బోయి యట ♦ నీకెది యిష్టము యద్ది దీర్చెదన్. ౫౦౨

ఉ॥ కావున లెమ్ము నాభుజము ♦ గట్టిగఁ బట్టుచు నెక్కి హాయిగా
నీవు వసింపు మంచుఁ గను ♦ నిక్కనస్కంధము మీఁద నాయమన్
దా వహియించి యెక్కుడకొ ♦ తర్లె, ననంతరమందు గోపికల్
శ్రీవిభుఁ గాంచఁ జాలక వి ♦ శేషవియోగకృశానుదగ్ధలై. ౫౦౩

ఉ॥ నిబ్బితి వీడి యా యడవిఁ ♦ జేరి కడుంగడు నేడ్చి రా దరిన్
బ్రబ్బిన గోపి యూథము ల ♦ వారిగ వించల కోకిలాటవిన్
గొబ్బునఁ జేరి యాద్యుతినిఁ ♦ గోమలులార! నిమేష మీరిటన్
నిబ్బర మొందుఁడీ కనుల ♦ నీరము గాఱఁగ నియ్యకుండుఁడీ! ౫౦౪

చ॥ అని తమి నాశ్వసించు తఱి ♦ నన్నలు గొందఱు రెండు ప్రక్కలం
దున మకరందసేచనము ♦ తుష్టిగ సల్పి సుగంధ వస్తువుల్
గొని మెయిఁ బూసి తళు ♦ కు ల్గలుగంగ నలంకరించి వీ
వనలను ఛత్రచామరలఁ ♦ బట్టుచు నీవ మహాద్భుతాకృతిన్. ౫౦౫

చ॥ సవిధము నందు వేడ్కనొక ♦ స్వామిని గన్పడి యల్ల గోపికా
నివహము నూఱడించి "బళి! ♦ నీరజలోచనలార! రాధికా
ధవుఁడటు రాధ మానమును ♦ దాఁగొన నేగెడి" నన్న విన్న న
బ్జవిపులనేత్రలైన వ్రజ ♦ భామలు విస్మయ మొందిరో విభూ! ౫౦౬

క॥ వింతల నటుబొందిన త, త్కాంతలు తాళస్వరములు ♦ గ్రాలఁగఁ దచ్ఛ్రీ
కాంతగుణయశోగానము, చింతలఁ బోఁద్రోసి యిటులఁ ♦ జేసిరి భక్తిన్. ౫౦౬

గోపికలు శ్రీరాధాకృష్ణుని గీర్తించుట.

తే॥ నందనందన! యానంద♦కంద! కుంద,రదన! మన్మథమోహనా♦సదయహృదయ!
విశ్వభూషణ! జననుత! ♦ విశ్వదీప!, విశ్వదుఃఖవినాశకా ♦ వినతు లివిగో.

చ॥ అవనిసురోత్తమ శ్రుతి జ ♦ యధ్వజ! నందకులాబ్జభాస్కరా!
దివిషదమోఘువంద్య! సుర ♦ తృప్తిదకార్యధురీణ! ధారణీ
ధవ! మధువైరి! ముక్తజన ♦ దర్పణ! కంసమురాదిమారణా
ర్థవిధికృతావతార! యదు ♦ రాజ! జయంబు ఘటిల్లుచుండుతన్. ౫౦౮

క॥ గోపాల సింధు చంద్రమ!, గోపకవంశాద్రిశిఖర! ♦ గోధునికమలా!
గోపరిపాలన దక్షా!, గోపక గృహ రత్నదీప! ♦ గోపక వినుతా! ౫౦౯

క॥ రామాభిరామ! సుగుణో, ద్దామా! కల్యాణసీమ! ♦ దైత్యవిరామా!
కామటతేజోధామా!, రామానుజ వారిదాభ ♦ రామా! భూమా! ౫౧౦

క॥ రాధాస్యసరోజాళీ!, రాధాముఖచంద్రకోక! ♦ రాధారమణీ
మాధుర్యలతామాధవ!, రాధాహృచ్చంద్రహార! ♦ రాధాకృష్ణా! ౫౧౧

ఉ॥ ఎవ్వఁడు రాసకేళులను ♦ నింతులఁ గూడుచు నాచరించెనో
యెవ్వఁడు వేణుగానమున ♦ నెల్లజగంబులఁ దృప్తిఁజేసెనో
యెవ్వఁడు గోపికాళి నయ ♦ నేంద్రియజీవనమూలహారమై
మవ్వముగా వసించు నల ♦ మాపతి మా పతి మమ్ము మన్చుతన్. ౫౧౨

ఉ॥ ఏవిభుఁడెల్ల యాధముల ♦ యిష్టముదీర్పఁ గడంగె నేఁడు రా
ధావనజాక్షిమానము న ♦ దాటున నొంటిగ మాన్చె నేఁడు బృం
దావనిఁ దళ్కుసల్పె వసు ♦ ధావిభవాఢ్యుఁ డెవండొ యెవ్వఁడా
గ్రావము శుద్ధిజేసె నల ♦ కారుణికుండు ప్రసన్నుఁడయ్యెడున్. ౫౧౩

చ॥ అరుణ, కళానిధుల్, జ్వలను ♦ సట్లు, ప్రసన్నవన ప్రవేశమో
ఘురకవనప్రవేశముగ, ♦ సొంపగు చల్లనిగాలి వీల్గగా
విరు లెఱనిప్పుతున్కలుగ, ♦ వేశ్మము నొల్కగ, మాకుఁ దోఁచె ని
న్నోఁటిగిన నాఁటగోలె దయ ♦ తోడఁ బ్రసన్నతఁ బొందు మోహరీ! ౫౧౪

చ॥ తొలుత, సుదాసపుత్రకుని ♦ తొయ్యలి, భర్తను వీడి బాధల
న్నలిగెను, దానికంటె నలు ♦ నాతి, పతిన్ విడి కష్టమొందె నా
సిలుగుల మించి సీత తన ♦ జీవితనాయకుఁ బాసి పెల్లు బా
ములఁ బడె దానికన్న నిది ♦ పొందఁగ రానిది కృష్ణ! ప్రోవుమా! ౫౧౫

## శ్రీకృష్ణుండు గోపికలకుఁ బ్రసన్నుండగుట.

మ॥ అని ప్రార్థింపఁగ దేవకీసుతుఁడు భూ ♦ షాలంకృతాకారుఁడై
నును పుట్టంబులఁ గట్టి తన్మురళిచే ♦ నూఱారు రాగంబులన్
ఘనలీలన్ గడు గానముల్ సలుపుచా ♦ కాంతాసమూహంబునన్
దనరెన్ రాధను గూడి చిన్నగపు వ ♦ క్త్రింబందుఁ బొల్పారఁగాన్. ౫౧౭

తే॥ అంత గోపిక లందఱు ♦ జింతలవిడి, వచ్చి నిలిచిన కృష్ణుని ♦ ముచ్చటఁగని
యొక్కసారిగ లేచి య♦నుత్తమ విధిఁ, జుట్టు ముట్టిరంతట మధు♦సూదనుండు

క॥ గోపిక లెందఱు గలరో, యాపము లన్నింటిఁ దాల్చి ♦ రోచిష్ణుండై
యాపడుచులలో నడుమను, నేపునఁ దా నిల్చి నాట్య ♦ మెలమి నొనర్చెన్.

తే॥ చేసి యట్టుల నాట్యంబు ♦ శ్రీధరుండు, వనమునం దొక్కచో నుండ♦వల్లవసతు
లుగని యాజలజాలయా♦లోలు డాసి,దోసముల క్షమింపు మటంచుఁ♦జేసి నతుల.

క॥ వినవే మా మొఱ, దేవా!, కనవే కారుణ్యమతిని ♦ గాసుగ జగముల్
గని సర్వము నీవే యని, మనమందున నమ్మి మమ్ము ♦ మఱచుట దగునే ?

క॥ నమ్మిన మమ్మును మోస, మ్మిమ్మాడ్కి నొనర్చి యెచటి ♦ కేగితివో నీ
నెమ్మది యెట్లు సహించెనొ, యమ్మక్క ! యిదేమి న్యాయ ♦ మయ్యా కృష్ణా!

ఉ॥ అపయిఁ గృష్ణమూర్తి వినుఁ ♦ డంగనలార ! మనోజ్ఞ పుష్కర
ద్వీపమునందు దధ్యుదధి ♦ దివ్యమునీంద్రుఁడు హంసనామకుం
డోపి మనుద్వయాంతరము ♦ నుత్తమపద్ధతిఁ గోర్కిలేక నా
ప్రాపును వేఁడుచున్ దపము ♦ బాధముగా నొనరించె నింతలోన్. ౫౨౨

తే॥ యోజనార్ధశరీరము ♦ నొందియున్న, రెండు చేఁపలేతెంచి యా ♦ దండిజోగి
మ్రింగె. వానిలో నుండి య ♦ భంగ భంగి, నిర్గమించెఁ బాణాన్నమక ♦ నిర్జరారి.

ఉ॥ భక్తున కంతవంత యటు ♦ వచ్చుట గాంచి బిఱాన నేగి నా
శక్తిని వానిఁగొట్టి ముని ♦ సత్తముఁ గాచియుఁ దెల్లదీవిలో
యుక్తముగాఁ జెలంగెడి ప ♦ యోధి ఫణీశ్వరతల్పమందునన్
రక్తిఁబరుండి వెండియుఁ గ ♦ రంబుగ మీావెతఁ గాంచి వచ్చితిన్. ౫౨౮

తే॥ భక్తవశ్యుఁడ నెప్పుడున్ ♦ భామలార !, క్షీర సాగర మందలి ♦ శేషశయ్య
గాఢనిద్రను జెందెడి♦బాధసౌఖ్య, మువిడి యిటు వచ్చుటకు నదే♦మూలమయ్యె.

తే॥ శాంతి దాంతి సమేతులు ♦ సర్వసములు, నైరపేక్ష్యులు నగు ముని♦నాథులెల్ల
జ్ఞానవిషయుల్ రసాదుల ♦ సరణి నెఱుఁగు, కరణి నానిరపేక్షు సు ♦ ఖమని కంద్రు

తే॥ అంత గోపికలో దేవ ! ♦ యబ్ధియందు, శేషశయ్య నీకొప్పిన ♦ చిత్రరూప
మిపుడు దయతోడఁజూపు మో♦కృష్ణచంద్ర!,యనుచు సన్నుతింపఁగ నాతఁ♦డభిమతించి

సీ॥ అభ్రంకషంబులౌ ♦ యలలతోడుతఁ గ్రాలు, పాలకడలి నటఁ ♦ బాఱఁజేసి
నవరత్నములతోడ ♦ నయనపర్వ మొనర్చు, ప్రాసాదరాజముల్ ♦ బ్రబలసల్పి
బాల ప్రభాకర ♦ భవ్య సహస్ర భో, గంబులు గల శేషుఁ ♦ గ్రాలఁజేసి
వృషభాను పుత్రియై ♦ విశ్వమోహినియైన రాధను లక్ష్మిగా ♦ రాణమార్చి
తే॥ అష్టభుజములఁదాలిచి♦యంఘ్రితలను, నందుఁగలుమూల జవరాలు♦నడుగు లొత్తి
గోటి మార్తాండ మూర్తియై♦ కుండలీంద్ర,శయ్య నిద్దురవోయె నో♦ జనకరాజ!
చ॥ పదపడి గోపికావళి, య ♦ పాంపతి నిర్మిత శేషశయ్యపైఁ
గుదిరిన కృష్ణచంద్రుఁగని ♦ కొంకక మ్రొక్కుపదుల్ బొనర్చి స
ముమ్మదమును బొందె నేస్థలి న ♦ మోఘముగా హరి దర్శనంబు త
త్సదతుల కిచ్చె, నాస్థలము ♦ దోషహరంబును బుణ్యదంబగుర్. ౧౨౯

యమునాతటమందు రాధాకృష్ణులు విహరించుట.

క॥ పిమ్మట హరి, గోపీ వ్రా, తమ్ములతోఁ గూడి వేగ ♦ తద్యమునా నీ
రమ్ములను గళాకేళి సు, ఖమ్ముగ నొనరించె రాధి ♦ కాయుక్తుండై. ౧౩౦
చ॥ వనజదళాయతాక్షి వృష ♦ భానుకుమారిక, లీల లక్షప
త్రనిభృతదివ్యపద్మముఁ గ ♦ రంబునఁ దాలిచి నిల్వఁగన్న యా
కనకపటుండు డాసి తమ ♦ కంబునఁ గూడుచుఁ బాడు చుండి య
ట్టె నగుచు నల్లొ దానిఁ గొని ♦ యుక్కున నేగఁ గడంగెఁ దన్నదిర్. ౧౩౧
తే॥ అంత నక్కమలేక్షణ,♦యభయుఁడగుచు, నక్కళిందజానదిఁజను♦నచ్యుతుఁగని
వెంటబడి వాని పట వంశి♦వేత్రములను,గొని హసించుచుఁ జనసాగె♦జనకరాజ!
ఆ॥ అపుడు శౌరి గాంచి♦యయ్యావి ప్రేయసీ!, నాకు నిచ్చి పొమ్మ♦నంగ నామె
నాథ! నా కమలము ♦ నాకిమ్ము పిమ్మట, నీకు నివ్వి యిత్తు ♦ నిక్కమనఁగ.
క॥ గరుడ ధ్వజుఁ డోతరుణీ, సరి సరి యిఁకఁ జాలుఁజాలు ♦ సరసము నాతోఁ
బురుషుల మించఁగ నెంతువె, సరగున నవి దెమ్ము పిదప ♦ జలజముఁ గొమ్మా!
తే॥ అవల రాధయు మాధవా!♦యసమ్మిద్ధ,దొలుత నాతమ్మిఁగొనలేదె♦దోసమెవరి
దయ్య! యోచించు మనఁ గృష్ణుఁ♦డా కమలము, నామె కిడి తనవస్తువు♦లన్నిటిఁగొనె.
క॥ శ్రీరాధా హరులంతటఁ, గోరిక భాండీరవన ము ♦ కుంఠితగతితోఁ
జేరి యలంకృతు లొండొరు, లారాయనఁ జేసికొనిరి ♦ హరిదాసమణీ! ౧౩౬
తే॥ పిదప శ్రీకాంతుఁ డట్టి యా♦భీరసతులఁ, గూడి మాధవీముఖలతా♦కుసుమభరిత
మైన లోహజంఘ వనంబు ♦ నరిగి యెల్ల,గొల్లఁతెల తలలన్ బూలఁ♦గూర్మి ముడిచి
ఆ॥ అచట నుండి గదలి ♦ యమున తీరంబున, గోప సతుల తోడఁ ♦ గూడి తిరిగి
తరులతాసుమఫల ♦ పర మహాపుణ్య వ,నంబుఁ జేరి విపుల ♦ నవ్యధరను.

చ॥ సురపతి యప్సరోంగనల ♦ శోభిలి యాడెడి మాడ్కి రాధికా
తరుణిని గూడి గోపికలు ♦ దాళము వేయుచుఁ బాడుచుండ న
బ్బురమగు రాసకేళులను ♦ బొల్పుగఁ జేయఁగడంగె నందు భూ
వర! యొకచిత్రమయ్యె నది ♦ వల్కెద బాగుగ నాలకింపుమా! ౫౩౯

## శంఖచూడ కంసులు గదాయుద్ధం బొనరించుట.

ఉ॥ దక్షుఁడు ముద్గరాజి ధన ♦ దప్రభుభృత్యుఁడు శంఖచూడుఁడన్
యక్షుఁడు సాటిలేక ధర ♦ యం దొకవేళను నాముఖంబునన్
శిక్షితకంసవిక్రమ వి ♦ శేషము వీనుల నాలకించి స్వీ
యాక్షయ లక్షభారయుత ♦ మౌ గదఁ గేల గ్రహించి యుద్ధతిన్. ౫౪౦

చ॥ వడి మధురా పురంబునకు ♦ వచ్చి మదోత్కట కంసగోష్ఠి క
ప్పుడె చని మ్రొక్కి యాదవ వి ♦ భూ! యిల నీవు గదా సమిత్కృతా
ర్థుఁడవని వచ్చితిన్ గనుకఁ ♦ దోడ్త గదాసమరంబు జేయఁగా
నడిగెద, నిందు నోటమియె ♦ న్నాఘన జేతకు దాసుఁడయ్యెదన్. ౫౪౧

తే॥ అనఁగఁ గంసుఁడు దానికి ♦ నభిమతంబు, జూపిగదఁగొని మధ్యాహ్న ♦ సూర్యుపగిది
మండిపడి శంఖచూడుతో ♦ భండనంబు, సల్పమొదలిడె వారలా ♦ సమయమందు.

క॥ కరి కరిఁ బోరెడి కైవడి, హరిహరియును జేరి కలహ ♦ మాడిన యట్లుల్
గిరి గిరి దాఁకిన విధిఁ జూ, పరులకు నగుపడుచు వారు ♦ పటుదర్పమునన్. ౫౪౩

ఆ॥ ప్రలయకాల మేఘభయద ♦ రావముబోలు, రెండుగదల రొదలు ♦ రేగుచుండ
నటియు నటుఁడు, నటనఁ ♦ జటులంబుగా సల్పు, కరణి వారు బోరఁ ♦ గ్రాలి రపుడు

తే॥ రెండు గదలును మొత్తని ♦ పిండియగుట, జూచి కంసుండు గసి శంఖ ♦ చూడయక్షుఁ
బిడికిటం గొట్టఁ గ్రమ్మఱఁ ♦ బృథులముష్టి, శంఖచూడుండు కంసునిం ♦ జదియఁగొట్టె

చ॥ సురనికరంబనంతమునఁ ♦ జూడ యదూద్వహశంఖచూడు లి
ట్లిరువదియేడు వాసరము ♦ లేగెడి దాఁకనిఁ బోరునాచరిం
చిరి పిదపన్ యదుప్రభువు ♦ చేత గ్రహించుచు శంఖచూడు నం
బరమున వందయామడలు ♦ బాఱఁగ వైచె ననంతరంబునన్. ౫౪౪

తే॥ శంఖచూడుండు పైనుండి ♦ చదికిలఁబడి, కొంత చింతించి క్రమ్మఱఁ ♦ గోడిపుంజు
వోలె లేచియుఁ గంసునిఁ ♦ బూన్కిఁబట్టి, వినునఁ బదివేలయామడల్ ♦ జనఁగవిసరె

చ॥ అటుపయి నుగ్రసేనసుతుఁ ♦ డాకసమందున నుండి గాలి మ
ల్లటపడి తిర్గి లేచియుఁ జ ♦ లంబున సింగము మాడ్కి వానిపైఁ
దటుకున వ్రాలి పట్టుకొని ♦ ధారణినిం బడఁదన్నె, యక్షుఁడం
తటఁగసిఁ గంసుఁ గొట్టి వసు ♦ ధాస్థలిఁ ద్రొక్కెను మైథిలేశ్వరా! ౫౪౫

చ॥ ఇటుల మదాతిరేకులు న ♦ హీన బలిష్ఠులు ముష్టిభండనో
త్కటులు గదాజిధన్యులు న ♦ కంపిత ధీరులునైన వారలా
ర్భటులు సెలంగ యుద్ధము న ♦ పారముగా నొనరింప భూమి వే
చటులభయంబునన్ వణఁక ♦ సాగెను వీరులు సెంది రబ్రముల్. ౫౮౯

తే॥ అట్టి కాలంబునందున ♦ నఖిలయదుపు, రోహితాగ్రణి, శ్రుతిశాస్త్ర ♦ యాఢిభావ
విదుఁడు గర్గ మునీంద్రుఁడు ♦ కదనముఁజని, వినతులంగొని కంసుని ♦ కనియె నిట్లు.

వ॥ యదువరా ! ముందు కదనంబు మాని నానుడు లాలకింపుము ఈ మహా బలిష్ఠుండగు శంఖచూడుండు నీతో దీటుకు రాఁ దగు పోటుమగండుగాఁడు. కాన నీకు సాంపరాయంబు సాంప్రతం బసాంప్రతంబ యగు మున్ను బలశాలివగు నీదృఢ ముష్టిని సర్వసుపర్వేంద్రుని వాహనంబగు నైరావతంబు సైతము ధరణిం బడి క్షోభిల్లి యమరావతీపురంబునకుం బరుగిడదే?! మఱియు నీ బలంబున ఢిందిన వీరుల పేరు లుగ్గడింప నలవియగునే? వెండియు నీ యక్షుండు నీకు సఖ్యుండు గాని వధ్యుండు గాఁడు. పరిపూర్ణతముండగు శ్రీకృష్ణునిచే వీఁడు మడియం దగిన వాఁడు. కాన సందియంబు మాని వేవేగ వీనితో నేస్తం బొనరింపుమని చెప్పి శంఖ చూడుని వైపునకుం దిరిగి యక్షవరా ! మీయిరువుర కొక్కఁడే ఘాతకుండై యుంటఁ గంసుండు నీకుఁ బ్రాణమిత్రుండగునట్లొనర్చుకొనుమని యుపదేశింప నా యదువరశంఖచూడు లా మునివాక్యంబు చొప్పున సఖ్యం బొనర్చిరి. కొంత కాలమగుడు తద్యక్షుండు మిత్రుని వీడ్కొని స్వగృహంబున కేగుచు, మార్గ మధ్యంబున నిశీథమందు మనోహరంబగు రాసగానం బాలించి తత్తాలశబ్దాను సారంబుగా నరుగుదెంచి రాసమండలంబు గన్గొని యందు రాధికాలంకృతవామ భుజుండును, స్వచ్ఛందవక్రీకృతదక్షిణపాదుండును, వేత్రవంశీధరుండును, జగన్మో హనుండు నగు శ్రీకృష్ణుండు ఛత్రచామ రాద్యంచితలగు గోపికలు సుట్టుముట్టి కొలువ, రాసక్రీడ లొనర్చుటం గాంచి రాసేశ్వరుండు వాసుదేవునిగా నెఱింగి యతని సామాన్యబాలుగా గణించి సుందరులగు తద్గోపికల నపహరింప నెంచి సమీపించె నని విన్నవింప విని రాజేంద్రుం డాశ్చర్యమగ్నమనస్వియై మానీం ద్రుతో నిట్లనియె. ౫౯౧

## శ్రీకృష్ణుండు శంఖచూడుని వధించుట.

తే॥ అంత రాస రంగంబున ♦ నతఁడు సొచ్చి, యేమిచేసెను? నాకది ♦ యెఱుఁగఁ దెలుప
మిముఁ బరావరవిత్తము ♦ నమలభక్తి, నభినుతించెద నన ముని ♦ యనియె నిట్లు

ఆ॥ అధిప ! వ్రేతలెల్ల ♦ రా తాళభూరుహా, యతశరీరు ధీరు ♦ న్వ్యాఘ్రముఖుని
నసిత వర్ణు యక్షు ♦ నతిలలజ్జిహ్వుని, గాంచి పరుగు లిడిరి ♦ కడిఁది నడలి.

తే॥ అపుడు కోలాహలంబులు ♦ నతిశయిల్లె, యక్షుఁడా పాలు నతివలన్ ♦ హరి హరి యని
పాఱడి శతచంద్రాననన్ ♦ బట్టి యుత్త, రాశఁ జనెఁ గాములెంతిసా ♦ హసులు దలఁప

శా॥ పోరా పోకిరి! లేకి! నన్విడువురా ♦ భూమిన్ స్వసల్ దల్లులున్
లేరా నీకిఁక నున్నచోఁదగునె ఛీ ♦ లేదా నయంబించుకే
రారా చూడర మంచి చెడ్డలను నన్ ♦ రక్షింపరా యేఘనుల్
మారాకారుఁడు నావిభుండు త్రుటిని ♦ న్మాయింపఁడా తుంటరీ! ౫౫౫

క॥ అనిమూలుచు హరి హరి హరి, యను చడలుచు నార్చు చల్ల ♦ యక్షునిమీఁదన్
దనరుచు నరిగెడి తనచెలి, వనజాక్షుఁడు గాంచి సాల ♦ పాణియయి చనెన్. ౫౫౬

ఉ॥ ఆవల గుహ్యకుండు వెను ♦ నంటుచు దండధరోపమానుఁడై
లావున వచ్చుచున్న కమ ♦ లాపతిఁ గన్గొని భీతి నల్లహే
లావతి నచ్చటన్ విడిపి ♦ లాయన మయ్యెను బిమ్మటన్ దదిం
ద్రావరజుండు నుద్దవిడి ♦ నర్వవిధంబున వెన్కొనెన్ జుమీ. ౫౫౭

చ॥ కని యది యక్షుఁ డెల్లెడలఁ ♦ గాల్కొలఁదిన్ బరుగెత్తినన్ జనా
ర్దనుఁ డగధారియై వెనుకఁ ♦ గ్రాలుట శీత నగాంతికంబునన్
కని యొకసాలమున్ బెఱికి ♦ కయ్యముఁ గోరుచు శ్రీశసమ్ముఖం
బున నిలుచుండ శౌరి, యల ♦ భూరుహముం గొని వేయ వానిపై. ౫౫౮

ఉ॥ వాతహతాగరీతి వడి ♦ వాఁడిలపైఁ బడి తిర్గి యుత్థితుం
డై తన ముష్టి శ్రీధరుఁ బ ♦ డన్ బ్రహరించి దిగట్టకంబునన్
మ్రోఁతసెలంగ రోసమున ♦ బొబ్బలిడన్, హరి, గాంచి యక్షునిన్
జేత గ్రహించి త్రిప్పియుఁ గ ♦ సిన్ ధరఁగూల్చె ననంతరంబునన్. ౫౫౯

తే॥ శంఖచూడుండు కృష్ణుని ♦ సంగ్రహించి, భూతలంబున బాఁదెను ♦ భీతి మాని
ద్వంద్వయుద్ధ మేతద్రీతి ♦ వఱలఁ బుడమి, యడలఁ దొడఁగెను నంతిమం ♦ బందుఁ జక్రి.

చ॥ పిడికిలితోడఁ దచ్ఛిరము ♦ భిన్నమొనర్చియు దానినుండి వె
ల్గెడు మణి భాగ్యవంతుఁ డవ ♦ లీలగ శేవధియ న్నిధిన్ గ్రహిం
చెడు విధి సంగ్రహించెఁగద ♦ శ్రీపతియై హరి, యన్యదీయమా
విడిగల కెంపుఁ గైకొనియె ♦ వింత ఘటింపదె? యుద్ధి భూవరా! ౫౬౧

తే॥ అంతఁ దజ్జ్యోతి శ్రీకమ ♦ లాక్షుమిత్రుఁ, డైన శ్రీదామునందున ♦ లీనమయ్యె
నిటుల శంఖచూడుని వధి ♦ యించి మణికరుఁడయి వెన్నుఁడు గ్రమ్మఱ ♦ వడిని వెడలి.

తే॥ రాసరంగంబుఁ జేరి సం ♦ తోసమొదవ, మణి నల శతచంద్రాననా ♦ మహిళ కిచ్చి
గోపికలఁగూడి తద్రాస ♦ కూర్దనములఁ, జేసి యమునాతట శ్రీని ♦ జేరి కనుచు.

క॥ బృందావనమున కరుగుచు, నందున విహరింప నెంచె ♦ నటుపై హరిచేఁ
బొందిన వరమున నోషధి, బృందము సతులౌచు యూథ ♦ వృతలై రతికై. ౫౬౮

చ॥ హరిసవిధంబునన్ నిలువ ♦ నచ్యుతుఁడట్టి లతాంగనా జనం
బరుసమునన్ గనుంగొని ము ♦ హుర్ముతితో మనసార వారితో
మురళిని గీతిఁ బాడి నగు ♦ మోమున రాసము నర్చి యా యనం
తరమున రాధతో యమున ♦ దాఁపునకుం జని చూచి తత్తటిన్. ౧౬౫

చ॥ త్రివిధములన్ సమీరణుఁడు ♦ దివ్యసుమంబుల సౌరభంబులన్
నవకము జెంది వీవఁగఁ గ ♦ నద్వట వంశికదంబయుక్తమై
భవికదమై మనోజ్ఞమగు ♦ భాసిలు సైకతమందు రాసకే
ళి వలనఁ గల్గినట్టి శ్రమ, ♦ లీల నశింప వసించె భూపతీ! ౧౬౬

తే॥ అపుడు గోపికా వేణు వీ ♦ ణాదివాద్య, సరణి ననుసరించి సకల♦సురలు గరము
వార లీశ్వరపైఁ బూల ♦ వానను గురి, యించి రందలి సతులు సే♦ వించిరిటుల

గోపికలు విహ్వలలై శ్రీకృష్ణునిం జేరుట.

చ॥ మరగిన కొందఱున్న లరె ♦ మాపతి! మాపయిఁ గోపమేల? సుం
దరులము గామె యేమిఁకను ♦ దాళగలేము, విరాళి హెచ్చె ని
ష్ఠురముగ నుండఁ బోకుమని ♦ జోత లొనర్చిరి, కొంద ఱంగనల్
వరగళమందు హారముల ♦ వైచి వసించిరి కృష్ణునింగలన్. ౧౬౭

సీ॥ కాంతుఁడా! రమ్మని♦కరమును లాగుచుఁ,గుతుకమ్ముం గనుచెలుల్ ♦ గొంతమంది
పంకజనాభుని ♦ వక్షంబు దాఁకుచుఁ, గోర్కులొందెడి సతుల్ ♦ గొంతమంది
కరములఁ గమలాక్షుఁ♦గాలసవ్వడి వనిన్, గ్రుమ్మరు కోమలుల్♦గొంతమంది
శ్రీహరి మ్రోలను♦జేరి తళ్కుల బెళ్కు, కులుకులం దగు చెలుల్♦గొంతమంది

తే॥ రాధికా వేషమును బూని♦రాణమీఱి, కుదురుగా నాడు మెలఁతలు♦గొంతమంది
కృష్ణవేషంబుతోడుతఁ ♦ గీర్తనంబు, వింతగాఁ జేయు కాంతలు ♦ గొంతమంది.

సీ॥ తాళస్వరంబులన్ ♦ మేలిమి రాగముల్, బాడిరి కొందఱు ♦ భామినులును
హావవిభావసం ♦ భావితఫణుతుల, నాడిరి కొందఱు ♦ చేడియలును
విశ్వమోహనుఁడైన♦వెన్నునిన్ గనులారఁ, గాంచిరి కొందఱు♦కామినులును
జారిణీవృత్తుల ♦ శౌరినిం జేరుచుఁ, గోరిరి కొందఱు ♦ కోమలులును

తే॥ పూరుషోత్తముతోడుతఁ♦బూలబంతు,లాడఁదొడఁగిరి కొందఱు♦ప్రోడలు మఱి
దానవారాతితోఁ దమి ♦ దాఁగురింత, లాడిరో జనకా! కొంద ♦ ఱతివ లింక.

సీ॥ కడియంబు లందియల్♦గల్లుగల్లని మ్రోయ, హరి మధురాధర♦మాను సతులు
యోగి దుర్లభమైన ♦ శ్రీగరుడధ్వజు, దట్టమౌ కౌగిలిఁ ♦ దనరు సఖులు
జిన్నినవ్వున వెల్గు♦వెన్నుని నెమ్మోముఁ, గని నవ్వి ముద్దులన్♦గొను రమణులు
కృష్ణ, కృష్ణా యని ♦ కేవల భక్తితో, నాతని గుణముఁ గొం ♦ డాడు చెలులు

తే॥ సరసపరిహాసముల్ జేసి♦సమ్మదంబుఁ, జెందు మందయానలు తత్క♦ళిందజాస
రిత్తటిఁ మూఁగి రాధికా ♦ శ్రీహరులకు, దృష్టిఁ గూర్చుచునుండిరో♦దివ్యచరిత!

చ॥ హరియును వారలం గలిసి ♦ యాడుచుఁ బాడుచు వీడె మిచ్చుచున్
మఱియును గొంచు వృక్షముల ♦ మాటున డాఁగుచుఁ గావిమోవులన్
గొఱుకుచు నవ్వుచున్ బ్రణయ ♦ కోపముఁ బొందుచు వారికోర్కులన్
ద్వర నెరవేర్చుచున్ మిగుల ♦ భాసిలుచుండెను మైథిలేశ్వరా! ౫౭౨

సీ॥ సకలవిధంబులన్ ♦ జక్కఁగాఁ బోషించు, తలిదండ్రులన్ జుట్ట ♦ ములను వీడి
యాపదల్ బాపుచు ♦ నఖిలసుఖంబుల, గడనఁ జేసెడి విడి ♦ ముడివి విడిచి
యుభయలోకానంద ♦ మొదవించు సుందరి, యైన యర్ధాంగిని ♦ నవలఁ ద్రోసి
మెండగు నెండలన్ ♦ మండియు, వానలఁ, దడసియుఁ జలిచేత ♦ దడను జెంది

తే॥ యన్నపానాదులన్ విడి ♦ యనిలభక్షకులయి నిర్వాతదీపము ♦ వలె సమాధిఁ
గ్రాలు యోగులుసైతము♦గాంచలేని, హరినిఁ బొందిరా సతులిది♦యరుదు గాదె.

ఆ॥ ఇటుల ద్వారకేశుఁ ♦ డింతులతోఁ గూడి, రాసకేళి సల్పె ♦ నాసమయము
నందు నొక్కచిత్ర ♦మయ్యె నయ్యది యేది, యనినఁ జెప్పుచుంటి ♦ వినుము జనక!

## ఆసురిమహాముని కథ.

క॥ ధీరుండగు నాసురిముని, నీరజదళనేత్రు నమ్మి ♦ నిర్మలతపమున్
నారదనామకనగమునఁ, గోరిక విడి చేయఁదొడఁగె ♦ క్షోణీనాథా! ౫౭౫

ఉ॥ దానికి మెచ్చి యచ్యుతుఁ డ ♦ తండు తపం బొనరించు వేళలో
మానక సుందరాభరణ ♦ మండితుఁడై సహధర్మిణీయుతుం
డై నగుమోముతో నతని ♦ యక్షియుగంబున గోచరించు చ
న్మానసముదంబుఁ గూర్చుచుఁ జ ♦ నున్ బ్రతిఘస్రమునందు భూవరా! ౫౭౬

తే॥ ఇట్టి తరుణంబునందు శ్రీ♦కృష్ణుఁ డొక్కపరినిఁ దన్నేత్రముల కగు♦పడక పోయె
దీని కెంతో యా యాసురి♦మానివర్యుఁడాదఁ జెందుచు యోచించి♦యచటనుండి.

ఆ॥ తపము నాపి కృష్ణ ♦ దర్శనలాలసుఁ, డగుచు లేచి యల మ ♦ హామునీంద్ర
మాన్యబదరికాశ్ర ♦ మంబున కేతెంచి, హరిని గనక వగచి ♦ యందు సాగి.

క॥ లోకాలోకాద్రికిఁ జని, శ్రీకాంతుని వెదకి కనక ♦ చేడ్పడి యచటన్
దూఁకొనిన పార్షదులఁగని, వీఁకన్ బ్రశ్నింప, వారు ♦ వీక్షింప మనన్. ౫౭౯

క॥ శ్వేత ద్వీపముఁ జేరుచుఁ, బీతపటుఁడు శేషశయ్య ♦ వెలుఁగమిఁగనుచున్
బ్రాఁతిగఁ బొగులుచు నచ్చటి, లాఁతుల నడిగియును నేమి ♦ లాభములేమిన్.

తే॥ అధికదుఃఖంబుఁబొందిచు♦హా!యిదేమి, యెచట వెదకిన శ్రీహరి♦యెఱుఁగఁబడక
యుండె నేనేమి సల్పనా♦నుందు నెందుకి, నెటుల నాతనిఁ జూతునో♦యెఱుక పడదు

క॥ అనుకొను చిట్టుల మఱి శ్రీ, వనజాక్షుని నెమక దివ్య ♦ వైకుంఠంబుఁ
జని తత్థలమున శ్రీపతిఁ, గనజాలక మిగుల వగచి ♦ కదలియు నచటన్. ౫౭౨
తే॥ వడిని శ్రీరమా వైకుంఠ ♦ పదవిఁ జొచ్చి, చూడ నచ్చట నాతఁడు ♦ శోభిలమిని
గుంది వీడ్కొని గోలోక♦కుంజమునను, బృందకాటవిఁ వెదకి గో♦విందుఁగనక.
క॥ కని కావలి వాండ్రను నో, ఘనులారా! మీరు హరినిఁ ♦ గంటిరె? యేచో
టున కేరీతిని జనియెనొ, యనుమానము మాని తెలుప♦నర్థింతుఁ జుమీ. ౫౭౪
ఆ॥ అని యడుగఁగ వార ♦ లగ్రజాగ్రేసరా!, వినుము మావిభుండు ♦ పృశ్నిగర్భ
కలితవామనాండ ♦ కనదిల కిద్దెస, నరిగె నవిన నల్ల ♦ యాసురిముని. ౫౭౫
ఉ॥ ఆసరణిఁ మనోగతిని ♦ నాజగము న్విడి యిద్ధరాస్థలం
బాసను జొచ్చి చూడ నిట ♦ నా హరి గన్పడకుంట నెమ్మదిఁ
వేసటఁ బొంది తుట్టతుద ♦ విష్ణుని జిష్ణుఁ గృష్ణు నిల్పి కై
లాసగిరిఁ జెలంగెడి క ♦ శానిధిమౌళినిఁ గాంచి మ్రొక్కియుఁ. ౫౭౬
తే॥ నీలకంఠ! మహాదేవ♦నీరజాక్షుఁ, గాంచ నేను వైకుంఠలో♦కంబు మొదలు
పరమగోలోకముందాఁక♦సరిగ వెదకి, యుంటిఁగాని యాచక్రి, నా♦కంటఁ బడఁడు.
క॥ కావున దేవా! యెచ్చట, దేవకి తనయుండు వఱలుఁ ♦ దెలుపుమ దయతోఁ
నావుడు గంగాధరుఁడును, నీవిధి వచియించె మునికి ♦ నిద్ధచరిత్రా! ౫౭౭
ఉ॥ నెమ్మది నాసురీ! యరయ ♦ నీవె కృతార్థుఁడవంచు నెంతు నా
యెమ్మికనుండు కర్మవిష ♦ యుల్ సురసాదులఁబోలె నల్పకా
మమ్మున నుండు మౌను లస ♦ మాన మనూనజనార్థ్యముఁ రహ
స్యమ్మును నిర్గుణంబు నగు ♦ సౌఖ్యలవం బెఱుఁగంగ నేర్తురే? ౫౭౯
తే॥ కాన నీవిటు నిష్కామ♦మాని వగుచు, నిర్గుణాధిక సౌఖ్యంబు♦నిస్తులముగఁ
జెందియుంటివి రిత్తగాఁ ♦ జేసితి శ్రమ, పద్మనాభుని గననింక ♦ భావమున్న.
చ॥ విపులమహోదధిఁ మిగుల ♦ వేదనఁ బొందెడి హంసమాని న
ట్లుపగతదుఃఖుగా సలిపి ♦ యాఱగు చందుల నుండి బృందకా
విపినము నందు రాసమున ♦ వ్రేతలఁ గూడుచు నుండెఁ గాన నీ
విపు డట కేగుచుండు మిదె ♦ యేనును వచ్చెద మౌనినాయకా! ౫౮౧
చ॥ అను చటు లాసురిం గలిసి ♦ త్ర్యంబకుఁ డాయమునాతరంగిణీ
ఘనతటసంగశోరుతరు ♦ కాండలతావిలసన్నికుంజ పుం
జనిభృతసైకతస్థలికి ♦ సాగఁగ నద్దిరి గోజగన్నివా
సినులగు ద్వారపాలికలు ♦ సేతులఁ దాలిచి మంచిబెత్తముల్. ౫౮౨
ఉ॥ అడ్డిన వెంట నాయిరువు ♦ రా పురుఁబోఁడుల కిట్లు పల్కిరీ
రెడ్డముఁ బెట్టఁ బోకుఁ డిఁక ♦ నే మతిదూరముచుండి నాథ నా

దొడ్డ రమేశుఁ గాంచ వడి ♦ తోఁ జనుదెంచితి మమ్మలార! మీ
ర్చెడ్డ ఘటింపకుండ హరిఁ ♦ జేర నొనర్పుడి! చూపుఁడీ దయన్. ౪౯౩

తే॥ తరులుఁ దటినులు గోవులు♦ధాత్రియంచుఁ, దమిఁ "బరోపకారార్థమి♦దంశరీర"
మనుచు ఫలతోయ దుగ్ధంబు♦లనిశమిడుచు,నలరినటు బుధుల్ పరహిత♦మందునుండ్రు

వ॥ అంత నాద్వారపాలికలు. ౪౯౪

ఉ॥ బాగుగ నున్న మీ రనెడి ♦ పల్కులు గాని క్రియన్ ఫలింపవా
శ్రీగరుడధ్వజుం డిపుడు ♦ స్త్రీప్రకరాన్వితరాసఖేలనో
ద్యోగిగ నుండె మే మిచట ♦ నుండ విధించెను గాన లాఁతివా
రీగడి దాఁటి లోపలకు ♦ నేగిన ముప్పగు మాకు వారికిన్. ౪౯౫

ఉ॥ లేనిమొదన్ హరిం గనఁగ ♦ లిప్స దృఢంబుగ మీకు నున్నచో
మానసరోవరంబు జని ♦ మజ్జనముం బొనరించి గోపికా
మానవతీసురూపము ల ♦ మందముగా ధరియించి వచ్చిన
న్లోనికిఁ బోవఁ జాలుదురు ♦ నూల్కొనుఁ డోద్విజులార! దానికిన్. ౪౯౬

ఉ॥ నాపుడు వార లిద్ద్వ రల ♦ నాతుల వాకుల నాలకించి యా
తావును వీడి సాగి త్వరి ♦ తంబుగ మానసరోవరంబు నం
దోపుచుఁ దానమున్ సలిపి ♦ యుగ్మలి రూపులఁ దాల్చి తోడ్త నా
శ్రీవిభు రాసమండలము ♦ జేరి యనంతరమందు మెల్లఁగాన్. ౪౯౭

సీ॥ స్వచ్ఛజాంబూనద ♦ భ్రాజిత పద్మరా, గాంచిత ధరణీస ♦ మన్వితంబు
మాధవీముఖలతా ♦ వీథీకదంబాది, భూరుహసందోహ ♦ భూషితంబు
మండితప్రాంగణ ♦ మండప స్తంభస, ఛావీధిపంక్తి వి ♦ భాసితంబు
నరుణసితాసిత ♦ హరితవిచిత్ర వ, ర్ణస్ఫురత్పుష్ప వి ♦ రాజితంబు

తే॥ లలిత వాసంత చంద్రికా♦విలసితంబు, విహగ మధుకూజితం బజ్జ♦వితతియుతము
శీతలానిలాన్వితము సం♦ప్రీతి కరము,నగు నికుంజ మొక్కెడు గని♦యరిగి యందు

సీ॥ కోటిమన్మథరూపుఁ ♦ గోటిసూర్య తేజుని, గౌస్తుభశోభితుఁ ♦ గమలనేత్రుఁ
గనకమయాంబరుఁ ♦ గరుణాపయోనిధిఁ, గమలామనోహరుఁ ♦ గమలనాభు
శ్రీవత్సచిహ్నితు ♦ శ్రీనరస్నేహితు, శ్రీద్వారకావాసు ♦ శ్రీనివాసు
జలధరవర్ణుని ♦ సర్వభూషణయుతు, వేత్రవంశీధరు ♦ వినుతచరితు

తే॥ గోపికావృతునిన్ రాస ♦ కుర్దనేశు, ద్విరద గామినీరాధికా ♦ విహితు వరదుఁ
గృష్ణు దూరముగాఁ గాంచి♦ కేలుమోడ్చి, యెల్లగోపికల్ గనుచుండ♦నిట్టులనిరి.

తే॥ కృష్ణ! కృష్ణ! కృపాసింధు ♦ కీర్తనీయ, దేవదేవ! జగత్పతీ! ♦ దివ్యచరిత!
పద్మనాభ! నారాయణా!♦పరమపురుష!,విశ్వకారణ! శౌరి! మా♦వినతులివిగో.

తే॥ భూమి భూరిభారము బాప♦బుణ్యనరులఁ,గావ వేదముల న్నిల్పఁ♦గా మఖములఁ
  బ్రోవ వైకుంఠలోకంబు♦బూన్కి వదలి,నందు నింకిని బిడ్డవై♦యలరితివిగ. ౬౦౨
క॥ రాధాధరమధుభృంగా!, శ్రీధర! బ్రహ్మాండకోటి ♦ శేఖర! గోపీ
  యూథావృత! మధుసూదన!, మాధవ! గోవింద! చక్రి!♦ మమ్ములఁ గనుమా.
తే॥ అరయ సర్వావతారంబు♦లందు నీవె,గాదె పరిపూర్ణతముఁడవు♦ఘనచరిత్ర!
  వరదుఁడవు నీవె గోలోక ♦ పతివినీవె, పరమయోగీశుఁడవునీవె ♦ పరమపురుష!
తే॥ నిన్నుఁ జూడంగ నెల్లెడ♦నెమకినెమకి, తుట్టతుద కిటు వచ్చుచుఁ♦దోయజాక్షుఁ
  డవగు నిన్నని యఘము లం♦డంచి ధన్య,తముల మైతిమి రాసేశ!♦దయను గనుమ.
తే॥ అంత భగవంతుఁ డానుతి♦నాత్మమెచ్చి, రాధతోడఁ బ్రసన్నుఁడై♦రవలుగురియు
  మేఘగంభీరవాణి నా♦మేటితబుసు,లకు వచించె నేత్రదీతి♦నకలుషముగ. ౬౦౬
క॥ షష్టిసహస్రాబ్దంబులు, కష్టపడి తపంబుసల్పఁ ♦ గరుణను గని మీ
  యిష్టము నడిగినఁ జెప్పమి, నిష్టులని యుపేక్షజేసి ♦ యొసఁగితిఁ గాదే. ౬౦౭
ఉ॥ ఐనను మీ యభీష్టముల ♦ నన్నిఁటి నిత్తుఁ దెల్పుఁడన్న నీ
  శానుఁడు నల్ల యాసురియు ♦ సాగిలి మ్రొక్కి మహాత్మ! యన్యముల్
  వేనిని గోర మీ విపుడు ♦ ప్రీతిని రాధిక నీదు పాదముల్
  ధ్యాన మజస్రముల్ సలుపు ♦ నావిధి మాకు నను గ్రహింపుమా! ౬౦౮
తే॥ అవలఁ గృష్ణుఁడు దానికి ♦ నభిమతింప, శంకరాసురు లావంశి ♦ సాలసవిధ
  మున మనోహరతరుయుత♦పులినమందు, నిత్యవాసము జేసిరో ♦ నుత్యచరిత!
క॥ పిమ్మట రాధాపతి లో,పమ్ములు లేనట్టిరీతిఁ ♦ బద్మాకారా
  మమ్మున వ్రేతలతో రా,సమ్ములఁ బ్రేమమ్ముతోడ ♦ సలిపెను జనకా! ౬౧౦
ఆ॥ ఆఱుమాసము లిటు ♦ లతివలఁగూడుచు, రాధికాధవుండు ♦ రాసములను
  జేసియుంట గోపి ♦ కాసముదాయంబు, పూర్ణతుష్టిఁబొందె ♦ భూప! యవల.
క॥ అరుణోదయవేళను ని,ద్దురవిడి గోపీజనంబు ♦ తొందర స్వకమం
  దిరముల కేగఁ దొడఁగె నిజ,వరయూథము లెల్ల జుట్టు ♦ పరివేష్టింపన్. ౬౧౨
తే॥ నందనందనుఁ డంత స్వ♦మందిరమున, కేగె వృషభానుసుత తన♦యింటికరిగె
  నిట్టి రాసకేళీ కథ♦నెవరుభక్తి, వినెదరో వారు ముక్తులై♦తనరఁగలరు. ౬౧౩
తే॥ అనఁగ జనకుండు నారదా!♦యఘముఖాసు,రరుచు లెట్టుల రాధికా♦రమణుఁగలిసె
  నెటుల శంఖచూడుని జోతి♦కృష్ణమిత్రుఁ,డైన శ్రీదాములో లీన♦మయ్యె!జెపుమ!

## శంఖచూడోపాఖ్యానము

తే॥ అంత మునివరుఁ డిట్లనె♦నమలచరిత!, రమ్యగోలోకవార్త నా♦రాయణముని
  ముఖమునన్ మున్నువింటిని ♦ భూప! వినుము, చిత్తమన్యస్థలంబునఁ♦జేర్చకుండ.
క॥ దామోదరునకు ముప్వురు, భూమి, శ్రీ, రాధ, లనెడి ♦ పొలఁతులు గలరా
  భామినుల లందున రాధా, కామినియే హరికి ముఖ్య ♦ కాంతగ నుండెన్. ౬౧౬

వ॥ అంతఁ బరిపూర్ణయౌవనాఢ్య యగు రాధ తనవిభుండు సవతియగు విర
జతోఁ గూడి వేడుకగా నేకాంతంబుగాఁ గ్రీడించుచుండెనను సంగతి నిజసఖిచే విని
మిగుల వగచి వందయామడ లెత్తును వందయామడల విస్తృతంబును గోటిభానుసన్ని
భంబును గోట్యశ్వకల్పితంబును హారతారాంచితంబును నై యొప్పు నరదం
బధిరోహించి ౬౧౮

చ॥ కరములయందు బెత్తములు ♦ గ్రాల దశార్బుదచేటికాజనుల్
వఱలుచు నాల్గుగ్రేవలను ♦ భద్రముగూర్ప సువర్ణభూషణో
త్కరము ధరించి కోటిశశి ♦ కాంతివిభాసురయై మనోహరుఁ
హారిని గనంగఁ బైనమయి ♦ యర్థ్వగచిత్రము లెల్లఁ జూచుచుఁ. ౬౧౯

తే॥ ఒయ్య నొయ్యన శ్రీకృష్ణు♦నునికిఁ జేరు, తఱి హరిన్యస్తుఁడైన శ్రీ♦దాముఁడు మొగ
సాల నిల్పి యారాధికా♦స్యందనంబు, నడ్డగించె స్వప్రభుసూ♦క్తినను సరించి.

తే॥ అవల నడ్డిన శ్రీదాము ♦ నధికబలుని, జక్రిమిత్రుని రాధికా ♦ సఖులు గాంచి
యిట్టి దొరసాని తేరెటు♦లీవు నిల్పి, వెడలితి వటంచుఁ గొట్టిరి♦బెత్తములను.

తే॥ అంతఁ బొదరింటిలోపల ♦ నధివసించు, కృష్ణుఁ డారాధికాసఖు ♦ లేపుమీఱ
ద్వారపాలకుఁ దన్నిడి ♦ ధ్వనుల వినుచు, భీతిచేఁ దిరోహితుఁ డయ్యెఁ ♦ బిదప విరజ

తే॥ అడలినదియౌచుగోలోక♦మందుఁగోటి, యోజనాయుతంబుగఁ బాఱి♦నుదధి యుర్విఁ
గ్రమ్మినట్టుల, రవియు నల్గడల నొక్క,సారి వెల్గిన పద్ధతి ♦ ధారుణీంద్ర! ౬౨౦

తే॥ అంత సఖులతో రాధ కుం♦జాంతరంబు,జొచ్చి యెల్లెడఁ గని మధు♦సూదనుండు
భీతిచేఁ దిరోహితుఁడౌట♦విరజ నదిగ,మాఱుట నెఱంగి మఱి నిజా♦గారముఁ జనె.

తే॥ అవలఁ గృష్ణుఁడు హ్రాదిని♦యైన విరజ, మరల సాకారగా సల్పి♦పరిసరంబు
నందు వెల్గు బృందావన♦మందు నున్న, కుంజమున రాసముల్ జేసెఁ♦గూర్మిఁ బిదప.

ఆ॥ విరజ, శౌరివలన ♦ హరినిభసప్తపు,త్రులను గనియె వార ♦ లల వనంబు
నకుఁ దొడవులుగఁ దగి♦రొకపరిఁ దమ్ముల, నన్నలు ప్రహరించి ♦ రాడుకొనుచు.

క॥ చిఱుత లపుడు మఱిఁ గొట్టక, పరువిడి హరియుక్తజనని ♦ పయ్యెట డాఁగన్
విరజయు గని వత్సలతన్, గరములఁ గొని బుజ్జగించెఁ ♦ గ్రమోక్తులతోన్.

క॥ వనజాక్షుం డటు తన చెలి, తను విడి యల యర్భకులను ♦ దమిఁ గొనుచుంటన్
గని కనలి యదృశ్యుం డయ్యెను విరజ గడు వగచి హరి ♦ యెడఁ బాయుటచేన్.

తే॥ కొడుకులార! మీరలు హరి♦కూడిక చెడ,సలిపితిరి దాన జలధులై ♦ జంతుకోటి
గ్రోలనట్లు నైమిత్తికా♦ఖ్యాలయమునఁ,గలిసికొనురీతి నుండురు♦గాక భువిని.

వ॥ అని శపింప నయ్యేడ్వురు కొమరులు మాతృశాపనిహతులై తత్క్షణం
బునఁ బ్రియవ్రతంబు నరదంబుగా రచించి యందు సమాస్థితులై భూలోకంబు
నకుం జనుదెంచి లవణేక్షుసురాసర్పిదధిదుగ్ధజలంబులను పేర సప్తార్ణవంబులై

ప్రాణికోటి గ్రోలరాని ఘోరజలంబులు గలిగి యగాధంబులై జడంబులకుఁ దల్లి యుండె ప్రథమద్వీపంబున లక్షయోజనంబులందును, ద్వితీయద్వీపంబున రెండు లక్షలయోజనంబులను, తృతీయద్వీపంబున నాల్గులక్షలయోజనంబులను, చతుర్థ ద్వీపంబునం దెనిమిదిలక్షలయోజనంబులను, పంచమద్వీపంబునం బదాఱులక్షల యోజనంబులను, షష్ఠద్వీపమునందు ముప్పదిరెండులక్షలయోజనంబులను, సప్తమ ద్వీపమునం దఱువదినాల్గులక్షలయోజనంబులను నాయామంబు వేఱువేఱుగాఁ బొంది యొండొరులకు సంబంధంబులేని మాడ్కిఁ బ్రవహింపం దొడంగిరి. అంత నవ్విరజాకాంత, సంతాన కాంత విరహాతురయై కుందుచుండఁ గరుణాసముద్రుం డగు నుపేంద్రుండు గ్రమ్మఱఁ బ్రసన్నుండై "జీవితేశ్వరీ! నిన్ను బాసి నేనొక క్షణంబైన నుండఁజాలను. మఱియు మన తనయుల నహరహంబు జూచి నిజశక్తిని గాంచుచుండఁ గలవని వరం బొసంగి యోదార్చి తన వియోగంబున రాధికకుఁ గలిగిన సిలు గెఱింగి యటనుండి వీడ్కొని నెచ్చెలియగు శ్రీదామునితోఁ గూడి తద్రాధాకుంజంబునకుం జని తోరణంబున నిలుచుండఁ ద్రిపురసుందరియు మాన వతియు నగు నారాధిక, గనుఁగొని సకోపయై యిట్లనియె. ౬౨౯

చ॥ నరహరి! పొమ్ము పొమ్మటకె ♦ నాదరిఁ జేరకు మా నికుంజమం
దరుసముతోడ నా విరజ, ♦ యాపగగా నదమౌచు నీవు సం
బరమున నెల్లకాలమును ♦ వాసము సల్పినఁ జక్కనుండు నో
హరి! యణువంత లాభ మిట ♦ హత్తదు గావున వేగ నేగుమా! ౬౩౦

క॥ అనవుడు శ్రీహరి విని యా, మె నికుంజములోన దూఱి ♦ మిన్నకయుంటన్
గనుఁగొను శ్రీదాముఁడు రా,ధను గని యిట్లనియె నధిక ♦ తామసబుద్ధిన్.

క॥ తల్లీ! గోలోకేశుని, ఫుల్లసరోజాక్షు సకల ♦ భువనేశ్వరు, లీ
లోల్లాసుని భగవానుని, నల్లరిగా నల్లసంబు ♦ లాడుట దగునే? ౬౩౧

సీ॥ నిస్సార సంసార ♦ దుస్సహరోగముల్, బాపెడి వైద్యుండు ♦ పతియ కాఁడె
యార్థిక వైదిక ♦ యౌగిక నైతిక, ఫక్కిఁదెల్పెడివాఁడు ♦ పతియ కాఁడె
ధర్మార్థ కామ సం ♦ తాన సాధనములన్, వాసికెక్కినకర్త ♦ పతియ కాఁడె
యెట్టిచింతలనైన ♦ నెట్టివంతలనైనఁ, బాపెడి నేర్పరి ♦ పతియ కాఁడె

తే॥ సకలవాంఛల నెరవేర్చి ♦ సౌఖ్యమిచ్చు, ప్రభువు పతి కాఁడె చుట్టాల ♦ కభయ మొసఁగి
కరుణఁ గనువాఁడు పతి కాఁడె ♦ కమలనేత్ర!, యట్టి నీపతిన్ దూఱుట ♦ న్యాయమగునె?

మ॥ జననీ! యెన్నిటి యోగహీనుఁడయినన్ ♦ సౌశీల్య సౌజన్య స
ద్ఘనతా పుష్కలతా గరిష్ఠకవితా ♦ దాక్షిణ్య కారుణ్య ధ
ర్మ నయ ద్రవ్య విహీనుఁడైనఁ దమితో ♦ మన్నించి ప్రేమించు స
ద్వనితాసంఘముఁ గాంచి వేల్పులెపుడున్ ♦ వర్ణించి కాపాడరే. ౬౩౪

తే॥ అఖిలవిధముల ననుకూలుఁడగుచు నిన్నుఁ, బ్రేమతోఁ డాయు మాకృష్ణు విధముగనక
ధూర్తవై యిట్లు నా ప్రేమో లఁ దూలనాడఁ, దగునె? జెప్పుము తరుణీమ తల్లి! తల్లి!

చ॥ మఱి నినుఁబోలు శక్తులతి మాత్రముగా సృజియించు దివ్యచా
తురిని గడించియున్న హరి తో నటు దూలఁగ మాటలాడెదే ?
సరిసరి కోపముం విడిచి శాంతము నెందు మనంగ రాధికా
తరుణియు వించుఁ గిన్కను ద్రా తంబుగ నిట్లనె వానికో విభూ! ౬౩౬

చ॥ జనకు నుతించుచుం జనని శాపము లాడితి వోరి శుంఠ! వే
దనుజుఁడవై ధరిత్రిని వ్య థాజలధిం బడి పీడఁ జెందుమా!
ఘనమగు గోజగంబు క్షణ కాలములో పల వీడి యేగుమా!
యనవుడు శౌరి మిత్రుఁడు త దంబకుఁ గ్రమ్మఱ నిట్లు వాకొనెం. ౬౩౭

క॥ అనుకూలుండగు హరిపైఁ, గినియుటచే నీవు ధరను గృష్ణుని విడి బా
ధను నూతేడులు దాఁకను, గనుచుందువు తప్పదిద్ది కాంతామణిరో! ౬౩౮

తే॥ ఇటుల నొండొరుల్ శాపము లిచ్చికొనియుఁ,
గుందుచుండుటఁ జూచి గో విందుఁ డెలమి
స్వయముగా వారియెదుటకు వచ్చి తొలుత
రాధ కిట్టులఁ బల్కె ధ రాతలేంద్ర! ౬౩౯

తే॥ మద్వచన మబద్ధము సల్ప మంచినేర్పు, కలదు గాని భక్తోక్తులఁ గల్లఁజేయు
శక్తి పరమాణు వంతయు సరిగ లేమి, నీకు నొకవర మిచ్చెద నెలఁత! వినుమ.

క॥ వారాహకల్పమందున, ధారుణి భారంబుఁ బాప దైత్యుల మాపం
ధీరులకును దర్శన మిడఁ, బేరిమి నీతోడఁ గలిసి వెడలెద ధరకుం. ౬౪౧

తే॥ నీ విరహకాలమందున నెలకు నెలకు, నేను దర్శన మిచ్చెదమాను మార్తి
యనుచు భార్యను నోదార్చి యనుచరుండు, బలుఁడునైన శ్రీదామునిఁ బలికె నిట్లు.

క॥ నీ యంశముతో రక్కసి,వై యవనిం బుట్టి యట్టి వైవస్వతమ
న్వాయతకాలమునం నేఁ, బాయక రాసములఁ జేయు పట్టున నీవుం. ౬౪౩

చ॥ అరమున నన్ను జేరి పరి హాసములం బొనరింతు వందునం
మరలక నీవు నావలన మందెద వప్డె సవిగ్రహుండవై
మరల యథాప్రకార మన మానరుచిం దగియుందువయ్య యీ
పరమును బ్రీతిఁ గైకొనుచు భావమునందలి చింత మానుమా! ౬౪౪

తే॥ అనఁగ నతఁ డట్లు స్వాంశతో నసురుఁడగుచు
సుధను గృహమునం దగి శంఖ చూడుఁ డనెడి
పేరుఁగని బలియాచుఁగు బేరు మిత్రుఁ
డగుచు హరిహతుఁడై దివ్యుఁ డయ్యె నయ్య! ౬౪౫

తే॥ అద్వయుండయి యందఱి♦యందునుండి, సర్వకార్యంబు లొనరించు♦జాణ కిదియు
  జిత్రమౌనొకొ? యాకృష్ణుఁ♦జేర నుతుల, సలిపి సాగిలి మ్రొక్కెద♦జనకరాజ!
తే॥ కల్మషులును బృందావన♦ఖండ మిద్ది, భక్తి వినినచో నాపంచ♦పాతకములు
  వ్రేల్మిడిఁ జన ధన సుత ♦ వృద్ధిఁబొంది, దండిగోలోకమందున ♦ నుండఁ గలరు.
తే॥ జనక! మఱియేమి సత్కథ♦వినవలతువొ, తెలుపుమా యన నాతఁడో♦దేవమౌని!
  బాలుఁడగు హరి యెట్లు గో♦వర్ధనగిరిఁ, జేత నెత్తెనొ యాకథ♦జెప్పు మనుడు.

ఉ॥ శ్రీకమలానివాస! ముని ♦ శేఖర మానసవాస! నిర్మల
  ప్రాకటసత్యభాష! బహు ♦ రమ్యసువర్ణవిభూష! దేవతో
  షా! కమనీయవేష! శర ♦ ణాగతసాధుసుపోష! ఖండితా
  స్తోకసమస్తదోష! యదు ♦ శుద్ధకులాంబుధిపూర్ణచంద్రమా! ౭౪౯

ఉత్సాహావృత్తము॥ గోపికాసమేత! రాస ♦ కుర్దనప్రణేత! సం
  తాపపాపజేత! దుష్ట ♦ దైత్యకరిమృగాధిపా!
  గోపతీ! హరీ! మనోజ ♦ కోటిదివ్యవిగ్రహా!
  భూపదీప్రసగంచితాంగ! ♦ భూసురాగ్రణి ప్రియా! ౭౫౦

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చివుకుల
కులజలధికళానిధి, కోటమాంబాకామయ తనయ, లక్ష్మీదేవీ
సుబ్రహ్మణ్య దత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వ
నిశ్చయ, సుజనవిధేయ, శ్రీనివాసాపరనామధే
యాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన
శ్రీగర్గభాగవతం బందలి
బృందావనఖండము
సంపూర్ణము.

---

శ్రీ శ్రీ శ్రీ
హరిః ఓంతత్సత్
శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీగర్గభాగవతము.



## గిరిరాజఖండము.





శ్రీయమునారుచిరాంగా!
తోయరుహసమానహస్త! ♦ తోయజనాభా!
తోయరుహాగృహాధర! నా
రాయణ! రాసప్రవీణ ♦ రాధాకృష్ణా! ౧

శ్రీకృష్ణుండు తండ్రిని నింద్రపూజనుగూర్చి ప్రశ్నించి గోవర్ధనగిరిని బ్రశంసించుట.

వ॥ అక్కథకుండు జనకవిభున కిట్లు చెప్పందొడంగె. దేవా! జనులు జనపాలకునకు వార్షికంబగు కప్పంబుఁ గట్టినట్లు కృషీవలురగు గోపకు లందఱు పురందరునకుఁ బ్రతివత్సరంబందుఁ బ్రావృట్కాలంబునఁ బూజాపురస్సరంబుగా బలిని సమర్పించుచుంట బ్రహ్మాండనాయకుండగు శ్రీకృష్ణుం డొక్కతఱి నవలోకించి సకలగోపకదీపితంబగు సభాస్థలినున్న నిజజనకుండగు నందునిం గని నాయనా! ప్రత్యబ్దంబున నయ్యింద్రున కిట్లు బలిని సమర్పించుచుంటిరి. దీన మీ కేమి ఫలంబు గలదు? లౌకికమా? పారలౌకికమా? యేదియో యానతిండని ప్రార్థింప నందుం డందుల కియ్యకొని నిజనందనున కిట్లనియె. ౨

ఆ॥ ఇది సురేంద్రపూజ ♦ యొడఁదఁ దలంపఁగ, భుక్తిముక్తికరముఁ ♦ బుణ్యతమము
దీని విడినవాఁడు ♦ దీనుఁడై తిరిగెడిఁ, గాని సుఖయుతుండు ♦ గాఁడు గాఁడు. ౩

క॥ అనవుడు భగవానుం డల్లన నగి తండ్రీ! యిదేమి ♦ లక్షణ మిపుడే
ఘనుఁడు వచించెను మీ రిది, యనుమానము మాని విడుట ♦ యర్థప్రదమా.

ఉ॥ కారణ మేమనన్ వినుఁడ ♦ ఖండపురాకృతకర్మరీతి బృం
దారకులున్ సురేంద్రుఁడు య ♦ థావిధి స్వర్గసుఖంబు వొంది యే
వారమునన్ స్వపుణ్యమితి ♦ పారము సెందునొ నాఁటగోలె నీ
ధారుణి జన్మమెత్తి సుకృ ♦ తంబును దుష్కృతిఁ జేయుచుండరే. ౪

కం॥ కావున వారును మనతో, నే విశయము లేనియట్లు ♦ లీనులై యుంటన్
జీవన్ముక్తి ఘటిల్లక, జీవితముల్ వ్యర్థ మగును ♦ సేవించినచోన్. ౬
సీ॥ సురతతికంటెఁ దన్నముచి ♦ సూదనుఁ డా దివిజేశుకంటె సుం
పద చతురాస్యయుక్తవిధి ♦ తద్విధికంటె హిరణ్యగర్భుఁడా
పరపరమేష్ఠికంటె గుణ ♦ భాసురమాయయు దానికంటె నా
పర సుగుణం బనశ్వరము ♦ బ్రహ్మ ముపాస్య మటం చెఱుఁగుమా! ౭
చం॥ అదియును జగన్నిదానమయి ♦ యాగమ గో సుర వహ్ని ధర్మ సం
పదలకు మూలమై సకల ♦ భాగ్యమహానిధియై వెలుంగు న
య్యదియె విడి వేఱుదాని మన ♦ మందున నమ్మి భజించు నట్టి దు
ర్మదునకు ముక్తి సేకురునె? ♦ యాపిస్తములే నెఱవేఱుచుండునే. ౮
కం॥ కావున నింద్రుని పూజల, నావలఁ బోఁద్రోసి మీర ♦ లటు లర్చల నా
శ్రీపతి భువనక్షోజంబగు, గోవర్ధనగిరికి సల్పి ♦ కోర్కులఁ గొనుఁడీ! ౯
ఉ॥ తద్గిరియో పులస్త్యుని యు ♦ దాత్తబలంబున నీస్థలంబునన్
సద్గతిదాయకం బగుచుఁ ♦ జక్కఁగఁ జొచ్చెను గాన బ్రహ్మవ
క్త్రోద్గత భూమిదేవులకు ♦ నొయ్యన నాలకుఁ, బూజ సల్పి సం
పద్గతపారితోషికము ♦ బాధముగా నిడ నౌను దానికిన్. ౧౦
గీ॥ నంద! యొనర్పఁగా నటుల ♦ నాకుఁ బ్రియంబగు నన్నఁ దత్సభన్
జందములు నాలకించెడి సు ♦ శీలుర యందున వృద్ధుఁడైన స
న్నందుఁడు కృష్ణవాక్యము మ ♦ నంబునఁ బూర్తిగ మెచ్చి నాయనా!
నందసుతా! వచింపుము ఘృ ♦ ణామతిఁ దన్నగపూజ యెట్టిదో? ౧౧

## గోవర్ధన పూజావిధి.

వ॥ అంత రాధికాకాంతుండు స్వాంతంబున సంతసించి సన్నందున కిట్లనియె. గోపవృద్ధా! తద్గోవర్ధన ధరాధర వరంబు నందలి క్రింది ప్రదేశంబున గోమయంబున నలికి నిగ్గగు ముగ్గులఁ బెట్టి పూజాసంభారంబులం గొని జితేంద్రియుండై బ్రాహ్మణులతోఁ గూడి పరమభక్తినిఁ దదచలంబును ధ్యానించి యావాహనంబు సల్పి యర్ఘ్య మొసంగి పాద్యమిచ్చి యాచమనం బిడి గంగాయమునోదకంబుల సహస్రశీర్షా యనెడు మంత్రంబున నభిషేకించి పంచామృతంబుల స్నానంబుఁ జేయించి దివ్యవసనంబును యజ్ఞోపవీతంబును సమర్పించి చందనాది సుగంధద్రవ్యంబులు నలఁది కమనీయంబులగు సుమంబుల నర్చించి నానాదివ్యగంధభాసురంబగు ధూపంబును, జగజ్జ్యోతిభాతి వెలుంగు దీపంబు నర్పించి భక్ష్యభోజ్యలేహ్యచోష్య పదార్థంబుల నివేదించి చతుష్షష్టికచోలంబుల నైదుపంక్తులుగా నమర్చి యామ్రాదిఫలంబులు గంగాయమునాజలంబుల నించి యందుఁదులసీదళంబు లిడి యొక్కొక్క

దానికి షట్పంచాశద్విధంబులగు సామగ్రుల భోగంబులు గలుగునట్లు సేవించి సుర భూసురాగ్ని గోబృందంబుల షోడశోపచారంబుల సంతుష్టిపఱిచి ద్విజవరులకు మృష్టాన్నం బిడి తదితరులకు సైతం బన్నదానం బొనర్చి గోపీ గోపాలయుక్తంబుగా దానును సాపడి కాంస్యఘంటాదిచతుర్విధ వాద్యంబుల మొఱయించి కర్పూర నీరాజనం బెత్తి వేదావామేత మ్మనెడుమంత్రంబునఁ బుష్పాంజలి యర్పించి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి వినుతించి జయశబ్దంబులం గావించుచు నాట్యం బొనరించి గోవర్ధనగిరిరాజోత్సవంబుఁ జేయందగు. ౧౯

తే॥ ఎందు గోవర్ధనాచల ♦ మొంద లేదో, యందు గోమయంబున దాని ♦ యంతయెత్తు
బొడవు వెడలుపు ఘటియించి ♦ పుష్పవల్లి, భూరుహాదులఁ గూర్చినఁ ♦ బూజ్యమగు

తే॥ అట్టి గోవర్ధనాచల ♦ మందునుండి, శిలను దత్తుల్యకనకముఁ ♦ జేర్చికొన్నఁ
బుణ్యుఁడగు నిట్లు చేయని ♦ పూరుషుండు, గరము రౌరవనామక ♦ నరక మొందు

శా॥ సాలగ్రామసురార్చనంబుఁ బ్రతిఘ ♦ సంబంధునన్ జేయు ధీ
శాలిన్ బాపము లంట వప్పు జలభా ♦ స్వత్పద్మ మట్లిందునన్
గోలోకంబుననుండి వచ్చి తగు నా ♦ గోవర్ధనాద్రీశు నే
రేలోపంబులు లేక ప్రొమొక్కెదరొ వా ♦ రిష్టంబులం బొందరే? ౧౫

తే॥ అనఁగ నందసన్నందులు ♦ నఖిల గోపకులును విని యద్భుతంబునఁ ♦ జెలఁగి నాడు
కన నొనర్పు నింద్రుని పూజ ♦ దిగఁగ విడిచి, శైలవిభుఁ గొల్వఁదలఁచిరో ♦ జనకరాజ!

గోవర్ధన పూజా మహోత్సవము.

చ॥ అచల గిరిప్రభూత్సవము ♦ నంతటఁ జాటియు గర్గరామ కే
శవుల యశోదఁ గూడుచు గ ♦ జంబున నెక్కియు గోపగోపికా
నివహము గోగణంబులును ♦ నెయ్యముతోఁ జనుదేర గోత్రరా
ట్సవిధమునందుఁ జొచ్చెను బ్ర ♦ జప్రభుఁ డాసమయంబునందునన్. ౧౭

ఉ॥ స్వాంతమునందు సంతసమె ♦ సంగ జయంత శచీ సమేతుఁడై
దంతివరంబు నెక్కి సుర ♦ తండముతోఁ బ్రమదావనాంతర
ప్రాంతము జేరు వజ్రివలె ♦ భాసిలె నాయుపనందనందు లా
వంతున నార్యులైన వృష ♦ భానులు వచ్చిరి దారయుక్తులై. ౧౮

ఉ॥ మఱియు సహస్ర బాలరవి ♦ మండలభాసురమైన పల్లకిన్
సురపతిపత్నిఁబోలె మణి ♦ శోభిత భూషణముల్ ధరించి చె
చ్చెర భ్రమరీ సమాకుల వి ♦ చిత్ర చకోరి విధానఁ జేటికో
త్కరయుత యాచు నెక్కి గిరి ♦ కాంతునిఁ జేరెను రాధ వేడ్కతోన్. ౧౯

చ॥ అటు గిరినాయకాంతికము ♦ నందిన మీఁదట రాధ డోలికన్
దటుకున డిగ్గి కోటివని ♦ తావృతయై లలితా విశాఖలున్

జటుల మనోజ్ఞ చామరలఁ ♦ జక్కఁగఁ బట్టుచు వీవ భక్తులు
త్కటనుతి సల్పుచుండఁదగె ♦ ధారుణినాథ! యనంతరంబునన్. ౨౦

సీ॥ ద్వాత్రింశదధికయూ ♦ థంబులు మిథిలాని, వాసినుల్గోసల ♦ వాసినులును
ధ్రువలోకకాంతలుఁ ♦ దోయధిభామినుల్, శ్రీరమావైకుంఠ ♦ ఉత్రసతులు
నోషధీసతులు మ ♦ హాజ్యులద్వీపవా, సినులు జాలంధర ♦ చేటికలును
నూర్ధ్వవైకుంఠమం♦దుండెడి నువిదలు, శ్రుతిరూప మునిరూప♦సుదతితతులు
తే॥ పృథుల బర్హిష్మతీసతుల్♦విపినవాసి, నులును యజ్ఞసీతాస్త్రీ ల♦తలవిలాసి
నులును యూథములనుగూడి♦బలులఁగొనుచు, శైలనాయకు సరసకుఁ♦జనిరి మఱియు.

చ॥ సరిగ నలంకరించుకొని ♦ జాణతనంబున బాలవృద్ధుల
చ్చరలును రాజయోగులును ♦ శాంతిసమేతమహర్షులున్ ధరా
మరులు సురర్షులున్ జెలులు ♦ మంత్రులుఁ దద్గిరిరాజపూజకై
కరములఁ బుష్పలంబలులఁ ♦ గైకొని యేగిరి మైథిలేశ్వరా! ౨౧

ఉ॥ ఈరహిఁ గోప్రవర్ధన ♦ గేంద్రమహోత్సవ మాలకించి కా
మారి, భుజంగహారకట ♦ కాంచితుఁడై సిగఁ జక్కఁగూర్చి ధు
త్తూరము భృంగరాజమును ♦ దూఁకొని తత్ప్రమథప్రయుక్తుఁడై
ఘోరముగా నుమారమణి ♦ తో నటకుం జనె నందివాహుఁడై. ౨౩

తే॥ చాలదూరమునుండియు ♦ శైలనాయ, కోత్సవంబును జూడఁగా ♦నుచితవిధుల
జనులు సనుదెంచి రెక్కువ ♦ సంతసమున, నోలి నిసుకను జల్లిన ♦ రాలనట్లు

ఉ॥ అంచిత గోప్రవర్ధన న ♦ గాధిపుఁ డత్తఱిఁ గృష్ణునానతిన్
గాంచన శృంగ సంగతుఁడు ♦ గాంతిపరీవృతరత్నసానుభూ
మ్యంచితుఁ డీప్సితప్రదుఁడు ♦ నాయతకాయుఁడు బుష్పనిర్ఝరా
ధ్యంచితుఁడున్ ధరారుహాస ♦ మన్వితుఁడై తగియుండె నో విభూ! ౨౪

ఉ॥ మేలిమి రూపులన్ జెలఁగు ♦ మేరుహిమాద్రిముఖాచలంబు లా
కాలమునందుఁ దద్వరన ♦ గంబునకున్ జనుదెంచి భక్తితోఁ
గేలు మొగిడ్చి కానుకలఁ ♦ గించను గాంచక యిచ్చిమెచ్చి రా
శైలవరార్చ నందుఁడు ద్వి ♦ జన్మముఖంబున సల్పి యాదిలోన్. ౨౬

చ॥ హరివచనానుసారముగ ♦ నల్ల ధరామరగోసురార్చనల్
సరిగ నొనర్చి పాయిలకు ♦ సాపడఁజేసి ధనం బొసంగియున్
ద్వర నుపనంద నంద వృష ♦ భానుయుతుండయి శైలపూజలు
ద్ధరముగ నాచరించి బలిఁ ♦ దోరముగా నిడె నంత భక్తితోన్. ౨౭

తే॥ దానవారి యాగిరికిఁ బ్ర ♦ దక్షిణముల, జేసె వేల్పులు పూల వ♦ర్షించి రెల్ల
గోపికాగోపులాడుచుఁ ♦ గోకిలస్వ, నమున గానము సల్పి రా ♦ నందమొదవ.

తే॥ అర్చనామల నగవరం ♦ బంతకంత, కన్ని తెన్నులఁ జెన్నొందె ♦ హరియు నందు
వేయురూపములతోడుత ♦ వెలిఁగి బలిగ, నిడిన యన్నరాశులఁ గ్రోలి ♦ యిట్లు నుడివె.

క॥ గోవర్ధనుఁడను నూడుఁడి!, యీవిశ్వమునందునున్న ♦ యెల్లమలలకే
నేవిభుఁడనని యెఱిఁగి సం, భావనలన్ సల్పుఁడిపుడు ♦ ప్రజలార! యనన్. ౩౦

ఉ॥ చూపఱు లా గిరీంద్రమున ♦ శోభలు నల్గడలందుఁ జింద స
ల్లాపముఁజేయు దేవుని సు ♦ లక్షణలక్షితుఁగాంచి దేవ! మా
శ్రీపతి మిమ్ముఁజూపుటను ♦ జెందితి మేము కృతార్థతన్ దయన్
మా పసు లేము బంధుసఖ ♦ మండలి వృద్ధిఁజెలంగఁ బ్రోవుమా! ౩౧

తే॥ నావు డపరంజినగల వి ♦ న్నాణమొంద, దివ్యరూపంబు ధరియించి ♦ తేజరిల్లు
గోప్రవర్ధనుఁ డవ్వారి ♦ కోరిక లిడి, వేల్మిడిన్ దిరోహితుఁ డయ్యెఁ ♦ బిదప మరలి.

తే॥ నంద వృషభాను గోపోప ♦ నందబంధు, గోపికాజనులును మిత్ర ♦ కూటములును
జంద్రమాళినీలాంబరో ♦ పేంద్రముఖులు, సనిరి సకుటుంబముగ నిజ ♦ సదనములకు

ఉ॥ ఈదృశగోప్రవర్ధన న ♦ గేంద్రపవిత్రచరిత్ర మిత్తెఱన్
నీదరిఁ జెప్పినట్టు లల ♦ నిర్జరపాలకు మ్రోలఁ బల్కఁగా
నా దివిజాధిపుండు ప్రతి ♦ హాయనమందలి నాదుపూజ వీ
రీదినమందు మాని గిరి ♦ కెట్టుల నర్చల సల్పి రో మునీ! ౩౨

ఇంద్రుఁడు గోకులంబుపై గోపించుట.

ఉ॥ మూర్తములోన వీరలను ♦ బూదినిఁ గల్పెద నంచుఁ గిన్క సం
వర్తకనామమేఘముల ♦ బంధనముల్ వదలించి వారిదా
వార్త నెఱుంగుఁడీ! త్రుటినిఁ ♦ బ్రత్యవహారమునన్ జగంబులన్
బూర్తిగ ముంచివేసినటు ♦ బోయి వ్రజంబును ముంచివేయుఁడీ. ౩౩

చ॥ అని యనుపన్ దదంబుదము ♦ లప్పుడు రోహిత పీత మేచకా
ర్జున బహుచిత్రవర్ణముల ♦ జొత్తిలి యింద్రనిభంబులై కసిన్
ఘనగజహస్తధారలను ♦ గర్జల మించులఁ గూడి యేకరీ
తినిఁ గురిసెన్ భయంకర వి ♦ ధిన్ వ్రజవాసివినాశనార్థమై. ౩౪

క॥ సుడిగాలి వీవఁ దొడఁగెను, దడదడఁ బిడుగులును బడియె ♦ దరువులు గృహముల్
దడయక కెడసెను గడువడిఁ, బుడమిని గొండలును గూలెఁ ♦ బొడిపొడిగాఁగన్.

ఉ॥ సప్తబిలంబులున్ బృథుల ♦ సప్తజగంబులు మాఱుమ్రోఁగె ది
క్ప్రాప్తగజాష్టకంబును ధ ♦ రాస్థలి భీతిలి కూలెఁ దారలున్
దీప్తుల వీడి నేలఁబడె ♦ దీనత వ్రేతలతోడ వ్రేలు సం
సుప్తుల బిడ్డలన్ గొనుచు ♦ క్షోభిలు చేగిరి నందుకెంకికిన్. ౩౫

తే॥ అటుల వారలు నందుని♦యాలయమున, కరిగి బలరామయుక్తుఁడౌ♦హరినిఁ గాంచి
కరయుగంబుల ముకుళించి♦కట్టిడులకు, నక్కటికము గలుగునట్టు♦లనిరి జనక! ౩౯

మ॥ అకటా! మీనుడి నిక్కమంచు మదిలో ♦ నత్యంతము న్నమ్మి వా
డుకఁగాఁ జేయు సురేంద్రపూజ విడి వి ♦ ద్ధారంబుగా నొందుకొం
డకు నర్చల్ బొనరించుచుంటిమి గదా! ♦ డంబంబుకై యిట్టు లూ
రక వాచించుట పాడియే శివశివా! ♦ రామా! యశోదాత్మజా! ౪౦

చ॥ అల సురనాయకుండు తన ♦ యర్చను మాని రటంచుఁ గిన్కతో
నల ప్రలయంబునం దువలె ♦ నన్నులు, జిన్నలు, గొడ్డుగోదలే
మలజడు లిట్టులొందఁగ గృ ♦ హంబులు గూలఁగ సర్వవస్తువుల్
విలయము నొంద బెట్టుఁ గురి ♦ పించె నవాభ్రముఖంబులన్ బలీ! ౪౧

తే॥ ఇటుల మము బాధపెట్టుచు ♦ నింట నీవు
సుఖముగా నుంటి విది మాకు ♦ సొద్దె మయ్యె
నరయఁ బిల్లికిఁ జెరలాట ♦ మాఖువునకుఁ
బ్రాణసంకట మనునట్లు ♦ బాలకృష్ణ! ౪౨

ఉ॥ కావున నింద్రకోపము నిఁ ♦ కన్ సహియింపఁగలేము మమ్ము నీ
వేవిధిఁ గావ నెంచితివొ? ♦ యేర్పడఁ దెల్పు మనంగఁ జక్రి, గో
పావళులార! మీరు భయ ♦ మందక వస్తుసమేతులై కుటుం
బావృతులై త్వదర్చిత న ♦ గాంతికమొందుఁడి! యేను వచ్చెదన్. ౪౩

శ్రీకృష్ణుండు గోవర్ధన పర్వతం బెత్తుట.

చ॥ అని యిటు వారలం బనిపి ♦ యామురారి స్వాగ్రజుఁడౌచు గోప్రవ
ర్ధనగిరిఁ జేరి బాలము, త్వ ♦ రన్ గమలంబును జేతఁ గొన్నరీ
తిని దనకేలఁ దన్నగప ♦ తిన్ బెకలించి గ్రహించి గోపులా
ర! నడువుఁడీ! యిటన్ జనుఁడి! ♦ రండు కుటుంబపశుప్రయుక్తులై. ౪౪

తే॥ అట్లు పలుకంగ గోపకు ♦ లంద అద్భుతమున ముక్కున వ్రేలిడి ♦ దారపుత్ర
మిత్ర పరివార గో వస్తు ♦ మిళితులగుచు, నద్రివిభుక్రిందఁ జేరిరో ♦ యవనినాథ!

ఆ॥ అవల వానవలన ♦ నరుదెంచు ఝురములు, పర్వతంబుక్రిందఁ ♦ బాఱఁదొడఁగ
విడిముడిపడలియొడ♦యఁడు గని సుడివాలు, వ్యాళపాలుఁ దలఁచె ♦ వారిఁగావ.

క॥ తలఁచిన వెంబడిఁ జక్రముఁ, జలువలయొడయఁడును వచ్చి ♦ చెంతఁ జెలంగన్
గలిమిచెలి చెలియుఁ గనుఁగొని, జలములఁ దొలఁగించి గిరిని ♦ సాకుఁడి మీరల్.

క॥ అనిపంపఁగఁ దచ్చక్రము, మును పల వనధుల నగస్త్య ♦ ముని యానిన రీ
తినిఁ దన్నగావరణగత, వనముల గడగడను ద్రావి ♦ వఱలుచునుండెన్. ౪౫

ఆ॥ మఱి యనంతుఁ డల్ల♦గిరివరుఁగుండలి, యగుచు మోసి యతిశ♦యముగఁ బాఱు
చురుగుదెంచు ఝురము ♦ నావలఁద్రోయుచుఁ, గ్రాలె జలధినాపు♦వేలఁబోలె.
తే॥ ఏడుదినము లిట్టుల నచ♦లేంద్రమెత్తి, తమ్ముఁగాపాడు హరిచంద్రు♦నెమ్మితోఁ జ
కోరవిధమునఁ జూచుచు♦గోపకులము, హాయిగా నుండె నోమైథి♦లాధినాథ!
మ॥ అపు డాజాడ సురేశ్వరుం డెఱిఁగి వే ♦ యైరావతం బెక్కి స్వీ
య పదాతి ద్విప రథ్యయానములు వె ♦ న్నాడంగ నూఱించులో
ష్ణాపవిన్ దాలిచి కిన్కతోఁ జని వ్రజం ♦ బున్ మాపి తాఁ గన్న యా
యపకీర్తిన్ దొలఁగింప నెంచి విసరెన్ ♦ హాహా! యనన్ గోపకుల్. ౫౧
ఉ॥ దాని జనార్దనుండు గని ♦ దవ్వుల వజ్రయుతంబుగా హరిన్
మ్రానుపడం బొనర్చెను సు ♦ మా! యపుడా దివిజేంద్రుఁ డభ్రముల్,
సేనలఁ గొంచు సాధ్వసముఁ ♦ జెంది తెగించి హసింపఁ బాఱెఁ బం
చాననతాడితంబగు గ ♦ జంబు విధంబున భూప! యాపయిన్. ౫౨
ఉ॥ వాన లణంగె వెల్లువలు ♦ వాసెఁ బ్రచండసమీరణంబులున్
మానె విపంకమయ్యె ధర ♦ మప్పితమైన జలంబుతో నదుల్
దానముఁ జెందెఁ బక్షు లమి ♦ తంబగు సౌఖ్యముఁ బొందె గోపసం
తానము సంతసించె హరి ♦ దశ్వుఁడు వెల్గె నభంబు భాసిలెన్. ౫౩
క॥ మని రాభీరులు హరి దయఁ, గనిరి ఘనాఘనసమీర ♦ కష్టము లేమిన్
వినిరి వనజాక్షుసూక్తులఁ, జని రీవల కందునుండి ♦ స్వజనాన్వితులై. ౫౪
చ॥ చెలులను గాంచి శ్రీహరి వ ♦ చించె నిటుల్ సఖులార! మీరు నా
వలె నిపుడీ నగంబు నొక ♦ పాణిని నెత్తుఁడి! చూతుఁగాక! యం
చల గిరి నర్ధభారమునె ♦ యా సహవాసుల కియ్య వారలం
దుల కురరీకరించి మలఁ ♦ దొడ్డఁగఁ బూనుచుఁ గూలి రిద్దరన్. ౫౫
చ॥ పులిఁగని నక్క, వాతలను ♦ బొందిన యట్టులఁ దన్నుజూచి కొం
డలతలకట్టు నెత్తఁగఁ గ ♦ డంగి ధరన్ బడి లేవలేని మి
త్రులను రమేశ్వరుండు గని ♦ రోయక నవ్వుచు లేవఁదీయ వా
ర లలరి కృష్ణమిత్రుఁ బరి ♦ రంభణభూషితుఁ జేసి రెంతయున్. ౫౬
ఉ॥ తమ్ములుఁ దండ్రులున్ జెలులుఁ ♦ దాతలు మామలు సోదరీగణం
బమ్మలుఁ బిన్నపెద్దలును ♦ నన్నలు వెండియు నందు నుండు లో
కమ్ములు శ్రీహరీ! భవద ♦ ఖండఘృణాపరిపూర్ణ దివ్యభా
వమ్మున లొగ్గడిన్ బడక ♦ వర్ధిలుచుంటి మటంచు వేఁడియున్. ౫౭

## శ్రీకృష్ణాభిషేకము.

చ॥ పెరుఁగును బాల నేతులను ♦ బెల్లుగ నిచ్చి సుమాతృకాదులన్
హరిపయిఁ జల్లి వందనము ♦ లగ్గలికంబుగ సల్పి స్వీయమం

దిరముల కేగి రంత వసు ♦ దేవసుతుండును బూర్వరీతిఁ ద
ద్గిరివర ముంచి యొంటరిగఁ ♦ దిగ్గెడివేళ బలారి గాచుచున్. ౫౮

క॥ అమరులఁ దోడ్కొని తద్ధరి, సముఖంబున కేగుదెంచి ♦ సాష్టాంగనతుల్
గ్రమముగ సల్పియు వినయభ,యములను శ్రీహరికి నిట్టు ♦ లనియెన్ జనకా!

సీ॥ శ్రీవాసుదేవాయ ♦ దేవాదిదేవాయ, యంబుజాక్షాయ తు ♦ భ్యం నమోస్తు
గోపాలకేశాయ ♦ గోలోకవాసాయ, యభ్రవర్ణాయ తు ♦ భ్యం నమోస్తు
బ్రహ్మాండమండల♦భాస్వత్స్వరూపాయ, యసురాంతకాయ తు♦భ్యం నమోస్తు
కరుణాసముద్రాయ ♦ పరిపూర్ణజాతాయ, బలసమేతాయ తు ♦ భ్యం నమోస్తు.

తే॥ గోపికాజననాథాయ ♦ గోప్రవర్ధ, నాచలోద్ధారకాయ తు ♦ భ్యం నమోస్తు
పరమయోగీశ్వరాయ తు♦భ్యంనమోస్తు,వరదశావతారాయ తు♦భ్యం నమోస్తు

తే॥ పతితపావన! జగదీశ! ♦పాహి! పాహి!, కంసముఖదుష్టులన్ జంపఁ♦గాలితీవు
విశ్వమోహన! నీమాయ♦వెల్లడైన, నన్ను బుత్రవాత్సల్యము♦నన్ గ్రహింపు.

తే॥ అనుచుఁ గొనియాడెఁ బిమ్మట♦నబ్ధిజాత, యైన సురభినామక కామ♦ధేను వట్టి
గోప్రవర్ధననగమునఁ ♦ గుదిరియున్న, శ్రీపతిన్ స్నాతుసల్పె స్వ ♦ క్షీరధార.

క॥ ఆవల నైరావత మా, దేవధునీసలిలములను ♦ దివ్యకరములన్
శ్రీవిభు నభిషేకించెను, దీవించిరి బ్రహ్మరాజ ♦ దేవమహర్షుల్. ౬౩

క॥ సురలును హరిపైఁ బ్రీతిని, గురిసిరివర పుష్పవృష్టిఁ ♦ గొండాడిరి కి
న్నరచారణగంధర్వులు, నరుసముత్తో నప్సరసలు ♦ నాడిరి తేఁడా! ౬౪

క॥ పదపడి గోవర్ధనగిరిఁ, ద్రిదివేంద్రప్రభృతిసురలు ♦ దేవకిపుత్రున్
ముదమున నభిషేకించిన, పిదపన్ ద్రవరూపమొంది ♦ వేడ్కసెలంగన్. ౬౫

శా॥ శ్రీకాంతుండు ప్రసన్నుఁడై యల నగ ♦ శ్రేష్ఠంబు హస్తంబుచేఁ
దాఁకెన్ దత్కరచిహ్న మిప్పటికిఁ ద ♦ ద్గ్రావంబునన్ వెల్గు నే
ర్జోకన్ దానిని గాంచుచుందు రల సు ♦ శ్లోకుల్ సుఖంబొంది యా
వైకుంఠంబున నొప్పుచుందు రని నీ ♦ భావంబునన్ నమ్ముమా! ౬౬

చ॥ మఱి యటఁ గృష్ణపాదముల ♦ మచ్చలు గన్పడుచుండుఁ గామధు
గ్సురభిపదాంకముల్ వెలుఁగుఁ ♦ జూచినవారలు పాపదూరులై
పరమముఁగాంత్రు వెండియు సు ♦ పర్వధునీవిమలాంబు వందు సం
బరమునఁ బాఱుచుండు నది ♦ "మానసిగంగ" యనంగ నొప్పెడిన్. ౬౭

ఉ॥ అందున నేత్రపజల్ జలక ♦ మాడెదరో యలవారు పాపముల్
డింద నొనర్చి పుణ్యము గ ♦ డిందిఁగఁ గాంతురు కామదోగ్ధ్రి గో
విందుని స్నాతుగా సలుప ♦ వెల్లువ వాఱిన దేశమెల్ల "గో
విందసరోవరం" బనఁగ ♦ విశ్రుతి కెక్కెను విశ్రుత ప్రభూ! ౬౮

ఉ॥ దాసిని గాంచు వారలును ♦ దద్ధరిధామముఁ జెంది యుందురో
మానవనాథ! యంతి సుర ♦ మండలనాథుఁడు దేవయుక్తుఁడై
దానవవైరి మ్రొక్కి బలి ♦ తండ మొసంగి జయధ్వనుల్ దగం
గా నిజపట్టణంబునకుఁ ♦ గ్రమ్మఱి క్రచ్చఱ నేగె నంతటన్. ౬౯

గోపకులు శ్రీకృష్ణుని పరీక్షించి నిస్సందేహులగుట.

చ॥ ఒకపరి వ్రేలు వ్రేతలును ♦ నొద్దికగా గుమిగూడి నందు ని
క్కకుఁ జని నందరాజున క ♦ కల్మషబుద్ధి వచించి రిట్లు గో
పకవర! నీవె ధన్యుఁడవు ♦ పంకజనాభుని బోలియుండు పు
త్రకు నిటు లేరు గాంచి ప్రమ ♦ దంబును బొంది యశంబుఁ జెందిరే? ౭౦

తే॥ పుట్టగొడుగులఁ బెకలించు♦బుడుతలవలెఁ, దామరసమును బీకెడి♦దంతిమాడ్కి
నాయతంబగు కాయంబు♦నందియున్న, గిరిని నొక కేల నెత్తె నీ♦కృష్ణమూర్తి.

తే॥ ఎచట నేడేండ్ల బాలకుఁ ♦ డెచట నేడు, ప్రొద్దు లా గోప్రవర్ధన ♦ భూధరంబు
నొక్కచేతను ధరియించి♦యుండు టిద్ది, చిత్రములలోనఁ జిత్రమై♦చెలఁగె నంద!

వ॥ అదియునుం గాక తల్లి యగు నీ యశోదయుఁ, దండ్రివగు నీవును దెల్లనివారుగా నుంటిరి. మీకు జనించిన పిల్లఁడు మాత్రము నల్లనివాఁడై మన చంద్రవంశంబున విలక్షణుండై యుండె. గతంబేమి? ఇతని యన్నయగు బలభద్రుండు గౌరవర్ణుండగుటవలన సందేహాస్పదుండు గానేరఁడయ్యె. చూడంజూడ నీకృష్ణుండు క్షత్రియసంభూతుండని తోఁచెడి. ఇయ్యది మనకులంబునకుఁ గళంకం బాపాదించెడి, వెనుదీయక సత్యంబుఁ బల్కుము. లేనిచో గోపకులకుఁ బరస్పరంబు వివాదంబు సంభవించుట ధ్రువం బన యశోదాసహితుం డగు నన్నందుండు భయభీతుండై సవినయంబుగా నయ్యలారా! మున్ను కృష్ణవిషయంబున మన పురోహితుండగు గర్గమహర్షి వలన వినిన సూక్తులు మీరడిగినవానికిఁ బ్రత్యుత్తరంబు నీఁజాలును. కాన నాపైఁ గోపమూపి యాకర్ణింపుఁడు. పూర్ణావతారులగు కమలాకాంతుండును, రాముండును, శ్వేతద్వీపాధిపతియగు హరియు నరసింహుండును నక్షరుండును నరనారాయణమహర్షులు వర్ణక్రమంబుగా లీనమై యుందురను విషయంబు వ్యక్తం బొనరించు "కృష్ణ"యను నామంబున వ్యవహరింపఁ బడుచు వేదగుహ్యంబులగు వాసుదేవాద్యనంతనామంబులం దాల్చి ద్వాపరాంతంబును, గలియుగారంభంబు నగు కాలంబునఁ గంసాది దుష్టశిక్షణంబును, శిష్టరక్షణంబు నొనర్ప సకలబ్రహ్మాండనాయకుండగు పరమేశ్వరుండు పరిపూర్ణతమావతారుండై పుట్టి నీకుఁ బట్టియై పరిఢవిల్లుచున్నవాఁడు. ఇతఁడు వృషభాను గృహంబున జన్మించిన రాధావనితామతల్లికకు విభుండగు. ఇతనియందే సకల స్థావరజంగమంబులు విలసిల్లు. ఈతఁడు యుగక్రమంబున శ్వేతారుణ కృష్ణ పీత

వర్ణంబులం బొంది యుద్ధరణి నుద్భవిల్లు. మఱియుఁ గ్రమక్రమంబుగా నీతని లీలలు పరమాద్భుతకరంబులై ప్రవర్తిల్లునని యెఱింగి యాతనిపై మోహంబుఁ బొందకు మని వాక్రుచ్చె. ఇద్ధర నెల్లరకు బ్రాహ్మణవాక్యంబు బ్రహ్మవాక్యంబు గదా యని వాకొన నాలకించి గోపకులు మెచ్చక నందుని కిట్లనిరి. ౨౩

ఉ॥ ఈవనురీతి గర్గముని ♦ యిచ్చటికిన్ జనుదెంచినన్ మము
న్నీవపు డేలఁ బిల్వవొకొ? ♦ నిక్కమె యియ్యది? చాలుఁ జాల్నయా
భావవచస్సులెందుల క ♦ బద్ధము లాడకు మింకఁ గార్యముల్
నీవొకరుండవే సలిపి ♦ నెమ్మదిఁ జెందుచు నుండుమో ప్రభూ! ౨౪

తే॥ పలికి యిట్టుల వారు తద్వల్లవేంద్రు, లోగిలిన్ విడి యొక త్రుటిలోపల వృష
భానువరు దరి కరుదెంచి ప్రణతిఁ జేసి, సేమమడిగి యీచొప్పునఁ జెప్పి రయ్య!

ఆ॥ తొలుత మేము పలుకు ♦ పలుకుల నాలించి, నందుచుట్టఱికము ♦ నట్టులేక
విడిచి మనకులంబు ♦ విమలంబు జేయుమా, వల్లవకులకువల ♦ బంధుచంద్ర!

చ॥ అనవుడు తద్విభుండు విని ♦ యచ్చెరు వొందుచు ఘోషులార! గో
పనికరనాథనందవరు ♦ బంధముఁ ద్రెంపుమటంచు నాకుఁ గి
న్కను బలుకంగ సాగితిరి ♦ కారణమేమి? వచింపుఁడీ! యదే
మనమునకుం బ్రియంబయిన ♦ మానక మీ రనిన ట్లొనర్చెదన్. ౨౭

ఉ॥ నందుఁడొ కీర్తిశాలి నవ ♦ నందవిభుండును సర్వగోపకా
నందవిధాయకుండు ముని ♦ నాథనుతుండును మత్సఖుండు గో
విందుని తండ్రియై జగతి ♦ విశ్వజనీనుఁడుగాఁ జెలంగునే?
యెందుల కట్టివాని మన ♦ మిత్తఱి వీడుట మీరు సెప్పుఁడీ! ౨౮

తే॥ తప్పు లేనట్టి వస్తువు ♦ ధరణిలేదు, గానఁ దగినంత దోషంబుఁ ♦ గనఁబఱచుఁడి!
నాకు నచ్చినన్ విడుతు మా ♦ నందవిభుని, సందియంబిందు వలదోయి ♦ సరసులార!

ఆ॥ అంత వార లయ్య! ♦ యా నందవిభునకుఁ, గుల విరుద్ధుఁడైన ♦ కొడుకు పుట్టె
నతని పలుకుఁ బనులు ♦ నాకృతి యబ్రమా, నింతకంటె దోష ♦ మేమనవలె?

క॥ ఈదోషము వరుసఁగ మీ, మీఁదికి రాకుండ ముందు ♦ మేము వచింపన్
మీదరిఁ జేరితి మిష్టము, లేదా యిఁక మీకు మాకు ♦ లేవు ప్రియంబుల్. ౩౧

ఆ॥ అదియుఁగాక నీకు ♦ నాత్మజ యొక్కర్తు, గలదు సరిగ మదిని ♦ దలఁపుమయ్య!
యంచుఁ జెప్ప నాతఁ ♦ డానాఁడు నేవిన్న, గర్గసూక్తి వినుఁడు ♦ కనుఁడు నిజము.

చ॥ సకల జగన్నివాసుఁడును ♦ స్రష్టయు భర్తయు హర్త భక్తర
క్షకుఁడును నా పరేశుఁడు ర ♦ సాతలభారము దీసివేయఁగా
వికటమదం బణంపఁగను ♦ వేధ నుతింపఁగ నొప్పి నందపు
త్రకుఁడయి గోకులంబున వి ♦ రాజిలుచుండెను కృష్ణనాముఁడై. ౩౩

తే॥ త్వన్నికేతన మందు ను ♦ ద్భవము గన్న, రాధ గోలోకవాసిని ♦ రమ్యరూపి
ణియగు పరమేశ్వరిగ నెంచి ♦ నీవు మోహ, మందకుండుము వృషభాను ♦ బృందనాథ!

తే॥ మఱియు నీకుమారికకు నా ♦ హరికిఁ బెండ్లి, ధాతయే వచ్చి యమునకు ♦ దాపునందు
నెగడు బృందావనంబున ♦ నిర్జనముగఁ, గ్రాలు భాండీరవనిఁ జేయఁ ♦ గలఁడు ముందు.

తే॥ నీ కుమారిక కోర్కెచే ♦ నిఖిలగోప, చయము, గోవర్ధనాహ్వయ ♦ శైలవరము
గోవితతులును యమున బృం ♦ దావనంబు, పరమగోలోకముననుండి ♦ వచ్చె నిటకు.

ఉ॥ ఈరహిఁ బల్కి గర్గముని ♦ యేగెను తత్ప్రభృతిన్ మనంబునం
దారమణిన్ గుఱించి విశ ♦ యంబులఁ జెందక భక్తిఁ జూతు నా
ధీరసుధీరులార! ధర ♦ విప్రవరోక్తియ వేదవాక్యమై
తీరుపుఁ జెప్పఁగాదె మది ♦ దీర్ఘముగాఁ బరికింపుఁడీ యనన్. ౮౭

తే॥ ఆలకించిన గోపకు ♦ లబ్బురంబుఁ, జెంది క్రమ్మఱ వృషభాను ♦ శేఖరునకు
యుక్తియుక్తముగా నిట్లు ♦ లుచితరీతిఁ, బల్కఁదొడఁగిరి బహులాశ్వ ♦ పార్థివేంద్ర!

చ॥ సరిగనె యున్న పీవనిన ♦ సంగతులన్నియుఁ బాడి పంట బం
గరు రజతంబు రత్నములుఁ ♦ గాంచననిర్మితహర్మ్యముల్ మనో
హరమగు నారెముల్ బలము ♦ నర్థము సంపదకీర్తి గోవులున్
వఱలుచు నుండె నీకుఁ బలు ♦ భంగులఁ గంసుఁడు వొంగు భంగిగన్. ౮౯

ఉ॥ కాని త్వదుక్తరీతి వ్రజ ♦ కాంతుఁడు కాంచనరమ్యవేశ్మముల్
గాని సువర్ణభూషణని ♦ కాయముగాని యశోబలంబులన్
గాని మనోజ్ఞగోవులను ♦ గాని వదాన్యతఁ గాని యింకనె
ద్దానిని గాని నీకెనఁగఁ ♦ దార్కొననేరఁడు గాఁడె చూడఁగన్. ౯౦

క॥ ఎయ్యెడ నెయ్యంబునకున్, గయ్యమునకు వియ్యమునకుఁ ♦ గావలె సామ్యం
బియ్యెడ నది సూచుము మా, కుయ్యని విని నంకుతోడి ♦ కూర్మిని విడుమా! ౯౧

తే॥ అతనిసంబంధముల్ విడి ♦ మైలబిలుని, సరణి ధనియును గాన్యకు ♦ బ్జాపురపతి
యధిక బలియా బలందను ♦ నల్లునిగను, జేసికొనినచో లెస్సయై ♦ చెలఁగుఁగాదె.

ఉ॥ అంతియకాని కష్టముల ♦ నన్నితెఱంగులఁ బొందుచున్ గృషిన్
సంతత మాచరించెడి వ్ర ♦ జస్థితనందుని యాత్మజాతు నీ
చెంతకుఁ జేర్పవల్దతని ♦ చిన్ని సుతుండె పరేశుఁడైన మే
మంత గనుంగొనంగ వ్రజ ♦ మం దిపు డీవు పరీక్షఁ జేయుమా! ౯౩

చ॥ పలుకఁగ నిట్టులట్టి వృష ♦ భానువరుండును నాలకించి గో
కులపతి వైభవంబును న ♦ కుంఠితరీతిఁ బరీక్షసేయఁగాఁ
దలఁచి క్రియాళిసంఘటన ♦ దక్షులు యోగ్యులు భాగ్యవంతులు
జ్జ్వలులును నౌ వృషానుల వె ♦ సన్ బిలిపించె విదేహనాయకా! ౯౪

ఉ॥ ఆపయి నాతఁడా బుధుల ♦ నందఱు జూడఁగఁ గోట్లకొల్ది ర
త్నాపిత తారహారముల ♦ నామలకాభ విశేషదివ్య ము
క్తాపటలంబులన్ మణిక ♦ దంబము మూడలు బళ్ళెరంబులం
దోపిక నింపి యిచ్చి యుచి ♦ తోక్తులఁ గొన్నివచించి పంపెఁగా. ౯౫

ఉ॥ అంతట తద్వ్రజానులును ♦ నా వ్రజనాయకు గోష్ఠిఁ జొచ్చి నే
త్రాంతములన్ బ్రమోదజల ♦ మగ్గలికన్ గురియంగ భక్తి న
త్యంతము మ్రొక్కి కానుకల ♦ నన్నిటి నాదృతి నిచ్చి నమ్రులై
శాంతవచస్సులన్ బలుక ♦ సాగిరి నందుని కిట్లు భూవరా! ౯౬

ఉ॥ ఆవృషభానుఁ డాత్మతన ♦ యాకరపీడన మాచరింపఁగా
భావమునం దలంచి మముఁ ♦ బంపె నిటుల్ వరనిశ్చయార్థమై
కావున నొప్పి నీ సుతునిఁ ♦ గైకొని పెండ్లికిఁ దర్లి రండు క
న్యావరణార్థ మొండు నగ ♦ నర్మిలి మా కిడి యంపుఁడో ప్రభూ! ౯౭

చ॥ అనవుడు నందరాజు విని ♦ యల్ల యుపాయనముల్ గ్రహించి యో
జన సలుపన్ యశస్విని యు ♦ సాధ్వియు నైన యశోద చెంతకున్
జని వృషభానుదత్తమణి ♦ సంతతిమౌక్తిక తారహారకాం
చనములఁ జూపి తల్లపిత ♦ జాలముదెల్లము జేసె నల్లనన్. ౯౮

తే॥ శ్రీయశోదయుఁ దనభర్త ♦ సెప్పినట్టి, హరి వివాహ మహోత్సవం ♦ బాలకించి
యల్ల వృషభానుఁ డంపిన ♦ యాణిముత్తి,యములఁ గన్గొని నందుని ♦ కనియె నిట్లు.

ఉ॥ శౌరివివాహవార్త విన ♦ సంతస మయ్యెడిఁగాని యిత్తఱిన్
వారు వరార్థమై మణులు ♦ బంగరుసొమ్ములు మౌక్తికంబు ల
వ్వారిగ నిట్టులన్ మనకుఁ ♦ బంపిరి గ్రమ్మఱఁ దద్విధంబునన్
వారికి నంపినన్ మిగుల ♦ బాగుగ నుండును గాని యారయన్. ౧౦౦

చ॥ ధనము సువర్ణభూషలును ♦ దారములున్ వరహారముల్ మణుల్
ఘనముగ నే నొసంగఁ గలఁ ♦ గాని తదాకృతి నొప్పు మౌక్తికం
బు నొకటి యేని లేమి నిడు ♦ పూనిక లేదిఁక నేమొనర్తు? వా
నిని నిడకున్నచో యశము ♦ నీలిమ సెందదె? ప్రాణనాయకా! ౧౦౧

తే॥ కానఁ గర్తవ్యమేమొ ప ♦ ల్కంగఁదగు న, నంగ నందుఁడు సరియని ♦ నందనపరి
ణయము నిట్టి ముత్తెంబులు ♦ నాకుదొరకి, నపుడొనర్తు నం చెంచి యే ♦ మనకయుండె.

తే॥ ఇట్టి జాడ సర్వజ్ఞుఁడౌ ♦ కృష్ణుఁ డెఱిఁగి, యల్లముత్యాల నురువుగా ♦ నగుపడునవి
కతము దొంగిలి చని బహి ♦ స్థ్సలమునందు, నాటెఁ గృషికుఁడు బీజముల్ ♦ నాటినట్లు.

చ॥ పదపడి నందరాజు వృష ♦ భానుఁడు పంపిన మౌక్తికంబుల
న్గొదకొని తెక్కసేయ నొక ♦ నూటెటొ తగ్గుటఁ గాంచి యేమిరా!

యిది ! బలి యాటకై కొనెనొ ♦ కృష్ణుఁడు గైకొనెనో మఱెవ్వరి
య్యది యెటు లాచరించిరొకొ ? ♦ యంచు విచారణసేయ నెంచుచున్. ౧౦౪

చ॥ తొలుతను కృష్ణసన్నిధికి ♦ దూఁకుడుగాఁ జని యిద్దియేమిరా !
చిలిపిపనుల్ త్యజింపవుగ ♦ ఛీ యిపు డిచ్చట నున్న ముత్తియం
బులఁ గొనియుంటివే యిటకుఁ ♦ బోకిరు లెవ్వరు వచ్చినట్లు నేఁ
దలఁపను నీవుగంటివె ? య♦థార్థముఁ దాఁపక చెప్పుమో సుతా ! ౧౦౫

క॥ అప్పురుషోత్తముఁ డపుడో, యప్పా ! శతమౌక్తికముల ♦ నంది వెలుపలన్
గొప్పఁగ నాటితిఁ గృషికుల, చొప్పునఁ దప్పైనఁ గొట్టు ! ♦ చుల్కనఁగనుచున్.

చ॥ అనవుడు నందుఁ డోరితులు ♦ వా ! యెటు లిప్డు పాతించి యెట్టి నే
లను వెదజల్లియుంటివో వి ♦ లంబము సేయక వచ్చిచూపుమా !
యని హరితోడఁ దా నరిగి ♦ హాంగగు బంగరు కొమ్మలాకులన్
ఘనమగు చెట్టులం దసిరి ♦ కాయలఁ బోలిన ముత్తెములు గ్గనెన్. ౧౦౬

తే॥ కాంచి యాతండు వెన్నుని♦గౌఁగిలించి, ముద్దులాడియు నాయనా!♦మొదల వృథగ
మొరటుగ నిను దండించితి♦బుద్ధి నఱయ, నీవు పరమాత్మవని తోఁచె♦నిశ్చయముగ.

తే॥ కొడుకు కొడుకన్న నందలు ♦ గొడుకు లగుదు
రొక్కొ ? యీఫక్కిఁ దలిదండ్రు ♦ లబ్బునట్లు
మంచిపనులను సల్పు కొ ♦ మరుఁడె కాక
యహహా ! యద్భుతానందంబు ♦ లబ్బె నేఁడు. ౧౦౯

ఉ॥ వాకొని యిట్లు రిక్కలు న ♦ భంబునఁ బర్విన మాడ్కిఁ జెట్లపైఁ
బ్రాకిన మౌక్తికంబులను ♦ బండ్లను గోటి గ్రహించి యవ్వి శో
భాకరహైమపాత్రముల ♦ యం దిడి కంకణకాంచికింకిణుల్
గోకలు హారముల్ మణులు ♦ కోట్లకొలందిఁగఁ గూర్చి కూర్మితోన్. ౧౧౦

ఉ॥ సత్తములౌ వృషానులకుఁ ♦ జక్కఁగ నిచ్చి సునీరులార ! మీ
రెత్తఱిఁ బెండ్లిమూర్తమని ♦ యిచ్చుటికిన్ మఱియేగుదెంతురో
యత్తఱి వేడ్క నెల్లరము ♦ నచ్యుతుతోఁ జనుదెంతు మిప్పుడీ
యుత్తమపారితోషికము ♦ లుగ్గలికై యిడియుంటి మేగుఁడీ ! ౧౧౧

చ॥ అని యనుపన్ వృషానులు మ ♦ హాద్భుతహర్షము లొంది వాని వీ
డ్కొని వృషభానువర్యసభ ♦ కుం జని నేతకు వందనంబులన్
బొనరిచి గోకులేశ్వరుఁడు ♦ బుద్ధిమదగ్రణి యైన నందుఁ డం
పిన కరదంబు లిచ్చి సర ♦ విన్ బలుకాడఁ దొడంగి రిట్టులన్. ౧౧౨

తే॥ దేవ ! మీయాజ్ఞఁ గైకొని♦దివ్యమైన, వ్రజమునకుఁబోయి నందుని♦భవనమునకు
నేగి బహుమానముల నిచ్చి♦యీర లనిన, పలుకులాడితి మాతని♦ఫణితి వినుమ !

మ॥ పలుకా తేనియలొల్కు ధనమా ♦ పౌలస్త్యకోశాభముల్
బలమా శత్రుభయంకరంబు గృహమా ♦ స్వారాడ్గృహశ్లాఘ్యమౌల్
జెలియా పూతచరిత్ర సుతులా ♦ శ్రేష్ఠుల్ సుహృల్లోకులా
యలఘుల్ గోవులు కామధేనువులు సూ! ♦ యా నందభూనేతకున్. ౧౧౪

తే॥ సిరియు సంపత్తు రెండును ♦ సరిగ వఱలు
విలువగల రతనంబులు ♦ వెల్లివిరియు
దివ్యముక్తాతరుప్రతతి ♦ తియ్యఁ జెలంగు
నందసుందరమందిరం ♦ బందు దేవ! ౧౧౫

క॥ మీరలు పల్కినభావము, లూరీకృతమగుడు గోప ♦ కోత్తముఁడు వెసన్
గోరికఁ గన్యార్థముగ న, పారముగాఁ గానుక లిటులఁ ♦ బంపెను గనుమా!

క॥ నందుఁడు కేవలకృషికుఁడే, యందముగాఁ జేయుననెడి ♦ మాటను గర్గుం
బందునఁ బడనీయకుమీ, యందఱికిన్ మించినాఁడ ♦ టంచుఁ దలఁపుమీ!

ఉ॥ ఆవల గోపు లాపలుకు ♦ లన్నిటిఁ దిన్నఁగ నాలకించి యా
హా! వృషభాను వాక్యములె ♦ యక్షరరీతి యథార్థమయ్యె రా
ధావనజాక్షి యాహరికి ♦ దారయు నామెకు నట్టి కృష్ణుఁడే
జీవితనాయకుం డగుచు ♦ శ్రీహరియే పరమాత్ముఁడౌఁ జుమీ. ౧౧౮

చ॥ మఱి వ్రజనాయకుం డధిక ♦ మాన్యుఁడు దక్షుఁడు భాగ్యవంతుఁడున్
సరసుఁ డటంచుఁ దోఁచెడిని ♦ సాంతముగా మన పల్కులెల్ల ద
బ్బర లగుచుండె నంచు వృష ♦ భానునకున్ నతులం బొనర్చి పో
యి రతఁడు సంతసించె జను ♦ లెల్లరు హర్షముఁ బొంది రో విభూ! ౧౧౯

క॥ శక్తిని నెచ్చట శ్రీహరి, ముక్తాక్షేపంబుఁ జేసె ♦ ముచ్చట నచ్చో
ముక్తాసరసియగును నట, మౌక్తిక మిడు నరుఁడు ముక్తి ♦ మలయును జనకా!

తే॥ అనఁగ జనకుండు ముదమున ♦ నమరమునికిఁ, గ్రమ్మఱన్ బల్కె నిట్టులో ♦ తాపసురేంద్ర!
గోవర్ధనగిరి నెన్ని ♦ గొప్పతీర్థ, ములు సెలంగునో తత్త్వస్థితిఁ ♦ దెలుపుమయ్య!

ఉ॥ నావుడు మైథిలేశునకు ♦ నారదుఁ డిట్లను గోవర్ధన
గ్రామము సర్వతీర్థ తిల ♦ కం బతిరమ్యము గోపగోపికా
గోవితతివ్యథాహరణ ♦ కోవిదతావిదితంబు వెండి బృందా
దావన మల్లక్షేత్రములఁ ♦ దద్దయుఁ బెద్దద టంచు నెంచుమా! ౧౨౨

వ॥ మఱియు నగ్గిరివరం బింద్రయాగం బధఃకరించి యఖిలాండకోటిబ్రహ్మాండ నాయకుండును భగవానుండును బరాత్పరుండును బరిపూర్ణతమావతారుండును గోలోకేశ్వరుండును స్వాయంభువుండునగు శ్రీకృష్ణునిచే మంత్రతంత్రయంత్రసమన్విత పూజాపురస్కారంబులం బొంది యఘనాశనియగు మానసీగంగను శుభ్రంబును

శుభ్రప్రదంబును శుద్ధంబును నగు చంద్రసరోవరంబును గుసుమాకరసరోవరంబును గోవిందకుండంబును రాధాకుండంబును గృష్ణకుండంబును లలితాకుండంబును గోపాలకుండంబును గలిగి కృష్ణప్రియంబై పూర్ణబ్రహ్మతపత్రంబై గోలోకము కుటంబై విలసిల్లు. అం దర్భకసహితంబుగా దేవకీగర్భసంభూతవిశ్వగర్భుండు క్రీడలాడె. వెండియు నక్కొండ యందలి శ్రీకృష్ణశీర్ష స్పర్శసంజనితలాంఛనాంచితశిల మాలిశిల యనంబరఁగె. అందు గోవిందుఁ డెందుఁగందుకఖేలనం బొనరించెనో యాస్థలంబు కందుకక్షేత్రంబన వన్నెకెక్కె. ఏయశ్మంబునం జిత్రంబు లొనర్చెనో యది చిత్రశిల యని వ్యవహృతంబయ్యె. ఏపాషాణంబున నాహృషీకేశుండు క్రీడారతుండై వాగ్వాదం బాచరించెనో యది వాదని యనం బ్రసిద్ధంబయ్యె. ఏ నేల గోపాలబాలుండు బాలకసహితంబుగా బ్రేల యుష్ణీషంబుల దొంగిలించెనో యద్ది యౌష్ణీషతీర్థంబని విదితం బయ్యె. ఎవ్వ రా మలఁగల పూర్వోక్తపుణ్యతీర్థంబులను శ్రద్ధాభక్తులం గని యందగపడు శక్రపదంబులం గాంచి బ్రహ్మపదంబుల నెఱిఁగి కృష్ణపదంబుల సంచరింతురో యవ్వారు పంచమహాపాతకులైనను పావనులై యైహికసుఖంబులను సమగ్రంబుగా ననుభవించి యవసానంబున విష్ణుపదంబుఁ జెందఁగలరు. తన్నగప్రభావం బభివర్ణింపఁ జతుర్ముఖ పంచముఖ షణ్ముఖ సహస్రముఖప్రముఖులును శక్తులు గానేర రనిన నాబోంట్లకలవి గాదని పల్కి నలయుసే యని మఱల నిట్లనియె.	౧౨౩

## దధిహరణ లీల.

తే॥ ఒక్కయెడ హరి తద్గిరి♦నొప్పుచుండు, మురళిఁ దాలిచి యూఁదుచు ♦ నరుగుతఱిని
బెరుఁగు నమ్ముబ్రవేతలఁ గాంచి ♦ పేరుతోడ, నడ్డి కేలిడి యిట్లనె ♦ సడ్డలేక.

క॥ అలుగఁకుఁడీ! చెలులారా!, తొలఁగకుఁడీ యిందునుండి ♦ దూఁకుడుమాటల్
బలుకకుఁడీ పెడభావము, దెలుపకుఁడీ గోపికాస ♦ తీమణులారా!	౧౨౪

క॥ అందుఁడు నా కరకమలముఁ, బొందుఁడు మనసార సౌఖ్య ♦ ముల నాతోడన్
జెందుఁడు దమి విహరింపఁగ, నొందుఁడు రమణీయవనుల ♦ నుగ్మలులారా!

తే॥ సుందరీమణులార! యీ♦యందగాఁడు, మీకు నీక సంభవించునే?♦మెలఁగిచిత్త
మందు మీరు యోజించుఁడీ♦యదనుదప్పఁ, బదనుదప్పనుగాదె యో♦పడఁతులార!

ఆ॥ పలుక నటుల నల్ల ♦ వల్లవపుల్లాబ్జ, నయన లల్ల వికచ ♦ నలిననేత్రు
కరసరోజము దొలఁ ♦ గంగ జేయుచు నిట్లు, పలుకఁ దొడఁగి రయ్య♦ పార్థివేంద్ర!

శా॥ పో పో పోకిరీ! త్రోవలోన నిటు మ ♦ మ్మొం బట్టుటల్ పాడియే?
నీపోకిళ్లుఁ గారిపోను దలఁపన్ ♦ నీతల్లి దండ్రుల్ జెఱన్
భూపాలాజ్ఞను గట్టమొందరొకో? నీ ♦ వో పెర్గుపా లెప్పుడున్
గోపాగారములందు దొంగిలివె యో ♦ గోపాల చాల్ జాలురా!	౧౨౫

తే॥ అనఁగ వినినట్టి హరి, హరి♦కి నియె నిట్టు,ప్రబలుఁడైనట్టి కంసు స♦బాంధవముగఁ
జంపి యిటకేను దెత్తు నా♦శక్తిఁ గనుఁడు, పెండ్లి యాడుఁడు నన్నిప్డు♦వెలఁదులార!

క॥ అనవుడు వ్రేతలు దానికి, ననుమతి జూపక వచింప ♦ హరి విని వేత్రం
బునఁ దచ్ఛ్వేతసిత దధి, ఘన భాండములెల్లఁ బగులఁ ♦ గాఁ బ్రహరించెన్. ౧౩౧

ఆ॥ అద్ది గాంచి యల్ల ♦ యాభీరనారులో, పంకజాక్ష! పెరుఁగు ♦ భాండములను
బగులఁగొట్టితివిగ ♦ బళిర మీ తలిదండ్రుఁ, లకు వచింతు మంచ ♦ లయక చనిరి.

ఉ॥ ఆపయి నచ్యుతుండు ముద ♦ మందుచు సందిదె యంచు మిత్రులన్
దాపునఁజేర్చి తృప్తిపడఁ ♦ దద్దధి నీవపలాశదివ్య ప
ర్ణాపితమైన దొన్నెలను ♦ హాయిగఁ బోయుచుఁ గ్రోలె నాస్థలం
బోపతి! "ద్రోణతీర్థ"మన ♦ నొప్పు సఘాచలవజ్రకల్పమై. ౧౩౩

ఆ॥ అందుఁ జెట్ల కొమ్మ ♦ లాకులు దొప్పల, వలెఁజెలంగు నింత ♦ వఱకు నెవఁడు
పెరుఁగు దాన మిచ్చి ♦ యొరిగిలఁజేయునో, వాఁడు గోజగతిని ♦ వఱలు స్థిరత.

## గిరిరాజ విభూతి వర్ణనము

తే॥ ఏస్థలంబునఁ గమలాక్షుఁ ♦ డీక్షణముల, మూసి చెలులతో దాఁగిలి♦మూఁతలాడె
నద్ది పుడమి లౌకికతీర్థ ♦ మనఁగ నొప్పి, పాపరాశులఁ ద్రోలెడిఁ ♦ బట్టుఁబట్టి.

తే॥ ఎందు వెన్నుఁడు సఖులతో ♦ నిటుల నటుల,నింబుగాఁదిర్గె నద్ది క ♦ దంబఖండ
తీర్థ మన నొప్పి తన్ను భ ♦ క్తిని నుతించు,నరుని నారాయణుంజేయు ♦ నట్టులేక.

తే ఎచట శ్రీహరి రాధతో ♦ నెసఁగి రాస, ఖేలనంబున శృంగార ♦ మోలిఁగాంచె
నద్ది శృంగార మండలం ♦ బనఁగ నొప్పి, యల్ల గోవర్ధనాద్రియం ♦ దతిశయిల్లు.

తే॥ ఎట్టి రూపముతోడుతఁ ♦ గృష్ణమూర్తి, గోప్రవర్ధనగిరి నెత్తి ♦ గోపకులను
గాచె నారూప మిప్పుడున్ ♦ గాంచఁబడెడి,నట్టి శృంగారమండలం ♦ బందు జనక!

తే॥ రమణమీఱెడి కలియుగా ♦ రంభకాల, మందు నాల్గువేలెనిమిది ♦ వందలేడు
లరుగ శృంగారమండలం♦బందు నచల, బిలము నడుమను హరిరూపు♦వెడలఁగలదు

శా॥ ఆరీతిన్ దగు చక్రి దేవదమనా ♦ ఖ్యన్ బిల్వ నెల్లప్పుడున్
ధీరుల్ సన్నుతిసేయు లీలలను నెం ♦ తేన్ జేయు నవ్వాని నె
వ్వారల్ భక్తిని వేదశాస్త్ర విధులన్ ♦ ప్రార్థింతురో వారు పా
పారణ్యంబును దాఁటి పుణ్యపురికిన్ ♦ హర్షంబుతోఁ బోవరే. ౧౪౦

తే॥ భరత వర్షంబునం దొక♦ప్రక్కయందు, ద్వారకా నాథుఁడొకదెసన్♦బదరినాథుఁ
డొక్కమూల జగన్నాథుఁ ♦ డొక్కచక్కి,రంగనాథుండు నొప్పున ♦ భంగభంగి.

తే॥ ఇటుల నల్వురౌ నాథుల♦నెత్తఁగి నడుమ, గోప్రవర్ధననాథుఁడు♦గుదురుకొనియె
నాథపంచక మీక్షించు ♦ సాధుబృంద,మవ్యయంబగు గోలోక ♦ మందు నుండు

తే॥ యాత్రఁ జేసెడి మానవు ♦ లఖిలనాథు, లను గనుంగొని గోవర్ధ ♦ నగనాథుఁ
గాంచరో వారు యాత్రచేఁ ♦ గలుగు ఫలము, సెందఁజాలరు శంక కిం ♦ చిత్తు లేదు

తే॥ పంచనాథుల ప్రోలను ♦ బాధితులకు, శరణమగు ధర్మమంటప ♦ స్తంభములును
గలవు వానిని నెవ్వఁడు ♦ గనునొ యట్టి, నరుఁడు నారాయణుండయి ♦ వఱలు మఱియు

తే॥ నడచి యాత్రలఁ జేయని ♦ నరులు నల్వు, రైన నాథులఁ జూడని ♦ మానవులును
గోవర్ధన గిరినాథుఁ ♦ గోర్కెఁ గనిన, సర్వఫలములఁ గాంతురో ♦ జనకరాజ!

తే॥ మఱియు నైరావతాహ్వయ ♦ కరిపదాంక, ములును దేవేంద్రపదచిహ్న ♦ ములును విష్ణు
పాణి పద లాంఛనంబులా ♦ పర్వతమునఁ, దనరు నవి గాంచు మానిసుల్ ♦ ధన్యతములు.

తే॥ పైనిఁ జెప్పిన చొప్పున ♦ బహుళపుణ్య, తీర్థముల్ గోవర్ధనా ♦ ద్రివరమునకు
నవయవంబులుగా నుండు ♦ నమలచరిత!, యింక నెయ్యది వినదవో ♦ యెఱుఁగఁ జెపుమ!

తే॥ అనఁగ జనకుఁ డేతీర్థము ♦ లే యవయవ, ములుగఁ దద్గిరి కయ్యెనో ♦ తెలుపుమయ్య!
జ్ఞానివర! యన్నఁ దన్నారక ♦ మానివర్యుఁ, డిట్లు వత్సలతఁ వచి ♦ యింపఁ గడఁగె.

వ॥ భూపా! సకల భూతంబుల సర్వాంగంబులందుఁ బొందుపడియున్న బ్రహ్మంబున కవయవవిభాగం బేర్పరచుట దుర్ఘటంబగు నట్లి గోవర్ధననాథునకు నానుపూర్విగా నంగంబుల నిష్కర్షించుట దుష్కరంబని యెఱుంగుము. ఐనను ప్రసిద్ధంబులైన యంగంబు లేయే తీర్థంబులుగాఁ జెలంగెనో యది నాయెఱింగిన కొలఁది విన్నవించెద. వినుము. ఎచ్చోట గోకులవాసులు పూజాపురస్సరంబుగా నన్నకూటంబు సమర్పించిరో యెద్దానికి శృంగారమండలం బుపరిభాగంబున నుండునో యా రమ్యస్థలం బచలనాథునకు ముఖంబును, మానసీగంగ నేత్రంబులును, జంద్రసరోవరంబు నాసికమును, గోవిందకుండం బధరంబును, కృష్ణకుండంబు చిబుకంబును, రాధాకుండంబు రసనయు, లలితాకుండంబు కపోలంబులును, గోపాలకుండంబు కర్ణంబులును, కుసుమాకర సరోవరంబు కర్ణాంతంబులును, మౌలిశిల లలాటంబును, చిత్రశిల శిరంబును, వాదినీశిల కంఠంబును, కందుకక్షేత్రంబు పార్శ్వంబులును, నాష్ణీషకుండంబు కటియును, ద్రోణతీర్థంబు పృష్ఠంబును, లౌకిక తీర్థం బుదరంబును, కదంబఖండతీర్థం బురంబును, శృంగారమండలంబు జీవంబును, శ్రీకృష్ణ పదలాంఛనంబులు మనంబును, దద్ధస్తచిహ్నంబులు బుద్ధియును, నైరావతాంకంబులు పదంబులును, పుచ్ఛకుండంబు వాలంబును, కామధేను పాదపాళులు బాహువులును, వత్సకుండంబు బలంబును, రుద్రకుండంబు రౌద్రంబును, శక్రకుండంబు కామంబును, కుబేరతీర్థం బుద్యోగంబును, బ్రహ్మతీర్థం బనుగ్రహంబును, యమతీర్థం బహంకారంబును నై విరాజిల్లు నని పెద్దలు వక్కాణించిరి. ఇట్టి గిరివరంబు హరి యురంబునఁ బ్రాదుర్భవించి పులస్త్య తేజఃపుంజంబున నచ్చటికి వచ్చి సర్వపాపంబుల గచ్చువిచ్చొప్పరించుచు సాటిలేనిదై మించె. ఏతన్నగవిభూతికథాశ్రవణతత్పరు

లఘురహితులై పునర్జన్మంబుఁ గాంచక గోలోకమం దానందం బనుభవింతురని గుర్తెరుంగు మన విని బహులాశ్వుండు మునివరున కిట్లనియె.

మ॥ గిరిరాడ్ఖ్యాతిని నాకుఁ దెల్పితివి కో ♦ ర్కిన్ వింటిఁ దచ్చైల మా
హారి వక్షంబున నెట్లు పుట్టినది వ ♦ ల్లాడంగ నే వేఁడితిన్
సరసజ్ఞానధురీణ! నా మునియు రా ♦ జా! యల్ల గోలోక భా
సుర గోవర్ధనజన్మగాథ విను మం ♦ చున్ జెప్పఁ దొడ్గెన్ జుమీ. ౧౫౦

గిరిరాజోత్పత్తి వర్ణనము.

ఉ॥ సత్యుఁ డనంతుఁడున్ బరుఁడు ♦ జ్ఞాని విశుద్ధుఁడు నైజసిద్ధుఁడున్
నిత్యుఁ డనన్యుఁ డవ్యయుఁడు ♦ నిర్గుణుఁడున్ బ్రమదస్వరూపుఁడున్
బ్రత్యవహారభాసురుఁడు ♦ భర్తయు హర్తయు గర్తయున్ ముని
స్తుత్యుఁడు కాలరూపుఁ డఘ ♦ దూరుఁడు పూర్ణుఁడు కృష్ణుఁ డొప్పఁగా. ౧౫౧

ఉ॥ ఆతని వీడి మానస మ ♦ హంకృతి చిత్తము బుద్ధియున్ మహా
భూతములున్ మహత్తులు వి ♦ భుండు బలుండు గుణత్రయంబు బ్ర
ద్యోతనుఁడున్ గళానిధియు ♦ నుర్వియు నూర్ధ్వము దిగ్చయంబు జీ
మూతము నిర్వవం చెలుఁగు ♦ భూవర! యాహరి యిచ్ఛ నాదిలోన్. ౧౫౨

శా॥ వాలాయంబుగ శేషుఁడై బిసరుచిన్ ♦ భాసిల్లి యూరుస్థలిన్
లీలాలోలతమంబు మానవచతు ♦ ర్లిప్సాప్రదంబైన శ్రీ
గోలోకంబు సృజించి పాదమున ది ♦ క్కూలంకషోర్మిచ్ఛటా
వ్యాలీఢత్రిపథప్రసారచతురన్ ♦ భాగీరథిన్ గాంచియున్. ౧౫౩

సీ॥ వామాంసమందున ♦ వాహినీవరయైన, కాళిందినిం గుతు ♦ కమునఁ గాంచెఁ
జీలమండను గడు ♦ జెన్నువహించెడి, రాసమండలమును ♦ రాణఁ గాంచె
జానుపులందున ♦ సర్వ వనంబుల, నింబగు బృందావ ♦ నంబుఁ గాంచె
నూరుపులందున ♦ నుత్తమోత్తమమైన, లీలా సరోవరం ♦ బొలిఁ గాంచెఁ

తే॥ గటిని నవరత్నఖచితమౌ ♦ కనకభూమిఁ, గాంచె నుదరరోమావళిన్ ♦ గ్రమమాధ
వీలతలఁ గాంచె నాభిని ♦ వేలకొలఁది, వివిధవర్ణాంచితాబ్జముల్ ♦ వేడ్కఁ గాంచె.

చ॥ మఱియును జక్రి జంఘముల ♦ మాధవమాధురిసాధువున్ సరో
వర రుచిరంబు భృంగరుతి ♦ భాసురమున్ సుమనోమనోజ్ఞమున్
సరస విహంగ సంగతము ♦ చత్వరహర్మ్యసభాసమేతమున్
గురుతర భాస్వరంబయిన ♦ కుంజముఁ గాంచె మహోల్లసంబునన్. ౧౫౪

తే॥ జత్రుదేశంబులందు వి ♦ చిత్రములగు, ద్వారకా మధురాపురుల్ ♦ పరిఢవిల్లె
భుజములందున శ్రీదామ ♦ ముఖులు నష్ట, పార్షదుల్ బుట్టిరా పీత ♦ పటున కింక.

మ॥ త్రివళిప్రాంతములన్ సుగంధయుతమా ♦ దివ్యానిలం బొయ్యను
ద్భవమయ్యెన్ మణిబంధయుగ్మమున నం ♦ దశ్రేణి జన్మించె రో
మ వితానంబున గోపవంశమును జ ♦ న్మం బొందె బుద్ధిన్ లతా
నివహంబుల్ తృణగుల్మముల్ గలిగె ని ♦ ర్నిద్రప్రతాపోదయా! ౧౫౭

వ॥ వెండియు నా బ్రహ్మాండనాయకునకు ౧౫౮

చ॥ మనమున గిబ్బ గిడ్డలు స ♦ ముంజసరీటిఁ దగెన్ గరాగ్రమం
దున నుపనందులున్ దగిరి ♦ దోర్యుగమూలములందుఁ బొందికన్
ఘన వృషభాను షట్కమును ♦ గన్పడె దాపల మూఁపునందు గో
రవిభిదకాంతిపుంజము వి ♦ రాజిలె రాజ! యనంతరంబునన్. ౧౫౯

తే॥ దానినుండి లీలయు, సిరి ♦ ధాత్రి విరజ, లనెడి వనితామణులు వెల్గ ♦ రందు లీల
యను లతాంగిని శ్రీరాధి ♦ కాఖ్యఁ బిలుతు, రామె హరిసతులందు ము ♦ ఖ్యగఁ జెలఁగు

ఉ॥ ఆయమ దివ్యబాహుయుగ ♦ మందుఁ దనర్చ లలితావిశాఖలన్
దోయలు లిద్ద రొప్పిరిఁకఁ ♦ దోయజలోచనలైన గోపికల్
బాయక యామె కేశముల ♦ భాసిలి రట్టుల గోజగంబు భా
గ్యాయతనంబుగా సలిపె ♦ నా కమలాలలనేశుఁ డంతటన్. ౧౬౧

ఉ॥ దేవుఁడు దేవపోషకుఁడు ♦ దేవనుతుండును వాసుదేవుఁడున్
భావజకోటిమోహనుఁడు ♦ భక్తవశుండు పరాత్పరుండు శి
ష్టావనతత్పరుండు నగు ♦ నచ్యుతుఁ డగ్గలమైన వేడ్క రా
ధావనజాక్షితోఁ గలిసి ♦ తత్పృథు గోజగమందు నొప్పగన్. ౧౬౨

చ॥ ఒకపరి వేణుగానరవ ♦ యుక్తము భామినినూపురధ్వని
ప్రకటితమున్ సువర్ణగృహ ♦ వప్రసభాంగణ హర్మ్యరమ్యమున్
సకల లతాప్రసూనఫల ♦ సంయుతమున్ జననేత్రరామణీ
యకమగు రాసమండలము ♦ నందున రాధిక, భర్త కిట్లనెన్. ౧౬౩

తే॥ జీవితేశ్వర! నాపైనిఁ ♦ జెలిమి నిశ్చ,యముగ నున్నచో నీతోడ ♦ నంతరంగ
మందు నుండెడి భావంబు ♦ నఱుముఱలను,విడిచి నుడివెద నావుడు ♦ వెన్నుఁ డపుడు.

ఉ॥ దాని వచోవిలాసమును ♦ దాని సుధాకరతుల్యవక్త్రమున్
దాని మదేభయానమును ♦ దాని లసన్మధురాధరంబునున్
దాని శరీరసౌష్ఠవము ♦ దాని మనోజ్ఞవిభావహావముల్
దాని కటాక్షము ల్గని ము ♦ దంబును బొందుచు నామె కిట్లనెన్. ౧౬౪

తే॥ నీదుభావమునందున ♦ నిలిచియున్న, యాశయంబును దెలుపుము! ♦ యద్ది యొసఁగఁ
దగనిదైనను నీపైని ♦ తమకమునను, నిడుదు స్పష్టీకరింపుమో ♦ యమ్మలాఁడి!

క॥ అనవుడు రాధిక యిట్లను, వనజాక్షా! యమునతటిని ♦ వఱలెడి బృందా
వనిఁ గుంజముదరి గూఢమ,యిన దేశము రాసమునకు♦నేర్పరచు మనన్. ౧౬౭

చ॥ హరి శ్రవణంబులార విని ♦ యట్టులె యం చరుసంబుతోడ న
చ్చెరువును గొల్పు భూమిని ర ♦ చింపఁగ నెంచి సమస్తలోకముల్
గరముఁ బరీక్ష సల్పి యెటఁ ♦ గన్గొనఁజాలక స్వీయనేత్రతా
మరసములన్ స్వవక్షము న ♦ మందముగాఁ గని నంతమాత్రనే. ౧౬౮

శా॥ గోపీ వ్యూహము సూచుచుండ నల నై♦ కుంఠోరువక్షంబునం
దాపేక్షన్ సజలప్రభాపటల మ ♦ త్యంతంబుఁ దోఁతెంచి క్రీ
డాపాత్రంబగు రాసభూమిఁ బడి గు ♦ ట్టంబోలు రూపంబుతోఁ
బాపధ్వంస కృతిప్రశస్త మగుచున్ ♦ భాసిల్లె నంతంతకున్. ౧౬౯

సీ॥ శ్రీఫలమన్మథ ♦ చిత్రకవకుళక, దంబ రంభాముఖ ♦ తరువరముల
మల్లికా మాలతీ ♦ మాధవీ చంపక, పారిజాతాది పు ♦ ష్పనిచయములఁ
గీరపారావత ♦ శారికాపరభృత, సారస భృంగాది ♦ సరసరుతుల
స్నానపానోచిత ♦ స్వాదూదకోల్లస, న్నీరజవ్యాపృత ♦ నిర్ఝరములఁ

తే॥ జెలఁగి శతకోటి యోజన♦ములను గ్రాలు, శేషుఁబోలిన లంబంబు♦నెంది లక్ష
యోజనంబుల వెడలుపు♦ నొంది యొను,పదులకోట్లామడల యెత్తు♦వఱలి ప్రబలె

తే॥ స్వర్ణకలశోజ్జ్వలత్సౌధ ♦ సరణి నద్ది, కోటియోజన విస్తృత ♦ కూటశతక
ములను వెలుఁగు గోవర్ధనా♦చలమని శత,శృంగమని దానిఁ బిలిచెద♦రిలను జనులు

ఉ॥ అత్తఱి గోజగజ్జనము ♦ లర్ఝురె! యొక్కక్షణంబులోన నీ
యెత్తు, విశాల, మాయతము ♦ లీ మల కెక్కడనుండి నేవిధిన్
హత్తెనొ యంతకంత కిది ♦ యంతయుఁ గ్రమ్ముచుఁ బెర్గుచుండె హా
చిత్తము దత్తరిల్లెడిని ♦ జేయుట కేమియుఁ దోఁప దక్కటా!

తే॥ అద్ది గనుఁగొని వనజాక్షుఁ♦డద్రిఁ జేతఁ, జఱచి యేల గోవర్ధనా♦చల! యిదేమి
జగముఁ గ్రమ్ముచుఁ బెరిగెద♦విఁగను నిలువు,మంచు శాసింప నాగుట్ట♦యట్టె యాగె.

ఆ॥ అంత వెన్నుని చెలి ♦ యైన తద్రాధిక, నయనపర్వ మిడెడు ♦ నగవరంబు
నందు గూఢమైన ♦ యనుఁగుచోటును గాంచి, శౌరితోడఁ గూడి ♦ చేరె ధీర!

ఉ॥ ఆవల నగ్గిరీంద్ర మల ♦ యచ్యుతు నానతి సర్వపుణ్యతీ
ర్థావృతమున్ దిరస్కృత ఘ ♦ నాసితకాంతియుతంబు నాదితే
యావళి హర్షదాయకము ♦ నై యల ద్రోణుసతిన్ జనించి మో
దావహమైన గోకులము ♦ నందుఁ జెలంగెఁ బులస్త్యనీతమై. ౧౭౫

ఉ॥ ఎట్టులఁ దత్పులస్త్యముని ♦ యెందుల కాగిరిఁ దెచ్చి యిచ్చటన్
బెట్టెనొ యట్టివార్త విని ♦ పించితి మున్నిఁక దన్మునీంద్రుఁ డా

గుట్టల మేలుబంతి కల ♦ గోజగమందున హెచ్చిన ట్లిటుల్
బిట్టుగఁ బెర్గునేమొ యను ♦ భీతిని శాపమిడెన్ క్షయార్థమై. ౧౭౬

క॥ అనెడి సమాచారంబును, మును సెప్పితిఁ గాదె! యిట్టి ♦ భూధరజన్మం
బును విన్నవార లందఱు, గనరే గోలోక బహుసు ♦ ఖంబుల జనకా! ౧౭౭

## గిరిరాజ మాహాత్మ్యము.

క॥ ఏతద్గిరిమహిమంబున, నైతిహ్యము వినుము విజయుఁ ♦ డను బాపఁడు త
ద్గౌతమి తీరం బందున, భూతలజనవంద్యుఁ డగుచుఁ ♦ బొలుపార వలెన్. ౧౭౮

చ॥ అతఁడు ఋణంబు గైకొనఁగ ♦ నామథురాపురి కేగి స్వీయమా
కృతి నెఱవేర్చి తిర్గి తన ♦ యింటికిఁ బోవుచు త్రోవలోన న
ద్భుతమగు రూపమున్ గలిగి ♦ పొల్పువహించిన తన్నగంబునం
దతిశయవర్తులం బయిన ♦ యశ్మము నొండు గ్రహించి వేడుకన్. ౧౭౯

చ॥ వరుసఁగ గోకులంబు విడి ♦ పైనిఁ బ్రయాణము సల్పుపట్టున
న్గరములు మూఁడు, హస్తినిభ ♦ నాస, మురస్స్థముఖంబు, వక్రమై
నరదనపంక్తి, రక్తనయ ♦ నంబులు, నాల్కలు నాల్గు, చేతులే
డు, రువగు ముండ్లఁబోలిన న ♦ ఖోత్కరము, ల్గల రాక్షసు న్గనెన్. ౧౮౦

ఉ॥ ఆదనుజుండు వోయెడి ధ ♦ రామరవర్యునిఁ గాంచి యాఁకటన్
రోదసి భేదిలన్ బహువి ♦ రుద్ధవిధంబున ఘర్ఘరాభమా
నాద మొనర్చి వాని నయ ♦ నంబుల ముంగల నిల్వ బ్రాహ్మణుం
డాదను గేలనున్న గిరి ♦ యశ్మమునం బ్రహరించె భూవరా! ౧౮౧

ఉ॥ అంతట యాతుధానుఁడు న ♦ ఘౌఘనివారణశీలశైలరా
డంతరనీతపూతశిల ♦ స్వాపఘనంబునఁ బడ్డ దుష్కృతా
క్రాంతనిశాచరత్వము న ♦ రంబున వీడి మనోజరూపుఁడై
చింత దొలంగి బ్రాహ్మణునిఁ ♦ జేరి నమస్కృతి సల్పి యిట్లనెన్. ౧౮౨

ఉ॥ భూసురవర్య! నీవె బహు ♦ పుణ్యతముండవు లోకరక్షణా
భ్యాసమహాశయుండ వొక ♦ వర్తులమౌ శిలఁగొంచు నాపయిన్
వేసి నిశాటరూపమును ♦ వీడ నొనర్చియు నిట్టిరూప మీ
వేస మొసంగినారుఁ గడు ♦ వేడుకఁ గూర్చితి విద్ది యల్పమే? ౧౮౩

ఉ॥ క్రమ్మఱ బ్రాహ్మణుండు వలు ♦ కంగఁ దొడంగెను సిద్ధపూరుషా!
యిమ్మెయి నేను మిమ్ము నఘ ♦ హీనునిగా నొనరింపలేదు స
త్యమ్ముసుమీ మదశ్మమున ♦ కట్టి మహత్తుసెలంగునంచు లే
శమ్ము నెఱుంగఁజాల నిఁక ♦ సర్వము నీవె వచింపఁగాఁ దగున్. ౧౮౪

క॥ అనవుడు సిద్ధుం డిట్లను, వినుమా గోవర్ధనాద్రి ♦ విభు మహిమంబుల్
మును బెద్దలు వల్కిన రీతిని జెప్పెద నీకు విజయ! ♦ ధీరసుగేయా! ౧౮౫

సీ॥ మంచిమాటలఁ జెప్పి♦మాయలఁ గావించి, కొంపలఁ గాఁజేయు♦కొంటెవాండ్రు
వేదశాస్త్రములకుఁ♦బెడయర్థముల్ సల్పి, కుమతంబులన్నిల్పు ♦ కుత్సితులును
బవ లమ్మ యని రేయిఁ♦బడకకుఁ బడఁతిరో!, రమ్మని పిల్చెడి♦రాక్షసులును
నుపకారములఁ బొంది ♦ యపకారములఁజేసి, ధన్యులమని నిక్కు♦టక్కరులును

తే॥ దేవ భూదేవతల దూఱు♦దృష్టులు మఱి, "యాత్మవత్సర్వభూతాని"♦యంచు నన్య
దార ధనముల నర్థించు♦వారలేని, నల్ల గిరిని గాంచిన ధన్యు♦లగుదు రయ్య!

సీ॥ గంధమాదనయాత్రఁ ♦ గలుగు ఫలంబును, మించు పుణ్యంబు సి♦ద్ధించుచుండు
వృషభాద్రిశోలక ♦ ఋశ్యమూకాద్రి యా, త్రలఁ గల్గు ధన్యత♦దనరుచుండు
మంగళగిరియాత్ర ♦ జంగరుఁ భక్తి నొ, సంగిన సుకృతంబు ♦ సంభవించుఁ
గేదారమందున ♦ నైదువేలేండ్లు త,పంబును సల్పిన ♦ ఫలము గలుగు

తే॥ కూటశాద్రిని నపరంజి♦కొమ్ములున్న, గోవులను దానమిచ్చిన♦గొప్పఫలము
నీకుఱు నల గోవర్ధన♦చిత్రగిరిని, గన్నులారంగ గనిన ని♦ష్కల్మషులకు. ౧౮౬

సీ॥ మలయాచలంబున ♦ మణుఁగుల కొలఁదిని, స్వర్ణమిచ్చినఁగూడ♦ఫలములేదు
దేవగిరిఁ భూమి ♦ దేవతలకుఁ బంచ, భక్ష్యాన్నమిడినను ♦ ఫలములేదు
సహ్యాపర్వతమందు ♦ శాస్త్రోక్తరీతి నుర్వర నొసంగినగూడ ♦ ఫలములేదు
వేంకటాచలమందు ♦ వింధ్యాద్రియందు స, వంబుల సల్పినఁ ♦ ఫలములేదు

తే॥ వారిధారమహేంద్ర ప♦ర్వతములందు, నశ్వమేధసహస్రంబు♦నధికభక్తి
నాచరించినఁ ఫలము లే ♦ దట్టి గోప్ర,వర్ధనంబును గననట్టి ♦ వారి కనఘ!

తే॥ అట్టి శ్రీశైలమందు వి♦ద్యాధరాఖ్యఁ, జెలఁగుకొలఁకునఁ బదియబ్ద♦ములను జలక
మాడు పుణ్యంబుగలుగు నీ♦యద్రినున్న, పుచ్ఛకుండంబునం దొక♦పూఁట మునుఁగ

వ॥ మఱియు శ్రీరామనవమిని జిత్రకూటంబందలి పయస్వినీనదిని, నక్ష తృతీయను బారియాత్రగోత్రంబునను, సప్తమిని నింద్రకీలశైలంబునను, వ్యాస పూర్ణిమను గుకురగిరియందును, మధన ద్వాదశిని నీలాద్రియందును, స్నానదాన తపంబులం జేసిన పుణ్యం బీగోవర్ధనాచలం బందలి మానసీగంగను మునింగిన సిద్ధించు. వెండియు సురగురుండు సింహరాశిగతుం డగుచుండ గోదావరీ ప్రవాదిని యందును, వాచస్పతి కుంభరాశిం బ్రవేశింప మాయాపురం బనంబరఁగు హరిద్వారంబునను, ఋష్యమీనక్షత్రమందుఁ బుష్కరతీర్థంబునను, సూర్య గ్రహణంబునం గురుక్షేత్రంబునందును, జంద్రగ్రహణంబున వారణాసియందును, ఫాల్గునంబున నైమిశక్షేత్రంబునను, నేకాదశీతిథిని శూకరక్షేత్రమందును, గార్తిక మాసంబునందు గణముక్తిదక్షేత్రంబునను, గార్తికపూర్ణిమయందు వటేశ్వర

క్షేత్రంబునను, శ్రీకృష్ణజన్మాష్టమిని మధురాపురమందును, ద్వాదశీదినంబునందు ఖాండవవనంబునను, నర్కుండు మకరగతుం డగుడు బర్హిష్మతీపురంబునను, మాస శివరాత్రిని వైజనాథ వనంబునను, సోమవతియగు నమావాస్యను గంగాసాగర సంగమస్థలంబునను, దశమిని రామేశ్వరంబందలి సేతుబంధంబునను రథసప్తమిని శ్రీరంగక్షేత్రంబందును దర్శించి యవగాహనం బొనర్చి యథాశక్తిదానంబు లొసంగి సవంబులం గావించి జపతపస్స్వాధ్యాయంబుల నాచరించిన వారెట్టి ఫలంబు లొందెదరో యట్టి యగణ్యపుణ్యం బీ గోవర్ధనాద్రి నొకమాఱైన సందర్శించి గోవిందకుండంబునఁ దానంబు సల్పి దానంబు లనూనంబు గావించిన సేకూఱు నని గుర్తెఱుంగుము. ఇంకఁ జాంద్రాయణాదివ్రతంబుల సల్పిన పుణ్యంబుకంటెఁ గోటి గుణితఫలంబు లభించు క్షేత్రంబులలో క్షేత్రరాజంబై పర్వతంబులం బర్వత శ్రేష్ఠంబై దర్శనీయంబులను సందర్శనీయంబై వెలుంగు నగ్గిరివరంబుతో సమంబగు క్షేత్రంబును బర్వతంబును దర్శనీయంబును బుణ్యప్రదంబును త్రికాలంబులను లేవని తెలిసికొనుము. తాదృశమహామహిమామనోహరంబగు నగ్గోవర్ధనం బందలి పాషాణంబున నన్నుఁ బ్రహరించితివి. తచ్ఛిలాస్పర్శంబున మత్కలుషంబులు లులితంబులయ్యె. రాక్షసత్వంబువాసె. రమణీయరమారమణరూపంబు నాకు సిద్ధించె. కానఁ దద్గిరిదర్శనస్పర్శనంబుల నాచరించిన నీవె కృతార్థుండవుగాదే యని నుడివిన నప్పుడమివేల్పు విని హర్షాశ్చర్యంబులం బొంది సిద్ధున కిట్లనియె.

ఉ॥ సిద్ధ! మహానుభావ! బుధ ♦ శేఖర! నీ యనుకంప నిత్తఱిన్
శ్రద్ధగ గోప్రవర్ధనధ ♦ రాధరదివ్యమహత్తు వింటిఁ ద్వ
చ్ఛుద్ధశరీరముం గనులఁ ♦ జూచితి నమ్మితిఁ బ్రాగ్భవాన నీ
పద్ధతి యెట్టిదో యెఱుఁగఁ ♦ బల్కుమ నావుడు సిద్ధుఁ డిట్లనెన్.                    ౧౮౧

ఉ॥ కాశ్యపిదేవ! పూర్వజనిఁ ♦ గల్మషయుక్తుండనై పవిత్రమౌ
వైశ్యకులంబునందుఁ బ్రభ ♦ వంబును బొంది ధనోద్ధతుండనై
వేశ్యలఁగూడితిన్ సురను ♦ వేమఱు ద్రావితి జూదమాడి య
ప్రాశ్యుఁడనైతి జాతి పిత ♦ భార్యయుఁ దల్లియు బిట్టు దిట్టఁగన్.                    ౧౮౨

ఉ॥ కోపము వచ్చి యొక్కతఱిఁ ♦ గొబ్బరికాయలఁ గొట్టినట్లు నా
తాపము దీర భార్య తలి ♦ దండ్రుల నెత్తులపైనిఁ గఱ్ఱతోఁ
బాపభయానుకంపలను ♦ భావమునం జొరనీక కొట్ట వా
రీ పృథివిన్ ద్యజించి పర ♦ మేగి రనంతరమందు వేడుకన్.                    ౧౮౩

ఉ॥ నేనును హారివిత్తమును ♦ నిష్కముఁ గైకొని వేశ్యతోడ నీ
శానసుమిత్రదిక్కునకుఁ ♦ జక్కఁగ నేగి ధనంబు వెచ్చ మ

న్నాఁ డ్యన మొనర్చి డబ్బుకయి ♦ నూఱులకొల్దిఁగఁ జంపి లోకులన్
మానపరాభవంబులను ♦ మాని చరించుచు నుంటి భూసురా! ౧౯౪

ఉ॥ చేసిన బ్రహ్మహత్యలును ♦ జేసిన క్షత్రియ హత్యలున్ మఱిన్
జేసిన వైశ్యహత్యలును ♦ జేసిన పాదజహత్య లింక నేఁ
జేసిన భ్రూణహత్యలును ♦ జేసిన మానిని రత్నహత్యలున్
నీ సవిధంబునన్ బలుక ♦ నేర్తునె? యిన్నియటంచుఁ గోవిదా! ౧౯౫

క॥ ఒకపరి మృగమాంసార్థము, సుకముగ నొకవనముఁ జేరి ♦ చూచెడితఱి నం
దొక భుజగం బేతెంచియు, స్వకపాదములంటఁ గఱవఁ♦జచ్చితి నంతన్. ౧౯౬

క॥ చీఁకటి ప్రాఁకుల గుమినలెఁ, గైకొని కశపాశములను ♦ గన్నుల నిప్పుల్
దూఁకఁగఁ బండ్లను గొఱుకుచు, భీకరయమభటులు వచ్చి ♦ వెరఁగుపడఁ గసిన్.

క॥ త్రాడుల గుత్తముగా న,న్నాడని రహిఁ గట్టి ముద్గ ♦ రోత్కరములతోఁ
దాడించి యాపుడమిపై, నీడుచుకొని సంయమినికి ♦ నేగిన మీఁదన్. ౧౯౮

తే॥ కాలునాజ్ఞఁ గుంభీపాక♦ఘన నరకము, నందు మన్వంతరం బుంచి♦యమితహింస
సల్పి తప్తోర్మినరకానఁ ♦ గల్పమొండు, పెక్కుబాములఁ బెట్టిరో♦విప్రవర్య!

క॥ ఎనుబదినాలుగు లక్షల, పెను నరకములందు నన్నుఁ ♦ బెట్టుచు వేర్వే
రను నొక్కొక యేడును వ్యథ,లను బెల్లుగఁ బెట్టి రావ♦లన్ శమనేచ్ఛన్. ౨౦౦

క॥ భారత ధారణిలోఁ బడి, సారులు సూకరముగాను, ♦ శతజన్మములన్
దారుణ శార్దూలంబుగ, నూఱుజనుల నుష్ట్రముగను ♦ నూల్కొంటి మఱిన్.

తే॥ మహిష జన్మము నేనూఱు♦మాఱులెత్తి,యుంటి సర్పజన్మంబుల♦నొక్కవంద
సారులెత్తి దుష్టులచేతఁ ♦ జంపఁబడితి, నింకఁ బదివేల యేండ్లిటు♦లేగె జనుల.

క॥ అంతట నిర్జలమైన వ,నాంతరమం దిట్టి రాక్ష ♦ సాకారముతో
వింతగ వికిరాలాఖ్య దు,రంతాపత్కరుఁడనగుచు ♦ నలరుచు నెంతో. ౨౦౩

తే॥ ఒక్క శూద్రుని మొడలున♦నొయ్యనెక్కి, గోకులంబున కేఁగఁగా♦గోపకులును
గృష్ణపార్షదులు నగు న♦హీన బలులు, గాంచి కఱ్ఱల నను గొట్టఁ♦గడఁగి రంత.

తే॥ వారి తన్నుల కాగక♦వ్రజము విడిచి,కాల్కలందిగఁ బాటి యా♦కరణి క్షుధను
నిర్దయాత్ముండనై యిప్డు ♦ నిన్ను మ్రింగ, వచ్చియుంటిని నింతలో♦పలను నీవు.

క॥ భీతి మనంబును గలఁచఁగ, నాతత గోవర్ధనాద్రి ♦ యశ్మముతోడన్
ఘాత మొనర్చితి దానన్, బూతుఁడనై కృష్ణకృపను ♦ బొందితి శుభముల్.

ఉ॥ ఈకరణిన్ ధరామరున ♦ కెంతయు వాకొను లోన నట్టి గో
లోకమునుండి భూమణము ♦ లున్ హయముల్ బదివేలుఁ గోటి సూ
ర్యాకృతి తుల్యకాంతు లను ♦ యాయులు లక్ష సహస్రచక్రముల్
దూఁకొను నొండు తేరటకుఁ ♦ దోడనె వచ్చియు నిల్చె ముంగలన్. ౨౦౬

క॥ దానిని సిద్ధుఁడు విప్రుఁడు. పూనికఁ గని హర్షమొంది ♦ ప్రమొక్కిరి పిదపన్
దానిని నెక్కుచు సిద్ధుఁడు, మానిత గోలోకమున క ♦ మందగతిఁ జనెన్. ౨౦౮

తే॥ పిదప బ్రాహ్మణవర్యుఁడు ♦ వెనుక మరలి, విమలభక్తి గోవర్ధన ♦ సముఖమునకుఁ
జని ప్రదక్షిణముల్ జేసి ♦ సంస్తవంబు, సలిపి ప్రణమిల్లి యరిగెను ♦ స్వగృహమునకు

ఉ॥ ఈరహి గోప్రవర్ధన న ♦ గేంద్రకథాసుధఁ గ్రోలువార లా
శ్రీరమణస్వరూపమును ♦ జెంది మనోహరతత్థ్సలంబునన్
జేరి సుఖింత్రు గాని పితృ ♦ శేఖరదండము గాంచ రిద్ధి ము
క్కారుల నిక్కమయ్య జన ♦ కా! యని ప్రీతి వచించె శౌనకా! ౨౧౦

తే॥ మఱియు గోపరార్ణవకేళి ♦ సరిగ వినిన, వారు దేవరాజును బోలి ♦ పరమసుఖము
లనుభవించియుఁ బరమున ♦ నట్టి నంద, రాజుకై వడి శాంతులై ♦ రాజిలుదురు.

క॥ అనవుడు శౌనకుఁ డిట్లను, మునివర!, జనకుండు మఱి వి ♦ బుధమానిని నే
మని పృచ్ఛించెనొ యయ్యది, వినఁగోరుచునుంటి బ్రహ్మ ♦ విద్వరగర్గా! ౨౧౨

తే॥ అవల గర్గబుధేంద్రుఁడు ♦ ననియె నిట్లు, నారదా! యింతమాత్రన ♦ నాకుఁ దృప్తి
గలుగదయ్యెను గానఁ బ ♦ ల్కుంగవలయు, రాధికాధవ! మాధుర్య ♦ గాథ లనుడు.

క॥ కువలయ సంరక్షణరత!, కువలయపతితిలక! గోప ♦ కులజలధీందూ!
కువలయమనోజ్ఞవర్ణా!, కువలయమిత్రార్కనేత్ర! కువలయనాథా! ౨౧౪

ఉత్సాహవృత్తము॥ దేవదేవ! వాసుదేవ! ♦ దేవకీసతీభవా
దేవమానినుత్యజీవ ♦ దేవభోగిరాడ్ధవా!
గోవివర్ధనాహ్వయోరు ♦ గోత్రభారభారకా
దేవదమననామధేయ ♦ దృప్తవంశవారకా! ౨౧౫

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చివుకుల
కులజలధికళానిధి, కోటమాంబాకామయ తనయ, లక్ష్మీదేవీ
సుబ్రహ్మణ్య దత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వ
నిశ్చయ, సుజనవిధేయ, శ్రీనివాసాపరనామధే
యాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన
శ్రీగర్గభాగవతం బందలి
గిరిరాజఖండము
సంపూర్ణము.

---

శ్రీ శ్రీ శ్రీ
హరిః ఓం తత్సత్
శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ గర్గ భాగవతము.

## మాధుర్య ఖండము.



మం॥ జులనామా! రామా!
మంజీర కిరీటహార! ♦ మణిగణతేజః
పుంజసమంజస! గోపీ
రంజక! మురళీవినోద! ♦ రాధాకృష్ణా! ౧

### శ్రుతిగోపికోపాఖ్యానము.

చ॥ దివిజమహార్షి యిట్లనవి ♦ దేహధరాపతి కార్యవర్య! కే
శవుని వరంబుచే నల వ్ర ♦ జస్థలిలో శ్రుతిరూప గోపికా
నివహము సత్కులంబున జ ♦ నించియు నందకుమార రూపవై
భవములఁ గాంచి యిష్టపడి ♦ భర్తగఁ గైకొన నెంచి భక్తితోన్. ౨

క॥ బృందావనమున కరిగియు, బృందావననాథ యైన ♦ బృందాదేవిన్
సుందరమండప మందున, నందముగా వేదవిధుల ♦ నారాధింపన్.

ఉ॥ ఆమె ప్రసన్నయై వరము ♦ లడ్గినమాడ్కి నొసంగఁ దద్వధూ
స్తోమము భక్తవత్సలుఁడు ♦ తోయజలోచనుఁడైన కృష్ణుతో
ధామములందుఁ బ్రత్యహము ♦ దప్పక కూడుచు రాసకేళులన్
బ్రేముడిఁ బాడుచున్ మిగుల ♦ వేడ్కను జేయుచునుండె నింతలోన్. ౪

మ॥ ఒక ఘస్రంబున నర్ధరాత్రము సనన్ ♦ యోగీశ్వరుండున్ వలా
హకవర్ణాభుఁడు నైన కృష్ణుఁడు తదీ ♦ యాగారముల్ జేరుటన్
వికలత్వంబును బొంది గోపికలు త ♦ త్పీతాంబరున్ భక్తిపూ
ర్వకసాష్టాంగనతుల్ బొనర్చి యిటులన్ ♦ వాచించిరో భూవరా! ౫

క॥ తోయజలోచన! యెపుడు, చ్ఛాయమహిమ గన్న నిన్ను ♦ జంద్రచకోర
న్యాయముగాఁ గనుచుండెడి, మాయెడ కిందనుక రాక ♦ మసలితి వేలా? ౬

ఉ॥ నావుడు దమ్మికంటియు న ♦ నర్ సమకట్టి నిటుల్ లతాంగులా
రా! వినుఁ డెవ్వఁ డేరి హృద ♦ యంబున నుండునో వాఁడు దవ్వనం
దోవిన డాసి చూచినటు ♦ లుండు నభోమణి భూమినున్న రా
జీవచయంబుఁ గాంచి విక ♦ సింప నొనర్చిన యట్లు చెల్మితోన్. ౭

తే॥ కాన దరినున్న దవ్వనన్ ♦ గ్రాలుచున్నఁ, గాంచుచుందును మిమ్ము నో ♦ కాంతలార!
మద్గురుఁడగు దుర్వాసుఁడన్ ♦ మౌనివర్యుఁ, డిపుడు భాండీరవనమున ♦ కేగుదెంచె.

తే॥ అల యుదంతంబు నాలించి ♦ యధికభక్తి, శక్తికొలఁదిని సేవల ♦ సలుపఁ దలఁచి
యతనికడకేను వోతినో ♦ యతివలార!, దానఁ గాలయాపనమయ్యెఁ ♦ గాని కనఁగ.

క॥ గురువే బ్రహ్మయు గురువే, హరియున్ గురువే శివుండు ♦ నఖిలామరులున్
గురువే పరమగు బ్రహ్మము, గురు వగుటం బట్టి యతనిఁ ♦ గొలుచుట యొప్పున్.

క॥ అజ్ఞానతమోంధుని కా, ప్రజ్ఞానాంజన శలాక ♦ భవనాశకమౌ
సుజ్ఞాన నేత్ర మిచ్చెడు, ప్రాజ్ఞుని సద్గురుని నెఱఁగి ♦ భక్తి నుతింతున్ ౧౧

క॥ గురువును గాంచని దుష్టుఁడు, గురువున్ నిందించుచుండు ♦ కుత్సితజనుఁడున్
గురువును దలఁపని లేకియు, నరకమునన్ బీడఁబడఁడె? ♦ నానావిధులన్. ౧౨

క॥ అకారణమున నేనును, నెక్కాని నాగురుని కెఱఁగి ♦ నిశ్చలమతితోఁ
జక్కని సేవల సలిపియు, నిక్కడి కేతెంచితిఁ గమ ♦ లేక్షణలారా! ౧౩

క॥ అనవుడు గోపిక లెల్లరు, మనమున నాశ్చర్యమొంది ♦ మాధవు నెంతో
వినుతులఁ జేసియు మ్రొక్కియు, వినయమునన్ వక్ష్యమాణ ♦ విధి ననిరి విభూ!

తే॥ దేవ! పరిపూర్ణతముఁడవు ♦ దివ్యభువన, కోటినాయకుఁడవు జగ ♦ ద్గురుఁడ వక్షు
రుఁడవు నీకును నొక్క గు ♦ రుండు గలఁడె?, వానిఁ గాంచంగ మామది ♦ వరుగు లిడెడి.

ఉ॥ ఎట్టుల నీ నిశీథము ల ♦ ఙ్ఘించి యహర్ముఖ మెప్పుడౌనో? మే
మెట్టులఁ ద్వద్గురు ప్రవరు ♦ నీక్షణపర్వముగాఁగఁ జూతుమో
యెట్టులఁ గొప్పద్దై నడుమ ♦ నడ్డ మొనర్చు కళిందజానదిన్
బిట్టుతరింపఁ జాలుదుమొ? ♦ వేఁడితి మీవు వచింప శ్రీహరీ! ౧౬

క॥ అనవుడు వనజాక్షుండును, వినుఁడీ నామాట నీర ♦ జేక్షణలారా!
చనుఁడీ తన్నది యడ్డిన, ననుఁడీ నేఁ జెప్పినట్టు ♦ లఱలేనిమదిన్ ౧౭

ఆ॥ గోపగోపికాళి ♦ గోవినోదుండైన, హరి యధార్థబాల ♦ యతియయేని
నతని నమ్మువార ♦ మైతిమేన్ యమునరో!, త్రోవ నిచ్చి మమ్ముఁ ♦ గావవమ్మ!

తే॥ ఇట్లునుడివినన్ యమున ప్రా ♦ ర్థించి మీకు, దారి నిడునంత మీరది ♦ దాఁటియల్ల
మద్గుహూర్త్తముఁ గాంతురో ♦ మదఁతులార!, యన్న నాయన్నుమిన్నల ♦ హర్ముఖమున

క॥ గురు రాజ వధూ సుర భూ, సుర సన్నిధికిన్ ఫలంబొ ♦ సూనమొ జలమో
సురుచిర పత్రమొ యేదో, యరుసమునన్ గొనుచు భక్తి ♦ నరుగవలెఁగదా.

తే॥ కాన మనముయథాశక్తినిఁ♦గాన్కలఁగొని, యతనిసన్నిధానమునకు♦నరుగుదమని
వేఱువేఱుగ నేఁబది♦యాఱుపాత్ర, ములను భక్ష్యాన్నముల నించి♦పోవఁ దొడఁగి
తే॥ క్రమముగా నల నదిఁజేరి♦కట్టినేస్త, కాఁడు వచియించినట్లు స్వ♦కంధరముల
వంచి వాచించి పథినిడక్♦వడినిదాఁటి, పరమ భాండీరవనమున♦కరిగి యందు. ౨౨
ఉ॥ వాస మొనర్చి యెల్లపుడ♦పార తపం బొనరించుచుండు దు
ర్వాసుని గన్నులారఁ గని ♦ భక్తిభయప్రమదంబు లొప్పఁగాఁ
జేసి ప్రదక్షిణంబులను ♦ జేతులు మోడ్చి నుతించి యార్య! మీ
కోసము దెచ్చినట్టి యివి ♦ గొంచు గ్రసించియు మమ్ముఁ గావుమా! ౨౩
క॥ ఏవం విధిఁ బ్రార్థింపఁగ, నా విమలమునీశ్వరుండు ♦ నాలించి వివా
దావహపద్ధతిఁ గన్గొని, యీవిధి వచియించె వారి ♦ కిద్ధచరిత్రా! ౨౪
మ॥ సతులారా! యరయంగ నేఁ బరమ హం ♦ సక్ సిద్ధ్యక్రియుండక్ జుమీ
మతిలో మీరొనరించు సేవలకు స♦మ్మాన్యక్రియాశ్రేణికి
న్గతుకం బొందితిఁ గాన మీ రిపుడు నా ♦ నోటక్ ద్వదానీత భో
గతతిక్ బెట్టుఁడి మెక్కెదక్ గనుఁడి మీ ♦ కాంక్షల్ దమిక్ దెల్పుఁడీ! ౨౫
ఉ॥ ఆ ముని పల్కులక్ వినిన ♦ యాసతు లందఱు వేఱువేఱుగాఁ
బ్రేముడి వానిఁ గొంచు ఋషి ♦ విస్తృత వక్త్రమునందుఁ బెట్టఁగా
నామునికోట్లకొల్దిగల ♦ యవ్వి క్షుధాతురరీతిఁ బాత్రలం
దేమియు లేనటుల్ మెసవె ♦ నింతులు వింతలఁజెంద భూవరా! ౨౬
ఉ॥ పిమ్మట వ్రేత లా మునిని ♦ వేఁడి రిటుల్ మునివర్య! యిత్తఱిక్
మిమ్ము శుభేచ్ఛతోడఁ గన ♦ మేము దలంచి తదబ్జనాభవా
క్యమ్మున దుస్తరంబయిన ♦ యా యమునానదిని దాఁటియుంటి మిం
కిమ్మెయిఁ దన్నదిక్ మరల ♦ నెట్లుతరింతుమొ కూర్మిఁ దెల్పుమా! ౨౭
ఆ॥ అనఁగ మునివరుండు ♦ నాలించి సతులార!, యిచటనుండి లేచి ♦ యెప్పు డట్టి
యమునఁ జేరఁగలరొ ♦ యా సమయంబున, నిట్టు లనుఁడు మీర♦లెసక మెసఁగ
క॥ నిర్వారి నిరన్నుఁడు వ్రతి, దూర్వారసపాయి దోష ♦ దూరుఁడునై యీ
యుర్విర వెలుఁగుచునుండెడి, దుర్వాసుని నమ్మ మాకుఁ ♦ద్రోవను నిమ్మా!
మ॥ అని ప్రార్థించిన మీకు నాయమునయుక్ ♦ హర్షంబుతో మధ్యమం
బున మార్గంబు నొసంగుఁ గాన ఁజనుఁడీ ♦ పూఁబోఁడులారా! యనక్
వనజాస్యల్ ముని సెప్పినట్లరిగి యా ♦ పాపాపహంబుక్ ఘనం
బును నా తద్ధునిఁ దాఁటి కృష్ణనికటం ♦ బుక్ జేరిరో యేలికా! ౩౦
తే॥ అంత శ్రుతిరూపగోపిక ♦ లంద ఱట్టి, రాధికేశ్వరు తోడుత ♦ రాసమందుఁ
దుష్టిఁజెందియు మనమునఁ♦దోఁచినట్టి, సంశయంబుల నడిగిరో♦జనకరాజ! ౩౧

తే॥ ఏము దుర్వాసు దర్శనం◆బిపుడు సల్పి, వచ్చియుంటిమి కాని మీ◆వాక్యములను
సంశయంబులు గలిగె మా◆స్వాంతములను, గాన వ్యక్తీకరింతుమో◆కమలనాథ!

మ॥ మము నెల్లప్పుడు సేరఁజీరి తమితో ◆ మాతోడఁ గ్రీడింపవే ?
మమతన్ వచ్చుచు వెన్న పాలు పెరుగుల్ ◆ మాయిండ్లఁ గాఁజేయవే ?
యమునాహ్రదినిలో సతీయుతుఁడవై ◆ యాటాడవే బాలసం
యమి నేనందు వచింతు వేల యిపుడో ◆ యంభోజపత్రేక్షణా! 33

తే॥ మఱియు నీయొజ్జ దుర్వాసుఁ◆డఱమఱవిడి, మేము గొంపోయినట్టి య◆మేయభోగ
ములను బూర్తిగా మెక్కి మ◆రలను దూర్వ,రసము గ్రోలుదునని దబ్బ◆ఱలవచించె.

క॥ అరయఁగ నీవలె గురువును, గరముగ ననృతంబులాడు◆కఠినుఁడని మా
కఱమఱ గల్గెడిఁ గావునఁ, ద్వరఁ బ్రత్యుత్తరముఁ జెప్పి◆తనుపుము కృష్ణా! 3౪

వ॥ అనవుడు జనార్దనుం డిట్లనియె. మానినులారా! నేను నిరాధారుండను, నిరాకారుండను, నిరాహారుండను, నిరామయుండను, నిరంజనుండను, నిరహంకారుండను, నిర్గుణుండను, నిష్క్రియుండను, నిర్వికల్పుండను, నిర్మలుండను, వైషమ్యరహితుండను, సర్వసమానుండను, సర్వాధారుండను, సర్వాంతర్యామిని నైన మాట ధ్రువంబు. ఇందున సందియము లేదు. జల నుదకంబునందలి పద్మపత్రంబు వలె విషంబులోని క్రిమివోలె సంసారంబునందుఁ జరించువారు తత్కృత్యంబులం దసక్తులై రాగద్వేషంబుల మాని సదాచారప్రవర్తకులై కామ సంకల్పంబుల వర్జించి బ్రహ్మార్పణంబుగా వర్ణాశ్రమవిహితంబులగు కర్మంబులను సల్పి జ్ఞానులై నన్ను భజించు భక్తుల కోరికల ననుసరించి నామరూపంబులం దాల్చి సంచరింతు. నాకుఁ బరంబనుమాట లేదని యెఱుంగుఁడు! ఇఁక మానావమానంబులఁ గీర్త్యపకీర్తులఁ గష్టసుఖంబుల గోఖర బ్రాహ్మణచండాలుల సమదర్శియై నిరశనుండును, నియతాత్ముండును, బరిత్యక్తపరిగ్రహుండును నై జ్ఞానాగ్నిని సర్వకర్మముల దహించి లోకసంగ్రహార్థంబు వాని నాచరించువాఁడు విద్వాంసుఁ డనంబరఁగు. అట్టివాఁడు పుణ్యాపాపంబు లంటక మోక్షార్హుండగు నేతాదృశుం డా దుర్వాసుం డౌట దూర్వారసమితాశనుం డైనను మీభక్తికి మెచ్చి యిమ్మాడ్కి మీరిచ్చిన యన్నరాశులం బరిగ్రహించి మిమ్ములను ధన్యులఁ గావించెనని తెలిసికొనుం డన నాఋషిరూపగోపిక లాశ్చర్యమొంది సంశయంబుల వీడి జ్ఞానమయులైరి. మఱియు నిట్లే కృష్ణభక్తివివర్ధనంబును, బాపహరంబును నగు ఋషిరూపగోపికాచరిత్రం బాకర్ణింపుమని నారదుండు జనకున కిట్లనియె. 3౬

## ఋషిగోపికోపాఖ్యానము

తే॥ వంగదేశంబునందున◆మంగళుఁడను, గోపకుం డొప్పు నవలక్ష◆గోప్రభుండు
నధికధని దార పంచ స◆హస్రవిభుఁడు, శాస్త్రవిదుఁడు సల్లక్షణ◆సంయుతుండు.

చ॥ ఒకపరి దైనయోగమున ♦ నుండిన ద్రవ్యము మాయమాయెఁ జో
రకులము గొన్ని యాలను ధ ♦ రాపతి బల్మిని గొన్నియాలఁ దీ
సికొనియె వీతిహోత్రుఁడు వ ♦ సింనెడి గీము దహించె మెక్క న
న్నకటమఁ గట్ట జీర్ణవస ♦ నంబు వసింపఁ బోయె వానికిన్. ౩౮

ఉ॥ దాన ననంత చింతలను ♦ దైన్యముఁ బొందెడి వానిభార్యలన్
బూనిక దండకాటవిని ♦ ముచ్చటగాఁ జరియించు మానిసం
తానము రామునాజ్ఞ వని ♦ తావరరూపముఁ దాల్చి పుట్టె నా
మానినులన్ గనుంగొనుచు ♦ మంగళుఁ డిట్లు దలంచె నాత్మలోన్. ౩౯

ఉ॥ ఇప్పుడు పాడిపంటలును ♦ నిష్టులు విత్తము గీము నామునన్
జొప్పడకుండె నే నెచటఁ ♦ జొచ్చుదు నేమి యొనర్ప నౌను? నా
కిప్పగిదిన్ గుమారికల ♦ హీనముగా జనియించి రయ్యొ! యీ
ముప్పెటు దప్పు? వీరికెటు ♦ బూన్కి వివాహము లౌనొ? దైవమా! ౪౦

శా॥ ఆధివ్యాధిసమాకులుండ నయితిన్ ♦ హర్షంబు వోనాడితిన్
సాధుశ్రేణివిదూరగుండ నయితిన్ ♦ శాంతంబు మాయించితిన్
మేధాహీనుఁడ నైతి దీనజనతా ♦ మిశ్రుండ నైతి త్క్షు
ద్బాధా దగ్ధుఁడ నైతి గర్హ్యమగు నీ ♦ దారిద్ర్యదోషంబునన్. ౪౧

తే॥ ధనము గలిగినన్ బరుఁ డాత్మ ♦ జనుఁడె యగును
ధనములేనిచో స్వజనుం డి♦తరుఁడు గాఁడె!
పేదనగు నాతనయల నే ♦ విత్తవంతుఁ
డైన బంధువు సేకొన ♦ నరుగుదెంచు. ౪౨

క॥ ధని వీరిని గొన నేతెంచనిచో వీరెల్ల రాత్మ ♦ జనులు సెలఁగుదాఁ
కను తత్కష్టములొందుచు, నను దూఱుచునుందు రెట్లు ♦ నాగతియగునో. ౪౩

ఆ॥ సుతులు గలుగుచోట♦సొమ్ము సెలంగదు, సొమ్ము గలుగుచోట♦సుతులు లేరు
రెండు గలుగుచోట♦దండి శేముషి లేదు, మూఁడు గలుగుతావు♦భువిని నరుదు.

తే॥ దైవవశమున దారిద్ర్య ♦ దశఘటిల్లఁ, గుందుచుండెడి నాకిష్టు♦కూఁతులిట్లు
కాకతాలీయరీతిఁ ♦ గలిగి రకట! చింతహెచ్చెడి నైననేఁ ♦ జేసెద నిటు. ౪౫

చ॥ ధని బలికీర్తిశాలి శ్రుతి ♦ ధర్మవిదగ్రణియైన యొక్కనే
తను గని వీరినెల్లఁ గర ♦ దంబుగ నిచ్చుటె మంచిదంచుఁ దా
ననుకొనలోనఁ దీర్ఘతతి ♦ యాయియు వృద్ధుఁడు యోగ్యుఁడౌ జయుం
డను నొక గోపకుం డతని ♦ యందికకుం జనుదెంచి యిల్లనేన్. ౪౬

తే॥ మంగళాహ్వయ! నీవు నా♦మాటవినుము, నీకుమారికామణులను♦నెమ్మి నల్ల
నందరాజునకిచ్చి యా♦నందమందు, మట్లుసేయఁ బిల్లలు సుఖ♦మందఁ గలరు. ౪౭

ఉ॥ అందుల కాతఁ డొప్పుకొని ♦ యా వ్రజభాసురనందనేత్రకుల్
గుందుచు నియ్యలేక యిడెఁ ♦ గూఁతుల నందఱ నంత నందు నా
సుందరమందయానలును ♦ శుక్లసుధాంశుని బోలి వృద్ధినిం
బొందిరి సక్రమంబుగ న ♦ పూర్వకళావిభవాభిరామలై. ౪౮

చ॥ పదపడి నొక్కకాలమున ♦ వారలు తద్ద్విజనాథు నింటిలో
మదనమనోహరాకృతి స ♦ మంచితుఁడై చెలువారు శౌరినిన్
ముదమునఁ గాంచి పెన్మిటిగఁ ♦ బొందుట కెంచి కళిందజాభిధా
నదిని గుఱించి నిశ్చల మ ♦ నంబున ధ్యానము సేసి రెంతయున్. ౪౯

ఉ॥ ఆయెడఁ దన్నదీమణి ద ♦ యన్ దరిసెల్లుచుఁ గోర్కులిచ్చి తా
నేయెడకో చనన్ బిదప ♦ నిద్ధమునీశ్వరరూపగోపుల
త్యాయత బృందకాటవిని ♦ నచ్యుతు తోడుత రాసకేళులన్
జేయఁదొడంగి రో మనుజ ♦ శేఖర! కార్తికశుద్ధ పూర్ణిమన్. ౫౦

తే॥ మఱియు మైథిల గోపికా♦మహితచరిత, మాలకింపుము మైథిలే♦శా! దశాశ్వ
మేధములఁ జేసి నంత య♦మేయఫలము,బొంది గోలోకసౌఖ్యంబుఁ♦జెంద గలవు.

మిథిలాగోపికోపాఖ్యానము.

క॥ అల రఘురాముని వరమునఁ, జెలులొ మిథిలా నగరికిఁ ♦ జెందిన వనితా
తిలకము లానవనందుల, నెలవుల జనియించి వృద్ధి ♦ నిం గని రవలన్. ౫౧

మ॥ ఒక ఘస్రంబున నందగేహమున దృ ♦ గ్యుగ్మంబునన్ జక్రిరూ
పకళావైభవరీతిఁ జూచి పతిగా ♦ భావించి తత్సిద్ధికై
సకలార్థప్రదమైన మార్గశిర మా ♦ సంబం దతిశ్రద్ధఁ గొం
కక కాత్యాయని నోము సల్పిరటు త ♦ త్కన్యల్ మహాభక్తితోన్. ౫౩

ఉ॥ ప్రొద్దున లేచి తత్సతులు ♦ వోదము రమ్మని యొండొరు ల్దమిన్
దద్దయుఁ బిల్చుకొంచుఁ గర ♦ తాళమృదంగవిపంచికాస్వనం
బుద్దవిడిన్ జెలంగఁగఁ బ ♦ యోరుహనాభగుణప్రభావముల్
విద్దెలముద్దుగుమ్మవలె ♦ వేమఱుఁ గోకిలవాణిఁ బాడుచున్. ౫౪

తే॥ యమునలో దిగి స్నానంబు♦నాచరించి, శుభ్రవస్త్రంబులం దాల్చి♦శుద్ధమగు ని
సుమునఁ గాత్యాయనీ సురూ♦పము రచించి,షోడశోపచారంబుల♦సొరిదిఁ జేసి. ౫౫

మ॥ జననీ! స్థావరజంగమంబులు భవ ♦ చ్ఛాస్తిన్ జరించున్ విరిం
చన లక్ష్మీపతి చంద్రమౌళి దివిష ♦ జ్జంభారికుంభోద్భవా
దినిరూఢుల్ నిను గొల్చి కోరికల నెం ♦ తేన్ బొందరే నందనం
దనునిన్ బెన్మిటిఁ జేసి మాకిపుడు మో ♦ దంబిమ్ము కాత్యాయనీ! ౫౬

ఆ॥ ఇట్లు నిత్యము నుతి ♦ యించి తద్వ్రతరాజ, మట్టి మార్గశీర్ష ♦ మగువలిటును
జేసి రందు నొక్క ♦ వాసరంబందున, నొక్క చిత్రమయ్యె ♦ వక్కణింతు. ౫౭

క॥ చెలువలు దమతమ దువ్వలు, వలగట్టునఁ బెట్టి భక్తిఁ ♦ బాడుచు హరినిన్
మొలలోఁతు నీళ్ళలోనికిఁ, జలములఁ జని జలకమాడు ♦ సమయమునందున్.

క॥ తమకక జంకక కొంకక, కమలాక్షుం డెఱిఁగి యెట్లొ ♦ కాళిందీ తీ
రము నల్లల్లనఁ జని యా, కమలముఖుల యంబరములఁ ♦ గాఁజేసి వెసన్. ౫౯

ఆ॥ సంబరంబుతోడఁ ♦ జనుచు నర్భకుంభంగి, వాఁకమీఁది చల్ల ♦ పయర విసర
నధికతాపమార్చు ♦ నట్టి హరిప్రియ, వృక్షమెక్క సుదతు ♦ లిట్టు లనిరి. ౬౦

తోటకవృత్తము॥ కోకలఁ దాఁకఁగఁ ♦ గూడదు కృష్ణా!
పోకుము పోకుము ♦ పోకిరివీఁకన్
నీకిది యెవ్వఁడు ♦ నెమ్మిన్ జెప్పెన్
మాకెటు దక్కును ♦ మానము మామా! ౬౧

సీ॥ గండరగండలఁ ♦ గారింపవలెఁగాని, యబలలన్ నొవ్వఁజే ♦ యంగఁ దగునె?
ముగ్ధకర్బురులను ♦ బోకార్పవలెఁగాని, ముగ్ధలన్ విపదబ్ధి ♦ ముంపఁదగునె?
భూకంటకుల సిరుల్ ♦ గైకొనవలెఁగాని, ముగ్ధాంబరములఁ గొం ♦ పోవఁదగునె?
శత్రుభిమానంబు ♦ సమయింపవలెఁగాని, సతుల మానము దీయు ♦ సరణి దగునె?
తే॥ నిన్ను హాసియించువారలఁ ♦ దన్ని గోల, సలుపవలెఁగాని నిరపరా ♦ ధలను మమ్ము
గోలఁజేయుట దగునె? యో ♦ ఖేలనాతి,లోల! లీలావిలోల! గో ♦ పాలబాల! ౬౨

సీ॥ చిన్నవాఁడ వటంచుఁ ♦ జిత్తమం దెంతుమా, చిన్నవారికిఁ గాని ♦ చేఁతలుండెఁ
బెద్దవాఁడ వటంచుఁ ♦ దద్దయు నెంతుమా, చిన్నతనంబింకఁ ♦ జెలఁగుచుండెఁ
బోకిరివే యని ♦ బుద్ధియం దెంతుమా, బుద్ధిమత్కార్యముల్ ♦ బొందియుండె
బుద్ధిమంతుఁడవని ♦ పూనిక నెంతుమా, పోరానిపోకడల్ ♦ వొలయుచుండెఁ
తే॥ దెలిసియిటు జేయుచుంటివో ♦ తెలియకయిది,సలుపుచుంటివో మా కేది ♦ దెలియదకట
నీపనుల్ వింతగొల్పెడి ♦ నెమ్మితోడ, మా పటంబుల నిడి మమ్ము ♦ మనుపు కృష్ణ!

మ॥ ఘనవాహాజ్ఞ మహాగ్రహంబునఁ దటి ♦ ద్గర్జాశనిశ్రేణితో
ఘనపంక్తుల్ వ్రజనాశనార్థమయి రాఁ ♦ గా వేగ నీవేగి త
ద్ఘనశైలంబును నెత్తి మొత్తి ఘనముల్ ♦ తద్గోకులం బెల్లఁగా
చిన నీకియ్యది యెట్టి గొప్పతన మి ♦ చ్చోన్ జెప్పవే శ్రీహరీ! ౬౪

క॥ లెమ్మా! యిఁకఁ గొమ్మను డిగి, రమ్మా! కరుణించి యంబ ♦ రమ్ములఁ దెమ్మా!
కొమ్మా! చేసెడి జోతల, నిమ్మాడ్కిని సలిపి నగెద ♦ వేలా కృష్ణా! ౬౫

చ॥ కులముల నుద్ధరించుటయొ ♦ గోసురభూసురులందు భక్తిగా
మెలఁగుటొ కల్మివిద్దియల ♦ మేలు గడించుటొ గొప్పరాజులన్

గలనున గెల్చుటో తగును ♦ గాని యిటుల్ మముఁ జేరవచ్చి మా
వలువల దొంగిలించుట ల ♦ వం బుచితంబుగ లేదు నందజా! ౬౬

తే॥ కాన మాపైని దయయుంచి ♦ కమలనేత్ర!, కట్టుకోకల నిడి మమ్ముఁ ♦ గావవయ్య!
యంచుఁ బ్రార్థింప నాతండు ♦ నల్లన నగి, వారి కందఱ కిట్టులఁ ♦ బలుకఁ దొడఁగె.

క॥ ఓ వనజాననలారా!, యీవలువల నేవియేవి ♦ యెవరివెవరివో
భావింపలేను గావున, నీవైపున కీరె వచ్చి ♦ యేతి కొనుండీ! ౬౮

ఆ॥ లేనియెడల నిప్పు ♦ డేనివి గైకొని, యుంటి కరుగఁగలను ♦ నింతులార!
యనఁగ వారలు విని ♦ యాననంబుల వంచి, నగుచుఁ బలికి రిటుల ♦ నాననతోడ.

మ॥ జలజాక్షా! పలుమాటలేల పరిహా ♦ సంబేల మాతోడుతన్?
జలికాలం బిది యాఁగలేము వనిఁ జా ♦ జాలింపు సయ్యాటముల్
జలమం దుంటిమి వత్తు మెట్లటకు ల ♦ జ్జవీడి శ్రీకృష్ణ! మా
వలువల్ మాకు నొసంగి ప్రోవుము! దయా ♦ వారాంనిధీ! ధీనిధీ! ౭౦

ఆ॥ గోకులంబునందుఁ ♦ గొంకని జంకని, రసికమణివి గుణివి ♦ వ్రజపజుఁడవు
శ్యామసుందరుఁడవు ♦ సరసుండవును వన,మాలి వీవు గావె ♦ మదిని దలఁప. ౭౧

తే॥ అయ్య! నీ బానిసలము మే ♦ మందఱమును
మమ్ముఁ బాములఁ బెట్టుట ♦ మంచిదొక్కొ?
మంచి చెడుగులఁ గాంచి కా ♦ వించుమయ్య!
యోగ్యు లప్రతిష్ఠకు జంకు ♦ చుంద్రుగాదె. ౭౨

క॥ నీయెడ నభల లటం చేలా యెంచెదవయ్య! "దుర్బ ♦ లస్యబలం రా
జా" యన వినవే వలువల, నీయనిచో రాజునకు వ ♦ చింతుము కృష్ణా! ౭౩

క॥ అనవుడు వనజాక్షుఁడు విని, వనజేక్షణలార! కంస ♦ పతి కిది వల్కన్
జనుటకు సిబ్బితిలేదా?, నను జేరుట కిపుడు మీకు ♦ నాన గలిగెనా? ౭౪

మ॥ చలియంచున్ జలికాలమంచు నిలువన్ ♦ శక్యంబు గాదంచు మీర్
పలుకన్ సాగితి రిద్ది నిక్కమమయేన్ ♦ వైళంబ యందుండి నీ
వల కేతెంచుఁడు నన్ను డాయుఁ డివిగో ♦ వస్త్రంబులం బొందుఁడీ!
లలిగాఁ జేసిన యెల్ల కష్టములు వా ♦ లాయంబుగాఁ దీరెడిన్. ౭౫

ఆ॥ బానిసలమటంచుఁ ♦ బల్కఁగా దొడఁగితి, రట్టులైన మీర ♦ లనినయటు
సల్పవలయుఁగాని ♦ చలమునఁ బలుకుట, పాడిగాదు రండు ♦ పడఁతులార! ౭౬

క॥ లేదా యింటికిఁ బోయెద, మీఁదన్ మీయిష్టమన్న ♦ మెలఁతలు విని దా
మోదర! తగునే మానము, వోదా నీదారి నీవు ♦ వోవన్ మాకున్. ౭౭

తే॥ అహహా! మేము వివస్త్రల ♦ మగుచు జలక, మాడినందుల కెంతయు ♦ నర్హమైన
పాచితముఁ జేసి చక్కని ♦ పథము జూపి, నను వుమంటివి నప్పుడున్ ♦ నలిననేత్ర!

ఆ॥ అనుచుఁ గొంద ఱటకు ♦ నరిగెదమందురు, గొంద ఱటకు నేగఁ ♦ గూడ దంద్రు
గొందఱు మన మొఱను ♦ గుందుఁడే కరుణించి, తెచ్చి యిచ్చునంద్రు ♦ దివ్యచరిత !

ఉ॥ ఆద నిటుల్ వచించుచుఁ ద ♦ దంగన లూరక చూచి యాహరి
న్లేదు ఫలం బటంచుఁ దుద ♦ నిర్మలకోమలహస్తపద్మసం
ఛాదితమారగేహలయి ♦ సాగి జలంబులనుండి నల్ల దా
మోదరు ప్రోలఁ జేరి తమ ♦ పుట్టము లిమ్మని కోరి రో ప్రభూ ! ౮౦

మ॥ అవలన్ భీతపటుండు నవ్వి సతులా ♦ రా! మీకు సిగ్గేల? నా
సవిధం బందిపు డీరు నిల్చుటకుఁ గాం ♦ చన్ బాల్యమందుండి రేఁ
బవలున్ మిమ్ములఁ గూడుచున్ బెరఁగనో ♦ పాటాడనో యాడనో
యెవి మీకున్నవొ నే నెఱుంగనివి వే? ♦ యీక్షించి వాచింపుడీ ! ౮౧

ఆ॥ మీరు మానవతులె? ♦ దూరదేశస్థిత
నదికి వచ్చితి రెటు? ♦ నగ్నత నెటు
నులుకు విడిచి మునుఁగఁ ♦ దలఁచితిరే రహిన్
నోము గొఱతఁగాదొ? ♦ నుడువుఁ డిపుడు. ౮౨

తే॥ కాన చేవేగ నపరాధ ♦ మైన దనుచు, నొక్కపరిఁ జేతు లెత్తుచు ♦ నొరిగల నిడి
యీరు మీ మీ పటంబుల ♦ నేఱికొనుఁడి, వ్రతఫలంబును బొందుఁడీ ♦ రమణులార!

క॥ తరువాత నాసుదతులున్, గరముల జోడించి కృష్ణ! ♦ కావుమ నీవే
వరగుఁడవు మోహనుండవు, కరుణాభరణుండ వనుచుఁ ♦ గైకొని వలువల్. ౮౪

క॥ కనుఱెప్పల వాల్పక యా, వనజాక్షుం గాంచి వలచి ♦ వఱలుచు నుండన్
వనమాలి విలోకించుచు, నన నిటు దరహాసితవదనుఁ ♦ డగుచున్ జనకా ! ౮౫

ఆ॥ అతివలార ! మీర ♦ లాగ్రహాయణిక మా, సమున నన్ను గూర్చి ♦ శాస్త్రవిధులఁ
గ్రమమండపమునఁ ♦ గాత్యాయనీవ్రత, మాచరించితిరిగ ♦ యధికభక్తి. ౮౬

ఉ॥ దానఁ బ్రియంబుఁ జెందితి య ♦ థార్థ మెఱింగితి మీ ప్రియంబులన్
నే నెఱవేర్తు నెల్లికడ ♦ నిశ్చయ మిద్ది యనంగ వారల
న్మాన్యనముదంబుఁ బొంది తమ ♦ యున్కల కేగిరి మైథిలేశ్వరా !
యీ నెఱిఁ గౌసలాంగనల ♦ వృత్తముఁ జెప్పెద నాలకింపుమా ! ౮౭

## కౌసల గోపికోపాఖ్యానము.

క॥ శ్రీరామోక్తిని గౌసల, నారీమణులా నవోప ♦ నందసతులకున్
శ్రీరామా రుచి సుగుణా, కారాదులతో జనించి ♦ క్రమముగ నిలలోన్. ౮౮

సీ॥ అభ్రచయంబులో ♦ యంధకారంబులో, సారసమధుమత్త ♦ షట్పదములొ
రాజబింబంబులో ♦ రత్నదర్పణములో, భవ్యమందిరములో ♦ పంకజములొ

యంబుజన్మంబులో • యంగజతూపులో, కాటుక పిట్టలో • గండుమీలొ
జలజకోశంబులో • చక్రవాకంబులో, బంగారు గిండులో • బొంగరాలొ
తే॥ మారునారియొ యలిచాలొ • కారుత్రాఁచొ
యనఁటికంబాలొ తాబేళ్లొ • యంబుజములొ
పల్లవంబులొ కపురంబొ • పసిఁడి లతలొ
క్రొమ్మెఱుంగులొ యంచు న • రుల్ దలంప. ౮౯

చ॥ పెరిఁగిరి శుక్లచంద్రు సర • విన్ మణిహేమవిభూషణంబులన్
మెఱసిరి మేల్మి వల్వలను • మించి రుదంచిత పద్మినీస్త్రియన్
వఱలిరి ద్రవ్యవంతులగు • వల్లవవర్యులఁ బెండ్లియాడి వే
పఱచిరి నాల్గుదిక్కుల న • పారయశంబు ననంతరంబునన్. ౯౦

క॥ అల ననఁబోఁడులు లలితుని, గలుముల జవరాలి మగనిఁ•గన్గవ కింపున్
గొలిపెడివానిని దొడవుల, జెలువారెడి కృష్ణుఁ గాంచి • చెంది విరాళిన్. ౯౧

సీ॥ తీరునే యీమన • దేహతాపంబులు, కృష్ణసేవామృత • వృష్టిలేక
చూడునే యీమన • చూడ్కులు లోకంబు, కృష్ణముఖాబ్జ మీ • క్షింపకుండ
చేయునే యీమన • చేతులు పరకృతుల్, కృష్ణహస్తముల గ్ర • హింపకుండ
వినునె యీ మనచెవుల్ • వెఱవారికతలను, కృష్ణ వేణురవ మా • లింపకుండ
తే॥ నడచునే యిప్పుడీ మన•యడుగు లితర, దేశములలోన శ్రీకృష్ణ•ధిష్ణ్యములకు
జనక! మనసు దీరునె యిట్టి•మనకు నన్య, భూతిఁ గృష్ణసంభోగ వి•భూతిలేక.

మ॥ అని చింతించుచు నొక్కనాఁడు మధురా • ఖ్యాపట్టణస్థోరు వీ
థిని గృష్ణా! జగదేకసుందర! హరీ! • దీనావనప్రాపకా!
వనమాలీ! వనజాత దివ్యనయనా! • భర్మాంబరభ్రాజితా!
యని పాలున్ బెరుఁగమ్ముచుందురు తద • బ్జాక్షప్రియాసక్తలై. ౯౩

ఆ॥ మఱియు నిటుల వారు • మాధవుం డెందెందు, సంచరించునట్టి • స్థలములందు
నరిగి తిరుగుచుండి•యాహరి గుణములఁ, దమ మనముల మిగులఁ•దలఁచి తలఁచి.

చ॥ జలమున నగ్నిఁ దేజమున • తన్మాతలమందున నంబరంబునన్
నలుగడలందు మానవ గ • ణంబునఁ జెట్టుల గుట్టలందునన్
బులినములందునన్ యమున • పొంతల నెల్లెడఁ జక్రి చక్కఁగాఁ
జెలఁగుటఁ గాంచి మోహమును • జెందుచుఁ దన్మయలైరి భూవరా! ౯౪

తే॥ అత్తఱిన్ వారు కృష్ణహృ•తాంతరంగ, లగుచు సాత్త్విక భావాష్ట•కాన్వితలయి
చేతనాచేతనంబుల • రీతి నెఱుఁగ, లేక పిచ్చివారలవలె • వాకొనుదురు.

తే॥ సర్వవాంఛల విడనాడి•సత్యమైన, బ్రహ్మమందు లయించెడి•పరమహంస
విధిని నితర కార్యంబుల•వీడి యట్టి, కృష్ణునందున వారెదన్•గీలుకొలిపి. ౯౭

చ॥ బలిమిని హస్తయుగ్మమున ♦ బాటల క్రీడను వీడి సత్కళా
లలితసుధాకరేందుముఖ ♦ లక్ష్యముగాఁ బొలుపారు కృష్ణు ము
ద్దులమొగముం గ్రహించి పరి ♦ తోషముతోడుతఁ జుంబనంబుల
న్నలిఁ గొనిరా వధూజప ఘ ♦ నస్థితి యేమనవచ్చు? భూవరా! ౯౮

చ॥ పదపడి తద్వ్రజాంగనలు ♦ పంకజనాభుని దోర్యుగంబుపై
ముదమున స్వీయబాహువులఁ ♦ బొందికగా నిడి రాసకేళులన్
జెదరని చెల్మి సల్పి రల ♦ చేడెల భాగ్యవిధంబు వేయినో
ళ్లొదవిన శేషుఁడున్, నలువ ♦ యున్ బలుకంగ సమర్థు లౌదురే? ౯౯

ఉ॥ దోషములన్ హరించు శ్రుతి ♦ ధోరణి సత్కృతిసాంఖ్యయోగవై
శేషికతర్కతత్త్వపరి ♦ శీలనధన్యులు దేనిఁ జెంది సం
తోషముఁ గాంతురో యది వి ♦ భూతనిభంబగు భక్తితోడ నా
శేషశయానునిం గొలుచు ♦ శిష్టులకున్ వడిఁజిక్కుఁ బార్థివా! ౧౦౦

తే॥ భక్తివలన నా పరమాత్మ ♦ వశ్యుఁడగు న,టంచుఁ బల్కఁగ సాంఖ్యయో ♦ గాదివిధుల
నల్పనట్టి యాగోపికా ♦ సముదయంబ, సర్వవిధముల సాక్షియౌ ♦ జనకరాజ!

తే॥ మఱియుఁ బురుషార్థదంబును ♦ బరమము హరి,దర్శనప్రదమును నయో ♦ ధ్యానివాసి
నులగు చెలువల చరితంబుఁ ♦ బలుకుచుంటి, సావధానంబుగా విను ♦ మార్యవర్య!

## అయోధ్యావాసినీ గోపికోపాఖ్యానము.

చ॥ చెలఁగుఁగదా సువర్ణమణి ♦ చిత్రిత భిత్తి కవాటజాలవే
దిలలితహర్మ్యకోటివన ♦ దివ్యసభాపరిఖాంగణాది సం
కలితము ధార్మిక ప్రవర ♦ క్రమతరంబగు చాపకాపురం
బిల కొక భూషణంబుగ బు ♦ ధేంద్రనుతంబయి సింధుభూమిలోన్. ౧౦౩

ఉ॥ ఆధృతి ధర్మరాజు ధన ♦ మందున నైలబిలుండు భోగమం
దా దివిజేశ్వరుండు నయ ♦ మందున శుక్రుఁడు రూపునందు దా
మోదరుపట్టి తేజమునఁ ♦ బూషుఁడు డీవి దధీచి భక్తిఁ బ్ర
హ్లాదుఁడు మేరుధీరుఁడును ♦ నా విమలాహ్వయుఁ డద్ది యేలెడిన్. ౧౦౪

ఉ॥ ఆతఁడు తత్పురంబు నవ ♦ యంబు నయంబున నేలుచున్ రతిన్
నాతుల నాఱువేలను ఘ ♦ నంబుగఁ బెండిలియాడి దండిగా
శాతసుమాస్త్రతాపములు ♦ సల్లపఁడన్ రతులందుఁ దేలి యా
గోతులు గొడ్డురాం డ్రగుట ♦ గుందిఁ దొడంగె నిటుల్ నరేశ్వరా! ౧౦౫

సీ॥ రవిలేని దివమును ♦ రాజులేని తమిస్ర, సారసములు లేని ♦ సరసివరము
శీలము లేనట్టి ♦ శృంగారవతియును, దానము లేనట్టి ♦ దంతిమణియు

దానములేనట్టి ♦ ద్రవ్యవంతుండును, వాఙ్నియమము లేని ♦ పౌరుషంబు
ధర్మంబులేనట్టి ♦ తత్త్రిలోకంబులు, హరిని నుతింపని ♦ యాననంబు

తే॥ బుధులు పర్వని గోష్ఠియుఁ ♦ బూర్ణతుష్టిఁ, గనని బ్రాహ్మణుం డధిపతి ♦ లేనరనట్టి
పృథుల రాజ్యంబు వరసుతుం ♦ డెసఁగనట్టి, వంగసంబును వాసికి ♦ వచ్చునొక్కొ ?

ఉ॥ ఎన్నఁడు నాకుఁ బుత్రులు జ ♦ నించెడి మంచి యదృష్ట మబ్బునో
యెన్నఁడు వానియాటల మ ♦ దీక్షణ పర్వముగాఁగఁ జూతునో
యెన్నఁడు వాఁడు నాయురము ♦ నెక్కఁగ ముద్దులఁ బెట్టుకొందునో
యెన్నఁడు నన్ను ధన్యగ న ♦ హీనవిధంబుగ వాఁ డొనర్చునో. ౧౦౮

తే॥ వరసుతుల్ బుట్టి పున్నామ ♦ నరకమందుఁ, బడెడి బాధలఁ దప్పించి ♦ పరమగతికి
నేగునటు జేసెదరు గాదె ♦ యే మొనర్తు, ననుచుఁ జింతిలుచుండె నో ♦ యవనినాథ!

ఉ॥ అమ్మెయి యాజ్ఞవల్క్యుఁడను ♦ నాగమనైగమవేది యొక్క ఘ
న్రమ్మున నమ్మహీశ్వరుని ♦ సన్నిధికిన్ జనుదెంచి యర్చఁ బూ
ర్ణమ్ముగఁ బొంది సమ్ముఖము ♦ నన్ వసియించిన తన్నరేంద్రు వ
క్త్రమ్మును గాంచి యిట్టు లడు ♦ గన్ దొడఁగెన్ గరుణార్ద్రవాణితోన్ ౧౦౯

ఉ॥ క్షేమమె నీ కుటుంబమున ♦ క్షేమమె నీపరిపాలనంబునన్
క్షేమమె బంధులోకమున ♦ క్షేమమె మిత్రసమూహమందునన్
క్షేమమె యెల్లచోటుల సు ♦ శీల! త్వదానన సుందరాంబుజా
భీమెయిఁ జిన్నవోయెడి న ♦ దేదియొ యిత్తతి నాకుఁ దెల్పుమా! ౧౧౦

తే॥ అనఁగ విమలుండు విని మునీ! ♦ యఖిలవేది, వైననీ వెఱుంగని పొక్కు ♦ నమరునొక్కొ?
యైన మీవాక్యగురుతఁ బ ♦ ల్కఁడుచుంటి, సుతులు లేనట్టివారికి ♦ గతులుగలవె?

ఉ॥ మానివరేణ్య! మత్సతుల ♦ మానిని యొక్క తెగూడ గర్భమున్
బూనక పోవుటన్ మిగులఁ ♦ బొక్కితిఁ జిక్కితిఁ దిక్కఁగొంటి ని
ద్దానికి సేపనుల్ సలిపి ♦ తద్వ్యథలన్ ద్యజియింప నేర్తునో
మానక దివ్యదృష్టిఁ గని ♦ మా కెఱిగింపుము! చింతదీర్పుమా! ౧౧౨

ఉ॥ నావుడు యాజ్ఞవల్క్యుఁడును ♦ నందనుఁ డీజని నీకుఁ గల్గఁడో
భూవర! కోట్లకొల్దిగ సు ♦ పుత్రిక లే జనియింతు రంకిలిన్
నీవు పరిత్యజించి సుఖ ♦ నీరధిఁ దేలు మనంగ నాతఁడో
భూవిబుధేంద్ర! యంచుఁ దల ♦ భూమిని సోఁకఁగ మ్రొక్కి యిట్లనెన్. ౧౧౩

తే॥ దేవముని పిత్ర్యాణంబులఁ ♦ దీర్తు నెట్టు, లెట్లు మజ్జీవితము వాసి ♦ కెక్కఁగలదొ
నాసమస్తకష్టము లెట్లు ♦ నాశ మగునొ, పల్కుమా! నాకుఁ గొమరుండు ♦ వఱలనపుడు.

చ॥ కొమరుఁడు లేని మానవుఁడు ♦ గొంపను దంపులఁ బెంపు జేయు డెం
దమున విచారమొందు శ్రుతి ♦ ధర్మములన్ నిరసించి మాను ద్ర

వ్యమును గడింపకుండఁ బర ♦ మార్థము వ్యర్థమటంచుఁ బల్కు లో
కమునకు నింద్యుఁడౌనుగద ♦ కావున నాగతి యెట్లొ చెప్పుమా! ౧౧౫

చ॥ అనవుడు యాజ్ఞవల్క్యముని ♦ యాతని కిట్లను మేదినీశ! నీ
మనమున నుండు భావము స ♦ మగ్రముగా వినియుంటి నీవిఁకన్
విను మిటు మాఘమందుఁ బ్రభ ♦ వింపఁగఁ బోయెడి కూఁతులన్ జనా
ర్దనునకు దాయలన్ గలిసి ♦ దాన మిడన్ నెరవేరుఁ గోరికల్. ౧౧౬

చ॥ మఱియు ఋణత్రయంబు నిడి ♦ మానవగేయుఁడవై పరంబు నీ
వఱగొంటలేక కాంతు వహ ♦ హా! యన నా విమలుండు మెచ్చి క్ర
చ్చఱ నిటు బల్కె మానివర! ♦ సంతసమయ్యెను గాని యట్టి శ్రీ
హరి యెపు డేకులాన జని ♦ నందును యద్ది దయన్ వచింపుమా! ౧౧౭

వ॥ అంత నమ్మిథిలాకాంతుండు సంతసించి భూకాంతా! యీ ద్వాపర యుగాంతంబున మథురాపురాంతరంబున యదుకులంబునందు రోహిణీ నక్షత్రంబును, హర్షణనామయోగంబును, బవకరణంబును, సౌమ్యవారంబును గలిసిన భాద్రపద కృష్ణాష్టమియం దర్ధరాత్రంబునం దంధకారబంధురంబగు సమయంబున శ్రీవత్సాంకుండును, మేఘవర్ణుండును, బీతాంబరుండును, బద్మనేత్రుండును, జతుర్భుజుండును, జగన్మోహనాకారుండును వనమాలియు నగు శ్రీకృష్ణుం డరణియం దగ్నివిధంబున దేవకీదేవియం దుద్భవించి వృద్ధిజెందుచుండు. అతం డవతరించు నబ్దంబునకు నీప్రభుత్వం బింకను నూటపదునేను సంవత్సరంబులు శేషింపఁగలదని యెఱుంగుము. అత్తఱి నక్కుమారునకు నీ కుమారికల నిడి ధన్యుండవగుమని నుడివి చనినమీఁద ౧౧౮

చ॥ విమలధరాధిపుండు మది ♦ వేడుకఁ జెందుచునుండె నంత యాజ్ఞవ
ల్క్యముని వచించినట్లు శుభ ♦ కాలము వచ్చుట తద్వధూటులన్
క్రమముగ రామచంద్రుని వ ♦ రాన నయోధ్యవసించు భామినుల్
గోమరితలై జనించి రను ♦ కూలములౌ గుణరూపరేఖలన్. ౧౧౯

ఉ॥ ఆసుత లొయ్యనన్ బరిణ ♦ యార్హవయోన్విత లౌటఁ గాంచి యా
కోసలనాయకుం డెద న ♦ కుంఠిత మానివచస్సు యోజనన్
జేసి సమర్థదూత నొక ♦ నిం బిలిపించియు వానితోడఁ దా
నీసరణిన్ వచించె జగ ♦ దీశ్వరతద్ధరిమార్గణార్థమై. ౧౨౦

తే॥ ఈవు మథురాపురంబున ♦ కేగి శౌరి, మందిరంబున వసుదేవ ♦ నందను ఘన
వర్ణునిం జతుర్భుజుని శ్రీ ♦ వత్సయుక్తు, సుందరాకారు శ్రీకృష్ణుఁ ♦ జూచి రమ్ము.

ఉ॥ వచ్చిన నీవు మత్సుతల ♦ బాంధవదాయయుతుండ నౌచు నా
పచ్చని పట్టుపుట్టముల ♦ భాసిలు సామికి శాస్త్రరీతిగా

నిచ్చట నిచ్చయంబు సుమి ♦ యేగుమ! వేగ నసంగ నాతఁడుం
గ్రచ్చఱ సాగి చేరి మధు ♦ రాపురవాసుల నడ్గె నిట్టులన్. ౧౨౨

ఆ॥ ఆర్యులార! మీర♦లా వసుదేవుని, నెఱుఁగుదురొకో యీ న♦గరిని గలఁడె?
యతని కొడుకు లెచట♦నధివసించుచునుండ్రో, విశదముగ నుడువుఁడు♦వేగ నాగ!

తే॥ మాథురులు విని యాదవ♦నాథకంస, భీతి మెల్లని మాటలఁ♦బిలిచి యతని
చెవిని స్వీయవక్త్రంబులఁ♦జేర్చి యిటులఁ,బల్కఁ దొడఁగిరి శ్రీకృష్ణ♦భక్తవర్య!

ఉ॥ పుట్టిరిగాని పుత్రకు ల ♦ మోఘుబలుల్ గుణరూపకాంతు లా
దిట్టల నందఱం గసి ను ♦ దీర్ణబలుం డగు కంసరాజు చే
పట్టి వధించె నొక్కసుత ♦ బాల్యమునన్ దివికేగె దాన ని
ట్టట్టనరాని ఖేదము జ ♦ నింపఁగ నా వసుదేవుఁ డుండెడిన్. ౧౨౫

చ॥ ఇది యతిగూఢ మించుకయు ♦ నెయ్యెడఁ జెప్పకుమయ్య చెప్పినన్
యదుపతి పీడఁబెట్టఁగలఁ ♦ డంచు నెఱుంగు మనంగ నాతఁ డ
య్యది విని తత్పురిన్ విడిచి ♦ యా విమలాఖ్యుని చంపకాపురిన్
గదిసియుఁ గన్నవార్త లల ♦ తన్మాతలనేతకు నిల్లు వాకొనెన్

క॥ అయ్యా! మధురకు నేగితి, నయ్యానకదుందుభి ప్రి ♦ యాత్మజులను వే
యయ్యాదవభూపాలుం, డయ్యారే యన వధించె ♦ నఁట! యయ్యయ్యో! ౧౨౭

చ॥ అల వసుదేవుఁ డాత్మజ చ ♦ యంబు లయంబటు జెందుటన్ లలిన్
గలఁగుచుఁ దన్మహాపురిని ♦ గ్రాలె నటంచును వింటి నంతఁ ద
త్స్థలమును వీడి మీదరికి ♦ సాగియు వచ్చుచు బృందకాటవి
న్జలఁగెడి నొక్క చిన్ని సుతు ♦ నిం దిలకించితి నెట్టివాఁ డనన్. ౧౨౮

సీ॥ పీతాంబరుండును ♦ వేత్రవంశీధరుం, డభ్రవర్ణుఁడు పంక ♦ జాననుండు
శ్రీవత్సయుక్తుండు ♦ భావజరూపుండు, నమృత నిష్యందివ ♦ చోన్వితుండు
గంజనేత్రుండు జ ♦ గన్మోహనుండును, బహ్వలంకార వి ♦ భ్రాజితుండు
గోపక పుత్రుండుఁ ♦ గోమల దేహుండు, వనమాలి పీవర ♦ ఘనభుజుండు

తే॥ ఖేలనాలోలుఁ డతుల వి♦శాలకీర్తి,శాలి బుద్ధిశాలియు శీలి ♦ సత్యభాషి
పాశుపాల్యప్రవీణుండు ♦ వల్లవాంగ, నాజనాంతర భాసుఁ డ ♦ నన్యఘనుఁడు.

ఉ॥ కాని చతుర్భుజుం డతఁడు ♦ గాక ద్విబాహుసమేతుఁ డౌటచే
నేను త్వదుక్త పుత్రుఁ డతఁ ♦ డింతయుఁ గాఁడని వీడి వచ్చితిన్
మానవనాథ! యట్టి ముని ♦ మాట యబద్ధముగాదు కాన న
న్నానక పంపు మెందయిన ♦ మానసమందుఁ దలంచి నట్టులన్. ౧౩౦

ఉ॥ అంతటఁ దద్ధరాధిపతి ♦ యందుల కద్భుత మొంది దానిన్
స్వాంతమునందు మంతనము ♦ సల్పెడి పట్టున హాస్తినాపుర

ప్రాంతమునుండి భీష్ముఁడను ♦ రాజు సమర్థత సింధుదేశ మ
త్యంతము గెల్చి వచ్చినపు ♦ డా విమలుండను మ్రొక్కి యిట్లనెన్. ౧౩౧

మ॥ కురువంశోత్తమ! యాజ్ఞవల్క్యముని నా ♦ కున్ మున్ను గూర్మిన్ ధరా
భరమున్ బాపఁగ వేదధర్మముల ని ♦ ల్పన్ దేవకీదేవకిన్
హరి పుట్టం గలఁడంచుఁ బల్కె నది స ♦ త్యంబౌచు నేనెంచి యా
యిరువందన్ వెదకింపఁగా నతఁడు లేఁ ♦ డేమీ! దయన్ దెల్పుమా! ౧౩౨

క॥ కూఁతుల నతని కిడుటకే, సేఁతలు సేయంగ వలెనొ ♦ చెప్పుము! బలులన్
బ్రీతిని గొమ్మా! యీనా, జోతలఁ గొని శంకఁ బాపి ♦ చూడుము దయతోన్.

చ॥ విమలుఁ డిటుల్ నుతింప నల ♦ భీష్ముఁ డిటుల్ వచియించె భూప! యీ
సమయమునందు నడ్డిన ప్ర ♦ శస్తరమౌ చరిత్ర గాథగూ
ఢ మయిన దైన నీనుతి దృ ♦ ఢంబుగ మెచ్చి వచింతు నాలకిం
పుము! మధురాపురాన హరి ♦ పుట్టిన మాట నిజం బిఁకేమనన్

మ॥ వసుదేవుండు నిజాత్మజాళి యదు భూ ♦ పాలుండు కంసుండు బల్
కసితోఁ జంపిన మీఁద ఖేదపడి శ్రీ ♦ కాంతుండు పుట్టన్ వెసన్
నసిఁగొంచున్ జని యాయశోమతి సతీ ♦ శయ్యన్ బరుండంగ నుం
చి సమూఢంబగు యోగమాయఁగొని తాఁ ♦ జేరెన్ నిజాగారమున్. ౧౩౪

ఉ॥ ఆకమలేశ్వరుండు వ్రజ ♦ మందున వృద్ధిని బొంది యా
శ్రీకర బృందకుం జని వి ♦ చిత్రములన్ గనుఁగొంచు గోపికా
గోకుల గోపులంగలిసి ♦ కూరిమితోఁ బదునొక్కడేండ్లు వాఁ
డైకరమున్ జరించెడి న ♦ హా! యన దీని నెఱుంగ రెవ్వరున్. ౧౩౬

క॥ దుష్టులఁ జంపుట కొఱకును, శిష్టులఁ గాపాడు కొఱకు ♦ శ్రీహరి జన్మం
బిష్టముతో నెత్తెను నిఁకఁ, గష్టపరంపరలు సనును ♦ గలఁతల విడుమా! ౧౩౭

ఉ॥ దానవుఁడైన కంసుని హ ♦ తం బొనరించినపైఁ బ్రకాశుఁడౌఁ
గానఁ దదంతరంబుననె ♦ కాంచిన కూఁతుల గూఢరీతిగా
దానమొసంగి యాహరికి ♦ ధన్యుఁడవై పరమొందు మోధరా
జాని! శరీర ధర్మములు ♦ చంచలము ల్గద జాగు మానుమా! ౧౩౮

ఉ॥ శాంతనవుం డిటుల్ వలిక ♦ స్వస్థలముం జనెఁ బిమ్మటన్ ధరా
కాంతుఁడు తిర్గి దూతఁ దమ ♦ కింబునఁ బిల్చి ప్రియోక్తితోడ నీ
వింతకు మున్ను నాకు వచి ♦ యించిన కుఱ్ఱఁడె కృష్ణుఁడయ్యె! య
త్యంతజవంబుచే నరిగి ♦ యాఘనుఁ దోడ్కొని రమ్ము ధీనిధీ! ౧౩౯

తే॥ రాయబారి బయలుదేరి ♦ యాయమునకు, దాపునందున నున్న బృం ♦ దావనమున
శీతవాతము హాయిగాఁ ♦ జెలఁగుచుండ, సంచరించు కృష్ణుని రహ ♦ స్యమునఁ గాంచి

చ॥ హరి! యరవిందనేత్ర! యభ ♦ యప్రద! దోషవినాశకా! మహే
శ్వరుఁడ వజుండ వాద్యుఁడవు ♦ బ్రహ్మవు బ్రహ్మముఖాదివంద్య స
చ్చరితుఁడ వప్రమేయుఁడవు ♦ సామ్యవిహీనఘనుండవయ్య! నిన్
గుఱిచి నుతింపఁ జాలుదునె? ♦ కొమ్మవిగో నతులో దయోదయా! ౧౪౧

ఉ॥ ఎవ్వఁడు కర్ణహీనుఁడయి ♦ యెల్ల యుదంతము లాలకించునో
యెవ్వఁడు నేత్రహీనుఁడయి ♦ యెల్ల జగంబులఁ జూచుచుండునో
యెవ్వఁడు రూపహీనుఁడయి ♦ యిష్టుల కన్గవ గోచరించునో
యెవ్వఁడు దేవదేవుఁడయి ♦ హెచ్చెనొ యా నిను భక్తి మ్రొక్కెదన్. ౧౪౨

ఉ॥ ధన్యము నంద గోకులము ♦ ధన్యము శ్రీమధురాపురంబునున్
ధన్యము గోపికా జనము ♦ ధన్యము గోపకవంశ మంతయున్
ధన్యము బృందకాటవియు ♦ ధన్యులు నీ తలిదండ్రు లింక నే
ధన్యుఁడ నైతి మీ శుభద ♦ దర్శనమౌట సరోజలోచనా! ౧౪౩

ఉ॥ కంసముఖాది దానవుల ♦ కంఠములం దెగటార్చి భూమివే
హింసల మాన్పి గోశ్రుతిమ ♦ హీసుర సాధులఁ బ్రోవ సేవకో
త్తంసమనోరథంబుల య ♦ థావిధిఁ దీర్పఁగ జన్మమెత్తి యా
శంసిత నందసౌధమున ♦ శౌక్ల్యసుధాంశుని మాడ్కిఁ బెర్గవే? ౧౪౪

ఉ॥ నీ యశమే కదా శశిని ♦ నిర్మలుగాఁ బొనరించి దిక్కులం
దాయత చంద్రికల్ బఱపి ♦ హర్షముగూర్చెడి దద్దియేకదా
యాయమరాపగాధరుని ♦ యద్రిని దెల్లని గొప్పకొండగా
హాయిగఁ జేయఁజాలెడిది ♦ యద్ది లవంబు నుతింప శక్యమే? ౧౪౫

చ॥ ఎవ రెఱుఁగంగరాదనుచు ♦ నిచ్చట నుంటివి కాని నీ యశం
బవఘళమొంది యెల్లెడల ♦ నందఱకున్ దెలియంగఁ జాఱెఁగా
దె? వరద! పరాత్పరా! వరమ ♦ తీ! మృగనాభిపటీరకేతకీ
నివహ సువాసనల్ బరణి ♦ నెట్టన డాఁచిన డాఁగునే మొకో? ౧౪౬

శా॥ క్షేత్రజ్ఞుండవు కర్మసాక్షివిగదా ♦ శ్రీరాధికానాయకా!
ధాత్రిన్ నీ వెఱుఁగంగఁజాలనివి సేఁ ♦ తల్ గానరా వైన నో
సుత్రామాదిసుపర్వవంద్యచరణా! ♦ చూపించి కారుణ్య మీ
మాత్రన్ దౌత్యము గన్న నా వచనముల్ ♦ మన్నించి యాలింపుమా! ౧౪౭

తే॥ సింధుదేశమునందుఁ బ్ర♦సిద్ధిగన్న, చంపకాహ్వాయపురవర ♦ జనపతి యగు
విమలుఁ డనువాఁడు త్వత్పద♦విమల పద్మ, ములను మిక్కిలి నెద నమ్మి♦పలికె నిట్లు.

చ॥ జపమఖలవ్రతంబులను ♦ శ్రౌతసవంబులఁ దీర్థయాత్రలన్
దపమును సర్వదానములఁ ♦ దద్దయుఁ దావక దర్శనార్థమై

యెపుడును సల్పి నిన్ను నుతి • యించుచు నుంటిని నమ్మియుంటి నా
కిపు డొకమాటు గన్పడుమ ! • యాత్మసపర్వముగాఁగ శ్రీధరా ! ౧౪౯

చ॥ మఱి నిను భర్తగా నెపుడు • మానసమందు నుతించువారు తా
మరసదళాయతేక్షణలు • మన్మధదారసమానరూపిణుల్
వరనియమవ్రతస్థలును • స్వర్ణవిభూషణయుక్తలైన మ
త్సురుచిర కన్యకామణుల • సొంపుగ నీవు పరిగ్రహింపుమా ! ౧౫౦

శా॥ దేవా ! యీవిధిఁ జెప్పుమంచు ననిపెన్ • దివ్యానుకంపన్ నన్నున్
రావే ప్రాకటచంపకాపురికి నన్ • బ్రార్థించు నానేత కీ
వీవే దర్శన మానరేంద్రు సుతలన్ • హెచ్చిల్లి చేపట్టి పో
లేవే మమ్ముల ధన్యులన్ సలుపఁగా • లేవే వివేకిప్రియా ! ౧౫౧

తే॥ ఇట్లు వినుతింప సరియంచుఁ • గృష్ణుఁ డొప్పి, రాయబారిని దోడ్కొని • వాయువేగ
మునఁ దదధికారి యింటికిఁ • బోవ నతఁడు, గద్దియన్ డిగ్గి యెదురేగి • గాఢ భక్తి.

శా॥ శ్రీవత్సాంకుని హేమచేలరుచిరున్ • స్మేరాననున్ రమ్యరా
జీవాక్షున్ వనమాలి వంశిధరునిన్ • జీమూతవర్ణాంచితున్
దేవస్తుత్యుని గోపికాజనధవున్ • దీనావనఖ్యాతు శ్రీ
గోవిందున్ స్వగృహాగతున్ గనుచు ప్రెమొ • క్కుల్సల్పి యిట్లాడెన్. ౧౫౩

చ॥ కొను మిదె సింహపీఠికను • గూర్చుని నే నిడు పూజలెల్లఁ గై
కొనుమని యర్చలన్ సలిపి • కొంకక దోసిలి యొగ్గి సమ్ముఖం
బున నివసించె దత్సుతలు • ముచ్చట నా హరి జాలరంధ్రపం
క్తిని గనసాగి రంత నల • కృష్ణుఁడు తత్పతి కిట్లు వాకొనెన్. ౧౫౪

క॥ విమలా ! యిత్తతి సంతో, షము గల్గెను యాజ్ఞవల్క్య • సద్వరమున నీ
కమిత శివంకర దర్శన, మమలదయ నిడితి వరము • లడుగుము ! యిత్తున్. ౧౫౫

క॥ అనవుడు విమలుం డిట్లనె, యనఘా ! ధన్యుండ నైతి • ననిశము నీపా
దనలినయుగసుధ నానెడి, ఘనమత్పదముగ రచించి • కావుము ! కృష్ణా. ౧౫౬

క॥ ధీరుఁడవు సర్వవిద్యా, పారగుఁడవు బ్రహ్మవాది • వంద్యుఁడవు మహా
వీరుఁడవు వేదపథసం, చారచణుఁడ వంతకంటె • సద్వరమున్నె ? ౧౫౭

తే॥ భక్తవత్సల ! యది విడి • పరవరంబుఁ, గోరుటల్ జూడఁ దియ్యని • కొబ్బెర విడి
చిప్ప వేఁడెడి వీటిఁడి • చొప్పుఁగాదె, జలజనాభ ! యన్యవరంబు • వలదు వలదు.

ఉ॥ ఆవల దాని కంబుజద • ళాయతలోచనుఁ డొప్ప నాతఁడున్
మావులఁ దేరులన్ గరుల • మాడలు మాడుపు లర్థరాశు లా
దేవున కిచ్చి కూఁతుల బ్రశ • స్తిస్థితపక్తి నొసంగఁగా జయా
రావము నిండె వేల్పులు గ • రంబుగఁ బూలను జల్లిరో విభూ ! ౧౫౯

ఉ॥ అసమయాన నావిమలుఁ ♦ దర్కశతప్రతిమానమూర్తియై
భాసిలి వైనతేయుపయి ♦ భార్యలతోడుత నెక్కి యచ్యుతా
వాసముఁ జెందె నంత నల ♦ వారిజలోచనుఁ డాలతాంగులన్
రాసములందుఁ దేల్చె నను ♦ రాగము మీఱ వ్రజస్థలంబునన్. ౧౬౦

తే॥ మఱియుఁ గామవనమున నా ♦ మానినులను
గూడి శ్రీహరి విహరించెఁ ♦ గోర్కి మీఱఁ
దన్ను భజియించు వారికి ♦ వెన్నుఁ డెలమి
నిచ్చలను దీర్చి ముక్తిని ♦ నియ్యఁ డొక్కొ? ౧౬౧

చ॥ విమల కుమారి ముజ్జలము ♦ వెల్లిగఁ బాఱుట నందు దానికిన్
విమలసరోవరం బనెడి ♦ పేరు ఘటిల్లెను దానియందు నె
ట్టి మనుజుఁడైన దానము గ ♦ డిందిగ సల్పినఁ బాపమేగుఁ బు
ణ్యము లభియించు నిట్టి కథ ♦ నాస్థను విన్న జనుండు ధన్యుఁడా. ౧౬౨

యజ్ఞసీతోపాఖ్యానము.

తే॥ కనకభూవర! వెండియు ♦ శౌరిభక్తి వర్ధకంబును సుఖదంబు ♦ బాపహరము
నైన యజ్ఞసీతాకథ ♦ నాలకింపు, మనుచు నిట్లనె నారద ♦ మునివరుండు. ౧౬౩

తే॥ మున్ను దక్షిణదిగ్భాగ ♦ మున ననేక, రుచిరుచిరతరు సుమఫల ♦ నిచయకలిత
వనులతో మంచిపసులతో ♦ స్వస్తికాది, భవనములతో నుశీనరా ♦ వని చెలంగు.

చ॥ వరపరమప్రమాణ విధి ♦ వర్థిత వేదపురాణశాస్త్రసూ
త్రరమణసార్థకార్థబహు ♦ ధర్మ సుకర్మ కృతిస్ఫురత్ప్రభా
కరసమదీప్తి దిక్తిమిర ♦ కర్తనకీర్తితమూర్తు లాఢ్యులున్
సరసులు సుందరీమణులు ♦ చాలఁ జెలంగుదు రందుఁ బొందికన్. ౧౬౪

తే॥ అట్టిదేశంబునం దొక్క ♦ యవసరమున, వరుసగాఁ బదియేడులు ♦ వానలేక
యతిశయక్షామడాంబరా ♦ ద్యఖిల రుజలు, గ్రాలుటన్ జను లెల్లరు ♦ దాళలేక.

క॥ పుత్రకళత్రాదులతోఁ, దత్రత్యులతోడఁ గూడి ♦ తన్నందు వ్రజం
బాత్రముగాఁ జేరి యచటఁ, జిత్రగృహంబులను గట్టి ♦ చేసిరి వసతుల్. ౧౬౫

చ॥ అటుపయి వారిగేహముల ♦ నారఘురాము వరంబుచేత ను
త్కటముగ యజ్ఞసీతలను ♦ కాంతలు పుట్టి క్రమక్రమంబుగాఁ
జటులవయస్సమేతలయి ♦ సంయమికిన్ రతిగొల్పు రూపమున్
దిటముగఁ బొంది భూషలను ♦ దేహము నిండ ధరించి వేడ్కతోన్. ౧౬౬

ఉ॥ అందముగా విహారముల ♦ నందున సల్పెడి కాలమందు నా
సుందరనందనందనునిఁ ♦ జూచి విరాళిని సైపలేక త

న్నందసుతుం డుదారుఁడును ♦ నవ్యమనోభవరూపుఁడున్ మహా
నందమయుం డనామయుఁ డ ♦ నాథవిభుండు ప్రసన్నుఁ డౌటకై. ౧౯౯

క॥ రాధాకేళీలోలుఁడు, రాధాప్రాణ ప్రియుండు ♦ రాధాత్ముండున్
రాధాభక్తవరదుఁడున్, రాధాధీనుం డటంచు ♦ రాధను జనుచున్. ౧౭౦

క॥ జననీ! మా మొఱవినుమా, విన నీచరితంబు విశ్వ ♦ విదితము తల్లీ!
కన నీ రూపము వంద్యము, కొన నీ మావందనములఁ ♦ గోరితి మమ్మా! ౧౭౧

తే॥ అమ్మ! వృషభాను పుత్రికా! ♦ యబ్జనయన! దేవదుర్లభుఁడగు హరి ♦ నీవశమున
నుండెఁ దత్ప్రసన్నార్థమౌ ♦ నొండువ్రతముఁ, దెల్ప వేఁడితి మిప్పు డ ♦ స్వల్పచరిత!

క॥ అనవుడు రాధిక యిట్లనె, వినుఁడీ! యేకాదశీ ప ♦ విత్రవ్రతమున్
ఘనముగ సల్పిన హరి ద, ర్శనమిడి శుభమిచ్చు నద్ది ♦ సత్యమనంగన్. ౧౭౩

ఉ॥ వారలు రాధ కిట్లనిరి ♦ భామరో! యావ్రత మెట్లు పుట్టెనో
యేరిది సల్పిరో తొలుత ♦ నెన్ని యభిఖ్యలు దీనికున్నవో
యేరహి నోమగావలెనొ ♦ యీదృశసంగతులన్ వచించి మా
కోరిక దీర్పవమ్మ! భువ ♦ నోద్ధురభారకభామినీమణీ! ౧౭౪

## ఏకాదశీ వ్రతవర్ణనము.

వ॥ అనవుడు రాధికాసుందరీమణి యందుల కురరీకరించి గోపికలారా! యీ యేకాదశి యసురల వధార్థంబై మార్గశిరకృష్ణపక్షంబున దామహావిష్ణు దేహంబునం దుద్భవించె. తత్ప్రభృతిఁ బ్రతిమాసంబునఁ బూర్వాపరపక్షంబుల రెంటను వచ్చెడి. తద్విధి నొక యబ్దంబులో నేతెంచు నిరువదినాలు గేకాదశులకుఁ గ్రమంబుగా నుత్పన్నా, మోక్షా, సఫలా, పుత్రదా, షట్తిలా, జయా, విజయా ఽమలకీ, పాపమోచనీ, కామదా, వరూథినీ, మోహినీ, న్యపరా, నిర్జలా, యోగినీ, దేవశయనీ, కామినీ, పవిత్రా ఽజా పద్మేందిరాపాశాంకుశారమా ప్రబోధినులను నామంబులును, మలమాసంబున వచ్చెడి రెండేకాదశులకును సంపత్ప్రద యను నభిధేయంబులు గలిగె. ఈ షడ్వింశతినామశ్రవణం బొనర్చు వారి కేకాదశీ వ్రతాచరణఫలంబు జిక్కు. ఇఁక వ్రతాచరణం బెట్లనిన పూర్వదినంబగు దశమిని నుషఃకాలంబున లేచి కాల్యంబులం దీర్చి శుభ్రవస్త్రంబులం దాల్చి యేకభుక్తం బొనర్చి మఱల నొకమాఱుమాత్ర ముదకంబు గ్రోలి జితేంద్రియుండై భూమిమీఁద హరిని సంస్మరించుచు శయనింపందగు. మఱునాఁ డేకాదశిని బ్రాహ్మ్యముహూర్తంబున మేల్కాంచి భగవద్ధ్యానంబు సల్పి కాలకృత్యంబుల నెఱవేర్చి యనుత్తమంబగు మహానదీస్నానంబుగాని, యుత్తమంబగు తటాకస్నానంబుగాని మధ్యమంబగు వాపీస్నానంబుగాని, యధమంబగు కూపావగాహనంబుగాని యాచరించి క్రోధలోభవివర్జితుండై బ్రాహ్మణనిందకనీచదురాచారమిథ్యావాదిపరద్రవ్యాంగనాప

పారణాసక్తాగమ్యాగమనరతసంభాషణంబు మాని కేశవుని ధ్యానావాహనాది విధులఁ బూజించి ధూపదీపంబులఁ జూపి నైవేద్యంబు సల్పి నీరాజనం బొసఁగి మంత్రపుష్పం బిడి ప్రదక్షిణంబులఁ గావించి నమస్కరించి తద్వ్రతకథఁ బురోహితునివలన విని, యయ్యాచార్యునకు వందనపూర్వకంబుగా యథాశక్తి దక్షిణతోఁ గూడిన తాంబూలం బిచ్చి నిష్కలుషీకృతంబగు మనంబున రేయిని గృష్ణనామ సంకీర్తనం బొనర్చుచు జాగరణంబు జేయుందగు. మఱియు దశమిని గాంస్యపాత్ర భోజన, మాంస, మసూర, కోద్రవ, హరిమంథక, శాక, మధు, పరాన్న, మైథున, పునర్భోజనంబులను బదింటిని వర్జించి యేకాదశిని ద్యూత, క్రీడా, నిద్రా, తాంబూల, దంతధావన, పరనిందా, పైశున్య, స్తేయ, హింసా, రతి, క్రోధా సత్యంబు లను బదునొకండును బరిత్యజించి ద్వాదశిని గాంస్యపాత్ర, పలల, క్షౌద్ర, తైల, మంగళ్యక, పిష్టి, మష్టిక, కామ, క్రోధాసత్యపరాన్నమైథునంబు లను బన్రెండును వీడి యేకాదశీవ్రతంబు ముగించి ద్వాదశిపారణంబు బ్రాహ్మణ యుక్తుండై సాత్వికాహారంబు గొనందగు. వృద్ధిగనుండునేకాదశికాక శేషించిన యేకాదశీదినంబె యుపవాసయోగ్యం బగు మదిరాబిందుపాతంబున గంగా ఘటంబు త్యాజ్యంబగునట్లు దశమీవేధబాధితంబగు నేకాదశీదివసంబు వర్జ్యంబగు నని యెఱుంగుము. ఇఁక నేకాదశీవ్రతాచరణ ఫలం బెట్టిదనిన, ౧౨౫

శా॥ అష్టాశీతి సహస్రభూసుర సుధీ ♦ రాన్నప్రదానంబు జ్యో
తిష్టోమాది మహామఖాచరణముల్ ♦ దీర్ఘాటనంబుల్ శ్రుతి
స్పష్టామేయ సుకర్మధర్మకృతియుల్ ♦ వాప్యాదిసంస్థాపనం
బష్టాత్మార్చలు గూడ దీని కెనయా ♦ నా ? బిట్టు చర్చింపఁగాఁ. ౧౨౬

సీ॥ సకల శుభప్రద ♦ సర్వవ్రతంబుల, శ్రేష్ఠమా నేకాద♦శీవ్రతంబు
సంసార బాధలఁ ♦ సమయించు నేతిలఁ, శ్రేష్ఠమా నేకాద♦శీవ్రతంబు
నారోగ్య భాగ్యంబు ♦ నమరుచు మందులఁ, శ్రేష్ఠమా నేకాద♦శీవ్రతంబు
హరిభక్తి నొడఁగూర్చు ♦ నతిశయయుక్తులఁ, శ్రేష్ఠమా నేకాద♦శీవ్రతంబు

తే॥ ప్రలయ రౌద్రాకృతిం దాల్చి♦ప్రాణిచయము,బట్టి బాధించు కాలునిఁ♦నెట్టఁజాలు
చెయువులను శ్రేష్ఠ మేకాద♦శీవ్రతంబు,గాదె పంకజేక్షణలార!♦కాంతలార!

క॥ ఏకుటిలాత్ముండైనను, నేకాదశియందు నుపవ♦సించినచో న
స్తోకాఘధరాధరముల, నేకక్షణమందుఁ గూల్చి ♦ కృష్ణునిఁ జేరుఁ. ౧౨౭

క॥ ద్వాదశ్యేకాదశులను, శ్రీదయితుఁ దులసి నర్చఁ ♦ జేసిన జనుఁడా
వేదోదితసవఫలముల, మోదముతోఁ బొంది కృష్ణు♦ప్రోలకుఁ జేరుఁ. ౧౨౮

తే॥ ఈ వ్రతంబును సల్పిన ♦ యెల్లజనులు, మాతృ పక్షంబునం బది♦మందిఁ దండ్రి
ప్రక్కఁ బదిమందినిఁ భార్య♦వైపునఁ బది,మంది నుద్ధరించునుగాదె♦మడఁతులార!

తే॥ శుక్లకృష్ణమాహేయులు సారిదిఁ బిదుకు, పాలయందున భేదంబు వఱలనట్లు
శుక్లకృష్ణపక్షైకాద శులును మార్పు, లేక యొకరీతి ఫలమిచ్చు లేమలార!
తే॥ నూఱుజన్మంబులందలి మేరుమంద, రసమపాపంబులన్ దూల రాశిఁగాల్చు
వహ్నిఁబోలె నేకాదశీ వ్రతతిలకము, వడి దహించును వైకుంఠ పదవి నిచ్చు.
క॥ విధినో యవిధినో కొలఁదిగ, బుధులకు ద్వాదశిని దాన ము నిడ నదే మే
రుధరాధరతుల్యంబై, మధురిపువాసమునఁ జేర్చు మానినులారా! ౧౮౩
సీ॥ చిలువల యందున శేషుని కైవడిఁ, బక్షులందు గరుడ పక్షివోలె
దేవత లందున శ్రీవిష్ణువిధమున, వర్ణంబు లందున బాపల వలె
నవనీరుహంబుల నశ్వత్థతరువిధి, నాకులందుఁ దులసి యాకు మాడ్కి
మాసంబులందున మార్గశీర్షమురీతి, వేదంబులన్ సామ వేదమువలె
తే॥ వ్రతములందు నేకాదశీ వ్రతము మిగుల, వన్నెకెక్కును బదివేల వత్సరములు
తపముఁ జేసిన ఫలమిచ్చి ధన్యచరితుఁ, జేయుఁ గావున మీరది సేయుఁడాస్థ.
ఆ॥ అంత వారు రాధ కని యిటుల్ దేవిరో!, మున్ను దీని నెవరు మొదలుపెట్టి
ధన్యచరితులైరో తత్కథ దయతోడఁ, జెప్పు మనుచు నామె చెప్పె నిట్లు.
చ॥ తొలుతను వేల్పులీ వ్రతము దూలిన రాజ్యము దిర్గి గెల్వదై
త్యులను నశింపఁజేయఁగ మ హోద్ధురభక్తిని సల్పి రాత్మదా
యల వలనన్ ద్యజింపఁ బడి యంకిలిఁ బొందిన లుంపకాఖ్యుఁడున్
సలిపి నిజప్రభుత్వమును జక్కజయించి ముదంబుఁ జెందెఁగా. ౧౮౪
తే॥ భూతలంబున మేటియౌ కేతుమంతుఁ, డనెడి భూపుఁడు పుత్రలా భార్థ మీవ్ర
తంబు సల్పె వైకుంఠుఁ డేతద్వ్రతమున, శ్రాద్ధదేవలోకస్థిత జనకుఁ గాచె.
తే॥ దేవపత్నులు బ్రాహ్మణ స్త్రీకి నిట్టి, వ్రతము దెల్పఁగ నది జేసి యా బ్రాహ్మణియును
ధనము ధాన్యము మాన్యత తనయు లలర, స్వర్గసౌఖ్యంబు బొందెనో చానలార!
సీ॥ మఱిఁ బుష్పదంతియు మాల్యవంతుఁడు పిశాచత వీడ నెద్దాని సల్పినారొ
శ్రీరామచంద్రుండు సేతుబంధము రావణాంతార్థ మెద్దాని నాచరించెఁ
బ్రలయాంతమందు సు పర్వగణంబు సకల శుభార్థము దేని సలిపియుండె
నప్సరస్సు ప్రష్టిదో షాంతార్థమై భక్తి, మేధావి యెద్దాని మిగులఁ జేసె
తే॥ లలితనామక గంధర్వ కులతిలకుఁడు, శాపమునఁ గన్న దయ్యపు రూపుమాయఁ
జేసె నెది యది యేకాద శీవ్రతంబు, గాదె వివిధవిధాగత కలుషహరము. ౧౮౫
చ॥ భవుఁడును దీని సల్పి యల బ్రహ్మకపాలము వీడె ధుందుమా
రవిభుఁడు నంబరీష సగ రప్రముఖప్రభు లిద్ది జేసి మా
ధవుని నివాసమొందిరి గ దా యొక వైశ్యుఁడు జ్ఞాతిదూరుఁడై
యవగుణముల్ జెలంగి యది హాయిగ సల్పి కృతార్థతన్ దగెన్. ౧౮౬

ఉ॥ భంగము లెన్నివచ్చినను ♦ బట్టును వీడక భక్తితోడ రు
క్మాంగదుఁ డిట్టి సద్వ్రతము ♦ నాచరణం బొనరించి శ్రీహరి
ప్రాంగణ మొందె నైలబిల ♦ పార్థివశాపముచేతఁ గుష్ఠమా
త్మాంగను హేమమాలి యిది ♦ దాల్మి నొనర్చి కృతార్థతన్ గనెన్. ౧౯౧

తే॥ మఱి హరిశ్చంద్ర మాంధాతృ♦మానవేశ్వ,రులును నేకాదశీవ్రత♦మలఘువిధిని
నాచరించి యీ పృథివికి♦నధిపు లగుచు, నెలి వైకుంఠ వాసులై♦క్రాలిరయ్య!

తే॥ మఱియు ముచుకుందు నల్లుఁడై ♦ వఱలు శోభ
నాహ్వయుండును నీవ్రత ♦ మాచరించి
చంద్రభాగయన్ భార్యతో ♦ సకలపృథివి
ధనదు బోలి పాలించు నీ ♦ క్షణము వఱకు ౧౯౩

తే॥ కానఁ దిథిరాజమున్ భక్త♦కల్పకంబు,నయిన యేకాదశీదినం♦బల్పమనుచు
నెదఁ దలంపక చేయుఁడీ! ♦ యింతులార!,దానితోడీటుగా నే వ్ర♦తంబు రాదు.

చ॥ అనవుడు యజ్ఞసీతలును ♦ నచ్యుతలాలస లౌచుఁ దద్వ్రతం
బును విధిచోదితంబుగ న ♦ మోఘవిధంబునఁ జేయఁ గృష్ణుఁడున్
నెనరున మార్గపూర్ణిమను ♦ నివ్వెఱ జెందఁ బ్రసన్నుఁడై తదం
గనలను గూడి రాసము ల ♦ ఖర్వముగా నొనరించె దేవరా! ౧౯౫

## పులిందినీ గోపికోపాఖ్యానము.

తే॥ మఱియు సర్వాఘహరము న ♦ మానుషంబు
కృష్ణభక్తివర్ధకమును ♦ గీర్తనీయ
ము నగు శ్రీపులిందజవధూ ♦ పుణ్యగాథఁ
బలుకుచుంటిని వినుమయ్య! ♦ యలఘుచరిత! ౧౯౬

తే॥ జనకరాజ! పులిందులు♦చాలమంది,యుక్కడీంద్రయి వింధ్యాచ♦లోపవనము
నందు నివసించి దీనుల♦యర్థము విడి,తేని ధనమును గసిఁ దస్క♦రింపఁ దొడఁగ,

ఉ॥ ఆహవకేళి ధీరుఁడు మ ♦ హాబలుఁ డాఢ్యుఁడు వింధ్యభూమిని
ర్వాహకుఁ డాకతాయలయి ♦ రైని హరించెడి వారిఁ గాంచి ద్వక్షౌ
హిణు లొప్ప నడ్డి శర ♦ చాపకృపాణగదాదిహేతులన్
సాహసభూషణుం డగుచు ♦ సల్పె రణంబు ననంతరంబునన్. ౧౯౮

ఉ॥ వారలు గొన్ని ఘస్రము ల ♦ పారబలంబున నోర్చి నేర్పుతోఁ
బోరి సహింపలేక యదు ♦ భూవరకంసుని కొక్కజాబునం
దీ రణకేళిగాథ లిఖ ♦ యించియు నంపిరి వానిఁ గన్న యా
వీరవరుండు నొప్పి పిలి ♦ పించి ప్రలంబుని నన్యశూరులన్. ౧౯౯

తే॥ జాబు నందలి సంగతుల్ జక్కఁ దెలిపి, పాండవంగఁ బ్రలంబాద్య ఖండబలులు
శత్రుభీకర వేషముల్ సరగఁ దాల్చి, భండనాంగణమొందిరా పట్టునందు.

సీ॥ కాఱుమబ్బులఁ బోలి కరముభయంకర, మైనట్టి నల్లని మేనుతోడ
బహుభారసముపేత ఘటులతరాయోమయ, కాలపాశసమశృం ఖలలతోడఁ
బ్రత్తికాయల మాడ్కిఁ బరగుచు నెఱనిప్పు, కుంపటులను బోలు గ్రుడ్లతోడఁ
బగతుఱ గుండియల్ బ్రద్దలౌ నర్పఁగఁ, దగిన యఘోరము ద్గరముతోడ

తే॥ మకుట కుండల ఫణిహార మండలంబు, తోడ వ్రేలాడు నాల్కల తోడ నొప్పి
యోజనద్వయోచ్చాంగంబు నొంది జగము, వడఁకఁ జేయు ప్రలంబు నా ప్రభువుగాంచి.

ఉ॥ బెగ్గిలి వింతతోఁ గరముఁ బేరు టురంబున వైచి యీ యనిన్
నెగ్గి జయింపఁ జాల నని నెంజలి బొంది చమూసమేతుఁడై
ముగ్గరముం ద్యజించి రథ మున్ వడి నెక్కి మనోజవంబుతో
నగ్గిసముగ్గిసల్ బడుచు సాగె హరింగను నేగ్గుచాడ్పునన్. ౨౦౨

ఉ॥ ఆవిధి నట్టి వింధ్యపతి యాశుగఁ బాఱఁ బ్రలంబుఁ డాపులిం
దావళితోడఁ గూడుకొని యా మధురాపురి కేగె నంత ర
క్షోవిభుఁడైన కంసుఁడును జూచి ముదంబున వారి నందఱన్
సేవక వర్గముం దునిచెఁ జెప్పిన చొప్పునఁ జేయునట్లుగాన్. ౨౦౩

చ॥ పదపడి వారు కామగిరి పై సకుటుంబముగా వసించి రీ
యదనున రామచంద్రవర మందలి శక్తిఁ బుళిందినీసతు
ల్తదవసథంబులన్ గలిగి లక్ష్మినిఁ బోలుచు వృద్ధిఁ జెందు చా
మదనసమానరూపుఁ డగు మాధవునిం గని కన్నులారఁగాన్. ౨౦౪

తే॥ ప్రేమవిహ్వలలై తారు కామరోగ, పీడితలయి యహర్నిశల్ విష్ణుమూర్తి
సన్నుతించుచు నుంట నా శౌరి మెచ్చి, రాసకేళుల వారి సంతోస పఱచె.

ఆ॥ ఎట్టివారలకును నీక్షింపఁగారాని, కృష్ణమూర్తి వారి కెటుల దరిసె
నంబు నిచ్చి కోర్కె నట్టులు లేకుండ, నిడెను వారిభాగ్య మేమనవలె? ౨౦౫

ఉ॥ ఆరయ భక్తు లెప్పు డల యచ్యుత పాదసరోజధూళియే
కోరుదు రంతె కాని సుర కోటివిభుత్వనరప్రభుత్వ సం
సారసుఖార్థరాశిదృఢ సత్వమహత్త్వమనోభవోపమా
కారములన్ సమీహాలను గావలె మాకని కోర రో విభూ! ౨౦౬

రమాసఖ్యాది గోపికోపాఖ్యానము.

ఆ॥ అట్టి భక్తజనుల నాధిక్యమున్ గన్న, యన్యగోపికా జ నామలకథ
విన్నవింతుఁ గాన వినుమయ్య! బహుళాశ్వ!, మును గోకులంబు నందు వేడ్క.

వ॥ నీతివి న్నాగ్నద, శుక్ల, పతంగ, దివ్యవాహన, గోపేష్టు లను నాలుగ్వురు వృషభానులు జనించిరి. అవ్వారల బిడారులందు శ్రీరమారమణవరంబుచే రమా వైకుంఠమండలి మందయానలును, నూర్ధ్వవైకుంఠమండలి యువిదలును, శ్రీలోకాచలమండలి చెలువలును, శ్వేతద్వీపంబునందలి సుందరులును, సముద్రజలగు జలజేక్షణలును, మఱియు శ్రీలక్ష్మికి సఖురాండ్రై) జనపదంబుల నివసించు సతులును జనించి దినక్రమంబున వర్ధిల్లి జగన్మోహినులై శేయింబవలును శ్రీనందనందన చరణారవిందంబులను ధ్యానించుచుఁ దద్దర్శనకుతూహలలై మాఘమాసవ్రతం బాచరింప నద్దేవుండు మెచ్చి వసంతపంచమీదినంబున నా గోపికాజనంబు బరీక్ష జేయం దలంచి, ౨౦౮

మ॥ పులితోలఁ గట్టి శిరంబునన్ బెనుజడల్ ♦ బొల్పార మౌనీంద్రుఁడై
లలిభస్మంబును బూసి దేహమున ను ♦ ల్లాసంబుగా వంశితో
నిలపైనున్న జనంబు లెల్లరును మో ♦ హింపంగ బల్ పాడు చా
జలజాతాక్షుల వాడలందుఁ దిరుగన్ ♦ సాగెన్ విదేహప్రభూ ! ౨౧౦

క॥ అత్తఱి నత్తొయ్యలులున్, దత్తామరసాక్షుఁ గాంచి ♦ తమి హెచ్చిల్లన్
హత్తించి నాస వ్రేళ్లను, జిత్తరుపుల మాడ్కి నిల్చి ♦ చింతించి రిటుల్. ౨౧౧

సీ॥ ఎవ్వఁడో యీబాలుఁ ♦ డిందుఁడా కాఁడాలిఁ, గంకంబు పీడింప ♦ నడఁగుచుండు
కంతుఁడా యీతండు ♦ కాఁడా మనోభవుం, డంగహీనుండయి ♦ క్రుంగుచుండు
నింద్రుఁడా యీఘనుం♦డెన్నటికిం గాఁడు, బ్రహ్మహత్యలఁ బాఁదు♦వగచుచుండు
కనకగర్భుఁడ వీఁడు ♦ కాఁడు విచారింప, నాతిండు తానెయై ♦ యదరుచుండు

తే॥నిఁకఁ దలంప వీఁడెవ్వఁడో♦యెఱుకపడదు,గాని మీరు యోజింపుఁడీ♦కాంతలార!
యన్న నాసతులం గొంద ♦ ఱన్నుమిన్ను, లెన్ని తిన్నగఁ దలఁపు వ ♦ చించి రిట్లు.

తే॥ మేము నెఱుఁగము కాని యో ♦ మెలఁతలార !
యితఁడు సతుల కాఱులచేత ♦ నడఁద పిఱుగి
నిల్లు విడిచి సంయమివలె ♦ నిట్లు దిరుగు
చుండె నని తోఁచుచుండె మా ♦ యుల్లములను. ౨౧౩

సీ॥ కానిచో నీతని ♦ యాననచంద్రుండు, మిగులఁ దమింపఁగాఁ ♦ దగునె చెపుము !
కానిచో నీతని ♦ కరకమలంబులు, తక్కుముండుకుఁ బట్టఁ ♦ దగునె చెపుము !
కానిచో నితని వ♦క్షఃకవాటంబు రు, ద్రాక్షమాలలను బొల్పఁ♦దగునె చెపుము !
కానిచో నీతని ♦ ఘననిభదేహంబు, తద్ద బూదిని బూయఁ ♦ దగునె చెపుము !

తే॥ కానిచో వీని ప్రాయంబ♦నూనరీతిఁ, బ్రాయముల మాటిమాటికిఁ♦జేయఁదగునె
చెపుము ! కానిచో నిట్టి సు♦శీలు నడుగు, దమ్ము లడవుల నడువంగఁ♦దగునె చెపుము!

తే॥ ఇట్టి కుట్టుని విడిచియు♦నెటులఁ దల్లి, దండ్రియుఁ జెల్లె లన్నలు♦దమ్ము లెలమి
బ్రతుకుచుండిరో తెలియదీ♦పట్టిగన్న, పరులు విడుతురే విడి వారు♦బ్రతుకఁగలరె?

తే॥ అందఱము చేరి మెల్లన ♦ నతనికడకుఁ, జేరి యడిగిన సరసమౌ♦జెలువలార!
యనఁగ నందఱు సమ్మతి♦మంది యతని, చెంతకుం జేరి యిట్లు ప్ర♦శ్నించి రాస్థ.

చ॥ యతివర! యేరు మీరు? భవ♦ దాహ్వయ మెయ్యది? యేకులంబు? మీ
స్థితి యెట? వృత్తియెద్ది? మఱి ♦ సిద్ధిని నెందునఁ జెందియుంటిరో?
వితతముగా వచింపుఁ డని ♦ వేఁడుచు వేఁడితి మన్న నాతఁ డ
ద్భుతమగు వాక్యధోరణిని ♦ ముగ్ధల కిట్టులఁ బల్కెఁ భూవరా! ౨౧౮

సీ॥ నా నివాసంబు మా ♦ నసరోవరమున నే, యాహారముల్లేని ♦ యమివరుండ
నాఖ్యయా నారు స్వ ♦ యంప్రకాశుం డల, పరమహంసదశకుఁ ♦ బరగువాఁడ
వర్తమానంబును ♦ భవ్యంబు భూతంబు, దప్పక చెప్పెడి ♦ గొప్పవాఁడ
స్తంభనమోహనో ♦ చ్చాటన మారణ, మంత్రవిద్యాసిద్ధి ♦ మరఁగినాఁడ

తే॥ మఱియు సర్వవిద్యలయం ద♦మానుషమగు, నేర్పు గలిగినవాఁడనో♦నెలఁతలార!
మీర లడిగిన దాని సా♦ధారణముగఁ, జెప్పఁగలను సంశయమిందుఁ♦జెందవలదు.

చ॥ అనవుడు తద్వ్రజాంగనలు♦నాయతి కిట్లని రట్టులైన మా
మనముల నున్న సంగతు ల ♦ మందముగా వివరింపుఁడీ యనఁ
విని యతఁ డించుకంత దన ♦ వీక్షణమూర్ధ్వమునందు వైచి యి
ట్లనియెను దల్లతాంగులకు ♦ నాదరభావసుబద్ధ బుద్ధియై. ౨౧౯

తే॥ మీ మనంబులనుండిన♦కామ మధిక, గూఢమాటను జెవిచెంతఁ♦గోర్కి దీఱఁ
జెప్పఁగాఁదగుఁ గాదేని♦సెలవుమీర, లిడినఁ జేసెద వెల్లడి♦నింతులార! ౨౨౦

తే॥ అనుచు సాభినయంబుగా ♦ నట్టి వార్తఁ
గొలఁది సూచించె నటుమీఁదఁ ♦ గోమలులును
మెచ్చి యోగీశ! యెపుడు మా ♦ యిచ్ఛ కాఁడు
రాగలఁడో యిట కయ్యది ♦ వేగ జెపుమ! ౨౨౧

ఉ॥ నావుడు సిద్ధుఁ డిట్లనియె ♦ నవ్యసరోరుహనేత్రలార! మీ
భావము నే నెఱింగితిని ♦ బాగుగ నున్నది మీర లందఱా
శ్రీవిభు సమ్మతించుఁ గొలఁది ♦ నేఁపు కనుంగవ మూయుఁ డిప్పుడే
యీ వసుదేవపుత్రుఁ డిట ♦ కాగతుఁ డయ్యెడి నన్న వారలుఁ. ౨౨౨

చ॥ సరియని యొప్పి శ్రీహరి న ♦ చంచలభక్తిఁ దలంచుచుఁ గనుల్
సరగున మూసి రంత నల ♦ సారసనేత్రుఁడు వారి ప్రేమ యు
ద్ధురతను జూచి మెచ్చి దయ ♦ తో యతిరూపము వీడి తోడ్త సుం
దరుఁ డగు నందపుత్రుఁ డయి ♦ తద్వనితాసముఖంబునం దగఁ. ౨౨౩

ఉ॥ పెన్నిధిఁగన్న పేదవలె • వేడ్కఁ గనుంగొని వారు వేడి రా
వెన్నుఁడు మాఘసువ్రతము • వేమఱుఁ జేయుచుఁ దన్ను గోరు నా
యన్నులమిన్నలం గలిసి • యభ్రముగొల్చెడి రాసకేళులన్
గ్రన్నన దేలి తృప్తిపడెఁ • గౌఁగిళులన్ మఱిఁ జుంబనంబులన్. ౨౨౮

తే॥ ఇటుల నమరాంగనలతోడ • నెల్లసురలు, క్రీడలాడిన మాడ్కి నా • చేడియలను
గూడి బృందావనిన్ హరి • యాడినకతఁ, జెప్పితిని నింక విను వ్రజ • స్త్రీలకథలు.

దివ్యాత్రిగుణవృత్తి గోపికోపాఖ్యానము.

తే॥ శాంతి వీతిహోత్రాగ్నిభు • క్శాంబు పావ,నశ్రుత శ్రీకరవ్రజ • నాథ గోప
తులను నుపనందు లా వ్రజ • స్థలిఁ బుట్టి, బలయశోధనసుతశీల • కలితులైరి.

తే॥ వారి భవనంబులందు శ్రీ • పరమపురుష, వరముచే దివ్యలును నది • వ్యలును భూమి
గోపికలును ద్రిగుణ వృత్తి • గోపికలును, బుట్టిరో మిథిలేశ్వర ! • పుణ్యపురుష !

క॥ రాధాసమరూపంబును, రాధాగుణ వేషములను • రాధావృత్తిన్
రాధానాథ ప్రేమయు, రాధాస్నేహంబు గలిగి • ప్రబలిరి వారల్. ౨౨౯

ఆ॥ ఒక్కదినమునందుఁ • నక్కీర్తిసుందరీ, తనయ యైన రాధ, • వనజనయను
పైని ప్రణయ కోప • మూని యారాసేశు, రాసరంగమందుఁ • బాసి యేగె.

తే॥ అంత శ్రీకాంతుఁ డదిగని • యామె కోప, మార్ప మానవతీ హృద • యాపహారి
హాలికోచిత వేషంబు • గ్రాలఁ దోఁట, కేగె వారది గని రాధ • కిటుల ననిరి.

మ॥ కరభోరూ ! వ్రజసుందరీమణి ! జగ • త్కల్యాణసంధాయినీ !
సరసుం డంబుజలోచనుం డమృతని • ష్యందాస్యుఁడున్ బాలభా
స్కరసామ్యాంగదమౌళికుండల ప్రథు • గ్రైవేయకావాపకో
ద్ధురుఁడున్ హేమపటుండు నా హరి యదే • తోఁతెంచె వీక్షింపుమా ! ౨౩౦

శా॥ ఆభీరాగరుకుంకుమాదిరసలి • ప్తాకారుఁడై రాసకే
ళీభాగ్యావధిలాలసుండు నయి చె • ల్మిన్ హాలికోద్ధర్షమం
దాభోగంబును జెంద నాతఁ డల యు • ద్యానంబునన్ వంశితో
నాభాషాసతి మెచ్చఁ బాడెడి నహో • యావైపునం జూడుమా ! ౨౩౧

ఉ॥ నల్లని ముంగురుల్గలిగి • నవ్యవయోన్మదఘూర్ణితాత్ముఁడై
నల్లని రూపునన్ వెలిఁగి • నాతుల ప్రీతికి మూలబంధమై
యుల్లస ముల్లమం దలర • నొప్పిన యప్పరమేశుఁ గాంచుమా !
నల్లలితాను రాగమునఁ • జయ్యన నాతని పొంత కేగుమా ! ౨౩౩

ఉ॥ లెమ్ము ద్రుతంబునం జనుము • లేమలచేతఁ ద్వదీయరమ్య దే
హమ్ము నలంకరించు మల • యత్తరు గంధము పుష్పవారులన్

ఘుమ్మను నట్లు జేయుమిఁక ♦ గోపను వీనుము కృష్ణచంద్రు మో
దమ్మునఁ గూడి రాసములఁ ♦ దద్దయు జేయుము రాధికాంబరో ! ౨౩౪

ఉ॥ ఈసమయంబు మంచిదని ♦ యెంచుచు క్రమ్మఱ నిద్ది రాదు సం
తోసముతోడ నుండు మనఁ ♦ దోయజలోచనయైన రాధ చే
టీసముదాయముం గలిసి ♦ లెక్కకు హాలి మహంబుఁగాంచు వే
గాసను లేచి కిన్కవిడి ♦ యావని కేగె ననంతరంబునన్. ౨౩౫

వ॥ పూర్వోక్తలును, దత్సఖీలాపములును, కుంకుమసంకుమదగోరోచనా హరిద్రాగరుకస్తూరీశ్రీఖండాది రసపూరితదృతిసమేతలును, నగు నా వ్రజాంగనలు అంగదపాదాంగదకాంచీకంకణతాటంకహారతారాద్యాభరణంబులం దాల్చి పచ్చని వలువల ధరించి స్వీయకోమలకోణహస్తంబుల నాభీరారుణచూర్ణమ్ములు గైకొని భూనభోభాగంబులు సంధ్యారాగంబు విడంబించున ట్లెలెడఁ జల్లి కోకిలస్వనంబులో హేలాలికాగీతంబుల గానం బొనర్చుచు ఫుల్లసరోజలోచనుండగు వల్లవకులజలధి హల్లకప్రియుపై వసంతంబుఁ బోసి కుంకుమపటీరాగరుచూర్ణములను బలుమఱు విసరి యొకనక్కీయుమాఁడుటుఁ జనపుబూఱ దాయుచు నడుమనడుమ భయంపడుచు నాతని నగుమొగంబును ముద్దుగొనుచు యథేష్టంబుగా విహరింపుచుండ నక్కమలాక్షుండును మిక్కిలి సంతోషించి యా సతీమణుల కందఱ కన్నిరూపులతో నై వారి చూపఱులు తనివి దీఱఁ దమ యుగళంబుగ నగ్గింప రాధాదేవితోడం గూడి తిరుత్సవంబు సంపూర్ణంబుగా నడిపించి తదస్తకృతాంకనేత్రుండై స్వకీయంబగు నుత్తరీయంబును గుఱుతుగా నా హిరిఁబోఁడుల కొసంగి యటనుండి వెడలి నందభవనంబున కేగె. నెండియుఁ జతుష్పదార్థప్రదంబగు దేవకన్యాగోపికాచరితంబు వినిపించెద వినుమని యిట్లు చెప్పందొడంగె. ౨౩౬

## దేవకన్యాగోపికోపాఖ్యానము.

ఉ॥ శ్రావుఁగదా కుబేరసము ♦ డైరుచిరుండు వజ్రప్రభుండు గో
పాలుఁడు కీర్తివంతుఁడు ది ♦ వస్పతినామక వీరుఁ డొక్కఁడు వే
గోలలఁ బెండ్లియాడి బుధ ♦ కోటులు మెచ్చఁగ ధర్మపద్ధతిన్
మాలవదేశమేలుచు స ♦ మస్తసుఖంబులఁ బొందుచున్ బ్రభూ ! ౨౩౭

తే॥ అతఁడు సంసారజనితపా ♦ పద్ధిఁ నీఁదఁ, జాలినది మూఁజగంబులన్ ♦ సజ్జనసహ
వాస నౌకయ యొక్కటే ♦ యటంచెనంచు, విజ్ఞులగు బ్రాహ్మణులచేత ♦ విని కడంక.

తే॥ అఖిల భార్యలఁ దోడ్కొని ♦ యాత్మగృహము
నుండి వెడలి క్రమంబుగా ♦ దండివైన
తీర్థములఁ గాంచి సేవించి ♦ దివ్యమధుర
కేగి యందలి వింత లీ ♦ క్షించి యచట. ౨౩౮

తే॥ గోకులంబున బుధుఁడు యోగ్యుండు నైన, నందభూపుఁడు గలఁడని నాగరకుల
వలన విని యా యశోదేశు పజ్జకరిగి, కనియు బృందావన శ్రీనిఁ గాంచి యవల.

క॥ నందుని యానతిఁ గొని యా,నందముతో రమ్యయోజ నద్వయదేశం
బొందుచు బృందావనిలో, మందిర మొక్కండుగట్టి మనికి నొనర్చెన్. ౨౪౧

క॥ బృందిష్టంబగు గోష్ఠఁ, బందముగా నొకటి గట్టి యాతఁడు దివిష
త్పందోహాధిపువలె నా,నందముతో నుండ నిజ జనంబులతోడన్. ౨౪౨

క॥ దేవలవాక్యము చొప్పున, దేవాంగన లాత్మజలుగ దివ్యాకార
వ్యావృతలై పుట్టియు సిత, జైవాతృకు పగిదిఁ బెరుఁగు సమయంబందున్.

క॥ మోహనరూపుండగు నా, శ్రీహరినిం గాంచి మరులఁ జెంది వివశలై
యా హరినిం గూడుట క,వ్యాహతవిధి మాఘమాస మందలి వ్రతమున్.

ఉ॥ మోదముతో నొనర్చుటకుఁ బ్రొద్దున నిద్దురలేచి భాస్కరా
రోదయవేళ నా యమున యొద్దకుఁ బోయి మునింగి యందు దా
మోదర చిత్రలీలల నెపుడో యన నుచ్ఛ్రియపఙ్క్తిఁ గానవి
ద్యాదయితామతల్లికయు హర్షము జెందఁగఁ బాడి రయ్యెడన్. ౨౪౫

తే॥ తమ్ముఁగంటి ప్రసన్నుఁడై తద్వ్రజాంగ,నలను జీరియు నిట్లనెఁ జెలువలార!
యీరు కోరెడి వరమేదొ యెఱుఁగఁ జెపుడి,యేనొసంగెద నెంతటిదైనఁ గాని.

చ॥ హరి నుడి విన్న యా సతులు హర్షముఁ బొంది మహాత్మ! యారయన్
బరుఁడ వజుండ వాద్యుఁడవు బ్రహ్మవు మన్మథ మన్మథుండవ
క్షరుఁడవు మాన్యలభ్యుఁడవు కారుణికుండవు భూమిభారసం
హరుఁడవు సర్వనాయకుఁడవైన నినుం గను భాగ్య మబ్బెఁగా. ౨౪౭

చ॥ జలరుహనేత్ర! మాపయిఁ జక్కని యక్కటికంబె యున్నచో
జలజము బెత్తమున్ మురళి సంఘటిలన్ నవహాటకాంబరం
బులు దగ మోమునన్ నగవు మొల్కలనెత్తఁగఁ బింఛమొప్ప భూ
షలు సెలువార సన్నటుని చందమునన్ గనిపించుచుండుమీ. ౨౪౮

తే॥ ఇంతకంటెను బరవరం బెదియువలదు, శ్రీకరా! యన్న నాతఁ డంగీకరించి
హర్షమిడుచుండె సాంఖ్యాదు లందలేని, శౌరిభక్తవశుఁడయి చెన్నారఁడొక్కొ?

## జాలంధరీగోపికోపాఖ్యానము.

క॥ మఱియును జాలంధరులగు, తరుణుల చరితంబు నుడివెదన్ దీని వినన్
బురుషార్థంబులు గలుగును, బరమును జేకూరుననఘ! బహులాశ్వవిభూ!

తే॥ సప్తశైవలినీతీర సముపగతము, సర్వసంపద్యుతంబు యోజనయుగాన్వి
తంబు సర్వకల్యాణప్రదంబునైన, రంగనామకపురము వెలుంగుచుండు.

ఉ॥ దూత మనోజవంబున య ♦ దుప్రభుసన్నిధి కేగి భక్తితో
జోతల సల్పి యిట్లనియె ♦ శూరవరా! యొక జాబు వ్రాసి మీ
చేతికి నిమ్మటంచు రిపు ♦ సేనలచే వెతఁజెంది మీదు చే
యూఁతను గోరు రంగనగ ♦ రోత్తమనాయకుఁ డంపె నన్నిటుల్. ౧౬౩

ఉ॥ కావున నిట్టి జాబు గొని ♦ గాలివలెన్ జనుదెంచి మా విభున్
బ్రోవుము జాగు మానుము వి ♦ రోధిభయంకరవీర! నీవు దీ
నావనతత్పరుండవు గ ♦ దా యమరాసురమానవాళి ని
ర్జీవముగా నొనర్పవొకొ? ♦ చెప్పఁగలాఁడనె నీ సమర్థతల్. ౧౬౪

ఉ॥ ఆఁకటఁ బీడ జెందు నరుఁ ♦ డన్నము జూచెడి మాడ్కి దప్పిచే
నాకులమొందుచుండు జనుఁ ♦ డంబువు గాంచెడిభంగి స్తోకకా
స్తోకము శారదాభ్రకణముఁ ♦ జూచెడిరీతిఁ జకోరకంబు దో
షాకరుఁ గాంచు నట్లతఁ డ ♦ జస్రము జూచెడి మీదు రాకకై. ౧౬౫

ఉ॥ మీరటు కేగుదెంతురను ♦ మేలిమి వార్తను నాలకించినన్
సూరునిఁ జూచి పద్మములు ♦ శోభను బొందు ముదంబుగాంచిన
ట్లారమణుండు సారెకును ♦ హర్షము జెందఁడె? కంసభూవరా!
శూరవరాగ్రణీ! యనుచు ♦ జోతములం బొనరింప నాతఁడున్. ౧౬౬

తే॥ మానసంబున యోజించి ♦ మనుజభర్త, కులగు కోటిదానవపంక్తితోఁ ♦ గూడికొనుచు
రంగపట్టణపతి యుద్ధ ♦ రంగమునకు, నేగి రంగోజిఁ గాచెదఁ ♦ నే నటంచు. ౧౬౭

సీ॥ గోమూత్రసిందూర ♦ గోరోచనా మృగ, నాభిపత్రాంచితా ♦ ననముతోడ
విశ్వభయంకర ♦ వింధ్యమహీధ్రసా, మ్యాయతోచ్ఛ్రాయ దే ♦ హంబుతోడ
నభ్రభారవానుకా ♦ ర్యద్భుత శృంఖలా, క్రమబద్ధ దీర్ఘపా ♦ దములతోడ
శత్రునాశంకర ♦ చాణూరముష్టిక, శలకూటముఖ నిజ ♦ సఖులతోడ

తే॥ భీకరంబగు కువలయా ♦ పీడకరిని, నెక్కి మదధారలున్ నేల ♦ యేర్లుగాఁగ
గండపుటముల వెంబడిఁ ♦ గాఱ వెడలి, రంగపురి కేగె రిపులతో ♦ రణముజేయ.

కం॥ పదపడి యదుకురువీరులు, మదమునఁ గుంతత్రిశూల ♦ మార్గణసస్త్రాం
శదళములను బలుభంగులఁ, గదనంబును సల్పిరి జన ♦ కథగాథా! ౧౬౯

ఉ॥ అత్తఱి బాణసంతమస ♦ మావహవ భూమిని గ్రమ్మఁ గంసుఁడున్
గత్తిక మొందు వేసికొని ♦ కాఱడవిన్ జను చిచ్చువోలెఁ జే
రెత్తిన ముద్గరంబు గొని ♦ యేత్తెఱఁ గౌరవసేనఁ జొచ్చి ప
ల్తుత్తునియల్ బొనర్చెఁ బవి ♦ తో హరి కొండలఁ గొట్టినట్టులన్. ౧౭౦

కం॥ యదుపతి పదపడి పదముల, నెదురుల యరదములఁ గూల్చె ♦ నిభములఁ దనదా
మదకరిచేఁ ద్రొక్కించియు, సదమదముం జేసె తురగ ♦ జాలముఁ దోడ్తోన్. ౧౭౧

ఆ॥ వె॥ వైరివరుల దివికిఁ ♦ బాఱవైచియుఁ దిర్గి
కొనుచుఁ బరిహసించి ♦ గొడుగు లొక్క-
యముల ఛత్రచామ ♦ రముల, నరాతుల
మూఁపులందుఁ బెట్టి ♦ మోయు మనియె. ౨౭౨
సీ॥ ఘంటికానిస్వన ♦ కర్ణసుగజంబుల, గోటమీఱెడి వ్యోమ ♦ కుత్సితుండు
పశ్చిమాంఘ్రిద్వయ♦బలమున మాఁపులఁ, ఘనులఁ ద్రోయును గేశి♦కర్బురుండు
సాశ్వరథంబులఁ♦హస్తంబులనుబట్టి, యట్టిటుల్ ద్రిప్పు వృ♦షాసురుండు
ముష్టిబలంబున ♦ మొనకాండ్రతలలపై, మొట్టికాయలవేయు♦ముష్టికుండు
తే॥ మఱియు నానావిధంబులఁ ♦ మనుజభక్ష
కులగు దైత్యులు చెలరేగి ♦ కలనులోన
జంపుచుండుట మిగిలిన ♦ శత్రుసైని
కులు గనుంగొని పరుగిడి ♦ రులుకుఁ జెంది. ౨౭౩
ఉ॥ ఆజి భయంకరుండయిన ♦ యా యదువీరుఁడు శత్రుసేన లా
యోజఁ బరుంగిడన్ సలిపి ♦ యుద్ధము మాని స్వకీయసైన్యవి
భ్రాజితుఁడౌచు దుందుభులు ♦ బల్మఱు మ్రోయఁ గుటుంబయుక్తరం
గోజినిఁ గాంచు నామధుర ♦ కుం జనె మిత్రులు మెచ్చ నిచ్చలన్. ౨౭౪
చ॥ అల ధృతరాష్ట్రభూమివిభుఁ ♦ డాత్మపరాజయ మాలకించి యో
ధుల నిసుమంతె దూఱి రిపు ♦ దుర్భర దోర్బల గర్వభంగమున్
సలుపఁగ నిశ్చయించుకొని ♦ చక్కని కాలము గుత్తెఱుంగఁగాఁ
బలుమఱు వేగులన్ బనిపి ♦ వార్తలెఱుంగుచునుండె భూవరా! ౨౭౫
తే॥ అంతఁ గంసుండు గోకులం♦బందు బర్హి,షదమ నెడిపురి రంగోజి♦యదువిభునకు
నిడఁగ నాతండు గైకొని♦యెలమితోడ, వాసమును జేసె నిజకుటుం♦బమునుగూడి.
తే॥ ఈరహిన్ గొన్ని దివసంబు♦లేగ నతని, లలనలందున జాలంధ♦రులును హరి వ
రమునఁబుట్టి మనోజ్ఞలై ♦విమలమతుల, గోపకులఁ బెండ్లియాడియుఁ♦గోర్కితోడ
తే॥ జారధర్మంబుఁ జేపట్టి♦చక్రపాణి, తోడ స్నేహించి రద్దానఁ♦దోయజాక్షుఁ
డట్టి బృందావనంబున♦నాసతులను, రాసములఁ దేల్చెఁ జైత్రిక♦మాసమందు.

## సముద్రకన్యకాది గోపికోపాఖ్యానము.

వ॥ మఱియు నాగోకులంబునందు శోణపురాధీశ్వరుండును, శ్రీమంతుం డును, ధీమంతుండును, నీతిమంతుండును, సత్త్వవంతుండును, బలవంతుండు నగు నందుం డను గోపకుం డైదువేల యతివలం బెండ్లాడి యింద్రభోగంబు లనుభవించు చుండ నతని సతులయందు శ్రీమత్స్యమూర్తి వరంబునఁ నపాంపతి సముద్భవలగు ముగుదలును, బృథ్వీదోహనంబునఁ జిత్రవిచిత్రౌషధులును, బృథువరంబున బర్హి

వ్మతీపురభామినులును, నరనారాయణమహామునివరంబున నచ్చరలును, వామను
నుని వరంబున సుతలనివాసినులగు విలాసినులును, శేషుని వరంబున నాగ
కన్యక లుద్భవిల్లిరి. అప్సరలకు మహాయోగిపుంగవుం డగు దుర్వాసుండు మహిమో
మహిమోపేతంబును, వాంఛాప్రదంబును నగు యమునాపంచాంగం బను
మహామంత్రంబు నుపదేశింపఁ దల్లతాంగులు శ్రీకృష్ణప్రీత్యర్థంబై నిశ్చలభక్తిని
నందనందనమహిషియగు నా కళిందనందనను బూజించి యామంత్రం బుపాసించు
దద్ధునీశ్వరి ప్రసన్నయై యడిగిన వరంబుల వారి కొసంగె. తెనుగుని మదనమోహ
నుండగు నా శ్రీకృష్ణుండు మాలతీమల్లికాపారిజాతకేతకీపద్మాదినానావిధ
కుసుమపరిమళభరితంబును, కోకిలపుంస్కోకిలకోకకేకిశుకపికమధుకరాళిమధు
స్వనమనోహరంబును, మధుపధ్వనిమధురంబును, కాళిందీజలకల్లోలకోలాహల
సమాకులంబును, వసంతలతికామనోహరంబును, జిత్రవిచిత్రంబును, బవిత్రంబును
గల్యాణకరంబు నగు బృందావనంబందు మలయమారుతంబు [illegible]
గల్పవృక్షాంతికంబునం జెలంగు కదంబతరుమూలంబున [illegible]
మధుమాసంబునందు మోహపాశబద్ధంబును, గోపికామనోంగ [illegible] నగు
[illegible]లికోత్సవం బారంభించె. అంత నాయింతులా యనంతుసన్నిధి [illegible]
సంతుష్టాంతరంగలైరి. అత్తఱి రాధాసహితుండగు కృష్ణుండు [illegible]
బాలుని దిరస్కరించుచుఁ దేజరిల్లె. వెండియు నా నాగకన్యకలు [illegible]
డగు హరినింగూడి తదుత్సవంబు దివిజనేత్రపర్వంబుగాఁ [illegible]
దేవరాజబ్రహ్మర్షివరేణ్యాసుర్లభుండగు నాథగవానుసగూడు చే [illegible]
బింతింతయని చెప్పంగలమే? భూపా! పాపహరంబగు గోపికలచరి [illegible]
ఇంక నీవేమి వినవలతువో తెల్పుమని యడుగ నారదునకు జనకుం [illegible]

తే॥ నారదా! యట్టి గోపీజనమున కల్ల, యనఘుఁడైన దుర్వాసుఁడు [illegible]
యమునహోదరీపంచాంగమమలబుద్ధి, నిచ్చెనని చెప్పితివి [illegible]

## యమునా పంచాంగము.

మ॥ సదయాంతఃకరణుండ వౌచు యమునా సౌభాగ్య పంచాంగ [illegible]
య్యాదియో దానినెటుల్ జపింపవలెనో యద్దానిచే [illegible]
బాదవుఁ మున్నిది యేరుసల్పి రను స ద్గోవిందాంకితుల్ [illegible]
మది యానందమహాసుధాజదఫిలో [illegible] నారదా! ౨౦

మ॥ శ్రుతులారఁగ విని నారదుం డిటుల వా క్రుచ్చెఁ దయన్ [illegible]
డితిహాసంబు వచించెదన్ వినుము భూమీశా! యయోధ్యాపురి
పతియున్ రాజవరుండు దివ్యధనియున్ బాహాబలాఢ్యుం [illegible]
న్మతిమంతుండును సత్ప్రవర్తకుండు నా మాంధాత నా నొప్పెడిన్. తా

ఉ॥ ఆ యనఘుండు వేటకయి ♦ యాత్మగృహంబును వీడి కానకుం
జాయఁగఁ జేరి తిర్గు చల ♦ సౌభరినామక మౌని యాశ్రమం
బాయతబృందకావనము ♦ నందుఁ జెలంగుట గాంచి మెల్లఁగా
నాయెడ కేగి యల్లుఁడగు ♦ నామునికిన్ నతిజేసి యిట్లనెన్. ౨౮౩

శా॥ మౌనీ! నీవు పరావరజ్ఞుఁడ వనా ♦ మాన్యుండ వార్యుండ వ
జ్ఞానాంధాన్వితలోకభాస్కరుఁడవో ♦ జామాత! యీవిప్ప డె
ద్దానన్ రాజ్యసుఖంబులన్ జెలఁగి యీ ♦ దైత్యారి సారూప్యమున్
సానందంబుగఁ జెందఁ జాలుదునొ నా ♦ కద్దాని వాక్రువ్వుమా! ౨౮౪

క॥ అనవుడు సౌరభి యిట్లను, నినతారక లెంతకాల ♦ మెసఁగెడినో యం
దనుకను రాజ్యంబిడి తుద, వనమాలినిఁ జేర్చు యమున ♦ పంచాంగంబే.

క॥ వివరించెద నని వినుమా, స్తవ పటల సహస్రనామ ♦ సరణి కవచముల్
గవిసిన నది పంచాంగ మ,ని విబుధు లనుచుందురు తర ♦ ణికులశశాంకా!

తే॥ అనఁగ మాంధాత ప్రశ్నించె ♦ నడిగె నిట్లు, సౌభరీ! యమునా కవ♦చంబుఁ దెలుపు
మది యనుష్ఠింతు భక్తితో ♦ ననఁగ మునియు, మతియు నిట్లనె నతనికో ♦ మానవేంద్ర!

తే॥ సర్వరక్షాకరంబును ♦ సకలశుభద, మైన కాళింది కవచంబు ♦ ననెద వినుమ!
యాగజుండు చతుర్భుజ ♦ పద్మనయన, స్యందనస్థను శ్యామను ♦ యమునఁ దలఁచి.

తే॥ కలిసి యందు వేరువన్ ♦ జలక మాడి, సిగను ముడిచియుఁ బూర్వది ♦ క్కునఁగుశాస
నమునఁ గూర్చుండి సంధ్య స ♦ ప్రక్రమముగాను, సల్పి యమునాకవచమిద్ది ♦ చదువనగును

యమునా కవచము

సీ॥ మాయమునా స్రవంతి శీర్షమును రక్షించుత, కృష్ణ కన్నులను ర ♦ క్షించుఁగాత
శ్యామయు భ్రూదేశ ♦ మోముత నాసికన్, స్వర్గవాసినియుఁ గా ♦ పాడుఁగాత
గౌవల రక్షించు ♦ తన్ మోదరూపిణి, హృది మహానదియు ర ♦ క్షించుఁగాత
జ్రకీవామాంసజ ♦ శ్రవణముల్ ప్రోచుత, గాళింది యధరముల్ ♦ గాచుఁగాత
వివసుత చిబుకంబు ♦ రక్షించుతన్ యమ, భగిని కంధరము గా ♦ పాడుఁగాత
కృష్ణ ప్రియాంగన ♦ పృష్ఠంబు ప్రోచుతన్, భుజముల్ దటినియుఁ ♦ బ్రోచుఁగాత
నూరువుల్ రంభోరు ♦ వోముతన్ జానువుల్, పాదభేదినియుఁ గా ♦ పాడుఁగాత
ఘుటికలన్ బ్రోచుత ♦ గోర్కరాసేశ్వరి, కలుషహారిణి కాళ్లఁ ♦ గాచుఁగాత
నంతర్బహింతర్ధ్వ ♦ మాదిమపదికలన్ బ్ర, పూర్ణతమప్రియ ♦ ప్రోచుఁగాత

తే॥ సర్వదా స్వాధా సర్వ ♦ సమయములను, జక్కఁగాఁ బ్రోచుగావుత ♦ సకలలోక
మాత మాతల్లి మాకిట్ల ♦ ప్రీతితోఁ బ్ర,సన్నయై ప్రొద్దుకాలంబు ♦ గొని సాకుగాత.

క॥ ఇది యమునాకవచంబును, బదిమాఱులు పరమభక్తిఁ ♦ బఠియించిన య
ట్టిచిత్రము వల ధనము మ,గిది ధనియై వటలి కడకుఁ ♦ గేవలమందున్. ౨౯౧

తే॥ బలియు బుద్ధిమంతుఁడు నైన ♦ బ్రహ్మచారి
నియతితో మితాశనుఁడయి ♦ నెలలు మూఁడు
జరుగునందాఁక దీనిని ♦ జదువ నాతఁ
డఖిల రాజ్యాధిపత్యంబు ♦ నందఁ గలఁడు. ౨౯౨

తే॥ మూఁడు నెలలలో నిశ్చల♦బుద్ధి నిద్ధి, నూటపదితడవలు నుంచి♦చోటునందుఁ
జేరి చదివిన వారికి ♦ సిద్ధిగాని,విషయ మేదియు నుండదో ♦ విమలచరిత! ౨౯౩

తే॥ ఎవఁడు ప్రొద్దున మేల్కాంచి ♦ కృష్ణదర్శ,నాదికారణమగు దీని ♦ నధికభక్తిఁ
జదువునో యాతఁ డైహిక♦సౌఖ్యములను, జెంది గోలోకమున కేగి♦చెన్నుమీఱు.

తే॥ అనఁగ మాంధాత యిట్లనె ♦ యమునయొక్క
సర్వసిద్ధికరంబగు ♦ స్తవముఁ బలుకు
సౌభరీ! యన్న నాతఁడా ♦ జన విభునకు
స్తవము నుడువంగఁ దొడఁగెనో ♦ జనకరాజ! ౨౯౫

యమునాస్తోత్రము.

తే॥ పద్మనాభవామాంససం♦భవకుఁ గొల్చు, కృష్ణకాంతకుజోతంబు శ్రీ♦కృష్ణరూపి
ణికి జోహారువు కాళింది ♦ నిర్గుణికి, జాగిలిఁ భక్తిఁ గోదుత ♦ సల్పుచుంటి.

క॥ సిలుగు సుజనులకుఁ గూర్చెడి, తులువలు కాముకులునైన ♦ గుష్టులు శ్వాదృ
క్తులుగానైరేఁ వారిని, సలలితమతి సాకు నీకు ♦ సల్పెదఁ బ్రణతుల్. ౨౯౭

తే॥ కృష్ణ! కృష్ణస్వరూపవు♦పృథుతరంగ, ములను గూర్మినతారుఁడు♦సెలఁగుచుండుఁ
బ్రబలయమునమత్స్యమూర్తివై ♦ నిలుతువు ప్రతి,బిందువందు గోవిందుఁడు♦వెలుఁగుచుండు

శా॥ అమ్మా! దేవపురుల్ యథాయథలుగా ♦ నబ్జోద్భవాండంబు ఖం
డమ్ముల్ గాఁగ గిరీంద్రభూమిరుహకు ♦ ద్వ్రశేణిదుర్గోరుకూ
లమ్ముల్ గూల జవంబునన్ విరజ ను ♦ ల్లంఘించి లోకమ్ముఁ బూ
తమ్ముఁ సల్పుచుఁ బాఱుచుంటి వినె జో ♦ తల్ నీకు లీలావతీ! ౨౯౯

శా॥ ఫుల్లాబ్జాయతనేత్ర వామభుజసం ♦ భూతా! విభూతీశ్వరీ!
తల్లీ! గోపకగోపికాసురభివ ♦ త్సశ్రేణిసంరక్షణా
భ్యుల్లాసా! యరవిందమిత్ర తనయా! ♦ పూతా! జగన్మోహినీ!
కల్లోలాకర! మేఘవర్ణరుచిరా! ♦ కావింతు నీకంజలుల్. ౩౦౦

ఉ॥ జీవనజోత్పలాది బహు ♦ చిత్రసుమంబులఁ జూత నారికే
ళావనిజంబులన్ మిగుల ♦ హర్షము గూర్చెడి తీవెలన్ బ్రమో
దావహమైన కుంజముల ♦ నందముఁ జెందెడి బృందకావనిన్
ఠీవిఁ దలిర్పఁ జేరుచుఁ గ ♦ డిందిగ మెచ్చెడి నిన్నుఁ గొల్చెదన్. ౩౦౧

సీ॥ కోవిదసన్నుత! ♦ గోలోకమున నీవె, యుత్తమవై సత ♦ ముందువమ్మ!
భూధారంబులో ♦ పాపాత్మువులకెల్ల, దర్వీకరంబవై ♦ తనరితమ్మ!
గోవిందసంగత ♦ గోపకగోపికా, కుర్దనకలితవై ♦ కుదిరితమ్మ!
జలలోలకల్లోల! ♦ సంచయ కోలాహ,లాంచితవై లలి ♦ నలరితమ్మ!

ఆ॥ సకలజగములందు ♦ సౌందర్యవతివమ్మ!, సుమతివినుతవమ్మ! ♦ విమలరూప
మమ్మ! యాదిదేవు ♦ నర్ధాంగివో యమ్మ!, నిన్ను నమ్మియుంటి ♦ నన్నుఁ బ్రోచు.

క॥ యమునా నామముఁ దాల్చిన, నమరులు మీపేరుఁ దలఁచి ♦ యఘనగములఁ జూ
ర్ణముగాఁ గావి తుగు తల్లీ!, యమభగినీ! భక్తి నిన్ను ♦ నారాధింతున్. 303

ఆ॥ నీవు సన్నమైన ♦ యాకృతాంతుండును, నిన్ను దలఁపనట్టి ♦ నీచజనుల
సగిగఁ గొట్టగన్ బ్ర ♦ చండనాముండయి, దండముఁ గొని పురిని ♦ మెండు దిరుగు.

తే॥ విషయకూపములన్ బడి ♦ వెతలఁ గుడిచి, వేమఱున్ విసువొందెడి ♦ వెఱ్ఱుల పయి
నీ కటాక్షరజ్జువు బడ్డ ♦ నిముసమున నె, లేచి వారు కేవలమును ♦ జూచుచుండ్రు.

తే॥ శ్రీవిరాణ్మూర్తి విస్తృత ♦ శీర్షమందు, వేణిరూపకమాలగా ♦ వెలుఁగుచుంటి
వమ్మ! నీగుణమందు నా ♦ వంతయేని, శేషుఁడున్ వర్ణనంబును ♦ జేయఁగలఁడె?

తే॥ ఇట్టి నీ పుణ్యనామతి ♦ నెచట నెచటఁ, బాడుచుందురో యందందు ♦ వఱలు నరుల
భాగ్యమేమని చెప్పనౌ ♦ భానుతనయ!, మోదములొనరింతుఁ గైకొని ♦ ప్రోవవమ్మ!

తే॥ ఇట్టి యమునా స్తవంబును ♦ నేజనుండు, వేకువను లేచి పూర్వోక్త ♦ విధిగ భక్తి
జాపమొనర్చు నతఁడు జగతికి ♦ సౌఖ్యమొసఁగి, భోగములఁ బొంది గోలోక ♦ మునకు నరుగు.

యమునా పటల పద్ధతులు.

వ॥ అనవుడు మాంధాత యానందించి మహాత్మా! యనుగ్రహించి కామ
ప్రదంబులగు కాళిందీపటల పద్ధతులను బోధింపవే యనిన నమ్మునివరుండు
ఇట్లనియె జనవరా! తద్యమునాపటలంబున కాదియందుఁ బ్రణవంబును జేర్చి మాయా
బీజం బుద్ధరించి రమాబీజం బనుసంధించి కాళిందీదేవి యనుదానిని జతుర్థ్యం
తంబుగాఁ జేసి దానికి నమశ్శబ్దంబు గూర్చిన మహామంత్రంబగు. తన్మంత్రం బేకా
దశలక్షావృత్తులు జపించిన సిద్ధించి వాంఛాప్రదంబగు శుభకరంబగు నొక్క
సింహాసనంబున షోడశదళపద్మంబును వేసి మధ్యభాగంబునఁ గర్ణికను జిత్రించి
యమునాసహితుండగు శ్రీకృష్ణుని మనోహరంబుగా లిఖించి పూర్వోక్తకమలంబు
నందలి షోడశదళంబులందు గంగా, విరజా, కృష్ణా, చంద్రభాగా, సరస్వతీ,
గోమతీ, కౌశికీ, వేణీ, సింధు, గోదావరీ, వేదస్మృతీ, వేత్రవతీ, శతద్రు, సరయూ,
ఋషికుల్యా, కకుద్మిను లను నదులను వేఱువేఱుగాఁ దత్తన్నామమంత్రంబులతో
షోడశోపచారంబుల నర్చించి క్రమంబుగా దిక్చతుష్టయంబునను బృందావన,
గోవర్ధన, బృందా, తులసీ, దేవతలను స్థాపించి, యా మంత్రనామంబులతోఁ

బూజించి భగవతియుఁ గళిందనందినియు, సూర్యసంజాతయు, యమభగినియు, శ్రీకృష్ణప్రియయు, యూధీభూతయు నగు యమునకొాఱకని మాటిమాటికి నుచ్చరించుచు నావాహనాద్యుపచారంబులం గావించి పైనిఁ దెలిపిన మహామంత్రంబు జపింపందగు. ఇఁకఁ దత్పద్ధతి యెట్టిదనిన తన్మంత్రపురశ్చరణంబు సిద్ధించునందాఁక బ్రహ్మచారియై మౌనంబుఁ దాల్చి యవభోజియుఁగాని పర్ణాశనుండుగాని యై నేలఁ బరుండి యింద్రియంబులను జయించి కామక్రోధాదులఁ దూరీకరించి సమర్థుండగు దేశికుని నేర్పాటుజేసికొని తదాజ్ఞానుసారంబుగా బ్రాహ్మ్యముహూర్తంబున మేల్కాంచి యమునను సన్నుతించి కాల్యంబులం దీర్చి యరుణోదయంబున నద్యాదులందు స్నానం బొనరించి నిత్యంబులగు జపతపంబులఁ నిర్వర్తించి తన్మంత్రం బనుష్ఠింపందగు. మధ్యాహ్నంబగుడు సంధ్యావందనం బొనర్చి నియమపూర్వకంబుగా నుండందగు. తన్మంత్రపురశ్చరణసమాప్త సమయంబునం బుత్రవంతులగు దశలక్షబ్రాహ్మణులను గంధపుష్పాక్షతాదులతోఁ బూజించి మద్రసోపేతంబగు మధురాన్నం బిడి జాంబూనదపాత్రాంబరాభరణ దక్షిణల నొసంగి సంతుష్టులం జేయందగు. ఇట్లాచరించిన నామంత్రంబు సిద్ధించి బుద్ధిగతాభీష్టంబులను సిద్ధింపఁ జేయు. సందియ మావంతయు లేదు. నీవు ననుష్ఠించి సర్వసుఖంబులఁ బొందు మని యుపదేశింప నారాజవరుండు,　　౩౦౯

ఆ॥ అరుసమొంది ధీర! ♦ యమునా సహస్రనా, మనుతిగూడఁ జెప్పి ♦ మనముపొంగఁ
జేయ వేఁడితి నన ♦ నాయోగి వర్యుండు, వలుకఁ దొడఁగె నిట్లు ♦ పార్థివేంద్ర!

వ॥ భూరమణా! యీమంత్రంబునకు సౌభరిమహర్షియు, యమునదేవతయు ననుష్టుప్ఛందంబును, మాయాబీజము కీలకంబును, రమాబీజంబు శక్తియుగలదు. ఈనామస్తోత్రంబుఁ బఠించుటకు ముందుగా "శ్యామామంభోజనేత్రాం" అను దానితోఁ ధ్యానంబొనరించి "కాళింది" యను నామంబు మొదలు "సర్వతీర్థాధిదేవత" యను నామంబువఱకుంగల వేయినామంబులఁ సక్రమంబుగాఁ జదువనగు. ఇట్టి స్తోత్రం బొకమాఱు సల్పినవాని గృహంబునందుఁ జౌర్యంబును, రెండుసారులు జదివిన వాని కెట్టి ప్రదేశంబున నైనను జోరవ్యాఘ్రాదిభయంబులు గలుగనేరవు. శుద్ధద్వితీయయం దిద్దానిని బ్రారంభించి పూర్ణిమలోపలఁ బదితడవలు పఠించిన రోగి రోగంబునుండియు, బద్ధుఁడు బంధనంబునుండియు విముక్తు లగుదురు. గర్భిణి సుకుమారునిం గాంచు. విద్యార్థి సకలవిద్యలందుఁ గుశలియగు. మోహనస్తంభనోచ్చాటనఘాతనశోషణదీపనోన్మాదనతాపననిధిదర్శనవశీకరణంబులందు నేర్పును మనోగతంబులగు నిష్టంబులను సిద్ధింపఁ జేయు. దీనిని విధివిధానంబుగాఁ బారాయణం బొనరించిన బ్రాహ్మణుండు బ్రహ్మవర్చస్వియు, రాజన్యుండు సర్వరాజ్యాధిపతియు, వైశ్యుండు ధనాధిపతియు నగు. ఇది బ్రాహ్మణముఖంబుగాఁ దన్మహి

మంబు వినిన శూద్రుండును నిర్మలుండై మోక్షార్హుండగు. నిత్యంబును భగవత్పూజాకాలంబున నిద్ది చదివినవాఁ డుదకంబునం దరవిందంబు వొందియు నీరంటనట్లు సంసారమం దుండియుఁ దజ్జనితపాపంబు నంటఁడు. ఇది యొక సంవత్సరంబువఱకు నూరుమాఱులు ప్రత్యహంబుఁ జదివిన సప్తద్వీపవలయితంబగు నిమ్మేదిని నేకచ్ఛత్రాధిపతియై పరిపాలించుననుట కనుమానంబులేదు. నిష్కామియై యెవఁడిది చదువునో వాఁడు పురుషార్థంబులంబొంది జగతింబేర్పొంది జీవన్ముక్తుండగు. మఱియు నిది సావధానంబుగాఁ జదివినవా రఖిలసుఖంబులం గాంచి యంతిమంబున గోలోకంబున కరుగఁగలరని పలుక నా మాంధాత యాలించి యలరి మునికి నతులిడి నిజరాజధాని యగు నయోధ్యాపురంబున కేగెఁ గాదె! యింకను నీవేమి వినవలతువో తెలుపుమని యడుగ జనకుండు నారదున కిట్లనియె. ౩౧౧

తే॥ పుణ్యవశమున గోకులం ♦ బున జనించి, నట్టి సుదతుల గాథల ♦ నల్ల యర్కపుత్రి పంచాంగమున్ వింటి♦భూసుర! మఱి, కృష్ణుఁడందేమి సేసెనో ♦ యెఱుఁగఁ జెపుము!

## ప్రలంబాసుర వధ.

ఉ॥ నారదుఁ డద్దివించు జన ♦ నాథున కిట్లను నొక్కవేళలో
శ్రీరమణుండు భ్రాతయగు ♦ సీరిని గూడుచు గోసమూహముల్
బారులు గట్టి నేత్రయుగ ♦ పర్వముగాఁ జనఁ ద్రోలు చల్ల భాం
డీర వనంబుఁ జేరి యట ♦ నవిగనుండెడి నొక్కచోటునన్. ౩౧౩

తే॥ గోవులను మేయఁ ద్రోలియుఁ ♦ గోడెకాండ్రఁ
గలసి వాహ్యావాహక రూప ♦ లలితకేళి
నాడుచుండెను కంసుచే ♦ నంపఁబడిన
యల ప్రలంబ నిశాచరుఁ ♦ డట్టితఱిని. ౩౧౪

ఉ॥ గోపకబాలకుం డగుచుఁ ♦ గుర్గనలాలసులైన వారితో
శ్రీపతి చూచుచుండఁగనె ♦ చేరి ముదంబున నాడుచుండె నీ
రూ పల గోపబాలకు లె ♦ ఱుంగక పోయి రనంతరంబునం
దా పురుషోత్తముండు గని ♦ యందఱ కయ్యది దెల్పె నత్తఱిన్. ౩౧౫

ఆ॥ ఆటలందుగల్చి ♦ నట్టి నీలాంబరు, నోడినట్టి కుఱ్ఱఁ ♦ డొకఁడు గూడఁ
బందెమేసికొన్న ♦ భంగి మోయఁగలేక, యుంటఁగను ప్రలంబుఁ ♦ డోప్పికడఁక.

ఉ॥ సీరిని స్వాంసలాంసమునఁ ♦ జేకొని పైనమొనర్చి యట్టి భాం
డీర వనంబు నుండియు వ ♦ డిన్ యమునాతటినీతటంబునన్
జేరిచి యందునుండి మఱిఁ ♦ జెల్వగు శ్రీమధురాపురంబునన్
జేరుట కుద్యమించు తఱి ♦ సీరి గనుంగొని యాక్షణంబునన్. ౩౧౭

చ॥ ఘనసమమైన రూపమది ♦ కంబుగ దాల్చి ధరాధరేంద్రుడు మా
ర్కొని బహుదుర్గముండయి త ♦ టిత్సహితాభ్ర గత ప్రపూర్ణచం
ద్రునివలె దైత్యపృష్ఠమున ♦ దోచి వెలుంగ దొడంగె దీప్తిదీ
ప్తనవమణి ప్రకాశిత సు ♦ వర్ణమయాభరణంబులన్ మఱిన్. ౩౧౮

ఉ॥ చండపరాక్రముం డయిన ♦ చక్రి సహోదరుడా ప్రలంబు దు
ర్దండభయంకరుం డగుట ♦ దా గని వేగము వాని బట్టి యా
కొండలగొట్టు నింద్రువలె ♦ గ్రుద్ది శిరంబును జెండివైచె బ
ల్దండిగ బూలవాన విబు ♦ ధ ప్రతతుల్ గురియంగ భూవరా! ౩౧౯

ఉ॥ అంతట వాని జోతియును ♦ నా బలరామునిలో లయించె న
త్యంత జయధ్వనుల్ దివిని ♦ ధాత్రిని నిండె నరేంద్ర! యన్న భూ
కాంతుడు దిర్గియిట్లు పలు ♦ కం దొడగెన్ మఱి వాని పూర్వ జ
న్మాంతర పుణ్యగాథను ద ♦ యామతి నాకు వచింపవే సుధీ! ౩౨౦

ప్రలంబాసుర పూర్వజన్మ వృత్తాంతము.

చ॥ సురముని తిర్గి యిట్లనె య ♦ శోధన! తొల్లి గుబేరు డిందు శే
ఖర పదపద్మపూజకు స్వ ♦ కంబగు చైత్రరథంబు నందునన్
విరులను రక్ష సేయగ బ్ర ♦ వీణత గాంచిన యక్షవర్యులన్
వఱల నొనర్చె నాభటులు ♦ భద్రముగా గనుచుండి రింతలోన్. ౩౨౧

తే॥ ఒక్క దినమందు నేర్పరి ♦ హూహువనెడి, వానికొడుకును శ్రీహరి ♦ భక్తవర్యు
డు నగు విజయుండన్ గంధర్వ ♦ జనుడు హరిని, వేణువీణాగళంబులన్ ♦ వీధి వీధి.

ఉ॥ స్తోత్రము జేయుచున్ ధనదు ♦ తోటను నెవ్వరెఱుంగ నట్లుగా
నాత్రముతోడ జొచ్చి విరు ♦ లన్నిటి దిన్నగ గోసికొంచు నే
మాత్రపు సద్దులేని యటు ♦ మంచివడిన్ జనె నంతదాని నా
చైత్రరథేశ్వరుండు గని ♦ చాల విచారముబొంది కిన్కతోన్. ౩౨౩

చ॥ అరరె! యిటుల్ మదీయ వన ♦ మందున జేరి సుమంబు లన్నిటిన్
బొరిబొరి గోసి కైకొనుచు ♦ బోయె నెటో యల తెక్కరీడు త
న్నర సుర యక్ష కిన్నర గ ♦ ణస్థితుడైన ఘనుండునైన ను
ద్ధురమగు నాదు శాపమున ♦ దోడ్తన రక్కసుడౌచు బుట్టుతన్. ౩౨౪

చ॥ అని శపియించె దద్విధిని ♦ నా విజయుండు నిశాట రూపమున్
దనకు ఘటిల్లుచుండుట న ♦ దాటున గాంచి యకృత్యమెంచి తో
డ్తన యల గుహ్యకేశ్వరుని ♦ దాపునకుం జని తత్పదంబులన్
వినయ విధేయతల్ గలిగి ♦ వేమఱు మ్రొక్కి నుతించి యిట్లనెన్. ౩౨౫

తే॥ తప్పుఁ బొరపాటుచే నిప్పు ♦ తావకోప, వనము నందునఁ జేసితి ♦ ధనద! నేను
రాక్షసాకృతితో ధరఁ ♦ బ్రతుకఁజాలఁ, గాన మన్నించి బ్రోవుము ♦ కరుణతోడ
తే॥ అనఁగ నా నరవాహనుఁ ♦ డభిమతించి, ద్వాపరాంతము నందున ♦ వాసుదేవు
నన్నయౌ బల భద్రుని ♦ హస్తములను, శాపముక్తుఁడ వగుదువో ♦ సరసహృదయ!
తే॥ అనుచుఁ గరుణించె దత్సూక్తి ♦ నా విజయుఁడు,
దైత్యుఁడై ప్రలంబాఖ్యతోఁ ♦ ధరణిఁబుట్టి
యచ్యుతాగ్రజ హస్త సం ♦ హతుల శాప
ముక్తుఁడై పరమొందె నో ♦ పుణ్యపురుష! 3౨౫

## కృష్ణుండు దావాగ్నిని మ్రింగి గోపకులను రక్షించుట.

తే॥ పిదపఁ గేళిలాలసులగు ♦ పిల్లవాండ్రు, ఘాస లోభంబునఁ ముంజ ♦ కాననమున
కరిగి మేసెడి నాత్మీయ ♦ సురభి తతుల, ద్రోలుకొని రాఁగఁ దెరువ ♦ తోడఁనేగి.
సీ॥ మన్మథ దేవుని ♦ మన్ననఁ గల్పు ము, క్కంటిదౌ మూఁడవ ♦ కన్నునంగ
భగ్గుభగ్గునమండి ♦ యెగ్గుల మిక్కిలి, కలిగించెడి బడబా ♦ నల మనంగ
నంభోధిమంధన ♦ మందు నొక్కుమ్మడి, బైలుదేరిన విష ♦ జ్వాల లనఁగ
సర్వలోకంబుల ♦ క్షణములోన దహించు, ప్రలయ కాలాభీల ♦ వహ్ని యనఁగ
తే॥ ఘోర భీకర మైనట్టి ♦ కారుచిచ్చు, పుట్టి తన్మహారణ్యంబుఁ ♦ జుట్టుముట్టి
కాల్చుచుండుటఁ గనుఁగొని ♦ కాతరులయి, యేమితోఁచక యెలుగెత్తి ♦ యిటుల ననిరి.
మ॥ అదిగో దావము చిట్పటార్భటులతో ♦ నంతంతకుఁ మమ్ములఁ
గదియఁ సాగె ఘృతోరుకౌస్తుభమణీ! ♦ తన్మౌరాజచూడామణీ!
త్రిదివేశేశ్వరరక్షణప్రియమణీ! ♦ దీనాళి చింతామణీ!
స్వదయార్ద్రాఘభుజంగగారుడమణీ! ♦ చక్రాదిపాణీ! గుణీ! 33౧
తే॥ కృష్ణ! కృష్ణ! కృపాకరా! ♦ కీర్తనీయ! మమ్ము దావాగ్ని కసితోడ ♦ మంటఁ గలుప
వచ్చెడిని నిన్నుశరణంబుఁ ♦ జొచ్చుచుంటి, మయ్య! చయ్యన రక్షింపు ♦ మియ్యదనుకన.
చ॥ అనఁ గరుణాళుఁడుం డయిన ♦ యచ్యుతుఁ డిట్లనె నన్నలార! మీ
మనముల భీతి వీడి యొక ♦ మాఱు కనుంగవ మూయుఁడీ! యన
న్వని యల గోపబాలురు స్వ ♦ నేత్ర యుగంబును మూసి రంత నా
వనజదళాయతేక్షణుఁడు ♦ వహ్ని దహించెడి చోటు జేరుచుఁ. 333
చ॥ జలమును గ్రోలు పోలికను ♦ సాదపు ముద్దను మ్రింగు భంగిగా
నలయముగా దహించెడి ద ♦ వంబు గుటుక్కున మ్రింగె నింగి వే
ల్పులు దమ వ్రేళ్ల నాసికల ♦ నూపి విచిత్రముఁ బొందుచుండ మి
త్రులు నులు కాత్మలఁ విడిచి ♦ తోషముఁబొంద బలుండు మెచ్చఁగాఁ. 33౪

మ॥ తరువాతన్ మునివర్యుఁడైన హరి యా ♦ దానంబుఁ బో కార్చి త
త్సురభివ్యూహకగోపబాలకులతో ♦ సూర్యాత్మజాతీరభా
సురభాండీరమహావనస్థపృథులా ♦ శోకాటవిం జేరి సం
బరమొందెన్ జనకా! మహాత్ములకు నే ♦ భావంబు సిద్ధింపదే? 33౭

ఉ॥ అంతన గోపబాలకులు ♦ నాఁకట దప్పిని బీడఁ బొంది బ
ల్దిండి బలాన్వితాచ్యుతుని ♦ లెస్సగ వందనముల్ బొనర్చి తా
రందరు జేరి వేఁడి రిటు ♦ లక్కట! దూపను ఝుత్తుచే వ్యథల్
జెంది నశింపనుంటి మిఁకఁ ♦ జెచ్చెరఁ బ్రోవుము! నందనందనా! 33౮

తే॥ అంత సోకుమారకులగొంగ ♦ యంచుల కురక, రీకరించియు వారికీ ♦ రీతిఁ బల్కె-
మాధురులగు బాపలతోడ ♦ మఖము నంగి, రసుఁ డొనర్చెడి నీచెంత ♦ రయమునతోడ.

ఉ॥ అచ్చటి కేగి బ్రాహ్మణుల ♦ కందఱికిన్ గిడిగిస్ఫు భక్తితోఁ
గ్రచ్చఱ నల్పి యన్న ముద ♦ కంబుల నడ్గుడు పొందనంగ వా
రచ్చట నుండి పైనమయి ♦ యా మునివర్యుని యజ్ఞవాటికన్
జొచ్చి విధేయులై మిగుల ♦ జోత లొనర్చి వచించి రిట్టులన్. 33౯

ఆ॥ విప్రవర్యులార! ♦ యప్రమేయుండగు, గోకులేశసుతుఁడు ♦ గోపబాల
కులను గూడి గోత ♦ తులఁ దమిఁ ద్రోలు చ, శోకవనడి వనికి ♦ సొరిది వచ్చె

క॥ ఆతఁడు నాతని భ్రాతయు, నాతనితోఁ దిరుగు ♦ లాండెకి మిత్ర
వ్రాతము లన్నోదకముల, నాతురులై బందువలన ♦ నవి మీారిసుఁడీ! 3౪౦

ఉ॥ వారల కుయ్యిలన్ విని స ♦ వక్రియలన్ నెరవేర్పు భూసురుల్
వారికి నిట్లు వాకొనిరి ♦ బాలకులార! ముదంబుతో నిటన్
వారిని గాని యోదనము ♦ పట్టెడుగాని యొసంగు వీలు మా
కేరహిఁ గల్గలేదని వ ♦ చింపఁగఁ జింతిలుచుంటి మక్కటా! 3౪౧

శా॥ అంతన్ వారు నిరాశులై యల సరో ♦ జాక్షున్ మఱిన్ జేరుచున్
జింతాక్రాంతమనస్కులై యనిరిటుల్ ♦ శ్రీకృష్ణ! నీ యానతి
న్జింతాకంతయు దాఁటకుండ మఖమున్ ♦ నేమంబుతోఁ జేయు వే
దాంతార్థప్రథితాగ్రజన్ములను మే ♦ మర్థింప నన్నంబునుల్. 3౪౨

క॥ ఏమియు లేవని వాకొని, రామీఁదట మీాకు దరికి ♦ నరుదెంచితి మిం
కేమెటు బ్రతుకంగలమో, యీామెయి నుడువంగవలయుఁ ♦ దృష్ణన్ గృష్ణా!

క॥ నావుడు వారికి నిట్లనె, శ్రీవిభుఁడో బాలులార! ♦ చెచ్చెర నలభూ
దేవుల భార్యల చెంతకు, నీవేళని పోయి యడిగి ♦ యిచ్చులఁ గనుఁడీ! 3౪౪

క॥ ఈతడవకు నామాటను, బ్రీతిగ విని పొండనంగఁ ♦ బిల్లలు మఱి యు
త్పాతోన్మూలనపటునవ, మాతతముగఁ జేయు నిక్క ♦ కంగియు నంమన్.

చ॥ చెలఁగెడి ధాత్రిదేవతల ♦ చెల్వల మ్రొక్కుచు నమ్మలార ! గో
కులపతిపుత్రకుండు నవ ♦ కోటిసుధాకరసుందరాస్యుఁడున్
జలదనిభుండు పుష్పశర ♦ సామ్యమనోహరవిగ్రహుండు నా
జలజదళాయతాక్షుఁడు వ్ర ♦ జస్థలినుండి వయస్యయుక్తుఁడై. ౩౪౬

ఉ॥ గోవులఁ ద్రోలుకొంచు ఖగ ♦ గుల్మలతాపరిపూర్ణమౌ యశో
కావనిజాభిరామవని ♦ కాగతుఁ డయ్యెను నందునున్న మి
త్రావళితోడ క్షుత్తృషల ♦ నక్కలిఁ బొందెడి దాన మీరు మా
కేపిధనేఁ జలాన్నముల ♦ నిండిఁకఁ ద్రోయకుఁ డన్నదుక్తులన్. ౩౪౭

మ॥ అని వేఁడన్ ధరణీసురాంగనలు దా ♦ మాలించి యాకుఱ్ఱలన్
గని యో బాలకులార ! మీరిపుడిటన్ ♦ గాంక్షించు నన్నాంబువుల్
గొనుఁడీ ! యట్టి మహామహుం గనుటకై ♦ కోర్కుల్ ఫలింపంగ మే
మును రానెంచితి మంచు వారి కిడి ర ♦ ప్యంబువ్వ లవ్వారిగాన్. ౩౪౮

చ॥ పదపడి బాలకుల్ సనిరి ♦ బ్రాహ్మణభార్యలు బైలుదేరి స
మ్మదమునఁ దన్మహాటవిని ♦ మన్మథమన్మథు సాగ్రజన్మునఁ గృ
ష్ణుఁ దసివి తీఱ విన్నవిధిఁ ♦ జూచితిమం చరుసంబుఁ బొంది త
త్పదములకున్ నమస్కృతుల ♦ భక్తిని బల్మ లొనర్చియుండుడున్. ౩౪౯

తే॥ తెమ్మికంటియుఁ గన్గొని ♦ తన్వులార!, మీర లిటకు నేతెంచుటల్ ♦ మేలుసుమ్మి
వల్లభులతోడఁగూడి ప్రా ♦ పంచిక సుఖ,ములను జెంది గోలోకంబుఁ ♦ బొందఁగలరు

క॥ అని వరమిడ నతులిడి వా,రు నశోకవనమ్మునుండి ♦ త్రుటిలో నాత్మీ
యనిలయములకున్ జనుదెం, చినఁ గని తత్ప్రియులు నెదలఁ ♦ జింతిలి రిట్టుల్.

తే॥ సరసిజాక్షునిఁ గనిన మా ♦ తరుణిమణుల,జన్మములె సార్థకంబులు ♦ సత్య మల్ల
కంసభయమున శౌరిని ♦ గనని మాదు, జన్మ మేటికిఁ గాల్పనే ♦ జగతియందు.

ఉ॥ పిమ్మట నందనందనుఁడు ♦ పిల్లలు దెచ్చి యొసంగు నన్నతో
యమ్ముల మిత్రసోదరస ♦ మన్వితుఁడై భుజియించి గోసమూ
హమ్ములఁ ద్రోలుకొంచు హృద ♦ యంగమమౌ నల బృందకాటవిన్
కమ్మగఁ జేరె నో యుపని ♦ షద్విపులార్థవిదగ్రణీ! గుణీ ! ౩౫౩

శ్రీకృష్ణుండు గోపకులకు వైకుంఠలోకంబు జూపుట.

ఆ॥ పాపహారమగు మఱి యొండు ♦ శ్రీపతికథఁ
జెప్పుచుంటిని విను మార్య ! ♦ శ్రీకరంబు
నఘహారంబును బరమంబు ♦ నఖిల శుభద
మైన యేకాదశీవ్రత ♦ మాస్థతోడ. ౩౫౪

ఉ॥ గోకులనాథుఁ డొక్కతఱిఁ ♦ గోర్కి ఫలింపఁగఁ జేసి ద్వాదశిన్
వేకువలేచి గోపపరి ♦ వేష్టితుఁడై యమునా ధునీమణిన్
వీఁకను జొచ్చి క్రుంకులిడు ♦ వేళను నప్పతిసేవకుండు గ
ద్గోకులనాథు రజ్జువుల ♦ తో బిగకట్టి మహాజవంబునన్. 3౫౧

తే॥ వరుణలోకంబునకుఁ గొని♦పాఱె నవల, గోపకులను గోలాహల♦మాపఁజాల
నట్టు లయ్యేను బిమ్మట♦నచ్యుతుండు, వారి నూరార్చి ముట్టె యా♦వరుణపురిని.

చ॥ పరుషమతిన్ మదేభముల ♦ వాజులఁ దేరులఁ గేతనంబులన్
బరిఖల దుర్గవప్రములఁ ♦ బత్తుల భర్మమయోరుహర్మ్యముల్
బొరిఁబొరి బూదిలోఁ గలిపి ♦ మూలను డాఁగిన పాళిఁబట్టగా
నరిగెడివేళ నా వరుణుఁ ♦ డంజలులన్ ఘటియించి యిట్లనెన్. 3౫౨

ఉ॥ కోపము మానుమయ్య! యను ♦ కూలపథంబున నుండుమయ్య! మా
యోపినయంత మీ మొడ న ♦ నుత్తమరీతి వసింతుమయ్య! మే
మీపరిఁ జేయు తప్పులను ♦ నెంతయు నీవు క్షమింపుమయ్య! యో
శ్రీపతి! నీ పదంబులకు ♦ శీర్షముతో నతులం బొనర్చెదన్. 3౫౩

క॥ గోపీమకూలచోరా!, గోపీకేళీవిలోల! ♦ గోపీనాథా!
గోపకరాజకుమారక!, గోపకవంశాబ్ధిచంద్ర! ♦ గోపాలమణీ! 3౫౪

మత్తకోకిల॥ శిష్టరక్షక! దుష్టశిక్షక! ♦ చిత్రఖేలనలోలుపా!
యష్టదారమనోహరా! పృథు ♦ లాదితేయగణప్రియా!
యష్టమూర్తినుతప్రభావ! య ♦ హస్కరార్బుదతుల్య! మా
కష్టముల్ దొలఁగంగఁ జల్లగఁ ♦ గావుమా! కమలేశ్వరా! 3౬౦

శా॥ బ్రహ్మాండేశ్వరు బ్రహ్మనాభు సనఘున్ ♦ వందారు మందారునిన్
బ్రాహ్మణ్యాంఘ్రిసరోజరాజివినతి ♦ ప్రారంభ ధన్యాత్మునిన్
బ్రహ్మానందమయున్ నిరామయుని శ్రీ ♦ రాధామనోచోరుఁ ద
ద్బ్రహ్మనిర్వచనీయుఁ గృష్ణుని నినున్ ♦ బ్రార్థింతు విశ్వంభరా! 3౬౧

చ॥ అని పొగడంగఁ జక్రధరుఁ ♦ డాగ్రహమున్ విడి సుప్రసన్నుఁడై
మనమున భీతి మానుము సు ♦ మాళముగా మను మోయి పాశి! యీ
పనులికఁ జేయకుండుమని ♦ పల్కుచు నందుని త్రాళ్ళు విప్పి తో
డ్కొని యమునాతటిన్ వెలుఁగు♦గోపకసన్నిధిఁ జేర్చె నంతటన్. 3౬౨

ఉ॥ నందముఖంబునన్ వనజ ♦ నాభు ప్రభావము గోపకుల్ మహా
నందము గల్గఁగా వినియు ♦ నమ్మఁగఁజాలక నందనందనున్
దొందరతోడ డాయుచు మ ♦ ధుస్రవదుక్తులఁ బల్కి రిట్లు గో
విందకుదారవిందయుగ ♦ వేష్టన జృంభితబంభరోపమా! 3౬3

తే॥ నీరజాతాయతేక్షణా! ♦ నిశ్చయముగ, నీవు భగవంతుఁడవె? యైన ♦ నీకుఁ డెంకి
యైన వైకుంఠలోకంబు ♦ నమరులను, విడిచి చూపింప వినుతిఁ గా ♦ వింతు మిపుడు.

క॥ అంత ననంతశయానుఁడు, సంతసమున్ గని సగోప ♦ జనుఁడై వైకుం
ఠాంతరదేశంబున కత్యంతంబగు శీఘ్రగతిని ♦ నరిగియు నటఁ దాన్. ౩౬౫

సీ॥ వేయి శిరంబులు ♦ వేయి పాదంబులు, వేయి భుజంబులు ♦ వెలుఁగుచుండ
శంఖంబుఁ జక్రంబు ♦ శార్ఙ్గంబు గదయును, బద్మంబు వనమాల ♦ పరిఘవిల్లు
చామరాందోళికా ♦ చ్ఛత్రకిరీటకే, యూరాది భూషలు ♦ నొప్పుచుండ
నవ్వధికోటులు ♦ జక్కఁగాఁ గావించు, పార్షదుల్ పెక్కురు ♦ వరగుచుండ

తే॥ పెక్కుసూర్యుల కాంతులు ♦ పెరుఁగుచుండ
సురమహారాజులు ప్రొక్కి సం ♦ స్తుతులు సల్ప
జ్యోతిరరుమండలంబున ♦ నొప్పు సింహ
పీఠమున నున్న శేషుపై ♦ వెలిఁగె నపుడు. ౩౬౬

తే॥ గోకులమునుండి వచ్చిన ♦ గోపకు లతి, భయమునన్ గుసగుసలాడి ♦ వఱలుచుంటఁ
గాంచి పార్షదులెల్లరు ♦ కని దవ్వు, నందు వారిని గూర్చుండ ♦ నాజ్ఞ చేసి.

ఉ॥ ఎత్తఱినైన విష్ణుసభ ♦ నీరలు గాంచితిరో కొలఁకా? యిట్టులు
న్మత్తులు పొక్కి వాగుటయు ♦ నాఁగనమో? యిూ యెడ నాల్గువేదముల్
మొత్తముగాఁ బరేశ్వరుని ♦ ముచ్చట సెప్ప టెఱుంగరో కొలఁకా? నో
శ్శైత్యక యింక భక్తి నల ♦ కృష్ణుని గొల్వుఁడి! ముక్తిఁ బొందుఁడీ! ౩౬౮

తే॥ అని వచింపఁగ గోపకుల్ ♦ హర్ష మొంది
మానసమును బూని తమ తమ ♦ మానసముల
కిట్లు బోధించుకొని రీగ ♦ మేశ్వరుండు
దివ్యసింహాసనంబునఁ ♦ దేజరిల్లి. ౩౬౯

చ॥ మనల నధఃకరించి యొక ♦ మాటయు నేమ్మనతోడఁ బల్కఁ డం
దున శతధా ప్రజస్థలమొ ♦ తుష్టికరంబు సుఖప్రదంబు గా
వున నిట లేచి యచ్చటికిఁ ♦ బోవఁగ నౌనని యెంచు వారిఁ దో
డ్కొని వడిలో రమేశ్వరుఁడు ♦ గోకులమేగె ననంతరంబునన్. ౩౭౦

## సుదర్శనోపాఖ్యానము.

సీ॥ మఱియొకవేళను ♦ మఱిగణాన్వాన్వితు, శకటముల్ గొంచు గో ♦ పకనికరము
ననసందవరు లుప ♦ నందులు మడ్వృష, భానువులున్ దమ ♦ వసతినుండి
నక్షిపర్వంబైన ♦ యంబికావనమున, కరిగి సభృత్యులై ♦ యందు విడిసి
యందు మహావిద్య ♦ యను పేరఁ బరగెడి, భద్రకాళీదేవిఁ ♦ బార్వతీశు

తే॥ భక్తితోడుతఁ బూజించి ♦ పాపతాప
హారమగు శ్రీసరస్వతీ ♦ ప్రవాదినీత
టమున భూదేవతలకు దా ♦ నముల నొసఁగి
ప్రొక్కి మృష్టాన్నము భుజించి ♦ ముచ్చటాడి. ౩౨౧

క॥ అందంబగు నొకచోటున, నందఱు నిదురించి రంత ♦ నజగర మొండా
నందుని పాదము గఱువఁగ, నందుఁ డులికిపడుచు లేచి ♦ నలఁగుడు పడుచున్.

ఆ॥ పాహి! పాహి! కృష్ణ! ♦ పంకజలోచనా!
యేదొ కఱచె నన్ను ♦ నీవు గనుమ!
యంచు నెలుఁగునెత్తి ♦ యార్వ నిద్రించిన
వారు లేచి యటకుఁ ♦ బాఱి చేరి. ౩౨౩

క॥ కఱచెడి నురగముఁ గనుఁగొని, కొఱకొఱలాడుచును గట్టెఁ ♦ గొట్టినఁగానీ
శిరమునఁగలమణి వీడని, తెఱఁగున నది యడుఁగు విడక ♦ తిరుగుచు నుండెన్.

క॥ అత్తఱిఁ గాళియమర్దనుఁ, డత్తెఱఁగును గాంచి కసి ని ♦ జాంఘ్రిని దన్నన్
దత్తఱిలి యది తదాకృతిఁ, బొత్తుగ విడి పొంది పూర్వ ♦ పుణ్యాకృతినిన్. ౩౨౪

వ॥ శ్రీహరినిం జేరి సాష్టాంగప్రణామంబు లాచరించి ముకుళిత కరారవిందుండై స్వామీ! భక్తవత్సలా! యేను సుదర్శనుం డను పేరంబరగు విద్యాధరుండను. ఒక్కసమయంబున నష్టావక్రమహామునీశ్వరుం గాంచి పరిహసించితిని. దాన నామహామహుండు కసలి సర్పంబు గమ్మని నాకు శాపం బిడె. అక్కతన నిందనుకఁ దద్భోగిరూపంబున నుండి పతితపావనేత్యాదిబిరుదాంచితభవత్పదపద్మమకరందరజఃకణస్పర్శనంబునఁ దచ్ఛాపంబు సమాప్తంబై తొల్లింటి రూపు నాకుఁ జేకూఱె ధన్యుండ నైతిం గాదె? ఇట్టి లోకశంకరుండవగు నిన్ను సన్నుతింప సమర్థుండనే? మన్నించి నన్ను రక్షింపు మని ప్రార్థించి సర్వోపద్రవరహితంబగు వైకుంఠలోకంబున కేగె. అంత నందులకా నందాదిగోపకు లంద అధికాశ్చర్యానందంబులం బొంది యాతండు భగవంతుండే యని నిశ్చయించి పొగడుచు మరలి వ్రజమండలంబున కేతెంచిరి. ౩౨౫

తే॥ వెండి యూవేమి వినదవో ♦ వేగఁజెపుము, యనఁగ జనకుండు మోదిల్లి ♦ యావ్రజమున
వనరుహాక్షుఁ డేలీలల ♦ నొనరిచెనొకొ? తెలుపుమా! యనఁగ మునిమణి ♦ పలికె నిట్లు.

తే॥ పసిఁడిపుట్టముతాల్పొక్క ♦ పట్టునందు, నన్నతోఁగూడి స్వీయగృ ♦ హంబునుండి
వెడలి యచలభాగములందుఁ ♦ బిల్లవాండ్రఁ, గూడి డాఁగురుమూఁత ♦ లాడఁదొడఁగె

## శ్రీకృష్ణుండు వ్యోమారిష్టాసురులను వధించుట.

తే॥ అట్టిపట్టున దిట్ట మ ♦ యాత్మజుండు, బలియు నగు వ్యోమదైత్యుండు ♦ బైలుదేరి
గోపరూపంబు దాల్చి త ♦ త్కుగ్గడనరతు, లైన గోపకబాలుర ♦ నపహరించె.

తే॥ కొండబండల క్రిందుఁగాఁ జండగతిని, సారెసారెకు వచ్చుచుఁ జనుచు నున్న
శాద్రిసానువులందున భద్రపఱచు, చుంట సోకుమూకలగొంగ యొయ్యఁజూచి.

ఉ॥ రక్కసునిం గరంబులఁ గరంబుగఁ బట్టి ధరాస్థలంబుపై
నుక్కున నొక్కపెట్టున జయోక్తులు నిండఁగఁ బుష్పవర్షముల్
జక్కఁగ దేవత ల్గురియ సంగడికాండ్రును మెచ్చ నన్యుల
మ్మక్క! యనంగఁ గొట్ట నతఁ డానిముసంబున నీల్గె భూవరా! ౩౫౧

ఆ॥ అంత వాని జ్యోతి యఖిలదిక్కులయందు, వెలిఁగి చక్రిలోన విలయమొందె
ననఁగ జనకుఁడో మహర్షి! తత్ప్రాక్తన, జన్మచరిత మెఱుఁగ స్పష్టపఱచు.

క॥ నావుడు ముని యని నాతఁడు, భూవర! భీమరథనామ భూమీశుఁడున్ మే
ధావియు, యజ్వయు, ధని బలి, శ్రీవిభు భక్తుండు నగుచుఁ జెలఁగెను గాశిన్.

ఉ॥ ఆతఁడు రాజ్యపాలనము నందఱు నౌనని మెచ్చఁ జేసి ని
ర్భీతిని బట్టభద్రునిగఁ బ్రెగ్గడయైన కుమారు సల్పి వృ
త్తాలిత దివ్యమైన మల యాద్రికి నేగియు లక్షవర్షముల్
బ్రాఁతిగ నిల్చి శ్రీధరుఁ దపం బొనరించెను తత్క్షణంబునన్. ౩౫౪

తే॥ మునివరుఁడగు పులస్త్యుఁడు ముచ్చటపడి, ఛాత్రబృందంబుతోఁగూడి చనఁగనట్టి
భీమరథరాజు లేవక వినతులిడక, గర్వియై యుంటఁ గనుఁగొని కరము గనలి.

క॥ దనుజుఁడవగుమని శాపం,బు నొసంగెను నంత నట్టి భూమీధవుఁడా
మునిపదములపైఁ బడి శరణను జెందఁ బులస్త్యముని కనుంగొని దయతోన్.

తే॥ ద్వాపరాంతమునందున వ్రజములోన, జక్రి యుదయించుఁ దద్భుజశక్తిచేత
శాపముక్తుఁడవై నీవు శౌరియందు, లీనమయ్యెద వో సుధీ మాననీయ!

తే॥ అని వచించెను బిమ్మట నాతఁ డల్ల, మయనిశాచరపుత్రుఁడై మహినిబుట్టి
వ్రజమునందున శ్రీహరి బాహుశక్తి,చేత గిట్టి పరేశ్వరున్ జేరె జనక!

ఉ॥ వెండియు నిల్లు యొక్కతఱి విశ్వభయంకరుఁ డాయతాంగుఁడున్
జండపరాక్రముండు దను జప్రముఖుం డతికుత్సితుం డరి
ష్టుండను వాఁడు గోపకళి శుభ్రకరంబునఁ జేరి రోదసిన్
నిండి ప్రతిధ్వనింపఁగ ననేకవిధంబుల బొబ్బరించుచున్. ౩౫౯

తే॥ శృంగములతోడ గిరుల మహీస్థలమునఁ, గూల్చి తరువుల నన్నిటిన్ గోడుపఱచు
చుంట గోగోపగోపికలోర్వలేక, భయమునన్ గాల్కొలందిగఁ బాఱి రవల.

చ॥ సభయుల నాత్మమిత్రులను శౌరి కనుంగొని భీతి వీడుఁ డం
చభయ మొసంగి యట్టి వృష భాకృతినుండిన దైత్యుఁ ద్రోయ వాఁ
డు భళి యనంగ మాధవుఁ బ టుత్వమునం గొని దచ్చికోసులన్
రభసముతో ధరన్ బడఁ గరంబుగ నెట్టెను కృష్ణుఁ డంతటన్. ౩౬౧

ఉ॥ బాలుఁడు చెంబు బండవయి ♦ బ్రద్దలుగాఁ బడవైచినట్లు గా
లీలఁగ వాని వాలము ల ♦ లిం గొని గిఱ్ఱునఁ ద్రిప్పి త్రిప్పి యా
నేలను గొట్టె నంత నల ♦ నిర్జరవైరియు లేచి యొక్క పెన్
శైలముఁ గొమ్ములన్ బెఱికి ♦ చక్రిశిరంబున వేసె నార్చుచున్. ౩౯౨

ఉ॥ అయ్యది కాంచి కిన్క మరు ♦ నయ్యఁయు నయ్యచలంబు నయ్యెడ
న్జయ్యనఁ గొంచు నయ్యసుర ♦ నాథు తలన్ బడవైచె దానిచే
నయ్యసురుండు కొంతవడి ♦ వ్యాకులుఁడై మఱిలేచి కొమ్ములన్
గయ్యము గోరి యుర్వి నుద ♦ కంబు జనించెడిలాగు గ్రుమ్ముచున్. ౩౯౩

చ॥ కమలదళాక్షుపై నుఱికెఁ ♦ గాఁ గని చక్రి తదీయదీర్ఘ శృం
గములను బట్టి వాతహతిఁ ♦ గంజము తిర్గిన యట్లు త్రిప్పి రో
షమున ధరిత్రిఁ గొట్టఁగ ని ♦ శాటుఁడు రక్కసి రూపువీడి భూ
మ్యమరశరీర మూని యల ♦ యంబుజనాభుని మ్రొక్కి యిట్లనెన్. ౩౯౪

సీ॥ నీరమణీయాంఘ్రి ♦ నీరజంబునఁ గదా, తుంగవీచీ సంగ ♦ గంగ పొంగె
నీమనోహరనాభి ♦ నీరజజనిఁ గదా, పృథుమాయ బిడ్డలఁ ♦ బెట్టియుంట
నీ కమనీయాస్య ♦ నీరజంబునఁ గదా, భూసురవర్యులు ♦ బుట్టియుంట
నీదివ్యలోచన ♦ నీరజంబులఁ గదా, నీరజమిత్రుండు ♦ నెగడియుంట

తే॥ నీమనంబునఁ గద చంద్రుఁ ♦ డామతిలుట, నీదు సంకల్పమునఁ గదా ♦ నిఖిలభువన
ములును బుట్టుట గిట్టుట ♦ యలరియుంట, పాశుపాల్యప్రవీణ! గో ♦ పాలబాల!

మ॥ కరుణాంభోనిధి! నందపుత్ర! నిజ భ ♦ క్తశ్రేణికల్పద్రుమా!
వరతంత్వాఖ్యుఁడ బ్రహ్మచారిని సురో ♦ పాధ్యాయశిష్యుండ భూ
సురుఁడన్ నేఁ బొరపాటుచే గురుదరిన్ ♦ జొచ్చిల్లి పాదంబులన్
గరమున్ జాపి తిరస్కరింప గురుఁడున్ ♦ గాఠిన్యభావంబునన్. ౩౯౬

తే॥ ఎద్దువగుమని నను శపి ♦ యించెఁ గృష్ణ!, దాన వంగదేశములందు ♦ నేను వృషభ
రూపమును దాల్చితి సురవి ♦ రోధిమైత్రి, వలన రాక్షసత్వంబును ♦ గలిగె నాకు.

తే॥ నీయనుగ్రహంబున నేను ♦ నేఁడు వేడ్క, శాపముక్తుండనైతి రా ♦ క్షసత విడిచి
యుంటి నీ రేడుజగముల ♦ కొడయఁడవగు, నీకు మ్రొక్కెద శ్రీకృష్ణ! ♦ నిర్మలాత్మ!

తే॥ అనుచు మ్రొక్కి విమానంబు ♦ నందు నెక్కి, దివ్యతేజంబుతో వాఁడు ♦ దివముఁ జేర
నిపుడు పాపహారంబు న ♦ భీష్టదంబు, నైన మాధుర్యఖండంబు ♦ నంటి జనక!

ఉ॥ ఆపదధీనదీనకరు ♦ ణార్ద్రకటాక్ష! విపక్షశిక్షకా!
గోపరిపాలనప్రియ! య ♦ ఘోరసుదర్శనచక్రపాణి! ల
క్ష్మీపతి! శౌర్యధైర్యబల ♦ శేవధి! ధీనిధి! యాదవాన్వయో
ద్దీపక! సూర్యకోటిసమ ♦ దీప్తివిభాసుర! భూమనోహరా! ౪౦౦

ఉత్సాహ॥ నిత్యసత్య శుద్ధబుద్ధ ♦ నిర్వికల్ప చిన్మయా!
స్తుత్య వేదరాశిగమ్య ♦ దోషదూర! శ్రీకరా!
ప్రత్యయార్హ! విశ్వరూప! ♦ పద్మనాభ! కేవలా!
ప్రత్యనీకభీకరాంగ! ♦ బహుళ లోకనాయకా! ౪౦౧

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చివుకుల
కులజలధికళానిధి, కోటమాంబాకామయ తనయ, లక్ష్మీదేవీ
సుబ్రహ్మణ్య దత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వ
నిశ్చయ, సుజనవిధేయ, శ్రీనివాసాపరనామధే
యాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన
శ్రీగర్గభాగవతం బందలి
మాధుర్యఖండము
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ
హరిః ఓంతత్సత్
శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ గర్గభాగవతము.



## మధురాఖండము.





మధురానాథా! శ్రీధర!
మధుదైత్యవినాశకృతిస ॥ మర్థా! లక్ష్మీ
మధురాధరపానప్రియ!
ప్రథనాధిక విక్రమసామర్థ్య! ॥ రాధాకృష్ణా! ౧

వ॥ అనవుడు జనకుం డమ్మునీంద్రున కిట్లనియె. మునివరా! రాధామాధవకథావిధానకథనప్రథితసుధీనిధివగు నీ వనుగ్రహించి సకలజనమనోభిరామంబగు నమ్మధురాపురవరంబున నా మధురిపుం డేయే కార్యంబు లెట్లెట్లొనరించెనో దుర్భరంబగు దోర్బలంబున నిక్కిన సూర్ధుర నొక్కుచున్నడిం ద్రొక్కం జాలిన యుక్కడీఁడగు నక్కంసుని ధ్వంసం బెట్లు గావించెనో విశదీకరింపు మని ప్రార్థింప నా కయ్యపుఁ దిండి యయ్యవనీంద్రున కిట్లనియె. ౨

### కంసుండు శ్రీకృష్ణ వధార్థంబై సన్నాహంబులఁ బన్నుట.

క॥ ఒకతఱి మధురానగరికి, సకమాహాత్మ్యజ విపులసంశ ॥ నిధనోద్యమమున్
త్రికరణశుద్ధిగఁ గోరి కుతూహలమున నే నరిగి యుంటి ॥ దోషవిదూరా! 3

చ॥ చనిచని కాంచితిన్ మనుజ ॥ చారణ కిన్నర సిద్ధ యక్ష రా
ద్దనుజ సురాప్సరోజనయు ॥ తంబు శతాంగ మదేభ వాజిరా
జినిభృతమున్ బలిష్ఠ యదు ॥ శేఖరయుక్తము నూత్నరత్నజా
తినివృత వేదికాన్వితము ॥ దివ్యము కంససభాప్రదేశమున్. ౪

ఉ॥ అందున నల్గడల్ జయజ ♦ యధ్వను లొప్పఁగ సింహపీఠికన్
జెందిన దుష్టుఁ గంసు యదు ♦ శేఖరుఁ గాంచితి నంత నాతఁ డా
నందముతోడ భండనము ♦ నన్ మును పింద్రునినుండి గొన్న యా
సుందరచామరాది పరి ♦ శోభితపీఠ మొసంగి భక్తితోన్. ౫

ఉ॥ నాకు సమర్చఁ జేయఁగ ఘ ♦ నంబుగ నుబ్బి యిటు ల్వచించితిన్
భీకరవైరిదారణవి ♦ వేక కృతార్థ! యశోద నెమ్మితో
గోకులమందుఁ గన్న పసి ♦ కూన భవత్కరముం ద్యజించి వే
యాకసమొందినట్టి కథ ♦ యంత యెఱుంగుదు వీవు దేవరా! ౬

ఉ॥ భూవర! పూర్వపుణ్యమునఁ ♦ బుట్టిన యీ వసుదేవుఁ డాస్థతో
దేవకియందుఁ గృష్ణు, బల ♦ దేవుని రోహిణియందుఁ గాంచియున్
నీవలనన్ భయంపడుచు ♦ నెచ్చెలియా వ్రజనాథు చేతిలో
ఠీవిగఁ బెంచుమా! యని యి ♦ డెన్ దదనంతరమందు వారలున్. ౭

ఆ॥ శుక్లపక్షచంద్రు ♦ శోభను బెరుఁగుచుఁ, బూతనయును నసుర ♦ మొదలుకొనియు
నల యరిష్టుఁ డనెడి ♦ నసురువఱకుఁగల, రక్కసులను జంపి ♦ నిక్కరయ్య! ౮

చ॥ ఇరువురు వీరు వైరులని ♦ యీ వెత నమ్మి మెలంగుమా! యనన్
సరగ బలిష్ఠకంసుఁడు న ♦ సాధ్య దురాగ్రహకంపితాంగుఁడై
కరమున శాతఖడ్గమును ♦ గైకొని యా వసుదేవుఁ దత్సభన్
నఱుకఁగఁ బోయి నారదు వచ ♦ నంబున నాగియు నెట్టకేలకున్. ౯

తే॥ ఆలితోఁగూడ నాతని ♦ హస్తములకు, సంకెలల వేసి వెసఁ జెఱ ♦ సాలఁ బెట్టె
నంత నటనుండి నేఁబోతి ♦ నవల నతఁడు, రామకృష్ణవినాశనా ♦ రంభ మరసి. ౧౦

తే॥ దనుజవరుఁడగు కేశినిన్ ♦ దానె పిలిచి
రామకృష్ణులఁ ద్రుంపఁగా ♦ వ్రజము జనుము!
యంచు నంపి చాణూరము ♦ ఖాసురులను,
మంత్రులన్, నిజకరిమహా ♦ మంత్రిఁ జీరి. ౧౧

ఉ॥ వీరవరిష్ఠులార! సర ♦ విన్ వినుఁడీ! మునివర్యుఁడైన యా
నారదుఁ డిట్టి నన్ను నల ♦ నందగృహస్థిత రామకృష్ణులే
పోరునఁ జంప నుండిరని ♦ పూర్తిగఁ దెల్పెను గాన వారల
మీరిట మల్లయుద్ధమున ♦ మిత్తికొసంగుఁడి! గెల్పుఁ దెల్పుఁడీ! ౧౨

ఉత్సాహ॥ మల్లభూమి శుభకరముగ ♦ నుసలకుండఁ జేయుఁడీ!
యుల్లమున్మదాంబుధారఁ ♦ నుబ్బు నా గజంబుచే
నల్ల నల్లిఁ ద్రొక్కినట్టు ♦ లణఁగఁ ద్రొక్కఁ జేసి వా
రెల్లఁ [illegible] ♦ చేయుమంచు! చయ్యనన్. ౧౩

క॥ అమవసపవలున మల్లర, ణమగుర్ దత్పూర్వదినము ♦ నర్ గార్యమగయ
జ్ఞమును బ్రశాంతము కొఱకై, క్రమముగ జరిపింతుఁగాన ♦ రండటకీరల్. ౧౪

ఉ॥ వారికి నీ రహిన్ బలికి ♦ పంపి రహస్యముగా మనీషి న
క్రూరుని నంతరంగు నను ♦ కూలుని మంత్రిని బిల్చి యిట్లనన్
బోరను రామకృష్ణులను ♦ పోటులు నద్దెగటార్తు రంచు నా
నారదమౌని యిత్తఱిని ♦ నాకు నెఱుంగఁగఁ జెప్పెఁ గావునన్. ౧౫

కంసుం డక్రూరుని గోకులంబున కంపుట.

తే॥ ఎల్లి వేకువ గోకుల ♦ మేగి యందు, నున్న నందునిగేమున ♦ వెన్నుఁడతని
యన్నయుండిన నీవార్త ♦ లన్ని జెప్పి, యమృత మొల్కెడి పల్కుల ♦ నాడి వేఁడి.

క॥ పృథులోపాయన భరితులఁ, బ్రథితుల నందాదిగోప ♦ రాజుల మధురా
విధసందర్శన మిష చే, రథముల నెక్కించుకొనియు ♦ రమ్మక్రూరా! ౧౭

మహాస్రగ్ధర॥ వినుమాదిన్ రామకృష్ణుల్ ♦ విదితకువలయాపీడనాగంబుచేఁగా
ని నిరాఘాటంబుగా నా ♦ నిరతిశయబల ♦ స్నిగ్ధమల్లాళిచేఁగా
ని నిమేషంబందుఁ జావన్ ♦ నిరుపమ విధులన్ ♦ నేనొర్తున్ బ్రవేశు
న్వానుకన్ సిల్గన్ బొనర్తున్ ♦ సెన రెద విడి యో ♦ స్నేహితాళ్యగ్రగణ్యా!

తే॥ పైని నావృష భాసుని ♦ భంగపరతుఁ, బిదప నందోపనందుల ♦ పీఁచమడఁతు
నంత నానకదుందుభిన్ ♦ హతమొనర్తు, వానిసఖుఁడగు దేవకు ♦ వధమొనర్తు.

తే॥ మాఱియు రాజ్యసముత్సుకు ♦ విరసు నుగ్ర, సేనుఁబరిమార్తుయాదవ ♦ సేన నంత
నంత మొనరింతు సంశయ ♦ మందవలదు, వీరు ప్రాగ్జన్ సురలని ♦ విశ్వసించు.

సీ॥ భూత భేతాళాది ♦ నేతయు వీరసం, స్తవ్యుండు భూతసం ♦ తాపనుండు,
కింకరు యేవచ్చిన ♦ శంకరుసైతము, సంకటపడఁ జేయు ♦ సంకరుండు
పట్టుబట్టిన నట్టి ♦ ప్రళయకాలునిఁ గూడ, నణఁపఁజాలినదిట్టి ♦ దాభిముండు
ముక్కంటినింగూడ ♦ మొగసాల కాపరి, గా నల్పినట్టి బా ♦ ణాసురుండు

తే॥ వృకనిశాట, హరిశ్మశ్రు ♦ హృష్ట నరక, కాలనాభ, మహానాభ, ♦ కర్బురులును
మిత్రులౌచు మదర్థమై ♦ మేడమందుఁ, బ్రాణముల నియ్య సిద్ధులై ♦ వఱలిరయ్య!

క॥ ధనియును ధన్వియు బలియును, దనుజాసురమనుజవరులఁ ♦ దనమాటకు లొం
గిన వారినిగాఁ జేయుచు, మనెడి జరాసంధుఁడరయ ♦ మామయకాదే. ౨౨

ఉ॥ ఆరయ నేను యీజగతి ♦ యందలి గండరగండలన్ గరం
బూరును బేరులేని యటు ♦ లుగ్రతనాశ మొనర్చి యీ యకూ
పారవృతావనీస్థలము ♦ పాలనసేయుచు నుంటి సర్వ బృం
దారకులన్ బిడౌజు ద్రుటిఁ ♦ ద్రాళ్ళను గట్టి జయించితిన్ గదా. ౨౩

తే॥ వెండియుఁ ద్రవ్యపతినిఁ గు ♦ బేరు మేరు, గిరిగుహామహామర్గముం ♦ దఱచుచుండఁ
ద్రోసియుంటిని త్రైలోక్య ♦ భాసమాన, రాజ్యలక్ష్మిని గైకొంటిఁ ♦ బ్రణుతచరిత!

క॥ అకుతోభయుఁడను జుమీ, యిఁక నాకును నాచెలులకు ♦ నెది యవశంబై
సుకరములఁ గూర్పఁగ జాలదొ?, ప్రకటింపుము కొఱతలేని ♦ రహి నక్రూరా!

తే॥ కవిజనములు యుం దీవె ♦ కవివరుఁడవు, చతురమతులందు నా బృహ ♦ స్పతివినీవు
గాన నెదిచేయఁదగు ? నన ♦ దానవేంద్రుఁ, డైన యక్రూరుఁడతనికి ♦ ననియె నిట్లు.

తే॥ మీరు వలికిన పలుకులు ♦ మేలుగూర్చు, నవిగ నున్నవి కాని యి ♦ య్యవిదలంప
దైవయత్నము చేతఁ ♦ గాఁ దగును గాని, మనుజయత్నము చేతఁ ♦ గాఁ దనఁగ వినుము.

శా॥ కంసుం డిట్లు వచించె దానవలితా! ♦ కావించినన్ యత్నము
త్రాంసుల్ మెచ్చఁ గ్రియానసుల్ సఫలమై ♦ దైవార వే దైవమే
శింసాస్త్రంబని నమ్మి పౌరుషబల ♦ స్థైర్యాదులన్ వీడినన్
హింసల్లగ్గవె ? మిన్నకుండిన గదల్ ♦ హెచ్చిల్లి వేధింపవే ? ౨౮

ఉ॥ కాలము దైవరూపమని ♦ గట్టిగ నమ్మిన కర్మయోగి యే
మూలనొ యుంపఁగాత బ ♦ ముల్ జలముల్ మతిలేని వెంగలుల్
వీలుగ దైవమే వరము ♦ విశ్వసనీయ మటంచుఁ జెప్పగాఁ
జాలుచు నుండ్రుగాత దృఢ ♦ శక్తిసమేతుఁడు దానినొప్పునే. ౨౯

ఉ॥ కావున రేపు గోకులము ♦ కంజహితోదయపూర్వవేళలో
నీవు బిరాన సాగుమని ♦ యేపున నొక్క వచించి పంపి యా
సేవకజాలమున్ బనిపి ♦ చీవఱవడ్డ మనంబుతోడ రా
త్నావృత పీఠికన్ విడిచి ♦ యంతిపురంబున కేగె భూవరా! ౩౦

వాసుదేవుండు కేశినిశాచరుం ద్రుంచుట.

చ॥ కదపడి కంసునానతి జ ♦ వంబున నేగిన కేశిదైత్యుఁడున్
మదమున నశ్వరూపమును ♦ మానుగఁదాల్చి వ్రజంబు జొచ్చి యం
బుదము విధాన బొబ్బలిడి ♦ పుచ్ఛహతిన్ ఘనపంక్తి నింగి యం
దదవదలౌనటుల్ సలిపి ♦ యంఘ్రిహతిన్ ధరఁగూల్చెఁ జెట్టులన్. ౩౧

ఉ॥ ఆసమయంబునందు వ్రజ ♦ మందు నివాసముఁ జేయు గోప గో
పీసముదాయ మాయసురు ♦ భీకర చర్యలఁ గాంచి బెంములం
దాసల వీడి మాధవుని ♦ యండకుఁ జేరుచు దిక్కు కమ్మనం
గా సరి యంచు నొప్పికొని ♦ కంజదళేక్షణుఁ డూరడించుచున్. ౩౨

పంచచామరము॥ లటాలునన్ గటిన్ బటంబుఁ దద్దఁగట్టి దైత్యుపై
హుటాహుటిన్ జనంగ నా న ♦ రోదనుండు శ్రీహరిన్

బటుత్వయుక్త దీర్ఘ వామ ♦ పాదభూత బాధితుఁ
ద్రుటిఁ బొనర్చి యార్చి నింగి ♦ ద్రెమ్మఁగ భూమి ద్రయ్యఁగాఁ.

మ॥ అటుపై శ్రీధరుఁడాగ్రహించి నిజహ ♦ స్తాగ్రంబుచే వానిఁ
విటతాటంబుగఁ బట్టి త్రిప్పియు వియ ♦ ద్వీధిఁ జతుః క్రోశముల్
ద్రటిలో దాఁట గిరాటు వేసె నవలన్ ♦ దోషాచరోత్తంసుఁడు
త్కటకోపంబునఁ దిర్గివచ్చి తనతోఁ ♦ గన్ మోఁదె దామోదరున్. 38

వ॥ అంతనాదైత్యాంతకుండు ప్రలయాంతకు భంగిం గనలి యా కేశిదుష్ట్ర కీని వాలంబుఁ గేలం దాలిచి గిరగిరం ద్రిప్పి యప్పురవీధియందు వందయోజనం బులపైఁ బడునట్లు విసర నయ్యసురుం డసురుసురై క్రమ్మఱ లేచి ధారాధరంబు కరణి నార్చి పేర్చి జూలును, రోమస్తోమంబును విదలించుకొని కార్చిచ్చు ద్రింగిన యక్కమలాక్షు సమక్షంబునఁ బాదంబులన్ మేదినిం ద్రవ్వుచు నా బాలకృష్ణుం గొని విహంగంబు భంగి నింగి కెగయుచు దిగుచుఁ దిరుగుచు మిగుల బాధింపం దొడంగె. అంత శిష్టరక్షకుండగు నా శ్రీహరి యనిష్టపుష్టినష్టకరంబగు నొక ముష్టితో నా దుష్టనిశాటుం బ్రహరింప నతండు రెండుగడియల కాలంబు గడబట్టి తిరుగఁ దెరలి యా హరిని దన కంధరంబునఁ దగిలించుకొని చదలున కెగసి లక్ష యోజనంబు లుల్లంఘించె. అపు డందు గోవిందుఁ డా దుండగీని పాదసటాపుచ్ఛ ఖురంబులతో నఖండంబగు భండనంబు రెండుజాములొనర్చి నిజభుజంబుల నవ్వానిం గైకొని యుయ్యల నూఁచినపగిది నట్టిట్టూఁపి యటనుండి క్రిందఁ బడవైచి యొక బుజంబు తదాస్యంబందుఁ జొప్పించె. అంత నది యుపేక్షించిన యామయంబు విధంబునఁ గ్రమక్రమంబుగాఁ బెరుఁగుచు నా యసురోదరంబును బ్రవేశించి కలంచఁ గని తగినట్లా రక్కసుండు తన కుక్షిం బ్రబలంబుగా నొనర్పం గడంగ ఖండితోద రుండై మృతుండయ్యె. అయ్యవసరంబున నయ్యశ్వశరీరంబునుండి కిరీటహార కేయూరకంకణకింకిణీకాంచీసమంచితంబగు దివ్యరూపంబు ధరించిన యొండు పురుషుండు నిర్గతుండై యా భక్తవత్సలునికిం బ్రణమిల్లి సాంజలియై యిట్లనియె.

## కేశిపూర్వజన్మవృత్తాంతము.

తే॥ దేవ! శక్రానుచరుఁడను ♦ దివ్యరూప, ధరుఁడ, తేజస్వి వర్చస్విఁ ♦ దత్త్వవిదుఁడఁ
గుముదనామకుఁడన్ నేను ♦ గొడుగుబట్టి, యింద్రుమెప్పించి జీవింతుఁ ♦ గృష్ణ! తొల్లి

తే॥ అపుడు దేవేంద్రుఁ డట్లువృ ♦ త్రాసురవధ, సల్పి తద్బ్రహ్మహత్యాది ♦ శాంతికొఱకు
సర్వసవనోత్తమంబును ♦ స్వస్తిదంబు, నైన యశ్వమేధంబు స ♦ మాచరింప

తే॥ శ్యామ కర్ణాంచితము మనో ♦ జవయుతంబు,
శుభ్రవర్ణ సంయుతమును ♦ శుభకరంబు

నైన హయమును విడువంగ ♦ దానిఁదస్క
రించుకొని యెక్కి తలమున ♦ కేగియుంటి. ౩౮

ఉ॥ అత్తఱి నింద్రుఁడుర్ దివిష ♦ దావళితోఁ జనుదెంచి నెత్తిపై
మొత్తుచుఁ ద్రాళ్ళఁగట్టి హయ ♦ ముం గొని దుర్మతి! తేజిరూపుతో
హత్తు పిశాచరుండవగు ♦ హూమనుయుగ్మ మటంచు శాపమున్
జిత్తమునన్ దయాగసముఁ ♦ జేర్పక నాకిడె నబ్జలోచనా! ౩౯

ఉ॥ దాన హయస్వరూపవృత ♦ దైత్యుఁడనై చరియించుచుంటి నో
దానవవైరి! నీదయను ♦ దత్పృతనాయకశాప మిత్తఱిన్
నేను విడంగఁ జాలితిని ♦ నిశ్చయ మియ్యది భక్తవత్సలా!
దీనశరణ్యా! దేవనుత! ♦ దేవ! నతుల్ బొనరింతు భక్తితోన్. ౪౦

చ॥ అని ప్రణమిల్లి నల్గడల ♦ సన్నుతరోచులఁ బర్వుచున్ మహా
ఘనమగు విష్ణులోకమును ♦ గాంతిసమన్వితమౌ విమాన మం
దున వెసనెక్కి చేరెను వి ♦ ధూతరిపూత్కర! తత్పరంబునన్
దనరిన సంగతుల్ వలికె ♦ దన్ వినుమో బహులాశ్వభూవరా! ౪౧

అక్రూరుండు గోకులంబున కరుగుట.

తే॥ కంసునాజ్ఞ నక్రూరుండు ♦ ఘనరథంబు, నెక్కి గోకులంబునకేగు ♦ చక్కఁజమగు
గిరుల దరుల సరస్సులఁ ♦ దరుల విరులఁ, గాంచు చలరుచుఁ జను చిచ్చ ♦ నెంచె నిట్లు,

క॥ నయముననో భయముననో, ప్రియముననో వైరముననొ ♦ విష్ణుని బలునిన్
రయమునఁ దోడ్కొని రమ్మని, నియమించిన యట్టికంసు ♦ నిత్యముఁగొలుతున్

ఉ॥ ఏమితపంబుఁ జేసితినొ ♦ యే మహనీయునిఁ గొల్చియుంటినో
యేమిజపంబొనర్చితినొ ♦ యెట్టి వ్రతంబుల నోచియుంటినో
యేమిసుఖంబు ధాత్రికి ఘ ♦ టించితినో కద! యీదినంబునం
దా మధువైరి నా స్వభుపు ♦ నా హరినిం గను భాగ్యమబ్బెఁగా. ౪౪

ఉ॥ కాని మదాగమంబు విని ♦ కంసుని పంపున వీఁడు వచ్చె న
ద్దాన నితండు వధ్యుఁడని ♦ దానవహంత సమీకరంతయై
మానసమందు నెంచి పరి ♦ మార్చునొ? చెల్మిని గద్దెనిచ్చి స
మ్మానముఁ జేయునో మఱియు ♦ మద్విధి యెవ్విధి నివ్వటిల్లునో. ౪౫

ఉ॥ ఎట్టులనైన నేఁడు కమ ♦ లేశుఁ గనుంగొను భాగ్య మబ్బె నా
యట్టి కృతార్థుఁ డీ జగతి ♦ యందుఁ జెలంగునె? పట్టుపుట్టముల్
గట్టిడిజేజె యే నరుల ♦ కన్నుల గోచరుఁ డౌనొ వారు బ
ల్బెట్టులు నైన ధన్యులయి ♦ శ్రీధరుఁ జేరరె? యంతరంగమా! ౪౬

ఉ॥ ఈరహిఁ శౌరినిం గుఱిచి ♦ యెంచుచు సచ్ఛకునంబుఁగాంచి య
క్రూరుఁడు గాందినీసుతుఁడు ♦ గోకుల మర్త్యుఁడు గ్రుంకువేళలోఁ
జేరి యవాంకుశాంబుజ వి ♦ శిష్టజనార్దన పాదచిహ్నయు
గ్ధారణిఁగాంచి డిగ్గన ర ♦ థంబును డిగ్గి మనోరథంబునన్. ౪౭

తే॥ పొరలి యానందబాష్పము ♦ ల్బొరల విడిచి
నందు మన్కికి నరుగంగ ♦ నందునుండి
బలునిఁ గూడిన కృష్ణుండు ♦ వచ్చుచుంటఁ
గన్నులారఁగఁ గనుఁగొని ♦ గాఢభక్తి. ౪౮

సీ॥ పురుషోత్తములను నం ♦ భోజలోచనులను, శ్యామలగౌరవ ♦ ర్ణాంచితులను
లీలాపరులఁ బీత ♦ నీలాంబరధరుల, బాలుర గోజాల ♦ పాలకులను
మకుటలలంతికా ♦ మంజీరకంకణ, హారకేయూరస ♦ మన్వితులను
యోగిరాడ్దేవరా ♦ డురగరాణ్ణుతులఁ బు,రాణుల భక్తసం ♦ త్రాణరతుల

తే॥ నిర్జితానంగరూపుల♦దుర్జనగణ, తర్జనాతూర్యార్జిత బలుల ♦ దుర్జయులను
నార్జవార్జిత యశులను♦హరి బలులను,డాసి పదములంబడి నతుల్♦జేసె నవల.

క॥ శౌరియు రోమాంచితునిన్, వీరుని నానందబాష్ప ♦ విలసన్ముఖు న
క్రూరుని నక్రూరునిఁ గని, కారుణికత్వార్ద్ర నయన ♦ కమలుండగుచున్. ౫౦

చ॥ పదములనుండి హస్తములఁ ♦ బట్టుచు లేవఁగఁదీసి యింటికిన్
ముదమునఁదోడుకొంచుఁజని ♦ ముద్దగు గద్దియ నిచ్చి మంచిగాఁ
గుదిరిన భక్ష్యభోజ్యముల ♦ గోవుముఖంబునఁ బెట్టె భూవరా!
పదపడి గాందినీతనయు ♦ ప్రక్కకు నందుఁడు సేరి యిట్లనెన్. ౫౧

ఉ॥ సిగ్గును వీడి భోజపతి ♦ చిన్నల నల్లురఁజంపెఁ జెల్లఁబో!
యెగ్గులుఁగూర్చెఁ జెల్లెలకు ♦ నేమియెఱుంగని వారినిం జెఱన్
బగ్గను బెట్టె న్యాయముల ♦ వంబు దలంపక యింక నెవ్వరిన్
నుగ్గొనరింపఁ జూచెడినొ ♦ న్యూనతలేని యటుల్ వచింపుమా! ౫౨

తే॥ అట్టిచెట్టరాజ్యమునందు♦నెట్టులిపు, బ్రతుకుచుంటివో యక్రూర!♦పలుకుమయ్య!
యనుచు గేహములోనికి ♦ నరిగెఁ బిదప, హరియు గాందినీపుత్రకు♦నడిగెనిట్లు.

ఉ॥ సేమమె మీకు మీపురినిఁ ♦ జిన్నలుఁబెద్దలు స్త్రీలు పూరుషుల్
సేమమె? నీవె సాగుతతెఁ ♦ జీరుచు నాతలిదండ్రు లాదట్లో
నేమి వచించి రాత్మజన ♦ మేవెతలన్ బడకుండెనో క్కా? యిం
కేమిదలంచెఁ గంసుఁడిపు ♦ డెల్లజగంబులు క్షోభఁజెందఁగాన్. ౫౪

ఉ॥ నావుడు గాందినీసుతుఁడ ♦ నందొడఁగెన్ బరమాత్మ! మొన్న భో
జావనిజాని, మానమున ♦ నాసభయందుఁ గృపాణపాణియై

యావసుదేవుఁ జంపుటకు ♦ యత్నముఁజేయుటఁ జూచి వెంటనే
దేవమునీంద్రుఁడుఁ డాపె వసు ♦ దేవకుమారక ! వైరిమారకా ! ౫౫

ఉ॥ దాన నశేషయాదవులు ♦ ధార్మికవర్యులు దద్దరిల్లి త
త్స్థానమునుండి లేచి పెఱ ♦ తావులకున్ జని రంతఁ గంసుఁడా
దీనుల యాదవోత్తముల ♦ దేవతలన్ బరిమార్ప యత్నము
న్మాన్యనముగా నొనర్చెడిని ♦ యుక్త మయుక్తము లేక శ్రీకరా ! ౫౬

క॥ అక్రూరమున నామధురకుఁ, జక్కఁగఁ జనుదెంచి కంసుఁ ♦ జంపియుఁ బ్రజకున్
జిక్కులఁ బాపుచు సుఖముల, గ్రక్కునఁ గలిగింపుమయ్య ♦ కరుణాభరణా !

క॥ అనవుడు సబలుండగు హరి, తనపెంపుడు తండ్రిదా యు ♦ ధార్థాశయమున్
గొని కార్యకరుల వ్రేలను, నెనగునఁ బిలిపించి యిట్ల ♦ నెను బహులాశ్వా! ౫౭

క॥ నేనును నందులు షడ్వృషభ, భానువు లుపనందు లింక ♦ బలిగోపక సం
తానము వృద్ధులు మధురకుఁ, బైనము కాఁగలరు వేకు ♦ వను నద్దానన్. ౫౮

క॥ అరుణోదయకాలమునన్, బురిగల నెయిపాలు పెరుఁగుఁ ♦ బ్రోఁగుఁగఁగొని ౫౯
కరదంబులతో సయితం, బరదంబులఁ బెట్టి యిచట ♦ కరుదెంచవలెన్. ౬౦

ఉ॥ ఆతరువాతఁ గార్యకరు ♦ లాహరి యాజ్ఞఁదలన్ వహించి యా
వ్రేతల యిండ్లకుం దిరిగి ♦ పెద్దలు బిన్నలు నాలకింపఁ ద
త్ప్రీతకటోదితోక్తులను ♦ వెల్లడిఁ జేయుచుఁ జిడ్డుపెరు పా
ల్నేతులు ప్రోఁగుగా నొకటఁ ♦ నేర్పునఁ జేర్పఁదొడంగి రింతలోన్ ౬౧

చ॥ విడిముడి బోఁటియేడుగడ ♦ వెన్నుఁడు పైనమొనర్చు వార్త యా
పిడుగువలెన్ వ్రజాంగనల ♦ వీనులలోఁ బడఁగొందఱంగనల్
గుడిచెడి యన్నమున్ విడిచి ♦ గోలను బెట్టిరి కొందఱన్ను లీ
తఁడు మనలం దృజించి యెటు ♦ దర్లు? నటంచుఁదలంచి రెంతయున్. ౬౨

ఉ॥ కొందఱు గండదేశములఁ ♦ గోమల హస్తములుంచి బెంగతోఁ
గుందిరి కుందుఁడే చనినఁ ♦ గొంప మునుంగదె యంచు గోపికల్
గొందఱు వల్కిరామధుర ♦ కున్ హరియేగుట ప్రస్తుతంబు నం
దెందులకంచుఁ గొందఱని ♦ రీశ్వర ! మేశ్వర బద్ధశేముషీ ! ౬౩

మ॥ మఱి యా రాధిక, కృష్ణు నెమ్మొగమునన్ ♦ మందస్మితంబున్ సుకం
ధరమున్ నాస నురంబు నారు వరహ ♦ స్తంబుల్ పదంబుల్ శరీ
రరుచుల్ మాటలు నీటులున్ బ్రణయమై ♦ రంబుల్ మహాబాహాద్యాన సం
చరణాసక్తిని రాసముల్ దలఁచుచున్ ♦ శశ్వత్తు రోదించెడిన్. ౬౪

చ॥ ఇంకను గొందఱుగ్మలులు ♦ కృష్ణుని వీడఁగ లేక యించుకేన్
జంకక యొక్కయిక్కనొక ♦ జట్టుగఁ గూడియు రాయబారిదా

వంకకుఁ బోయి యోయనఘ! ♦ పాడియె? మమ్ములఁ బాపి శ్రీపతీ
బెంకెతనానఁ దోడుకొని ♦ వెళ్ళుట చెప్పుము! గాందినీసుతా! ౬౧

క॥ అక్రూరుండవు గావని, సక్రమముగ నాడితిమిగ! ♦ చక్రనరయ నీ
వోక్రూరుండవు జుమ్మీ, చక్రివియోగంబు మాకు ♦ సంధించుటచేఁ. ౬౨

మ॥ మురళీగాన వినోద కార్యకలనా ♦ పూర్వప్రభావాఢ్య! యీ
తరుణంబందుఁ జిరంతనంబయిన మా ♦ సంబంధమౌ వల్లరీ
గరముం ద్రెంపి యదృచ్ఛగాఁ జనెదవే! ♦ కారుణ్య మావంతయేఁ
సరిగా నుండిన యట్లు తోఁపదహహా! ♦ శౌరీ! మురారీ! హరీ! ౬౩

సీ॥ రాసకేళులయందు ♦ రతినిగావించిన, చెలిమి యావంతయేఁ ♦ దలఁపవేల?
మాయిండ్లలోఁబడి ♦ మంచిపాల్పెరుఁగు నేతులు గ్రోలినట్టిమేల్ ♦ దలఁపవేల?
యలజలక్రీడల ♦ యందొనరించిన, స్నేహంబు నాత్మలోఁ ♦ జేర్పవేల?
బృందకారణ్యంబు ♦ నందలి మాతోడి, క్రీడలు మదిని లె ♦ క్కింపవేల?
తే॥ గోప్రవర్ధన శైలంబు ♦ గోట నెత్తి, వ్రజ నివాసులఁ గాచిన ♦ పరమకరుణ
నల్పమైనను మాపైని ♦ దాల్పవేల?, మధురకరిగెదవే కృష్ణ! ♦ మమ్ము విడిచి.

సీ॥ సీతామహాదేవి ♦ శ్రీరాముతోఁగూడ, వనటచెందుట ప్రేమ ♦ వలనఁగాదె
చంద్రమతియు హరి ♦ శ్చంద్రునితోఁగూడ, వనటచెందుట ప్రేమ ♦ వలనఁగాదె
యింద్రాణి యట్టి దే ♦ వేంద్రునితోఁగూడ, వనటచెందుట ప్రేమ ♦ వలనఁగాదె
హైమవతీసతి ♦ హరుతోడ మిక్కిలి, వనటచెందుట ప్రేమ ♦ వలనఁగాదె
తే॥ మఱిఁ బతివ్రత లను వాసి ♦ మహినిగన్న, వారలెల్లరు భక్తితో ♦ వనటకనుట
ప్రేమవలననె కావునఁ ♦ మేముగూడఁ, గష్టసుఖముల నీవలెఁ ♦ గాంతుమయ్య!

మ॥ చెలులారా! యలనాఁడు రాసమున నీ ♦ శ్రీకృష్ణచంద్రుండు తే
నెలు వర్షించు స్వరాన నేమిపలికెఁ ♦ నేఁడేమి చేయంగఁదాఁ
జెలరేగెఁ గనుఁడీ యిదేమి నయమో ♦ చిత్తంబు స్థైర్యంబుగా
నిలుపఁ లేని మహానుభావు దయయుఁ ♦ నిర్మూలమూలంబగుఁ. ౭౦

క॥ కావున లాభము లేదిఁక, నేవనితోయేమనికిఁకొ ♦ యేగెదమో రా
జీవాక్షులార! కర్మం, బీవిధి యేడ్పించుచుండె ♦ నెదిచేయనగుఁ? ౭౧

క॥ అనిహేరాళమగు విరహ, మునవగచి స్వసద్మములకుఁ ♦ బోయెడి వారిఁ
వనమాలి కాంచి యిట్టులు,ననె నందఱ కన్ని రూపు ♦ లందుచుఁ దాల్మిఁ ౭౨

శ్రీకృష్ణుండకర్పూరసహితుండై యరుగుచు రాధాదుల నూఱడించుట.

క॥ గోపికలారా! మీర్పరితాపంబును మానుఁడేను ♦ దప్పక త్వరలోఁ
మీపొంతకు వచ్చెద సుమి, మీపెరిమను జేసినట్టి ♦ మేలు మఱతునే. ౭౩

వ॥ అని చెప్పి యటనుండి సాగి వృషభానుతనూజాత యగు శ్రీరాధాదేవి సుందరమందిరంబునకుం జని యందుఁ దనవియోగంబునఁ బరవశయై యొంటిగా శోకమునం బడి యున్న రాధికం జూచి తత్సఖీజనంబు దన్నుఁ జుట్టుముట్టుచుండ సకల లోకమనోహరంబగు మురళీగానం బొనరింప నాలించి యప్పద్మిని పద్మినీమనోహరోదయంబును గాంచి సంతసించిన పద్మిని విధంబున నిజనయనపద్మంబుల విప్పి శ్రీకృష్ణుఁడు పద్మబాంధవుం గని యలరారి సింహాసనం బిడి సత్కరించె. అంత నమ్మాధవుండు దీనయు, నశ్రుపూర్ణముఖియు, విరహావిహ్వలయు నగు నాసుందరిని జూచి మేఘగంభీరంబగు గళంబున. ౭౮

శా॥ ఈ నామాటలఁ దాలిమిన్ వినవె యో ♦ యేణాక్షి! యీవేళలోఁ
బోనా యీమధురా పురంబునకు తే ♦ పో మాపో యందుండి రా
లేనా దుష్టులఁ జంపి శిష్టులను హా ♦ ళిన్ గాచి తృప్తిగ్రతుండన్
నానా స్ఫూర్తి యుండఁ జాలుదునె? యో ♦ కాంతామణీ! పల్కవే! ౭౯

ఆ॥ నేను వచ్చువాఁక ♦ నెంజిలి విడిచి భూషలను దాల్చి హాయిఁ ♦ జెలులతోడ
మాట్లాడుకొంచుఁ ♦ బొలుపారుచుండుమా!, యంచు నూఱడించె♦నవనినాథ! ౮౦

క॥ అమ్మాటలు దనచెవులకు, ములుకులుగాఁ దోఁప రాధ ♦ మూర్ఛిల్లిమతిన్
జెలికాండ్రు దావదగ్ధము,గు లత విధంబునఁ దపించి ♦ కౌతుకపడుమదిన్. ౮౧

క॥ తెగువ ? సిరిత నాథా!, యగచాట్లను నన్ను బెట్ట ♦ ననిశము నిన్నున్
మిగుల స్నేహించెడి నను, దిగవిడిచియు నిచట నెటకొ ♦ తెగఁబోయెదవే?

ఉ॥ పోయెడు నా మాట చేయఁగలఁ ♦ బొల్తుక పుట్టువుగాదె బూదినై
పోయెద నా ప్రేమ నెటుల ♦ మూఁడెను గీడులు నాకు నక్కటా!
యే యసమాన మన్నాడి న ♦ హించితి నే? కలనైన నిట్లు నా
కేయనుమానము చొప్పడు న ♦ టంచుఁ దలంచితినే! మనోహరా! ౮౩

క॥ రక్షింపు మంచో నను(గను, లాహా! యనిరెండుతడవ ♦ లన్ నుడువ జగ
ద్రక్షకుఁడు కారుణ్యా క, టాక్షంబు నిగుడ్చి యిట్టు ♦ డాఁపక పలికెన్. ౮౪

మ॥ కలికీ! శ్రీకృష్ణనుండ సంతతము భ ♦ క్తశ్రేణి యిష్టంబులన్
ఫలియింపన్ బొనరింతుఁ గాని యెపుడున్ ♦ వ్యర్థంబుగావింపనే!
యలశ్రీనాముఁడు నిన్ను భర్తృవిరహం ♦ బబ్బంగ నూరేండ్లు బల్
సలుపంగల్ గల్ల శపించె నోజగమునన్ ♦ జింతింప లాభించునే? ౮౫

ఆ॥ అట్టి శాపకాల ♦ మరుదెంచె నిప్పుడే, బిట్టు దాని ననుభ ♦ వింపవలయు
సంచితాఘరాశి ♦ సాధారణంబుగాఁ, జనునె? యెంతగొప్ప ♦ జనులకైన. ౮౬

చ॥ గలజమ నేస్తబంధనము ♦ గాదొకొ? యయ్యది చింతచేయుటల్
మతి సరయుంగ నాసుముఁడు ♦ మత్స్యఘుఁడే కద యైన నీవు నా

సతివగుట౯ దమి౯ విడువఁ ♦ జాలక నేఁ బ్రతిమాసమందు నీ
స్థితి గని వేడ్కఁగూర్చుటకు ♦ స్నేహమొనర్తు సఖీవతంసమా ! ౮౩

తే॥ కాన శోకంబు మానుమో ♦ కమలనేత్రి!, యన్న నామె చేయుటకు నే ♦ య్యాదియు లేక
దేవ ! నీవు వచించిన ♦ ట్టివి మాస, మాసమున దర్శనంబిచ్చి ♦ మనుచువయ్య ! ౮౪

ఆ॥ అటులఁ గాని యెడల ♦ హాటకసన్నిభ, మనుశిరీషమృదుల ♦ మనుఘనంబు
దివ్యమునగునాదు ♦ దేహంబు దాహంబు, సలుపఁగలనటంచుఁ ♦ దెలియుమయ్య !

చ॥ జలరుహనేత్రుఁ డద్దివిని ♦ సత్యము నానుడులెల్ల ధర్మవు౯
జలరుహబాంధవేందువులు ♦ సంధ్య యముండును నంతరాత్మ । సా
బలుకులు శాస్త్రజాలము బ ♦ వల్ నిశి సాక్షులు గాగ నాదుగో
పులపయి నొట్టుపెట్టికొని ♦ పూర్తిగఁ జెప్పినవాట నమ్ముమా ! ౮౬

క॥ చేతస్స్ఫూర్తిగ కోర్కి, కౌతుకముగఁ జెలిమిఁ జేసి ♦ యెగ్గుల్ లగ్గుల్
బ్రాఁతిగఁ దెలుపునో వాఁడే, భూతలమున ధన్యతముఁడు ♦ పుణ్యుండుగదా, ౮౭

క॥ చేతస్సునందు విషమిడి, ప్రీతిగ స్నేహించు నరుఁడొ ♦ విషపుమ్ముంగు౯
హేతుపటుఁడు లంపటుఁడును, ఘాతుకుఁడునునైన నటుసి ♦ కరణి నఘముఁడో. ౮౮

క॥ ఈయెడ నీయెడఁ జేసిన, నేయము టకటొంకుగాదు ♦ నెటి నమ్ముము! యో
తోయరుహాయతనేత్రా!, పోయెద సెలవిమ్ము త్వరగఁ ♦ బాలతుండనుచున్ ! ౮౯

తే॥ కర్ణకరణంబులకు రస ♦ ఘనత దెలియ, నటులఁ గోర్కెలఁ గాంక్షించు ♦ నట్టి మునుల
కెద్ది దెలియరాదో యెద్ది ♦ యేమిగోర, నట్టిమునులకుం జిక్కనో ♦ యద్ది నేను.

తే॥ పాలకును బాలఁగలతెల్పు ♦ డాలునకును, దారతమ్యంబు లేని వి ♦ ధమున నీకు
నాకు భేదము లేదని ♦ నమ్మి మునులు, సతము ధ్యానించుచుందురో ♦ సరసిజాక్షి !

క॥ నాకును నీకును భేదం, బేకరణిని గూర్చి యెవ్వ ♦ రెద జపియింత్రో
యాకొంటెలు నరకమునం, దాకమలాప్తేందుభముగ ♦ నత్తునుగు సఖీ ! ౯౧

తే॥ నీవు మేదిని నన్వీడి ♦ నిలువలేవు, కాని నిన్వీడి యేమనఁ ♦ గలను ? చెపుము !
కానఁ దప్పక నెలనెలఁ ♦ గనుపడెదను, బొత్తుగాఁ జింతమానుము ♦ పువ్వుబోఁడి !

ఆ॥ అంచు నూఱడించి ♦ యంగీకరింపఁగా, సలిపి యింటికేగె ♦ సరగ నవల
నందముఖులు బలులఁ ♦ బొంది రథములెక్కి, కల్యమందు లేచి ♦ కదలిరయ్య !

తే॥ అంత నక్రూరుఁడా రమా ♦ కాంతబలులఁ, దన యరదమందు నెక్కించి ♦ తాను నెక్కి
మధుర కేగెడి వేళలో ♦ మార్గములను, గోట్లకొలఁదిగ గోపికల్ ♦ గుమిగ నిలిచి. ౯౫

మ॥ అదె యక్రూరుఁడు క్రూరుఁడై యరదమం ♦ దారామ హేమాంబగుల్
గుదురం జేసి సమీరతుల్యగతితోఁ ♦ గోల్కొంచుఁ దోతెంచెడిం
గద ! వీక్షించుఁడి ! యడ్డగించుఁడి ! కసి౯ ♦ గారించుఁడీ ! దంచుఁడీ !
చెదరంగొట్టుఁడి ! నెట్టుఁడీ ! కొఱకుఁడీ ♦ ఛేదించుడీ మించుఁడీ ! ౯౬

ఉ॥ ఒండొరు లిట్లు పల్కుకొని ♦ యుగ్మలు లారథ మత్రపం క్తి మా
ర్తాండుని గప్పుకొ వడిని ♦ దద్దయు జుట్టును ముట్టి దండిగా
దండములన్ గ్రహించుచు ర ♦ థంబును జూర్ణమొనర్చి సారథిన్
రెండగు వ్రేళ్ళఁబట్టికొని ♦ లివ్వనఁ గ్రిందికి లాగివై చియున్. ౯౭

ఉ॥ దద్దులు గట్టునట్టులుగఁ ♦ దతురగంబుల వేత్రపంక్తితోఁ
దద్దయుఁగొట్టి నెట్టన ర ♦ థస్థుల యుక్కడగింప సాగఁగా
గ్రద్దన మాధవుండు గని ♦ కంజదళేక్షణలార! తిర్గి నేఁ
బొద్దది గుంకులోపలనె ♦ రూఢిగ వచ్చెద నిండ్ల కేగుఁడీ! ౯౮

చ॥ అనియిటు పల్కిగోపికల ♦ నావల కంపి స్వభక్తు గాందినీ
తనయునిఁ బ్రోచి తేరును ద్రు ♦ తంబునఁ జక్కఁగఁజేసి రథ్యముల్
మనమున భీతినిన్ విడి సు ♦ మాళము నొందగ మూఁపులందుఁ జే
తను గడుఁదట్టి కట్టియుఁ బ ♦ తాకను నెత్తి వసింపవేడ్కతోన్. ౯౯

తే॥ గాందినీపుత్రకుండును ♦ గాంచి యలరి, సజ్జితమగు నారథమును ♦ సరగనెక్కి
రామకృష్ణులు దనవెంట ♦ రాజిలంగఁ, ద్రోల సాగెను మధురపు♦ద్రోవయందు.

ఉ॥ ఆరథకేతు వెందనుక ♦ నతులు కన్పడు గోచరించెనో
యా రథవాజిసంతతిఖు ♦ రాహత ధూళులునెంతదాఁక దై
నా తెనొ యంతదాఁకఁ గని ♦ పంకజనాభుని పల్కులెంచి శ్రీం
గారవతుల్ విచిత్రముగఁ ♦ గాంచుచు నిల్చిరి బొమ్మలో యనన్. ౧౦౧

క॥ క్రమముగఁ గృష్ణుం డక్రూ, రముసలియుతుఁడై యల మధు♦రాపురిఁ గల శ్యా
మ్యామహాద్యానవనికి హ, ర్షముతోఁ జని రథము డిగ్గి ♦ సత్వరగతితోన్.

ఉ॥ అన్నను రాముఁగూడి యము ♦ నాపగ కేగియు దాహ మారఁగాఁ
దిన్నగ నీరుఁద్రావి మఱిఁ ♦ దేరును నెక్కెను గాందినీజుఁడున్
గ్రన్నన రామకేశవులఁ ♦ గాంచి తదాజ్ఞను బొంది తద్ధునీ
సన్నిధిఁజేరి కాల్యములఁ ♦ జక్కఁగఁ దీర్చి యనంతరంబునన్. ౧౦౩

## అక్రూరుండు యమునానదిని రామకృష్ణులం దర్శించుట.

తే॥ నిత్యనైమిత్తికంబులన్ ♦ నిష్ఠతోడఁ, జేయ జలములోనికిఁ బ్రవే♦శించె నందుఁ
గరము నుడులతోఁ జెలఁగియ♦గాధమైన, యొక్కయెడ రామమాధవు♦లొప్పఁగనియె

తే॥ కనియు ముక్కున వ్రేలిడి♦గట్టునెక్కి, రథమునందుననున్నఁ యా♦రామహరులఁ
గాంచి క్రమ్మఱ నదిలోనఁ ♦ గనఁగ వార,లిర్వురొప్పుట గనిఁయెద ♦ నెంచెనిట్లు

మ॥ కలయో మాయయొ సత్యమో భ్రమయొ నా ♦ కందోయివైచిత్ర్యమో
జలజాతాయతపత్రనేత్ర కృతియో ♦ జాలంబొ యింకేదియో

పలుకం జాలను గాని యేమి యిది యా ♦ పద్మాక్షునీలాంబరుల్
జలమందుం రథమందు నొప్పి రొకకా ♦ లంబం దభేదంబుగన్. ౧౦౮

క॥ ఏవంవిధి ననుకొని తా, భావమునం దలరి మఱియు ♦ వారులలోనే
తివిఁగఁజూడఁగ సాగెను, నావేళను గాందినీజుఁ ♦ డాకాళిందిన్. ౧౦౯

సీ॥ వేయిపడగలతో ♦ వెలిఁగెడి శేషునిఁ, గుండలీభూతునిఁ ♦ గూర్మిఁగాంచి
యాతని యుత్సంగ ♦ మం దద్భుతంబైన, గోలోకచిత్రముల్ ♦ గోర్కెఁగాంచి
గోపకాళ్యవనాను ♦ కూలగోత్రేశ్వరం, బైనట్టి గోవర్ధ ♦ నాద్రిఁగాంచి
బృందకారామ కా ♦ ళిందీ ధునీమణి, సౌందర్యమంతయుఁ ♦ జక్కఁగాంచి
తే॥ కోటిమన్మథలావణ్యుఁ ♦ గోటిభాస్క,రోజ్వలాంగుని రాసేశు ♦ నూర్జితయశుఁ
గృష్ణు రాధికాయుతుఁ బ్రభుఁ ♦ దృష్ణతోడఁ, గాంచి బ్రహ్మయటంచు ను ♦ తించె నిటుల

సీ॥ ఎవనిచే జగము జ ♦ నించునో యెవ్వని,చే నిది వృద్ధిని ♦ జెందుచుండు
నెవనిచే నిది గిట్టు ♦ నెవనిలో నిది యుండు, నెవ్వఁ డిద్దానిలో ♦ నెసఁగుచుండు
నాది మధ్యలయంబు ♦ లంటవో యెవనికి, నెవనికిఁ గల్మమం ♦ బెదియు లేదొ
నామరూపగుణాదు ♦ లేమాత్ర మెవనికి, లేవో యెవ్వఁ డఖిల ♦ దేవదేవుఁ
తే॥ డట్టి శాశ్వతుఁడవగు నీ ♦ యద్భుతమగు, మాయ నిర్జరభూసుర ♦ మౌని వరులు
దెలిసి కొననప్పు డెఱుఁగంగఁ ♦ గలనె? చెపుమ! నన్ననుగ్రహింపుము కృష్ణ! ♦ నందపుత్ర!

శా॥ పద్మాక్షా! హరి! పద్మవైరికులజా! ♦ పద్మోదరా! మానిహృ
త్పద్మేందిందిర! పద్మబాణజనకా! ♦ పద్మాలయానాయకా!
పద్మాళిప్రియకోటిరుక్మరుచీ! ♦ పద్మోద్భవాదిస్తుతా!
పద్మవ్యూహసమర్థమాతుల! భవ ♦ త్వత్పద్మముల్ గొల్చెదన్. ౧౧౦

ఉ॥ చేతులు నీదు పూజలను ♦ జేయుట కంఘ్రులు రెండునున్ భవ
త్పూతనికేతనంబులకుఁ ♦ బోవుటకున్ శ్రవముల్ భవత్కథల్
బ్రీతిఁగ నాలకింపఁగ శి ♦ రంబు కరంబుగ నిన్ను మ్రొక్కఁగాఁ
జేతము నిన్దలంచుటకు ♦ సిద్ధ మొనర్పుము నందనందనా! ౧౧౧

తే॥ దేవకీపుత్ర! బ్రహ్మాండ ♦ దేవ! శరణు
నన్ను మన్నించి రక్షింపుమో ♦ నలిననేత్ర!
యనుచు ననులోనఁ గృష్ణుండు ♦ నఖిలలోక
సహితుఁడై తిరోహితుఁ డౌట ♦ సరిగ నెఱిఁగి. ౧౧౨

తే॥ మఱల నతులిడి సంధ్యాది ♦ మహితకర్మ, లాచరించి తీరమునకు ♦ నరుగు దెంచి
తిరిగి వెనుకకుఁ గనుచు న ♦ చ్చెరువుఁ బొంది, హరి పరబ్రహ్మయని నిశ్చ ♦ యంబొనర్చి.

చ॥ అలరుచుఁ దేరునెక్కి యసి ♦ తాంబరనందకుమారయుక్తుఁడై
జలజహితుండు గ్రుంకుతఱిఁ ♦ జక్కఁగఁ దన్మధురాసమీపమం

దలరు వనంబుఁ జేరె నట ♦ నా వ్రజరాణ్ముఖ గోపకుల్ వడిన్
బిలపిలమూఁగిరా పిదప ♦ వెన్నుఁడు, నందుఁడు దొట్టివారలన్. ౧౧౪

చ॥ కని యల గాందినీతనయుఁ ♦ గాంచి ప్రియంబున నిట్లు పల్కె నో
ఘనచరితా! భవద్రథముఁ ♦ గైకొని ముందుగ వీడు లోనికిన్
జను మటుపైన మేమును వె ♦ సన్ జనుదెంతుము పొమ్మనంగ వాఁ
డును భయభక్తులన్ గనుఁగ ♦ దున్ గిడిగిళ్ళు బొనర్చి యిట్లనెన్. ౧౧౫

తే॥ పతితపావన! జగదీశ! ♦ పరమపురుష!, సోదరాభీరయుతముగా ♦ భేదము విడి
నా గృహంబునకేతెంచి ♦ నలిననాభ్య, పాదధూళిఁ బావనము స ♦ల్పన్ నుతింతు.

తే॥ నిన్ను విడనాడి యింటికి ♦ నేను బోను, జూవె! యని పల్కువిని యా య ♦ శోదపట్టి
యిట్లు వాకొనె నక్రూర! ♦ యేను కంస, ముఖవిరోధుల నందఱఁ ♦ బొడిచి యడఁచి.

ఆ॥ నీవు గోరినట్లు ♦ నీలాంబరాభీర, సహితుఁడ నగు నేను ♦ సత్వరముగ
నీమనికికి వత్తు ♦ నీ వాలసింపక, తెమ్ము రథముగొమ్ము ♦ పొమ్ము పొమ్ము. ౧౧౮

శ్రీకృష్ణుండు మథురకుఁ జేరుట.

వ॥ అంత నక్రూరుం డద్దానికి నొప్పి యుషఃకాలంబున మేల్కాంచి తదను
మతిం గొని తన యరదం బెక్కి కంసుని సదనముం జొచ్చి యతనికి రామకృష్ణాగమ
నంబు వినిపించి నిజగృహంబున కరిగె. తదనంతరంబున నపరాహ్ణంబగుడు సాగ్ర
జుండగు కృష్ణుండు తత్పురీదర్శనలాలసుండై ప్రయాణసన్నాహం బొనర్చుట నందుం
డాలోకించి నాయనా! యిది మహాసుఖకరంబగు గోకులంబు గాక యతిభయంకరం
బగు కంసుని ముఖ్యపట్టణంబని యెఱింగి యార్జవంబు ముందిడుకొని యప్ర
మత్తుండవై సంచరింపుము. నాను శ్రీమరువకుమని హెచ్చరింప నతం డందుల కూ
రీకరించి నందప్రణోదితగోపక బాలవృద్ధసహితంబుగా నాపురిలోనికి నడుగిడి నగ్గర
లం దలరెడి దుర్గంబులను బరిఖలను వప్రంబులను భర్మమయరమ్యహర్మ్యంబులను
శృంగాటకంబులను శృంగారోద్యానవనంబులను విపణులను నచ్చరలనుబోలి మసని
చేతికటారులనం దగు మిటారులను యమునాతటినీతటవిలసన్మణిమయసోపానంబు
లను వెండియు నానావిచిత్రంబులను విలోకింపం దొడంగె. అమ్మెయిఁ జిరంత
నమ్మ్మగ విని శ్రీకృష్ణుని రాకకై చంద్రచకోరన్యాయంబుగా నిరీక్షించెడి నమ్మాధు
రసుందరీమణు లమ్మాధవాగమనమ్ము విని స్వకృత్యములం ద్యజించి ప్రాసాదంబుల
నెక్కియుఁ గవాటంబుల నక్కియు గవాక్షంబుల నుండియు నా దీనపయోనిధినిఁ
గాంచి హృష్టాంతరంగలై, ౧౧౯

సీ॥ వీఁడఁటే గోపక ♦ విభు యశోదా తపః,ఫలపుంజమని యెన్నఁ ♦ బరగు సుగుణి
ఽ వీఁడఁటే పూతన ♦ విలయంబుఁ బొందఁగా, జనుబాలఁ ద్రావిన ♦ ఘనసుతుండు

వీఁడఁటే మందలో ♦ వెన్నపాల్పెరుఁగులఁ, గాఁజేసి మ్రింగిన ♦ గట్టిదొంగ
వీఁడఁటే చిటికెన ♦ వ్రేలున గిరినెత్తి, వ్రేపల్లెఁ గాచిన ♦ విదిత బలుఁడు
తే॥ వీఁడఁటే గోపికాంబర ♦ వితతిఁగొనుచు, భూరుహంబెక్కి చతురత ♦ ముచ్చటాడి
డెందములను హరించిన ♦ సుందరుండు, జలజలోచనలార! యో ♦ సకియలార!
సీ॥ వీక్షింపవే! వాని ♦ భృంగ ఘనాఘనో, త్కరమునుమీఱు ముం ♦ గురుల హొయలు
జూడవే! యాతని ♦ శుద్ధరాకాచంద్రుఁ, బోలెడి గుండ్రని ♦ ముద్దుమొగము
గాంచవే! యాతని ♦ కమనీయ పద్మినీ, కాశంబులైనట్టి ♦ కనులసొంపు
గనుఁగొనవే! వాని ♦ ఘనకవాటప్రతీ, కాశమై తనరువ ♦ క్షంబు విధము
తే॥ కనవె! యాతని మదమత్త ♦ గజసమాన, యానరమ్య మీక్షింపవే! ♦ హస్తిహస్త
శస్తమైన యాజాను భు ♦ జములతీరు, జలజలోచనలార! యో ♦ సకియలార!
ఆ॥ ఇతఁడు తిరిగి నట్టి ♦ బృందావనంబును, నితనిఁ జూచినట్టి ♦ మెల్లవ్రేలు
రాసకేళి నిట్టి ♦ రసికుతోఁ గూడిన, చేడె లే సుకృతముఁ ♦ జేసినారొ? ౧౨౨
ఆ॥ ఈమహాత్ముఁ గనిన ♦ యేము ధన్యులమైతి, మంచుఁ బొగడుచుండ ♦ నచ్యుతుండు
రాచబాటఁ జనుచు ♦ రజకుఁ డొక్కఁడు తన, కెదురుగాగ నిటు న ♦ దించె జనక!

{ రామాది సహితుండగు కృష్ణుండు రజకునిం జంపి
వాయక సుదాములను ననుగ్రహించుట. }

క॥ ఓరీ! యెవ్వండవురా, రారా! నాకడకు నాకు ♦ రమ్యాంబరముల్
దేరా! మాటాడకురా, పోరా! నామాట వినర ♦ పొందర సుఖముల్. ౧౨౪
ఆ॥ అంతనాతఁ డవ్వి ♦ యాత్మకోపాగ్నికా, జ్యాహుతులుగ నుండి ♦ యనియె నిట్టు
లరరె! యెవ్వఁడిట్టు ♦ లనలేదు నన్నెప్పు, గాని యీతఁడెవఁడొ ♦ కనెదఁగాక.
క॥ నీతాతయు ముత్తాతయు, నీతండ్రియు నీవుగాసి ♦ నేత్రంబుల నీ
రీతిగ నుండెడి వలువల, నేతటి నే నంటిరొక్కొ? ♦ యెంగిలికాయా! ౧౨౬
ఉ॥ కావున నోర్మదల్పక యిఁ ♦ కజ జను మియ్యవి వీరవీరుఁడై
దేవమనుష్యరాక్షసుల ♦ దిట్టముగాఁ బ్రహరించి లోకముల్
జేవఁగ నేలు కంసవిభు ♦ చేలము లంచు గ్రహించు మాప్రభుం
డీ విషయం బెఱింగిన స ♦ హింపక నిన్జెఱఁ బెట్టు దుర్మతీ! ౧౨౭
ఉ॥ ఇట్టులఁబల్కు నారజకుఁ ♦ గృష్ణుఁడు గాంచి యరే యిదేమిరా!
తిట్టుచు మాటలాడెదవు ♦ దేహమెటుండెనె? యేరువత్తురో
యెట్టుల నిన్నుఁ గాచెదరొ? ♦ యేఁదిలకించెద నంచుఁ గూకటిం
బట్టి శిరంబు ద్రుంచెఁ దన ♦ వార లపారముదంబుఁ జెందఁగాన్. ౧౨౮
ఉ॥ అంతట వానిజోతి యల ♦ యచ్యుతులోన లయించె నట్టి వృ
త్తాంతముగన్న తత్సఖులు ♦ తగ్గి కరంబులనున్న దుస్తులన్

దొంతిగఁ జక్కి ముంగలకుఁ ♦ ద్రోసి శరత్సమయాన మబ్బుల
త్యంతము బాఱినట్లుగ య ♦ థాంఘ్రిబలంబుగఁ బాఱిరో విభూ! ౧౨౯

తే॥ అవల వారలు వదలిన ♦ యంబరముల, నంబుజాక్షుండు తొల్తొల్త ♦ నాత్మకిష్ట
మైన వానిని ధరియించె ♦ హరియుఁగూడ, మంచివస్త్రంబులందాల్చె ♦ మనసుదీర.

క॥ గోపకబాలురు సైతం, బోపికతో నేఱికొనుచు ♦ యుక్తపటంబుల్
జేపట్టి కట్టఁదొడఁగిరి, శ్రీపతిబలరాములును వి ♦ చిత్రముగఁగనన్. ౧౩౧

తే॥ మఱియు మిగిలిన వస్త్రముల్ ♦ మాధురులును
గొని ధరించి రీచిత్రంబు ♦ గనులఁగన్న
యొక్కవాయకుం డంబుకు ♦ హెూదరహాలి
గోపసన్నిధి కేతెంచి ♦ కోర్కిఁగాంచి. ౧౩౨

క॥ నిస్తుల పటముల నస్త్రవ్యస్తముగా వీరుగట్టె ♦ రని వారలకున్
శస్త్రవిధంబునఁగట్టెను, స్వస్తియశశ్శ్రీలుఁ బరముఁ ♦ జక్రి యొసంగన్. ౧౩౩

ఆ॥ అచటనుండి కృష్ణుఁ ♦ డగ్రజ గోపక, సహితుఁడగుచు లేచి ♦ చతురమతిని
బుష్పహారములను ♦ బొలుపుగాఁ గూర్చు సు, దాముసదనమునకుఁ ♦ దరలిచనఁగ.

చ॥ అతఁడల రామకృష్ణులను ♦ హర్షమునన్ గని హేమరత్నచి
త్రితపృథుసింహపీఠములఁ ♦ దేజరిలం బొనరించి భక్తితో
శ్రుతిహితసత్కృతుల్ సలిపి ♦ శోణితలంబు శిరంబు సోకఁగాన్
నతులిడి వాఙ్మనఃక్రియల ♦ నమ్రవినమ్రత శౌరి కిట్లనెన్. ౧౩౪

తే॥ భక్తసందోహమందార! ♦ బలినిగూడి, నీవు నాయిల్లుజొచ్చుట ♦ నేను ధన్య
తముఁడ నా యన్వయంబును ♦ ధన్యమయ్యె, నాగృహంబు పవిత్రమై ♦ నాణెమొందె.

తే॥ మఱియు నాతల్లివంక నా ♦ మగువవంక, దండ్రివంకనుండిన యేడు ♦ తరములఁదగు
పితరులెల్లరు నిత్తఱి ♦ విష్ణులోక, మునకు నేగి రటంచెంతు ♦ వనజనాభ! ౧౩౭

క॥ సాధుజనరక్షణార్థ మ, సాధువధార్థంబు జగతి ♦ జన్మించితిరో
శ్రీధర! నీకివె మ్రొక్కులు, బాధలఁ బోఁద్రోచి యిమ్మ ♦ పరమసుఖంబుల్.

చ॥ అని కొనియాడుచున్ మధులి ♦ డస్వ్రతవాసిత దివ్యపుష్పముల్
గొని బలరామకేశవుల ♦ గోరుమొదల్ దల దాఁక యోగ్యమై
ననిఱి నలంకరించియుఁ బ్ర ♦ ణామముల్ మఱేఁజేయ వారలున్
మనమున నుబ్బి రావల ర ♦ మాపతి యాతని కిట్లు వాకొనెన్. ౧౩౯

పంచచామరము॥ సుదామ! నీదుసేవలెల్ల ♦ సొంపుగాఁ జెలంగుటన్
ముదంబుగల్గె మాకు నిప్డె ♦ పుణ్యభక్తమైత్రియున్
మదాది శత్రుషట్కహీన ♦ మానసంబు భక్తియున్
సదా ఘటిల్లుఁగాక నీకు ♦ సంశయంబు లేనటుల్. ౧౪౦

క॥ ఆయెడ బలరాముండుఁ, నేయముతో నిట్లుపలికె ♦ నీకు సుదామా!
యాయుర్వృద్ధియు బలమును, శ్రీయును విఖ్యాతి సతము♦ సెలఁగుఁ గాతఁ. ౧౮౧
క॥ వరముల నీరహి నొసఁగియు, నిరుపురు నటనుండి లేచి ♦ యింకొకవీథిఁ
దిరుగుచుఁ గని రొక తరుణిని, సరసిజనయనఁ బటీర ♦ సహితఁ గుబ్జఁ. ౧౮౨

శ్రీరామకృష్ణులు కుబ్జతో సంభాషించుట.

చ॥ పదపడి రామకృష్ణు లల ♦ భామిని నిట్టుల నడ్గసాగిరో
సుదతి! త్వదీయ వంశమెది? ♦ సూత్రము గట్టినవాఁ డెవండు? పే
రెది? యెట కీ పటీర రస ♦ మెవ్వనికై కొనిపోవుచుంటివో?
యిది యొకకొంత మాకు నిపు ♦ డిచ్చెదవే? యన నద్ది యిట్లనెఁ. ౧౮౩
చ॥ నరవరులార! భూతలము ♦ నఁ నన్నుఁ బిల్తురు కుబ్జయంచు నే
వరవుడు నిప్డు కంసునకు ♦ బానిసకత్తెగ నుండి గంధముఁ
గరముగఁ బూయఁబోయెదను ♦ గందముఁగోరిన మీరె యెల్లెడఁ
బురుషవరేణ్యు లౌట నిదె ♦ పూసెద హస్తము లిట్లు చాఁచుఁడీ! ౧౮౪
చ॥ ఇటుల వచించి చందనముఁ ♦ గృష్ణునకుఁ యమునావిభేదనో
త్కటపటురామమూర్తికిని ♦ దద్దయు రాచి వ్రజార్భకాళికిఁ
జటులముగా నలంది పలు ♦ జాఁగిలులం బొనరింప వారలా
దటఁబడి రంతఁ జక్రి యల ♦ తన్విని గన్గొని యుత్సహించుచుఁ. ౧౮౫
ఉత్సాహ॥ గూను నడ్డి కుంటుటలను ♦ గోలుపడిన దేహముఁ
మానుగా నొనర్పఁ దలఁచి ♦ మగువకాళ్ళ వ్రేళ్లపైఁ
బూనఁజేసి తనపదముల ♦ ముగుదగొదఁ దనదు రెం
డైన వ్రేళ్ళఁబట్టి పైకి ♦ నట్టె సాగఁదీయుటఁ. ౧౮౬
క॥ వంకర టింకరలు విడ శ,శాంకసతిఁ రతిని రంభ ♦ శచి మించిన బ
ల్పొంకపు దేహము కుబ్జకు, నంకము లేనట్టు లమరె ♦ హరిపదధీనా! ౧౮౭
క॥ సుందరి యగు కుబ్జయు నా, నందంబును బొంది నంద ♦ నందనుఁ గని గో
విందా! సుందర! దయ నా,మందిరమున కేగుదెంచు♦మా! యీవేళఁ. ౧౮౮
తే॥ మఱి రసజ్ఞ! సర్వజ్ఞ! యభిజ్ఞ! నే♦మారుబారి, కాగజాలనామనమునీ♦యందచిక్కి
నిన్ను విడలేను రారమ్ము♦వెన్నదొంగ!,యంచు నగవుతో లాగె నా♦యవసరమున.
తే॥ గోపబాలురు చప్పట్లు ♦ గొట్టి నవ్వి, పెద్దవాఁడైన ముసలియు ♦ నొద్దనుండి
చూచుచుండ నీకుబ్జ యు ♦ శోదపట్టి, నెంతపనిజేసె నారార! ♦ యేమియేమి!
తే॥ నలువకైనను వేనోళ్ల ♦ చిలువకైన, నంగనాసాహసం బెన్న ♦ నలవియగునె?
తగునె నీకిది వీథిలోఁ ♦ దలిరుఁబోఁడి, యైన నీకులమున కద్ది ♦ యనువుగాదె?

ఉ॥ ఆరహిఁబల్కువారు చెవు ♦ లార విసన్ హారి, యట్టికుబ్జకీ
ధోరణిఁ జెప్ప నో రమణి! ♦ త్రోవ నెఱుంగని వారికిన్ నిజా
గారములందు విందులిడి ♦ గౌరవముల్ బొనరింతు రౌర! యీ
యూరఁ దెలుంగు వారి దగు ♦ యోగ్యతఁ జెప్పఁ గలాఁడనే యహా! ౧౫౨

చ॥ నెలఁతరో! పోవ యీ పురిని ♦ నేను సుమిత్రులఁగూడి కాంచి నీ
నెలవున కేగుదెంచెదను ♦ నిశ్చయ మంచు నిజోత్తరీయమున్
జిలిబిలిపల్కులాడి కొని ♦ చెచ్చెర వీడ్కొని రాజవీథిలోఁ
గల ధనధాన్యవృద్ధులను ♦ గన్గొన వైశ్యులాబ్ధిచంద్రులన్. ౧౫౩

ఉ॥ కాంచినతోడ నూరుజులుఁ ♦ గంజదళాక్షున కిచ్చి గద్దెన
ర్ఘ్యాంచితపాద్యవారులను, ♦ బాల జలమ్ములఁ దమ్ములమ్ములన్
మంచి ఫలమ్ములన్ విరుల ♦ మన్ననలం బొనరించి శీర్షమున్
వంచి నమస్కృతుల్ సలిపి ♦ పల్కిరిటుల్ ముకుళించి హస్తముల్. ౧౫౪

ఉ॥ శ్రీపతి! భావికాలమునఁ ♦ జిత్రతరంబుగ నీవె యిచ్చటన్
భూపవరుండ వైన మము ♦ బుద్ధిని రోయక సర్వకాలముల్
జ్ఞాపక ముంచుకొ మ్మదఁ ద ♦ లంపఁ ద్వదీయుల మేము కామె? నీ
పాపల మాడ్కిఁ బ్రోవు మని ♦ పల్మఱు వేఁడి రనంతరంబునన్. ౧౫౫

క॥ ముసిముసినగవులు నగి సం,తసమున నా కోమటులను ♦ దైత్యారిపుం డి
ట్టి సరణి నడిగె ధనుస్స్థల, ముసులగు నటు జూపుఁ డిప్డు ♦ దూరుజులారా!

చ॥ అనవుడు వైశ్యులందఱు త ♦ దద్భుతచాపవిభంగభీతి దా
నిని వచియింప రై రవల ♦ నీరజనాభు శరీరసౌష్ఠవం
బునను గుణంబులన్ మిగుల ♦ మోహముఁ జెంది తదన్యులెల్ల రో
తనయ! ధనుస్స్థలం బిపుడు ♦ తప్పక చూపెదమయ్య! రమ్మిటుల్. ౧౫౬

తే॥ అనుచు వారలు చూపిన ♦ యధ్వమందు, నడచు చాత్మీయసఖులతో ♦ నవ్వుటాల
మాటలాడుచుఁ జక్రి సు ♦ మాళిముగను, గ్రమముగాఁ దద్ధనుస్స్థలి ♦ కడకుఁ జేరి.

### శ్రీకృష్ణుండు ధనుర్భంగంబు గావించుట.

సీ॥ స్వర్ణమయంబును ♦ సప్తతాలకయుక్త, మష్టధాతుసహిత ♦ మలఘుతమము
లక్షభారయుతంబు ♦ దక్షపంచసహస్ర, మనుజానయోచిత ♦ మహితభరము
నైంద్రాధికంబును ♦ నరిభయంకరమును, వలయాకృతోరగ ♦ ప్రభుసమంబు
పార్థివ నాశక ♦ భార్గవదత్తంబు, కంసగృహీతంబుఁ ♦ గాంతికాంత

తే॥ మఖిల పౌరార్చితంబును ♦ యజ్ఞమండ, లరుచిరంబును నా చాప ♦ వరము నరులు
వలసు వల దనుచున్నను ♦ వలఁతిఁగ నగి, కేలఁగొని లీల హర్యా నెక్కించి మించి

తే॥ ఇక్షుఖండంబుఁ గ్రొవ్విన ♦ యిభము సులువు, గా విఱిచినట్టు లాత్మీయ ♦ కరబలమునఁ
గర్ణపర్యంతముగ లాగి ♦ క్షణములోన, రెండుతుండెములౌనటుల్ ♦ చెండివైచె.

ఉ॥ చెండినతోడనే యొక వి ♦ శేషరవంబు ఘనస్వనంబటుల్
దండిగఁ బుట్టె దాన సభ ♦ తండము మెచ్చెను దిఙ్మదేభముల్
బండెఁ బ్రపంచముల్ పగిలె ♦ బాహుబలాఢ్యులు మెచ్చి రన్యులున్
గండరగండఁ డంచనిరి ♦ కంసుని గుండియ చెండఁగాఁ బడెన్. ౧౬౧

క॥ కావలివా రది గనుఁగొని, యేవిధినే న్వీనిఁ దఱిమి ♦ యేలిక మెచ్చం
గా విగతప్రాణునిగా, నీవేళ నొనర్తుమంచు ♦ నేగఁగ నటకున్. ౧౬౨

క॥ ఉగ్రమున రామహరు లల, యుగ్రధనుశ్శకలముల మ ♦ హోద్ధతిఁగొని యా
యుగ్రాస్త్రధరుల వారి స,మగ్రముగాఁ గొట్టి రా స ♦ మయమందుననే.

తే॥ భిన్నపాదులు గొందఱు ♦ భిన్నబాహు,వులును గొందఱు భిన్నశీ ♦ ర్షులును గొంద
ఱగుచు నైదువే లుక్కరు ♦ లవనిఁబడిరి, పౌరు లదిగని పాఱిరి ♦ స్వగృహములకు.

క॥ మఱిఁ గోలాహలములు త,త్పురిఁ గరముగఁ బుట్టెఁ గంస ♦ భూపచ్ఛత్రం
బరుదుగఁ బేరోలగమున, ధరఁబడె నకస్మాత్తుగా న ♦ దరిపడ సభ్యుల్. ౧౬౩

## సూర్యాస్తమయ వర్ణనము.

ఉ॥ ఈ సమయంబునందుఁ గమ ♦ లేక్షణ! నీవొనరించు సేఁత నీ
వేసము రోస మీఁకులను ♦ వీక్షణజేసితి దీనిఁ జూచు నీ
యే సననుంటిఁగాన నిఁక ♦ నీవిలుఁ జేరుము కుబ్జవాట నిన్
మోసమొనర్తు రల్పులని ♦ పోయెడి నా రవి గ్రుంకె నయ్యెడన్. ౧౬౪

సీ॥ పడమరపడఁతుక ♦ నడికట్టు సడలించెఁ, బడమరదొర కక్కు ♦ నడరఁ దొడఁగె
నెత్తమ్మిముత్తైవ ♦ మొత్తుకో మొదలిడెఁ, దొగవగకత్తియ ♦ సొగసుఁ జేసెఁ
బగలను నత్తగా ♦ ప్పతన మంతయుఁ దగ్గ, రేఁగోడలిపొగరు ♦ రెట్టిమొగ్గ
లిబ్బుల దొరలెల్లఁ ♦ దబ్బిబ్బుఁ జెందిరి, మ్రుచ్చులు హెచ్చుగ ♦ మెచ్చిరిచ్చ

తే॥ జక్కవలతేని దొరతన ♦ మక్కిలిఁబడెఁ, జక్కవల గొంగ దొరతన ♦ మెక్కువయ్యె
నరయ నొక్కరు బాముల ♦ నందుచుండ, నొకరుసుఖములఁబొందుచు ♦ నుంద్రుగాదె

సీ॥ శాకినీ ఢాకినీ ♦ హాకినీ ప్రముఖ భూ,తవిహార భావుకో ♦ ద్యానవనము
యతికృష్ణవర్ణవ ♦ ర్ణితమత్తగజసామ్య, చండమహిషవాహ ♦ దండధరుఁడొ
వేదశాస్త్రపురాణ ♦ విశ్వవిశ్రుతకృష్ణ, వీర్యనాశోద్యోగి ♦ దుర్యశంబొ
వర్ణసంకరహేతు ♦ దుర్ణయ నిర్ణయో,ద్యోగి సంపాదిత ♦ దుష్కృతంబొ

తే॥ తామసీ సతీకుముఖ వ ♦ స్త్రంబొ యనఁగఁ, గటికచీఁకటు లెల్లెడఁ ♦ గ్రమ్మెఁదొడఁగ
భీతుఁడైనట్టి నరువలె ♦ వెన్నుఁడన్నఁ, జెలులఁగూడి యానందుని ♦ చెంత కేగె.

## మధురాపుర పురంధ్రీ విరహ వర్ణనము.

క॥ పదపడి మధురా వధువులు, మదనజనకు రూపుఁ గాంచి ♦ మన్మథగదచేఁ
జెదరిన మది గలవారై, వదలఁ బటము లొండొరులును ♦ బల్కుకొని రిటుల్.

ఉ॥ అంగనలార! యీపురిని ♦ నంగజకోటి రుచుల్ హరించి శ్రీ
సంగుఁడు నేడు వేడుకఁగ ♦ జాలఁ జరించెను వాఁడె మాదు స
ర్వాంగముల దనంగమధు ♦ రాకృతితోడఁ జెలంగి గోచరిం
పంగఁ దొడంగెఁ జూడుఁడని ♦ పల్కఁగ నందలి ప్రోడ లెల్లరున్. ౧౨౦

మ॥ విని యిట్టుల్ బలుకాడఁగాఁ దొడఁగిరో ♦ బింబోష్ఠులారా! జనా
ర్దనుఁ డీయూరను నల్గడల్ దిరిగి తా ♦ త్సర్వంబునన్ జూచి మి
మ్మును మమ్ముంగని వీరె మిన్నలనుచున్ ♦ మోహించి సర్వాంగముల్
గని చిత్తంబులు గొప్పవంచుఁ గొని వే ♦ గంబోయెఁ జోరాభుఁడై. ౧౨౧

క॥ వనమాలి యితం డింకను, మనలన్ విడలేక యిపుడు ♦ మన యంగములం
దున వెలుఁగుచు నుండెడి, నని యెఱుఁగుఁడి? మీరలెవల ♦ నరయఁగ మఱియున్.

సీ॥ కమలేశుఁ గననట్టి ♦ కన్నులు కన్నులే, సర్పముల్ జొచ్చు బె ♦ జ్జములుగాక
యజ్ఞాత్ముఁ దాఁకని ♦ హస్తంబు హస్తమే, మడ్డిగానుండెడి ♦ త్రెడ్డుగాక
గోవిందు మోపని ♦ గుబ్బయు గుబ్బయే, దిక్కుమాలిన పెంట ♦ దిబ్బగాక
విష్ణూక్తుల వినని ♦ వీనులు వీనులే, గ్రావసంగతవివ ♦ రములుగాక

తే॥ నీరజోదరుఁ బొగడని ♦ నోరునోరె, చాలఁగా మ్రోఁగుచుండెడి ♦ డోలుగాక
హేమచేలుని కూడిక ♦ నెఱుఁగనట్టి, ముద్దులాడి ముద్దియయె? పెన్ ♦ మొద్దుగాక.

సీ॥ కాయంబుతోడుతఁ ♦ గాయంబు దివ్యమా, నధరంబుతోడ ది ♦ వ్యాధరంబు
మోముతో మోమును ♦ భుజములన్ బుజములఁ, గరతలంబులతోడఁ ♦ గరతలముల
ఱొమ్ములతో ఱొమ్ము ల ♦ గ్నమ్ముతో లగ్నము, నూరుయుగ్మముతోడ ♦ నూరుయుగము
ఘ్రాణానిలంబుతో ♦ ఘ్రాణానిలంబును, బాదయుగంబుతోఁ ♦ బదయుగంబుఁ

తే॥ జేర్చి సందులేనట్టి యా ♦ శ్లేషములను, గూర్మిఁ గోలఁది జేసికొనుచుఁ ♦ గుతుక మొందు
ఉన్నడో గద యా కృష్ణుఁ ♦ డట్టులేగ, నో గదా యేమి చేయనా ♦ నువిదలార!

సీ॥ కోటిమన్మథులను ♦ దాఁటిన రూపేల, యీకృష్ణమూర్తికే ♦ యొసక మెసఁగె
నెసఁగెఁబో యాహరి ♦ యేల తద్గోకుల, మందు నుండక యిట ♦ కరుగుదెంచె
నరుదెంచెఁబో నాతఁ ♦ డరుదుగా నేటికి, వీథివీథుల వెంట ♦ వెడలవలసె
వెడలెఁబో యేల యా ♦ తఁడు ప్రస్తుతంబున, నొంటిగా నిట మన ♦ కంటఁబడుట

తే॥ కంటఁబడుగాక యతనిపైఁ ♦ గరముఁ గూర్మి, మనకు నేటికిఁ దనరెను ♦ దనరుఁగాక
యిట్లు కారించుటలకో ♦ యింతులార!, చెప్పుఁడీ యెట్టికార్యముల్ ♦ జేయనగునె?

క॥ ఒకసారిఁ జూచినంతనె, యకలంక ప్రేమ మనకు ♦ నాహారియందే
సుకముగఁ గలిగెను దాన న,ధికపు మనోవ్యాధిపుట్టెఁ ♦ దీఱనియట్టుల్. ౧౭౬

తే॥ ఇంతమాత్రమునకు మన ♦ కిట్టులుండఁ, జాలకాలము నుండి వ్ర ♦ జంబునందు
రాసమండల మందున ♦ రతులఁ దేలి, నట్టి సతులెట్లు మరతు రా ♦ యంబుజాక్షు ?

క॥ అని యిటు పరిపరి తెఱఁగులఁ, గనుకొనలను నీరు గాఱఁ ♦ గాఁ గమలేక్షుల్
మనములఁ దలఁచుచుఁ బడకకుఁ, జనసాగిరి సక్రమముగ ♦ జనకనరేంద్రా !

క॥ ఆ రామకృష్ణులానిశి, నా రమణీయోపవనము ♦ నందున సకలా
భీర సహితులై రుచిర, క్షీరాన్నము మెసవి తెలివి ♦ చే నుండి రటన్. ౧౭౯

వ॥ భోజభూపతియగు నక్కంసుండును శ్రీరామకృష్ణులొనర్చిన రజకశిరచ్ఛేదంబును శరాసనవరసంరక్షణదక్షవధంబును, ధనుర్భంగంబును విని దిగులుపడి యశుభసూచకంబులగు వామాంగస్ఫురణంబులం దత్తఱపాటుతోఁ గని శయనించి కనుమూసినంతనే తైలంబు బొడలయందుఁ బూసికొని సిగవిరియంబోసికొని రక్తపుష్పమాలికల్ వేసికొని వానముల నూడం దీసికొని కాసరంబున నాసీనుండై ప్రేతలతోడం గూడి దక్షిణదిగ్యానం బొనర్చినట్లు కలం గాంచి యులికిపడి దిగ్గనలేచి చింతించుచున్నంత, ౧౮౦

## సూర్యోదయ వర్ణనము.

ఉ॥ కొక్కొరొ కొక్కొరో యనుచుఁ ♦ గోడులు గూసెను నంబరంబునన్
రిక్కలు మాసెఁ దేంట్ల రొద ♦ రేగె నిశాకరుఁడేగెఁ జక్కవల్
నిక్కె విహంగనాదములు ♦ నెక్కొనె మారుని తూపులేఁపులున్
జిక్కెఁ దమంబు లెల్లెడలఁ ♦ జెల్లెను దెల్లని డాలు నెక్కడిన్. ౧౮౧

సీ॥ చటులకపటులను ♦ నటెనట విటివిట, చోరులం బరిమార్చు ♦ శూరుఁ డనఁగ
మార్తురఁజంపి శ్య ♦ మంతకమణిఁ దాల్చి, యరుదేరు కౌస్తుభ ♦ ధరుఁ డనంగ
సకలరోగంబుల ♦ సమయించి సౌఖ్యముల్, నరులకుం గూర్చు ధ ♦ న్వంతరి యన
బ్రహ్మవర్చస్విలో ♦ బ్రాహ్మణ జనులచే, మ్రొక్కులందెడి వేద ♦ మూర్తి యనఁగఁ

తే॥ దమ్ములను ప్రియురాండ్రఁ బ్రే ♦ మమ్ముచేరఁ
బొందుఁజేసెడి ప్రియుఁ డనఁ ♦ బూషణుండు
వేయిచేతుల తోడుత ♦ వెడలి కడల
వెలుఁగఁజేయుచు నుదయించె ♦ లలితరీతి. ౧౮౨

## కంసుండు మల్లరంగంబు నిర్మింపం జేయుట.

ఆ॥ ఆసమయమునందు ♦ నా భోజభూపతి, పడక విడిచి లేచి ♦ భటవరులను
గార్యభారకరులఁ ♦ గ్రమముగా రావించి, యాజ్ఞచేసె నిట్టు ♦ లవనినాథ !

వ॥ కార్యసాధకులారా! మీరు వేవేగ జాంబూనదస్తంభవిరాజితంబును విపులాంగణసంగతంబును నగు మత్సభామండపంబున కగ్రభాగంబందలి ప్రదేశంబున మల్లక్రీడారంగంబు హంగుగా నయనపర్వం బగునట్లు గావింపుఁడన్న వారలాపలుకు తొడలఁ దాల్చి తత్స్థలంబున సిమోన్నతంబుల సమంబుగాఁ జేసి హేమసోపానసమంచితమంచంబులను రచించి చుట్టును నుంచి ముక్తాహారంబులు వ్రేలాడుచుండు బంగారుడాలుఁబోలిన మేలుకట్టు గట్టి యతిమృదులంబగు తలగడతో వెలిఁగెడి వేకనులవాని గద్దెనద్ద వజ్రంబు లమర్చిన పొన్నులుగల చామరంబులను మరాళసన్నిభంబులగు సితవ్యజనంబులను బూర్ణచంద్రమండలరుచిరంబగు శ్వేతచ్ఛత్రంబునను నమూల్యంబులగు నవరత్నంబులను విరాజిల్లి కనులపండు వొనర్చునొండు మంచంబుఁ బదిమూరలెత్తునఁ దను వేలికకై నిర్మించి యతిచతురంబుగా మల్లరంగంబు సిద్ధంబు సల్ప నయ్యదువీరుం డేతెంచి కాంచి సంతసించి మంగళతూర్యంబులు మ్రోఁగుచుండ వారాంగన లాడుచుండఁ బాటకాండ్రు పాడుచుండఁ దనకై యేర్పాటుజేసిన మంచెపై నాసీనుండయ్యె. అంతఁ గంసాహుతులగు బాణాసురనరకాసురప్రముఖదనుజవరేణ్యులును జరాసంధప్రభృతిబంధురత్నంబులును నందాదులైన గోపగ్రామణులును శంబరాసురప్రభృతులగు నాత్మసఖులును సామంతులును మండలేశులును బౌరులును జానపదులు నేతెంచి నమ్రులై పారితోషికంబులను గప్పంబులను సమర్పించి నియమితంబులగు తమ యాసనంబుల నధిష్ఠించిరి. తత్సమయంబునఁ జాణూరముష్టికకూటశలతోశలప్రముఖప్రధానమల్లులుల్లాసంబున నామల్లరంగంబుఁ బ్రవేశించి యవ్యాహతవ్యాయామం బొండొరులు ముద్గరాద్యాయుధంబులతోఁ జేయుచున్న యవసరంబున ౧౮౩

## శ్రీరామకృష్ణులు కువలయాపీడగజంబు వధించుట.

ఆ॥ రామహరులు మల్ల ♦ రణకేళిఁ జూడంగ, నరుగుదెంచి మోస ♦ లందు మిగులఁ
ద్రొవ్వి తిరుగులాడు ♦ కువలయాపీడముఁ, ద్విరదవరముఁ గాంచి ♦ సరభసమున. ౧౮౪

చ॥ తొలఁగి మదేభచోదకుని ♦ తో హరి యిట్లను మావటీఁడ! యీ
కలభము నీవు ప్రక్కకటు ♦ గైకొని మార్గము మాకొసంగు మి
ట్టుల నొనరింపవేని నిను ♦ డొక్కలు చీలిచి యేన్గుతోడఁ గు
క్కల కిపుడేను వేసెదను ♦ గాచికొనం గమకింపుమా! యనన్. ౧౮౫

ఆ॥ మావటీఁడు మెండు ♦ మండిపడుచుఁ దన్నిభవరముఁ ద్రోచెఁ ♦ గృష్ణుపైని
నంత నదియుఁ గూడ ♦ నామృత్యుదేవత, యనఁగఁ జెలఁగి మిగుల ♦ నాగ్రహించి. ౧౮౬

శా॥ శీత్కారంబులు సర్వదిక్కురులకున్ ♦ జేద్పాటు సంధిల్లఁగా
నుత్కర్షంబుగఁ జేసి శత్రుకులనా ♦ శోత్తీర్ణతుండంబుతోఁ

గుత్కలాధిపధారినిన్ హరిని గై ♦ కొం చెత్తె నా కృష్ణుఁడున్
దత్కాలంబున దానినుండి నెటులోఁ ♦ దప్పించుకొం చేగుటన్. ౧౪౮

శా॥ కుంభి శ్రేష్మము సూచి క్రమ్మఱి లలిన్ ♦ గోపించి కుప్పించి త
జ్జంభారాతి సహోదరున్ గరముతోఁ ♦ జక్కంగఁ జేపట్టి వే
స్తంభంబుల్ బురుడించు పాదముల క్రిం ♦ దన్ వేయుచున్ ద్రొక్కి బల్
జృంభింపంగఁ జతుర్భుజుం డభయుఁడై ♦ చిత్రంబుగాఁ జూచి తాన్. ౧౪౯

శా॥ బృందారణ్య నికుంజపుంజములలో ♦ వృక్షంబులం ద్రోయు రీ
తిం దన్నాగపదంబు లట్టు లిటులన్ ♦ దిట్టంబుగా నెట్టి వె
న్కం దైవారు మదేభ మడ్డముగ వే ♦ గం దిర్గి శ్రీకృష్ణు ని
స్సందేహంబుగఁ బట్టి కొట్టఁ గడఁగెన్ ♦ సవ్యాపసవ్యంబులన్. ౧౫౦

మ॥ అటుపై దానవవైరి వైరికరిసిం ♦ హంబౌచుఁ, దద్దంష్ట్రిలు
త్కటరోమంబునఁ బట్టి యూఁపి కసి మో ♦ కారించి కారించి యు
ద్భటరీతిన్ బ్రహరించి మించి పురికిన్ ♦ బాఱంగ మత్తేభమున్
బటుదర్పంబున వెంటనంటె నగరిన్ ♦ బర్వంగఁ గోలాహలాల్. ౧౫౧

శా॥ పాపధ్వంసకుఁడైన దానవకుల ♦ ప్రధ్వంసకుం డాగజం
బేఁపన్ గ్రమ్మఱివచ్చె నద్ది హరితో ♦ నేతెంచు వేళన్ బలుం
డాపాతంబుగ దానితోఁక నలస ♦ ర్వారాతి సర్పంబులన్
మాపన్ లాగిన లాగు లాగెఁ బృథులా ♦ మర్షంబునన్ భూవరా! ౧౫౨

క॥ ఆపై శ్రీపతి కని నగి, కూపపుచేత్రాడులాగు ♦ కొనిన ట్లరిని
ర్వాపణచణమైన కువల, యాపీడకరంబు లాగ ♦ నారంభించెన్. ౧౫౩

క॥ ఇరువురుఁ దుదమొద లీరహి, వఱలుచుఁ గరపుచ్ఛములను ♦ బటుభుజములతోఁ
బెళకఁగడఁగ నాగజము పొ,గరు విడి నిశ్చేష్టమయ్యెఁ ♦ గలుషవిదూరా!

శా॥ దానిం గాంచి దురాగ్రహోగ్రనిభులై ♦ దర్పించి తచ్చోదకుల్
మానుల్ ధీనిధు లేద్వు రుద్దవిడి త ♦ న్మత్తద్విపం బెక్కి య
ద్దానిం ద్రోలఁగసాగి రంకుశముతో ♦ దైత్యారిపై నింకఁ గ్రో
ధానూనానిలమూర్తులైన పెఱవా ర ♦ త్యార్భటుల్ సేయుచున్. ౧౫౫

తే॥ మూఁడువందలకరులపై ♦ మొనసి యెక్కి, యంకుశాస్ఫాలనంబులన్ ♦ హరిహరులను
జంప వానిని ద్రోలి రా ♦ సమయమందు, గువలయాపీడమను కరి ♦ కోపగించి.

ఉ॥ చండపరాక్రముండయిన ♦ చక్రధరున్ హరియింపఁబోవ నా
తం డలదాని తొండమును ♦ ధైర్యముగా బిగఁబట్టి యన్న యం
దుండి కనుంగొనన్ జను లో ♦ హోయనఁ ద్రిప్పుచుఁ బాఁదె ధాత్రిపైఁ
గొండికవాఁడు గిండిఁగొని ♦ కొట్టినయట్టుల ధారుణీశ్వరా! ౧౫౭

ఆ॥ అంత నద్ది గిట్టి ♦ నవలఁ దజ్జ్యోతియుఁ, గృష్ణమూర్తిలోల ♦ యించెఁ జక్రి
దాని దంతములను ♦ దత్తణంబునఁ బీకి, యేనుఁగైన మాన ♦ టేంద్రుఁ జదివె.

తే॥ మఱియు సీరి శేషించిన ♦ మత్తకరులఁ, బట్టి కొట్టెను దత్రత్య♦బలులు గాంచి
వర్షకాలము జనినట్టి ♦ పద్ధతిఁ గని, వారిదములు బాఱినయట్లు ♦ వాఱి రవల.

క॥ గోపకబాలకయుతుఁడగు, శ్రీపతి బలరాముఁ గూడి ♦ చిత్రమృగములన్
మాపిన పంచాస్యమువలె, నేపునఁ దగి జయరవంబు ♦ లెల్లెడ నిండన్. ౨౦౦

తే॥ ఆస్యకాంతి యనూరుని ♦ నపహసింప, శ్రమజలంబులు కాల్వలై ♦ చనఁగ దంతి
దంతముల్ మూఁపులందునఁ♦దనరుచుండఁ, జిచ్చువెచ్చిడి ననిలంబు♦స్థితిని వెడలి.

రామకృష్ణులు చాణూర ముష్టికాద్యసురుల వధించుట

తే॥ శిల్పి ముఖశిల్ప చిత్రవి♦చిత్రితంబు, సర్వభూపసుహృద్భృత్య♦సంగతంబు
సంగపాటవాదర్శనా♦స్థాంగణంబు, కంసకల్పిత మల్లరం♦గంబు కడకు. ౨౦౨

సీ॥ పూఁబోఁడులందఱు ♦ పుష్పబాణుండన, జెట్టులెల్లరు జగ ♦ జెట్టి యనఁగ
గోపకు లెల్లరు ♦ గోకుల విభుఁడన, దుష్టులు వైవస్వ ♦ తుం డనంగఁ
బరమయోగీంద్రులు♦పరమతత్త్వంబన, సురజాలములు విరా♦ట్పురుషుఁ డనఁగఁ
నందరాజు స్వకీయ ♦ నందనుండని యుబ్బ, రాజన్యులును రాజ ♦ రాజనంగఁ

తే॥ గంసుఁ డాత్మీయ మృత్యువు ♦ గాఁ దలంప
మఱియు నితరులు దమ తమ ♦ మానసముల
నున్నరీతుల నెన్నఁగా ♦ నొయ్యనరిగి
నలుగడల్ శోభ నెందఁగ ♦ నిలిచె నపుడు. ౨౦౩

తే॥ భోజభూపుండు వచ్చిన ♦ పుండరీక, నయన బలులను జచ్చిన ♦ నాగవరముఁ
గాంచి యబ్బురమునుం బొంది ♦ కలఁతఁ జెంది, యేమితోఁచక మొద్దుర♦హీని వసించె.

చ॥ మఱి యల మంచి మంచముల ♦ మానుగ నున్న సుధీమణుల్ నిశా
కరునిఁ జకోరవారములు ♦ గాంచి ముదంబును బొందినట్టు లా
హరిఁ గని సంతసించి రిఁక ♦ నన్యులు నీ వసుదేవపుత్రు లి
ద్దరును బరాత్పరుల్ గుణులు ♦ పుణ్యులటంచుఁ దలంచి యెంతయున్.

ఉ॥ ఈహరి పుట్టినట్టి స్థల ♦ మీ హరి తిర్గిన తావు నీజగ
న్మోహనుఁ గన్నవారలు వి ♦ నోద మొనర్చెడి వీని మిత్రసం
దోహము వీనిఁ గన్న విబు ♦ ధుల్ మన మీ పురవాసు లెట్టి సం
దేహము లేక ధన్యతను ♦ దేఱిరె? యంచు వచించి రయ్యెడన్. ౨౦౪

శా॥ వీణాదుందుభి కాహళీ పటహముల్ ♦ వేమాఱు మ్రోయంగ నా
చాణూరుం డల శౌరి సీరులను బ్ర♦శ్నన్ జేసె నీరీతి మీ

జ్ఞానల్ శూరులు గాన లెందు మృధ మ ♦ స్మద్రాజ్ఞునః ప్రీతికై
త్రాణఁ జేయుట యొప్పదే ? మనకిటన్ ♦ దైవారవే భద్రముల్. ౧౦౭

ఉ॥ నావుడు రామకృష్ణులును ♦ నవ్వి యిటుల్ పలుకాడిరో బలీ !
చేవను నీడు వాడుకలఁ ♦ జేఁతల రీతుల నీకు సాటి మే
మేవిధినైన రాఁగలమె? ♦ యిద్ది యధర్మము గాదె? దీని నీ
భూవరుఁడేని నొప్పునొకొ ? ♦ బొట్టె లటంచు మముం ద్యజింపఁడే ? ౧౦౮

క॥ అనవుడు చాణూరుండును, విని యిట్లనె నయ్యలార ! ♦ వేయేన్గులచే
వనుదగు కంసుని గజవర, ముచు జంపుట మీరు నాకుఁ ♦ బోలరె? ప్రతిగాఁ.

ఉ॥ మీరలు వీరవీరులని ♦ మేము దలంతుము కాని యర్భకుల్
సారము లేనివారనుచు ♦ స్వాంతమునందు గణింపమన్నఁ జా
ణూరునితోడ భార్గవిమ ♦ నోహరుఁడున్ హాలి ముష్టికాఖ్యుతోఁ
బోరఁ గడంగి రుత్సుకతఁ ♦ బుష్కరమం దమరాళి గన్గొనన్. ౧౧౦

వ॥ అమ్మెయి నమ్మల్లు లొక్కుమ్మడి భుజదండమ్ములతో నాకర్షణనోద నాదులం గావించుచుఁ గనుబొమలు ముల్లుపడ నేత్రంబులు ప్రలయాగ్నినిభంబులుగాఁ గరి కరితోఁ దాఁకు పోఁకను గిరి గిరితోఁ బోరుతీరునను హరి హరితో డీకొను జో కను బదాపదిం బాహాబాహిం గచాకచిన్ ముష్టాముష్టులను బోరాడు నవసరంబున శ్రీహరి నిజకరంబులఁ జాణూరశరీరం బెత్తి యుత్తమ్మిచూలి పున్నమ్ముల ప్రోవుం దూఁచి నట్లు తద్దేహభారంబుఁ దూఁచి త్రోచి వేఁచ నాచపలుండు చూచి యునా యాసంబుగా నొకకరంబునఁ గందుకం బెత్తుపొందికను నాదిశేషుం డీభూఖండంబు దాల్చిన ట్లాచక్రధరు నెత్తియొత్తి యుత్తరంబునఁ బడవేయ నాయచ్యుతుం డాకపటు కటికంధరంబులం బట్టి యెత్తి యట్టిట్టాడించి డించి గిఱ్ఱునం ద్రిప్పి భూతలంబున గిరాటువేయ నాయసురుం డాగ్రహంబున నుగ్రంపత్యుగ్రుడై నిగ్రహించుటయుఁ దత్సభాంగణమండలి గవాక్షంబుననుండి విలోకించుచున్న యచ్చుమిన్న లాయాస సంజనితాంబుసిక్తంబులగు శ్రీరామకృష్ణుల దేహంబులం గాంచి నిట్టూర్పుపుచ్చి. ౧౧౧

మ॥ అరరే! కుఱ్ఱల నీబలాచ్యుతులఁ బు ♦ ష్పాభాంగులన్ గ్రూరులున్
విరసుల్ వజ్రకఠోర దేహు లమర ♦ ద్వేషాఢ్యు లాముష్టికా
సురచాణూరులతో నియుద్ధము దయన్ ♦ సూదంతయున్ లేక భూ
వరుఁడీ కంసుఁడు సేయఁజేసెఁగద ! యీ ♦ పాపంబు సామాన్యమే ? ౧౧౨

క॥ అక్కట ! యిక్కుఱ్ఱల నిటు, స్రుక్కించెడి కంసుఁ ద్రుంచు ♦ శూరవరేణ్యుం
డొక్కం డిక్కడ లేఁడే ?, లెక్కింపక కనెడి వీరు ♦ లేకులు గారే ? ౧౧౩

ఆ॥ సభకుఁ జనుట తప్పు ♦ సనినప్డు సభ్యుల, తప్పు నెఱుఁగకుంట ♦ దప్పు తెలిసి
యూరకుంట దప్పు ♦ దాఱుమాఱుగ నందు, బల్కుచుంట దప్పు ♦ ప్రాజ్ఞనకును.

సీ॥ అంభోజములకైన ♦ నంభోజనేత్రుండు, హస్తంబులం గొని ♦ యాదరించుఁ
బిల్లఁగ్రోవుల కైన ♦ వెన్నుండు గమ్మని, యధరామృతం బిచ్చి ♦ హర్ష మొసఁగు
నెమిలిపురుల కైనఁ ♦ గమలామనోహరుం, డుత్తమాంగంబునం ♦ దూని మెచ్చుఁ
గడప చెట్టులకైనఁ ♦ గరుడధ్వజుం డొప్పి, సరససల్లాపముల్ ♦ సలుపుచుండు
తే॥ స్వర్ణవర చేలముల కైన ♦ సకల భువన, మోహనుం డంసమందునఁ ♦ బూనితీరు
నిటులు సలుపఁగ నేనోము ♦ లేలరావో, యెట్లు జీవింతుమో యమ్మ! ♦ యింక మనము.

మ॥ మన మా గోకులమందు ప్రేతలుగ జ ♦ న్మం బెత్తినన్ సూర్యచం
ద్రనిలింపేశశివేశపావకమునీం ♦ ద్రబ్రహ్మధాత్రీమరు
ద్వినుతుండై తగు వీని సద్గుణములన్ ♦ వేమంబు రూపాదులన్
గనమా! మ్రొక్కమ! కౌఁగిలించుకొనమా! ♦ కామించి క్రీడింపమా!

తే॥ ఈ మహామహుఁ గనుఁగొన ♦ నేమియేమి, నోములను వ్రజవాసులు ♦ నోచినారొ
యితనితోఁగూడి యాడి హ ♦ ర్షించు గోపికల యదృష్టమింత దటంచుఁ ♦ బలుకఁ గలమె?

క॥ గడచిన దానికి దుఃఖము, పడుటొప్పదు నేఁడు మనకు ♦ భాగ్యవశమునన్
విడిముడియొడయని దరిసెన, మడరిన యందులకు మనము ♦ హర్షింపవలెన్.

తే॥ కాని యక్రమయుద్ధంబు ♦ గలిగె నిచట, సింగులకుఁ జింత గలిగెడి ♦ నిందునిట్టి
చిట్టివారె జయంబును ♦ జెంది జగతి, వృద్ధిఁ గనెదరు గాక న ♦ హీనకీర్తి.

వ॥ అని ప్రీతిమీఱఁ బల్కుచుండుటయు నందఱుఁ గుందుటయుఁ గాంచి యా శ్రీవత్సలాంఛనుండు రిపుభయంకరుండై దోర్బలంబున నాకర్బురనాయకుం బట్టి వాతంబు సరోజాతంబును బెట్టికివైచినట్లు వియత్తలంబునఁ బాఱవేయ నాయాయతకాయుండు దివినుండు నక్షత్రం బధోముఖంబుగా రాలులీల నేలంగూలి క్రమ్మఱ నుత్థితుండై తనబలంబుకొలఁదిని నాకృష్ణుం బ్రహరింప నాహరి వెనుకంజవేయక యోర్చి నిజభుజదండంబున నాదుండగీఁ గైకొని నేలం గూల్ప నాయుల్బుండు భిన్నదంతుండయ్యు ననల్పబలాగ్రహావేశసంభ్రమంబులచేఁ బరవశుండై ముష్టిద్వయంబున నాయష్టమూర్తి మిత్రుం బొదివె. పిమ్మట నమ్మాధవుం డుమ్మలింపక యమ్మనుజభక్షకుఁ దక్కంసనమ్ముఖమ్మున నతిరభసమ్మునఁ ద్రిప్పిత్రిప్పి యందఱు పరికించుచుండ నీక్షోణిం బడవైవ నాకంసభటుండు రుధిరంబు ముక్కుమొగంబులనుండి మెండుగా వెడలం గ్రక్కి విగతప్రాణుండయ్యె. వెండియు. ౨౨౦

మ॥ బలరాముండును ముష్టికాసురుఁడు శుం ♦ భద్బాహు దర్పంబులన్
బ్రబలయాగ్నులవ్వాలెఁ బోరి రంత హాలి త ♦ ద్రాత్రించరుం బట్టి బల్
నలగం గొట్టి పదద్వయంబుఁ గొని త ♦ న్నాగారి పైనుండి పా
ములఁ గ్రిందన్ బడవైచినట్లు వడితో ♦ భూమిన్ బడన్వైవఁగాన్. ౨౨౧

తే॥ ముష్టికుండును నెత్తురు♦ముఖమునుండి, క్రక్కి స్రుక్కి కట్టకడకుఁ♦గాలమయ్యె
నద్దిగని యెదిరించు కూ♦టాఖ్యముష్టిఁ,గొట్టె హలి; హరి గిరిఁబవిఁ♦గొట్టినట్లు.
తే॥ అవల డీకొను శలదైత్యు♦నబ్జనాభుఁ, డాగ్రహించి విలోకించి♦నిగ్రహించి
యొక్కలత్తతో ఖండించెఁ♦బక్కితేఁడు, తుండమున సర్పముం బట్టి♦చెండినట్లు.
తే॥ మఱియు శ్రీహరి తోశల♦మనుజభక్షకు నవలీలఁగఁ జీల్చి కం♦సుని సమీప
మందుఁ బడవైచెఁ గ్రొవ్విన♦హస్తివరము,తరువు ఖండించి వైచిన♦కరణి జనక!
ఉత్సాహ॥ మల్లరంగమందు నిట్లు ♦ మల్లవరుల నందఱన్
వల్లవులును బిల్లలు నగు ♦ పద్మనాభసీరులే
డొల్లఁజేయ వార లప్పు♦డు మడసి రది గాంచి త
న్మల్లసఖులు లాతివారు ♦ మనఁగఁ బాఱి రరమునన్. ౧౨౭
తే॥ అవలఁ బ్రేక్షకులెల్ల రా ♦ హా! యనంగ
హరిసి మృతమల్లవిద్యుతుల్ ♦ వరుసఁ గలిసె
నంత శ్రీదామముఖసుహృ ♦ దాళితోడఁ
గూడి యనిఁజేయఁ గడగి రా ♦ కుంద బలులు. ౧౨౮
మ॥ తరువాతన్ బురవాసులెల్లరు క ♦ న్నద్రత్నాంచితాలంకృతుల్
వరపింఛంబును బట్టుపుట్టముల శుం ♦ భద్వంశి నేత్రంబులన్
సరవిం దాల్చి మృగేంద్రసామ్యులయి స్వ ♦ చ్ఛందంబుగాఁ దిర్గు నా
హరితాలాంకులఁ జూచి దుందుభులు మ్రో ♦ యన్ సంతసం బొందుచున్.
తే॥ కుబ్జలయ్యు వీ రెంతెంత♦గొప్పపనుల, సులువుగాఁ జేసిరనుచుఁ గం♦సుండు దప్ప
మేలు మేలని పొగడిరో♦మేదినీశ!, యీర్ష్య పరబలమొప్పునే? ♦ యెచటనైన.
శా॥ అంతన్ గంసుఁడు స్వీయమా నపజయం ♦ బాలించి క్రోధభ్రమా
క్రాంతుండై రొదఁజేయు తూర్యముల వే♦గన్ నిల్పి యోష్ఠంబుల
త్యంతం బల్లలనాడ భృత్యులకు నే♦తద్రీతి శాసించె నా
చెంతన్ నిల్చి వచించినట్లు పనులన్ ♦ సిద్ధింపఁగాఁ జేయుఁడీ! ౧౨౯
చ॥ మఱి వసుదేవ రూపమును ♦ మాపుఁడి! తండిరిగాక శత్రువై
కరముగ నాకు బాధలను ♦ గల్పనఁ జేసెడి నుగ్రసేనునిన్
నఱకుఁడి! నిర్జరాంశల ఘ ♦ నంబుగఁ బుట్టిన యాదవావళిన్
ద్వరగ వధింపుఁడీ! కరుణఁ ♦ దాల్పకుఁడీ! యని పల్కులోపలన్. ౧౩౦

## శ్రీకృష్ణుండు కంసుని వధించుట.

శా॥ అంభోజేక్షణుఁ డాఁకటన్ దిరుగు పం ♦ చాస్యంబు దానోల్లస
త్కుంభీంద్రంబును జూచి దూఁకునటు శా ♦ ర్దూలంబు మాహేయి సం

రంభనూ ర్ధ్వ రిని బట్టఁబోవు కరణిఁ ♦ రత్నోజ్జ్వలతల్పతిపై
దంభంబొప్పఁ జెలంగు కంసవిభుపైఁ ♦ దా దూఁకె రుద్రాభుఁడై. ౨౩౧

ఉ॥ పిమ్మట భోజభూవిభుఁడు ♦ భీతిలి మిత్తియె వచ్చె నం చెదన్
నమ్మి తెగించి మంచె విడి ♦ నవ్యకృపాణముఁ గేలఁ దాల్చి గ
ర్వమ్మున నెలంగ మాధవుని ♦ పై నరుగన్ గని శౌరి వాని దై
ర్ఘ్యమ్ముగఁ బట్టెఁ దార్క్ష్యుఁడు మ ♦ హాఫణి నుక్కునఁ బట్టినట్టులన్. ౨౩౨

తే॥ కంసుఁ డంతటఁ బుండరీ♦కమును పాము, విహగపతి నోటనుండి త♦ప్పించుకొనిన
రహిని న్యాలో కృష్ణుక♦రములనుండి, తప్పుకొని చక్రధరుపై నిఁ♦దారసిల్లె.

శా॥ కంసుం డిట్ల మధుహింసకుండు నిటులన్ ♦ గ్రావంబుపై సింహముల్
హింసాపాత్రముగాఁగఁ బోరినటులన్ ♦ లక్షించి యన్యోన్యమున్
హింసల్ బొందుచు మంచెఁ బోరి రల భో ♦ జేశానుఁ డజ్ఞాతునిన్
హింసింపన్ శతహస్తుఁడై దివికి వే ♦ యేగంగ శ్రీకృష్ణుఁడున్. ౨౩౪

తే॥ డేగ డేగను వెంటనం♦టిన విధమున, వాని వెంబడిఁ బోఁచు చు♦బాహువులను
ముజ్జగంబులఁగలబల్మి♦మొనసిపట్టి,త్రిప్పి పైనుండి మంచెమీఁ♦దికిని ద్రోసె.

తే॥ తరుపరంబు తటిత్ప్రపా ♦ తంబువలన, భగ్నమైనట్లు కంసప్ర ♦ పాతమునను,
మంచ దండెము విఱుగుటఁ♦గాంచి యట్టి,వజ్రసముకాయుఁడగు భోజ♦పార్థివుండు.

ఉ॥ త్రుంచుకొ వ్యాకులాత్ముఁ డయి ♦ యే త్తెఱ నుత్థితుఁ డౌచు బిట్టు కో
పించి కృపాణపాణి యయి ♦ వెన్నుఁ డనాది మహానుభావుఁ డం
చెంచక పోరుచుంటఁ గని ♦ కృష్ణుఁడు వానిని దిర్గి మంచెపై
నుంచి యుదంబు నెక్కి శిర ♦ ముద్ధతిఁ బట్టి కరద్వయంబునన్. ౨౩౭

చ॥ సిగ బిగియాఁగఁ బట్టుకొని ♦ చెచ్చెర మంచమునుండి క్రిందికిన్
పగవఁగ నెట్టె గండశిలఁ ♦ బర్వతశృంగమునుండి నేలకున్
మిగుల బిఱానఁ ద్రోసినటు ♦ మేదినినాథ! యనంతవిక్రముం
డగు హరి వానిపైఁబడె న్వ ♦ యంబుగఁ దన్మృతిశోధనార్థమై. ౨౩౮

తే॥ హిర లిద్దఱు నీహిహ ♦ విపులపైనఁ, గూలియుండుట నిద్దర ♦ గ్రుంగి స్థాలి
భాతి నొక్క ముహూర్తంబు♦పట్టలేని, ఫక్కఁ దుకతుకలాడె నో♦వసుమతీశ!

శా॥ సింహం బేనుఁగు పీనుఁగున్ ధరణిపైఁ ♦ జిత్రంబుగా నీడ్చిన
ట్లింహారోనాశకుఁడున్ బలాత్పరుఁడు నా ♦ నజ్ఞాతుఁ డా కంసునిన్
సంహారం బొనరించి చిత్రగతి నా ♦ సంస్ఫోటరంగంబునన్
రంహానూర్ధ్వ రిని నీడ్చెఁ బర్విలిడఁగన్ ♦ రాజుల్ మహాభీతితోన్. ౨౪౦

తే॥ పిదప వైరభావంబుతో ♦ విగతజీవుఁడైన కంసుండు వెన్నుని ♦ వభినుతించి
యోగిగా నలవాని సా♦రూప్యమొందె, భ్రమరకీటకన్యాయంబు♦వలెను జనక!

## శ్రీకృష్ణ బలరాములచేఁ గంసానుజాష్టకంబు హతంబగుట.

వ॥ ఆ తరువాత నాతని కనిష్ఠభ్రాతలగు సునాముఁడు, సుహ్రువు, సృష్టియుఁ దుష్టిమంతుండును, రాష్ట్రపాలకుండును, గంకుండును, శంకుండును, న్యగ్రోధుండును నవ్విధంబునఁ జివ్వను నవ్వనరుహనాభునిచేఁ గూలియున్న తమ యన్నం గని కన్నులందు విస్ఫులింగంబు లభంగురంబుగాఁ గురియంగఁ గోపించి రూపించి తెగించి విక్రమించి మించి యఘోరంబుగా రవళించి నిశాతహేతిభల్లవ్రాతంబు ధరించి సంగరరంగంబుఁ బ్రవేశించి నరహరిశిరఃకర్తనం బొనరింప నరుగుదెంచుట దూరంబునుండి రౌహిణేయుం డారసి మృగంబులం గని జంకుగొంకులు లేక గర్జించు సింగంబుభంగి నహంకారంబున హుంకరింప నాపరిపంథు లదరిపడి గడగడవడఁకి గగ్గోలుపడి దండఘాతంబులచేఁ జూతంబులనుండి ఫలంబులు జలజలరాలులీల నిజపాణులనుండి కృపాణబాణములు వడ నడలునఁ బుడమినిఁ గూలఁబడి వడి లేచి విడివడి వడముడి గురుఁడగు నత్తాటిపడగవాని మేనుం బిడికిళ్ళతోఁ గరీంద్రంబులు శుండాదండంబులతో గిరివరంబు గ్రుమ్మినట్లు బొడువ నమ్మధుసూదనాగ్రజుండు కనలి ముద్గరంబుతో సృష్టిసునాములం గొట్టి దక్షిణభుజంబున న్యగ్రోధుం బరిమార్చి వామహస్తంబునం గంకునిం డింకవేయించె. మఱియు నారమారమణుండు వామపాదంబున శంకుని, సుహ్రునిఁ, దుష్టిమంతుని, నష్టంబు సల్పి దక్షిణపాదంబున రాష్ట్రపాలకుని రూపుమాపె. ఇట్లు కంసానుజాష్టకంబు వాతసంఘాతఘాతంబుచేత ధరాజాతజాతంబు పాతంబుఁ జెంది హతంబైనరీతిఁ బీతాంబర నీలాంబరులచే హతంబై కరుణాభరణుండగు నా పరమునియందు లీనంబైన సమయంబున, ౨౮౨

సీ॥ బృందారకేంద్రులు ♦ విరుల వర్షించిరి, కాంచిరి ముదము సం ♦ గాతకాంక్షు
రంభాముఖాప్సరో♦రమణులు నాడిరి, పాడిరి గంధర్వ ♦ భామినులును
జయజయధ్వానముల్ ♦ సర్వదిక్కుల నొప్పెఁ, దప్పెను శిష్టసం ♦ తాపమెల్ల
నందాదిఘోషు లా ♦ నందంబుఁ జెందిరి, పొందిరి భీతినిఁ ♦ బూర్వసురలు

తే॥ విశ్వసృణ్ముఖసురతతి ♦ వినుతిఁ జేసె
మ్రోసె దుందుభికాహళ ♦ ముఖరతూర్య
ములును మునులును దీవెనల్ ♦ సలిపి రరరె!
హరియు హలియు శోభిల్లి రా ♦ యవసరమున. ౨౮౩

## కంసుని భార్యలు విలపించుట.

క॥ అస్తిప్రాప్తు లను సతులు, నిస్తుల బలుఁడైన మగని ♦ నిధనము విని వే
హస్తములఁ హృచ్ఛిరములఁ, గస్తిని బ్రహరించుకొనుచుఁ ♦ గన్నీరొల్కన్.

తే॥ భండనాంగణమందు వే♦దండశవము, వలెను బడి యున్న కంసుని♦ప్రక్కఁ జొచ్చి
సేదు మాత్రాళ్ళదెగ నంచుఁ♦బోఁడిమి విడి, కాకిగోలగ నిట్లువ్వఁ♦గాఁ దొడఁగిరి.

తే॥ హా మనోనాథ! హా దేవ! ♦ హా మహాత్మ! హా సురాసురాధికబల! ♦ హా నరేంద్ర!
హా మహావీర! హా యాద ♦ వాధినాథ! హా జరాసంధనుతతేజ! ♦ రాజరాజ!

శా॥ అయ్యో! యక్కట! చెల్లబో! కటకటా! ♦ హా నాథ! యీరీతి మా
కుయ్యాలింపక యేఁగుచుంటి వెటకో ♦ కోర్కెన్ మముం గాంచుమా!
కయ్యం బాడి త్రిలోకసంపదను సా ♦ కల్యంబుగాఁ గొన్న నీ
వియ్యాజిన్ బడియుంటి వట్టి బల మి ♦ ట్లేమయ్యె భోజేశ్వరా! ౨౮౭

తే॥ అరయఁగా నరులను గాని ♦ యమరులందుఁ, గాని కర్బురులనుగాని ♦ కలనులోనఁ
గసిని నిన్ను డీకొను వారు ♦ గలరె చెపుమ? యట్టి నీ కెటు మృతియేల ♦ హా త్రైనేత్రా?

ఉ॥ ఆరయ నీవు నీభగిని ♦ యందు జనించిన పుత్రకాళి ని
ష్కారణరీతిఁ జంపితివి ♦ శత్రువులైనను గాకపోయినన్
బౌరుషమే ప్రధానమని ♦ భావమునందుఁ దలంచి దిట్టవై
మారణ మాచరించితివ ♦ మాయికులన్ యదువంశజాతులన్. ౨౮౯

క॥ తత్కారణముననే నీ, వుత్కట బలివయ్యు మృతిని ♦ నొందితి వంచే
ముత్కర్షముగఁ దలఁతు మ, త్యుత్కటపుణ్యాఘసంఘ ♦ మూఱక చనునే?

తే॥ కాన వగచిన ఫల మేమి ♦ గలదు మాకు, నుదుటివ్రాతలు కొంచెమేన్ ♦ జెదరఁగలవె?
మేమనాథలమై యిట్లు ♦ మెలఁగ వలసె, నెవఁడు తప్పింప గలఁడయ్య! ♦ యిద్ధచరిత!

తే॥ మఱియుఁ గృష్ణుఁడు మృతుఁడైన ♦ మాతులునకు, నంతికంబున దైవాఱ ♦ యాగమవిధిఁ
బారలౌకికక్రియలను ♦ బూరితిగను, నాచరింపఁగఁ జేసియు ♦ నతిశయించి.

ఉ॥ ప్రేతుకపాళిఁ గూర్చి గ ♦ భీర గళంబున నిట్లుపల్కె నీ
రాక్షసనాయకుండు మధు ♦ రాపురనాథుఁడు నైన కంసుఁడా
పక్షులపోల్కె నొంటరిగ ♦ వర్తిలు పేదలసాధులన్ గసిన్
శిక్ష యొనర్చె నందున న ♦ శించెను నిక్కము మీ రెఱుంగుఁడీ! ౨౯౩

తే॥ కాన మీరింకఁ దెలివితోఁ ♦ గ్రాలవలయు, నంచు వచియించి తత్కంసు ♦ నంగనలను
నూఱడించి కళిందజా ♦ తీరమందుఁ, జందనాంచితచితులను ♦ జక్కఁ గూర్చి.

ఆ॥ పతికి మఱియు మృతికిఁ ♦ బాల్యవృద్ధవారికి, దహనముఖకృతులను ♦ దద్దఁజేయఁ
జేసి బలునిఁగూడి ♦ వాసుదేవుఁడు వసు, దేవు దేవకీస ♦ తినిఁ గనంగ. ౨౯౫

✤ { రామకృష్ణులు దేవకీవసుదేవుల చెఱమాన్చి యుగ్రసేనునిఁ బట్టాభిషిక్తుం జేయుట. } ✤

చ॥ యదుకులజాతులం గలిసి ♦ యా బలిదంద్రులు గల్గు బంధనం
బుదరికి నేగఁగా ఖగవి ♦ భుం డరుదేరఁగ నాగపాశముల్
వదలినమాడ్కి గుత్తముగఁ ♦ బాణులఁ గట్టిన వారి సంకెలల్
వదలఁగఁ జేయు వీరు భగ ♦ వంతు లటంచు నెఱుఁగు లోపలన్. ౨౯౬

తే॥ చక్రి సంభవస్థితిలయ ♦ సాధనమును, మోహకారియును నగుమాయఁ ♦ బుక్కలముగ
నలముకొనఁజేయ వారలు ♦ దెలివిఁ దప్పి, రామకృష్ణులు సుతులని ♦ ప్రేమతోడ

ఉ॥ కష్టము లిట్లు చెందితిమి ♦ గాదె యటంచు వచించునట్టు లా
విష్టపనాథులన్ దరికిఁ ♦ బిల్చి కవుంగిళులం బొనర్చ నా
దుష్టనిశాటహంతకులు ♦ తోడనె మ్రొక్కి క్షమాపణంబు సు
స్పష్టముగా వచించి తమిఁ ♦ బల్కిరి తల్లికిఁ దండ్రి కిట్టులన్. ౨౫౮

శా॥ తల్లిం దండ్రిఁ బితామహున్ గురుని దా ♦ తన్ జ్యేష్ఠు నభ్యాగతున్
గల్లల్ బల్కనివాని భక్తు నతిథిన్ ♦ గాంతన్ సఖున్ భూసురున్
సల్లాపాదుల సంతసంబు గలుగన్ ♦ సాగించు నాతండు హె
చ్చిల్లున్ యోగ్యులలోన నింకఁ బరుఁడో ♦ జీవన్మృతుండే కదా ? ౨౫౯

క॥ తల్లికి దండ్రికి నరుసముఁ, గొల్లలుగాఁ గూర్చువాఁడె ♦ కొడుకగుఁగాదే ?
తల్లిని దండ్రినిఁ బెల్లుగ, నల్లరి నొనరించు తులువ ♦ యాత్మజుఁ డగునే? ౨౬౦

శా॥ అమ్మా! నాయన! మాకుఁగా నిటులఁ గా ♦ రాగార మందుండి క
ష్టమ్ముల్ పెక్కిటిఁ బొంది కుందితిరి మీ ♦ రసామాన్యమే యాస్థితిన్
వమ్ముల్ సల్ప సమర్థతల్ గలిగియున్ ♦ బాపంగ రానట్టి యీ
మమ్ముల్ గుజ్జులటంచు నెంచి దయతో ♦ మన్నించి రక్షింపుఁడీ! ౨౬౧

క॥ ధర్మార్థకామముక్తులు, మర్మము విడి యిడెదు నట్టి ♦ మైనొసఁగిన మి
మ్మర్మిలిఁ జూడని యీమముఁ, గూర్మిని సైరింది సతులఁ ♦ గొనుఁడీ! కనుఁడీ!

చ॥ మలినము జెందనీదు గుణ ♦ మండలి వీడదు స్నేహముల్ విడన్
దలఁపదు దివ్యపాత్రమును ♦ దాపము జెందఁగనీదు ద్రవ్యమున్
దొలఁగెడివేళ సంచలతఁ ♦ దూకొన దార! సుపుత్రదీప మే
కులగృహమందునేన్ వెలుఁగ ♦ గొప్ప ప్రదీపము గల్గనేర్చునే ? ౨౬౩

తే॥ దేవకీవసుదేవులు ♦ తేనెలొలుకు, వారి పలుకుల కానంద ♦ పరవశులయి
రామకృష్ణాఖ్య సుతులఁగ ♦ రముఁ గొంచు, ముద్దులాడుచు నుండిరో ♦ పుణ్యపురుష!

ఉ॥ శ్రీమహిళాధవుం డవల ♦ స్నేహితసంవృతుఁడౌచు స్వీయ మా
తామహు నుగ్రసేనవిభుఁ ♦ దత్‌క్షణమందునఁ బిల్చి తాత! నీ
వీమెయి రాజ్యపీఠమున ♦ నెక్కుము ధర్మయుతంబుగా ధరన్
బ్రేమ దలిర్ప నేలు మెట ♦ వేదవిరుద్ధకుబోధ లేనటుల్. ౨౬౫

మ॥ అని వాక్రుచ్చి వియచ్చరుల్ వొగడఁగా ♦ నాత్మీయు లామోదముం
గనఁగా నున్నత రాజ్యపీఠమున నె ♦ క్కన్ జేసి యామీఁదఁ గం
సుని భీతిన్ బరదేశమేగిన యదు ♦ స్తోమంబు రావించి చ
క్కని ప్రీతిన్ మధురాపురాన వసతిన్ ♦ గావింపఁగా సల్పి తాన్. ౨౬౬

ఉ॥ నందుఁడు గోకులంబును జ ♦ నం గమకించుటఁ గాంచి వేగఁ గా
ళిందివిభేదియుక్తుఁడయి ♦ లెస్సఁగ జోతలసల్పి నాయనా!
యిందున నున్న యెల్లరకు ♦ నెల్లసుకంబులఁ గూర్చి యంత మే
మందముగా సగోపకుల ♦ మై చనుదెంతుము మీదు మన్కికిన్. ౨౬౯

తే॥ తల్లి యెవ్వతెయో మఱిఁ ♦ దండ్రి యెవఁడొ, కాని నిన్ను యశోదను ♦ గన్నతండ్రి
తల్లుల విధానఁ గనుచు మీ ♦ దయను నిట్టు,లింత వారల మైతిమే ♦ మిది మరతుమె?

క॥ కాంచిన తలి దండ్రులకున్, బెంచిన తలి దండ్రులకును ♦ భేదం బెది గా
న్పించదు కావున వారిని, వంచించెది వార లరయ ♦ బాపులు గారే?

చ॥ అని వినయంబుగాఁ బలికి ♦ యర్హవిధంబున సత్కరించి ప్రీ
తిని బహుపంగ నందుఁడు ను ♦ దీర్ణతరప్రణయావశాత్ముఁడై
వనరుహనాభు ముద్దిడి యు ♦ వారణ పద్ధతిఁ గౌఁగిలించి తాఁ
జనియె సగోపకుండయి వ్ర ♦ జంబున కో బహులాశ్వభూవరా! ౨౭౦

క॥ ఆ వసుదేవుం డావల, శ్రీవిభు జన్మ గ్రహముఁగు ♦ క్షితిదేవులకున్
గోవులఁ బదివే లిడె రా,ధావిభు డావిర్భవించు ♦ తఱి ననినట్టుల్. ౨౭౧

క॥ దుర్గతి వినాశక శ్రుతి, వర్గార్థకృతార్థు యాద ♦ వకులాచార్యున్
గర్గుని బ్రహ్మణ్యుఁగవి స,నర్గళ మర్యాదఁ బిలిచి ♦ యర్చించి యొగిన్. ౨౭౨

తే॥ గురువరా! రామకృష్ణుల ♦ కు నుభయులకు
వడుగు జేయంగ మిమ్ములఁ ♦ బ్రార్థనంబుఁ
జేయుచుంటిని నావుడు ♦ క్షితిసురుండు
నొప్పి శుభముహూర్తమున వే ♦ దోక్తరీతి. ౨౭౩

తే॥ తొలుత సల్పంగఁదగినఁ కృ ♦ తుల నొనర్చి, సకలపురుషార్థ కరకార్య ♦ సాధనమగు
పూత యజ్ఞోపవీతంబుఁ ♦ బ్రీతితొడ, వేసి వడుగు ముగించెడి ♦ వేళయందు.

శా॥ కుక్షిన్ లోకములన్ ఘటించి విబుధుల్ ♦ గోరన్ సమస్తేష్టముల్
దక్షత్వంబున నిచ్చు రామహరి లే ♦ తన్నద్గురూక్తిన్ "భవాన్
భిక్షాం దేహి" యటంచుఁ గొంగుఁగొని యా ♦ భీరాది సామాన్యులన్
భిక్షం బెత్తిరిగాదె తద్వినయమున్ ♦ జెప్పంగ సామాన్యమే? ౨౭౪

ఉ॥ ఆపయి రామకేశవుల ♦ నానకసాందిపి విద్యనేర్ప సాం
దీపనిపజ్జకుం బనుప ♦ ధీరత వారలు నేగి తత్సుసే
వాపరులై విధేయతఁ బ్ర ♦ వర్తిలుచున్ సహపాఠియుక్తులై
యోపికతోడ విద్దెల నొ ♦ హో! యన నేర్వఁ గడంగి రెంతయున్. ౨౭౫

క॥ అఱువదినాలుగు విద్దెల, నఱువదినాలైన కళల ♦ యందలి సారం
బఱువది నాల్గు దినములన, యఱగొఱ లెవి లేని యట్టు ♦ లందిరి జనకా! ౨౭౬

చ॥ హరిహలు లిట్లు విద్దియల ♦ నన్నిటి నేరిచి భక్తితోడఁ ద
ద్గురువరు చెంతకేగి యిల ♦ కుర్ దలలంట నమస్కరించి యో
గురుసమ ! మీరు దక్షిణను ♦ గోరుఁడు మే మిపుడిత్తు మద్ది దు
ష్కరమగుఁ గాక సౌఖ్యకర ♦ సాధనమే యగుఁగాక కోవిదా ! ౨౬౮

క॥ అనవుడు సాందీపనియున్, మనమునఁ దా నిట్లు తలఁచె ♦ మనుజులె వీరల్ ?
ఘనవిద్యల నన్నింటిని, గనుమూ సెడిలోనఁ జదువఁ ♦ గలిగిరి దానన్. ౨౬౯

శా॥ మాయామానుషజన్మముల్ ధర సుధీ ♦ మచ్ఛ్రేణినిం బ్రోవఁగా
మాయావిగ్రహతతిన్ హరింపఁగను ని ♦ మ్మాడ్కిన్ దయన్ గొన్న యా
మాయాతీతుఁడు సర్వలోకవిభుఁడున్ ♦ మౌనీంద్రహృద్వాసియున్
ధ్యేయుం డాద్యుఁడు నై చెలంగు పరముం ♦ డే యంచు సోత్సాహుఁడై. ౨౭౦

చ॥ మృతుఁడగు నాదు పుత్రకు ని ♦ మేషములం గొనిరం డటంచు నా
చతురులఁ గోర వారలును ♦ సంతసమంది సువర్ణకుంభచా
రుతరరథంబు నెక్కియు మ ♦ రుద్గతితోడఁ బ్రభాసతీర్థసం
యుతజలధిప్రదేశమున ♦ కుద్ధతిగాఁ జని కాలరుద్రులై. ౨౭౧

ఉ॥ బాణము నెక్కుపెట్టుచు న ♦ పాంపతిపై నిడులోన నాతఁడున్
నానెములైన ముత్తెముల ♦ నవ్యమణుల్గొని తెచ్చి యట్టి గీ
ర్వాణతతిప్రమోదకర ♦ రామరమేశుల కిచ్చి మ్రొక్కి నా
ప్రాణములేల తీసెదరు? ♦ బద్ధుఁడ మీనుడికో కృపాళువుల్. ౨౭౨

క॥ అనవుడు కృష్ణుం డిట్లనె, వనధీ ! యటులైన నీవు ♦ పటువీచికలన్
గొని యున్న మద్గురూత్తము, తనయునిఁ గొని తెచ్చి నాకుఁ ♦ దప్పక యిమ్మా!

ఉ॥ అవల సాగరుండును భ ♦ యాతురుఁడై హరికిట్లు పల్కె దీ
నావనబద్ధకంకణఘు ♦ నా ! ఘనవర్ణ మనోభిరామ ! రా
మావరజా ! భవద్గురుని ♦ యాత్మజు నేఁ గొనలేదు శంఖరూ
పావృతదానవుం డొకఁ డ ♦ హంకృతితో హరియించె శ్రీహరీ ! ౨౭౪

ఉ॥ ఆతఁడో యెప్డు నాయుదర ♦ మందు బలుండయి యెల్లవేల్పులు
న్నీతిని జెంద నుండు నిఁక ♦ నీవె బలంబున నట్టి దానవున్
ఘాత మొనర్పఁగాఁ దగును ♦ గావునఁ దత్కృతిసల్పి వే జగ
జ్జేతవు గమ్మనంగ హరి ♦ శీర్షము నూఁచి సరే యటంచుఁ దాన్. ౨౭౫

తే॥ కనకచేలంబులన్ గటిఁ ♦ గట్టిగాను, గట్టి ముజ్జగంబులు వణఁ ♦ కంగ నబ్ధి
వజ్రకూటాద్రిపాతంబు♦వలనఁ గలుగు, భయము జెందఁగ నుదధిలో♦వడిగఁబడియె.

ఉ॥ తద్గిరిపాతఘాతమున ♦ దానవుఁ డంబుధినుండి వెంటనే
క్రుద్ధత లేచి యుద్ధమును ♦ గోరి రమేశుని పైని శూలమున్

శ్రద్ధగ వైవ శౌరియుఁ గ ♦ రంబున నయ్యది పట్టి దానితో
నుద్ధతి వానినిఁ బొడిచె ♦ నుర్విని సొమ్మసిలంగ భూవరా! ౨౮౭

ఉ॥ అంతటఁ బూర్వదేవుఁ డిసు ♦ మంతగఁ జింతను బొంది లేచి యా
యంతకసన్నిభుం డగుచు ♦ నచ్యుతునిన్ దన నెత్తితోడ న
త్యంతము గ్రుమ్మె సర్పవర ♦ మాత్మ ఫణంబునఁ గిన్కతో గరు
త్మంతునిఁ గొట్టినట్టులుగ ♦ మైథిలనాథ! యనంతరంబునన్. ౨౮౮

తే॥ కైటభారాతియును లయ ♦ కాలరుద్రుఁ, డగుచు నాతని తలపైన ♦ నాత్మముష్టి
తోడఁ బొడిచెను దద్ధతి♦తోడ వాఁడు, కాలమయ్యెను దజ్జ్యోతి♦కలిసె హరిని.

ఆ॥ లీల హరియు మృతక ♦ లేబరమందున, నెమకి గురుని పుత్రు ♦ నేత్రములను
గనక యందు వెలుఁగు ♦ శంబువుఁ గైకొని, యబ్ధినుండి వచ్చి ♦ యరదమెక్కె.

చ॥ యమపురిలోన నాగురుని ♦ యాత్మజుఁ డుండునటంచు నెంచి పా
ర్థ్వమునఁ బ్రలంబవైరి తగ ♦ వాయుజవంబున దీర్ఘమైన సం
యమిని పురంబుఁ జేరి ప్రబల ♦ యాభ్రరవంబునఁ బాంచజన్య శం
ఖము లలి నూఁదఁగాఁ దొడఁగెఁ ♦ గాలుని పాలిటి కాలుఁడో యనన్. ౨౯౧

ఉ॥ భద్రవ మాలకించి విభు ♦ ధప్రకరం బడలెన్ గృతాంతుఁడున్
నిద్రను గన్నవానివలె ♦ నేలపయిన్ గడఁబట్టె గొప్పవౌ
నద్రులు మాఱుమ్రోఁగె నిఖ ♦ లాబ్ధులు క్షోభను బొందె దిక్కులన్
భద్రగజంబులున్ బెదరెఁ ♦ బాడుచు నాడితి నేను నింగిపై. ౨౯౨

చ॥ ఎనుబదినాల్గు లక్షలకు ♦ హెచ్చిన యా నరకంబు లందునన్
దనరిన పాపులం దెవరు ♦ తద్ధ్వనిఁ జెందిరో వారు ముక్తినిం
గని రటుపైన నాజముఁడు ♦ కానుకలం గొని తెచ్చి యిచ్చి యా
వనరుహనాభు పాదముల ♦ పైఁబడి గద్గదవాణి నిట్లనెన్. ౨౯౩

ఉత్సాహ॥ రామ! రామ! కృష్ణ! కృష్ణ! ♦ రాధికామనోహరా!
యేమి యేమి యిద్ది యేల? ♦ యిట్లు సల్పుచుంటిరో
ప్రేమతోడఁ దెల్పుఁడిపుడు ♦ వేగ దానిఁ జేసెదన్
మీమహత్త్వఁ దెలిసికొనెడి ♦ మేటిగాను ధీనిధీ! ౨౯౪

మ॥ కమలాక్షుండు మదుక్తులన్ వినియుఁ బ♦ల్కెన్ సాగె నీరీతి నో
సమవర్తీ! యటులేని మద్గురు సుతున్ ♦ శంకల్ విడంగా నిమే
షమునన్ దోడ్కొని వచ్చి నాకొసఁగి ప్రా ♦ జ్యంబైన యీ రాజ్యమున్
క్రమమౌ పద్ధతి నేలుకొమ్మనఁగ నా ♦ కాలుండు నాలించి వే. ౨౯౫

తే॥ గురు కుమారునిఁ గొని తెచ్చి ♦ సరసఁ బెట్టె
వార లప్పాలునిం గొని ♦ వడి నవంతి

కాపురిం గల యొజ్జకా ♦ పాప నిడిరి
గురుఁడు దమ్ము దీవింపంగఁ ♦ గోర్కిఁ గొలఁది. ౨౯౬

వ॥ అంత నాహరిహలు లాత్మగురువరేణ్యున కానందభయభక్తులతో నమస్కరించి వీడ్కొని క్రచ్చఱ సకలాలంకారాలంకృతంబగు శతాంగం బెక్కి మనోజవంబున మధురాపురికిం జనుదెంచి యదుకులప్రేమాస్పదులై ప్రవర్తిల్లు చుండిరి. ఇట్లుండ నొక్కనాఁ డగ్రజసహితుండై కృష్ణుండు బాంధవ్య, భక్తి, బలంబులచేఁ దన మనంబును సంగ్రహించుకొనియున్న యా పాండవులను సంస్మరించుచు నిజభక్తుండగు నక్రూరుని సదనంబున కేగ నతఁడు ప్రత్యుత్థానం బొనర్చి షోడశోపచారంబులం బూజించి సాష్టాంగప్రణామంబు లాచరించి యానంద బాష్పోత్ఫుల్లనయనవనరుహుండై దయాళువులారా! మీరా రా నాఁ డా మార్గంబున వాగ్దానం బొనర్చినకరణిని, నాగృహంబున కేతెంచితిరి. నే ధన్యుండనైతి. నాకులంబు పవిత్రం బయ్యె. గోవిప్రసాధు శ్రుతిధర్మదేవసంరక్షణార్థంబును, గంసాదిదుష్టశిక్షణార్థంబును, సకలబ్రహ్మాండనాయకులును, బురాణపురుషులును, నాదిమధ్యాంతరహితులును, నప్రమేయులును, నక్షరులును, వేదాంతవేద్యులును, బరిపూర్ణతములును, బరాత్పరులును, నగు మీరీ లీలఁ జరించుచుంటిరి గదా. మిమ్ముఁ గొండాడ నేనెంతవాఁడ. నా నెఱసుల మన్నించి రక్షింప వేఁడుచుంటినని మ్రొక్కి నక్కమలాక్షుం డక్కటికంబుతో సంభాషించి మఱియు నిట్లనియె. ౨౯౭

ఉ॥ పాండవ వర్తమానములు ♦ బాగుగ నున్నవొ లేవొ చుట్టమె
క్కండును రాఁడు సెప్పఁడు మృ ♦ గంబులకుఁ నెలవైన కాన ము
న్నుండి సమస్తకష్టముల ♦ నొందిరి నొచ్చిరి హెచ్చుగాను నే
నుండియుగూడ లాభమెది ♦ యుఁ గనుపింపదు వారి కియ్యెడన్. ౨౯౮

ఉ॥ వారిని నేను జూచి బహు ♦ వర్షములయ్యె నిఁకేమొనర్తు? నే
వారని వారు నేననియు ♦ వర్తిలుచుండిన మాకు సాంప్రతం
బీరహి దూరమయ్యెఁగద ♦ హెచ్చెడి దుఃఖము చిత్తమందు న
క్రూరుఁడ! వారి నారసి మ ♦ రుద్గతితో మఱి యేగుదెంచుమా! ౨౯౯

చ॥ అని వచియించి యా యనఘు ♦ నంపి బలాన్వితుఁడై స్వకీయమా
మనికికి నేగె నా పిదప ♦ మాధవు నానతి గాందినీసతీ
తనయుఁడు హాస్తినాపురికిఁ ♦ దాల్మిని బోయి పృథాకుమారులన్
గని హరి పల్కులన్ వినిచి ♦ కాంచి తదీయసుఖంబుఁ బ్రీతితోన్. ౩౦౦

తే॥ మఱలఁ బాండవుల్ చెప్పిన ♦ మాటల విని
త్వరగ నటనుండి వీడ్కొని ♦ వాయుగతిని

నట్టి మధురకుఁ జనుదెంచి ♦ హరినిఁ గాంచి
పాండవోదంతముల్ దెల్పి ♦ పలికె నిట్లు. ౩౦౧

మ॥ కమలాక్షా! "కురురాజపుత్రకులచేఁ ♦ గష్టంబులం బొందు నీ
మముఁ బోషింపఁగ భావికాలమున నా ♦ మానాయకుం జెప్పి కా
లము జేసెం గద మాదు తండ్రియని యా ♦ లాపించి యా పాండవుల్
మిము ధ్యానింతురు మిమ్ము నమ్మి యెదలో ♦ మేటిల్లుచుండ్రెప్పుడున్ . ౩౦౨

క॥ కూటికి గుడ్డకునున్ బలు,పాటులఁ బడినట్లు తోఁచె ♦ బహుదుఃఖ మెదన్
నాటెను నాకును మీతో,డ్పాటే ఘటియించెనేనిఁ ♦ బ్రబలరె? వారల్. ౩౦౩

ఉ॥ ఇట్టులఁ బల్కఁగా విని వ ♦ కృష్ణుఁడు కన్నుల నశ్రు లొల్కఁగా
నట్టి కురుక్షితీంద్రుపయి ♦ న్నాగ్రహముం జనియింప వెంటనే
మెట్టి కరీంద్రపత్తనము ♦ మేడ మొనర్చి జయించి వానిచే
నట్టి పృథాకుమారులకు ♦ నర్ధధరిత్రి నిడన్ బొనర్చె తాన్. ౩౦౪

క॥ అలరుచు మధురకుఁ జని ముకు, పలికిన నుడి ననుసరించి ♦ వడి నుద్ధవసం
కలితుండై మంగళదము, లలితము కుబ్జావధూని ♦ లయమున కరిగెన్. ౩౦౫

ఉ॥ దూరమునుండి మారుసతి ♦ తోఁ దులఁదూఁగఁగఁ జాలినట్టి కు
బ్జారమణీలలామ యల ♦ చక్రినిఁ గాంచి మహాప్రియంబుతో
నీరు సువర్ణకుంభమున ♦ నింపుచుఁ బాద్యము లిచ్చి పూజలన్
గోరికదీఱ సల్పి మణి ♦ గుంఫితపీఠ మొసంగి మ్రొక్కఁగాన్ ౩౦౬

తే॥ మదనజనకుండు మెచ్చి యా ♦ మదఁతిమిన్నఁ,గూడి కూర్చుండి భాసిల్లెఁ ♦ గోటిమన్మ
ధాంగుఁడగు తాన యుజ్జ్వల ♦ దాసనమున, శ్రీసతీమణితోడ భా ♦ సిల్లినట్లు. ౩౦౭

వ॥ అట్లు కుబ్జామందిరంబునందు నెనిమిది ప్రొద్దులు వైకుంఠుండు వైకుం
ఠంబునఁ గాలంబు గడపినట్లు గడిపి నిజసదనంబునకుం జనె. ౩౦౮

తే॥ జనక! యాకుబ్జ తపమెన్న ♦ శక్యమగునె?, మౌనివర్యు లనేక జ ♦ న్మంబు లెత్తి
తపమొనర్చియుఁ గననట్టి ♦ దానవారి, దర్శనంబయ్యెఁగాదె? త ♦ త్తన్వి కటులు.

తే॥ పాపహరమును శ్రీహరి ♦ ప్రాప్తికరముఁ, బుణ్యదమునగు నాచక్రి ♦ పూతగాథఁ
జెప్పియుంటిని మఱియేమి ♦ చెప్పవలెనొ, యానతిందు మహారాజ! ♦ యన్ననతఁడు.

## రజక పూర్వజన్మ వృత్తాంతము.

మ॥ బుధమానీంద్ర! భవన్ముఖాబ్జమున నే ♦ భృంగాయమానుండనై
స్వభుచారిత్రమరంద మానితి సుర ♦ ప్రత్యర్థి కేశ్యాది పూ
ర్వభవోదంతము కంసగాథ తెలిసెన్ ♦ వ్యక్తంబు కానట్టి కం
సభటుండా నల చాకివానికత మీ ♦ ర్చక్కంగ బోధింపుఁడీ! ౩౧౧

క॥ దగఁగొను జను మనమెటు లిం,పగు నీరును నభిలషించు ♦ నటు నా మనమా
సొగసగు కథనే విన హె,చ్చుగ నాకాంక్షించుచుండె♦సురమునివర్యా! ౩౧౨

ఉ॥ ఆయెడ నిట్టులన్ బలికె ♦ నబ్జజజాతుఁడు రాజవర్య! త్రే
తాయుగమం దయోధ్యను స ♦ ధర్ముఁడు రామవిభుండు రాజ్యమున్
హాయిగ నేలునప్డు డొక ♦ యగ్గనిశిన్ రజకుం డొకండు కో
పాయిత రక్తనేత్రుఁడయి ♦ యాత్మసతిన్ బ్రహరించి యిట్లనెన్. ౩౧౩

శా॥ ఓసీ! బానిస! సిగ్గులేదె? యిఁక నిం ♦ దున్నావె? ఛీ పొమ్ము నీ
మోసం బిచ్చట సాగునే? కదలవే? ♦ పోవే? కులంబెల్ల నీ
కోసం బెప్డు గుందెడిన్ బరునిదా ♦ కొంపన్ నెలల్ కొల్దిగా
వాసంబున్ దమిసల్పినట్టి సతికేల్ ♦ వట్టంగ రాముండనే? ౩౧౪

చ॥ అది వినినట్టి చారులు గృ ♦ హస్థులు భూవరుతోడఁ జెప్పిరా
యదనున రామచంద్రుఁడు క ♦ టా! యని ఖిన్నుఁడైపొంది దైవమా!
యిది యపకీర్తి యెట్లుమరె? ♦ నెట్లిది పోవు నటంచుఁ గీర్తికై
తుదకొక కాన కంపెఁ దన ♦ దోషవిదూరను ధర్మపత్నినిన్. ౩౧౫

తే॥ పాపరహితులౌ వారు లో♦కాపవాద,మునకు భయపడి పైయట్లు♦బుద్ధిపూర్వ
కముగ నొనరింత్రు కాని త♦త్కలుషమట్టి, యప్రతిష్ఠఁబన్నినవాఁడె♦యనుభవించు.

తే॥ అందువలననె యా చాకి♦యా కలుషము,ననుభవింప మఱల ద్వాప♦రాంతమందు
నశుచులకు మూలమౌ రజ♦కాన్వయమున, జన్మమెత్తి కంసుని సేవ♦సల్పుచుండె.

క॥ ఈసమయంబున స్వయముగ, నా సీతావిభుఁడు పుట్టి ♦ యపనిందలఁ దన్
జేసిన వానిని జంపియు, దోసములం బాపి కరుణ ♦ తోఁ బరమిచ్చెన్. ౩౧౬

క॥ వాఁడే వీఁడని యెఱుఁగుమ!, ఱేఁడా యపకారి కుపక ♦ రించి పరంబా
జాడ నిడిన శ్రీవిష్ణుని, పోఁడిమి గుర్తెఱుఁగ మనకుఁ ♦ బోలునె చెపుమా! ౩౧౭

## వాయకసుదాముల పూర్వజన్మ వృత్తాంతము.

క॥ అనవుడు భూవరుఁ డిట్లనె, మునివర! వనమాలిచేత ♦ మోక్షంబును బొం
దిన వాయకు తొలిచరితం,బును జెప్పఁగ మీకు జోత ♦ ములఁ బొనరింతున్.

తే॥ అనఁగ నారదుఁ డిట్లనె♦నధిప! మున్ను దశరథాత్మజరాఘవో♦ద్వాహకాల
మందు నీ మిథిలాపురి♦యందు నొక్క,వాయకుండు సీరధ్వజ♦ప్రభునియాజ్ఞ.

తే॥ రామలక్ష్మణులకొఱకు♦హేమచేల,ములను జిత్రరీతులఁగూర్చి♦భూపునకిడ
నతఁడు జామాతలకు నియ్య♦నాయుభయులు,నేయమునఁగట్టి రప్పుడా♦వాయకుండు.

ఉ॥ కన్నులపండువౌ నటులఁ ♦ గాంచి బళీ యని వారికీర్తిఁ దా
నెన్నుచు రామలక్ష్మణుల ♦ కెన్నఁడు సన్నని పట్టుపుట్టముల్

మన్నన నిట్టు లిచ్చెదనొ ♦ మంచిగ వారి నలంకరించి యిం
కెన్నఁడు హర్ష మొందెదనొ ♦ యేమియు యటం చెదనెంచు సంగతిన్. ౩౨౩

క॥ రాముఁడు కరుణాధాముఁడు, ప్రేమను గని ద్వాపరాంత ♦ వేళను నిదియా
నో ముఖ్యభక్త! యని వర, మామోదమున నిడె వాయ ♦ కాఖ్యుని కిచ్చన్.

ఉ॥ ఆవల వాయకుండు మిహి ♦ రాన్వయసాగరచంద్రుఁడైన సీ
తావనితేశు సత్కృపను ♦ ద్వాపరపుం దుదఁబుట్టి నెమ్మితో
నావిధి రామకృష్ణుల క ♦ నర్ఘ్యపటంబు లలంకరించి తాఁ
గేవల మొందె ధాన్యధన ♦ కీర్తులఁ బూర్తిగఁ బొంది భూమిపై. ౩౨౫

క॥ అంతట మిధిలాకాంతుఁడు, సంతసమున నిట్టు లడిగె ♦ స్రష్టృసుతా! శ్రీ
కాంతుం డేల సుదాముని, శాంతమునకు నేగె నట్టి ♦ సంగతిఁ జెపుమా! ౩౨౬

క॥ అనవుడు సురముని యిట్లనె, జననాయక! మున్ను ధనదు ♦ చైత్రరథవనం
బున సుమవటుకుం డగు నొక, ఘనుఁడుండును హేమమాలి♦కమనీయాఖ్యన్.

ఉ॥ ఆతఁడు న్యాయశీలుఁడు మ ♦ హాత్మవిధేయుఁడు స్వీయభామినీ
ప్రీతికరుండు నన్యజన ♦ విత్తసతీవిముఖుండు ధీవరుం
డాతతదానశీలుఁడు త ♦ దచ్యుత పాదసరోజబంభరీ
భూతుఁడునై చెలంగెడిని ♦ భూవర! యాతఁ డనంత రంబునన్. ౩౨౮

క॥ హరి దర్శనంబుఁ గోరుచుఁ, బరిమళభరితాంబుజాత ♦ పంచసహస్రాల్
ధరణీ శంకరుఁడగు శం,కరునకు నర్పించె నాత్మ ♦ కరములతోడన్. ౩౨౯

ఉ॥ అంతఁ బ్రసన్నుఁడై గిరిశుఁ ♦ డా ప్రియభక్తున కిట్లుపల్కె నీ
వింతగ నాకుఁ బూజలను ♦ నేల యొనర్చుచుంటి వట్టి వృ
త్తాంతముఁ జెప్పు మిప్పు డది ♦ దప్పక యిచ్చెదఁ గోరుమా! యనన్
సంతస మొంది యాతఁ డిటుఁ ♦ జక్కఁగ వేఁడె ననన్య భక్తితోన్. ౩౩౦

క॥ చంద్రాననార్ధదేహా!, చంద్రకిరణ ధవళవర్ణ ♦ చంచద్గాత్రా!
చంద్రార్కానలనయనా!, చంద్రార్ధమనోజ్ఞశీర్ష!♦ సాంద్రానందా! ౩౩౧

తే॥ వామదేవ! మహాదేవ!♦ వందనములు, విశ్వనాయకుఁడైన యా♦విష్ణుమూర్తి
మద్గృహంబున కేతెంచి♦మన్ననలను, గొని చనెడి వరంబియ్యఁ♦గోరుచుంటి.

ఆ॥ అనుట మిత్రిగొంగ♦యాలించి మేలని, ద్వాపరాంతమందుఁ♦దప్పకుండ
నీవడిగిన వరము♦నెఱవేఱునని పల్కె,నంత నతఁడు ద్వాప♦రాంతమందు. ౩౩౩

క॥ పుట్టి సుదాముండన, నట్టి మధురయందుఁ జెలఁగ ♦ నా వలమురితా
ల్పట్టుల నాతని సద్మము, మెట్టి తదర్చలను బొంది♦మేలు లొసంగెన్. ౩౩౪

క॥ మఱియెయ్యది వినవలతువొ, సరిగా వచియింపుమన్న♦జనకుఁ డిటులనెన్
దురితహరంబగు కుబ్జా, చరితంబును దెల్ప నతుల♦సల్పెద మౌనీ! ౩౩౫

## కుబ్జా పూర్వజన్మ వృత్తాంతము.

ఉ॥ నావుడు నారదుం డిటు ల♦నం దొడఁగెన్ ధరణీంద్ర! మున్ను సీ
తావిభుఁ డట్టి పంచవటిఁ ♦ దమ్ముఁడు భార్యయు వెంట నుండ నా
రావణు తోడఁబుట్టువు సు ♦ రప్రకరప్రతికూలఘోరరూ
పావృతయైన శూర్పణఖ! ♦ యచ్చటకేగి మహాజవంబునన్. 33౬

ఉ॥ రాముని గోటిపువ్వుశర ♦ రమ్యశరీరుని నేకపత్నితో
నేమముగాఁ జెలంగు ఘను ♦ నిం గని మోహముఁబొంది దుష్టయై
రామసతిన్ ధరాసుత న ♦ రంబున మ్రింగఁగఁ బోవుటన్ సుమి
త్రామహిళాసుతుండు కని ♦ తత్క్షణమందునఁ బట్టి దానినిన్. 33౭

తే॥ కత్తితోడుత నాసికా ♦ కర్ణములను, గోసి పంప నా రాక్షసి ♦ గోడుఁజెంది
యన్నయా రావణునితోడ♦నది వచించి, పుష్కరమను తీర్థమునకుఁ♦బోయి యచట.

క॥ పదివేలేడులు శ్రద్ధగ, మదనరిపుండైన హరుని ♦ మదినెంచి తపం
బదవదలేనటు సల్పెను, బదపడి తత్శంకరుండు ♦ ప్రత్యక్షుంబై. 33౯

క॥ వరమేమి నీవు గోరెదొ, త్వరగా వచియింపుమన్నఁ ♦ దత్సతి దేవా!
స్మరసమరాముఁడు హృదయే,శ్వరుఁడౌ నటు వరము నా కొ♦సంగు మనంగన్.

క॥ భూతేశుం డనె నిటు నీ, చేతస్సున నున్న కోర్కె ♦ సిద్ధించెడి నో
నాతీ! ద్వాపరకాలా,ంతసమయమందు వాసు ♦ దేవముఖమునన్. 3౪౦

చ॥ పదపడి నట్టి శూర్పణఖ ♦ ద్వాపరపుంగొనఁ గుబ్జనాగఁ దా
నుదయము జెందియుండ హరి, ♦ యుగ్రు వచస్సు ఫలంబుసల్పఁగా
యదుకులమందుఁ బుట్టి యటు ♦ లాసతి యింటికి నేగి భర్తయై
ముదమును బొంది కొన్ని దిన ♦ ముల్ వసియించె నటం చెఱుంగుమా! 3౪౧

## కువలయాపీడగజ పూర్వజన్మ వృత్తాంతము.

వ॥ వెండియు నీవేమి వినెదవో తెలుపుమన నాబహులాశ్వుఁడో మునివరా! కువలయాగజం బాగరుడధ్వజునిలోన నెట్లు లీనంబైనదియు దాని పూర్వచరితం బెట్టిదో వినిపింపుఁ డన నాయోగిపుంగవుండు దేవా! తొల్లి బలిపుత్రుండును నాయతకాయుండును, సర్వశాస్త్రార్థప్రవీణుండును, మహాబలుండు నగు మందగతి యను దైత్యుం డొకం డొకసమయంబున శ్రీరంగయాత్రకై బయలువెడలి మదద్విపంబు కైవడిఁ బధికులం బడఁద్రోయుచుఁ బోవుచుండ వృద్ధుండును, బలహీనుండును నగు త్రితుండను మహాముని నేలపై నెత్తురువఱదలై పాఱఁబడి ఓరీ! దుర్మతీ! మదోన్మత్తుండవై మత్తేభంబుమాడ్కి సంచరించుచు నిష్కారణంబుగ నన్ను బడఁద్రోసితివి! కాన గజత్వంబును బొందుమని శపింప నతం డా త్రితమునికి నతులిడి దయాకరా! యీశాపం బేను భరింపఁజాల; నాగజత్వంబున [illegible] మీకోటి

మహాత్ములకున్సైతం బిట్టి యాగ్రహంబు దగునే? మీరు నిగ్రహానుగ్రహసమర్థులు గదా! రక్షింపుఁ డని ప్రార్థించుడు నమ్ముని శాంతించి నావచనంబు రిత్తకాదు. ఐనను నీభక్తికి మెచ్చితిఁ గాన ద్వాపరాంతమందు మధురాపురిని సంచరించు శ్రీకృష్ణుని హస్తంబున గజరూపంబున నున్న నీకు ముక్తి కలుగునట్లు వరం బిచ్చితి. ఇద్ది గైకొని శోకింపకుమని పల్కె. అంత నామందగతి యారీతిని నయుతద్విరద బలంబు గలిగి కువలయాపీడమను పేరుతో వింధ్యాద్రియం దుద్భవించియుండ మాగధేంద్రుండు లక్షగజంబులతోఁ జని దానిని స్వాధీనంబు జేసికొని కంసునికిఁ బారిబర్హంబుగా నిడె. ఇట్లా కంసనికటంబున నుండి శాపావసానం బేతెంచుడు తద్ధరి హస్తంబున నిహతంబై యతనిలోన లీనంబయ్యె. ఇదియ తచ్చరితంబు. మఱియేమి వినవలతువో తెల్పుమన జనకుం డానందించి మునీంద్రా! యనంతబలుండగు శ్రీకృష్ణునితో మల్లయుద్ధం బొనర్చిన చాణూరముష్టికాదిమల్లుల చరితంబు విన నిచ్చఁ గలదని ప్రార్థింప నారదుండు ధారుణీంద్రునితో నిట్లనియె. ౩౪౩

## చాణూరాది మల్ల పూర్వజన్మ వృత్తాంతము.

క॥ అమరావతిపురమున మును, విమలుఁడగు నుతథ్యమౌని ♦ వెలయు నతనికిన్
గ్రమముగ సుతులైదుగు రుద,యముఁ జెందిరి పుష్పశర స♦మాకృతు లగుచున్.

ఉ॥ వారు దినక్రమంబునఁ బ్ర ♦ వర్ధన మొందుచుఁ దల్లితండ్రులన్
మీఱి యథేచ్ఛగా శ్రుతి స ♦ మాహితమౌ నిజజాతిధర్మముల్
దూఱి సతంబు విద్యవిడి ♦ తోమరముద్గరకుంతపంక్తి దై
వాఱఁగ నేస్థలంబునకొ ♦ పాటి నియుద్ధము నేర్చుచుండుటన్. ౩౪౪

తే॥ కన్న తండ్రి గనుఁగొని♦కనులకొనల,నుండి నీరు వెల్లిగఁ బాఱు♦చుండ మిగుల
వ్యసనమును బొంది మిక్కిలి♦యలుక గలుగ,భ్రష్టులౌ తనసుతులకుఁ♦బలికె నిట్లు

తే॥ ఆర్జవము శమమును దమం♦బాస్తికతయు, క్షాంతి శౌచము జ్ఞానవి♦జ్ఞానములును
దపము ననునివి దొమ్మిది♦ధాత్రి దేవ,తలకు నియతధర్మము లంద్రు♦ధర్మవిదులు.

క॥ శౌర్యం బీశ్వర భక్తియు, ధైర్యము దానంబు ప్రతిభ ♦ దయయును యుద్ధ
స్థైర్యము తేజము బుజుగతి, యార్యార్చయు క్షత్రియులకు ♦ నగు ధర్మంబుల్.

తే॥ పశుపాల్యంబు కృషియును ♦ బ్రాహ్మణ సుర
భక్తి వాణిజ్య మనునివి ♦ వైశ్యులకును
నిర్జరాగ్రజ సేవయు ♦ నిజకులోచి
తక్రియయు శూద్రులకు నౌను ♦ ధర్మములుగ. ౩౪౫

ఉ॥ పుత్రమిర్ష జనించి పలు ♦ పోకలఁ బోవుచు ధర్మదూరులై
రాత్రిఞ్చరంబొనెనన్నుట్ట గ ♦ రంబుగ బాధలఁ బెట్టుచుంట మీ
రాజు.

ర్మ్యక్రతువులైతి రంతియు ర ♦ సాతలదేవులె ? మీరు ? మీ కృతుల్
క్షత్రియజాతి ధర్మములు ♦ గావొకొ ? కుత్సితులార ! తెల్పుఁడీ ! 350
తే॥ వేయిమాఱులు సెప్పినఁ♦విసక మీరు, స్వేచ్ఛగాఁ దిర్గుటను మీకు♦వేగ నసుర
కులభవంబును నసురుని♦కూడికయు దగ, మల్లవిద్యాప్రసంగంబు♦సెల్లుగాక.
క॥ అని కలియింపఁగ వారలు, దనుజకులమునందుఁ బుట్టి ♦ దానవమైత్రిన్
దనరి నియుద్ధకృతార్థతఁ, గని యటు హరిచేతఁ జచ్చి ♦ కాంచిరి ముక్తిన్.
తే॥ వార లైదుగు రట్టి చాణూరముష్టిక, శల తోశల కూటులు♦గాదె యన్న
ముదముఁజెందిన బహులాశ్వ♦భూవరుండు, కంసు తమ్ముల కథఁదెల్పఁ♦గా నుతింతు.

## కంసానుజాష్టక పూర్వజన్మ వృత్తాంతము.

తే॥ అనఁగ నా ముని యిట్లనె ♦ నలక యనెడు
పురినిఁ దొలి దేవయక్షుఁడన్ ♦ సరసుఁ డొకఁడు
జ్ఞానపరుఁడును జ్ఞాని య ♦ క్షకులజుండు
ఖండపరశుపూజకుఁడు నై ♦ క్రాలుచుండు. 354

వ॥ అవ్వానికిఁ గాలక్రమంబున దేవకూట, మహాగిరి, గండ, దండ, ప్రచండ, ఖండా ఖండ భృగువులను నెనమండ్రు కుమారు లుద్భవిల్లిరి. వార లొయ్యనొయ్యఁ బెరిఁగి యొకనాఁడు జనకుని యాజ్ఞను మానససరోవరంబునకుం జని మధుపధ్వనిసంభృతంబులగు సహస్రారవిందంబులం గైకొని వాసనాలోలుభులై యాఘ్రాణించి యవ్వానినే తెచ్చి నిజపిత కొసంగిరి. అవ్వి ముక్కంటికిం బూజింపఁబడినను దదుచ్ఛిష్టీకృతదోషం బాకుమారాష్టకంబున కాపాదించె. దాన నవ్వార లసురజన్మంబుల మువ్మాఱెత్తి పిదప న్యగ్రోధాది నామంబులతోఁ గంసానుజులై పుట్టి లోకశంకరులగు శ్రీకృష్ణబలరాములచే నిహతులై ముక్తులైరిగదా ! మఱియుఁ దత్సాందీపనిపుత్రుని హరించిన శంఖరూపావృతపంచజనుని పూర్వజన్మవృత్తాంతంబు వినుమని యిట్లనియె. 355

## పంచజన పూర్వజన్మ వృత్తాంతము.

తే॥ అధిప ! మున్ను చక్రాదు లా ♦ యంబుజాక్షు
నకు నుపాంగములుగ నుండి ♦ నాఁటి మొందె
నందుఁ బాంచజన్యము శంఖ ♦ మధికమైన
హరిముఖంబును బొంది యి ♦ ట్లాత్మ నెంచె. 356

ఉ॥ ఆర్తజనప్రియుం డఘన ♦ యచ్యుతుఁ డీ ననుఁగొంచు దక్షిణా
వర్తము గెల్వఁజాలెను న ♦ పాంపతి పుత్రి కసాధ్యముల్ సుధా
పూర్తము రుచ్యమైన హరి ♦ మోవిని రాజమరాళకాంతితోఁ
బూర్తిగ నానుచుంటి ననుఁ ♦ బోలుదురే ? [illegible]

చ॥ చూచుచు నఖర్వగర్వమున ♦ నాడుకొనంగఁ దదీయవక్షమం
దున వసియించు లక్ష్మి, చెవి ♦ తో విని వెంటనె దానిఁ జూచి యి
ట్లనియెను శంఖమా! త్వరఁగ ♦ నాసురజన్మముఁ జెందుమో కుధీ!
ననుఁ బెఱవారి దూఱుదువె? ♦ న్యాయమె? యంచు శపింప నద్దియున్.

ఉ॥ పాంచజన్యాఖ్యశంఖోత్తమము ద్వగి య ♦ పాంపతియందు నిశాటజన్మమున్
గాంచి వసింపఁగాఁ దొడఁగి ♦ కంజదళాక్షుని యొజ్జ కుక్షి బా
ధించి హరించి శ్రీపతిహ ♦ తిన్ మృతమైె హరికేల శంఖరూ
పాంచితదేహమున్ వెలుఁగ ♦ నాత్మయు నా హరియాత్మఁ జేరఁగాన్. 3౫౯

తే॥ ముక్తిఁ బొందెను నిద్ది య♦ద్భుతముగాదె?
మనుజనాయక! యింకేమి ♦ వినవలతువొ?
సాహసప్రవరా! యన్న రాజవ♦రుఁడును సంత
సించి భక్తియుక్తుఁడయి పృ♦చ్ఛించె నిట్లు. 3౬౦

శ్రీకృష్ణుం డుద్ధవుని గోకులంబునకుఁ బంపుట.

ఉ॥ నారద! శౌరి యాసురసం ♦ హవ్యముగా మఱి యేమి చేసెనో
సూరిమిత్రోడఁ జెప్పు మని ♦ కోరఁగఁ దన్ముని యిట్లు పల్కె నో
భూరమణా! జనార్దనుఁడు ♦ బుద్ధిఁ దలంచెను నొక్కవేళ నా
భీరవధూలలామసుర ♦ భిప్రకరాన్విత గోకులంబునున్. 3౬౧

చ॥ తలఁచి యటుల్ మహామహుఁడు ♦ తత్క్షణమందు రహస్యరీతి నె
చ్చెలిని స్వకీయభక్తుని సు ♦ శీలుని నేర్పరి ధీరు నుద్ధవున్
బిలిచి యొసంగి జాబులను ♦ ప్రీతిని నిట్లనె మిత్రవర్య! గో
కులమున కేగుమయ్య! మన ♦ కోరిక లీరిక లెత్త నిత్తఱిన్. 3౬౨

చ॥ చని యొక జాబు నందున కొ ♦ సంగుము రెండవదైన యుత్తరం
బు నల యశోద కిమ్ము మఱి ♦ మూఁడవ కమ్మను రాధ కిమ్ము న
న్ననయము గూడు నెచ్చెలుల ♦ కారసి నాల్గవ దిమ్ము నెమ్మనం
బున నెనరుంచి తక్కినవి ♦ ముగ్ధల కిమ్ము సుమిత్రచంద్రమా! 3౬3

సీ॥ అనయంబు నాతోడ♦నాడుచుఁ బాడుచు, బుజగించు పితకు♦మ్రొక్కు లనుము
పవలును రేయియుఁ♦బరమప్రియంబునఁ, బోషించు తల్లికి♦మ్రొక్కు లనుము
సతతంబు నాతోడ♦సల్లాపములఁ జేసి, ముద్దాడు రాధకు♦ముద్దు లనుము
సంగాతమొనరించి♦సర్వచమత్కృతుల్, చూపిన సఖులకు♦సుకమె యనుము

తే॥ మద్వియోగంబునై పని♦మానినులను, మదుదితోక్తుల లాలింపు♦మా వ్రజంబు
నందు నుండు నాఁగకు నల్పకాల,మునను తప్పక రాఁగలఁ♦డనుము కూర్మి.

తే॥ మఱియు నక్రూరుతోఁగూడి ♦ మావ్రజంబు
విడిచి చనుదెంచు మార్గంబు ♦ వేగ నడ్డ
గించి నన్నిల్పు గోపికా ♦ సంచయమున
కల్పకాలములో వత్తు ♦ నను మిత్ర! ౩౧౬

తే॥ మఱియు నాకయి దేహముల్ ♦ మంటఁ గలుప
సిద్ధముగ నున్న చెలులకు ♦ బుద్ధిచెప్పి
ప్రీతి సమకూర్పుమో హిత ♦ వ్రాతముఖ్య!
పంపుచుంటిని నమ్మి నే ♦ ర్పరివటంచు. ౩౧౭

ఉ॥ నా చెలివంచు వారు నిను ♦ నమ్ముటకై యిపు డానవాలుగా
నా చెవిసొమ్ముఁ గౌస్తుభము ♦ నవ్యహరిత్స్ఫుటపద్మమాలలున్
బూఁచిన వేయిరేకులను ♦ జక్కఁగ నొప్పెడు పంకజంబుఁ బు
ష్పాచిత యష్టియున్ మురళి ♦ యంగదముల్ మకుటంబుఁ బొందియున్.

తే॥ నావలెన్ నీవు వేషంబు ♦ నాకొసఁగను
వేసి మచ్ఛతాంగంబు ♦ వేగ నెక్కి
పోయి యాగనుల్ సాధింపు ♦ మోయి మిత్ర!
యని సుగంధాదుల నొసంగి ♦ యంప నతఁడు. ౩౧౮

తే॥ చక్రికిన్ బ్రదక్షిణములు ♦ సల్పి మ్రొక్కి, వీడుకొని హరి రథమెక్కి ♦ విష్ణువేష
మును ధరించి గోపకగోస ♦ మూహగోపి, కా జనాన్వితవ్రజమున ♦ కోజ నరుగ,

ఆ॥ మోహనాదిరాగ ♦ ములను శ్రీకృష్ణుని, సన్నుతించు చాలఁ ♦ జక్కఁగాను
గోపగణముసూచి ♦ కొంతదవ్వననుండి, పెలుచ నొండొరులును ♦ బలుకుకొనిరి.

ఉ॥ గోపకులార! మిత్రుఁడు ము ♦ కుందుఁ డిటుల్ సనుదెంచుచుండె నా
శ్రీపతియానో కాదో యని ♦ చిత్తమునన్ విశయంబు లేల? మా
లాపరిధానకౌస్తుభచ ♦ లద్ద్యుతిమాలిసహస్రపత్రసం
దీపితపంకజాశ్వతతి ♦ దివ్యరథాదులు చక్రివే సుమీ! ౩౨౦

ఉ॥ చాల దినంబు లయ్యె మన ♦ సంగడికానిని జూచి యంచు వే
యాలుడితో సుదామముఖు ♦ లా హరిమిత్రులు కృష్ణవేషుఁ గు
త్కలధరాప్తు నుద్ధవు న ♦ తిప్రమదంబున డాసి యిచ్చటన్
నీలకటుండు లేఁ డితఁడో ♦ నెచ్చెలిఁ బోలెడి నీతఁ డెవ్వఁడో! ౩౨౧

క॥ అని శంకించెడితఱి నా, యన యల శ్రీదామముఖుల ♦ నచ్యుతసఖులన్
గని హరి పంపిన యుత్తర, మును నియ్యఁగ వారు దాని ♦ ముదమునఁ గొనుచున్.

తే॥ చదివి చదివి యందఱి యెల్ల ♦ సంగతులను
దెలిసికొని కనుఁగవ నశ్రు ♦ లొలుకుచుండ

నుద్ధవున కిట్లు బల్కిరో ♦ మద్ధితాభి
లాషి! మాచెలి యిటు రాఁద ♦ లంచె నొక్కొ? ౩౬౪

ఆ॥ క్షణము యుగముగ నొక ♦ గడియ మన్వంతర
ముగను జాము కల్ప ♦ ముగను దినము
బ్రహ్మకాలముగను ♦ బద్మనాభుని వీడి
గడుపుచుంటి మేము ♦ కాల మిపుడు. ౩౬౫

ఉ॥ ఆతఁడు లేని జీవితము ♦ నర్థము ధాన్యము వైభవంబులున్
వ్రేతల కెంతమాత్రమును ♦ బ్రీతికరంబులు గావటంచు నీ
చేతమునందు నమ్ము మిఁక ♦ స్నేహమొనర్చెడి మా యవస్థ యా
ధాతయుఁ జెప్పఁలేఁడని యె ♦ దన్ దలపోయుమ! యోయి యుద్ధవా!

చ॥ అని నుడువంగ నుద్ధవుఁడు ♦ నాడె నిటుల్ సఖులార! నేను త
ద్వనరుహనాభదాసుఁడను ♦ దత్ప్రియమిత్రుఁడఁ దద్రహస్కరుం
డనుజుమి నన్నుఁ గృష్ణుఁడు త ♦ టాలున గోకులమేగి మీసుఖం
బును గని రమ్మటంచనిపెఁ ♦ బూర్తిగ మీర్వినుఁడీ! ముదుక్తులన్. ౩౬౬

చ॥ మఱువక మిమ్ము మీచెలిమి ♦ మాధవు చెంతకు నేగి వేగ మీ
విరహము మీ యభీష్టముచు ♦ విన్నపముం బొనరించి మ్రొక్కి త
ద్ధరిసహితుండనై మఱలఁ ♦ దప్పక మీకడ కేగుదెంతు నా
యఱగొఱలేని పంతమిది ♦ యం తెద నమ్ముఁడి! చింతమానుఁడీ! ౩౬౭

తే॥ ఇట్లు శ్రీదామముఖసుహృ ♦ ద్బృంద మూఱ
డించి యాత్మరథమున నె ♦ క్కించుకొనియు
నర్కుఁ డస్తమించెడి వేళ ♦ యందు నంద
నగరమునఁ జొచ్చెఁ దద్వార్త ♦ నందుఁడు విని. ౩౬౮

శా॥ ప్రత్యుత్థాన మొనర్చి యుద్ధవుఁ బరీ ♦ రంభమ్ములన్ దేల్చి సం
స్తుత్యార్చల్ బొనరించి స్వాద్యజలజ ♦ గ్ధుల్ ప్రీతితో నిచ్చి యా
దిత్యశ్యానమనోజ్ఞతల్పసమమై ♦ తేజొందు తల్పంబు స
న్నుత్యప్రజ్ఞనొసంగి యడ్గె నిటుల ♦ న్పుత్రప్రవృత్త్యర్థియై. ౩౭౦

ఉ॥ నాయన! దేవకీపతికి ♦ నందన యుక్తముగాసుఖంబె? లో
కాయతకంటకుండును న ♦ ఘాకరుఁడౌ యదుభూపుఁ డంతమై
పోయినమీఁద యాదవులు ♦ పూర్తిగ సౌఖ్యముఁ బొందుచుండ్రె య
బ్బాయికి మాకుమారునకు ♦ భద్రమె? నీకికి నేమమేకదా! ౩౭౧

సీ॥ మనసారఁ బెంచిన ♦ జనని యశోదను, నెపుడేని నెద సంస్మ ♦ రించునొక్కొ?
ధనవ … డేయని నమ్మి, ♦ యలరు నన్నెపుడేనిఁ ♦ దలఁచునొక్కొ?

యాత్మీయ సఖులతో ♦ నాడిన పాడిన, బృందావన మెపుడే ♦ నెంచునొక్కొ?
బలభద్రుతోఁగూడి ♦ బాగుగాఁ గాచిన, యీయాల నెపుడేని ♦ నెత్తునొక్కొ?
తే॥ గోపికా గోపకావళి ♦ గోప్రవర్ధ,నాద్రి యమునోరుపులిన ప్ర♦ జాంగణముల
నెప్పుడైనఁ దలఁచునొక్కొ?♦యిందిరేశ్వ,రుఁడును నాకుఁబ్రియునగు కృ♦ష్ణుఁడు సుమిత్ర!

ఉ॥ దైవమ! ప్రాణతుల్యుఁడయి ♦ దాపున నుండిన నాకుమారు నే
డ్రేవకొ నెట్టి యిట్లు విప ♦ రీతముగా వగపొందుచుంటి నా
జీవనజాతలోచను వి ♦ చిత్ర విలాసవినోదు శూరు బృం
దావనసంచరిష్ణుని స ♦ ధర్మునిఁ గృష్ణునిఁ జూచు టెన్నఁడో. ౩౮౩

ఉ॥ ఎందులకీ శతాంగము లిఁ ♦ కెందులకీ తురగంబు లేటికీ
సుందరమందిరంబులు య ♦ శోధనధాన్యసువర్ణ ధేను గో
బృందము లివ్వి యెందులకు ♦ నెందులకీ పరిపాలనంబు నా
నందనుఁ డిందులేనియెడ ♦ నమ్మ్మమ! యుద్ధవ! వ్యర్థుఁడన్ జుమీ. ౩౮౪

తే॥ ఆర్యవర్య! చకోరమా ♦ యమృతకరుని, విడిచి పుడమిని బ్రతికిన ♦ విధిని నేను
మదనకోటి సుందరుఁడును♦గదన భీముఁ,డు నగు కృష్ణుని విడి యిట్లు♦మనుచునుంటి.

తే॥ భూమిభాగంబుఁ బాపంగఁ ♦ బుణ్యనరులఁ, బ్రోవఁ బుట్టిన జగదేక♦పూర్ణుఁడైన
కేవలుండని యెంతు నా♦కృష్ణమూర్తి, బలయుతున్ వాని విడి యెట్లు♦బ్రతుకఁగలను

క॥ అని పుత్రకమోహముచే, ఘనముగ శోకంబుఁ బొంది ♦ కన్నీ రొల్కన్
దన పలవునఁగల తలగడ, నునిచి తలన్ మిన్నకుండె ♦ నుర్వీనాథా! ౩౮౫

చ॥ అవల యశోద యాపగవి ♦ యాగమనంబును నాలకించి పు
త్రవిహితమోహబద్ధయయి ♦ ద్వారము చెంతకు వచ్చి నిల్చి క
న్నవను స్రవించు తోయమును ♦ గట్టిన చేలముచేత నద్ది యు
ద్ధవునకు బంధుమోదములఁ ♦ దద్దయు నడ్గి యిటు ల్వచించెడిన్. ౩౮౬

ఉ॥ నందునిగాని నన్ను నుప ♦ నందులఁగాని వ్రజంబుగాని స
న్నందునిగాని స్వప్రియగ ♦ ణంబునుగాని మనోజ్ఞమైన కా
ళిందినిగాని బాల్యగత ♦ లీలలఁగాని విహారయోగ్యమౌ
బృందనుగాని కృష్ణుఁడు స్మ ♦ రించునె? యెత్తఱినైన నుద్ధవా! ౩౮౯

ఉ॥ నాకొక పుత్రకుండు మఱి ♦ నల్వురు లేరుగదా కటా! కటా!
యాకొమరుండె నన్నిటు ద ♦ యారహితుండయి యిందువీడి తా
నేకడ కేగెనోకద యిఁ ♦ కెట్టుల నే బ్రదుకంగనేర్తు నా
శోక మిదెట్లు పోవు నెటు ♦ జూచినఁ జక్కనిబాట సిక్కదే? ౩౯౦

శా॥ అమ్మా! చిక్కని మంచి పాలొసఁగవే? ♦ హైయంగవీనంబుఁ దే
లేమ్మా! బిడ్డగు గడ్డపెర్గు నిడవే? ♦ దివ్యాన్నపాయ సెటుసా-

చిమ్మాడిక్కిఁ బలుకాడు నాకొమరుఁడె ♦ ట్లీవేళఁ దా మెక్కెనో
యమ్మా! గోపకగోపికాజనుల ప్రా ♦ ణాధారుఁ డీ కృష్ణుఁడే. ౩౮౧

ఉ॥ పాలనలాలనంబులను ♦ వత్సరమొండు క్షణంబు కైవడిన్
గాలము మేము పుచ్చితిమి ♦ గాదె? తదంబుజలోచనుం డిటుల్
గ్రాలకపోవుటన్ క్షణము ♦ కల్పముగా నిపు డేగుచుండె మా
జాలమునం దితండె సిరి ♦ సంపదలో యదుపుత్రరత్నమా! ౩౮౨

మ॥ అరరే! యెంతటి క్రూరురాలను గదా! ♦ యానాఁడు నాకూన భీ
కరకోపంబునఁ బెర్గుచుండఁ బగులం ♦ గాఁ గొట్టినం జేను స
త్వరనై యోటను ద్రాటఁగట్టి మిగులన్ ♦ బాధించితిన్ వానిఁ ద
స్కరుఁ డంచున్ మఱి యెక్కెనాఁడు నెటిగా ♦ శాపించితిన్ జెల్లఁబో! ౩౮౩

సీ॥ ఏపీటికిని నేగ ♦ నేవాడకును బోవ, నేఁడి కృష్ణుఁడని పృ ♦ చ్ఛించు వారె
యేపల్లె కేగిన ♦ నేయింటి కేగిన, నేఁడి కృష్ణుఁడని పృ ♦ చ్ఛించు వారె
యేతోట కెగిన ♦ నేచోటికిన్ జన, నేఁడి కృష్ణుఁడని పృ ♦ చ్ఛించు వారె
యెవ్వానిఁ జూచిన ♦ నెద్దానిఁ గాంచిన, నేఁడి కృష్ణుఁడని పృ ♦ చ్ఛించు వారె

తే॥ ఆలఁ గాంచిన నవ్వియు ♦ నబ్జనాభుఁ, డేఁడి యేఁడియం చఱచెడి ♦ నేమొనర్తు?
వాఁడు లేని నాజన్మంబు ♦ వ్యర్థముగద!, యేల యీవైభవములు? ప ♦ రేంగితజ్ఞ!

చ॥ అని విలపింప నాపగవి ♦ యుబ్బముఁ బొంది వచించె నిట్లు నా
తనువున నెన్నిలోమములు ♦ దారొకొనియున్నవో? యన్ని నాలుకల్
గొనియు నుతింపలేను మిముఁ ♦ గూర్మిని గూడిన భక్తి మీకుఁ గృ
ష్ణునిపయి నుండె నిట్టి దెటఁ ♦ జూడను జంపతులార! యింతగాన్. ౩౮౪

తే॥ తీర్థయాత్రా తపోదాన ♦ దివ్యయోగ, సాంఖ్యదుర్లభమును బహు ♦ శాశ్వతమును
ప్రేమపూర్వకమగు భక్తి ♦ మీమనముల, యందు నెక్కొని యియ్యది ♦ యల్పమొక్కొ?

ఉ॥ చింతల మాని మీసుతుఁడు ♦ చేత లిఖించిన జాబులోంది వృ
త్తాంతము లెల్లఁజూచుకొని ♦ ధైర్యము దెచ్చుకొనుండు కృష్ణుఁడున్
సంతస మా పురస్థులకుఁ ♦ జక్కఁగఁ గూర్చుచు నన్నతోడ న
త్యంత ముదంబుఁ జెందెడిని ♦ దన్మథురాపురమందు నిత్తఱిన్. ౩౮౬

తే॥ స్వల్పకాలంబులోన నా ♦ చక్రపాణి, సాగ్రజుండయి యిచ్చట ♦ కరుగుదెంచు
దుష్టజనశిక్షణార్థంబు ♦ శిష్టరక్ష,ణార్థముగ జనించిన పరుఁ ♦ డతఁడె సుమ్ము. ౩౮౭

వ॥ కావుననే పూతనాప్రాణహరణంబును, శకటాసుర నిపాతనంబును, తృణా
వర్తపాతంబును, యమళార్జునభంజనంబును, విశ్వరూపసందర్శనంబును, బృందావన
విహారంబును, గోపాలనంబును, బకవత్సాఘధేనుకాసురహింసనంబును, గాళియ
మర్దనంబును, దావాగ్నిపానంబును, గోవర్ధనోద్ధరణంబును, శంఖచూడామణి

సంగ్రహణంబును, నరిష్టకేశివ్యోమాసుర వినాశంబును, గావించి ప్రలంబాంతకుండగు నన్నతోఁ గూడి యక్రూరముఖంబున వచ్చిన కంసాహ్వానంబుఁ బురస్కరించుకొని మధురాపురి కరిగి దండధరు దండంబుమాడ్కి నుండు ప్రచండంబగు నొండు కోదండంబును వేదండం బిక్షుఖండంబు విఱిచినట్లు రెండుతుండెంబులుగా ఖండించి కువలయాపీడనామకకంసకుంభీంద్రంబు శుండాదండంబుఁ బట్టుకొని నేలం గూల్చి చాణూరముష్టికకూటశలతోశలులను మల్లుల నోడించి లక్షగజసమబలుండును, మదోత్కటుండు నగు కంసుని సిగ బిగియం బట్టుకొని మంచంబునుండి క్రిందికిం బడవైచి కరీంద్రంబుపై నారోహించిన పంచాస్యంబుమాడ్కిఁ జెలంగి వధించి కంసానుజాష్టకంబును, మృగంబులను మృగేంద్రంబువగిది నష్టం బొనర్చి పంచజనుం బంచత్వంబు బొందించి యమునితోఁ బోరాడి గురుపుత్రుం గైకొని దక్షిణగా గురువునకు సమర్పించి నిజభక్తులం బ్రోవం జాలె. ఇట్టి మహత్తరకార్యంబులు వీరు దక్కఁ దక్కినవారు సేయంగలరే? కానఁ దచ్చారిత్రంబు సమగ్రంబుగా వినిపింప సమర్థుండను గానని పలుకుచు నాయశోదా నందులతో నారేయి నొక నిమేషంబుగాఁ గడపె నంత. ౩౯౯

తే॥ వేకువను లేచి గోపికల్ ♦ విహితకృత్య, ములను సల్పి దీపంబుల ♦ వెలుఁగఁ జేసి
పిచ్ఛిలంబగు పెరుఁగును ♦ బెద్దకడవ, లందుఁ జిలుకగడంగిరా ♦ యవసరమున.

ఉ॥ కంకణకింకిణుల్ లయగఁ ♦ గ్రమవిధంబున మ్రోయ వారు భూ
శంకరకార్యశూర హరి ♦ చక్రికథాత్మకగీతులన్ నిరా
తంకముగా సుగానమును ♦ దద్దయుఁ జేయఁ దొడంగి రించుకే
జంకని కింకిరాత శుక ♦ సారససామ్యమృదుస్వరంబులన్. ౪౦౧

తే॥ ఉద్ధవుఁడు శశిపువు విడి ♦ యుచిత కృత్య, ములను దీర్చి నదిలోన ♦ జలకమాడ
స్వకరథం బెక్కి నడచుచు ♦ వాడ వాడ, లందు గోపికాకృతగాన ♦ మాలకించి.

ఆ॥ విస్మయంబుఁ బొంది ♦ వ్రేలును ముక్కుపై, వేసి యిట్టి నందు ♦ వీట నెంత
కృష్ణచంద్ర భక్తి ♦ యెసఁగె నహా! యోహో! యనుచు నదికిఁ బోయె ♦ నవల వారు.

ఉ॥ దూరము నుండి వాయుగతి ♦ తోఁ జను నుద్ధవుఁ గాంచి యీతఁడ
క్రూరుఁడ నంచు వచ్చి మును ♦ కొంపల ముంచిన క్రూరుఁడా? మఱే
శౌరివియోగబాధల న ♦ జస్రము గుందెడి మాకుఁ గష్టముల్
గూరుపఁ గంసమిత్రుఁడగు ♦ కొంటెయొ? కానియెడన్ మఱెవ్వఁడే? ౪౦౪

తే॥ నిరపరాధలోకంబును ♦ నిర్నిమిత్త, ముగ వధంపంగఁ గ్రొవ్వ ♦ మున్ను భోగులను సృజించిన యట్లు గాం ♦ దినియు మమ్ము, గాసిఁ బెట్టఁగ నక్రూరుఁ ♦ గ నెనుగాదె?

ఉ॥ ఆతఁడె తిర్గివచ్చెనొకొ? ♦ యం చధికాగ్రహవృత్తితో మరు
ద్రీతిగఁ బాఱి నీల్గునటు ♦ తేరున నుంతిన రాతుఁ గొట్టి యి

ప్రీతిఁ దెవండొ చెప్పు? వచి ♦ యింపనిచోఁ బ్రహరింతు మియ్యదే
సూత! యటంచుఁ దన్ముఖముఁ ♦ జూపుడు వ్రేలునఁ గ్రుచ్చి పల్కఁగాన్. ౪౦౬

ఉ॥ సారథి భీతిఁ బొంది యల ♦ చానల కిట్టులఁ జెప్పసాగె నో
సారసనేత్రలార! సుమ ♦ సాయకసామ్యమనోజ్ఞరూపుఁడై
శౌరిని బోలు నీఘనుఁడు ♦ చక్రి సఖుండని యెంచుఁడీ! యనన్
వారలు మెచ్చి యాతనికి ♦ వందనముల్ బొనరించి వేడ్కతోన్. ౪౦౭

తే॥ కృష్ణసందేశ మిపుడు గు ♦ ర్తెఱుఁగఁ గలమ
టంచు నొయ్యనొయ్యన నుద్ధ ♦ వాంతికమున
కేగి యాతనిఁ దోడ్కొని ♦ కృష్ణవార్త
లడుగఁ గదళీవనంబునఁ ♦ కరిగి యందు. ౪౦౮

ఉ॥ చల్లని పిల్లవాయువులు ♦ సక్కఁగ వీవఁ గళిందజోర్మికా
వెల్లన జాతశీకరము ♦ వేంద్రము నార్పఁగ దివ్యవృక్షముల్
సల్లలితప్రసూనములఁ ♦ జల్లదనంబును గూర్పఁ జక్రికై
మల్లడిఁ జెంది బొంది గొలి ♦ మాలినదం చను రాధ యింటికిన్. ౪౦౯

ఉ॥ చేరి రనంతరంబున సు ♦ శీల పరేశ్వరియైన రాధ యా
శౌరి సుమిత్రు రాక విని ♦ చక్కని పూజ సఖీజనంబుచేఁ
గోరికఁ జేయ సల్పియు ము ♦ కుందకథాశ్రవణం బొనర్ప దై
వాఱఁ దదుద్ధవుండు గని ♦ భక్తిని మ్రొక్కుచు నామె కిట్లనెన్. ౪౧౦

తే॥ దేవి! యేల కృశింతువే? ♦ తేటపఱచు, మీవు బ్రహ్మాండ నాయకు ♦ నింతివయ్యుఁ
జింత నెందుట తగునొకో? ♦ చిత్రముగద, నీమహత్త్వ విచారింప ♦ నెమ్మనమున

క॥ కృతనిత్యలీలుఁడై యతి, చతురతఁ గృష్ణుండు పుట్టు ♦ సమయంబందే
కృతనిత్యలీలవై యతి, చతురత లీలావతివిగ ♦ జన్మింతువుగా! ౪౧౨

క॥ హరి పరిపూర్ణతముండై, పఱలును యాయవసరమునఁ ♦ బాయక నీవున్
బరిపూర్ణతమవుగా ధర, వఱలెదవో భగవతి! వృష ♦ భాను కుమారీ! ౪౧౩

ఉ॥ ఎత్తఱిఁ జక్రి భూముఁడయి ♦ యిద్ధరఁ బుట్టునో యప్డు లక్ష్మివై
వార్తితివమ్మ! యెత్తఱిఁ ద ♦ దంబుజనాభుఁడు బ్రహ్మయౌనో నీ
వత్తఱి వాణివౌదు వెపు ♦ డంబురుహాయతనేత్రుఁ డుగ్రుఁడై
యత్తునో యప్డు నీవు శివ ♦ వౌదు వహా! జననీ! పరేశ్వరీ! ౪౧౪

తే॥ ఘన సనకసనందన సనా ♦ తనసనత్కు, మార మునిరూప మెత్తఱి ♦ మాధవుండు
నెందునో యప్డు జ్ఞాన మా ♦ నందములను, నిచ్చు నాదిదేవతవయి ♦ యొసఁగెదవుగ.

తే॥ ఎపుడు శ్రీహరి విష్ణువై ♦ యొసఁగు నపుడు, వైష్ణవిగఁ బుట్టెదవుగదా ♦ పాయలేక
యెపుడు యజ్ఞవరాహుఁడై ♦ ఘనమూర్తి, యలరునో యప్డు పుడమివై ♦ చెలఁగెదవుగ.

తే॥ ఏసమయమునఁ గాంతుతో ♦ వాసుదేవుఁ, డమరమునివర్యుఁడగునో యు ♦ ప్లతనిచేత నలరు మహతియను వీణవై ♦ చెలఁగెదవుగ, తలఁతు నిన్నద సాధ్వీమ ♦ తల్లి! తల్లి!

క॥ మఱి నరనారాయణులుగ, ధర హరి జన్మించినపుడు ♦ ధాత్రికి సుఖముల్
గరముగఁ గూర్చెడి శాంతిగ, సరసముగాఁ బుట్టెదవుగ ♦ సాధ్వీమణిరో!

వ॥ వెండియు శ్రీకృష్ణుండు కపిలుండైనపుడు సిద్ధసేవితంబగు సిద్ధివిగను, దత్తాత్రేయుండవైనపుడు జ్ఞానమయంబగు సిద్ధివిగను, యజ్ఞంబైనపుడు దక్షిణగను, నురుక్రముండైనపుడు జయంతివిగను, పృథుచక్రవర్తివైనపు డర్చివిగను, మత్స్యావతారం బెత్తినపుడు శ్రుతిరూపవుగను, కూర్మంబైనపుడు సర్వస్వరూపిణివిగను, ధన్వంతరియైనపుడు సంజీవనీనామకభేషజంబుగను, మోహినియైనపుడు జగన్మోహినివిగను, నృసింహుండైనపుడు భక్తవత్సలతాత్మకలీలారూపిణివిగను, వామనుండైనపుడు కీర్తివిగను, బరశురాముండైనపుడు పరశువుగను, శ్రీరాముండైనపుడు సీతవుగను, వ్యాసుండైనపుడు వేదాంతవాణివిగను, బలరాముండైనతఱి రేవతీదేవివిగను, బుద్ధుండైనపుడు బుద్ధివిగను, కల్కియైనతఱిఁ గృతివిగను, జంద్రుండైనపుడు చంద్రికవుగను, నర్కుండైనపు డాతపంబవుగను, నింద్రుండైనపుడు శచివిగను, హిరణ్యరేతసుండైనపుడు హిరణ్మయివిగను, గుబేరుండైనపట్టున నిధివిగను, క్షీరాబ్ధిశయనించు హరియైనపుడు సూక్ష్మసితతరంగిణివిగను, జన్మించి జగంబుల నుద్ధరించి పోషింతువుగాదె మఱియు మహామహుండగు నా శ్రీకృష్ణుండే సాంప్రతంబున వ్రజరాజనందనుండై వెలఁగ వృషభానుపుత్రికామణివై రాధయను నభిధానంబుతోఁ జెలఁగుచుంటివి. వెండియు నత్తమ్మికంటి యెప్పుడెప్పు డేయేరూపంబులం బూని యేయేకార్యంబు లొనర్పం గడంగునో యప్పుడప్పు డుచితభంగుల జన్మంబు లెత్తి యాయాకార్యంబుల నెగ్గించెదవుగాదె యని వాక్రుచ్చి వెండియు నిట్లనియె. ౪౧౯

తే॥ సర్వదేవస్వరూపుఁ డా ♦ చక్రపాణి, యఖిలదేవతారూపిణి ♦ నమ్మ నీవు
పరుఁడు భగవంతుఁ డాతండు ♦ ప్రకృతివీవె, యెనుపదిసేయుచుంటి మీ ♦ కధికభక్తి.

తే॥ అట్టి భక్తవత్సలుఁ డంపి ♦ నట్టి యుత్తరమిది దయతోఁడఁ జేకొని ♦ యవాలమతిని జదువుకొన వేఁడుచుంటి నీ ♦ స్వాంతమందుఁ, గలఁతఁ జెందకుమని చెప్పి ♦ కమ్మనొసఁగి.

ఆ॥ అవలి గోపికలను ♦ నామంత్రణముసేసి, వందమించినట్టి ♦ పత్రికలను
మీప్రియుండు వంపె ♦ మేలుగా నివి యంచు, వారికాదరమున ♦ వరుస నిచ్చె.

చ॥ పదపడి రాధ, శ్రీధరుఁడు ♦ వంపిన జాబును గండ్లకద్దినె
మ్మదిని దదంఘ్రులన్ దలఁచి ♦ మానసపద్మము విప్ప నెమ్మదిన్
జదువుకొనం గడంగి యొక ♦ సారి నగున్ మఱి యొక్కతేప బల్
బెదరిపడున్ మఱొక్కపరిఁ ♦ బ్రీతిని జూపుఁ బఠించి క్రమ్మఱన్. ౪౨౩

చ॥ సరియని శీర్షమూఁచి యల ♦ శౌరి వియోగము దుస్సహంబుగా
ధరపయి వ్రాలె నా పిదపఁ ♦ దత్సఖులెల్లరు వచ్చి చూచి పు
ష్పరసపటీరసారము ల ♦ పారముగా నొడలందుఁ జల్లి చా
మరముల వీవ నాసతి క్ర ♦ మంబుగఁ దెప్పిఱెఁ దత్పరంబునన్. ౪౨౪

ఉ॥ గోపిక లుద్ధవుండును ము ♦ కుందవియోగపయోధిమగ్నయై
తాపముఁ జెందు రాధఁ గని ♦ తాళక తాము లోచనంబులం
దేపున నీరు నించి రది ♦ యెచ్చట వెల్గఁ బాఱె నందుఁ బ
ద్మాంకితమైన యొండు కొల ♦ నయ్యెను లీల యనంగ దానిలోన్. ౪౨౫

తే॥ సనందనాదులన్ భక్తి♦సల్పువారు, దుష్టులయ్యును బూతులై♦దురుగ రాధ
మనసునందున దుఃఖంబు♦మఱుగుపఱచి, యాత్మవిభువార్త లాతని♦నడిగె నిట్లు.

ఉ॥ మమ్ముల మా విహారముల ♦ మానసమం దెపుడేన్ స్మరించునే?
యమ్మదనాథు నా హరిని ♦ నా కమలాక్షుని నా మనోహరున్
నెమ్మనమందు నే మరతు ♦ నే? యిఁక వాఁడిట కేగుదెంచఁడే?
యమ్మధురానివాసమె సు ♦ ఖాస్పదమయ్యెనె? వానికో సుధీ! ౪౨౬

ఉ॥ సోమునకై చకోరములు ♦ సూచెడికైవడిఁ గృష్ణమూర్తికై
యేమును గాంచుచుంటి మతఁ ♦ డే యిటనుండినయప్డు మాకుఁ బ్రొ
ద్దేమియుఁ జాలలేదుగద! ♦ యెన్నిపనుల్ బొనరించినన్ క్షణం
బేమియుఁ బోవఁజాల దిది ♦ యే గ్రహచారమొ కాని యుద్ధవా! ౪౨౭

ఉ॥ ఈవఱ కాంజనేయుఁ డటు ♦ లేగి యయోనిజ స్వస్థఁ జేసెనో
నీవటువచ్చి నెమ్మదిని ♦ నెమ్మదిఁ గూర్చితి విప్డు వానికై
ధీవర! యెట్లొ యుండనుక ♦ దేహము నిల్పితి మింక దీని మే
మేవిధి నాపలేము వెస ♦ నేగి మఱిన్ హరితోడ రమ్మిటుల్. ౪౨౮

తే॥ ఇదుగొ వచ్చితినని మాకు♦నెంతొ యాశ, పెట్టి నిజమోహధన మిట♦విడిచిపెట్టి
మధురకేగి తాఁ బలికిన♦మాటఁ దప్పి, చెలఁగు నతని జాబిది విశ్వ♦సించు టెట్లు?

ఉద్ధవుండు రాధా గోపికల నూఱడించుట.

తే॥ కాన దయయుంచి తప్పక♦కమలనాభుఁ, దోడుకొని యిచ్చటికి రమ్ము♦తొందరగనె
యని వచింపఁగ నుద్ధవుం♦డాలకించి, యాశ్వసించి యారాధకు♦ననియె నిట్లు.

తే॥ భగవతీ! భగవంతుఁడు♦స్వల్పకాల, ముననె వచ్చును లేనిచోఁ♦బూని నేను
మీయవస్థల నేఁ జెప్పి స♦మీరగతిని, హరిని దోడ్కొని వచ్చెద♦నమ్మ! నమ్ము.

తే॥ అని శపథముగఁ బల్కఁగా♦నామె యలరి, ఛత్రచామరాందోళికా♦చంద్రదత్త
చంద్రకాంతియుగసహస్ర♦చారుపత్ర, భాసురారవిందయుగముల్♦బరగ నిచ్చి.

ఆ॥ శంఖు[illegible] ♦ చక్రి నారించిన, మణి నొసంగి వక్ష్య ♦ మాణవిధిని
పలికె [illegible]! ♦ వైకుంఠునకు మాకు, సంఘటనము నీవు ♦ సల్పుమయ్య!

క॥ శాశ్వత నిర్గుణ భక్తియు, నైశ్వర్యము జ్ఞాన సుఖము ♦ లాయువు గలుగన్
విశ్వజనీనుఁడవై యీ, విశ్వమునన్ బ్రతుకుమయ్య! ♦ విశ్వాస్యసుధీ! ౮౩౫
ఆ॥ అంత వ్రేతలెల్ల ♦ రాభరణంబుల, నిడిరి వాని నింది ♦ రేశసఖుఁడు
గొనియె రాధికయు ము♦కుందసఖోక్తుల, నరుసమొందెఁ బిదప♦నాపగవియు.
ఉ॥ ఆయమ యానతిం గొనుచు ♦ నందలి కొల్వునఁ జేరి గద్దెపై
హాయిగఁ గూరుచుండెను వ్ర♦జాంగన లంతట మెల్లమెల్లఁగా
నాయనఁ జుట్టుముట్టి యిటు ♦ లడ్గిరి మధ్రియతుల్యవిగ్రహా!
యీ యరవిందనేత్రుఁ డెటు ♦ లాడెనొ మాకిపు డీవు దెల్పుమా! ౮౩౬
చ॥ అనవుడు నుద్ధవుండు వలు ♦ కాడఁ దొడంగె నిటుల్ లతాంగులా
ర! నను దదబ్జనేత్రుఁడు క ♦ రంబున నొంటిగఁ బిల్చి మిమ్ములన్
మనమున నెంచి కన్గవను ♦ మాటికి మాటికి నీరునించు చి
ట్లనియె వినందొడంగుఁ డిక ♦ నవ్వి వచించెద సక్రమంబుగన్. ౮౩౭
చ॥ గొనములయందు మానసము ♦ గూర్చినచో భవబంధనంబునన్
దనరుచునుండు నయ్యదియె ♦ తత్పరమాత్మను లీనమైన ము
క్తిని గను నట్టి రెంటికి న ♦ దే ఘనకారణమయ్యెఁ గానఁ ద
న్మనము జయించి కామముల ♦ మాని చరింపఁగ నాను భూస్థలిన్. ౮౩౮
తే॥ ఎవరు నన్ను బ్రహ్మంబుగ ♦ నెల్లచోట్లు,లందు నున్నవానిగను న ♦ ధ్యాత్మవిద్య
నెఱుఁగుచుందురో యాఘను♦లెడఁదఁ జెలఁగు,కలుష భావంబుఁ ద్రోతురో♦ కాంతలార!
ఆ॥ కన్ను లెంతవఱకు ♦ ఘనము తనుస్థితం, బగ్గమగుచు నుండు ♦ నంతవఱకు
నర్కుఁ జూడఁజాల♦నటు జనుఁడున్ మాయ,నదలనంతనఱుకుఁ♦బరము గనఁడు.
తే॥ స్థూలమార్గమునం జూడ ♦ దూరగుఁడను, గాని తత్త్వపథంబునఁ ♦ గాంచ గాన
మన సమాగమమందున♦మడఁతులార!, సాధనముగ నా విరహంబు♦సల్పు డనుఁడు.
తే॥ అట్లు సల్పిన సాంఖ్యయో♦గాదివిధుల, సంభవించు నా కూడిక♦సత్వరమున
మీకుఁ జేకూరఁగలదని♦మెలఁతలార!, భావమున నమ్ముఁడని మీకుఁ♦బల్కమనిమె.

గోపికాగీతలు.

తే॥ అవల గోలోకవాసిను♦లాతని కని, రిట్లు ప్రియులను విడి కృష్ణుఁ♦డిచటనుండి
యితరదేశమునకుఁ బోయి♦యెదొ లిఖంచె, దలఁప నిద్ది నిర్మోహతా♦బలము గాదె?
తే॥ మఱియు ద్వారపాలికలును♦మాటలాడి,రిట్లు ప్రేమించు మము వీడి♦కృష్ణుఁ డేగె
భాస్కరాంబుదాబ్దేందువుల్ ♦ పద్మచాత,కాళిచాకోరముల వీడి ♦ యరిగినట్లు.
తే॥ అవల శృంగారకారిక♦లాడిరిట్లు, నెలకు వెన్నెలపులుఁగు నె♦చ్చెలియగాదె
యేల దానికి శశిరశ్మి ♦ కీలయయ్యె?, ధాత వ్రాసిన వ్రాతలు ♦ దప్పవయ్య!
ఉ॥ కయ్యను వేయు తొయ్యలులు ♦ చక్కఁగఁ బల్కి రిటుల్ మృగంబులన్
వ్రయ్యఁగఁ గొట్టి కాల్కొలఁదిఁ ♦ బాఱిన బోయవలెన్ జనార్దనుం

డిమ్మోడ నోరచూపులను ♦ నెంతయు మమ్ములఁ గొట్టి యేడకో
చయ్యన నేగి క్రమ్మఱను ♦ స్వాంతమునందుఁ దలంపఁ డుద్ధవా! ४४८

తే॥ అవల పార్షద లని రిటు ♦ లంబుజాక్ష!
విరహబాధలు గడు మాకె ♦ వేద్యములగు
నొకని యంజను జీకుము ♦ ల్లొత్తుకొనఁగ
మఱియొకండు తద్బాధల ♦ నెఱుఁగఁ గలఁడె? ४४౯

మ॥ ఘనబృందావనపాలికామణు లిటుల్ ♦ కారుణ్యభావంబుతో
నని రే హేతువులేని ప్రేమ మహిమ ♦ త్మారామాది పొందుఁ సుమీ
సనిమిత్తుంకు గ్రహింపలేఁ డది రసా ♦ స్వాద్యామ్లతిక్తాదులఁ
గనఁగా శక్తము లౌనె? చేతులు గనుల్ ♦ కర్ణాదులో యుద్ధవా! ४४౯

తే॥ గోవర్ధన వాసినుల్ ♦ గూడి యిట్లు, పలికి రల విలాసవతుల ♦ వలచి వారి
కొడయుఁడై నట్టి శ్రీకృష్ణుఁ ♦ డున్నతాద్రిఁ, జెలఁగు మమ్మేలచూచు నెం ♦ దులకుఁదలఁచు?

తే॥ అంతఁ గుంజవిథాయిక ♦ లాడి రిట్లు, లతులమాధవీకుంజపుం ♦ జాంతరములఁ
గృష్ణవిరహగాథలె యాల ♦ కింపఁబడెడిఁ, బ్రస్తుతంబున మాధవ ♦ ప్రాణమిత్ర!

చ॥ మఱియు నికుంజవాసిను ల ♦ మందగతిఁ బలుకాడి రిట్టు లా
వరయమునాధునీతటిని ♦ భాసిలుచుండెడి బృందకాటవిఁ
వఱలు కదంబవృక్షముల ♦ పార్శ్వమునఁ విహరించు నా మనో
హరు సురభీవృతుఁ సబలు ♦ నాహరిఁ బొందుట యెప్పుడోగదా. ४౫౧

మ॥ యమునాయూథము లంతవచ్చి యిటు ప ♦ ల్కాడెఁ హృషీకేశసం
గము కుబ్జాదుల కిట్లు లీవినమునఁ ♦ గాఁజాలె నట్లే భవి
ష్యమునం దీ మనకుఁ ఘటించు సతులా ♦ రా! నమ్ముఁడీ మీరు భా
వమునందుఁ దిరమే జయాపజయముల్ ♦ భావింప నే మేటికిఁ? ४౫3

చ॥ గిరగిరగిరగిరగిర ♦ గిరనఁ గాలము, చక్రముం బలెఁ
దిరుగుచునుండుఁ గాదె సుద ♦ తీమణులార! సుఖీరు లాత్మలోఁ
గరముగఁ గష్టసౌఖ్యములు ♦ గావటికుండల టంచు నెంచి సం
బరమున నుంద్రు చింతవిడి ♦ పాపుఁడి! నెమ్మదినుండి తాపముఁ. ४౫४

మ॥ కరుణాశూన్యుఁడు భారతీవిభుఁడు త ♦ త్కార్మానుసారంబు స్థా
వరముల్ జంగమముల్ సృజించి యొకచో ♦ బాధల్ సుఖం బొక్కచో
వఱలం జేసి క్షణాన కొక్క రహిగా ♦ బాలుంకు క్రీడించి సం
బరముం జెందినలీలఁ బొందు ముదముఁ ♦ బద్మాక్షులారా! కటా! ४౫౫

వ॥ తత్కారణంబుననేకదా కురూపిణియు, దాసీకులసంభూతయు, దుష్ట
పరిచారికయు నగు కుబ్జ సురూపిణియై కులీనయై పరమేశ్వరప్రాణసఖియై విరాజిల్లి

తన యిష్టసిద్ధియైనదని దుందుభితోఁ జాటింప సమర్థురాలయ్యె నన్న వాకొనె నంత
విరజాయూథంబు లేతెంచి యిట్లనియె. ౪౫౬

ఉ॥ ఎవ్వనికైన సంతతము ♦ నింతులకూడిక యుండ దెప్పుడుం
జవ్వన ముండ దెప్పుడు వ ♦ సంతుఁడు నుండఁడు స్వర్గపాలనం
బవ్విబుధేంద్రుఁడే యనిశ ♦ మక్కఱ సల్పఁడు నాల్గుప్రొద్దు లి
ట్లివ్విధిగాని మీర్గడపుఁ ♦ డీ! మనకష్టము దీరిపోయెడిన్.   ౪౫౭

మ॥ లలితాయూథము లేగుదెంచుచు నిటు ♦ లాప్రక్రుచ్చె రామాభిషే
కలసత్కాలమునందు మంథర యనం ♦ గా నుండు కైకేయితో
త్తు లఘిష్ఠాత్మ తదుత్సవంబునకుఁ బ్ర ♦ త్యూహంబు గల్గించె ము
న్నలతొత్తే తగఁ గుబ్జ నాగ నది హా ♦ యం దేకృతుల్ జేయునో?   ౪౫౮

చ॥ మఱియు విశాఖయూథము స ♦ మంజస ఫక్కిని నిట్లుపల్కె నా
మురళి ముఖంబునం దలర ♦ భూషణముల్ మెయివెల్గ వేత్రముం
గరమునఁ బట్టి గోవులను ♦ గాచి స్వపట్టణ మేగఁ దోడిబా
లుర లలిఁ బిల్చు కుర్దన వి ♦ లోలు హరిన్ మఱువంగలేమహా!   ౪౫౯

శా॥ మాయాయూథము లిట్లుపల్కె నిఱుకౌ ♦ మార్గంబులన్ బల్మిచే
నా యాభీరసతీపటంబులను భీ ♦ హర్షంబులన్ గొంచు వే
స్వీయోరస్థ్సలమందు నుంచుకొని యా ♦ శ్లేషించి పోనెంచు దై
తేయారిన్ హరి నప్డు గీములకుఁ బ్రీ ♦ తిన్ మేము దోడ్తెత్తుమో.   ౪౬౦

తే॥ అష్టసఖులును నని రిట్టు ♦ లంగ సుంద,రుఁడును గోకులవిభుకుమా ♦ రుఁడును నైన
హరినిఁ జూచిన యాకన్ను ♦ లతని విడిచి,యవనిఁ గననొల్ల వని శౌరి ♦ కనుము ధీర!

ఆ॥ అష్ట షోడశసఖు ♦ లాడిరి బృందావ,నమునఁ జక్రి వేణు ♦ నాదసుధను
జవిని గొన్న యట్టి ♦ శ్రవణ యుగ్మము విశ్వ,గీతుల విన నిచ్ఛ ♦ గింపదయ్య!

వ॥ అంత ద్వాత్రింశత్కాంత లేతెంచి యిట్లనిరి.   ౪౬౩

సీ॥ గురుఁడు కోపించినన్ ♦ గోటి దండంబులన్, బెట్టి యావిబుధు మె ♦ ప్పింపవచ్చు
శాపఁ దుర్గుండైనఁ ♦ బరమాన్నముం బెట్టి, ప్రీత్యుక్తి నతని మె ♦ ప్పింపవచ్చు
రసికుండు గనలినన్ ♦ రసముల నెల్లఁ జూ,పించి యాసరసు మె ♦ ప్పింపవచ్చు
బిసినారి గినిసినన్ ♦ విడిముడిఁ గడుఁగడు, నిడి యట్టివాని మె ♦ ప్పింపవచ్చు

తే॥ స్నేహితుం డాగ్రహించిన ♦ నిర్మలమగు,ప్రియ మొనర్చి యవ్వాని మె ♦ ప్పింపవచ్చుఁ
నెదిరి యెదిరినన్ లొంగి మె ♦ ప్పింపవచ్చుఁ,గాని నిర్మోహు మెప్పింపఁ ♦ గలడెఁ విధియు.

చ॥ ఘుతి శ్రుతిరూప లిట్లని ర ♦ మాయికవృత్తి గుణాశ్రయంబునన్
ధరకు నిదానమయ్యె నది ♦ తన్మహదింద్రియ దేవతౌఘముల్

సార వెట జాగ్రదాదులకు ♦ సుంతయు హేతువుకాదొ యేది యా
హరిమయ తేజముం గొలుతు ♦ మగ్నిఁ గృశానుకణంబు లట్లుగన్. ౪౬౭

చ॥ అవల ఋషిస్వరూపిణులు ♦ నాడి రిటుల్ మునియోగిదుర్లభుం
డెవఁడొ సమస్త వేదముల ♦ కెట్లును జిక్కని వాఁ డెవండొ మా
య విడిచి మేటియౌ నెవఁడొ ♦ యాద్యుఁ డెవండొ ప్రపూర్ణుఁ డెవ్వఁడో
యెవఁడు పరేశ్వరుండొ యల ♦ కృష్ణున కియ్యవె జోతముల్ సుమీ. ౪౬౮

తే॥ అమరసతు లిట్లు పల్కి రం ♦ శాంశకాంశ,పూర్ణ సత్కళావేశసం♦పూర్ణ నామ
మద్విధావతారము లెత్తి♦సంభవస్థితిలయకారకుఁడొ హరిఁ♦గొలుతు మిపుడు.

ఆ॥ యజ్ఞసీతలిటు ♦ లని రిట్టి హరి గాదె, లోకనాయకుండు ♦ గోకులపతి
రాసరంగవిభుఁడు♦రాధికాహృత్కంఠ, భూషణుండు నగుచు♦మురియుచుండు.

మ॥ పరమప్రీతి వచించి రి ట్లల రమా ♦ వైకుంఠకాంతామణుల్
ధరణిక్షేమముఁగోరి యాదవులలో ♦ దైవాతె యాభీరసుం
దరులన్ గూడి నిజాంఘ్రిఘూళులను బృం ♦ దాభూమి గోవర్ధనో
ద్ధరశైలంబుల వెల్గఁజేయు హరి కీ ♦ దోసిళ్ళు కృష్ణప్రియా! ౪౬౯

చ॥ మఱి దెలిదీవిలోఁ జెలఁగు ♦ మానిను లిట్టులఁ బల్కి రర్భకుం
డరిగి శిలీంద్రధమున్ బెఱికి ♦ నట్లు గజంబు స్వపుష్కరానఁ బు
ష్కరమును ద్రుంచు మాడ్కి బలు ♦ గండరగండలు మోయలేని య
గ్గిరి నొక కేల నెత్తి తగు ♦ కృష్ణు నెదన్ మరువంగలే దహా! ౪౭౦

తే॥ చేరి యూర్ధ్వవైకుంఠవా ♦ సిను లని రిటు
నలుపుతో వెల్గు మాకనుల్ ♦ నలుపు గలుగు
నిలను గనుఁగదా ద్వైతమే ♦ యెఱుఁగనట్టి
మాకు యోగాదు లేలకో? ♦ మాధవాస్త! ౪౭౧

తే॥ అని రిటుల్ లోకగిరిసతుల్ ♦ హరిని విడువ
లేక ప్రేమపాశంబును ♦ వీఁకఁ ద్రెంప
మైతి మాతండొ యహిపాశ ♦ మండజపతి
నఱికినటుఁ ద్రుటి నద్దాని ♦ నఱికి యరిగె. ౪౭౨

తే॥ అజితపాదాశ్రితాంగన ♦ లాడి రిట్లు, పద్మలగ్నాళి దమ్మికై ♦ పదిదెసలను
దిరిగి కననట్లు మావి శ్రీ ♦ హరివిలగ్న,దృష్టులా హరికై చని ♦ యెఱుఁగకుండె.

చ॥ ఉసులుగ శ్రీసతీసఖులు ♦ నొయ్యన వచ్చి వచించి రిట్టులన్
బిసినితనంబునన్ యశము ♦ వీడును గోపముచేత యోగ్యతల్
వెసఁ జనుచుండు దంభమున ♦ వృద్ధిని జెందిన మైత్రి పాడగున్
వ్యసనములన్ ధనంబు వ్యయ ♦ మౌను గదా జనపాళికో సుధీ! ౪౭౪

చ॥ అనిరిటు మైథిలాంగన ల ♦ హా! యెవఁడేని ధరాతలంబునన్
ధనము నొసంగి దేహము య ♦ థావిధిఁ గాచుకొనంగ నౌను ద
త్తనువున మానరక్షణము ♦ దద్దయుఁ జేసికొనంగ నౌను ద
ద్ధనతనుమానరక్షలిడి ♦ తప్పక మిత్రునిఁ బ్రోవనౌఁ గదా. ౪౭౫

ఉ॥ తిన్నఁగఁ గోసలాబలలు ♦ దియ్యని పల్కుల నాడి రిట్టులో
యన్న! యెవండు మాదు విర ♦ హవ్యథఁ గాంచఁగలండు? దైవమా!
యెన్నఁడు మారుఘోరశిఖు ♦ లీ హృది నాటుట మానునో మఱిం
కెన్నఁడు వెన్నునిం గలిసి ♦ యేము సుఖంతుమొ సంతసంబునన్? ౪౭౬

వ॥ అంత నయోధ్యావాసిను లేతెంచి తమ విభుం గూర్చి యిట్లనిరి. ౪౭౭

చ॥ తొలుత నిరాశఁ గూర్చి తమి ♦ తో వడిగాఁ జనుదెంచి మాకు నా
శలఁ గడుఁబెట్టి వీడ్కొని వె ♦ సన్ మధురాపురి కేగి రాక యీ
లలిఁ దనవైన యోగకుశ ♦ లంబులు గల్గిన జాబు లిట్లు మా
నెలవుల కంపెఁ జూడ నిది ♦ నిష్క్రియ వృత్తముగాదె వింతగన్. ౪౭౮

వ॥ అంత పుళిందమందయాన లరుగుదెంచి యిట్లనిరి. ౪౭౯

ఉ॥ ఇంతకు మున్ను శూర్పణఖ ♦ యేగి వనంబున కీమహాత్మునిన్
గాంతునిగా వరింపఁ దను ♦ గన్గొని తమ్మునిచేతఁ గర్ణనా
సాంతము దాఁకఁ గోయునటు ♦ లాస్థను సల్పెను నట్టివానికీ
యంతరమందు మాయెడల ♦ నక్కటికం బెటువచ్చు? నుద్ధవా! ౪౮౦

ఉ॥ జాలిగఁ బల్కురా సుతల ♦ సాధ్వు లిటుల్ మన శౌరి విప్రురూ
పోలిగఁ దాల్చి మోసమున ♦ నుర్వరఁ గైకొని తిన్నయింటిలో
దూలము లూడఁబీకు నరు ♦ తో జతయాచు వదాన్యుఁడౌ బలిన్
జాలఁగఁ గొట్టి మట్టె నల ♦ చక్రికి నేమి యొనర్ప నేమగున్? ౪౮౧

వ॥ పిమ్మట జాలంధరీ మణు లేతెంచి యిట్లు వాక్రుచ్చిరి. ౪౮౨

ఉ॥ ఈ దనుజాంతకున్ మదిని ♦ నెంతయు నమ్మట బట్టికాదె ప్ర
హ్లాదుఁడు సర్వకష్టముల ♦ నంది మనోవ్యథఁ బొంది కోర నీ
శ్రీదయితుండు నెమ్మదిగఁ ♦ జేరక భీకరమైనరూపుతో
నాదట వెళ్గెఁ దొల్త నిపు ♦ డట్టి కఠోరుఁడు ప్రోచు మమ్మెటుల్? ౪౮౩

ఉ॥ పిమ్మటఁ బల్కి రిట్లు పృథి ♦ వీవనితల్ మది నొంచు పెట్టి వా
క్యమ్ములు వేఱుగాఁ బలికి ♦ యాచరణంబున లాఁతిరీతిఁ గా
ర్యమ్ములఁ జేయు పూరుషుని ♦ దౌ నడతన్ బరమేశ్వరుండు లే
శమ్ము నెఱుంగ లేఁడె? యిఁక ♦ శక్తులమే? మన మింద నుద్ధవా! ౪౮౪

తే॥ అవల బర్హిష్మతీసతు ♦ లాడి రిట్లు
ప్రలయమందున దయను వ ♦ రాహజన్మ
మెత్తి యిలఁ బ్రోచి తొల్తొల్తఁ ♦ బృథువిభుఁడయి
యిలను బాలించె నాఘనుఁ ♦ డితఁడ కాఁడె? ౪౮౬

ఉ॥ అంత లతాంగనల్ నుడివి ♦ రాష్ట నిటుల్ సుధఁ జేతఁగొంచు ధ
న్వంతరి నాగ వే వెడలి ♦ వైరమొనర్చు సురాసురాళి న
త్యంతము గాంచి వేల్పులకె ♦ యా యమృతం బిడి రాక్షసాళికిన్
గాంతగఁ దోఁచి మోహ మధి ♦ కంబుగఁ గూర్చిన వాఁ డితండెకా! ౪౮౭

తే॥ అవల నాగేంద్ర కన్యక ♦ లాడిరిట్లు, పతిగ నీహరిం గోరి శూ ♦ ర్పణఖ సనఁగఁ
గరుణ విడిచి కురూపిణి ♦ గాగ సల్పె, నామె యంత కీ డితని కే♦మాచరించె?

చ। మఱియు సముద్రకన్య లను ♦ మానము మాని వచించి రిట్టులన్
నరులకుఁ గల్మిలేముల తృ ♦ ణంబున కొక్కవిధానఁ గూర్చి బల్
హరుసము దుఃఖముల్ గొలిపి ♦ యాఱడిగాఁ దిరుగాడు భార్గవీ
వరసతిఁ గొన్న పూతఁ డెటు ♦ బాదుకొనం గలఁడింపుఁ బూత్రిగాన్? ౪౮౮

చ॥ పదపడి యప్సరోంగనలు ♦ వల్కిరిటుల్ మును పీ ఘనుండు లక్
ముదమున గన్నఁ శూర్పణఖ ♦ ముక్కుచెవుల్ దెగఁగోసెగాదె? యీ
యదనునఁ గోరు మమ్ములను ♦ నట్టులఁ గోయక పీడ దీనికై
మదుల నుతించి వానికి న ♦ మస్కృతులన్ బొనరింతు మెన్నియేన్. ౪౮౯

ఉ॥ దివ్య లనం దొడంగి రిటు ♦ దేవవిభుండగు నీమహాత్ముఁడా
దివ్యచరిత్రుఁడౌ బలికి ♦ దేవపదంబు నొసంగ నెంచి స
త్సేవ్యనిజాంఘ్రితో నదిమి ♦ చిత్రవిధిన్ సుతలానఁ జేర్చె నా
భవ్యచరిత్రు కృత్యములు ♦ వల్కఁగ శక్యమె? ధాతతాతకున్. ౪౯౦

ఉ॥ దంభము వీడి పల్కిరిటు ♦ తాల్మి నదివ్యలు భార్యతోడ స్వా
యంభువు శాంతిగల్గి తప ♦ మక్కఱి సల్పెడివేళ విఘ్నముల్
సంభవిలంగఁ జేసెడి ని ♦ శాటుల నూటిగఁ గొట్టి వాని నీ
జంభవిభేదితమ్ముఁడొగి ♦ సాకఁడె? మమ్మిపు డట్లు ప్రోవఁడే. ౪౯౧

తే॥ పలికి రిట్టుల సత్త్వవృ♦త్తలగు సుదతు, లెన్నియిడుములువచ్చినన్♦దన్నుఁగొలుచు
నట్టి ప్రహ్లాదునిన్ ప్రభు♦నధికదయను, బ్రోవఁడే యితఁడటు మమ్ముఁ♦గావఁడొక్కొ?

తే॥ మఱి రజోవృత్త కాంత లీ♦సరణి నాడి, రల హరిశ్చంద్ర రుక్మాంగ♦దాంబరీష
లను బరీక్షించి సౌఖ్యంబు♦లను ఘటించి,నట్టి యితఁడట్లు మముఁగని♦యలర జేయు

తే॥ అంతటన్ దమోవృత్తలు♦నాడి రిట్టు,లిట్టి మాయావి మిషనె యి♦క్కట్టులొంది
సుఖము గన్న బృందా బలి♦క్షోణినాథ,కుబ్జలను బోలి సుఖములఁ♦గనమొ? మనము.

చ॥ కసికరమన్న నీ హరిదె ♦ కాంచుమి ? యొక్కడెసన్ గృపాణియై
పేనఁటుల రూపుమాపు చోళ ♦ చెంతను నేగు త్రివక్రయైన కు
బ్జను గని నిర్నిమిత్తపయఁ ♦ బట్టి త్రిభంగులఁ జక్కఁజేసి దా
నిని గొనెఁ గాదె యా యితఁడు ♦ నిర్దయఁ ద్రోయునె ? మమ్ము నిమ్మెయిన్.

తే॥ చూప అవ్వామనాంఘ్రిఁ ♦ ఋషిప్రావ, సమయమ్ముం గనసట్టుల ♦ శౌరి రాక
కవధి దోఁపదు మాయెన ♦ లందు నిపుడు, కన్నులార నెప్పుడు వానిఁ ♦ గాంచఁగలము ?

ఉ॥ అమ్మక చెల్ల ! యట్టి హరి ♦ యా కరుణాకరుఁ డింద లేమి మా
నెమ్మది నిమ్మళంబుగను ♦ నిల్వదె ! దేహము పాలిపోయెనే !
యమ్మయ మయ్యెనే కనులు ! ♦ హస్తము లాడవె ! నోర్మెదల్పదే !
సొమ్ములు భారమయ్యె ! నిటు ♦ చూడుము ! యేమి యొనర్పమందువో ? ౯౮

సీ॥ గోపాలకులతోడఁ ♦ గూడి క్రీడించెడి, కృష్ణు నే మెప్పు డీ ♦ క్షింపఁగలము ?
బృందావనమున గో ♦ బృందంబుఁ గాచెడి, కృష్ణు నే మెప్పు డీ ♦ క్షింపఁగలము ?
తల్లిదండ్రుల కెంతో ♦ యుల్లాసముం గూర్చు, కృష్ణు నే మెప్పు డీ ♦ క్షింపఁగలము ?
రాధికాచరిత్ర ప ♦ సాధనములఁ బొందు, కృష్ణు నే మెప్పు డీ ♦ క్షింపఁగలము ?

తే॥ మోహనాంగుని లోకని ♦ ర్వాహపటు సుశీలు భూపాలు భక్తాల ♦ వాలు బాలు
జిష్ణుఁ బ్రభవిష్ణు రోచిష్ణు ! ♦ విష్ణుఁ గృష్ణుఁ, దృష్ణదీఱ నే మెప్పు డీ ♦ క్షింపఁగలము ?

తే॥ ప్రేమ కోలఁది నిట్లు గో ♦ పికలు మిగులఁ, గృష్ణుఁ జింతించి చింతించి ♦ యొట్టకేల
కిలను వ్రాలిరి దేహంబు ♦ లెఱుఁగనట్లు, మైథిలేశ్వర ! బహులాశ్వ ! ♦ మఱియు వినుము !

## ఉద్ధవుండు గోకులంబునుండి మధురకు వచ్చుట.

వ॥ అంత నుద్ధవుం డట్లు మూర్ఛితలై పడియున్న రాధాగోపికలం జూచి విచారించి వేఱువేఱుగా సంబోధించి నయవినయభయవచనంబులతో నోదార్చి ప్రత్యుత్తరంబును వ్రాసి యిమ్మని రాధాదేవినిం బ్రార్థింప నాదేవి లేఖినిం గైకొని మషిని ముంచి కమ్మపై వ్రాయఁబోవులోన నశ్రుజలంబులు కనులనుండి జలజల రాలఁదత్కాకలం బార్ద్రీకృతంబయ్యె. ఇట్లు పన్నపత్రంబులం దెచ్చి వ్రాయ మొదలిడినను నన్నియుఁ గన్నీటం దడిసి వ్యర్థంబులగుట నుద్ధవుం డుపలక్షించి

క॥ అమ్మా ! శోకింపకుమా !, కమ్మ నెటుల వ్రాయఁగలవు ♦ కన్నీరొల్కన్
నమ్ముమ ! నామాటల నీ, విమ్మెయి నాజోతలను గ్ర ♦ హింపుము ! తల్లీ ! ౧౦౧

క॥ అని పలికి గోపికార్చలఁ, గొని యా రాధికను వీడు ♦ కొని యా సాయం
బున రథమెక్కి వ్రజాధిప, ఘనగృహమున కేగి వసతిఁ ♦ గావించి నిశన్. ౧౦౨

క॥ అరుణోదయకాలమునన్, హరిఁ బొగడుచు మేలుకాంచి ♦ యభివాదనముల్
శిరమున నంద యశోదల, కరుసము గలుగంగఁ జేసి ♦ యనుమతిగొనియున్.

సీ॥ నందోపనందుల ♦ మందిరంబులకును, వృషభానుల ♦ సదనములకు
నరిగి వారికి మ్రొక్కి ♦ యనుమతిం గొని యచ్యుతసఖులైనట్టి శ్రీ ♦ దామముఖుల
కేగివత్తు నటంచు ♦ నెఱిగించి గోకుల, వాసులకుం జెప్పి ♦ వారు వనుపఁ
జక్కని తేరెక్కి ♦ సకలకళాకర, మధురాపురమున క ♦ మందగతిని

తే॥ జేరి యమునాధునీమణీ ♦ తీరమందు, నలరు నక్షయ వటమూల ♦ మందు నొంటి
గా వసించిన కృష్ణు ముం ♦ గలకుఁ బోయి, సలిపి సాష్టాంగనతుల నం ♦ జలిఘటించి.

మందాక్రాంతవృత్తము.

లోకాధారా! నిగమనిలయా! ♦ లోకరాజా! మహేశా!
లోకస్తుత్యా! సకలవరదా! ♦ లోభరాగాదిశూన్యా!
రాకాపూర్ణేందురుచిరరుచీ! ♦ రాధికాప్రాణనాథా!
శ్రీకృష్ణా! యాదవకులమణీ ♦ చిన్మయా! సత్యరూపా! ౧౦౫

మ॥ భవదాజ్ఞన్ గొని గోకులంబుఁ జని మీ ♦ పత్రంబులన్ మీ విరా
ళి వెతన్ గుందెడి ప్రేలకున్ జెలులకున్ ♦ లీలావతీపంక్తికిన్
శివముం జెప్పి యొసంగి ప్రేముడిని ద ♦ చ్చింతల్ త్యజింపంగఁ బ
ల్కి వడిన్ గ్రమ్మఱి యేగుదెంచితిని గే ♦ లీలోల! లోకేశ్వరా! ౧౦౬

తే॥ కాని నీవిరహంబునఁ ♦ గష్టపడెడి, ప్రేతలన్ జూచి తాళక ♦ వేగిరముగ
హరిని దోడ్కొని యిచ్చట ♦ కరుగుదెంతు,నంచు వాగ్దానమిచ్చితి ♦ నందువలన.

తే॥ ల్ల యంబరీష విభీష ♦ ణాది భక్తు, లందు నను నొక్కనిగ జేసి ♦ యట్టి నాదు
పలుకు సఫలంబుఁ జేయ గో ♦ కులమున కిపు, డరుగుదెంచుము నాతోడ ♦ నంబుజాక్ష!

శ్రీకృష్ణుం డుద్ధవ సహితంబుగా గోకులంబున కరుగుట.

క॥ అని పలు తెఱఁగుల వేడఁగ, విని కృష్ణుఁడు గోకులముఁ బ్ర ♦ వేశించుటకున్
మనమునఁ దలంచి మధురను, నొనరుపఁ దగు పనులఁ దెల్పి ♦ యుంచి ముసలినిన్

ఆ॥ ఉద్ధవాన్వితుఁడయి ♦ యురుశతాంగం బెక్కి, యేగ సాగి బాట ♦ నెసఁగు బృంద
కావనిఁ బులినముల ♦ గోవర్ధనాద్రిని, గోసహస్రములను ♦ గోల్కొఁ గాంచె.

ఉ॥ దూరమునుండి నాలు వది ♦ తోఁ జనుదెంచెడి కృష్ణచంద్రునిన్
సారెకుఁ జూచి మోములఁ దృ ♦ ణంబులు భాసిలఁ బాలు సన్నులన్
బూరితిగాఁ జెలంగి శ్రుతి ♦ పుచ్ఛములన్ బయికెత్తి వత్సముల్
గూరిమితోడఁ దోడ్కొని ము ♦ గుళ్ళల సూర్యునిఁ గప్పు చొప్పునన్. ౧౧౧

క॥ హంభా యని యఱచుచు విశ్వంభరు నరదంబుఁ జుట్ట ♦ సంతసమున నా
యంభోజాక్షుఁడు వానిని, సంభావన జేసినట్లు ♦ చఱచెను జేతన్. ౧౧౨

తే॥ అంత బసువులఁ గాచుచు ♦ నాడుచుండు, నట్టి శ్రీదామముఖు లట్టు ♦ లావు లేగి
స్యందనముఁ జుట్టియుండుట ♦ సరగఁ గాంచి, యబ్బురముఁ జెంది యొండొరు ♦ లను గొనిరిటు

ఉ॥ కనుఁడు శతాశ్వకల్పితము ♦ కాంస్యసుకల్పితరవప్రయుక్తముల్
ఘనకలశధ్వజాంచిత మ ♦ ఖండశతార్కరుచిప్రకాశితం
బు నయు సమీరవేగమునఁ ♦ బోవు రథం బెటు గోవు లడ్డగిం
చినవో సుమిత్రులార ! పరి ♦ శీలనఁ జేయుఁడి ! మాకుఁ దెల్పుఁడీ ! ౫౧౪

ఉ॥ అందునఁ గొంద ఱాడిరిటు ♦ లాబుధుఁ డెవ్వఁడొ కాని యాల కా
నందము గూర్చువాఁడని మ ♦ నంబునఁ దోఁచెడి దక్షిణాంగముల్
స్పందముఁ జెందుచుండె నల ♦ శౌరియె సర్వజనంబు మెచ్చఁగా
నిందుల కేగుదెంచెనొకో ? ♦ యీరును మేమును జూడనా నిదే. ౫౧౫

తే॥ అవల నరయంగ వారంద ♦ రట్టితేరు, దఱని డాసి శ్రీధరుఁడని ♦ యరుస మొందు
చుండఁ గని వారి ముజ్జల ♦ ములుకఁ గనుల, రథము డిగ్గి వేర్వేర భ ♦ ద్రంబు లడిగి.

మ॥ పరమప్రీతిని గౌఁగిలించుకొని సం ♦ భాషింప నవ్వారలా
యరవిందాక్షువియోగబాధ లెదలం ♦ దావృత్తుగా జ్ఞప్తికిఁ
సరిగా రా విలపింప శౌరి తమి నా ♦ శ్వాసించి గోష్ఠంబునం
దెటిఁగింపఁ దనరాక నుద్ధవుసఖుఁ ♦ హేజీబుఁ బంపెఁ జుమీ. ౫౧౬

చ॥ అనుపఁగ నట్టి యాపగవి ♦ యా హరిమిత్రులఁగూడి చయ్యనన్
జని పృథుగోకులంబునకు ♦ సంబరమందుచు నందుఁ దొట్టి వా
రిని గని మాధవాగమన ♦ రీతి వచింపఁగ వారు ప్రేమతో
విని యల కృష్ణుఁ బిల్చికొని ♦ వే యిలుఁ జేరఁగ నెంచి వెంటనే. ౫౧౭

సీ॥ భేరీమృదంగాది ♦ వివిధవాద్యములతోఁ, వారిసంపూర్ణకుం ♦ భములతోడ
విప్రప్రతతికృత ♦ వేదనాదములతోఁ, గమనీయచందనా ♦ క్షతలతోడ
వాసనావాసిత ♦ ప్రసవహారములతో, శ్రీసతీసమసువా ♦ సినులతోడ
నేత్రపర్వప్రజా ♦ నీరాజనములతో, దాసదాసీజన ♦ తతులతోడ

తే॥ శ్రీయశోమతీసతితోడఁ ♦ జిన్నవాంఁడ్ర,తోడ జయజయారవముల ♦ తోడ నుద్ధ
వాది గోపాలకులతోడ ♦ స్యందనముల,తోడ వెడలిరి చూపఱు ♦ తుష్టిపడఁగ.

తే॥ అవల వృషభానువర్యుఁ డ ♦ ర్యమునిఁ బోలి
యాలియౌ కలావతితోడ ♦ హైమశృంఖ
లాన్వితంబు సిందూర పు ♦ ష్పాంచితంబు
నైన మదకరి ముందుంచి ♦ యరుగఁ దొడఁగె. ౫౨౦

క॥ నందోపనందగోపక, బృందము వృషభానువులును ♦ వృద్ధులుఁ బ్రోడల్
సుందరగతితో బహ్వా,నందముగాఁ జనిరి నంద ♦ నందనుఁ గనఁగాఁ. ౫౨౧

చ॥ మఱియును రాధికారమణి ♦ మాధవురాక సఖుల్ వచింపఁగాఁ
గరముగ నాలకించి నవ ♦ కంజము సూర్యునిఁ జూచి వాసనల్

బరగ నొసంగినట్లు తన ♦ భర్మమయాభరణంబులన్ని యా
తరుణుల కిచ్చి యిచ్చను మ ♦ దంబును బొందెను సుప్రసన్నయై. ౧౨

తే॥ అష్టసఖులును ద్వాత్రింశ ♦ దంగనలును, షోడశాష్టేక్షణలు య ♦ శోదకొడుకు
రాక నాలించి హర్షించి ♦ రాధమనికి. కేగుదెంచిరి హరిని నీ ♦ క్షింపఁదలఁచి. ౧౩

తే॥ అంత శ్రీరాధికాదేవి ♦ యంతికమున, కరుగుదెంచిన సతులతో ♦ నలరి దివ్య
శిబిక యందెక్కి చక్రివ ♦ సించి నట్టి, స్థానమున కేగె నుచిత వే ♦ షంబుతోడ

ఆ॥ గోకులమున నుండు ♦ గోపికలందఱు, కృష్ణురాక వినుచు ♦ గృహకృత్యులకు
విడిచి యంబరములు ♦ దొడవులు దాలుచు, వడ జని రసురవి ♦ రోధిఁగాంచ

ఉ॥ పిమ్మట వాసుదేవుఁడటు ♦ బిన్నలుఁ బెద్దలు స్త్రీలుఁ బూరుషుల్
నెమ్మి వ్రజంబునుండి బహు ♦ నిస్వనముల్ సెలఁగంగ దివ్య నా
ట్యమ్ము లొనర్పఁ దన్పొగడు ♦ చెండకు వచ్చుటఁ జూచి భక్తితో
నమ్మ యశోమతీసతిని ♦ నయ్యను నందుని మ్రొక్కె నాదిలోఁ. ౧౯

వ॥ అంతఁ దద్యశోదానందులు చిరాగతుండగు తమ ముద్దుబిడ్డఁడు గన్నులారం గాంచి చేతులారం జేరం దీసి కౌఁగిటం గ్రుచ్చి మనసార జెక్కిళ్ళు నివ్వి ముద్దిడుకొని యంకంబులఁ బొంకంబుగాఁ గుదిర్చి యానందబాష్పంబులచే స్నాతుగా నొనర్చి భూషణాంబరహారంబులతో నలంకృతుం జేయ నాకత్తినెచ్చెలి మెచ్చి భూసురులకును నందోపనందవృషభానువులకును, సన్నందాదిగోపవృద్ధులకును వందనంబు లొనర్చి తత్కృతాశీర్యై నిజమిత్రులతో హస్తగ్రహణంబులం గావించి క్షేమ మూరసి పౌరదత్తపారితోషికంబులం గొని యశోదానందుల నొక్కగంధసింధురంబున నెక్కించి తా నుద్ధవసహితంబుగా నిజరథం బెక్కి నందోపనందవృషభాను గోపికాగోపయుక్తుండై నారీమణులు లాజాక్షతలు సల్లి మంగళారతులెత్తి పాడుచుండ నిలింపులు పూలవానలు గురియుచుండ జయజయశబ్దంబులు నిగుడ బ్రాహ్మణాశీర్వాదంబు లినుమడింప గోకులాంతర్యాతనందనగరంబునఁ బ్రవేశించె. అంత గోపకాంతలు సమ్ముఖమ్మున కేతెంచి ప్రాణవల్లభా! నీసుమిత్రుండగు నుద్ధవుని యనుగ్రహంబున నిన్ను సందర్శింపఁజాలితిమి. నీవేకదా మాకందఱ కాధారభూతుండవని వాక్రుచ్చిరిగాదె. బహులాశ్వా! మఱి యేమి వినవలతువో పలుకు మన నతం డా శ్రీహరి యే యే పనులం జేసి యా రాధికాదుల కానందంబు గూర్చెనో క్రమ్మఱ మధురాపురి కెమ్మాడ్కిఁ జనెనో యను విషయమ్ముల విస్తరింపఁ బ్రార్థించెద నన విని మునివరుం డాజనకున కిట్లనియె. ౧౭

తే॥ అట్లు గోకులమున నున్న ♦ యంబుజాక్షు,నర్కుఁడస్తమించెడి వేళ ♦ యందు రాధ
పిలువ నా వలమురితొల్పు ♦ వెడలి కదళి,వనమునకు వచ్చెఁ బ్రముదిత ♦ స్వాంతుడగుచు.

యీవిశ్వంబునలేని రూపవతియో ♦ యేహ్యాంగియో యెట్టిదో
యీవేళ౯ గమనించి చూచెదము శ్రీ ♦ కృష్ణా! జగద్రక్షణా! ౪౮౬

క॥ అనవుడు వనమాలియు నా, పనికొప్పి పదాఱువేల ♦ పడఁతులు మఱియా
యెనమండ్రు రాణులతోమఱి, వెనుకొనఁ జనసాగె రాధ ♦ వెలఁగెడి స్థలికి౯.

ఉ॥ చక్కని పెక్కుటెక్కెములఁ ♦ జందురు రూపును బోలు డాలుల౯
మిక్కిలి మేలుకట్టులను ♦ మేలిమిబంగరుకట్టుపాటున౯
జక్కనిదై శుభంబులను ♦ సారెకుసారెకొసంగఁజాలి యా
యిక్క గుడారమొండు దగ ♦ నిట్టిదటంచు నుతింప శక్యమే. ౪౮౮

ఉ॥ అందున సౌరభంబు లఖ ♦ లాశలఁ బర్వుచునుండు మాలతీ
బృందమరందముల్ సెలఁగు ♦ భృంగములు౯ శ్రుతిపేయనాదము
ల్దందడిసల్పు ముత్తియము ♦ ల౯ దగియున్న తెరల్ పటంబులు౯
బొందికనుండుఁ బీఠికయుఁ ♦ బొల్చునుగాదె తదాసనంబున౯. ౪౮౯

సీ॥ హంసనిభంబులౌ ♦ వ్యజనంబులంబట్టి, స్వీయసఖీజనుల్ ♦ విసరుచుండ
ఛత్రచామరముల౯ ♦ వేత్రంబుఁ దాలిచి, గోపిక లటులిటుఁ ♦ గూడి తిరుగ
బాలభానునిమాడ్కి ♦ భాసిల్లుచుండెడి, కమ్మలు వీనుల౯ ♦ గ్రాలుచుండఁ
గోటిచంద్రులకును ♦ దీటగునిజదేహ, కాంతులు నల్గడల్ ♦ గ్రమ్ముచుండఁ
తే॥ గోమలాంగియుఁ దన్వియుఁ ♦ గుందరదన, కృష్ణహృతమానసయునగు♦కీర్తిపుత్రి
యొప్పి యటనుండి నడుగుల♦నెయ్యనిడుచుఁ, బువ్వవనమున కల్లనఁ♦బోవుచుండె.

ఉ॥ అత్తఱి నట్టికృష్ణసతు♦ లందరు దవ్వునఁగాంచి యాయమ౯
దత్తరణిప్రకాశమునఁ ♦ దారలు తేజము బాసినట్లుగాఁ
దత్తరుణీమణీరుచిహృ ♦ తప్రభలై నిజరూపగర్వసం
పత్తులఁబుచ్చి యొండొరులు ♦ బల్కుకొన౯ సమకట్టి రిట్టుల౯. ౪౯౧

ఉ॥ ఇట్టి మనోహరాకృతి ధ ♦ రించిన సుందరి నెందుఁజూడ మే
మెట్టుల నీయమం గుఱిచి ♦ యీవర కీహరి నోటవింటిమో
యట్టుల నిప్డు గాంచితి మ ♦ హా! యనుకొంచు స్వనాథుమార్గముం
బట్టి తదంతికంబున వి ♦ భాసిలఁబోయిరి భూప! యావల౯. ౪౯౨

తే॥ రాచకన్నెల కన్నులు ♦ రాధ నెచ్చె, లులగు వ్రేతలకనులును ♦ గలిసి చెలఁగెఁ
బట్టరాజ్ఞీసహితహరి ♦ వచ్చుటఁగని, సల్పిరాభీరమానినుల్ ♦ జయరవముల.

చ॥ మఱియును రాధికారమణి ♦ మాధవురాకను గాంచి గద్దియ౯
సరగున డిగ్గి పద్మసదృ ♦ శస్వకనేత్రముల౯ ముదశ్రువుల్
బొరిబొరి ప్రాల్చి యాతనికి ♦ బూజల సల్పి ప్రదక్షిణంబుల౯
గరముగఁజేసి స్వీయకర ♦ కంజముల౯ ముకుళించి మ్రొక్కియు౯. ౪౯౪

వ॥ స్యమంతకమణిఖచితపాదంబులను, జింతామణిమండితతటంబును, బద్మరాగభాసురమధ్యంబును, జంద్రమండలవర్తులంబును, గౌస్తుభోద్భాసితాధఃప్రదేశంబునుం గలిగి కుండలమండలమండితంబును, పీయూషప్రసవత్పారిజాతవిభ్రాజితంబును, ఛత్రచామరసమన్వితంబును, విశాలంబును నగు సింహాసనం బొసంగి యందు సమాసీనుం గావించి యానందంబు సుందరాస్యంబున నందంబు గొల్ప నిట్లనియె.

క॥ సఫలం బయ్యెను జన్మము, సఫలం బయ్యెను దపంబు ♦ సల్పిన నోముల్
సఫలం బయ్యెను ధర్మము, సఫలం బయ్యె హరి! నీవు ♦ సనుదెంచుటచేన్.

తే॥ భక్తులకు సాయపడెదవు నీ♦పై నిభక్తిఁ, జూపఁజాలని దుష్ట న♦శుద్ధబుద్ధి
నైన నన్నిప్పుడిట్టి సి♦ద్ధాశ్రమాన, గాహనము ధన్యగాఁ జేసెఁ ♦ గద! మహాత్మ!

ఉ॥ నాబల మూతగాఁ గొని ర♦ణంబున వైరుల రూపుమాపవే!
నాబలమైన కారణము♦ నన్ గిరినెత్తి వ్రజంబుఁ గావవే
నాబిగినెమ్మి గోకులము♦ నన్ విభవంబును నాకుఁ జూపవే
నాబలిమిన్ క్షణంబున మొ♦నన్ హతుఁ జేయవె శంఖచూడునిన్. ౯౯

తే॥ మఱి జగజ్జేతయౌ కంస♦మానవపతి, యడలఁడే? నీబలమున♦ కమరవిభుఁడు
గర్వమును వీడి తిరుగఁడే?♦కమలనాభ!, నీదుచరితంబు నేను వ♦ర్ణింపఁగలనె?

ఉ॥ రాసమునందు గోపిక ల♦రంబున నీదరి కేగుదెంచి సం
తోసముఁ బొంది కౌఁగిళుల♦ తో మృదుభాషలతోడ మన్నన
న్జేసి వశం బొనర్చుకొని♦ నిక్కుచునుండ మెలంగవా కొ? నీ
వీసరణిన్ బొనర్చుట మ♦హీగతనారవిడంబనం బగున్. ౧౦౦

క॥ తన విభుఁ గూరిచి యీరహి, ననుచుండెడి కీర్తిపుత్రి♦ యావల వడితోఁ
దనచెలియగు చంద్రానన, యనుమతి మన్నించె నట్టు♦ లాహరిసతులన్.

ఉ॥ భామను సత్య జాంబవతి♦ భద్రఁ గళిందకుమారి లక్ష్మణా
భామిని మిత్రవింద మఱి♦ భైష్మిని డాయుచు వేఱువేఱుగాఁ
బ్రేమను గౌఁగిలించుకొని♦ ప్రీతిపురస్సరసూక్తులాడి త
త్క్షేమ మెఱింగి స్వస్థితు ల♦తిప్రమదంబునఁ దెల్పి యొయ్యనన్ ౧౦౧

తే॥ షోడశసహస్రగోపికా♦ సుందరులను, జేరి తమితమి బుజముల నా♦శ్లేషములను
సల్పుకొని యుచితంబగు♦ సరణిఁ బలికి, సత్కరించియు మఱిఁ బల్క♦సాగె నిటుల.

ఉ॥ చందురుఁ డొక్కఁ డుద్భవిల♦ సాగినతోడ్తఁ జకోరవారము
ల్డెందడి మూఁగినట్లు కమ♦లప్రియుఁ డొక్కఁడు వచ్చినంత దృ
గ్బృందము మెందు గ్రాలినటు♦ లీభగవంతుఁ డొకండు ప్రేమతో
నిందున నొప్పుచుండ మన♦ మెల్లరముంటిమి గాదె భక్తితోన్. ౧౦౪

సీ॥ పద్మప్రభావంబు ♦ భ్రమరముఖ్యంబును, గావ్యప్రభావంబుఁ ♦ గవివరుండు
రత్నప్రభావంబు ♦ రత్నపరీక్షిత్తు, విద్యాప్రభావంబు ♦ విబుధవరుఁడు
గానప్రభావంబు ♦ గాయకశ్రేష్ఠుండు, రసమహిమంబును ♦ రసవిదుండు
నోషధీమహిమంబు ♦ నుత్తమవైద్యుండు, శిల్పచాతుర్యం బ ♦ నల్పశిల్పి
తే॥ మాత్రమెఱిఁగిన యట్టులే ♦ మరుగులేక, భక్తుఁడొక్కఁడు మాత్రమీ ♦ పరముఁడైన
కమలనాభు ప్రభావంబుఁ ♦ గాంచఁగలుగు, నంబుజేక్షణలార! యో ♦ యక్కలార!

✦ రుక్మిణి మొదలగువారు రాధను బ్రశంసించి సత్కరించుట. ✦

చ॥ అవల విదర్భరాజసుత ♦ యాయమ పల్కుల నాలకించియుఁ
సవతులఁగూడి యిట్లనియె ♦ సాధ్వరో! యో వృషభానునందినీ!
యువనిని నీవె ధన్యవని ♦ యందును నీదగుభక్తి కీరమా
ధవుఁ డిటు లొంగె నిట్టి నిను ♦ దద్జ్ఞులు మెచ్చక యూరకుందురే? ౧౦౭

తే॥ ఏమహామహుచరితంబు ♦ నెల్ల జగము, లెపుడు పొగడునో యాజగ ♦ దీశ్వరుండె
నీదుచరితంబుఁ గీర్తించు ♦ నెమ్మినెపుడు, నింతకంటెఁ గృతార్థత ♦ యేమిగలదు?

క॥ ఇమ్మాధవుఁ డెటు బల్కెనొ, యమ్మాడ్కని నిన్నుఁజూచి ♦ యలరితిమమ్మా!
యిమ్మెయి నెమ్మిని మా శిబిరమ్మున కేతెంచ మిగులఁ ♦ బ్రార్థింతుఁజుమీ!

వ॥ అని వినయమ్ముగా వాక్రుచ్చి యవలంబంబుగా సాదరంబున నిజకరార
విందం బిచ్చి శతయూథసమన్వితయగు నా రాధికాలలనాలలామమును మహాత్మ్యం
డగు శ్రీకృష్ణునితోడఁ బద్మకింజల్కవాసితంబును, సర్వతోభద్రంబును, హైమం
బును నగు నాత్మశిబిరమ్మునకుఁ దోడ్కొనివచ్చి యందు శిరీషమృదులంబగు సోప
బర్హణపర్యంకంబును వేసి యందవ్వారిని సమాసీనులం గావించి సపత్నీసహితయై
వస్త్రమాలాభరణాదులం జక్కగాఁ బూజించి గోపీశతయూథంబును సైతము వేఱు
వేఱుగా నర్చించి నిజవిభునితో సముచితంబుగా బహువిధంబులుగా సంభాషించి
నిద్రఁబుచ్చి యా కీర్తిపుత్రింగూడ నిద్రపోవం బనిచి కృష్ణభార్యలందఱు దమ
తమ గుడారంబులకుం జనిరి. అంత రుక్మిణీతరుణీమణియు నిజవాసమ్మున కేతెంచు
నట్టున శ్రీకృష్ణుండు తల్పంబునఁ మేల్కొని కూర్చుండుటం గాంచి యల్లన డాసి
దేవా! యర్ధరాత్రంబైనను నిద్రింపకుండుటకు గతంబేమో తెలుపుమని సవినయయై
వేఁడ నా భగవంతుం డిట్లనియె. ౧౦౯

చ॥ తరుణిరో! యట్టి రాధికకుఁ ♦ దత్పరతఁ విధిపద్ధతిఁ నమ
స్కరణము లర్చలుఁ నుతులు ♦ స్వాగతమిచ్చి మహోపచారముల్
బోరిఁబోరి నీవు సేసితివి ♦ వొందెను సంతస మామె కాని ని
ద్దుర తొలిఝాంను వాడుకగ ♦ దుగ్ధము గ్రోలును బ్రత్యహంబునుఁ. ౧౧౦

తే॥ అద్ది యీాదిన మిచ్చట ♦ నమరలేదు, దాన రాధిక నిద్దుర ♦ మాని గాన
నాకుసైతము స్వాపంబు ♦ రాకయుండె, నాలసింపక క్షీరంబు ♦ లామె కిమ్ము.
చ॥ అనవుడు భీష్మనందిని య ♦ హా! యటులా! యని యొప్పి వెంటనే
తనదు సపత్నులం గలిసి ♦ తక్కుటకానివి పంచదార గ
ల్పినవి మహోష్ణమైన వగు ♦ క్షీరము బంగరుగిండిఁ బోసి రా
ధను గడుపారఁ గ్రోలెడివి ♦ ధంబున నల్పి విడెం బొసంగియున్. 929
తే॥ సత్యభామాదులన్ గూడి ♦ శౌరిదరికిఁ
జని సుకృతమంచుఁ దత్పద ♦ సరసిజముల
స్వమృదుకరపల్లవంబులఁ ♦ జక్కనొత్తు
చందు బొబ్బలన్ గని యిట్టు ♦ లనియె వింత. 923
క॥ అరవిందనాభ! యేలా?, యరవిందసమానతావ ♦ కాంఘ్రియుగమునన్
బొరిఁబొరి బొబ్బలు దగె ని, త్తఱిఁ గారణమేమి చెపుమ ♦ తద్విశయమునున్.
చ॥ పలుకఁగ నిట్లు చక్రి తన ♦ పై నల రాధికకున్న ప్రేముడిన్
దెలుపఁ బ్రసన్నచిత్తుఁడయి ♦ తియ్యనిపల్కుల వేతలున్ స్వభా
ర్యలు వినుచుండ నీరహిని ♦ నాడె విదర్భనరేంద్రపుత్రికా
తిలకమ! యట్లె చెప్పెదను ♦ దిన్నగ దానిని నాలకింపుమా! 929
ఉ॥ దేవి! జగత్సను స్తసుద ♦ తీనుతజీవితరాధికాత్మరా
జీవమునన్ మదంఘ్రిసర ♦ సీరుహాయుగ్మము స్నేహాభ క్తిపా
శావృతమాచు నుండి యిసు ♦ మంతయు నీవఱున్ జలింపలే
దావృషభానుపుత్రి కెన ♦ యా నొకా? యెట్టి మహామహులందునున్. 926
తే॥ ఇట్టి సమయంబునందున ♦ నీవు రాధకిడిన పా ల్వేడియాటచే ♦ నిట్లడుగులఁ
బుట్టె బొబ్బలు గనుఁడి! పూఁ♦బోఁడులార!, యనఁగ రుక్మిణీముఖసర్వ♦వనితలు విని.
చ॥ అల వారి యడ్గుదమ్ముల మ ♦ హాద్భుతితో సరిజేసి యిల్లిదన్
దలఁచిరి చాగు రే! యహహా! ♦ తద్వ్రజనాయిక కీర్తి వశేసుపైఁ
గల తమి యింతయంచు నన ♦ గా నగునే? యెవ రీమె కీడురాఁ
గలరొకో? యద్వితీయపర ♦ గా నుతియింపఁగనౌను సర్వధా. 927
తే॥ మఱియు గోపికామణులకు ♦ మాధవుపయిఁ
గల ప్రియుం బెఱుఁగుచు వింతఁ ♦ గనులమూసి
యహహా! యని విప్పి శ్రీహరి ♦ నడిగి రిట్లు
రాసకేళులఁ గాంచు పే ♦ రాసతోడ. 92౮
మ॥ మురళీగానవినోదబద్ధసుమతీ! ♦ ముల్లోకముల్ మెచ్చ నుం
దరబృందావనమందు గోపికలతోఁ ♦ దద్రాధికాభామతో

నరుడా మాదిరి రాసముఁ సలుపవే ♦ యద్దాన వారెల్లరుఁ
జరితార్థుల్ గద తత్తపోబలము లెం ♦ చన్ శక్యమే? యేరికిన్. ౯౧౦

తే॥ కాని యీరాసకేళివి ♦ ధానచిత్ర,ములను వినుటయే కాని క ♦ న్నులకుఁబండు
వగను గాంచలే దో హరి! ♦ ప్రస్తుతిమున,నవ్వి కరుణను మాకిట ♦ నగుపఱచుమ!

క॥ కల రిట గోపికలందఱు, గలదుగదా రాధికయును ♦ గ్రమస్థలముల్
గల దన్నియు గలవీవిఁక, సలుపుమ! యీరాసకేళి ♦ సరభుల దేవా! ౯౧౧

క॥ చేర్పుమ! ప్రేతల రాధను, గూర్పుమ! తచ్చిత్రరాస ♦ కుర్దనవిధులన్
నేర్పుమ! మాకును దద్గతిఁ, దీర్పుమ! మాకోర్కి సర్వ ♦ దేవస్తుత్యా! ౯౧౩

ఉ॥ రాసముఁజేయ నీయువస ♦ రం బుచితంబని చెప్పుచుంటిమో
శ్రీసుదతీప్రియా! యనఁగ ♦ శ్రీహరియున్ ముదమంది పల్కెనీ
ట్లో సతులార! మీమొదల ♦ నున్నతలంపులు మంచి విన్వి యీ
రాసవిధాననాయిక క ♦ రంబుగ నొప్పిన చో ఫలించుఁగా. ౯౧౪

ఉ॥ కావున రాధికామనము ♦ గట్టిగ వేఁడి ప్రసన్నమానటుల్
దేవిగసల్పుఁ డత్తటిఁ గ ♦ డింది గనయ్యెడి రాసకేళు లో
భూవరపుత్రులార! యన ♦ ముచ్చటఁజెంది తదష్టభార్యలా
శ్రీవృషభానుపుత్రికను ♦ జేరిరి సూచిరి గోరి రీకిహిన్. ౯౧౫

శా॥ తల్లీ! భక్తసమూహరక్షణపరా! ♦ తద్రాసరంగేశ్వరీ!
ఫుల్లాబ్జాక్షి! పరేశ్వరీ! భగవతీ! ♦ పూర్ణేందుబింబాననా!
యుల్లాసాన్వితగోపికాజనమణీ! ♦ యుక్తాంగి! కీర్త్యాత్మజా!
యుల్లం బారఁగ మ్రొక్కుచుంటి మిఁక మా ♦ యుక్తుల్ జెవిన్ బెట్టుమా!

చ॥ రసదుఁడు రాసనాయకుఁడు ♦ రంజిలు నిందున రాసముఖ్యవీ
వెసఁగుచునుంటి విచ్చటనె ♦ యీస్థలి నుండెడి గోపికాజనుల్
రసమును గోరు మేము నిటఁ ♦ గ్రాలితి మందున రాసకేళులన్
బస పొసఁగన్ రచించుచు న ♦ పారముదంబును గూర్పుమో సఖీ! ౯౧౬

ఉ॥ అంతట విన్నరాధికయు ♦ నాడె నిటుల్ చెలులార! యట్టి శ్రీ
కాంతుఁడు నొప్పినప్పుడ య ♦ ఖండభవత్ప్రియమౌను గాన మీ
రింతటనైనఁ బోయి హరి ♦ నెట్లొ ప్రసన్నునిఁ జేయుఁడీ! యనన్
గాంతలు వార లామెకు ప ♦ గల్పతి యొప్పిన చొప్పుఁ జెప్పఁగాన్. ౯౧౭

తే॥ ఆమె యురరీకరించియు ♦ నట్టులౌను, గాతమంచుఁ బ్రసన్నయై ♦ ప్రేతలగుమి
గోడఁగూడియుఁ బాడుచుఁ ♦ గ్రీడఁజేయు, సర్వసన్నద్ధయై యుండె ♦ జనకరాజ!

## శ్రీకృష్ణుండు రాధాష్టభార్యాదులంగూడి రాసక్రీడం గావించుట.

వ॥ అంత శ్రీకృష్ణుం డను త్తమంబగు నుత్తమాంగంబునం దాపింఛాభంబగు బర్హాపింఛం బంచితంబుగ లగించి మణిగణరచితముక్తాదామంబులం జుట్టి రాకాపూర్ణసుధాకరబింబసదృశంబగు సుందరముఖంబున దృష్టిదోషపరిహారంబుగాఁ దిలకంబిడి శ్రీకారాకారానుకారంబులగు శ్రవణంబులకు మండనంబులగునట్లు కుండలంబుల ధరించి తిలపుష్పనిభంబగు నాసికంబు లలితంబుగా సింగారించి కంబుతుల్యంబగు గళంబునం దారహారంబులు మనోహారంబుగా వేసి శ్రీవత్సలాంఛనాంచితంబును, గవాటవిశాలంబును, నగు వక్షస్థ్సలంబునం గౌస్తుభం బలంకరించి తిరస్కృతదిక్కరటికరంబులును, సర్వరక్షాకరంబులునగు కరంబులను గంకణంబులం బెట్టి పంచాస్యమధ్యప్రశస్తంబగు లగ్నంబునం దళతళలాడు నలివంపు హొంబట్టుపుట్టంబులం గట్టి సనకసనందనాదిమునిబృందవందితంబులును, సకలభువనరక్షాకరణకరణంబులును నగు చరణంబులందు మంజులధ్వనిమనోజ్ఞమంజీరంబులంగూర్చి బింబతులితంబును, దాంబూలచర్వణారుణితంబును నగు మధురాధరంబునఁ దరళంబుగాని కోమలతర సరళశబ్దసరసంబగు మురళిం దాల్చి పల్లవంబుల నుల్లసంబాడు చేతివ్రేళ్ళం బట్టి తద్వివరంబులం బూరించి వెన్నెలఁబోలి చిర్నగవు నల్లఁగలఁ బర్వ నలరుచుఁ బ్రీతిమెయి నాప్రేతలం జేరం దీసి సాలంకారయు జగన్మోహినియు నగు రాధికను వామకరంబునం గైకొని రుక్మిణ్యాద్యష్టపట్టమహిషులం గూడి సర్వసిద్ధికరంబును భువనప్రసిద్ధంబును నగు సిద్ధాశ్రమంబునకు శ్రద్ధమెయి నేగి మాధవమాసంబందలి పూర్ణిమాతిథియం దానందసంధాయకంబగు చంద్రోదయసమయంబున నృత్తవిద్యానవద్యంబై సర్వజనహృద్యంబై తనరారు రాసమండలంబులఁ గల్పించి యందందఱు సుందరీమణులు గలరో యందఱకన్నిరూపంబులం దాల్చి తన యిరుక్రేవల భూషణభూషితలై పొలుపారు యోషామణులు గావించు వీణావేణుమృదంగాదిగానంబుల కనుకూలంబుగఁ బాదవిక్షేపంబు లిడుచు నాడుచుఁ బాడుచు నుత్సహించుచుః దానును వల్లవపల్లవాధరలును సత్యభామాద్యష్టభామినీమణులును, శంఖపద్మవజ్రకందుకచతుర్ముఖచక్రవాళచతుర్భద్రసౌభద్రనాగబంధ్యావర్తకుండలీకరణఖురరీబంధప్రముఖంబులైన బంధవిశేషంబులకుం బ్రవేశించి మించి యేకపాదసమపాదవినివర్తితగతాగతవలితవైశాఖమండలత్రిభంగిప్రముఖంబులైన తానకంబులం దనూనంబుగ నిలిచి ఘటితాఘటితమర్దితపార్శ్వసమగ్రప్రముఖంబులైన పాదకర్మవిశేషంబులం జూపి సమపాదశకటవదనమతల్లీసుప్తిముఖంబులైన పార్థివచారిభేదంబులను గనుపఱచి యపక్రాంతడోలాపాదసూచీప్రముఖంబులైన వ్యోమచారివిశేషంబులును, గపిద్ధకటకాముఖశుకతుండార్ధచంద్రలాంగూలపతాకపద్మకోశముఖంబులైన స్వస్వభావ

వివిధవిధకరభావంబులం జేసి యాస్కందితభ్రమణకటాసనాదులైన జానుమండల భేదతండంబును దండలాతాలాతలలితవిచిత్రప్రభృతులైన దైవమండలంబుల దండిగ నాచరించి మీలనోన్మీలనకుంచితవికాసప్రముఖంబులైన దృష్టివిశేషంబుల నగు పఱచి నికుంచితాకుంచితకంపితాకంపితపరావృత్తపరివాహితప్రముఖంబులైన శిరో భావంబులం గనుపఱచుచుఁ గోటిచంద్రప్రతీకాశుండై మన్మథమన్మథుండై జగన్మోహనుండై సుందరీమణితారాహారమధ్యగతజైవాతృకుండై వెలుంగుచుండె. అప్పుడా రాసరంగంబు గంధర్వలోకంబుకరణి గానానందంబై నందనవనంబువిధం బున సుమనోమనోహరంబై హరినిలయంబునుబోలె సర్వమంగళాకరంబై కళాకర మండలంబునుబోలెఁ గువలయాభిరామంబై రామాయణంబురీతి రామాభ్యుద యంబై దయాళుహృదయంబువిధంబున భూతరక్షాకరణసమర్థంబై సమర్థకవివిలా సంబులీల ననేకప్రబంధబంధురంబై చెన్నుమీఱె. అందా గోవిందుం డా రతితోఁ గూడిన మదనుని సొబగునను, సౌదామినిఁగూడిన జీమూతునిరీతిని, రోహిణితోఁ గూడిన సుధాకరుని సొంపునను, శచితోఁగూడిన శక్రునిసరణిని నా రాధికాసతీమ తల్లికతోఁగూడి యొప్పె. మఱియు ౯౩౦

తే॥ రుక్మిణీ ముఖకాంతలు ♦ రుక్మవర్ణ,భాసమానలు నృపసుతల్ ♦ రాసములను
సలిపి తన్నిశ లప్పటి♦క్షణముబోలెఁ, గడపి హరితోడ నిటు కట్ట♦కడకు ననిరి.

క॥ ఓ నందనందనా! వ్రజ,మానినులను గూడి రాస ♦ మండలమున నీ
వానందప్రదవాద్యము, లానెఱిగా మొఱయ సల్పి ♦ హర్షం బిడవే! ౯౩౧

శా॥ నీ వేషంబును భాష నీకు తళుకుల్ ♦ నీబెళ్కు నీ కుల్కులున్
నీ విన్నాణము నీ దరస్మితములున్ ♦ నీ టాట్లు నీ నాట్యముల్
నీ వైదగ్ధ్యము నీ మనోహరగతుల్ ♦ నీ వేణుగానంబులో
దేవా! యీదృశరాసకేళిఁ గనరా ♦ ధీరుల్ దిదృక్షాపరుల్. ౯౩౩

క॥ మును పల బృందావనమునఁ,జని గోపీసతులతోడ ♦ జరిపితి వీ రా
సనికర మిప్పుడో భూవర, తనయుల మగు మమ్ముఁగూడి ♦ తద్ద జరుపవే? ౯౩౪

క॥ కావున నిటు రాసము లే,రావున నొనరింపలేదు ♦ తథ్యము గానన్
దేవా! ధన్యత నీకృప, నీవేళను గల్గె మాకుఁ ♦ గృష్ణాత్తమణీ! ౯౩౫

తే॥ఇట్టి శ్రేష్ఠుని మేమెందు♦ నెపుడు గనము,నిన్నుఁ బొగడంగఁ దరమానె?♦నిర్మలాత్మ!
మాదు జన్మము లిప్డు ని♦ర్మలములయ్యె,మోహనాకార! వినుమయ్య!♦ మ్రొక్కు లివిగొ

క॥ డెందమునందున ముని యా,నందమయుని నిన్నుఁగొల్చి ♦ నవనవగతులన్
జెందెడి నానందము మా,కందఱకును గూర్చియుంటి ♦ వహహా! కృష్ణా!

మ॥ శ్రుతివిత్సన్నుతమూర్తి! యీస్థలమునన్ ♦ శోభిల్లెడిన్ గోపికా
శతయూథంబులు రాధ షోడశసహ ♦ స్రప్రేయసీరత్నముల్

రతిరూపాంచితచేటికావృతభవ ♦ ద్రాజ్ఞ్యష్టకం బందుచే
నతిరేకించెడి నేఁటిరాస మల బృం ♦ దారణ్యారాసస్థితిన్. ౫౩౮

చ॥ అనవుడు శౌరి నవ్వి యిటు ♦ లాడెను నోసతులార ! బృందయన్
వనమున నేను ప్రేముడిని ♦ బల్మఱు జేసిన రాసకేళు లీ
దినమున నైన రాసముల ♦ తీరున కీడుగ రావటంచు మీ
రనెదరు కాని రాధ నిపు ♦ డడ్గుఁడి ! దీనిని గొంకులేనటుల్. ౫౩౯

ఉ॥ నావుడు వారలెల్లరును ♦ న్యాయపురస్సరవాక్ప్రవీణలై
యావృషభానుపుత్రి కిటు ♦ లాడిరి పూర్వమునందు నట్టి బృం
దావని నైన రాసములు ♦ తౌల్యముఁ జెందునె ? నేఁటి రాసఖే
లావిధి కిద్ది దెల్పుము స ♦ లక్షణపద్ధతి భామినీమణీ ! ౫౪౦

చ॥ అని యభిమానయుక్తలయి ♦ యాడఁగ నాయమ నవ్వి యిట్లనెన్
వనరుహనేత్రలార ! బహు ♦ భామలతో నిట రాసమున్ రచిం
చిన నల బృందకాటవినిఁ ♦ జేసిన రాసముతోడఁ బోలునే ?
ఘన మిదియౌనె ? యెన్నటికిఁ ♦ గాదని నమ్ముఁడి ! నెమ్మనమ్మునన్. ౫౪౧

తే॥ కారణం బేమనన్ బృంద ♦ కావనంబు
దివ్యతరుసమూహములును ♦ దీర్ఘమైత్రి
భారనతలతమును మధు ♦ ప్రతియుతంబు
గలదె ? దృక్పర్వముగ నిటఁ ♦ గాంతలార ! ౫౪౨

ఉ॥ ఎయ్యది పుష్పగుచ్ఛముల ♦ నెంతయు నొప్పెనో మాళిఁ బూనిన
ట్లెయ్యది రత్నతీరముల ♦ హెచ్చుగ ముద్రితమయ్యెనో మఱిం
కెయ్యది పద్మహంసవిహ ♦ గేంద్రబకాదిమనోజ్ఞమయ్యెనో
యయ్యమునాస్రవంతి యిట ♦ హర్షశుభాస్పదయౌచు నున్నదే ? ౫౪౩

ఉ॥ అక్కడి చందనావనిరు ♦ హంబులు నక్కడి భృంగరాట్ఛ్రుతిం
బక్కడి మాధవీలతలు ♦ నక్కడి కుంజనికుంజమండలం
బక్కడి దివ్యసైకతము ♦ లక్కడి సుందరమందిరోత్కరం
బిక్కడ నక్కలార ! యొక ♦ టేనియు మచ్చునకైన నున్నదే ? ౫౪౪

తే॥ రత్నసానుసమేతంబు ♦ రామణీయకమును భూరుహవల్లరీ ♦ సుమఫలాన్వి
తంబు ఘనమును బుణ్యతీ♦ర్థసహితంబు, నచలవరము గోవర్ధనం♦బిచటఁగలదె?

చ॥ అల వనినైన మందమల ♦ యానిలమున్ సుమసౌరభంబులన్
జెలఁగుచుఁ జల్లగా విసరఁ ♦ జిత్రపతత్రికలస్వనంబులున్
లలితముగా జనింప లత ♦ లన్ విరులన్ దగుసైకతంబులన్
గల వనమాలిసొంపు లిటఁ ♦ గాంచితినే ? చెలులార ! చెప్పుఁడీ ! ౫౪౬

ఉ॥ ఆమురళీవినోది మధు ♦ రారవ మా కుటిలాలకోజ్జ్వల
త్స్రోమసువక్త్రపల్లవుల యు ♦ శోదకిశోరు కిశోరతాకృతి
స్తోమము నామనోహరుని ♦ చూడ్కు లోయారపుకాల్నడల్ నవుల్
ప్రేమను గాంతలార ! చెవి ♦ వింటినె ? కంటను గంటినే ? యిటన్. ౧౪౮

ఉ॥ ఆహరిత్రోడఁ గూడుటయు ♦ నాడుట పాడుట డాఁగుటేగుటల్
మోహావశంబునన్ సలుపు ♦ ముచ్చటలున్ బొదరింట నుంట న
వ్యాహతకామకేళులను ♦ నాగుట నూఁగుట హస్తకర్షణో
త్సాహము హస్తవర్జనవి ♦ ధానము నాకిట సంభవించెనే ? ౧౪౯

ఆ॥ కోకలం గొనుచు ని ♦ కుంజమందు, దాఁగినట్టి యతనిఁ ♦ దద్దవెదకి
పట్టికొన్న సుదము ♦ వంశవేత్రముల నేఁ,గొనియుఁ జనినవేడ్క ♦ దనరె నొక్కొ ?

వ॥ మఱియు సుందరంబగు నాబృందావనం బందలి కృత్యంబు లసంఖ్యాకంబులై యనవద్యంబులై యప్రమేయంబులై పొలుపారు అట్టి పీస్థలంబున మందున కైనను నున్నవే? పరాంతరంబున నొండొరొండులీలలు గోపాలకృష్ణునిచే నొనర్పఁబడినవని యొప్పుకొన్నను నవి బృందావనరాజం బిందులేమిని మనఃప్రియంబులు గాకపోయె. ఏస్థలంబున నేలీలలు చేయఁదగినవో యవి యొనరించిన మనోజ్ఞంబుగా నుండునని పలుక నాసత్యభామాద్యష్టపట్టమహిషులు నిజగర్వంబులం బుచ్చి యచ్చెరువొంది ముచ్చటఁపడఁజొచ్చిరి. అంత నాయనంతుండు పూర్వోక్తంబుగా నాసిద్ధాశ్రమంబున రాసంబులం జేసి సర్వగోపీగణంబులను దోడ్కొని రాధికాసహితుండై నిజధర్మపత్నులు తోడుగా నడువ ద్వారకానగరంబుఁ బ్రవేశించి యత్యుత్తమంబులగు హర్మ్యంబులనుగట్టించి యందు రాసేశ్వరిని వసింపఁజేసి యితరంబులగు దివ్యసౌధంబుల నాప్రేత లుండునట్టుసల్పి సుఖంబుగాఁ గాలంబు గడపం దొడఁగెఁగాదె. సర్వపాపహరంబును మోక్షప్రదంబును నగు సిద్ధాశ్రమకథామాహాత్మ్యంబులు కథితంబులయ్యెనని నారదుచ్చి క్రమ్మఱ ద్వారకాపురిని బ్రశంసించుచు నిట్లనియె. ౧౫౦

## ద్వారకాపురీ వర్ణనము.

తే॥ పార్థివేశ్వర ! ద్వారకా ♦ పట్టణంబు,వందయామడల్ వెడలుపుఁ ♦ జెందెఁ జుట్టు
కొలత నాల్గువందల యామ ♦ డలు సెలంగుఁ, దత్పురీవిషయంబులఁ ♦ దమిని వినుమ !

క॥ అనఘా ! దత్పురి నడుమను వనమాలివినిర్మితంబు ♦ భాపుకదంబున్
ఘనము వరము ద్వాదశ యోజనపరిమితదుర్గ మొండు ♦ సక్కఁగ నుండున్.

తే॥ మఱియు నా పీటివెలుపల ♦ హరిరచితము
నద్భుతంబును నవయోజ ♦ నాన్వితమును

సకలజననేత్రపర్వము ♦ సర్వసిద్ధి
కరము నా దుర్గ ముండెడిఁ ♦ గార్గ్యపీంద్ర! ౧౧౩

ఉ॥ సత్తమ! యాపురిన్ మఱియు ♦ సర్వకళాస్పద మద్భుతంబు లో
కోత్తరమున్ రమారమిని ♦ యోజనయుగ్మము గల్గి పేరువే
రెత్తిన దర్ఘవంతమును ♦ హేమమణీసముదాయవిస్ఫుర
ద్భిత్తికవాటసౌధముల ♦ వెల్గెడి మూఁడవ దుర్గ మొప్పెడిన్. ౧౧౪

క॥ ఆదుర్గములఁ దొలిది దా, మోదరునిది దానియందు ♦ మోక్షప్రదముల్
శ్రీదనుజాంతక గృహములు, మోదదములు గ్రాలు నాఱు ♦ మూఁడునులక్షల్.

శా॥ ఆలోనన్ వృషభానుపర్యతనుజా ♦ త్యైశ్వర్యదాగారమున్
గ్రాలున్ గాదె తదీయమై చెలఁగు ద్వా ♦ రంబాదు బృందిష్మమై
గోలోకాగతమై యఘౌఘహరమై ♦ గోవిందనుత్యంబునై
లీలాధామమునై వెలింగెడిగదా ♦ లీలాసరోరత్నమున్. ౧౧౬

క॥ అట స్నానంబును సల్పిన, కటికయును నటసుటీఁడు ♦ గర్కోటకుఁడేన్
జటులంబగు పాపంబుల, జిటికెఁదుటూరించి పరముఁ ♦ జేరున్ మీఱున్. ౧౧౭

ఉ॥ అందున నెట్టివాఁ డయిన ♦ సప్తమి ముగ్ని సమాహితాత్మ రా
త్రిందివమున్ నుతించి సవి ♦ ధిన్ నతిసల్పి వ్రతంబుఁ జేసి మే
లుక్కొందస మించుకే సిడినఁ ♦ గొంకక జంకక కోటిబాములం
దొందిన పాపముల్ జడిపి ♦ యుత్తమకీర్తినిఁ బొంది నెట్టనన్. ౧౧౮

క॥ తమిఁద న్గొని చన గోలోకమునుండియు వచ్చినట్టి ♦ ఘనరథమం దె
ల్లమునులు గని పొగడంగా, నమలాకృతి నెక్కి యతిశ ♦ యానందమునన్.

మ॥ సుమరత్నార్పితహారతారములతో ♦ సూనాస్త్రరూపంబుతో
విమలాదిత్యసహస్రతుల్యరుచితోఁ ♦ బీతాంబరశ్రేణితో
భ్రమదీఱం దగి పార్షదుల్ జయజయ ♦ ధ్వానంబు లొప్పన్ ఘనుల్
దమి వింజామరలన్ గ్రహించి విసరన్ ♦ దాఁ జేరు గోలోకమున్. ౧౨౦

వ॥ అని పలికి వెండియు నిట్లనియె. మైథిలేశ్వరా! తన్నగరంబునం బదాఱు వేల నూటయెనిమిది పుణ్యతీర్థంబులును, శ్రీకృష్ణాష్టభార్యామణుల మందిరంబులును, గలవు. అవ్వాని కెవ్వరైనను వేఱువేఱుగాఁ బ్రదక్షిణంబు లొనరించి పునఃపునః ప్రణామంబు లాచరింపందగు. అందు జ్ఞానతీర్థం బనునది యొండు గలదు. తత్తీర్థంబున స్నానంబు సల్పి యటఁగల పారిజాతవృక్షంబును స్పృశించినవారికిఁ దక్షణంబున భక్తిజ్ఞానవైరాగ్యంబులు నిస్సంశయంబుగాఁ గలుగు. మఱియు నవ్వారల హృదయకుహరమం దాముకుందుం డానందమయుండై యెల్లప్పుడు నివసించి రక్షించుచుండు. స్వయంబుగా నా మహాత్ముని సమృద్ధిసిద్ధులు వరింపం

గలవు. ఏవం డా స్వర్గంబంగాఁ గల నందనందను సుందరమందిరం బానందంబునం గాంచునో యవ్వాఁడే భూరిధవిద్వ్యవర్తమానంబులందు జీవన్ముక్తుం డనియుఁ, గృతార్థుం డనియు, నిరుపమానవైష్ణవుం డనియుఁ జెప్పందగువాఁడని గుర్తెఱుంగుము. పంచయోజనవిస్తారితంబగు తద్భగవన్మందిరంబునకు ధనుశ్శతమాత్రపరిమిత దూరంబునం గృష్ణతేజస్సముద్భవంబై కృష్ణకుండనామకసరోవరం బొండు ప్రవహించుచుండు. జాంబవతీసుతుండగు సాంబుం డందు స్నానంబు సల్పి శ్రీకృష్ణుని యనుగ్రహంబున ముక్తుండైనట్లు తత్సరసిని స్నాతుండైనవాఁడు జీవన్ముక్తుండు గాఁగలఁడు. మహాబలుండగు బలరాముండు భూప్రదక్షిణం బాచరించి యభిజ్ఞ నత్యంబగు యజ్ఞంబొనరించి రేవతీసహితుండై యెచ్చోట విరాజిల్లెనో యం దుత్కృష్టాసనంబగు బలభద్రసరోవరంబు వెలయుంగు. అద్ది పూర్వోక్తకృష్ణకుండం బున కష్టాదశపదపరిమితదూరంబునఁ దూర్పుదెసం గలదు. ౯౬౧

తే॥ అందు మునిఁగినవానికి ♦ నఖిలపాత
కములు నశియించుఁ బుణ్యముల్ ♦ గలుగు వైష్ణ
వముగ లోకంబు సిద్ధించు ♦ బహువిధసుఖము
లందుఁ బొందును సందియ ♦ మందవలదు. ౯౬౨

చ॥ మును పల రుక్మిణీతరుణి ♦ పుత్రకుఁడౌ సుచారుభాను నెందునన్
గనుఁగొనలేనియప్పు గని ♦ నాగున కిర్చల నేస్థలిన్ బొన
ర్చెనో యెది యట్టి శ్రీహరి వి ♦ శ్రుతగృహంబున కంతకాశ వే
ధనువుల దవ్వునం గలదొ ♦ తత్స్థలి నొప్పు సుచారుకుండమున్. ౯౬౩

క॥ ధాత్రీశా! యిట మునిఁగిన, పాత్రుఁడు పొందెడిన పుత్ర ♦ ఫలమొందును ద
త్పుత్రసువంశము సిరిన, పుత్రవిభూతిమాద్యవృద్ధిఁ ♦ గాంచుచు వరుసన్. ౯౬౪

సీ॥ శ్రీకృష్ణుఁ డెందుఁ గాసిఁ ♦ జేసి తానంబుల, నెల్లప్పుడీవుల ♦ నిచ్చె నిసును
యెది కొల్దిబంగరు ♦ నిచ్చిన దానికి, నిబ్బడి ఫలముల ♦ నియ్యఁగలదొ
యెది కొల్దిరజతంబు ♦ నిచ్చిన దానికి, నిఁకఁ జతుర్గుణఫల ♦ మెఱుపడెను
యెది యొకఫల మేని ♦ నిచ్చిన దానికి, శతగుణలాభముల్ ♦ జక్కఁబడును

తే॥ హరిగృహంబున కెదుర్పు ♦ మాశ ద్విశత, చాపపరిమితదూరమం ♦ దేపు మీరె
నద్ది తీర్థరాజంబని ♦ యిద్ధమయ్యె, నదియె దానసరోవరం ♦ బండ్రు బుధులు.

చ॥ అట మొహరీల, రత్నముల ♦ నాద్యృతి నిచ్చిన పుణ్యరాశి కు
త్కటశతరాజసూయము ల ♦ ఖండసహస్రమహాశ్వమేధముల్
దిటముగఁ జేసి పొందు బహు ♦ దివ్యఫలంబులు షోడశాంశమేఁ
బెఱుగతిఁ దూఁగఁ జాలవని ♦ బాగుగ నమ్ముము! ధారణీశ్వరా! ౯౬౬

తే॥ బదరికాశ్రమయాత్రచే వచ్చు ఫలము, మేషరాశిని మిహిరుండు మెలఁగుచుండ
సైంధవాహ్వాయవనయాత్ర సల్పు ఫలము, దనుకు "దానతీర్థ"స్నాన తత్పరులకు.
ఆ॥ తరణి వృషభమందుఁ దగ నుత్పలావర్తమున మునింగి దానముల నిడిన ఫ
లంబుకంటెఁ గలుగు లక్షగుణఫలంబు, "దానతీర్థ" రాజదర్శకులకు. గీ॥
తే॥ అంతకంటెను కోటిగుణాధికఫలం, బబ్బుఁ గలదని యెఱుఁగుమా యట్టి దాన
తీర్థమందొక మాసంబు దివ్యభక్తి మునుఁగుచుండెడి జనులకు జనవరేణ్య!
తే॥ అశ్వదానము దానములందు మేటి, దానికంటెను మంచిది దంతిదాన
మంతకంటెను యోగ్యమౌ నరదమిత్రు, నంతకంటెను భూదాన మధికమండ్రు.

వ॥ సర్వసస్యసంపత్ప్రదంబగు వసుంధరాదానంబుకంటెను నన్నదానంబు మహాదానంబని వర్ణింపంబడు. ఈ యన్నంబే దేవపితృభూతంబులకుం దృప్తిం గలుగంజేయు. ఇద్దాని వలననే జగంబు విస్తారంబగు. పంచకోశంబుల నీ యన్నకోశంబే ప్రథమగణ్యంబైనది. సమస్త జంతువుల కిదియే జీవనాధారంబు ప్రాణంబునం దిది ప్రతిష్ఠితంబైనది. సకలరోగంబుల నేగంజేయుట కిదియే యనుత్తమాగదంబు. ఇది లేని ప్రపంచంబు నశియించుటకు సందియంబు లేదు. కావుననే యీ యన్నంబును బరబ్రహ్మస్వరూపంబని యార్యులొక్కుమ్ముగి ఘోషించిరి. ఇతరదానంబు లిద్దానివలెఁ దనివిం గూర్పంజాలవు. ఏతద్దానంబుతో సమానంబగునది త్రికాలంబులందును లేదని యెఱుంగుము. ఇట్టి యన్నంబును దద్దానతీర్థంబునం దానం బొనరించి దానం బాచరించిన మానవుని పుణ్యంబును, జతుర్ముఖుండుగాని షణ్ముఖుండుగాని సహస్రముఖుండుగాని వర్ణింప శక్తుండగునే? అవ్వాఁడు ఋణత్రయంబుఁ దీర్చికొని పరమపదంబు నొందఁ గలండు. మఱియుఁ దాదృశదానతీర్థంబున స్నాతుండై పూతుండై దాతయగువాని సుకృతంబు తత్పితృపక్షంబునం బదుగురకుఁ దన్మాతృపక్షంబునం బదుగురకుఁ దద్భార్యాపక్షంబునం బదుగురకును నరకంబుఁ బాపి దివ్యరూపంబును జతుర్భుజంబులం గల్పించి పీతాంబరంబులం గట్టించి హారాదిభూషణంబుల సింగారింపఁ జేసి జయజయ ధ్వనులతోఁ బార్షదులు వెంటనంట దివ్యరథంబునం దారూఢులం గావించి గోలోకసుఖంబులం గూర్ప సమర్థంబై యుండుం గాదె. మఱియుఁ దద్భగవన్మందిరంబునకుఁ బ్రాగ్భాగంబున నరకోసు దవ్వున మాయాతీర్థంబు మనోహరంబై విరాజిల్లు. అందు సింహారూఢయుఁ జండముండనిషూదనియు భద్రప్రదయు దుర్గతివినాశనియునగు దుర్గ యనయంబు వెలుంగుచుండు. దేవకీదేవి తన కుమారుండగు శౌరి యపవాదాపనోదార్థంబై శ్యమంతకంబు సంపాదింప జాంబవంతుని బిలంబునకుం జనిన కాలంబున సత్ఫలంబు లనన్యభక్తితోఁ దద్దుర్గం బూజించి జాంబవతీనామకప్రియాశ్యమంతమణివిభ్రాజమాన

శ్రీకృష్ణుండు మరలి వచ్చుటం గని పరమానందంబుఁ బొందె. అట్టి మాయాతీర్థంబు ఫలప్రదంబని వేఱుగా నొక్కి చెప్పవలయునే? యెవ్వరా తీర్థంబునం జలకం బాడి యా మాయాదేవిం బూజింతురో యవ్వారు జననోరథంబులు ఫలింపఁ గైవల్యంబున కరుగంగలరు. ఇంకఁ దద్ద్వారావతీపురీవిరాజమానద్వితీయ దుర్గవిశేషంబులను వినుమని యిట్లనియె. ౪౬౧

## ద్వారకా ద్వితీయ దుర్గవర్ణనము.

క॥ రెండవదుర్గమునకు నా, ఖండలదిశ నింద్రనామ ♦ కసరోవర మొ
ప్పుండును గామప్రద ముద్దండాఘవినాశకంబు ♦ ధర్మమయమునై. ౪౬౨

క॥ ఆతీర్థంబున మునిఁగినఁ, బూతుండయి చంద్రవిభవ ♦ ముం గని జంభా
రాతిపదంబునకుం జని, యాతతిసౌఖ్యంబు లొందు ♦ నధమాధముఁడేన్. ౪౬౩

తే॥ దానికిం గుడివైపునఁ ♦ దరణికుండ, ముండు నిచట సత్రాజితుం ♦ డుష్ణరశ్మి
కర్చసల్పి స్యమంతక ♦ మనెడి మణిని, భూషితుండయ్యె బూర్వమో ♦ భూతలేశ!

క॥ జనుఁ డెవఁడేనియు నందున, మునిఁగియు నొకపద్మరాగ ♦ ము నొసంగినచో
నినతుల్యవిమానంబున, నినలోకముఁ జేరి మిగుల ♦ నినవిభరుచినేన్. ౪౬౪

ఆ॥ దానికిం బ్రతీచి ♦ ధాతృతీర్థం బుండు, నచట జలకమాడి ♦ హైమపాత్ర
మందుఁ బాయస మిడి ♦ యతిశయభక్తితో, నిడిన వారిఫలము ♦ లీవువినుము!

ఆ॥ పంచపాతకములు ♦ ధ్వంసమైపోవును, బ్రహ్మహత్యలెల్లఁ ♦ బాటిపోవు
ననృతజనితదోష ♦ మడుగంటి తీరెడి, నిచటఁ గలఫలము వ ♦ చింపనగునె?

చ॥ మఱిఁ దలిదండ్రులన్ గురుల ♦ మానవనాథుల నాలఁ జంపున
ట్టిరు నట భక్తి మున్గిన ప్రతు ♦ టిన్ శుచులై జవిజేంద్రలోకమం
దరుసముతో స్వపాద మిడి ♦ యా కమలాసనరూప మొప్పఁగా
నరిగెద రబ్జజస్థలికి ♦ నా శశిసామ్యవిమాన మెక్కుచున్. ౪౬౭

తే॥ దాని కుత్తరదిక్కునన్ ♦ దనరుచుండు, "నీలలోహితతీర్థంబు" ♦ నీలలోహి
తుండు శ్రీమహాదేవుం డ ♦ ఖండదీప్తి, సతత మచ్చోట వెలుఁగు ర ♦ సాతలేంద్ర!

తే॥ మఱి మరుద్గణసత్సృష్టి ♦ మాని దేవ, తలును దక్షప్రలి నంమ రా ♦ స్థలమునఁగల
నీలలోహితలింగంబు ♦ నిశ్చలమతి, నర్చ సల్పి యా రావణుం ♦ డందెఁ బ్రభుత.

క॥ ఆ లింగంబును భక్తిని, నాలోకించిన జనుం డ ♦ నాయాసముగాఁ
గైలాసయాత్రఁ గలిగెడి, మేలును శతగుణము లెప్పు ♦ మేలును బొందున్.

క॥ స్నానము దివసత్రయమును, నా "నీలగ్రీవకుండ" ♦ మందున మునుఁగం
గా నా శ్రీగళులోకం, బానందముతోడఁ బొందు ♦ నఘమయజనుఁడేన్. ౪౭౨

ఉ॥ భద్రదమున్ మనోహరము ♦ పాపవినాశకమైన "సప్తసా
ముద్రక" నామతీర్థ మటఁ ♦ బొందెడి నందునఁ దానమాడు వాఁ

ద్రదినిఁబోలు పాపము ర ♦ యంబునఁ గూలిచి శ స్తసప్తసా
ముద్రకయాత్రఁగల్గు ఫల ♦ ముల్ గనఁగాదె విదేహభూవరా ! ౧౮౩

తే॥ బ్రహ్మవిష్ణుమహాదేవ ♦ వాయుసూర్య, చంద్ర దేవేంద్రపార్థభూ ♦ జలధిధనద
వహ్నిముఖసురల్ దత్తీర్థ ♦ పార్శ్వములను, వెలుఁగుచుందురు సతతంబు ♦ వినుతచరిత!

క॥ మఱి యీ బ్రహ్మాండంబున, వఱలుఁగదా సప్తకోటి ♦ వరతీర్థము లా
సరసులు సర్వంబందున, వరదములై కలిసియుండుఁ ♦ బాహితబుద్ధీ. ౧౮౫

తే॥ అట్టి తీర్థంబు నందు నీ ♦ రాడి చుట్టి, వచ్చు దిట్టలె ద్వారకా ♦ భవ్యయాత్రఁ
గన్నఫలము సఫలముగాఁ ♦ గంద్రుగాని, యన్యథాకరించిన నద్ది ♦ వ్యర్థమగును.

తే॥ వెండి యా తీర్థరాజంబు ♦ విష్ణురూప, మంచు వేల్పులు వచియింతు ♦ రట్టి ద్వార
కఁగల మూఁడవ దుర్గము ♦ నఁగల సంగ, తులను జెప్పెద విను మింక ♦ నలఘుచరిత!

ద్వారకాతృతీయ దుర్గప్రశంస.

చ॥ వినుత చరిత్రుఁడున్ బ్రథిత ♦ వీరుఁ డుదారుఁడు ధీరుఁడున్ ఫిక
ర్తన వరశిష్యుఁడున్ దశర ♦ థప్రియపుత్రకదాసుఁ డంజనీ
తనయుఁడు గాలి మెల్లపుడు ♦ తత్ప్రథమార్గము తూర్పుఁ బ్రోచు నా
ఘనుఁ గనువాఁడు భక్తుఁడగుఁ ♦ గాదె తదంజనిపుత్రుకైవడిన్. ౧౮౮

చ॥ అరయఁగ నట్టి దుర్గమున ♦ కంతకదిక్కున సంతతంబు శ్రీ
హరిగతమానసంబు వర ♦ మైన సుదర్శన మోము దాని నె
వ్వరు గనుచుంద్రో వారు నల ♦ పంకజనాభుని భక్తులై తమ
ద్ధురతరచక్రరక్షణము ♦ తోడుగ నొప్పుదు రయ్య భూవరా ! ౧౮౯

ఉ॥ దానికిఁ బశ్చిమాశ నతి ♦ ధైర్యసమేతుఁడు ఋక్షనాథుఁడున్
మానదుఁడున్ మహాబలుఁడు ♦ మాధవభక్తుఁడు జాంబవంతుఁడ
న్యూన్యనముగాఁ జెలంగి సత ♦ మోమును తద్ఘనుఁ జూచువాఁడు శ్రీ
జానికి ముఖ్యభక్తుఁడగుఁ ♦ జక్కఁ జిరాయువుతోడ నొప్పెడిన్. ౧౯౦

క॥ దాని కుదగ్దిశ విష్వ, క్సేనుఁడు ఘనబలుఁడు ప్రోచుఁ ♦ గీడ్పడు వాఁడేన్
వానింగనిన శ్రీహరి, మానసమే ధన్యుఁ జేసి ♦ మంచిన్ మంచున్. ౧౯౧

వ॥ వెండియుఁ దద్బహిర్దుర్గంబున కనతిదూరంబునం దర్థసిద్ధిప్రాయద్వారంబులవలెఁ జెలంగు రైవతాద్రి సముద్రంబుల నడుమను బిండారక నామక్షేత్రంబు సర్వతీర్థోత్తమంబై సకలప్రభావసంపన్నంబై మహాపుణ్యప్రదంబై చెన్నుమీఱు. మున్నిక్షేత్రంబునం బరిపూర్ణతముండగు శ్రీకృష్ణుని యానతిని యదుప్రభుండగు నుగ్రసేనుండు క్రతురాజం బగు రాజసూయం బొనర్చె. అందు బ్రహ్మాండగతసర్వతీర్థంబులును సమాహూతంబులై స్థిరనివాసం బొనర్చునట్లు పిండీకృతంబయ్యె. తత్ప్రభృతి నాస్థలంబునకుం బిండారకక్షేత్రం బని ప్రసిద్ధి

ఘటిల్లె. అచట జలకం బాడిన వాఁడు రాజసూయఫలం బనుభవించు. దినత్రయంబు నీరాడి ప్రతిమై బ్రాహ్మణులకు స్వర్ణదానాదులం గావించి మ్రొక్కిన జనుండు ప్రత్యహం బవిచ్ఛిన్నంబుగా వందిమాగధ స్తోత్రపాఠంబులను వినుచు భూషణ విభూషితలును, రాకేందువదనలును, క్షౌమవస్త్రధారిణులునగు విలాసినులచే సేవితుండై హృష్టుండై పుష్టుండై వీణావేణుపటహఢక్కాదుందుభికాహళాది వాద్యంబులు మొఁగళ్లు మొఱసినసరణి మ్రోయం గరీంద్రబృంహితంబులు నశ్వ హేషలును సంకులంబుగా మండలేశ్వరులు మంచిచెడ్డల విన్నవించుకొనుటకు మందిరబహిర్ద్వారంబున వేచియుండ రాజసంఘంబు నిటలతటఘటితకరపుటంబై పరివేష్టింప రత్నప్రభుచిద్భర్మమయరమ్యహర్మ్యాగ్రంబులు విజయధ్వజంబులతోఁ బొల్పార మత్తకుంజరకర్ణతాడితంబులగు భృంగమండలంబు మంజులధ్వనిం జేయ జగజ్జేగీయమానుండై నరలోకశేఖరుండై వెలుంగుచుండు. అతండు మహాత్ముం డని వచించుట కనుమానింపఁ దగదు. ఇహలౌకిక సుఖంబు లనుభవించి యంతిమం బునఁ గైవల్యంబుఁ బొందఁగలరు. మఱియు నెవ్వండైనను, గీ౨

మ॥ అల పిండారక తీర్థముల్ గనక రా♦జ్యంబెట్టులన్ బొందు? నె
ట్లల పిండారకమందునన్ మునుఁగకే ♦ యాత్మీయ సర్వాఘముల్
దలఁగా మోక్షముఁ జెందు? నిద్దిసెపుమా! ♦ ధర్మంబు వర్మంబు ని
ర్మలకర్మంబు ముదంబు దీని విడిసన్ ♦ రాజిల్లునే? మేలుగాన్. గీ౩

ఉ॥ యోగి సుయోగియౌనతఁడ ♦ నుత్తమ తత్సరసిన్ మునింగినన్
భోగి సుభోగియౌ నతఁడు ♦ పుణ్యదలత్సరసిన్ మునింగినన్
రోగి నిరోగియౌ నతఁడు ♦ రూఢిగఁ దత్సరసిన్ మునిగినన్
రాగి విరాగియౌ నతఁడ ♦ రంబునఁ దత్సరసిన్ మునింగినన్. గీ౪

తే॥ ద్వారకాపురమునకుఁ బ్ర♦దక్షిణము ల, రాధమానంబునం జేసి♦ప్రణతు లిడిన
వారిచేతులనైహిక ♦ పారమార్థిక సుఖములు గలవని యెఱుఁ ♦ గంగఁదగును.

శా॥ తత్తీర్థప్లుతుఁడై యవాశనుఁడునై ♦ ధర్మిష్ఠుఁడై కేశవా
యత్తాత్ముండయి మేదినీశయనుఁడై ♦ యాహ్లాదియై మానియై
విత్తద్వారక యాత్రఁజైత్రిమొదలా ♦ విఖ్యాత వైశాఖి బల్
హత్తుందాఁక నొనర్చునట్టి జను పు♦ణ్యం బెన్న సామాన్యమే! గీ౬

తే॥ అట్టి శ్రీకృష్ణపురయాత్ర♦నమరునట్టి, ఫలము లెన్నుట పడుచుండు♦వానచినుకు
లెన్నుటయుఁగాక శక్యమే?♦ యెట్టివేద,మయచతుర్ముఖధాతకున్ ♦మనుజనాథ!

సీ॥ ఘస్రంబులందు నే♦కాదశి కైనడి ♦ జిలువలందున నాది ♦ శేషుఁబోలె
బక్షిసంఘంబులఁ ♦ వైనతేయుని రీతి, శ్రుతపురాణముల భా♦రతమువితము
సంద్రంబులఁ క్షీర ♦ జలనిధిసరణిని, దారలయందు సు♦ధాకరు విధి
దేవతలందున ♦ దేవదేవుని భాతి, నఖిలజంతువులందు ♦ హరివిధమున

తే॥ శ్రేష్ఠమైన కరణి నెల్ల♦ క్షేత్రములను, ద్వారకాపురీక్షేత్రంబు♦వరము నిజము
దానిమహిమను వర్ణింపఁ♦దరమె? నీకు, నాకుఁ దాతకు నాతని♦నాయకునకు.

తే॥ ఆకసంబున మేఘముల్ ♦ ప్రాఁదిరులను, గ్రాలులీలను వైకుంఠ ♦ లీలలఁదగు
ద్వారకాపురి యాదవ♦పటలిఁగూడి, ధరకుఁదొడవయి ధన్యతఁ♦దనరె సహహా!

ఆ॥ ఆపురంబు నెప్పు♦డమరి చతుర్వ్యూహ,ములను బాలనంబు ♦ సలిపివెతల
నుత్తలపడుచుండు ♦ నుగ్రసేనున కిప్పి, సుఖిగఁ జేయుహరికి ♦ జోత లిడుదు.

చ॥ ఎపుడు స్వకీయలోకమున ♦ కేగుట కబ్జనాభుఁడెంచునో
యపుడల ద్వారకాపురము ♦ నర్ణవమందున ముంచివేయు వి
శ్వప! యంబులైన నచ్చట స్వ♦సద్మము భాసిలకున్న వాసమె
ల్లపుడును సల్పు నాస్థలిఁ జె♦లంగెడి నాతని ప్రీతి మెట్టిదో. ౬౦౧

క॥ ఏతత్క్షణపర్యంతం, బా తోయధియందుఁ గృష్ణుఁ♦డాడెడి నుడుపుల్
బ్రాంతిగ వినఁబడుఁగాదే, భూతలపరిపాలకా! య♦మోఘారంభా! ౬౦౨

తే॥ వెండి శౌరి యాజలధిలో♦విజ్ఞుఁడైన, నజ్ఞుఁడైనను బ్రాహ్మణుం♦డతిశయముగ
మామకాత్మయ యని పల్కు♦మాటి కరయ, విప్రపక్షపాతియకాఁడె?♦విష్ణుమూర్తి.

ఉ॥ బాడబుఁడైన మానవుఁడు ♦ వార్ధితటంబున కేగి లోతుంబోఁ
గూడినచోటుఁజేరి యట ♦ గోపతిసత్ప్రతిమన్ గ్రహించి బ
ల్వేడుకఁగట్టి యిల్లొకటి ♦ విజ్ఞులుమెచ్చఁ బ్రతిష్ఠజేయు న
వ్వాఁడు ప్రభాకరుండనియె ♦ భావమునందుఁదలంపనా విభూ! ౬౦౩

తే॥ ఇదియద్వారకాఖండంబు ♦ నెవరుదీని,
వినెదరో పఠియింత్రో యా ♦ యనఘుల కల
పరమహరిపాదముల గాంచు ♦ భాగ్యమబ్బఁ
గలదు నిజమిది మైథల♦ క్ష్మాతలేంద్ర! ౬౦౪

తే॥ అని జనకునకు నారద♦ముని నుడివిన, సరణి గర్గమునీంద్రుఁడు ♦ శౌనకునకుఁ
బల్కె నంతటఁ దన్ముని ♦ పరమభక్తి, గర్గయోగిని బ్రశ్నింపఁ ♦ గడఁగె నిట్లు.

ఉ॥ భూసురదేవ! దేవమణి ♦ భూషణభూషిత వాసుదేవ! గో
పీసహితా! హితప్రకర ♦ భీతివినాశరతా! రతీశ్వరో

ల్లాసకరా! వినుత్యసుక ♦ లా! కరినాయకహారి హారి! శ్రీ
వాస! కుశస్థలీపురని ♦ వాస! వలాహకనీలభాసురా! ౬౦౭

మాలిని.

మగధవిభువిజేతా! ♦ మానిరాడ్గమ్యనేతా!
నిగమగదితరూపా! ♦ నిర్జితారాతిభూపా!
సుగుణనిచయయుక్తా! ♦ శుద్ధభక్తాళిరక్తా!
యగమతిలకధారీ! ♦ వ్యాజశాపాంతకారీ! ౬౦౮

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చివుకుల
కులజలధికళానిధి, కోటమాంబా కామయ తనయ, లక్ష్మీదేవీ
సుబ్రహ్మణ్య దత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వ
నిశ్చయ, సుజనవిధేయ, శ్రీనివాసాపరనామధే
యాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన
శ్రీ గర్గభాగవతం బందలి
ద్వారకాఖండము
సంపూర్ణము

శ్రీ శ్రీ శ్రీ
హరిః ఓం తత్సత్
శ్రీకృష్ణార్పణమస్తు



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# శ్రీ గర్గ భాగవతము.

## విశ్వజిత్ఖండము.



అతసీసుమసంకాశా!
ప్రతతిప్రతతిప్రయుక్త ♦ భవననివాసా!
రతిపతిజనకా! రాసని
రత! యతితతిసన్నుతాత్మ! ♦ రాధాకృష్ణా! ౧

తే॥ అవల నేమని బహులాశ్వుఁ ♦ డమరమునిని,నడిగెనో యది యిపుడు నా ♦ కానతీయు
మనుటయు గర్గమౌనియు ♦ నట్టి శౌన,కునకు వినుమని యీరహి ♦ ననఁగఁ దొడఁగె.

ఆ॥ ఎవ్వఁ డుగ్రసేనుఁ ♦ డెటుల యదుప్రభుం, డాతఁడయ్యె నేల ♦ యాతని కటు
శౌరి సాయపడెనో? ♦ యారహి యంతయు, ముచ్చటింపు ము మర ♦ మునివరేణ్య!

### మరుతోపాఖ్యానము.

క॥ అనవుడు నారదముని యి, ట్లనియెను గృతయుగమునందు ♦ నతఁ డినకులమం
దున మరుతుండను పేరున, జనియించిన చక్రవర్తి ♦ జననుతచరితా! ౪

ఆ॥ అట్టిచక్రవర్తి ♦ యఘహరవిశ్వజి, దధ్వరోత్తమంబు ♦ నఖిలవేద
శాస్త్రసమ్మతముగ ♦ సల్పెను దక్షిణతి, యెట్టిదంటివన వ ♦ చింతు వినుమ! ౫

వ॥ అమ్మహాధ్వరంబును హిమాచలంబున కుత్తరప్రాంతంబునం దివ్య ప్రదేశంబుం గాంచి మునిశార్దూలుండగు సంవర్తుని నాచా[illegible] నొనరించి తదా జ్ఞానుసారంబుగాఁ బంచయోజనవిస్తారంబుగ . హె[illegible]ండం బొందును

యోజనవిస్తీర్ణంబుగ బ్రహ్మకుండంబును గవ్యూతివిశాలంబులగు పంచకుండంబులను నిర్మించి మేఖలాగర్తవిస్తారంబులుగ పదివేదికలను ఘటించి సహస్రహస్తోచ్ఛ్రియంబగు యూపంబును స్థాపించి వింశద్యోజనవిస్తీర్ణంబుగా సువర్ణమయంబగు యజ్ఞమండపంబు కదళీస్తంభతోరణాదిప్రకాశమానం బగునట్లు రచించి బ్రహ్మరుద్రాద్యఖిలబర్హిర్ముఖులను మహర్షివరేణ్యులను, మునీంద్రులను సవినయంబుగా నాహ్వానించి రావించి సంతసించి ౬

సీ॥ శాస్త్రోచితంబుగా ♦ సకలక్రియల సల్పు, దశలక్షహోతృతా ♦ ధనులతోడ
నఖిలాధ్వరంబులం ♦ దాటి తేటినయట్టి, పంచలక్షౌద్గాత్ర ♦ వరులతోడఁ
బ్రాచితంబులు లేని ♦ పగిదిఁ బనుల జేయు, పంచలక్షోద్గాతృ ♦ వరులతోడ
వెలగల్గినట్టి దీక్ష ♦ విడువక ఘనత భాసిలు దశలక్షదీ ♦ క్షితులతోడ

తే॥ విదితులైన చతుర్వేద ♦ విదులతోడ, సర్వశాస్త్రార్థతత్వజ్ఞ ♦ సమితితోడ
స్వకసమస్తపాపక్షయ ♦ ద్వారముగను, శ్రీహరిప్రీతికొఱకు నాచ ♦ రించె నందు.

క॥ నిరతం బగ్నిసి హోమము, గరిశుండాభాజ్యధారఁ ♦ గావించుటచేఁ
గర మూతనికి నజీర్ణము, దొరకొనె నిది యబ్బురముగఁ ♦ దోఁపదు గాదే! ౮

తే॥ మఱియు మరుతుం డస్వీయమహా ♦ మఖమునందు, దవిలి సభనువిశ్వేదేవు ♦ లెవరికెవ్వ
రికిని భాగము లిమ్మని ప్రీతితోడఁ ♦ జెప్పిరో, యటు వారికిఁ ♦ దప్పకయిడె. ౯

ఆ॥ ఎల్లదేవతలును ♦ నెల్లమహాత్మును, లెల్లఋషివరేణ్య ♦ లెల్ల యోగు
లెల్లజంతువులును నెల్లభూసురులును, జెంది తనివి మఱి య ♦ జీర్తి గనిరి. ౧౦

క॥ అత్తఱి ముజ్జగములలో, నెత్తావున నొక్కజీవ ♦ మే నాకలితో
గత్తర జెందుట లేదని, చిత్తమున న్నమ్ముమయ్య! ♦ శ్రీబహుళాశ్వా! ౧౧

తే॥ మరుతుఁ డాజన్నపుం దుద ♦ నరసి డాసి, నిజగురుఁడగు సంవర్తము ♦ నితిలకునకు
శాస్త్రరీతినిఁ బూజించి ♦ చక్కఁ గ్రొక్కి, దక్షిణగఁ జతుర్దశనియు ♦ తకరులింక.

క॥ జంబూద్వీపప్రభుతయు, జాంబూనదభరచతుర్ద ♦ శనియుతములు ర
మ్యంబగు మణికోటుల నశ్వంబులు నూరర్బుదములు భ ♦ క్తి నొసంగెన్. ౧౩

తే॥ వాజులైదువే లిభములు ♦ వందనూఱు, బారువలపొన్ను నొక్కొక్క ♦ బ్రాహ్మణునకు
వేయువేయుగ నిడి నమ ♦ స్కారములను, సల్పె నతని యీవికి నిల ♦ సాటి గలదె?

తే॥ తినిన త్రాగిన పాత్రముల్ ♦ గనకమయము, లైన విప్రులు సంతుష్టి ♦ నంది కొనక
యరిగి రవి శతయోజన ♦ స్ఫురితగిరిగ, మంచుమలపొంతఁ దగ నది ♦ మించునిపుడు.

క॥ పలుపలుకులు మన కేలా?, యిలలో నాసవమువంటి ♦ యిద్ధమఖంబుల్
గలుగదనియు నాతని కెన,గల యోగ్యుఁడు గ్రాలఁడనియు ♦ ఖ్యాతి ఘటించెన్.

క॥ అంతట విష్ణువు సవకుం, డాంతరమున నుద్భవించి ♦ యామరుతోర్వీ
కాంతునకు నాత్మరూపము, సంతోషముతోడఁ జూపి ♦ సన్నిధి నిలిచెన్. ౧౭

చ॥ నిలిచినతోడ నామనుతనేత ముదంబును బొంది యేమియున్
బలుకఁగలేక తన్నిహిత భక్తివశుండయి తత్పదంబులన్
సులువుగ వ్రాలె నంతట యశోదకిశోరుఁడు తద్ధరేశుఁ జే
తులఁ గొని లేవఁదీసి బహు తుష్టిదసూక్తుల నిట్లు వాకొనన్. ౧౮

మ॥ ధరణీనాయక! నీమఖంబునకు హ్లాదం బొంది నే వచ్చితిన్
మఱి నీ భక్తికి మెచ్చితిం గనుక వేర్మార్గంబు బోకుండ నే
వరముం గోరెదొ యద్ది స్వల్పమయినన్ భారంబుగా నుండినన్
గరుణన్ నీకు నొసంగెదన్ జుమి యనన్ క్ష్మానాయకుం డంతటన్. ౧౯

చ॥ మరల శిరంబిలన్ దగుల మాపతికిన్ నతిసల్పి పూజలం
బహువడిజేసి యిట్లనియెఁ బంకజనాభ! యశేషదోషముల్
సరగున బోవఁ గోరికలఁ జక్కఁగ నిచ్చెడి నీపదాబ్జముల్
బొరిఁబొరిఁ గొల్చు భాగ్యము గుబుద్ధికి నాకిఁకయుంటివో ప్రభూ! ౨౦

తే॥ ఇంతకంటెను జెలిమంచి యీప్సితంబు, గలదటంచు వాంఛించుటకంగదరిని
దగను నాపుటకని బావిఁ ద్రవ్వు మూర్ఖు,నట్టులే నాదు శ్రీధరా! యైన వినుము!

క॥ నీమాటలపైఁ గల గా,రామున నే నడుగుచుంటి రాజీవాక్షా!
నామదితామర నీపద, తామరసము విడనిరీతి దయచేయగదే! ౨౨

తే॥ అదియ ధర్మార్థకామమోక్షాదికార,ణంబుగద భక్తవత్సలా! నావుడు హరి
వీనులారఁగ నాలించి ప్రీతితోడ, నలిని కిట్టులఁ బల్కెనో యార్యవర్య! ౨౩

తే॥ తృషను వరముల నడుగక దివ్యమతిని, జూపియుంటివి దానికి సుఖముగంటి
నైన భక్తుఁడు ఫలయుతంబైన కోర్కె,గోరకుండిన నాయెద కుబురపడదు

క॥ కావున నను మానింపక, భూవర! మఱియొక్క వరము బొందుము నాచే
నావుడు తన్మరుతాధిపుఁ, డా విష్ణువుతోడ నిట్టు లనియెను నతుఁడై. ౨౫

క॥ నీ పదపంకజపూజయు, నీ పదపూజకులతోడి నెయ్యముఁ దగ ను
ద్దీపితవైకుంఠము నం, దేపారు విధం బనుగ్రహింపవె దేవా! ౨౬

మ॥ అని వేఁడన్ మురవైరి యిట్లనియె భూపాగ్రేసరా! యీవరం
బును నీకిచ్చితిఁ గాని యొక్క విషయంబున్ విన్ము సౌఖ్యాకరం
బును నాశ్చర్యకరంబునైన త్రిదివంబుం బొంది మోదంబు ని
మ్మనమందొందుచు నుండి క్రమ్మఱను నీ మన్వంతరంబందునన్. ౨౭

క॥ ఇరువదెనిమిదవ ఘనయుగ, మరిగెడి తఱి ధరను బుట్టి యలయూలకుఁ గా
పరియా నాతో మైత్రిని, నెఱపుచు మద్ధామమందు నిలుతువు మరుతా! ౨౮

క॥ అని వరమిడి చనెఁ దద్విధి, జనియించెఁ దదుగ్రసేన సదభిధ నతఁడా
వనరుహలోచను ననుమతి, నొనరించెను రాజసూయమొం డందముగాన్. ౨౯

క॥ ఇది మరుత్తోపాఖ్యానము, జదివిన వ్రాసినను వినిన ♦ సకలార్థంబుల్
గొదకొను హరిభక్తుల కై,య్యది యబ్బదొ? ముజ్జగముల ♦ నవనివరేణ్యా!
తే॥ అవల బహుళాశ్వుఁ డిట్లనె ♦ నమరమునికి
మౌనివర! చెప్పుమా యుగ్ర ♦ సేనవిభుఁడు
రాజసూయాధ్వరవర మా ♦ రంభ మెటుల
సల్పె నెటుదాని కా హరి ♦ సాయపడెనొ? 3౧

నారదముని బహుళాశ్వునకు రాజసూయవృత్తాంతంబు చెప్పుట.

క॥ అనవుడు నారదుఁ డిట్లనె, జనకా! యాయుగ్రసేన ♦ నరసుఁడు కీర్తిఁ
దనరుచు మనుతతి నొకపరి, వనమాలినిఁ బూజసేసి ♦ ప్రశ్నించె నిటుల్. 3౨
ఉ॥ దేవర! దేవమౌనివర ♦ దివ్యముఖంబున రాజసూయమేఁ
బావనదాధ్వరం బనుచు ♦ బల్మఱు వింటిని దత్క్రతూత్తమం
బేవిధిఁ జేయఁగావలెనొ? ♦ యేయధిదేవతయౌనొ? దానికిం
కేవిబుధాళి రావలెనొ? ♦ యేఫలమొ? వచియింపు మియ్యెడన్. 33
చ॥ జగమున నెందఱో నృపులు ♦ సారససామ్యభవత్పదంబులన్
మిగుల భజించి యెల్లపుడు ♦ మిక్కిలి చిక్కుల గల్గఁజేయు నీ
జగతిఁ దృణీకరించి నిజ ♦ సర్వమనోరథకంధ నీఁదరే
యగయుగశాపమోచనప ♦ రా! విదితాగధరా! పరాత్పరా! 3౪

వ॥ అని సప్రశ్రయంబుగాఁ బలుక నవ్వేలమురితా ల్పలరి యాయేలిక కిట్లు వక్కాణించె. యాదవేశ్వరా! లెస్సగా నాలోచించి చక్కని విషయంబు దేటపరచితివి. తత్సవోత్తమంబు జగత్త్రయప్రతిష్ఠాకరంబు. నీసంకల్పం బమోఘంబును, నిర్మలంబును నై నాకును సమ్మతంబయ్యె. తన్మఖకృత్యంబు యమప్రభుండవగు నీకొనర్పందగినదియ. వేఱొండు విచారింపక యారంభింపుము. అందులకుం దొల్దొల్త సర్వయాదవుల నామంత్రణంబు సేసి మహాసభం గావించి తాంబూలవీటికం గరంబునం గ్రహించి తదధ్వరవిషయికప్రతిజ్ఞను వ్యక్తీకరించిన నవ్వారు మదంశసంభూతులును, లోకద్వయవిజిగీషులగుటం బట్టి యద్దాని కంగీకరించి నల్గడలం గెల్చి యందుండు రాజమార్తాండులనుండి కప్పంబులం గొని తెచ్చి నీకిచ్చి సంపూర్ణంబు సేయింపం గలరు. కాన విష్ణుప్రీతిగా విధివిధానంబునం దడయక యా జన్నం బాచరింపుము. నేనును బాసటగా నుండెదనని సప్రియంబుగా నుడువ నా యుగ్రసేనుండు మెచ్చి యదువృష్ణిభోజాంధకాదులగు యాదవులను సమాహ్వానించి గారవించి సుధర్మం గావించి తా నింద్రసింహాసనాసీనుండై చేతం దాంబూలవీటికం ధరించి. 3౫

చ॥ తలఁచితి రాజసూయము య ♦ థావిధిగా నొనరింప మిమ్ములం
బిలిచితి నిద్ధి తెల్ప మొన ♦ నేరెదుదీవిని నున్న రాజులన్
గెలిచి కరంబులం గొని సు ♦ కీర్తి గడించియు వచ్చు వీరుఁ డీ
స్థలిఁ గలఁ డేని లేచి యిది ♦ చక్కఁ గ్రహించి గ్రసించు నిర్భేడన్. 3౯

క॥ అని గంభీరగళంబున, ననఁగా విని యాదవులును ♦ "హరి శివ" యనకే
చనసాగిరి తత్సమయంబునఁ బ్రద్యుమ్నుండు భైష్మి ♦ పుత్రుఁడు కడఁకన్.

తే॥ పలికె నిట్లు జంబూద్వీప ♦ భాసమాన, విభుల నందఱ నాజికిఁ ♦ బిలిచి గెలిచి
బలులఁ గైకొని వాసితో ♦ వచ్చి రాజ,సూయసవము సంపూర్ణంబుఁ ♦ జేయఁగలను.

తే॥ ఇట్టి దిగ్విజయంబును ♦ నేను జేయ, నే నగమ్యాగమనగురు ♦ ధేను బభ్రు
భూసురాది హత్యాకృతుల్ ♦ జేసినంత,దురితముల్ నాకుఁ గల్గుత ♦ సరసులార!

క॥ అని శపథోక్తుల నాడుచు, వినయముతో నుగ్రసేన ♦ విభునకు నతులన్
బొనరిచి తద్వీటికఁ గై,కొనెఁ జూపఱు లబ్రమొంద ♦ క్షోణీనాథా! ౪౦

యాదవులు దిగ్విజయార్థంబై వెడలు ప్రద్యుమ్ను
నభిషేకించి బహుమతు లిడుట.

తే॥ అంత యదుకులాచార్యుఁ ♦ డఖిలవేద,శాస్త్రవిదుఁ డగు గర్గుఁడు ♦ సన్ముహూర్త
మందు వేదసూక్తులతోడ ♦ నాతని కభి,షేక మొనరింపఁ జేసియా ♦ శీర్వదించె.

ఆ॥ ఉగ్రసేనుఁ డతని ♦ కుచితతిలకమును, బెట్టె నంత గోప ♦ విభులుగూడ
నాత్మశక్తి కొలఁది ♦ నవనతులై బలుల్, దెచ్చి యిచ్చి యిచ్చ ♦ మెచ్చి రవల. ౪౧

క॥ వనమాలి స్వశార్ఙ్గమునన్, ధను వక్షయసాయకమయి ♦ తగు నిషుధియుగం
బును దన యమ్ములపొదులన్, జనియింపఁగఁ జేసి యిచ్చె ♦ స్వకుమారునకున్.

సీ॥ ఉగ్రసేనుండైన ♦ యుగ్రసేనుండు మ,హాశితఖడ్గంబు ♦ నందనిచ్చె
నక్రూరమతియైన ♦ యక్రూరుఁడున్ దక్షి,ణావర్తశంఖంబు ♦ నందనిచ్చె
బలశాలియై హెచ్చు ♦ బలరాముఁడున్ దృఢ,మైన వర్మంబును ♦ నందనిచ్చె
వసుధావరుండైన ♦ వసుదేవుఁడు శత చం,ద్రాఖ్యాకృపాణంబు ♦ నందనిచ్చె

తే॥ నుత్తములకెల్ల ధవుఁడైన ♦ యుద్ధవుండు, కేసరోల్లసన్మాలిక ♦ వాసినిచ్చె
దుర్గతుల్ బాపఁజాలిన ♦ గర్గమునియుఁ, గృష్ణకవచయంత్రంబుల ♦ నిచ్చ నిచ్చె.

తే॥ బుద్ధిమంతులన్ వృద్ధుండు ♦ వృద్ధుఁ డనగు, శూరసేనుండు సత్కీర్తి ♦ మీఱు ఛత్ర
చామరాంబరకుండల ♦ సత్కిరీట,ముల నొసంగె శంబరవైరి ♦ కలఘుమతిని.

ఆ॥ హరిదధీశ్వరాన్వి ♦ తాఖండలుండును, విబుధమానిసహిత ♦ విధిశివులును
వచ్చి రందు బ్రహ్మ ♦ పద్మరాగము శంక,రుఁడు త్రిశూల మల మ ♦ రునకు నిడిరి.

తే॥ పాశి పాశంబు ననిలుండు ♦ వ్యజనయుగము
యముఁడు దండంబు భాస్కరుం ♦ డధికభార

రాజితగదఁ గుబేరుండు ♦ రత్నమాలఁ
జంద్రకాంతంబుఁ జంద్రుండు ♦ సరగ నిడెరి. ౪౭

తే॥ వీతిహోత్రుండు బరిఘంబు ♦ భూతలంబు
యోగమయపాదుకాయుగం ♦ బుత్తమమగు
ఘంతమును భద్రకాళియు ♦ గోర్కిమీఱ
నట్టి కందర్పునకు నిచ్చి ♦ రాయదనున. ౪౮

సీ॥ అంగుగా సింగార ♦ ముంగాఱుచెత్తైన, బంగారు శృంగముల్ ♦ బరఁగినదియు
ఘనరవంబులఁబోలు ♦ ఘంటికాటంకార, కింకిణీశబ్దముల్ ♦ గెరలునదియు
మారుతశీఘ్రంబు ♦ మానసవేగంబు, మించిన లఘుగతిం ♦ గాంచినదియు
బ్రహ్మాండమందు వె ♦ ల్పలనులోపలఁ బోవఁ,జాలిన నేర్పుతోఁ ♦ గ్రాలినదియు

తే॥ వెయ్యిబాబాలు జెండాలు ♦ వెయ్యి వెయ్యి,చక్రములుగల్గినదిరత్న ♦ చయముతోడఁ
జెలఁగునది విశ్వకర్మచేఁ ♦ జేయఁబడిన, దియగు జైత్రరథం బిడె ♦ దేవవిభుఁడు.

క॥ అరిసంహారణకరణచణ, వరశక్తిన్ శక్తిధరుఁడు ♦ వచ్చి యతనికిన్
గరముగఁ గరదంబుగ నిడె, హరికరుణాం గన్నవారి ♦ కట్లిడు టరుదే? ౫౦

ఉ॥ అత్తఱి శంఖదుందుభిధ్వ ♦ దంగమృదానకవేణువల్లకీ
సత్తమవేదనాదములు ♦ జాలఁ జెలంగఁగ లాజ లక్షతల్
ముత్తెములున్ విరుల్ గురియఁ ♦ బుష్పశరుండు బలాచ్యుతేశగ
ర్గోత్తములన్ నతిన్ దనిపి ♦ గొంది తదాజ్ఞ మహోల్లసంబునన్. ౫౧

తే॥ విజయశబ్దంబు లెల్లెడ ♦ వెల్లివిరియ, దివ్యమగు శతాంగంబునం ♦ దేజుమీఱ
నెక్కి యక్కుశస్థలినుండి ♦ యేగఁదొడఁగెఁ,జూపఱుల్ జోద్యమందుచుఁ ♦ జూచుచుండ.

తే॥ అతని వెంటనె చనిరి గ ♦ దాదిబలులు, సాంబముఖులును మిత్రాత్మ ♦ జాతయోధ
పత్తిరథగజహయయుతుల్ ♦ బద్మనాభ,మోదితుల్ మహారథులు న ♦ మోఘబలులు.

తే॥ మఱియు శస్త్రాస్త్రములు బత్తి ♦ హరులుగరుల, దేజుగల్గు దశార్హక ♦ భోజవృష్ణి
శూరసేనమధ్వంధక ♦ వీరముఖ్యు, లుద్ధవాదియాదవులేగి ♦ రుచితరీతి. ౫౨

తే॥ ఇంక నతని వెంటను మండ ♦ లేశ్వరులును, సకలశస్త్రాస్త్రభూ ♦ షలను దాల్చి
యరదముల నెక్కి చతురంగ ♦ పరివృతులయి, బయలుదేరిరిగా దె ♦ త్తోడ్పాటుపడఁగ.

వ॥ అత్తఱిఁ దత్పురినుండి గుందనంపుమొగ్గ లమర్పంబడిన వింతవింత మొగంబులతోడను, మిగుల మ్రోఁగు ఘంటాకింకిణులతోడను, నరిభయంకరులగు జోదుల తోడను, నయనపర్వంబగు నరుణాంబరంబులతోడను విరాజిల్లుచు దిగ్గజంబులం బోలుచు నీలాచలంబులభాతి భాసిల్లుచు మందగమనంబున మత్తమాతంగేంద్రంబులు గోట్లకొలంది నిర్గమింపం దొడంగె. అందుం గొన్ని భద్రంబులును, గొన్ని భద్రమృగంబులును, గొన్ని వింధ్యాచలభవంబులును, గొన్ని హిమా

లయసంభవంబులను, గొన్ని మలయప్రభవంబులును, గొన్ని మారంగోద్భవంబులును, గొన్ని కాశ్మీరజాతంబులును, గొన్ని కైలాసవనజంబులును, నైరావతజనితంబులై చతుర్దంతంబులు గల్గినవి కొన్నియు, నూర్ధ్వంబుగాఁ ద్రిశుండంబులు గ్రాల భూమ్యంతరిక్షంబులందు సంచరింపంజాలినవి కొన్నియు, నీలాంబరవిరాజితంబులై యంబారిని వీరులు జెన్నారం గాఱుమొగులుచందంబున ఘీంకృతుల నిశ్శంకంబుగాఁ జేయుచుం జరించునవి కొన్నియు, నిజశుండాదండంబునం గుల్యాదులం బెల్లగించి యర్కమండలమం దుంచుచుఁ బాదంబులతో మేదిని నదిలించుచు మదధారలతో నచలాదులం దడపుచుఁ దిరుగాడునవికొన్నియు, శిరంబులతో దుర్గాద్రిగండశైలాదులంగూల్చి వైరివారంబులం జీల్పంజాలి పెల్చన నిల్చినవి కొన్నియు దుందుభిపతాకాసంయుతంబులై యబ్ధియందు మకరరాజంబులపగిది విహరించునవి గున్నయేనుంగులు కొన్నియు నొప్పారు. వెండియు నంగవంగకళింగకాశ్మీరభోజకాంభోజ సావీరసౌరాష్ట్రమహారాష్ట్రమగధమాళవనేపాళకేరళచోళపాంచాళగౌళమళయాళసింహళసింధు ద్రవిడకర్ణాటపుళిందాంధ్రదశార్ణకుక్కురు గాంధారబాహ్లీకబర్బరకేకయ కోసల కుంతల కిరాత టంకణకొంకణమత్స్యశ్వేతద్వీపవైకుంఠరమావైకుంఠోర్ధ్వవైకుంఠాజితపాదాదిస్థలసంభవంబులగు దివ్యహయంబులును, గోట్లకొలంది నానాభూషణభూషితంబులై నిర్గమింపం దొడంగె. అందపక్వసూత్రంబులమీఁదను,బుద్బుదంబులమీఁదను, వాయుమనోవేగంబులతో నడచుచు వింత గల్గించునవి కొన్నితురగంబులును, మేడలను మాడువులను, గోటలను,గోడలను వాఁగులను, వాఁకలను, మిట్టములను, బల్లములను సులువుగా దాఁటఁజాలునవి కొన్నితురంగంబులును, మయూరీతిత్తిరిక్రౌంచీహంసీఖంజనీదివ్యగతులం బలుమాఱు మీఱుచు నాడునవి కొన్నితురంగమంబులును, శ్యామకర్ణంబులను శుభాంగంబులను, పీతపుచ్ఛంబులను ధవళవర్ణంబులను భాసిల్లి పక్షంబులతోఁ జెన్నారునవి కొన్ని తుక్ఖారంబులును, నుచ్చైశ్శ్రవకులోద్భవంబులు గొన్నియు వరుణప్రయోజితంబులై యశ్వినీసుతవిద్యానవద్యంబులైనవి కొన్నియు, సప్తాశ్వాశ్వసంభవంబులు గొన్నియు, నశ్వినీపుత్రతుల్యంబులుగొన్నియుఁ గల్పతరుసంకాశంబులు గొన్నియు, మేలిమిబంగారురంగుగలవి కొన్నియు, పాలెపట్టుపైఁ బాఱు పారదంబువిధంబున సిరాధారంబుగా వారులయందుఁబాఱందీరినవి కొన్నిహయంబులును,మనోహరంబుగానుండె. రధిసారధియోధశస్త్రాస్త్రసంపన్నంబులైన శతాంగంబులు తత్సైన్యంబునం జెలంగు. మఱియు నందుఁ ద్రిశూలాసిగదాపట్టిసపరిఘాముద్గరతోమరకుంతధర్మపాశంబులం దాల్చి దిగిభాభులై ప్రలయాంబుధినిభులై ఘోరసంగ్రామంబులం దరినికరగర్వ మడంచి వాసికెక్కిన శూరులు నొప్పారుచుండిరి. పూర్వోక్తంబుగా సర్వసులక్షణలక్షితుండై ప్రద్యుమ్నుండు సచతురంగంబుగాఁ గుళ

స్థలిపురినుండి వీడ్కొనుట సురాసురు లాలోకించి చిత్రపడుచుండ నుగ్రసేనుండు సార్థరామకృష్ణుండై డాసి ధానుష్కవరుండగు నా కందర్పునితోడ నిట్లనియె. ౫౬

తే॥ కృష్ణపుత్రక ! బుధవరా ! ♦ కృష్ణకృపను, సకలభూపతులం గెల్చి ♦ సత్వరముగ
నిట్టె ద్వారకాపురికి నీ♦ వేగుదెంచ, గలవు నిక్కమ్ము కాని యీ♦పలుకు వినుమ !

క॥ మత్తుని నిద్రితు బాలుఁ బ్ర, మత్తుని జడు విరథు భీతు ♦ మానిని మఱి ను
న్మత్తుఁ బ్రపన్నుని నెదిరిని, మొత్తరు నయవేత్త లనిని ♦ ముకాలములన్. ౫౮

క॥ ఆర్తుల యార్తినిఁ బాపఁగఁ, బూర్తిగఁ గదనంబునందుఁ ♦ బోరుట బహుదు
ర్వర్తనవధయును విభులకుఁ, గీర్తిదధర్మములు గావె ♦ కృష్ణాత్మభవా ! ౫౯

క॥ మానినిగాని పురుషుఁడు, గానీ యధముండుగాని ♦ కానీ షండుం
డైనను బ్రాణులపైఁ గసిఁ, బూనినచోఁ జంపనౌను ♦ బొందవఘంబుల్. ౬౦

ఉ॥ ఎవ్వఁడు దివ్వెలోఁ దనరి ♦ యుద్ధమహాబలయుక్తవైరులన్
జివ్వన రూపుమాపు నల ♦ శేముషి యాజగదేకదోర్బలుం
డివ్వసుధాస్థలిన్ యశ ము ♦ హీనవిధంబునఁ బొందె యంతమం
దవ్వసుదేవనందనము ♦ హాలయ మొందఁడె ? కృష్ణఁగృష్ణజా ! ౬౧

క॥ గెలిచిన గెలువక పోయినఁ, గలఁగక యల కలనునందుఁ ♦ గాలూది తమిన్
నిలిచిన నేర్పరి నీల్గినఁ, గలువలపగయిక్కదాఁటి ♦ కనఁడే సుగతిన్. ౬౨

ఉ॥ క్షత్రియజాతి కుద్భవిలి ♦ కాంచి యవక్రపరాక్రమంబు వే
దత్రయసూక్తభూపతియ ♦ ధార్థనయంబును గుత్తెఱుంగుచున్
శత్రులఁ బోరఁ జంపుటకు ♦ సాగి భయంబునఁ బాఱువార లీ
ధాత్రిని నింద్యులై తుదను ♦ దప్పక నొత్తురు రౌరవంబునన్. ౬౩

క॥ సేనలు మానవనాయకు, మానవనాథుండు సేన ♦ మనుపఁగవలయున్
ధీనిధి సారథి రథికుని, నానెఱి సారథిని రథియు ♦ హ్లాదింపవలెన్. ౬౪

తే॥ ఈవిధంబునఁ దొల్లి మ♦హీశ్వరుండు, నఖిలధర్మవిదుఁడగు స్వా♦యంభువమను
వనియెఁ గావున నీవిష ♦ యంబునందు, నేమరిల్లకు మోకార్ష్ణి ! ♦ యెల్లయెడల.

ఉ॥ యాదవ వీరలందఱు మ ♦ హాబలులున్ వివిధాస్త్రశస్త్రసం
పాదకులున్ యశోన్వితులు ♦ బట్టునఁ గార్ష్ణిని మీరు బ్రోవుఁడీ !
యాదవులార ! మిమ్ములను ♦ నాతఁడు బ్రోచెడి వారి వీరినిన్
వేదసురావనీసురులు ♦ విజ్ఞులు బ్రోతురు తప్పకుండఁగన్. ౬౬

చ॥ హరికి నుదుల్ శ్రుతిత్రయము ♦ నంగములున్ సుర లాస్య మగ్రజుల్
సురభులు దేహమున్ మును ల ♦ సుప్రకరంబుగఁ జెప్పుచుండుటన్
నరులకు మోక్షకాంక్షుల క ♦ నారత మయ్యవి సేవ్యమాను శ్రీ
హరిని సెవందు నిల్పునె ని ♦ జాత్మను వాఁడె జయించు నన్నిటన్. ౬౭

క॥ అంతట యాదవు లందఱు, సంతసపడి యుగ్రసేన ♦ శాసనముఁ దలఁ
  స్సంతను విడువక కొని యత్యంతముగ నుతించి మ్రొక్కి ♦ రటుపై మరుఁడున్.

క॥ గురువరునకు గర్గునకున్, హరికిని బలరామునకును ♦ నధిపునకు నతుల్
  బోరిఁబోరి నొనరిచి యాదల, హరిదాళిజయార్థి యగుచు ♦ నరుగఁ గడంగెన్.

ఆ॥ అంత నుగ్రసేనుఁ ♦ డల హాలి హరులతో, నిజనివాసమునకు ♦ నెమ్మిఁజనియెఁ
  బ్రేక్షకులును స్వీయ ♦ వేశ్మములకు నేగి, రవనిపాలక! తద♦నంతరమున. ౭౦

వ॥ అగ్రభాగంబున వాహినీసహితుండై మహాబలుండగు కృతవర్మయుఁ బశ్చాద్భాగంబునం బతాకినీయుతుండై ధనుష్మద్వరుండగు నక్రూరుండును, వాని వెనుకం బ్రతిమాపంచాంచితుండును, మంత్రికులతిలకుండును నగు నుద్ధవుండును, తత్పృష్ఠభాగంబునం దనేకాక్షౌహిణీసమేతులై ప్రద్యుమ్నానిరుద్ధ దీప్తిమ ద్భాను బృహద్భాను చిత్రభాను విచిత్రభాను వృక సాంబారుణ మధుపుష్కరదేవ వాహ శ్రుతదేవ సునందన విరూప కవి న్యగ్రోధులను కృష్ణపుత్రకులు పదునేనుమంద్రు మహారథులును, భోజవృష్ణ్యంధకాదిసర్వయాదవులును బయలుదేరిరి. తత్సైన్యస్థిత యాదవులు మాత్రం బేఁబదియాఱుకోట్లమందిగలరు. ఇఁక నా మూఁక మొత్తంబుం దెల్ప నెవండు శక్తుండగు? వీరి శిబిరంబులచే నాలుగామడలచోటాక్రమింపం బడియె. ఇట్టి విజయధ్వజిని బయలుదేరుతఱుణంబున ధణధణాత్కారంబులును, గిణకిణాత్కారంబులును, బటపటాత్కారంబును, జటచటాత్కారంబులును టంకార ఢంకారభాంకారఘీంకారక్రేంకారంబులు సంకులంబుగా జనించి మేఘగర్జంబుల విడంబించుచు దిగ్గజంబులం జెవుడుపరచుచు నాదికూర్మంబు లేమి కింక గల్గెనో యని ధావనము బొనర్చున ట్లొనర్చుచు దైవమా! నాకేమి యుపద్రవంబు సంభవింపఁ జేసితివని భూదేవి యడలునట్లు సల్పుచు హెచ్చం దొడంగెనని వార్తరుచ్చుటయు బహుళాశ్వుండు నారదమహర్షితో సవినయంబుగా నిట్లనియె. ౭౧

క॥ ఆయన యేయేస్థలముల, కాయెడఁ జనెనో మఱెట్టు ♦ లరులను గనెనో
  యేయేరీతుల గెలిచెను, యీయెడ దయ నాకుఁ జెప్పు ♦ మీవు సురర్షీ! ౭౨

తే॥ అరరె! యేమేమి! యా శౌరి♦కాత్మభక్తు,లందుఁ గలిగిన కారుణ్య♦మాడఁగలమె
  యద్ది పాపినిఁ గులముతో ♦ నమలచరితు,నిగ నొనర్చదె! నాభ్రుడా ♦ నిర్జరర్షి!

ఆ॥ ఇట్టులాడ కేఁడ! ♦ యీవు బల్కినదిష్టు, బాగు బాగు బాగు ♦ పద్మనాభ
  భక్తజీవితములు ♦ బహుళశోకంబులన్, జక్కఁజేయుటరుదె ♦ సరిగ వినుమ!

క॥ రవి కననివి కనఁజాలెడి, కవిమణి ఘనబిందువులను ♦ తోయ్మరజములన్
  దవిలి గణించునుగానీ, భవికదహరిగుణము లెన్న ♦ బైల్దేలఁడుగా. ౭౩

తే॥ నాలుగామడల్ దాఁక ఘ ♦ నంబుగాను
  నీడనిడువెల్లగొడుగుచే ♦ నేత్రములకుఁ

బండువౌనట్లు భైష్మిపు ♦ త్రుండు మరుఁడు
నైన ప్రద్యుమ్నుఁ డెంతో హ ♦ ల్వారఁ దొడఁగె. ౭౬

❖ ప్రద్యుమ్నుండు సేనాసహితంబుగాఁ గచ్ఛాది దేశంబుల కరుగుట. ❖

మ॥ అటులన్ యాదవవాహినీసహితుఁడై ♦ యైంద్రంబు దేరెక్కి యు
త్కటసంతోషముతోఁ దదంగజుఁడు త ♦ త్కచ్ఛాభిధాదేశముల్
జటులప్రక్రియగా జయింపఁ జనె మున్ ♦ శంభుండు జృంభించి యు
ద్భటతాదృక్త్రిపురంబులన్ గెలువఁగా ♦ బైల్దేరినట్టుల్ విభూ! ౭౭

తే॥ అట్టిపట్టునం గచ్ఛదే ♦ శాధిపుండు, శుభ్రుఁడను వాఁడు వేఁట క ♦ దభ్రగతిని
జనుచు నరుదెంచుసైన్యంబు♦గని వెనుకకు, మరలి యాత్మహాలావ్యాయ♦పురికి వచ్చె.

తే॥ అతని మూఁకలు తత్స్థలి♦కరిగినంత, ద్విరదచరణసంహతులచేఁ♦దరునికరము
గూలి నుసియయ్యె రేగిన♦ధూళు లాక♦సంబు నంధమయంబుగా♦సంతరించె.

క॥ దానిం గాంచిన పౌరవితానము భయపడెను మిగుల ♦ తద్భూవరుఁ డా
మీనధ్వజునకుఁ బ్రత్యుత్థానంబును జేసి మ్రొక్కి ♦ తత్పరమతితోన్. ౮౦

తే॥ హేమమాలల నొప్పారు ♦ నిభము లైదు
వంద లయుతంబు హయములు ♦ స్వచ్ఛమైన
స్వర్ణ మిరువదిమణుఁగులు ♦ బలిగ నొసఁగి
పుష్పహారబద్ధాంజలిన్ ♦ మ్రొక్కెనంత. ౮౧

క॥ ప్రద్యుమ్నుఁడు తన కయ్యాది, హృద్యముగా నుంట నతని ♦ కిడి రత్నస్ర
క్కద్యుతనార్యాచీనులు, జోద్యము గన నతని ప్రభుత ♦ సుస్థిరుఁ జేసెన్. ౮౨

ఉ॥ అంతఁ గళింగదేశముఁ ద ♦ దంగభవుండు జయింపఁ దత్తటి
త్వంతులగూడి యేగు మఘ ♦ వంతుని పోలిక బైలుదేరి త
త్ప్రాంతముఁ జేరె నంత నల ♦ పార్థివుఁడున్ స్వబలప్రయుక్తుఁడై
చింతభయంబులన్ విడి క ♦ సిన్ బ్రతిరోధము జేసె నాతనిన్. ౮౩

క॥ అది కని ధన్వివరుండగు, మదనసుతుం డొంటిగానె ♦ మసలని యట్లా
కదనమునన్ శరశిఖులను, బొదివి కళింగేశుపైనిఁ ♦ బూర్ణరుషాత్మన్. ౮౪

క॥ భటవరరథమదకరులను, గటకటబడఁగా శితాశు ♦ గదశత్రయమున్
ద్రుటిఁబఱపియుఁ డంకృతులన్, జటులంబుగఁ జేసె స్వీయ ♦ సైన్యము వొంగన్.

క॥ అత్తటి ననిరుద్ధుం డా, చిత్తజుఁడును జూచుచుండ ♦ శితబాణములన్
దత్త్రిత్వారిబలంబున, మొత్తముగా వైచె జనక ♦ భూభుజవర్యా! ౮౬

చ॥ అతని శితాశుగప్రహార ♦ మంది కళింగమహీశువాహినుల్
హతరథముల్ వ్యధాకృతమ ♦ హాధ్వజముల్ హతిమత్తనాగముల్

హతభటులున్ హతేశులు హ ♦ తాశ్వయచోదకజాలమున్ మఱిన్
హతరథిసారథివ్రతతి ♦ యై కనన య్యె ననంతరంబునన్. ౮౭

క॥ ఆకాళింగేశుఁడు తన, మూఁకలఁ గని మేనఁజెడిన ♦ బొందళము దగన్
వీఁక గజారూఢుండై, యాకట్టగ నతనిఁ బోర ♦ నాగ్రహమతిత్రోన్. ౮౮

తే॥ నూటనలుబదిమణుగుల ♦ వాటమైన, గదను గొని యనిరుద్ధుపైఁ ♦ గంటగిలగ
వైచి నిజకరిచే వీర ♦ వరులఁ ద్రొక్కు,నల్పి గర్జించె జలదంబు ♦ సరణిఁ గరము.

ఉ॥ అట్టులఁ దద్గదాహతిని ♦ జ్యాకుయిఁబడ్డ యుషామనోహరున్
జుట్టిన యాదవోద్భటులు ♦ జూచి మహాగ్రహవృత్తిఁ దద్రిపున్
బట్టి శితాస్త్రశస్త్రములఁ ♦ బాఁదిరిగా కురరంబు స్యేనము
న్బట్టి కలంబు మెక్కుఁగ ఘ ♦ నంబగు ముక్కునఁ గ్రుమ్మినట్టులన్. ౯౦

చ॥ పిదపఁ గళింగనాయకుఁడు ♦ వెంటనె నారినిగూర్చి చాపమున్
మద ముబుకంగఁ డంకృతుల ♦ మాటి కొనర్చి తదీయబాణముల్
జదియఁగఁ గొట్టె నంత బల ♦ శాలి బలానుజుఁడౌ గదుండు స్వో
ద్గదగొని వామహస్తమునఁ ♦ దద్గజముం బ్రహరించె నెంతయున్. ౯౧

తే॥ తత్ప్రహారమునన్ వాని ♦ దంతి పడియె
నింద్రదంభోళిహతిచే మ ♦ హీధరంబు
పడినయట్లు కాళింగుఁడున్ ♦ బడియెఁ బుడమి
నంతఁ దిరిగి యా కాళింగుఁ ♦ డాగ్రహమున. ౯౨

చ॥ గదఁగొని లేచి తద్గదుని ♦ గాటముగాఁ బ్రహరింప నాతఁడున్
గద నతనిన్ సుమాళముగ ♦ గాశ్యపిపైఁ బడద్రొబ్బి కొట్టె నా
పిదపఁ గళింగరాజు తన ♦ వీర్యము హెచ్చిల లేచి వానిన
మ్మద మణఁగంగ బాఁదె నిటు ♦ లయ్యెను ఘోరరణంబు వీరికిన్. ౯౩

ఆ॥ వీరిగదలు రెండు ♦ విస్ఫులింగంబులఁ, బఱపి పోరి తుదకుఁ ♦ గరము నుసిగ
మాఱె గదుఁడు ♦ వాని ధారణిఁబడఁద్రోసి, యీడ్చె ఫణిని గరుడి ♦ యీడ్చినట్లు.

తే॥ అట్టి సంహతిసంచూర్ణి ♦ తాస్థి బాధి,తుండునగు కళింగేశుఁడు ♦ త్రోదులేమి
నీమనోభవుశరణంబు ♦ నడుగ బలిని, శక్తికొలఁదిని నిడి యన ♦ సాగె నిట్లు.

క॥ దండము దండము దైవత, తండవిభుండవు పరేశ! ♦ దాన లయమునన్
మండెడి దండధరునిగతి,నుండిన నిన్నెవఁడు నూచి ♦ యోర్చునో చెపుమా!

చ॥ అనవుడు మెచ్చి కృష్ణతన ♦ యాగ్రణి తత్థ్సలి వీడి నీటిపైఁ
జను నవలంబుకై వడిని ♦ స్వధ్వజినీసచివేంద్రయుక్తుఁడై

ఘనమరుధన్వదేశపతిఁ • గాంచి జయింపఁగ నెంచి ముందుగాఁ
బనిపెను నుద్ధవాఖ్యుఁ దన • పైనము చొప్పును జెప్ప వానికిన్. ౯౭

క॥ శ్రద్ధను బుద్ధిమదగ్రణి, యుద్ధవుఁ డా మరుని యాజ్ఞ • నొందియు జేరెన్
దద్ధన్వాధిపధానికి, దద్ధరణీధ్రోరుదుర్గ • తండము గడవన్. ౯౮

వ॥ అట్లా రాజధాని కాతండు సేరి తదధిపుండగు గయుని సభాభవనంబునం గాంచి మహారాజా! యాదవేశ్వరుండగు నుగ్రసేనుండు జంబూద్వీపవిరాజమాన భూపతులనుండి కప్పంబులం గొని రాజసూయాధ్వరం బొనర్పంగలండు. ఇద్దాని కసంఖ్యబ్రహ్మాండవిభుండును, పరిపూర్ణతముండును, భగవంతుండు నగు శ్రీకృష్ణుండు సచివుండై చెన్నారె. అమ్మహాత్మునిచే ధన్విపరుండును, మహాబలుండునగు నీప్రద్యుమ్నుండు ప్రేషితుండయ్యెం గాన కులకోశలార్థంబుగాఁ గరంబునం గరదంబు లవ్వానికి సమర్పింపుమని సవినయంబుగాఁ జెప్ప నా గయుం డీషత్ప్రకుపితుండై వీర్యశౌర్యంబులు ధైర్యస్థైర్యంబులతోఁ బెనఁగొన నఖర్వగర్వంబున నిట్లు వక్కాణించె. ౯౯

తే॥ ఉద్ధవా! నీవు మీపతి•కొత్తి యిట్లు, పలుకవలయును గయరాజు•భండనంబు
సలుపకుండఁ గప్పముల నీఁ•దలఁచుకొనఁగ, లేదటంచు ముమ్మాటికి • లేదటంచు

తే॥ అబ్బ! యల్పులౌ నీబోటి • యాదవులకు, నింత స్వల్పకాలంబులో•నింత బుద్ధి
హద్దుమీఱి జనించెనే•యౌర! యరరె!, భండనంబును సల్పక•బలుల నిడను

మ॥ పిదపన్ దద్గయు నుద్ధవుండు విడి వే • వే సేరి ప్రద్యుమ్ను నో
మదనా! యంచు యదూద్భవుల్ వినఁగఁ ద • త్క్షత్త్రనేత వాక్యంబులన్
జనవర్ బూసను గ్రుచ్చినట్లు, మరుఁడున్ • సంగ్రామముం జేయ నె
మ్మది యోజించి స్వసైన్యయుక్తుఁడయి ర • మ్మా! యంచు నేగెన్ గసిన్.

తే॥ అట్లు చని యతఁడా గయు•నద్రి దుర్గ, ఖేయ వనరమ్య హర్మ్యశ్రముల్ • గింకిరిపడఁ
గొట్టి యెదిరించు నరిసేన•ముట్టి మట్టి, బిట్టుదిట్టగనొప్పె న•ప్పట్టు నందు.

మ॥ గయుఁ డక్షౌహిణి యుగ్మముంగొని మహో • గ్రంపశ్యుఁడై ధీరుఁడై
హయదంతావళిపాదసంహతులరున్ • జ్యాదేవి కంపింపఁగా
రయమొప్పం జని తన్మనోభవునితో • రా! రమ్మ! రమ్మంచు ని
ర్భయవృత్తిన్ జెలరేగి డీకొనె దివిన్ • బర్హిర్ముఖుల్ మెచ్చఁగాన్. ౧౦౪

సీ॥ మత్తేభములతోడ • మత్తగజంబులు, దుక్షారములతోడఁ • దురగములును
రథికవరులతోడ • రథికరత్నంబులు, సారథితతితోడ • సారథులును,
యోధపుంగవులతో • యోధపుంగవులును, మల్లవర్యులతోడ • మల్లవరులు
వైమానికులతోడ • వైమానికాగ్రణుల్, శస్త్రాస్త్రములతోడ • శస్త్రములును

తే॥ దాఁకివీఁకఁ బరస్పర ♦ మాకులంబు,గాఁగ ఘోరయుద్ధంబయ్యెఁ ♦ గడకు గయుని
వీరు లెల్లరు భయపడి♦తేరుల విడి, తత్క్షణంబునఁ బాఱిరి ♦ దశదిశలకు. ౧౦౮

ఆ॥ అవల గయుఁడు పాఱు ♦ నాత్మసైన్యంబును,గాంచి యొంటిగానె ♦ కయ్యమాడ
ధనువు టంకృతులను ♦ దద్దసల్పుచు నేగెఁ, బిదపఁ బంచశరుఁడు ♦ గదిసి కసిసి

ఉ॥ పంచశితాంబకంబులను ♦ వర్మముఁ జించి శతాశుగంబులన్
ద్రుంచి శరం బిషుద్వయము ♦ తోఁ బెదటెక్కెముఁ గూల్చి సూతు హిం
సించి మహాగ్రబాణమునఁ ♦ జెండి హయంబుల నాల్గుతూపులన్
వంచి రథంబు నిర్వదగు ♦ భల్లములన్ మృధమందు మించఁగన్. ౧౦౯

క॥ గయుఁడును గని పెఱధనువును, రయమునఁ గొని దీప్తిమంతు ♦ రతికాంతుని ని
ర్భయమున నిర్వదితూపుల, లయమానలు వేసి మొగులు ♦ లాగున నఱచెన్.

క॥ ఆయెటుకుఁ బ్రద్యుమ్నుం, డాయుని చింతించి యధిక ♦ భాస్వత్శక్తిన్
దీయుచు డాయుచుఁ బాయక, యాయధిపుని మీఁదనైచె ♦ హాహా! యనఁగన్.

క॥ ఆశక్తియుఁ దద్హృది నా,వేశముతోఁ జీల్చి నెత్రు ♦ వీఁవిగఁ గొని బల్
కాశి దగన్ గ్రోలెను ధర, ణీశుండగు గయుఁడు మూర్ఛ ♦ నిద్ధరఁ గూలెన్.

క॥ వెంటనె తద్బహుధనువులు, గంటునఁ దద్గయుని దివ్య ♦ కంఠము లాగెన్
మింటను దిరిగెడి గరుఁడుడు, గంటను గని పాములాగు ♦ కరణిని దేవా! ౧౧౧

చ॥ సురనరదుందుభుల్ మొఱసెఁ ♦ జూపఱు నబ్రమునొంది రెంతయున్
గురిసెను బూలవానలును ♦ గుంభిని విప్పె మొగంబు నింతలో
ధరపయిఁబడ్డ తద్గయుఁడు ♦ తాల్మిని సొమ్మను దేఱి లేచి యా
మరుని పదంబులన్ శరణు ♦ మాకగు! మంచుఁ బడెన్ నరేశ్వరా! ౧౧౨

క॥ పదపడి మదనుఁడు సుంకము, ముదమునఁగొని యచటసాగి ♦ పోయె నవంతీ
శు దరికి బంగరుకర్ణిక, మదమునఁజను షట్పదంబు ♦ మాదిరిఁ బిదపన్. ౧౧౩

ఉ॥ మాలవభూవిభుండు మతి ♦ మంతుఁడునౌ జయసేనుఁడా ప్రజా
పాలకు నాగమంబు విని ♦ బంధుపురోహితవృద్ధపుత్రమి
త్రాలిని గూడి భక్తిమెయి ♦ నర్చలొనర్చి కరంబు లిచ్చి వే
వ్రాలెఁ దదంఘ్రిపద్మముల ♦ పై నటుపై నల పుష్పబాణుఁడున్. ౧౧౪

ఆ॥ కారణాంతరమునఁ ♦ గనినట్టి వృద్ధులౌ, తల్లితండ్రులకును ♦ దండ్రి స్వసకు
నందముగను మ్రొక్కి ♦ పిందానువిందుల, వారిసుతులఁ బ్రీతి ♦ గారవించి.

తే॥ మాలవోద్భవజనులతో♦మలసి యాదవ,వాళి గొలువ మాహిష్మతి♦యనెడు పురికి
నరిగె; యాదవ బలముతో♦దరిని వఱలు, నర్మదా నదిఁగాంచె వి♦న్నాణముగను

వ॥ అనఘా! యానర్మదాతరంగిణీరత్నంబు శృంగారతిలకంబు నుదుటం బెట్టిన చందంబునం గల్లోలభరితంబగు తుంగతరంగనికరంబుచే భాసిలి మకుటం

బును మౌళిభాగంబున ధరించినకరణిం బుష్పగుచ్ఛంబులతో విరాజిల్లి దేవతానిచయంబులు మూర్తీభవించి ప్రకాశించినవిధంబునం గోరకిత పల్లవిత పుష్పిత ఫలితంబులగు వేతసీవేణుచూతామ్రమాతకాదితరునికరంబులతో శోభిల్లి మఱియు సకలవిధంబులను మందాకినీప్రవాహిని మాదిరి వెలుంగుట నాప్రద్యుమ్నుండు గని మనమందలరి తన డేరాలు వేయుట కనువగు ప్రదేశంబని స్థిరీకరించి రమ్యంబుగా వేయించి సురనికరమధ్యంబున వెలుంగు మహేంద్రుని సరణి యాదవాదిబలమధ్యంబునం బ్రకాశించుచుంటఁ దన్మాహిష్మతీపురవిభుండగు నింద్రనీలుండు గని నిజదూతం బిలిచి హస్తినాపురనాథుండును ధీమంతుండును బలవంతుండు నగు ధృతరాష్ట్రునిచే నేనీదేశంబునకు రాజుగా నిర్ణీతుండనైతిని కాన నిటనుండి యాభూవరునకుఁదప్ప కప్పంబు లన్యుల కొప్పంజెప్పంబడవు. సాహసించి రణమొనరించినను నిందు విఫలంబగునని యే గుఱుతింగి చనుమని చెప్పి నిజభటుం బంప నాతండా యాదవసేనకడకుం జని నమస్కరించి తద్గదితోక్తులను విన్నవింప నప్పూవింటివాఁడాలించి యాగ్రహించి కానిమ్ము మాయుగ్రసేనమహారాజునుగాని తద్బలంబునుగాని మమ్ములఁ గాని యీమొనగాఁ డెఱుంగఁడుగాఁబోలు నితఃపూర్వం బిల్లే మమ్ముల ధిక్కరించిన గయకళింగరాజులకుంబట్టిన యధోగతియే యితనికిం బట్టునని యెఱుంగు మన నతివేగంబునం దన యొడయనికడ కరిగి ప్రద్యుమ్నకథితంబగు సంగతి సభాసదులు వినుచుండం బలుక నాయింద్రనీలుండు విని యూర్ధ్వదృష్టిం గొలఁది విచారించి యాదవబలంబును గూర్చి చింతించి శిరఃకంపం బొనర్చి పంచసహస్రగజంబులును, నియుతహయంబులును, నియుతరథంబులును, గైకొని వినయభయంబులతో నాప్రద్యుమ్నున కర్పించి నమస్కరించి రక్షింపుమని ప్రార్థింప నతండు సంతోషంబుతో నవి గ్రహించి చమూసమన్వితుండై యటనుండి కదలి గుర్జరదేశంబున కేగి యదలించి స్వబలంబుఁ జూపించి జయించి కరదంబులం గ్రహించి చేదిదేశంబునకుం జనియె. తద్రాజ్యంబునకుం బాలకుండుగా. ౧౧౭

ప్రద్యుమ్నుఁడు చేదిదేశంబు గెలుచుట.

క॥ ఆనకదుందుభిభగినీ, మానసహరుండు బుద్ధి ♦ మన్మాన్యుండుం
ధీనిధి శిశుపాలుని పిత,యై నెగడొందు దమఘోషుఁ ♦ డను నామముతోన్.

క॥ ఆతని చెంతకు మరుఁడుం, దూతగ నుద్ధవుని బనిపెఁ ♦ దోడ్త నతండా
నేతను గని కొలువున నీ,రీతిని నతులిడి వచించె ♦ శ్రీహరిభక్తా! ౧౧౮

మ॥ దమఘోషా! మన యుగ్రసేనధరణీ ♦ దారుం డకూపారబ
ద్ధమహీభ్రాజితసర్వరాజుల నిజో ♦ ద్దామప్రతాపాదులన్
గ్రమమానట్లు జయించి వారివలనం ♦ గప్పంబులం బొంది ది
వ్యమునీంద్రుల్ దగ రాజసూయకృతి స ♦ ల్పంగాఁ దలంచెం గదా. ౧౨౦

క॥ అందుల కీప్రద్యుమ్నుని, సుందరు భానుమత్కవరుని ♦ శూరుని ధర రా
డ్బృందము గెలువఁగ బలులను, జెందగ మున్నిట్లు బంపె ♦ చేదిధరేశా! ౧౨౧

క॥ కావున నీవును మసలక, యా వీరునకు బలులిచ్చి ♦ యనుపుమ యధిపా!
నావుడు శిశుపాలుఁడు విని, పావకసమనయనుఁడగుచు ♦ వచియించె నిటుల్.

శా॥ ఔరా! కాలగతుల్ దురత్యయములై ♦ యాశ్చర్యముం గొల్ప న
ఘ్ఘారే! స్రష్టను గాలరూపు గుణి వి♦జ్ఞానప్రదుల్ భారతీ
దారుల్ బ్రహ్మరుగూడ నేఁడు కలియే ♦ దాష్ట్యంబుతో నేలఁగాఁ
బ్రారంభించెను నోడ బండి మఱియుల్ ♦ బండ్లోడలయ్యెం గదా! ౧౨౩

ఆ॥ ఎచట రాజహంస♦ మెచ్చట కాకంబు, మూర్ఖుఁ డెచట నెచట♦ బుధవరుండు?
కాని నేఁడు బంటు♦ కాలగతిఁ సార్వభౌముఁ గెల్వఁగడఁగెఁ♦ బలుకఁ గలమె!

తే॥ అల యయాతిశాపంబున♦ యాదవకుల, మెల్ల భ్రష్టరాజ్యపదమై♦ యేవగింపఁ
బడదె! యది యిప్డు రాజ్యంబు♦ స్వల్పమైన, నెగసిపడు మన్గు నదియయి♦ యెగసినట్లు.

ఉ॥ తుచ్ఛకులోద్భవుం డఖిల ♦ తోయధివేష్టితరాజ్యపాలన
స్వచ్ఛయశంబుఁ గాంచిన న♦ పండితపుత్రుఁ డఖండపాండితిన్
గచ్ఛపమూదిపెన్నిధులఁ ♦ గన్న దరిద్రుఁడు ద్రవ్యవంతుఁడై
యచ్ఛబహూకృతుల్ గనిన ♦ నాపఁగఁ బోలునె? పగ్గమేసియున్. ౧౨౬

క॥ వారిధరఁద్రుణమువలెన్, ధీరతఁగని యెక్కి నిక్కి ♦ దివిపైఁ జుక్కల్
దీరుగ మేమే యిత్తఱి, దీరిచితిమని యనుదు రిది ♦ తీరె? చెప్పుమా! ౧౨౭

తే॥ కొలఁది ప్రొద్దుల క్రిందట ♦ నలఁతిరాజ్య
ముగ్రసేనుండు వొందెనో ♦ యొందలేదొ
యపుడె యెంతటి వాఁడయ్యె ♦ నహహ! యతని
కట్టె వాసుదేవుఁడు మంత్రి ♦ యంట కాని. ౧౨౮

క॥ అతఁడు జరాసంధునిచే, మతిచెడి తన మధురవిడిచి ♦ మనుటకు జలధిన్
ద్రుతగతి నక్కెను వాఁడే, సతతము దద్భ్రాభునిఁ గొల్చు ♦ స్వబలాన్వితుఁడై.

క॥ మఱి యా మంతిరి జని సం,కర మల వసుదేవగోప ♦ కప్రభువరు లి
ద్దఱు నా కొడుకని కొడుకని, తురమును బొనరింతు రెంతొ♦ తూధూయనఁగాన్.

క॥ తెల్లనితండ్రి కాంచిన, తెల్లని వసుదేవునందు ♦ ధీరులు దెగడన్
నల్లగ నీ హరి పుట్టెను, దెల్లమయిన వార్త యిద్ది ♦ త్రిజగములందున్. ౧౩౧

తే॥ ఉద్ధవా! నీవు పల్కిన ♦ బుద్ధిమంతుఁ
డతిబలుఁడగు ప్రద్యుమ్నుఁడే ♦ యట్టి సంక
రునకుఁ బుట్టిన నీచుండు ♦ గనుక వీని
కేము కప్పముల్ గట్టుట ♦ యేటిమాట? ౧౩౨

క॥ మా తాడక పోరాడఁగ, నీరాజును రమ్మటంచు ♦ నెట్టనఁ జెపుమా!
పోరా! పోరఁగ రారా!, ద్వారావతి నేఁడుగెల్తు ♦ వైరులు డిందన్. ౧౩౩

తే॥ అని ప్రతిజ్ఞల సల్పి శి ♦ తాస్త్రశస్త్ర
ములను గైకొని ద్వార కేఁ ♦ బోవుచుంటి
నాయనా! సభాసదులార! ♦ నమ్ముఁడంచు
నరుగుతఱి నడ్డి దమఘోషుఁ ♦ డనియె నిట్లు. ౧౩౪

తలిదండ్రులు శిశుపాలునకు హితోపదేశం బొనర్చుట.

ఉ॥ చాలును జాలు సాహసము ♦ చక్కఁగ నోయి కుమార! వైరినిన్
గాలము దేశమున్ దొలుతఁ ♦ గాంచుము మించుము మూఁడుశక్తులన్
మే లగునో సిలుం గగును? ♦ మిట్టిపడన్ ఫలమేమి? నెమ్మదిన్
జాలఁగ యోజనన్ సలిపి ♦ సాగుము వేగ యమోఘపద్ధతిన్. ౧౩౫

క॥ చేసెడికార్యము మంచిదొ, దోసమొ యెదొ యరయనాను♦దుడుకొప్పదు సూ
వాసిని గోరెడివారలు, గాసంతయు దుడుకులేక ♦ కననౌ శమమున్. ౧౩౬

క॥ శమమే కలహము లాపెడి, శమమే చెదిరిన మనంబుఁ ♦ జక్కఁగఁ జేయున్
శమమే మేలులఁ గూర్చెడి, శమమే తపమని వచించు ♦ సకలశ్రుతులున్.

క॥ కినుకను మోహము దానన్, దనరెడి స్మృతివిభ్రమంబు ♦ దానను మతి నా
శనమును గల్గెడి మతి దా,న నశించెడిఁ గానఁ బ్రజ గ ♦ నందగు శమమున్.

క॥ పురుషార్థంబుల కోర్కె, కరమగు సాధనమటంచు ♦ ఘనులందు రిటన్
ద్వరితము గూడదు గనుక సు,కరముగ సామంబె సల్పఁ ♦ గాఁదగు బుత్రా! ౧౩౯

ఉ॥ దానముచేత సామమును ♦ దానము సత్క్రియచేత నద్దియున్
ధీనిధినుత్యయోగ్యతనుఁ ♦ దీప్తివహించును వెండిఁ జేదిభూ
జానులు యాదవాళి యొక ♦ జాతికిఁ జెందినవారు గాన నా
మానస మొప్పకున్న దని ♦ మార్కొని పోరుట కీరు వారలున్. ౧౪౦

క॥ అతఁడు సల్పెడి నీతియొ, పూతము బురుషార్థదంబు ♦ బుధనుత్యము నా
చేతనయినవఱ కేదియొ, ప్రీతిగఁ జని యిడెద నీవు ♦ వెంబడి రమ్మా! ౧౪౧

క॥ అని యుచితంబుగఁ జెప్పఁగ, విని యల శిశుపాలుఁ డందు♦భేదితుఁడయ్యెన్.
దన నోరెత్తకయుండెను, జనకులు పుత్రకుల నిట్లు ♦ శాసింపఁదగున్. ౧౪౨

తే॥ ఇంతలో శ్రుతశ్రవ యను ♦ నింతిమిన్న, చేదిపతిరాణి వసుదేవు ♦ చెల్లెలటకు
వచ్చి వినయావనతయయి♦పలికెనిట్టు,లాత్రగాఁడును ఖలుఁడైన♦పుత్రకునకు.

మ॥ తనయా! దుఃఖముగూర్పఁబోకు మనమున్ ♦ దద్యాదవుల్ బోరుటల్
జన దా యానకదుందుభిప్రభువు నీ ♦ సౌఖ్యార్థియౌ మాతులుం

డనియుఁ దత్సుతుండైన శ్రీహరిని నీ ♦ యాధిక్యముం గోరు బా
వనుగా భావమునం దెఱింగి విను మ ♦ బ్బా ! పట్టు వోఁగొట్టురా. ౧౪౪

ఉ॥ ప్రస్తుతమందు నిందులకు ♦ వచ్చినవారలు కృష్ణు నాత్మజుల్
నిస్తులశౌర్యధైర్యబల ♦ నిర్మలభావయుతుల్ మహాత్ములుఁ
శస్త్రశరీరు లందునఁ బ్ర ♦ శంస్యులు బూజ్యులు నాకు మీకునుఁ
గస్తి ఘటించు భండనము ♦ కై తలఁపన్ వలదయ్య ! పుత్రకా ! ౧౪౫

చ॥ అదియునుగాక నిన్నలిసి ♦ యాగతులై నటువంటి వారి నా
మదనముఖప్రభూత్తముల ♦ మాటలఁ బూజల లోటు లేనటుల్
ముదమున గారవించి బల ♦ ముఁ గొలువంగను దోడుకొంచు నా
సదనముఁ జేర్ప నే నిపుడు ♦ చాలఁగఁ గోరుచునుంటి నాత్మజా ! ౧౪౬

క॥ చిరకాలమయ్యె వారిని, మురిపెముతోఁ జూడ నిపుడు ♦ ముచ్చటపడెదన్
ద్వరగా మాతో రమ్మిఁక, దొరకదు సుత ! యిట్టివేళ ♦ స్తుతవీరవరా ! ౧౪౭

క॥ తలిదండ్రులు త్వదీతిని, బలికిరి శిశుపాలుఁ డద్ది ♦ పాటింపక యి
ట్టుల మఱి తన వారలకున్, బలికెను జెట్టులు హితోక్తి ♦ బాటింతురొకో ?

శిశుపాలుఁడు ప్రద్యుమ్నునిపై దండెత్తుట.

శా॥ అమ్మా ! నాకలరామకృష్ణులు సతం ♦ బాగర్భశత్రుల్ గదా
యామ్నాయాపులు యాదవుల్ పగను నా ♦ కాయాసముల్ గూర్పరో
యమ్మాడ్కిన్ మన కుండినాహ్వయపురం ♦ బందందఱున్ జేరి పూ
ర్ణమ్మైనట్టి పరాభవంబు గలుగన్ ♦ నాపెండ్లి నాపింపరో. ౧౪౮

క॥ వీరలతో నేయంబే, నేరీతిని జేయవలెనొ ♦ యేమేమి ? యహా !
వీరిని భండనవహ్నిని, మారణహోమం బొనర్తు ♦ మనవా రలరన్. ౧౫౦

తే॥ అమ్మ! మీరిర్వురుం గూడ♦నరులపక్ష,మైతిరేని మిమ్ముఁజెఱసాల♦యందుఁ బెట్టి
కష్టపెట్టెదఁ గంసుండు ♦ కన్నవారి, జెఱను బెట్టి వేధించిన ♦ కరణి నిజము.

వ॥ అని కఠినంబుగాఁ బలుక నాతలితండ్రు లిర్వురు ఖిన్నులై. ౧౫౧

తే॥ ఆరయ నజాతమృతమూర్ఖ♦లైనసుతుల, నాద్యులిర్వురు మంచివా♦రంతిముఁడటు
గాఁడుగద యాద్యులో సకృ♦త్కష్టదులిఁకఁ,జివర వాఁడసకృద్వ్యథన్ ♦దవులఁ జేయు.

ఉ॥ ఎవ్వఁడు మంచిసేఁతల ర ♦ చించి పితన్ దనియంగఁ జేయునో
యవ్వినతుండె పుత్రకుఁడ ♦ హా ! పతికిన్ బ్రతిలేక సంతతం
బెవ్వతె తత్సుఖం బఖిల ♦ షించునొ యాసతి భార్య నేఁ
డెవ్విధినేన్ సుఖవ్యథల ♦ నెంతయు నుండునొ వాఁడె మిత్రుఁడౌ. ౧౫౪

చ॥ ఘనుఁ డటువంటిపుత్రకుఁడు ♦ గల్గఁడుగా యని మిన్నకుండిరో
జనవర ! యుద్ధవుం డవల ♦ సాగి యటన్ నిజనేతచెంతకున్

జని శిశుపాలసూక్తులఁ దు ♦ చాలును దప్పనియట్లు చెప్పె నం
త నలమహాఖలుండు తన ♦ చాయల భస్మమొనర్ప నేర్పునన్. ౧౭౭

క॥ వాహిని ధ్వజినియుఁ బృతనా,క్షౌహిణులను నల్దెఱఁగులఁ ♦ గ్రాలెడి చము వు
త్సాహముచే నాయుధముల,చే హావణించి మును నడువ♦సిద్ధమొనర్చెన్. ౧౭౮

తే॥ అవల బహులాశ్వుఁడిట్లనె♦నమరమునికి, నెంతసైన్యమాతఁడు గొని♦యేగెదాని
లెక్కలన్ నాకుఁ జక్కఁగా♦వక్కణించు, మీరు కాలత్రయజ్ఞులు♦ధీర! యనఁగ.

వ॥ రాజా! యవధరింపుమని యిట్లని చెప్పంగడంగె. వందయేనుఁగులును, బదివేల గుఱ్ఱంబులును, లక్షకాల్బలంబును, బదునొకండువందలమంది రథులును, గలిగినది సేన యనియు నేతద్ద్విగుణంబుగా మీఱు సేన చతురంగిణియనియు, జతుశ్శతద్విపంబులును, నయుతరథంబులును, జతుర్లక్షతురంగంబులును, శస్త్రాస్త్రబలవాహనసంపన్నులును, లోహకంచుకాంచితులును, ధనుర్వేదపారీణులును సమర్థులు నగు గోటిపదాతులును, విరాజిల్లునది వాహిని యనియు, దీని కిబ్బడిగా నున్నది ధ్వజిని యనియు, దీని కినుమడిగా భాసిల్లునది పృతనయనియు, నిద్దాని కిమ్మడిగాఁ గన్పడునది యక్షౌహిణియనియు దీనికి నాయకుండైనవాఁడు సాహసుండనియు, శూరుండనియు, నిట్టి శూరులను నూఱుగురను భరించువాఁడు సామంతుండనియు, నేతాదృక్సామంతశతంబును నిర్వహించువాఁడు గజియనియు సారథిరథవాజులం గాపాడి యుద్ధమొనర్చువాఁడు రథియనియు, నీదృక్లక్షణంబులు గలిగి సేనలం బ్రోచువాఁడు మహారథియనియు పూర్వోక్తకార్యంబులు నెరవేర్చుటయేకాక శత్రుసైన్యంబులను ధ్వంసంబొనర్చువాఁ డతిరథుండనియుఁ దెలిసికొనుమని వెండియు నిట్లనియె. ౧౭౯

తే॥ అట్లు సేనల శిశుపాలుఁ♦డమరిచికొని, వాహినీధ్వజినులనెడి♦బలగములకు
సరగ సేనానులుగ ద్యుమ♦చ్ఛక్తులనెడి,వారి నతిబలిష్ఠులను నే♦ర్పాటుజేసి.

క॥ పృతనాక్షౌహిణ్యాహ్వయ, వితతచమువులకును రంగ ♦ పింగాభిధులన్
బతులుగ నొనరిచి మంత్రిస,హితుఁడై రతిపతిని గెల్వ ♦ నేగన్ సాగెన్. ౧౮౦

ఉ॥ కాహళదుందుభుల్ మొఱసె ♦ ఖంగున ఘంటలు మ్రోఁగెఁ గార్యని
ర్వాహకపంక్తి కట్టులఁ గ ♦ రంబులఁ దాలిచి వెంటనంటెఁ ద
త్శ్రీహరిపుత్రసేన యరి ♦ సేనలు నా జలధిం దరింప ను
త్సాహములో నిరీక్షణము ♦ సల్పుచు నుండె ననంతరంబునన్. ౧౮౧

ద్యుమచ్ఛక్తులు యాదవసేనతోఁ బోరి సాత్యకికృతవర్మలచే నీల్గుట.

ఆ॥ అటు లుభయుల ఫౌజు ♦ లాజిరంగంబున, గలిసికయ్యమాడఁ ♦ గడఁగెనందుఁ
దొలుత వాహిని యను♦బలగంబుతో ద్యుమం,తుండు చైద్యునాజ్ఞఁ♦ద్రోసి బగల.

క॥ అదరక యటు శిశుపాలుని, పెదమొన తలపడుటఁ గాంచి ♦ భీతిలక జగ
ద్విదితులు బలులగు యాదవు, లదిరా! యనఁ బ్రతిఘటించి♦రస్త్రాదులతోఁ.

తే॥ ఉభయసైన్యబాణంబుల♦నుద్ధరముగ, నంధకారమ్ము గ్రమ్మె ర♦ణాంగణమున
నుభయహయపద్రజంబుల♦నభము మిగుల,గప్పఁబడియెను బ్రేక్షకుల్♦గాంచి యదల.

క॥ అందలి వాజులు పఱుగిడి, సందియము విడిచి రిపుల ♦ సామజములపై
సందడి జేయును మఱిఁగరి, బృందంబోఁ కాల్బనరుల♦నెక్కడి త్రొక్కన్. ౧౬౫

ఉ॥ బాణగదాస్త్రశస్త్రవర ♦ పట్టిసశక్తికృపాణశూలముల్
బాణులఁ దాల్చి త్రాణఁగసి ♦ వారలు వీరల వీరు వారలన్
ప్రాణములం దెగించి పడ ♦ బాఁదుకొనం దుద నందుఁ బాదముల్
బాణులు నంగముల్ దెగిన ♦ బంటులు కన్పడసాగె రోవిభూ! ౧౬౬

సీ॥ అతిజవంబున నేగు ♦ నశ్వంబులన్ రెండు, తుండెములుగ జేయు♦నొండుగండఁ
డతిబలంబున మించు ♦ హస్తిదంతంబులం, బట్టి కుంభంబులం ♦ బఱుగునొక్కఁ
డిభవాహమంత్రులన్ ♦ మృగరాజువలెఁ బట్టి, పట్టిపల్లార్చెడి♦భటుఁడొకండు
పరసైనికులనెల్ల ♦ గరవాలమునఁ జీల్చి, నఱువలె దిరుగాఁడు ♦ భటుఁడొకండు
తే॥ విహగరీతినిఁ జెంగున ♦ విన్నుదాఁకి, పేఁకమార్దుర పై దూఁకు ♦ వీరుఁడొక్కఁ
డుండియుండని యట్లుండి♦ఖండనంబు,జరుపుదళవాయి యొక్కఁడు♦వఱలు నందు.

మ॥ అవలన్ జైద్యబలోల్లసద్ధ్రితము లా ♦ యక్రూరుఁడీక్షించి బా
ణవితానంబుల గుప్పె నంత రిపుసే♦నల్ వానకాలంబునన్
రవినిన్ మబ్బులు గప్పినట్లు గసిఁదీ ♦ ర్వంబైన విల్లమ్ములన్
నవయన్ వానిని గప్పెఁ జేదిధరణీ ♦ నాథోత్తములన్ బొంగుచున్. ౧౬౭

ఉ॥ అంతట గాందినీతనయుఁ ♦ డాగ్రహమూర్తి యనంగ నొప్పి ప్ర
ణాంతము సల్పు రిష్టిఁగొని ♦ యారిపులేసెడి బాణసంతతిన్
సాంతముగా జయించి స్వమ ♦ హోత్తరశక్తినిఁ దద్ద్యుమంతు న
భ్యంతర మింతలే నటు ల♦యారె! యనం బ్రహరించె దేవరా! ౧౬౮

తే॥ తత్ప్రహారంబునన్ వాఁడు♦ధరణిపైన, రెండుగడియలు దాఁక మూ♦ర్ఛిల్లి మరల
లేచి లక్షభారభరక♦ల్పితను గదను,గొట్టె వాని లోమ్మున మేఘు♦మట్టు లఱచె.

తే॥ వాని దెబ్బ నక్రూరుండు ♦ వ్యాకులాత్ముఁ
డగుట యుయుధానుఁ డీక్షించి ♦ యతిరయమున
గాలరుద్రుని మాడ్కిని ♦ గవిసి తద్ద్యు
మంతునకుఁ దిరస్కృతి బలు ♦ మాటలాడి. ౧౭౧

ఉ॥ చీటికిమాటికిన్ విలు వి ♦ శేషవిధంబులఁ డంకరించి వా
చాట! త్వదుత్తమాంగము వె ♦ సన్ హరియించెడి దీనిఁగాచికో

మ్మా! టకటొంకు లాపు మిఁక ♦ నంచొక తూపును వేయ నద్దియా
పోటరి గొంతుకం జతికి ♦ భూమిని గూల్చె ననంతరంబునన్. ౧౭౩

తే. తద్ద్యుమంతుని వీరులు ♦ దాళఁజాల, మంచు గాల్కొలందిని బాటి ♦ రవల శత్రుఁ
డనెడి ధ్వజినీప్రభుఁడు వచ్చి ♦ యట్లువారు, పరుగిడుటఁగాంచి కోపించి ♦ పరితపించి.

మ. అరరే! నే నిట నుండఁగానె యిటు ల ♦ న్యాయంబుగా సాగ నే
మిర! మా వీరులు బాఱఁగాఁ దొడఁగిరే ♦ మీ! యాదవుల్ రేగిరే!
సరియే నేనిఁక నూఱకొంట దగునా? ♦ చాల్జాలు నం చుద్ధతిన్
వరశూలం బల సాత్యకిన్ దునుమఁగా ♦ వైచెం జుమీ పిమ్మటన్. ౧౭౪

ఉ. సాత్యకి వానిదెబ్బ నిము ♦ సంబు రసన్ గడబెట్టి నంతఁ ద
త్ప్రిత్యయపాత్రుఁడైన కృత ♦ వర్మ రయంబున నేగుదెంచి త
న్నృత్యహతోజ్జ్వలద్రథము ♦ నూకఁగ నల్ప ననల్పశత్రుఁడున్
వ్యత్యయమయ్యె నంచు నధి ♦ కాగ్రహముం గొని దువ్వె మీసముల్. ౧౭౫

చ. కసిఁ బస దివ్యముద్గరముఁ ♦ గైకొని తత్కృతవర్మ తేరు బ
ల్పునసిగ నొనర్చె నావల బ ♦ లుండగు నాతఁడు స్యందనంబు వీ
డి సరగ నట్టి శత్రునిఁ గ ♦ డిందిగఁబట్టి భుజా యుగంబునన్
వెస రసఁగూల్చి నెట్టె నొక ♦ విస్తృతయోజన మేగునట్లుగాన్. ౧౭౬

క. అది కని తచ్ఛిశుపాలుం, డదరియు నల రంగపింగు ♦ లను పెగ్గడలన్
మదపూరితులను హితులను, నెదిరుల నెదిరింపుఁ డంచు ♦ నేడ్తెఱఁ బంచెన్.

రంగపింగులు యాదవబలంబుతోఁ దలపడి భానునిచే హతులగుట.

చ. అనిమిషమీఁత వారిరువు ♦ రగ్నిసమీరులు వచ్చినట్లుగాఁ
జని శితబాణవర్షము ల ♦ సాధ్యముగాఁ నొనరించి మించి బ
ల్కినుకను దంతిరథ్యములఁ ♦ గేతనముల్ రథులన్ రథంబులన్
మొనతలకట్టులన్ మిగుల ♦ మోఁదిరి దేవ! యనంతరంబునన్. ౧౭౮

క. ప్రద్యుమ్నుఁడు రిపుబల మన, వద్య మధిక మనుచుఁ గాంచి ♦ బాపురె! మనవార్
సద్యస్కాలమున మొనన్, సద్యశముఁ గడనఁ జేయఁ ♦ జాలరు కట్టా! ౧౭౯

క. అను చిటు యాదవులందఱు, ఘనసభగాఁ గూర్చి యిట్లు ♦ గంభీరగళం
బున యాదవులారా! యటు, గనుఁడీ యరు లెటుల మనలఁ ♦ గారించెదరో?

క. కావుననే మన మొనమొన, నీ వేళనుజొచ్చి శత్రు ♦ బృందమ్మును వీ
రావేశముతోడుత నల, వైవస్వతపురికి నంపి ♦ వచ్చెద మెచ్చన్. ౧౮౧

తే. లేనిచో రంగపింగసే ♦ నాను లింక, మన పతాకిను లన్నిటి ♦ మడియఁ జేయఁ
గలరు కావునఁ బోయెద ♦ నలఘుశక్తి, మీరు సైతము రండిప్పు ♦ మేదమునకు. ౧౮౨

వ॥ ఇట్లు శపథంబులాడుట శ్రీకృష్ణపుత్రకులలో నొక్కరుండును, నుక్కరియునగు భానుండనువాఁడు తత్సభాగ్రమందు నిలిచి సభాసదు లాలకింప మేఘగంభీరభాషణంబులతో నగ్రజాగ్రణీ! తమ యాగ్రహంబున కిది యదనుగాదు. ముల్లోకంబు లొక్కమొగి నెత్తటి నెదుర్కొనఁ దలంచునో యత్తఱి భవదుగ్రధనుష్టంకారంబున కవసరంబు గలుగునేమో కాని సామాన్యులగు నీ రంగపింగుల శిరంబులం దురంబునం డొల్లంజేయుట కలఁతియగు నా కృపాణంబు చాలదే? కళింగరాజును జయించినపగిది నివ్వారినిం గెల్చి సంతోషంబు గూర్పం గలనని పగ్గించి తత్ప్రియత్నంబాపి ఖడ్గధరుండై పదాతిభాతి నరాతిపతాకినిలో వనగజంబు వనంబునం బ్రవేశించు చాడ్పునం జొచ్చి హయంబులం ద్రుంచి పతాకలం జించి యదలించి యెదిరుల మదంబు సదమదంబుగావించియు బుజంబులం గొట్టియుఁ బెడతొక్కలుగాఁ గట్టియు దుత్తునియలగునట్టుల మట్టియు నెట్టియు క్షీణపుణ్యంబులగు తారకంబులు బుడమింబడెడివడువున ముత్తెంబులు రాలుచుండ గుంభికుంభములం బగిల్చి ద్వితీయఖడ్గంబునం దత్సైన్యంబంతయు నంతంబుసల్పి నీహారపటలంబు భేదించుచుం బ్రకాశించెడి ప్రభాకరునిచందంబున వెలుంగుచు శ్రీకృష్ణదత్తంబగు కరవాలంబునం దద్రంగపింగళతాంగంబులం భంగంబు గావించి తురగంబులం దుఱుమాడి సూతులం ఘాతించి తన ఖడ్గంబును భేదింపవచ్చు తదుభయచంద్రహాసంబులను నాశంబు సల్పి తద్రంగపింగోత్తమాంగంబులకుం గుఱియగునట్లు సముదగ్రాగ్రహవ్యగ్రుండై యసివరం బొందువైన నా యిరువురిశిరంబు లేకకాలంబునం దెగి ధరణింబడి దొరలుచుండ నభ్భానుం డానందించి యవి సంగ్రహించుకొని, ౧౮౩

చ॥ జయజయరావముల్ సెలఁగఁ ♦ జారణులుం గొనియాడ స్వీయులున్
భయమును వీడి సంతసిల ♦ వైరులు పాఱఁగఁ బూలవాన ల
వ్యయముగ వేల్పులుం గురియ ♦ వాద్యములున్ మొఱయంగ నమ్మచె
ల్ల! యనఁగఁ జూపఱున్ బహువి ♦ లాసముగా నిడె మారుచెంగటన్. ౧౮౪

మ॥ తరువాతన్ శిశుపాలుఁ డా యిరువు రం ♦ తం బొందుటం గాంచి వీ
రరసం బుబ్బ శితాస్త్రముల్ బవనశీ ♦ ఘ్రవ్యాయతాశ్వీయబ
ద్ధరథశ్రేష్ఠములున్ విమానసమముల్ ♦ దంతుల్మదోద్వృత్తము
ల్వరవిద్యాధరతుల్యులున్ భటులు గ్రా ♦ లం బోయెఁ బోరాడఁగన్. ౧౮౫

తే॥ అటు వసుంధర మాఱుమ్రో ♦ యంగ సల్పు
తూర్యములతోడ రథమెక్కి ♦ తుద మొనర్పఁ
జేదినాథుఁడు వచ్చుట ♦ జిత్తజుండు
గాంచి యోజించి రోషించి ♦ మించి తొలుత. ౧౮౬

క॥ పురుహూతదత్తరథికుం, డురవడితో నెక్కి శంఖ ♦ మూఁదెను దానన్
ధరణియు నభమును మ్రోఁచెను, బరచిత్తములఁ గలఁగుండు ♦ పడియెను సుగుణీ!

ప్రద్యుమ్నుండు శిశుపాలునితోఁ బోరి యోడించుట.

క॥ అవలన్ దత్కందర్పుం, డవిరళశిశుపాలసైన్య ♦ మను మేడకు శా
తవిశిఖముల మెట్లుగఁ గూర్చె విబుధులెల్లరును వినుతి ♦ సేయఁగ వీఁకన్.

శా॥ సత్త్వాఖ్యాతుఁడు చేదినాథుఁ డవలన్ ♦ శౌర్యాత్మజారంభముల్
మొత్తన్ మాటికిఁ జాపటంకృతుల నా ♦ మూలంబు గావించి త
ద్దత్తాగ్నేయసుశిక్షితంబు దృఢమౌ ♦ ధాత్రస్త్రమున్ వేయ నా
చిత్తోద్భూతుఁడు దత్తటిల్లకయ శో ♦ చిష్కేశతుల్యాత్ముఁడై. ౧౯౦

తే॥ అతని యస్త్రప్రభావంబు♦నాక్షణంబు,నందు నవలీల మరల బ్రహ్మాస్త్రమేసి
సంహరించెను దానికా♦శౌర్యధనుఁడు,చైద్యుఁడగు శిశుపాలుఁడు♦సాహసమున.

క॥ అంగజుభంగమొనర్పఁగ, నంగారాస్త్రంబు భార్గ ♦ వాంతఃకరణా
భంగురలబ్ధము వేయఁగ, నంగారంబులు జనించి ♦ యడఁజడులిడఁగన్. ౧౯౧

క॥ అర్జునమిత్రసుపుత్రుఁడు, పర్జన్యాస్త్రంబు వేసి ♦ వాని శరంబున్
భర్జించి సుఖముఁ గూర్పఁగ, దుర్జనుఁడౌ చైద్యుఁ డలక ♦ తో నాత్రుటిలోన్.

మ॥ మలయాద్రిన్ మును కుంభసంభవుఁ డసా ♦ మాన్యంబుగా దివ్యశి
క్షలఁ గావించిన దర్పవంతము గజా ♦ స్త్రం బేయఁగా నందు నే
న్గులు దీర్ఘంబులు నుద్భటాన్వితములై♦ కోటానఁగోటుల్ జనిం
చి లివన్ మారుని సేనపై దుమికి హీం ♦ సింపం గడంగెన్ జుమీ! ౧౯౩

క॥ అంతట హాహాకారము, లంతట జనియించె మరుఁడు ♦ యాదవసేనల్
జింతిలుటఁగాంచి తద్దైన్యాంతకరము నారసింహ ♦ మస్త్రము బఱపెన్. ౧౯౪

ఉ॥ అందు సటాచ్ఛటాశితన ♦ ఖాయతలాంగలభీమనాకృతుల్
బొందిన శ్రీనృసింహుఁడను ♦ పూరుషుఁ డొక్కఁడు బుట్టి బిట్టువె
ల్గొంది తదస్త్రనిర్గతమ ♦ దోత్కటహస్తిసమూహకుంభముల్
జిందఱసల్పి హుంకృతులఁ ♦ జేసి గ్రసించి తిరోహితుండుగాన్. ౧౯౫

క॥ దమఘోషుని తనయుఁడు నిరు,పమపరిఘంబును గిరాటు♦వైచెను బిదపన్
సుమబాణుఁడు తద్దేతిని, యమదండముచేతఁ జెండె ♦ నాసమయమునన్. ౧౯౬

ఆ॥ కనలి చేదివిభుఁడు♦ఖడ్గచర్మములతో, మంట నుఱుకు మిడుత♦మాడ్కి మరుని
మీఁది కుఱుక నతఁడు♦మెలకువ యమదండ, వరముచేత నవ్వి♦పాడుచేసి. ౧౯౭

ఆ॥ పాశిదత్తమైన ♦ పాశంబులంగొని, కసిని వానిఁబట్టి ♦ కట్టి పదను
కత్తితోడ నఱకఁ ♦ గడఁగ గదుండను, హరికుమారుఁ డడ్డి ♦ యనియె నిట్లు.

మ॥ పరిపూర్ణుండు పరాత్పరుండు విమల ♦ బ్రహ్మం బుపాస్యుండునౌ
హరిచే నీతఁడు వధ్యుఁడంచు వినమా! ♦ యావాక్యముల్ వ్యర్థమౌ
కరణిన్ సల్పకుమన్న! లేనియెడలన్ ♦ గారానికార్యంబు లి
త్తఱిఁ గావించిన దోషివయ్యెదవు గా ♦ దా! నీవు యోజింపుమా! ౧౯౯
తే॥ పిదప నీ వార్త శిశుపాలపితకుఁ దెలియ, నతఁడు నవరత్నహారదివ్యాంబరములఁ
గొని యథాశక్తిఁ గప్పముల్ గొంచు సపరి,వారముగ వచ్చెఁ బ్రద్యుమ్ను ♦ పాలికపుడు.
చ॥ మనసిజుఁ డాగ్రహంబు విడి ♦ మన్నన లా దమఘోషనేతకున్
బొనరిచి మ్రొక్క నమ్ముఁడయి ♦ మ్రోలను నిల్వ నతండు మెచ్చి నా
యన! యిపుడీవె ధన్యుఁడ వ ♦ హా! యెటువంటి పనుల్ బొనర్పఁ బ
గ్గెను నొనరించి సల్పితివి ♦ కీర్తికరంబని పల్కె బ్రీతితోన్. ౨౦౧
క॥ తెచ్చిన కానుక లన్నిటి, నిచ్చి కరంబుల నొసంగి ♦ యీ శిశుపాలున్
గ్రచ్చఱఁ బ్రోవుమ! యీతని, మచ్చరమున కర్హాకృతి క ♦ మంబుగ నయ్యెన్.
ఉ॥ కావున నింతటన్ విడిచి ♦ కావుము మా నెఱసుల్ క్షమింపుమో
దేవ! యనాథరక్షణను ♦ ధీ! యని వేఁడ మనుండు భూనరా!
యీ విపరీతకార్యతతి ♦ హేతువు నీ సుతుఁ డేముగాము కా
లావగుణంబె కారణమ ♦ టంచు మనంబునఁ దోఁచుఁ బూర్తిగాన్. ౨౦౩
తే॥ అని సముచితంబుగా బల్కి ♦ యతని సుతునిఁ
బాశముల విప్పిపుచ్చ న ♦ పారముదముఁ
బొంది యా దమఘోషుఁడు ♦ పుత్రుతోడ
స్వీయచంద్రికానగరంబుఁ ♦ జేరె జనక! ౨౦౪
తే॥ అవలఁ దచ్చైద్యసామంతు ♦ లందఱు తమ
ప్రభుని గతిగని యెదరక ♦ బలుల నిచ్చి
రంతఁ గంతుఁ డటన్ సాగి ♦ యాదవాన్వి
తముగ మనుతీర్థమున జల ♦ కముల నాడి. ౨౦౫

ప్రద్యుమ్నుండు కొంకణదేశాదులం గెలుచుట.

క॥ కొంకక జంకక లఘుగతిఁ, గొంకణదేశంబు సొచ్చి ♦ క్షమఁ దనరాకన్
గింకరుచేఁ దెల్పఁగఁ ద,త్కొంకణపతి వచ్చి మరుని ♦ కడ కిట్లనియెన్. ౨౦౬
ఉ॥ దేవ! గదాధరోత్తముఁడ ♦ దివ్యకులప్రభవుండ దిట్ట మే
ధావి యటంచు నన్బిలువ ♦ ధాత్రిని నేలెడివాఁడఁ గావునన్
నీవు గదారణం బిపుడు ♦ నెమ్మినొనర్చి జయించి నాకు సే
నావళి రూపుమాపుమని ♦ యాడగ నిట్లనెఁ బచ్చవిల్తుఁడున్. ౨౦౭
తే॥ పెక్కుమందిమి విఖ్యాతవీరవరుల, మేము చెలఁగితి మఱియు నీ ♦ వేకుఁడవు
గావె యిద్ది యధర్మము ♦ గాదె కనుకఁ, ద్వరఁగఁజని కప్పముల్ గొని ♦ తమిని నిమ్ము.

క॥ అనవుడు మేధావియు ని,ట్లనియెను నటుకానియెడ మ ♦ దంఘ్రిని దీనిఁ
గొని కదలించుఁడి! చూతము, ఘనవీరులు గారె చెపుడి! ♦ గట్టిగ ననఁగాఁ.

క॥ దానికి యాదవు లందఱు, మానముతో మిండిపడిరి ♦ మఱిఁ దత్తాలాం
కానుజుఁ డధికబలుం డభి,మానియునై గదుఁడు వాని ♦ మదము నణంపన్.

చ॥ గదను గ్రహించి నిల్వ నల ♦ కొంకణనాయకుఁ డాగ్రహంబునన్
గదఁగొని వానిపై విసరఁ ♦ గాంచి గదుండు గదన్ దదీయమౌ
గద నుసిఁజేసి రోసమునఁ ♦ గాడుపడన్ బ్రహరింప నట్టి బె
ట్టిదుఁడు వసుంధరన్ బడి క ♦ డిందిగ నోటను గ్రక్కె నెత్తురుల్. ౨౧౧

తే॥ మరల యుద్ధమొనర్పఁగ ♦ మనసుపడక, గొబ్బునం గప్పముల్గొని ♦ కోరి శరణు
సపరివారంబుగాఁ జని ♦ శాంతమూర్తి, కట్టి ప్రద్యుమ్ననకు నిచ్చి ♦ యభినుతించి.

ఉ॥ పామరుఁడన్ మహాత్మ! భగ ♦ వంతుఁడ వీవు పరీక్ష సేయఁగా
నీమెయిఁ గయ్యమాడితిని ♦ నీ నెఱసున్ క్షమియించి నా నతుల్
ప్రేమునిడితో గ్రహింపుమని ♦ వేఁడి స్వకీయపురంబుఁ జేరె నా
పై మదనుండు తత్థ్సలముఁ ♦ బాసి చనెన్ గుటకప్రదేశమున్. ౨౧౩

వ॥ అట్లు చనెడిసమయంబున మృగయార్థంబై బయలువెడలిన తత్కుటక దేశాధీశుండగు మాలిం గాంచిన జాంబవతీసుతుండగు సాంబుం డా రాజువలన బలులం గొనితెచ్చి యప్పచ్చవిల్లున కీయ నతం డందికొని యటఁగదలి మహా భయంకరంబగు దండకారణ్యంబు బ్రవేశించి మునీంద్రుల యాశ్రమంబులం దిలకించి నిర్వింధ్యాపయోష్ణితాపీతీర్థంబులలో సైన్యసమన్వితంబుగా స్నానంబు సల్పి శూర్పారకక్షేత్రంబున కరిగి యటనుండి నడచి ద్వైపాయనీహ్రదంబున కేతెంచి కాంచి యంత ఋశ్యమూకంబునకుం జని విలోకించి రాత్రిందివములు పర్జన్యుండు వర్షించెడి ప్రవర్షణాచలంబునకుం బోయి యానందించి శివక్షేత్రంబగు గోకర్ణంబును దర్శించి యట నిర్గమించి త్రిగర్తదేశనాథుని కరంబు లందికొని కేరళదేశంబు బ్రవేశించి యుండుట మన్ముఖంబునం దదధిపతియగు నంబష్ఠుండు విని పారితోషికంబులొ కందర్పున కొసంగ నాతండు గైకొని కృష్ణవేణీతరంగిణినిం దాఁటి తైలింగదేశంబున కరుదెంచె. అత్తఱిఁ దత్పురోపవనంబునం బురంధ్రీలలామములతో మృదంగాదిమధురధ్వనిసమేతంబుగా నింద్రుం డచ్చరలతోడ విహరించెడి వడువునఁ గ్రీడించు తత్తైలింగవిభుండగు విశాలాక్షుని పట్టపురాణియగు మందారమాలిని రజఃపుంజవ్యాప్తంబగు నభంబును గాంచి వెఱచి మనోహరా! కామాంధుండవై యేకార్యంబును గనలేకుంటివి. నేనో భవన్ముఖాలకాళిభ్రమరంబుగా నుండి యీవఱకెట్టి దుఃఖంబు నెఱుంగకుంటి. యాదవేశ్వరుండగు నుగ్రసేనుండు రాజసూయంబుఁ జేయందలంచి దిగ్విజయార్థంబై ప్రద్యుమ్నుని యాదవబలోపేతునిగాఁ బంపెనని

శ్రుతంబయ్యె. అతఁడే కాఁబోలు ప్రస్తుతంబున నా శిశుపాలాదిభూపాలకులం గెల్చి దుందుభిసందోహధుంకారంబులతోడను, కోదండటంకారంబులతోడను, మత్తేభ శీత్కారఘూత్కారంబులతోడను, నిన్నుంగెల్వవచ్చినట్లున్నది. కాన జాగుమాని కప్పంబు లతనికప్పనంబుసేసిరమ్మని హెచ్చరింప నావిశాలాక్షుండు నిజబలసహితం బుగా బలులం గొని యప్పూవిల్తున కర్పించి నమస్కరించి యథాప్రకారంబుగా నిజోద్యానవనంబునకుం జనియె. అంత నారతీకాంతుండా చోటువీడి పంపాసరో వరంబున కరిగి యందవగాహనంబు సల్పి మహారాష్ట్రదేశంబునకుం బోయి తద్వి భునిచేఁ గానికలం గొని యటసాగి కర్ణాటదేశంబు సొచ్చి తదధినాథుండగు సహస్ర జిత్తుచేఁ బూజలతోఁ గూడిన కప్పంబుఁ బరిగ్రహించి యతని వీడ్కొని దేహజంబు లగు వికారంబులం జయించుట కేగు యోగీంద్రులాగునం గరూషదేశంబును గెల్వఁబ కరిగె. అందు రాజధానియగు మహారంగపురంబునం దద్వసుదేవుని మఱియొక చెలి యలగు శ్రుతదేవ యను దాని భర్త వృద్ధశర్మ, దంతవక్త్రుండను తనయునితోఁగూడి పాలకుండుగా నుండు. ౧౧౪

ఆ॥ అట్టి వృద్ధశర్మ ♦ యాత్మజుఁడౌ దంత,వక్త్రుఁ డంబుజాక్షు ♦ వైరియగుచు
నట్టి చైద్యుఁబోలె ♦ నమ్మయబ్బల మాట,దాఁటి కినుక నిట్టు ♦ లోటులేక. ౧౧౫

దంతవక్త్రుఁడు మన్మథునితోఁ బోరి యోడుట.

ఉ॥ ఈదినమందు యాదవుల ♦ నెల్లర జల్లన డొల్ల నేసి యా
మోదముతోడ వత్తునని ♦ ముజ్జగముల్ వణఁకఁగ వచించి క్ర
వ్యాదభయాకృతిక్రియుల ♦ నక్కజుఁడై పలువిండ్లఁ బట్టి దా
మోదరపుత్త్రుపై దుమికె ♦ మోఁదుటకై యసహాయశూరుఁడై. ౧౧౬

వ॥ అంతం గందర్పుండు దర్పంబునం దమమీఁదికి నేతెంచు. ౧౧౭

సీ॥ కనులఁ ద్రిప్పఁగఁజాలు ♦ కాటుకమలఁబోలు, నల్లనిరంగుతోఁ ♦ జెల్లువాని
నిప్పులం గ్రక్కుచు ♦ నివ్వెఱబడఁ జేయుఁ, గ్రేలాడు నాల్కతో ♦ వీఁగువాని
గుండె బ్రద్దలొనర్చు ♦ దండిమబ్బులఁబోలి, పలుమాఱు బడబడఁ ♦ బాఁగువానిఁ
దద్దయు నిడుపైన ♦ దశతాళవృక్షంబు, లంతయున్నతమున ♦ నమరువాని
తే॥ మకుటకుండలహైమ వర్మకటకాది, భూషలఁ వెల్గువానిని,భూమి వణఁకఁ
దరుల గిరులను ద్రోయుచుఁ ♦ దిరుగువాని, లక్షభారాంచితగదఁ జెలంగువాని.
తే॥ కాంచి యాతనితోడుతఁ ♦ గయ్యమాడ,దివ్యశస్త్రాస్త్రముల్ దాల్చి ♦ త్రిజగములను
గెల్చి పెల్చన నిల్చెడి ♦ కీర్తిఁగనెడి, స్వబల మంపె నష్టాదశా ♦ క్షౌహిణులను.
మ॥ పిదపన్ దద్బల మస్త్రశస్త్రముల నా ♦ వీరుల్ మదోన్మత్తులై
చిదురంగాఁ బ్రహరించె నాగ్రహముతో ♦ శృంగుల్ మహాగ్రావముల్

జదియం గ్రుమ్మినయట్లు లాయసురుఁడున్ ♦ గాలాగ్నిరుద్రాభుఁడై
గదఁ గైకొంచు వియచ్చరుల్ వెఱపుతో ♦ గాంచన్ విజృంభించుచున్. ౨౨౦

ఉ॥ కొన్నిఁటి కుంభికుంభములఁ ♦ గుంభినిఁ గూలిచి తన్ని కొన్నిఁటిన్
గొన్నిఁటి వందయామడల ♦ కుం బడనెట్టి వియత్స్థలంబునం
గొన్నిఁటిఁ గొమ్ములం బెఱికి ♦ కోడిగముం బొనరించి కొన్నిఁటిం
దన్నుకొనంగ మొత్తి మొనఁ ♦ దద్రిపుసైన్యముఁ నందు వెండియున్. ౨౨౧

చ॥ అరదము లెత్తి తుత్తునియ ♦ లౌనటులన్ బడవేసి వెంటనే
హరులగళంబులన్ నఱికి ♦ యాకసమం దెడు నెల్ల టెక్కెముల్
బలుపలఁజించి త్రుంచి దృఢ ♦ వర్మములం దెగటార్చి రౌతులన్
బలుగు బదాతిజాతము ల ♦ వారిగఁ దీయఁగ మోఁది యాదటన్. ౨౨౨

తే॥ రాలిపాటునఁ జెలరేగి ♦ రాజసుతుల, బలుల భూషణభూషితాం ♦ గులను శస్త్ర
యుతుల భిన్న దేహాధోము ♦ ఖోర్ధ్వముఖులు, గాను బరిమార్చి యార్చె త ♦ ద్ఘనము మాడ్కి.

క॥ అత్తఱి నచ్చిత్తజు మొన, హత్తిన శస్త్రాస్త్రమణిచ ♦ యాన్విత యోధుల్
నెత్తురుఁ గ్రక్కుచు రిక్కల, మొత్తము వలె నేలవ్రాల ♦ మొదలిడి రయ్యా! ౨౨౪

తే॥ వెండియున్ దంతవక్త్రుండు ♦ భీమగదను, రిపుబలంబుఁ గలంచె ని ♦ ర్భిద్రశక్తిఁ
బ్రలయజలధిన్ వరాహంబు ♦ పంటఁబట్టి, పల్లటిలఁ జేసినట్టులఁ ♦ బార్థివేంద్ర!

తే॥ అట్టి పట్టున నష్టాద ♦ శాంబుజేక్ష, ణాత్మభవులు మహారథు ♦ లట్టిదనుజ
సత్తమునిఁ జేయ వాఁడు ప్ర ♦ సాద మతుల, రాఁకుఁదగినట్లు రాజిల్లె ♦ రక్తధార.

తే॥ కాని తద్ధతి నసురుండు ♦ కళవళపడ, కుంటఁ బరికించి కృతవర్మ ♦ మంట మండు
శరచయమున నక్రూరుండు ♦ శక్తి నసివ, రమున యుయుధానుఁడున్ గొట్టె ♦ రమితధాటి

తే॥ రోహిణీపుత్రకుండును ♦ రోమవిగ్రహుండు నగు సారణుండును ♦ దండిదైన
గొడ్డలిం గొని వానినిం ♦ గొట్టె తెఱపు, మఱపు బొందెడిలాగున ♦ మనుజనాథ!

ఉ॥ అంతట దంతవక్త్రుఁడు గ ♦ దన్ యుయుధానునిఁ గొట్టె కాళ్ళతో
నెంతయు గాండినీతనయు ♦ నేఁచి కసిన్ గృతవర్మఁ జేతులన్
బంతము మీఱ మొట్టి నిజ ♦ బాహుబలంబున మోఁది సారణున్
వంతల నొవ్వఁ జేసెను న ♦ వారణబాణకృపాణపాణియై. ౨౨౯

క॥ సారణయుయుధానులు నక్రూరుఁడు గృతవర్మ వాని ♦ ఘోరహతులచే
ధారణి మూర్ఛిల్లిరి ధాత్రీరుహములు గాలి గూలు ♦ తీరునఁ బిదపన్. ౨౩౦

ఉ॥ జాంబవతీతనూభవుఁడు ♦ సాంబుఁడు గైకొని ముద్గరంబు నా
దాంబికు ముద్గలంబును ద ♦ టాలునఁ జెండఁగ వైచి వెండియున్
డంబుగ దానితోన నక ♦ టా! వికటంబుగఁ గొట్ట నాతఁడా
సాంబునిఁబట్టి బాహువుల ♦ క్ష్మాతలమందునఁ గూల్చెఁ బెల్చనన్. ౨౩౧

ఆ॥ సాంబుఁ దంతలేచి ♦ సరగునఁ దద్దంత,వక్త్రుపాదములను ♦ బట్టి యిలను
బడఁగవైచె నద్ది ♦ కడువింతగాఁ దోఁచె, సర్వజనులకో ర ♦ సాతలేంద్ర!
ఆ॥ అపుడు దంతవక్త్రుఁ ♦ డవలీలగా లేచి, యఖిలభువనములును ♦ నార్వ నట్ట
హాస మాచరించి ♦ యాశంబరారితో, బలుకఁ దొడఁగె నిట్లు ♦ పరుషరీతి.
మ॥ మదనా! మీరు యయాతిశప్తులును సా ♦ మాన్యుల్ బరాస్కందులు
న్వదనప్రాంగణభీరువుల్ ఖలులు నా ♦ నాగోత్రసంజాతదు
ర్మదమత్తాంధకయాదవప్రభృతులై ♦ మాయంతవార్లేరటం
చెదలో సిగ్గును వీడి వచ్చితివిరా! ♦ యీనాఁటి కీరీతిగాఁ. ౨౩౪
క॥ వచ్చితివి పొమ్ము మీరిపు, డిచ్చటఁ బదిసుంది గలిసి ♦ యేకాకిని నఁ
విచ్చలవిడి బాధింతురె?, మచ్చరి ధర్మంబె వేయి ♦ మాటలిఁకేలా? ౨౩౫
తే॥ అయిన నిన్నన్నచో దోష ♦ మత్తుఁగాని, నిన్నుఁగన్నట్టి తండ్రిని ♦ నీకులంబు
నిందఁజేసిన దోషంబుఁ♦జెందదందు, వెయ్యిహేతువుల్ గల వవ్వి♦వినుము దుష్ట!
సీ॥ ఎవఁడు జరాసంధు ♦ నేపున కోపక,కూపారమును జేరి ♦ ప్రాపు గోరె
నెవఁడు మహాకాల ♦ యవనునిధాటికి, భయమినుడింపగాఁ ♦ బాఱిపోయె
నెవ్వఁడు వ్రేతల ♦ యిండ్లలోఁ జొరఁబడి, దధినవనీతముల్ ♦ దస్కరించె
నెవ్వఁడు వేదశా ♦ స్త్రోరితధర్మముల్, దాఁటిన బాటల ♦ మాటలాడె
తే॥ నెవఁడు గోపికాబాలుల♦యిండ్లకరిగి, కూనరాగంబులం దీసి♦కొంటెయయ్యె
నెవఁడు టక్కులం డెక్కుల ♦ నేసరేఁగె, నెవ్వఁడేసగింపులకును ♦ నేవపడఁడొ.
ఉ॥ ఎవ్వఁడు గోపికాంగనల ♦ యెంగిలికూడు భుజించి మెచ్చునో
యెవ్వఁడు రాసమండలుల ♦ నెబ్బెటికంబుగ నాటలాడునో
యెవ్వఁడు నందుగోపులను ♦ నెల్ల పుడుఁ దమిఁ గాచుచుండునో
యవ్వికటుండు కృష్ణుఁడుగ ♦ దా నినుఁ గాంచిన తండ్రి దుర్మతీ! ౨౩౭
తే॥ అట్టి నీచుండు నీ తండ్రి ♦ యల్పరాజ్య
మును గడించి ప్రభుండయ్యెఁ ♦ బుష్పబాణ!
యతని దయ నుగ్రసేనుఁ డా ♦ యలఁతి దొరత
నంబుఁ గైకొని యాదవ ♦ నాథుఁడయ్యె. ౨౩౮
తే॥ అంతమాత్రన రాజసూ♦యం బతం డొ,నర్పఁదలపడె క్షుద్రమా♦నక్క సింహ
పంచనఖములతోఁ గల♦హించునట్టు, లబ్బురమగుఁ గాలగతి దు♦రత్యయంబు.
చ॥ అనవుడు దంతవక్త్రునకు ♦ నంగభవుం డిటు పల్కసాగె నో
దనుజకులాధమా! మునుపు ♦ తాద్రుశకుండినపట్టణంబునం
దునఁ గడు జూపియుండిన య ♦ దుప్రభుయోధబలప్రతాపముల్
విని కని యుండ వక్కతన ♦ విన్మ మఱిఁ గనుమోరి తుంటరీ! ౨౪౧

క॥ నే నీ సంబంధినివని, మానసమున నెఱిఁగి మృధము ♦ మాలోఁ జేయన్
బూనితివి ధార్మికుల కిది, దానవకులనాపకా! య ♦ ధర్మముగాదే! ౨౪౨

వ॥ వెండియు ద్రోణుండను వసు విశ్వసుంధరను నందుండను నామంబునం
జన్మంబెత్తి గోపాలకులకుం బాలకుండై యెసఁగుననియు, దద్గోకులంబున వసించు
గోపికాగోపకులు శ్రీరాధామాధవతనూరుహోద్భవులగు గోలోకవాసులనియు,
నెవఁడు లోకాభిరాముండనియుఁ బరంధాముండనియు నసంఖ్య బ్రహ్మాండవిభుం
డనియు, గోలోకేశ్వరుండనియు భగవంతుండనియుఁ బరాత్పరుండనియు వేదాంత
విదులచేఁ గొనియాడఁబడునో యే మహామహుండు స్వతేజంబున సర్వచరాచర
తేజంబులు లీనంబుగాఁ బ్రకాశించునో యా పరమేశ్వరుండే దుష్టశిక్షణార్థంబును
శిష్టరక్షణార్థంబును శ్రీకృష్ణనామధేయంబునం గోకులంబునం బరిపూర్ణతమావ
తారంబెత్తెననియు మరుతుండను పార్థివేంద్రుండె యా కృష్ణవరంబుచే నుగ్రసేనుం
డను పేరం జనించి యాదవేశ్వరుండై నిరంకుశంబుగా రాష్ట్రంబుఁ బరిపాలించు
చుండెననియుఁ బైవార లందఱును బూర్వజన్మార్జితాగణ్యపుణ్యంబులచే జన్మించి
రనియు గుర్తెఱుంగుము. ఇట్టి మహాత్ములం దూలనాడుట పాడిగాక కీడులకుం
దోడగు. అట్లు నిందించినను జంబుకారవంబు లక్ష్యంబు జేయని సింగంబుభంగిని
శ్వానధ్వానంబులను వినని మత్తమాతంగంబువిధంబునను, బెడచెవిం బెట్టెదఁ గాన
శూరుండవైన మిన్నక కదనమ్మునకుం గదలిరమ్మన నద్దనుజేంద్రుండు రోషా
వేశపరవశుండై ౨౪౩

తే॥ గదను లక్షభారాంచితఁ ♦ గరమునఁ గొని
మురుని యురదంబుపై వైవ ♦ హారిసహస్ర
మిలను గూలియు సకిలించి ♦ నలుఁగడలకు
వెలిపుతోఁ బాఱఁదొడఁగెను ♦ ధరణినాథ! ౨౪౪

ఉ॥ పిమ్మట నమ్మురుండు దృఢ ♦ విస్తృతమౌ గదఁ దాల్చి దైత్యవ
క్షమ్మునఁ గొట్ట వాఁడలఁతి ♦ గాసిని జెందె ననంతరమ్మునం
దమ్మనుజాశనాంగజుల ♦ కద్భుతమైన గదాహవమ్ము ఘో
రమ్ముగ నయ్యె కొండ మృగ ♦ రాజులు పోటిగఁ బోరినట్టులన్. ౨౪౫

ఆ॥ అంత దంతవక్త్రుఁ ♦ డాత్మీయభుజదండ
ములను గృష్ణపుత్రుఁ ♦ బుష్పబాణు
మృగవిభుండు బల్మి ♦ మృగరాజునుంబట్టి
క్షోణిఁ గూల్చినట్లు ♦ గూల్చె నవల. ౨౪౬

చ॥ మదనుఁడు లేచి కర్బురు న ♦ మందముగాఁ గొని త్రిప్పి పాఁద వాఁ
డదటుగఁ గ్రక్కునెత్తురుల ♦ నస్థులు చూర్ణముగా ఖిలాంగుఁడై

యదవదఁజెంది ప్రాదిని న ♦ హార్యము గూలినమాడ్కి సౌమ్యతో
న్నదనమునంబడెఁ భువి వ ♦ ణంకెఁ జలించె జగంబు సర్వము౯. ౨౪౭

ఉ॥ అంతట వాని తండ్రియు మ ♦ హావిబుధుండును బుద్ధిశాలియు౯
శాంతుఁ డుదారచిత్తుఁడు ర ♦ సజ్ఞవరుండగు వృద్ధశర్మ ని
శ్చింతగ సంధిఁగోరుచు స్వ ♦ సేనలఁగూడి సతీసమేతుఁడై
కంతుని చెంతకుం జని ము ♦ కంబున దోసిలిఁగూర్చి యిట్లనె౯. ౨౪౮

ఉ॥ దీనశరణ్య! వృద్ధులము ♦ దీనులమా మముఁజూచి నీతిని౯
మాని శ్రుతిస్థధర్మమును ♦ మంటను గల్పుచు దుర్మదాంధుఁడై
పూనిక నిన్ను డీకొనిన ♦ పోకిరి నా సుతు సత్కృపామతి౯
మానక కావవేఁడెదను ♦ మన్మథ! యాదవవంశదీపకా! ౨౪౯

ఆ॥ అట్లు వేఁడి బలుల ♦ నంగజునకు నిచ్చి, యాదవప్రవరుల ♦ యర్చఁబడసి
యాత్మకీయమౌ మ♦హారంగపట్టణ,మునకు మరలఁ జేరె ♦ భూవరేణ్య! ౨౫౦

తే॥ అవలఁ బంచబాణుఁడు దక్షి ♦ ణార్ణవమున
స్వబలములతోడ భక్తితో ♦ జలకమాడి
కోట్లకొలఁదిని గోవుల౯ ♦ గోపకులును
సంచరించు నుశీనర ♦ స్థలికిఁ జేరి. ౨౫౧

క॥ పౌరులు భయభక్తుల నిడు, క్షీరంబును బెర్గు వెన్నఁ ♦ జేగొని యర్చల్
భూరిగఁగొని గజహయరథ, హారాంబరమణులఁ బొంది ♦ హర్షముఁజెందె౯.

### మన్మథుఁడు విదర్భాదిదేశంబులం గెలుచుట.

వ॥ పదపడి నమ్మదనుండు గదలి మణిరత్నమయంబై సర్పంబులతో భోగవతీపురంబు వొల్పారునట్లు రాజన్యులతో నొప్పారు చంపావతీపురి కరిగి తదధిపుండగు హేమాంగదునిచేఁ బూజితుండై కరంబులం బరిగ్రహించి నమస్కారంబులం గొని సంతుష్టుండై యా భూపలలామునకుఁ గింజల్కసముపేతంబగు హారంబును, సహస్రదళంబులతో శోభిల్లు దివ్యపద్మంబు నొసంగి సపరివారంబుగా వీడ్కొని పలుమాఱు దుందుభులు మ్రోఁగించుచు విదర్భదేశంబుల కరుగఁ దద్రాజధాని యగు కుండినపట్టణంబునందుం జెలంగు భీష్మకుండను రాజవ్వలరాజురాక విని సంతోషించి చని యాతనిని సదనంబునకుం దోడ్కొనివచ్చి పూజించి దివ్యాంబరాభరణంబు లొసంగి ముక్తాహారాదుల సమర్పించి యభిముఖుండుగా నాకందర్పుం డామోదంబుజెంది మాతామహుండగు నమ్మహారాజునకుఁ బ్రణామంబు లాచరించి సైన్యసమేతుండై కుంతదరదదేశంబుల కేగి, ౨౫౩

✤ మన్మథుం డగస్త్యమహామునిం గాంచి జ్ఞానోపదేశంబు బొందుట. ✤

తే॥ మలయభూధరపాటీర ♦ మారుతములు, సల్లగా వీచుచుండఁగ ♦ జందనతరు
కేతకీపుష్పవాసనో ♦ పేతమలయ,గిరి నగస్త్యుఁ బీతాబ్ధి వీ ♦ క్షించి భక్తి.

చ॥ కరములు మోడ్చి కీర్తిబల ♦ కౌతుకసంపద లిచ్చుదీవనల్
గరము గ్రహించి మౌని నడు ♦ గన్ సమకట్టె నిటుల్ నతాంగుఁడై
యరయ జగంబు దృశ్యమగు ♦ నర్ధ మసత్యముగాదె యెట్లిఁకన్
వఱలుచు నుండె సత్యముగఁ? ♦ బల్కుమ! యోగికులావతంసమా! ౨౫౫

తే॥ వెండి జీవుండు బ్రహ్మాంశ ♦ కుండు ముక్తుఁ,డునుగదా యాతఁ డెట్లిఁక ♦ గానములగుమి
బద్ధుఁడయ్యెడి? బ్రహ్మవి ♦ ద్వర్య! చెపుమ,కుంభసంభవ! దివ్యచ ♦ క్షూ! మహాత్మ!

చ॥ అనఁగ నగస్త్యుఁ డిట్లనియె ♦ నంగజ! నీ వల కృష్ణపట్టివై
యనఘుఁడవై మహాత్ముఁడవు ♦ నై యిటు లడ్గుట లీలయై జగం
బునకు శుభంబు నెక్కొలుప ♦ మూలమగున్ హరివోలె నీవిలన్
జననముఁ జెంది మానవుల ♦ సాఁకఁగఁ ద్రిమ్మరుచుంటివో ప్రభూ! ౨౫౭

తే॥ సత్యరవి ప్రతిబింబము ♦ సలిలమందు, సత్యముగఁ దోఁచినట్టులన్ ♦ సకలవిధుల
తత్త్వమునకును మఱియుఁ బ్ర ♦ ధానమునకుఁ, జూడఁదగినది శ్రీకృష్ణ ♦ సూనువర్య!

ఉ॥ ఎట్టుల నద్దమందు మొగ ♦ మెట్టుల సైకతమందు జీవనం
బెట్టులఁ ద్రాట సర్పము న ♦ హీనముగా నిజమౌచుఁ దోఁచునో
యట్టుల నీజగం బనృత ♦ మైనను నిక్కువ మట్లు దోఁచు నిం
కట్టుల నిట్టి జీవుఁడు త ♦ దంగగుణంబుల బద్ధుఁడౌఁ జుమీ! ౨౫౯

చ॥ అనఁగ ననంగుఁ డిట్లనె మ ♦ హాముని నాయక! జీవుఁ డేవిర
క్తిని గుణపాళిఁ జిక్కుపడి ♦ త్రిమ్మట నెందఁడో? యేయుపాయపం
ధను గుణరాజిఁ జిక్కుపడి ♦ తల్లడమొందఁడో? యట్టి సంగతుల్
గనికరమున్ ఘటించి పలు ♦ కన్వలె బ్రహ్మవిదగ్రణీ! గుణీ! ౨౬౦

ఉ॥ నావు డగస్త్యుఁ డిట్లనె న ♦ నంతకయానకుమారరత్నమా!
యేవిశుఁ డవ్వివేకము గ్ర ♦ హించి జగంబు మనోమయం బటం
చావులవీడి యుండెడినొ ♦ యావిబుధుండు సనాతనంబు సౌ
ఖ్యావహమైన బ్రహ్మపద ♦ మందఁగలండు నిరర్గళంబుగాన్. ౨౬౧

ఉ॥ భావుకభీతిజన్మమృతి ♦ బాధలు నాధులు వ్యాధులున్ క్షుధల్
యౌవనబాల్యవృద్ధత ల ♦ హంకృతులున్ మమకారముల్ రతుల్
గావరముల్ విమోహములు ♦ గష్టసుఖంబులు మంచిచెడ్డలు
న్దేవర! యాత్మ కంటవని ♦ నెమ్మదినమ్ముమ! కొంకులేనటుల్. ౨౬౨

మ॥ నిరహంకారము నిష్కలంబుఁ బరముం ♦ నిర్దేహముం బుద్ధము
ద్ధురముం శుద్ధము సర్వతోముఖము సం ♦ తోషస్వరూపంబు శ్రీ
కరముం బూర్ణ మనాదిమధ్యలయముం ♦ కాలాత్మకంబుం గుణా
కరముం బ్రహ్మమటంచెఱుంగు నెవఁడా ♦ గాఢజ్ఞుఁడే ముక్తుఁడౌ. ౨౬౩

చ॥ ఎవఁడు ప్రపంచమంత శయ ♦ నించెడి కాలమునందు మేలుకొం
చవితథతత్త్వముంగనుచు ♦ హాయిగనుండునె యామహాత్మ నీ
భువనముగాని మానవస ♦ మూహముగాని మఱేదిగాని యె
ట్టివిధినిఁ జూడలేదని క ♦ డిందిగ డెందమునందు నమ్మమా ! ౨౬౪

వ॥ మఱియు గగనానలానిలంబులు గోష్ఠకాష్ఠరేణువులకుం జిక్కువడక మెలంగుభంగిని, స్వచ్ఛంబగు స్ఫటికంబు పీతారుణకృష్ణవర్ణంబులతో సంక్రమింపనిసరణిని గుణంబులచేఁ గట్టువడక లౌకికోక్తులచేఁగాని లక్షణధ్వనివ్యంగ్యంబులచేఁగాని తెలియఁబడక ప్రత్యక్షానుమానవిగమాత్మజ్ఞానంబులతోఁ గొందఱచేఁ గర్మమనియు గొందఱచేఁ గర్తయనియుం గొందఱచేఁ గాలంబనియుఁ గొందఱచేఁ యోగంబనియుఁ గొందఱచే సాంఖ్యంబనియుఁ గొందఱచే వాసుదేవుండనియు, గొందఱచే బరమాత్మయనియుఁ గొనియాడఁబడుచు వెలుంగు నాబ్రహ్మంబు శ్రవణమననిదిధ్యాసంబుల విచారించు పుంగవుండు నిస్సంగుండై సుఖియై విరాజిల్లు ప్రచలదుదకంబువలనఁ బాదపంబులు చలించినపగిదినిఁ దిరుగుడుకండ్లకు ధరణి తిరిగాడితీరునను, గుణంబులచే భ్రమించు మనంబున కాత్మయందు జననమరణాది దుఃఖంబులున్నట్లు తోఁచుచుండు. భ్రాంతులగువారలు కరంబుచేఁ దిరిగాడి కొఱవి కరణిని జేసితిని జేయఁగలను, జేయుచున్నాను, నీవు సుఖివి. నేను దుఃఖిని. నిది నాది యది నీది యని యజ్ఞానంబునం బలుమాఱు బలుకుచుఁ బరిభ్రమించుచుందురు. సత్వరజస్తమోగుణంబులు మాయాగుణంబులుగాని యాత్మగుణంబులు గావు. ఈగుణంబులతోడనే తంతువులతోఁ బటం బేర్పడినట్లు జగం బేర్పడియె. ఇందు సాత్వికు లూర్ధ్వలోకంబునకు, రాజసులు మధ్యలోకంబునకును, దామసు లధోలోకంబునకుం జనుచుందురు. అంధకారంబున రజ్జువుం గాంచి సర్పంబను బుద్ధి జనించినట్లును, దూరంబునుండి మరీచికలంజూచి జలంబను ప్రజ్ఞ కలిగినట్లును, గుణత్రయభూయిష్ఠంబగు నీజగంబు మిథ్యాస్వరూపంబైనను సత్యంబను భావంబు వొడము. వృద్ధరాజులు గతించినతోడనే కుమారరాజులు పట్టాభిషిక్తులై రాజ్యసుఖం బనుభవించినట్లును, నరకవాసులు పాపంబులు క్షయంబుగా మరలివచ్చి సుఖం బొంది నట్లును, మానవులకు సుఖదుఃఖంబులు గలుగుచుఁ దొలఁగుచుండును. మేఘంబులును, దేహగుణంబులును, నహోరాత్రంబులును మొదలగునవి నియతంబుగా నుండక మాఱుచుండును గాదె? అట్లీజగద్దేహంబులకు సైతం బెఱుంగునది.

అందుఁ దారతమ్యం బెద్దియు లేదు. ఱెక్కలువచ్చిన తరుణంబునం బక్షులకు నీడం బుతోఁ బ్రయోజనంబులేనిఫక్కిని, నొడ్డెక్కిన తరుణంబున నుడుపంబుతో లాభంబు లేనివిధంబునను, జ్ఞానంబు గలిగినవాని కీసంసారంబువలన ఫలంబు గానరాదు. వెండియుఁ జక్కని మార్గం బన్వేషించి యవలంబించి సమదృష్టితో నెల్లెడల సంచరించెడి సంయమీంద్రునకు దర్పణంబుతో నుపయోగం బుండునే? ఎట్లిందుం డుదకపాత్రంబుల నానారూపంబులఁ జెలంగుచుండునో యెట్లగ్ని యింధనంబుల నానారూపములఁ బ్రకాశించుచుండునో యట్లే యద్వితీయుండును, భగవంతుండును నగు నాపరమాత్మయు స్వకృతంబులగు దేహాదులయందు ఘటమఠాకాశబాహ్యాభ్యంతరంబులందును నానారూపములతో విరాజిల్లు. ఇట్లు చెలంగుచున్నను స్ఫటికం బితర వర్ణంబులతో లిప్తంబు కానిచాడ్పున బ్రహ్మంబు తద్గుణంబుల నంటకుండు. శాంతాత్ముండును, కృష్ణభక్తుండును, జ్ఞాననిష్ఠుండును, విరాగియు నగు మహామహుని బూర్వోక్తగుణంబులు స్పృశింపనేరవు. ఎవఁడు సదానందమయుండై బాలోన్మత్తపిశాచంబుల విధంబున సంచరించునో వాఁడే జ్ఞానియని యెఱుంగుము. సూర్యోదయంబున ధ్వాంతంబు ధ్వంసంబై గృహంబున సర్వపదార్థంబు లగుపడినట్లు జ్ఞానోదయంబున నజ్ఞానంబు నశించి నిరతిశయంబగు తత్వంబు గనుపడుచుండు. ఏకపదార్థంబె పృథగ్ద్వారంబులగు నింద్రియంబులచే బహుగుణాశ్రయంబైనట్లు శాస్త్రానుసారంబులగు వేదాంతవాక్యంబులచే బ్రహ్మపదార్థంబు బహుప్రకారంబులుగా వర్ణింపంబడుచుండు. కొందఱద్దాని బరమపదంబనియు గొందఱు విష్ణులోకంబనియు, గొందఱు వ్యాప్యంబగు వైకుంఠంబనియు, గొందఱుఁ గైవల్యంబనియుం గొందఱు ప్రకృతిపరంబగు గోలోకంబనియు గొందఱుఁ విశదంబగు పరమనికుంజంబనియు వచింతురు. జ్ఞానవైరాగ్యభక్తిభావసంభరితులగువారే తత్పదంబున కర్హులగుదురు. శ్రీకృష్ణునికి భక్తుఁడగువాఁడా కైవల్యనాథుండును, బరాత్పరుండును బురుషోత్తముండునునైన యాతని పదంబుఁ జెంది పునర్జన్మంబెత్తక యానంద మనుభవించునని తెలిసికొనుమన నా కుసుమశరుండు పులకితగాత్రుండై యమ్మహామునికిఁ బూజించి నమస్కరించి కృతాంజలియై తదాజ్ఞఁ గైకొని సపరివారంబుగా వీడ్కొని.

తే॥ తామ్రపర్ణినిఁ గృతమాలఁ ♦ దానమాడి, రాజపురమున కరుగఁ ద ♦ ద్రాజు సాళ్వ
నామధేయుండు నాచేతఁ ♦ గాముఁడాది, యాదవులరాక విని కని ♦ యతిరయమున.

ఉ॥ వానరనాథుఁడో ద్వివిదు ♦ పాలికిఁ బోయి స్వకీయసంగతిన్
బూని వచింపఁగా నతఁడ ♦ మోఘముగాఁ జెలికిన్ సహాయమ
న్యూనమొనర్పఁగాఁదలఁచి ♦ యుగ్రత నుర్విఁజలింపఁ జేయు చా
మీనపతాకు మూఁకలను ♦ మేమెయిఁ దాకె విదేహభూమిపా ! ౨౬౭

మ॥ ద్వివిదుం డట్టులఁ దాఁకి దంతములతోఁ ♦ దీక్ష్ణంబులౌ గోళ్ళతో
సవిచిత్రంబుల స్వర్ణభూషితములన్ ♦ సంస్తవ్యముద్రావితా
నవరోచ్ఛ్రాయమహాధ్వజంబులను నా ♦ నారీతులం జించి య
శ్వవితానం బరదంబులన్ జెడునటుల్ ♦ సాగించి జృంభింపఁగాన్. ౧౬౮

ఉ॥ అంగభవుండు గన్గొని ర ♦ యంబున స్యందన మెక్కి శ్రోత్రముల్
గింగురనంగఁ డంకృతులఁ ♦ గేరుచు నల్వఁగ వాఁడు స్వీయమా
తంగమునుండి మాఘుని ర ♦ థంబుపయింబడి దీర్ఘమైన తోఁ
కం గొని పాతిపత్రతుర ♦ గం బరదంబుఁ గదల్చె భూవరా! ౧౬౯

క॥ అవల ననంగుఁడు శరముల, ద్వివిదుని మెడవైచి లాగఁ ♦ బిమ్మట నాతం
డవితథధరిత్రిని జేత్రో,భవునిన్ మర్దించె వజ్ర ♦ బహుదృఢముష్టిన్. ౧౭౦

క॥ అంతట నంతకసభుఁడగు, కంతుఁడు విలునెక్కుపెట్టి ♦ కౌశలమునఁ గ
ర్ణాంతము సంటగ లాగుచుఁ, బంతముతో వానిపైని ♦ బఱపె ధరేశా! ౧౭౧

చ॥ పఱపిన నమ్మహాశరము ♦ వానరనాయకు వానిఁబట్టి యం
బరమునఁ ద్రిప్పి యంతమున ♦ బాధలు పెక్కులు గల్గ లంకయం
బురి శతయోజనంబులను ♦ బోయిపడన్ విసరెన్ దదంగజుం
డఱిముఱి సాళ్వయోధులగు ♦ నాసురులం దునుమాడి గంటలోన్. ౧౭౨

చ॥ జయమును బొంది దుందుభులఁ ♦ జక్కఁగ మ్రోయనొనర్చి తద్బలుల్
రయమునఁ గొంచవాఁచిని వి ♦ రాజిలు శ్రీమధురాపురంబు ని
ర్భయముగఁ గాంచి మంగళశ ♦ రంబుఁ ద్రికూటము నెక్కె లంకనుం
డి యల కపీంద్రుఁడున్ గడువ ♦ డిన్ దదహార్యముఁ జేరి వెంటనే. ౧౭౩

తే॥ అచట వీడ్కొని మైనాక ♦ మనెడి గిరికిఁ, జేరి యటనుండి వెడలి యా ♦ సింహళమున
కరిగి యటనుండి భారత ♦ ధరణిఁ జొచ్చి, యచటనుండియు శీతాద్రి ♦ కరుగుదెంచి.

క॥ మఱి యచ్చటనుండియు శర,వరయుతము వినోదకరము ♦ ప్రాగ్జ్యోతిషమన్
పురమున కరిగెను ధరణీ,వర! మాసం బందునుండి ♦ పైనం బగుచున్. ౧౭౫

క॥ ఉత్సాహాన్వితమతితో, మత్సారస్థలికి నేగి ♦ మానవనాథా!
సత్సంగతిరతహితతతి, వత్సలమగు " రామకృష్ణ ♦ వరధర " కరిగెన్. ౧౭౬

తే॥ అరిగి యచ్చట శతయోజ ♦ నాయతమును
గ్రాహగృహము సముద్రంబుఁ ♦ గాంచి దాని
వేలఁ జేరి సాంబాదులఁ ♦ బిలిచి సభను
సలిపి యందు నుద్ధవునకుఁ ♦ బలికె నిట్లు. ౧౭౭

తే॥ కర్బురశ్రేణివిభుఁడు లం ♦ కాప్రభుండు, సిద్ధబలుఁడు విభీషణుఁ ♦ డిట్టిద్వీప
మునకుఁ బతియఁట! యాతండు ♦ మనకు బలుల,నియ్యకుండినఁ జేసెడి ♦ దేమొ? చెపుమ!

చ॥ అనఁగ నతం డిటుల్ బలికె ♦ యాదవవీరవరా! రతీశ్వరా!
యనఘుఁడవై సురాధిపతి ♦ వై యపరాంబుజలోచనుండవై
ఘనచరితుండవై సుగుణ ♦ కాంతుఁడవై పతివై యలంజుఁబో
లెను నను నడ్గుచుంటివి బ ♦ లీ! పెదవారికిఁ గూడ మాయయే? ౧౭౯

తే॥ స్వామి! మీయాజ్ఞ బ్రహ్మేంద్ర ♦ శంకరముఖ
దైవతంబులు శిరములఁ ♦ దాల్చుచుంద్రు
నేను దాసానుదాసుండ ♦ నీకుఁ జెప్ప
నంతవాఁడనె? నానతు ♦ లందికొనుమ! ౧౮౦

క॥ పదపడి భగవంతుండును, యదుకులముఖ్యుండు శంబ ♦ రారి రతీశుం
డు దయాళుఁడు ఘనబలుఁడో, మదనుం డొక కాకిలంబు ♦ మంచిది గొంచుఁ.

చ॥ దనుజవరేణ్యా! దర్పకుఁడుఁ ♦ ద్వద్ధరఁ జేరితిఁ గాన భోజభూ
పున కిపు డీవు కాసికల ♦ మొత్తమొసంగుము లేనిచో మదీ
యనిశితకార్ముకోద్గతమ ♦ హాశుగధారలతోడ మిమ్ము భం
డనమున సేనలం దగి హ ♦ టాహుటిఁ ద్రుంచెదనంచు వ్రాసియుఁ. ౧౮౧

ఉ॥ విల్లునఁగూర్చి నల్గడలు ♦ భీతిఁ బ్రతిధ్వనిసేయఁ దంకృతుల్
బెల్లుగ నాచరించియు వి ♦ భీషణనేత్రసభాస్థలిఁ విరా
జిల్లువిధంబునం బఱప ♦ శీఘ్రముగా నది దివ్యకాంతి భా
సిల్లుచుఁ దన్నిశాటపతి ♦ చెంతఁబడెఁ బెదరఁ సభాసదుల్. ౧౮౩

చ॥ పడిన శరంబునుండి నర ♦ భక్షకముఖ్యుఁడు పత్ర మొక్కటిఁ
వడిఁగొని దానిని జదివి ♦ బాపురె! చాగురె! యంచు వింతలఁ
బడి సభనున్న భార్గవుని ♦ భక్తినిఁ బూజలొనర్చి భోజభూ
పుఁ డెవఁడో? బాణమేరిదిది? ♦ బూసనుఁ గ్రుచ్చినయట్లు చెప్పుమా! ౧౮౪

క॥ అనుగఁగ నటు కవి మఱియనఁ, గడఁగెను మును దీనికొక్క ♦ కథ దగు దానిఁ
గడువినువారికిఁ బాపము, లడఁగును ఫలమబ్బు వినుమ! యాసురవర్యా! ౧౮౫

తే॥ పూర్వమందున బ్రహ్మకుఁ♦బుత్రులైన, సనకముఖులు యదృచ్ఛగా♦స్వర్గమువిడి
విష్టపత్రయమును దిర్గి♦ విష్ణులోక, మునకు నేగిరి తద్విష్ణు ♦ మూర్తినిఁ గన.

తే॥ అంత నంతఃపురద్వార♦మందునున్న, జయవిజయులు దిగంబరుల్♦బాలకులయి
వచ్చినట్టి యామునుల లో ♦ పలకుఁబోవ, నడ్డగించిరి బెత్తంబు ♦ లొడ్డి దేవ!

ఉ॥ ఆవల నమ్మహర్షులు మ ♦ హాగ్రహమొంది కుబుద్ధులార! యా
శ్రీవిభునిఁ విలోకనముఁ ♦ జేయఁగఁ బోయెడి మమ్ము నడ్డి బ
ల్కావర మిట్లుజూపితిరి ♦ గానఁ ద్రిజన్మములఁ నిశాటులై
భావముఁ జెంది యీరలటు ♦ పైఁ బరిశుద్ధులు గందు మెండుగాఁ. ౧౮౬

వ॥ అని శపియించిన యనుక్షణంబునం దా జయవిజయు లానందసంధాయకంబగు తద్భవనంబునుండి యధఃపతితులై దితిగర్భంబునందు హిరణ్యాక్ష హిరణ్యకశిపులను నామంబులతో జన్మించి దైత్యదానవపూజితులగుచు లోకంబులం జీకాకుపరచుచుండం బరాత్పరుండు యజ్ఞవరాహావతారం బెత్తి జలంబునుండి యుద్ధర నుద్ధరించుచు నాహిరణ్యాక్షుని నొక్కముష్టితో నష్టపరచి తిరిగి నృసింహావతారం బెత్తి హిరణ్యకశిపుం జీల్చి సుఖంబులం గల్పించె. ద్వితీయజన్మంబునం దాద్వారపాలకులు కేశినీగర్భమందు విశ్రవునకు రావణకుంభకర్ణులను నామధేయంబులతోఁ బుట్టి జగత్కంటకు లగుచుండం బరమేశ్వరుండు గని కనికరించి శ్రీరామనామంబుతోఁ గౌసల్యకు జనించి క్రమంబుగా లంక కరిగి భండనంబున నా గండల నిద్దరను ఖండించె. మఱియు నీ మూఁడవ జన్మంబునందు క్షత్రియవంశంబులందు శిశుపాలదంతవక్త్రులను నభిధేయంబులతో నుద్భవించి వర్తమానంబునం జెలంగుచున్నారు. అవ్వారిని వధించుటకై పరిపూర్ణతముండును నసంఖ్యబ్రహ్మాండవిభుండును గోలోకప్రభుండును నగు నా భగవంతుండు యదుకులంబున శ్రీకృష్ణనామంబుతో నుద్భవిల్లి లీలోల్లాసపరుండై ద్వారకాపురంబున విరాజిల్లు. ఈ మహామహునిచే నా శిశుపాలదంతవక్త్రులు ధర్మరాజ రాజసూయాధ్వరంబునం జరుగు సాల్వయుద్ధంబున నిహతులు గాఁగలరు. తద్ధరి కొమరుం డీమరుండనియు, నిపుడు కోదండనిర్గతంబై యతిజవంబున దశదిశలం బ్రకాశింపం జేయుచుఁ దటిత్స్వనంబుతో వచ్చిన బాణం బాతనిదే యనియు భోజభూపుండుగ్రసేనుండనియు నాతండు రాజసూయంబుఁ జేయందలంచి దిగ్విజయార్థంబై యీ కృష్ణకుమారునిం బుత్తెంచె ననియు గుర్తెఱుంగుచున శ్రీరామభక్తుండగు నవ్విభీషణుం డా శ్రీరామచంద్రుండే యీ శ్రీకృష్ణచంద్రుండని తెలిసికొని పుణ్యజనసందోహసమన్వితుండై బలులం గొని యంబరమార్గంబునం బుష్పబాణు బలం బాలోకించుచు నతనిం జేరి ప్రదక్షిణంబు లాచరించి సాష్టాంగదండప్రణామంబులం గావించి తదభిముఖుండై దోసిలియొగ్గుచు నిట్లు వినుతించె. ౨౮౯

మ॥ అరవిందాయతలోచనాయ మహతే ♦ యంగప్రభూతాయ తే
ధరణీభారనివారకాయ గురవే ♦ ధర్మావతారాయ శ్రీ
హరిపుత్రాయ మహాత్మనే భగవతే ♦ యారక్తపజారక్షణో
ద్ధురదీక్షాసహితాయ దేవనుతయే ♦ దుష్టప్రహార్త్రే నమః. ౨౯౦

తే॥ మత్స్య! కచ్ఛప! వారాహ! ♦ మనుజసింహ!
వామనా! రామ! శ్రీరామ! ♦ రామ! బుద్ధ!
కల్కి! శ్రీవాసుదేవ! సం ♦ కర్షణా! ర
తీశ! జగతీశ! నన్ను ర ♦ క్షింపుమంచు. ౨౯౧

తే॥ షోడశోపచారముల న♦ శాస్త్రరీతిఁ, బూజఁజేయ సంతుష్టుఁడై ♦ పుష్పశరుఁడు
జ్ఞానభక్తివైరాగ్యముల్ ♦ గరుణతోడ, నొసఁగి మఱి యాదరించి స♦ముచితభక్తి.

ఆ॥ బ్రహ్మదత్తపద్మ ♦ రాగశిరోమణి, చంద్రదత్తకాంత ♦ చంద్రకాంత
భవ్యవస్త్రములను ♦ బాలస్త్వదత్తమౌ, రత్నమాల నిచ్చె ♦ రక్తితోడ. ౨౯౩

తే॥ అంతటన్ విభీషణుఁడు మ♦హాముదమున
శంబరారికి బలులను ♦ జక్క నిచ్చి
మ్రొక్కి స్వీయమౌ లంకయన్ ♦ పురవరమున
కరిగె ధరణీశ! బహులాశ్వ! ♦ యవల వినుము! ౨౯౪

తే॥ రతివిభుఁడు ఋషభాద్రి, శ్రీ♦రంగపురముఁ, గాంచి కన్గొని ప్రాగ్దిశఁ♦గల సరస్వ
తీనదిం జూచి కావేరిఁ ♦ దివిరి దాఁటి, సహ్యగిరిదేశమున కేగు ♦ సమయమందు.

ఉ॥ పిల్లలు సేరి చప్పటల ♦ వేయుచుఁ బాడుచు వెక్కిరించుచున్
బెల్లుగ నల్లరుల్ సలిపి ♦ పీకినఁ దాఁకినఁ గూడ నుల్లమం
దుల్లసమూని స్వాంతికము ♦ నొందు దిగంబరు ముక్తకేశుఁ బు
ష్యల్లసదంగు భిక్షుఁగని ♦ యుద్ధవు నిట్టులఁ బృచ్ఛ జేసెడిన్. ౨౯౬

క॥ సత్తమ! బాలపిశాచో,న్మత్తులవలెఁ దిరుగుచు నవ ♦ మానించిన నో
రెత్తక వచ్చెడి నీ సమ, చిత్తుం డెవ్వండొ నాకుఁ ♦ జెప్పుమనంగన్. ౨౯౭

శా॥ చిత్తోద్భూతున కుద్ధవుం డిటుల వా ♦ చింపం గడంగెన్ దపో
విత్తుం డచ్యుతసత్కళాకలితుఁడున్ ♦ వేదాంతవిద్వర్యుఁడున్
సత్తాఖ్యాతుఁడు గామకోపమదమా ♦ త్సర్యాదిహీనుండు నౌ
దత్తాత్రేయమునీశ్వరుం డతఁడు కం♦దర్పా! యటు ల్గాంచుమా! ౨౯౮

క॥ ఇతని ప్రసాదంబున భూ,పతులు సహస్రార్జునాది ♦ పరములు యదుసం
తతులును సిద్ధులఁబొందిరి, రతిపతి! యన నాలకించి♦ ప్రద్యుమ్నుండున్. ౨౯౯

క॥ తనశిబిరంబున కేతెం,చిన దత్తాత్రేయమునికిఁ ♦ జేసి సపర్యల్
ఘన సింహాసన మిడి యిట్లనియె వినయపూర్వకముగ ♦ నంజలితోడన్. ౩౦౦

తే॥ పరమహంస! దత్తాత్రేయ! ♦ బ్రహ్మభువన,గతులఁ దత్వమార్గమున న♦వితథభక్తి
జెప్పి నా సంశయముల న♦శింపఁజేయు, మనఁగఁ దన్మునివర్యుండు ♦ ననియె నిట్లు.

వ॥ వస్వభావంబునం దులోకప్రయోజనంబును, దద్భావంబునం దత్ప్రయోజనాభావంబును దెలంగిన ట్లెంతవఱకుఁ దత్త్వం బజ్ఞాతంబై యుండునో తావత్పర్యంతం బీజగంబు సత్యంబుగాఁదోఁచి ప్రయోజనకరంబుగానుండు. ఎత్తఱిఁ దత్తత్త్వంబు తెలియంబడునో యత్తఱి నద్దానితో ఫలంబు గానరాదు. శరీరంబునకుఁగాని లాఁతిదానికిఁగాని ముకురంబునం బ్రతిబింబంబు గన్పడక ముఖంబునకు మాత్రమగుపడినట్లు ప్రధానార్థంబునందు జీవుం డాపరాత్పరుండని తెలియంబడక

జ్ఞానంబునమాత్రము తెలియంబడునని వక్కాణింప నప్పక్కిఁడాత్మోల్పత్తి యమ్ము నికి నమస్కారమ్ములం గావించి పిదప్పాని ద్రవిడదేశంబునం జెన్నారు వైకుంఠా చలంబున కరిగి సత్యవ్రతుండును రాజర్షివర్యుండును, ధర్మజ్ఞుండును సత్యవాఙ్మా మాంకితుండు నగు తద్ద్రవిడవిభునిచేఁ బూజాదులం గైకొని, ౩౦౨

ఉ॥ శ్రీలకుఁ దల్లియిల్లగుచు ♦ శృంగములం బొలుపాఱుచుండు శ్రీ
శైలముఁ గాంచి యందుఁ దగు ♦ శంకరుఁ గన్గొని కాంచి భ్రామరి
న్బాలు షడాననుం గని వి ♦ నాయకునిం దిలకించి వీచికా
జాలయుతంబు పంప యను ♦ సత్సరసిన్ గనులారఁ జూచియున్. ౩౦౩

క॥ గోదావరి భీమరథీ, ప్రాదిని హారితీర్థముఁగని ♦ యానందదమున్
మేదురము మహేంద్రాద్రికి, నాదటఁ జని పరశురాము ♦ నాలోకించెన్. ౩౦౪

ప్రద్యుమ్నుఁడు పరశురాముని దర్శించుట.

చ॥ కని యతఁ డమ్మహామునికిఁ ♦ గాశ్యపి నొదల దాఁక మ్రొక్కి యో
యనఘ! మహానుభావ! నిగ ♦ మార్థవిదగ్రణి! క్షత్రియాంతకా!
మునికులసింధుపూర్ణశశి! ♦ భూసురకేసరి! జామదగ్న్య! నా
వినతివితాన మందికొని ♦ ప్రీతినిఁ బ్రోవుము భక్తవత్సలా! ౩౦౫

తే॥ నావుడా మునివర్యుఁ డా ♦ నంద మొంది, దిగ్విజయమును గూర్చెడి ♦ దీవెనలను
సలిపి తచ్చతురంగముల్ ♦ సంతసంబు, గాంచునటు గౌరవించి యో ♦ గమహిమమున.

సీ॥ మా॥ అన్నంబు, సూపంబు ♦ నవలేహ, లేహ్యము, లమృతకుండలు లెచ్చు ♦ నప్పడములు
బూరి పాల్పూరీలు, ♦ బూరెలు గారెలు, బొబ్బిలు, బొబ్బట్లు ♦ మోదకములు
గర్పూరనాడులు ♦ గాయలు గూరలు, సట్లు బొంగరములు ♦ నానువడలు
బజ్జీలు, మణుఁగుఁబూ, ♦ లక్కజ్జముల్ చేగోళ్ళు, శతపత్రముల్, ♦ బూర్ణచంద్రకలలు,
గోధూమపరిఖలు, ♦ గోక్షీర, మండక, దధి, ఘృతనవనీత ♦ తక్రములును,
లసికలు రుచికలున్ ♦ లడ్డులు బెడదలు, బటకముల్, గూపికల్ ♦ బర్పటములు
జక్రాభముల్ బాల ♦ చక్షుఖేరిణి, మధు, శీర్షికలును వర ♦ శిఖరిణులును
నాజ్యపూరంబులు ♦ నవిలపూరంబులు, జక్కిలంబులు, దివ్య ♦ శక్తికలును.

తే॥ హారిమద్రసమిశ్రితా ♦ హార ముద్భవిల్లఁ జేసి వారల కిడి ♦ ప్రీతిఁ గూర్ప
మరుఁడు విస్మయానందముల్ ♦ బరగ సబల, కలితుఁడై యా మునికి మ్రొక్కి ♦ పలికె నిట్లు.

తే॥ దేవ! త్వద్దత్తభోజనం ♦ బే విధమగు, లోటు లేకుండ తృప్తి గ ♦ లుగ నొనర్చె
శ్రీరమేశ్వరభక్తులన్ ♦ శ్రేష్ఠుఁ డెవఁడొ, యెవ్వఁ డాహారి కిష్టుఁడో ♦ యెఱుఁగఁ జెపుము!

ఆ॥ అనఁగఁ బరశురాముఁ ♦ డంగజ! నీకంటె, నెవరి కేది యైన ♦ నేమి తెలియు?
నిపుడు నీవు నన్ను ♦ బృచ్ఛించుటల్ లోక, సంగ్రహార్థమనినఁ ♦ జనెడి నైన.

సీ॥ ఎవ్వఁడీ భువనంబుఁ ♦ దృణముగా భావించి, యఖిలభోగంబుల ♦ నవలఁద్రోయు
నెవ్వఁడు శ్రీహరి ♦ యితిహాసములనెల్ల, వినుటకు ననుటకు ♦ వేగిరపడు
నెవ్వఁడు శ్రీరాధి ♦ కేశ్వరరూపాబ్ధి, మగ్నచిత్తుండయి ♦ మహినిఁదిరుగు
నెవ్వఁడు శ్రీగోకు ♦ లేశానపదపద్మ,ముల నలిలీలను ♦ వెలుఁగుచుండు
తే॥ నెవఁడు శాంతుఁడో దాంతుఁడో ♦ యెవఁడు సకల,భూతవత్సలుఁడో యెవ్వఁ ♦ డాతిథిత్వు
వాదయామయుఁడాగుణి ♦ యాసుహృత్తు, కృష్ణునకు ముఖ్యభక్తుఁడో ♦ కృష్ణపుత్ర!
క॥ అలభక్తుఁడు నిజపదరజ,ముల భువనంబులను శుద్ధ ♦ ముగ సల్పి శుభం
బులఁగూర్చునటంచెఱుఁగుమ,! కలుములజవరాలిచూలి! ♦ కామా! భూమా!

ఉ॥ కోరక పారమేష్ఠ్యమును ♦ గోరక నిర్జరనాథధిష్ణ్యముల్
గోరక భూతలప్రభులఁ ♦ గోరక యోగిమునీంద్రసిద్ధులున్
గోరక తిర్గి పుట్టుటయుఁ ♦ గోరుచు నా హరి పాదధూళి నే
సూరిసెలంగునో యతఁడె ♦ శుద్ధుఁడు శ్రీహరిభక్తుఁడో ప్రభూ! ౩౧౨
ఆ॥ ఎంతమంచికార్య ♦ మేని క్షణంబునఁ, దనువు ధనము మనము ♦ ధారవోసి
చేసి తత్ఫలంబు ( జిత్తంబునంగూడఁ, దలఁప రట్టి భక్తు ♦ లలఘుచరిత! ౩౧౩
ఉ॥ వారె తదంబుజాక్షునకుఁ ♦ బ్రాణసముల్ ప్రియు లన్యభూపతుల్
గారు సురర్షివర్యులును ♦ గారు బలుండును గాఁడు యోగులున్
గారు పురందరాదులును ♦ గారల శంకరపద్మయోనులున్
గారు రమాదిజాయులును ♦ గారసి నీవెఱుఁగంగ నా విభూ! ౩౧౪
ఆ॥ భక్తవత్సలుండు ♦ వారిజాక్షుండట, భక్తవరుల వెంటఁ ♦ బడి తిరుగుచుఁ
బూతులుగ నొసర్చి ♦ ముక్తికొసంగును, గాని భక్తి నిడఁడు ♦ సూనబాణ!

మన్మథుఁ డంగవంగాదిదేశంబుల కరుగుట.

క॥ అన విని మదనుండును నతిఁ, బొనరిచి యమ్మునికిఁ దూర్పు ♦ మొగమున గంగా
వననిధిసంగమమున కరి,గెను శ్రీబహులాశ్వ! విశ్వ ♦ గీతసుకీర్తి! ౩౧౬.
ఉ॥ ధీరుఁడు మారుఁ డా రహిని ♦ దిగ్విజయోరుమిషన్ వసుంధరా
భారనివారణార్థమయి ♦ పర్యటనం బొనరింప నెంచి త
త్తీరమునుండి యంగవిభు ♦ దేశముఁజేరి తదీయసత్కృతుల్
భూరిగఁ బొంది కప్పముల ♦ ముత్తముఁ గైకొని సత్వరంబుగన్. ౩౧౭
తే॥ ఆప్రదేశంబువిడి యుడ్డ ♦ యనెడి దేశ
మునకు ముఖ్యపట్టణమును ♦ ఘనమునైనఁ
డామరాహ్వయపురి కేగి ♦ ఢంకఁగొట్టి
బలుల నిమ్మన నా బృహ ♦ ద్బాహువందు. ౩౧౮

తే॥ తత్పరేశ్వరాకృతిగుణౌ♦దార్యశౌర్య,ధైర్యమహిమల మనములం♦దలఁచి తలఁచి
యామహాత్ముని బ్రీతిసే♦యరమరలును, లేనియట్టులఁ బొందిరో♦మాననీయ!

మ॥ సనకాద్యత్రిపరాశరాసితశుకుల్ ♦ సాంఖ్యాయనుండున్ వసి
ష్ఠనిలింపర్షి బృహస్పతిప్రముఖులా ♦ శౌర్యాంఘ్రిపద్మంబులన్
మనముల్ భృంగముభంగిగా నిలిపి తా ♦ మం బేమియున్ లేకయే
యనిశంబున్ వినుతించుచున్ ధర నటా ♦ ట్యన్ సల్పుచుండ్రాస్థతోన్. ౬౪

చ॥ మఱియును నంబరీషయతి ♦ మైథిలనాథులు నుత్కలాంగులున్
భరతయదుప్రియవ్రతది ♦ వస్పతిపుత్రులు హేతుహీనులై
యఱగొఱ వీడుచున్ బరమ ♦ హంసలఁ బోలి యనారతంబు త
ద్ధరిచరణారవిందసుధ ♦ నానుచు సోలుచుఁ దిర్గుచుండ్రిలన్. ౬౫

ఆ॥ మఱి యహల్య శబరి♦మండోదరీ ద్రుప,దసుత లత్రిభార్య♦తార కుంతి
లోను భర్తురాండ్రు♦మాని కామంబును, బరమహంసలవలెఁ♦బ్రథితలైరి. ౬౬

తే॥ వాలిసుతవాతసుత జాంబ♦వ ద్గరుడ జ
టాయువు గుహసుదాములు ♦ వాయకుండు
వెండి సుగ్రీవకాకభు ♦ శుండిముఖులు
కృష్ణసంగతి ధన్యత ♦ నెసఁగిరయ్య! ౬౭

ఉ॥ ఆనిఖిలాండనాయకుని ♦ నచ్యుతు నిర్మలభక్తి దక్క యా
దానజపాగ్నిహోత్రసవ ♦ ధర్మతపస్స్మృతిపాఠతీర్థముల్
గాని యమవ్రతాదులును ♦ గాని మహాద్భుతయోగసాంఖ్యముల్
గాని మఱెట్టిగొప్పకృతి ♦ గాని వశంబున నిల్పఁ జాలునే? ౬౮

చ॥ వ్రతసవనక్రియానిగమ ♦ పారయమాదితపస్స్వధర్మక
ర్మతతిసుతీర్థపర్యటన ♦ మంత్రమహాజపయోగసాంఖ్యస
త్కృతులను జేసినంత ఫల ♦ మెంతయు దీనికి నబ్బుఁగాని య
వ్వి తదమలోరుభక్తిఫల ♦ విస్తృతి నొందఁగఁజాల వెప్పుడున్. ౬౯

ఉ॥ త్మోరమణా! తలంప నర ♦ కప్రకరాన్వితకాలపట్టణో
ద్ధారిణి దుఃఖశుజ్మృతిగ ♦ దావృతసంసృతిఘోరసాగరో
త్తారిణి యింద్రియార్జితకృ ♦ తాంతవిహారిణి కృష్ణపాదస
త్కారిణి విశ్వరూపిణిగ ♦ దా! యల నిర్మలభక్తి యెల్లెడన్. ౭౦

చ॥ ప్రవిమలకృష్ణభక్తిలత ♦ ప్రాక్తనసత్కృతులన్ జనించి మా
ధవవరదర్శనాదిరస ♦ ధారల వృద్ధినిఁ బొంది పుణ్యప
ల్లవఫలభారనమ్రత నె ♦ లంగ వసంతుఁడు దివ్యపంచమీ
దివసముఖంబునన్ జగతిఁ ♦ దేజరిలున్ బరమోత్సవంబుతోన్. ౭౧

సీ॥ సమ్మోహకాలాభ్ర ♦ జాలమధ్యస్ఫురద్జ్ఞానసౌదామిని ♦ కరణి దనరి
శాస్త్రార్థదర్శవా ♦ క్సంచయపదదీపి, కా ప్రకారంబునఁ ♦ గ్రాలుచుండి
జయరూపకార్తిక ♦ సంస్ఫురద్దీపావళులతోడ సొగసుగా ♦ వెలుఁగఁ దొడఁగి
సత్వరజస్తమ ♦ స్సంహారకార్యస, మర్థత నాఖ్య న ♦ న్వర్థపఱచి
తే॥ యొప్పు విజయదశమి యట్టి ♦ యుత్తమహరి
భక్తి విజయంబుఁ జాటుచుఁ ♦ బ్రజల కెపుడు
నుత్సవంబులఁ బొందుచు ♦ నుర్విమీఁద
వెల్గుచుండెను యాదవ ♦ క్ష్మావరేంద్ర ! ౨౨
తే॥ సాంఖ్యయోగదండములు పా ♦ ర్శ్వములఁ దగ
గుణవిభేదకీలంబుల ♦ కోటు లొప్ప
భక్తి నవవిధానములు సో ♦ పానములుగ
జెలఁగ గోలోకనిశ్రేణి ♦ వెలుఁగు నధిప ! ౨౩

వ॥ అంత నుగ్రసేనుం డానందంబు బొంది వ్యాసమునీంద్రున కిట్లనియె. ౨౪

క॥ కర్మఠవరుఁడగు గృహి యే, ధర్మమునఁ జేయవలెనొ ♦ తద్దరిసేవన్ ?
నిర్మలభక్తిరహితుఁ డా, ధర్మాత్ముని హరిని నెట్లు ♦ దర్శించునొకో ? ౨౫
తే॥ వ్యాస ! నిజభక్తి యభివృద్ధి ♦ పడని యపుడు
మనుజుఁ డేమి సేయఁగవలె ♦ మాధవుఁ డల
వారి నెట్లు ప్రసన్నుఁడై ♦ వరము లిచ్చి
ధన్యులుగఁ జేయునో నాకు ♦ దయను జెపుమ ! ౨౬

## హరిమందిర ప్రతిష్ఠావర్ణనము.

చ॥ అనవుడు వ్యాసుఁ డిట్లనియె ♦ యాదవనాయక ! లోకమందునన్
జనులకు నెప్డు సత్పురుష ♦ సంగతి భక్తి జనించు దానిచే
తన యల భక్తి వృద్ధియగుఁ ♦ దప్పదు నీకిఁకఁ గర్మ సేయఁగా
ననువగు కృష్ణసేవ పలు ♦ కాడెద శ్రద్ధగ నాలకింపుమా ! ౨౭
చ॥ వరుఁ డలిజాగరూకతను ♦ నవ్యచరిత్రుఁడు సాధుమిత్రుఁడున్
సరసిజలోచనాంఘ్రియుగ ♦ సన్నుతితత్పరుఁడున్ గులీనుఁడౌ
గురుని నొనర్పనౌఁ దొలుతఁ ♦ గొంకినచోఁ దనపుణ్యమేగు ని
ర్గురుఁడగువాని యాననము ♦ రూఢిఁ గనం దగ దేరి కెప్పుడేన్. ౨౮

వ॥ అట్టి సద్గురునివలన విష్ణుసేవావిధిఁ దెలిసికొని విష్ణుదీక్షాపరాయణుండై
సభామండపాంగణచతుశ్శాలజాలకజలయంత్రాదిభాసురంబగు హరిమందిరంబు
నుత్తరాభిముఖంబుగా నిర్మించి తోరణంబులను గలువడంబులను జిత్రవిచిత్రంబు
లగు యవనికలం గట్టి యందుఁ బీఠకుంభసహితంబగు నున్నతసింహాసనంబు నమర్చి

దానికి సచ్చిదానందనామంబును సోపానత్రయంబుగాఁ గూర్చి యమూల్యంబులగు పట్టుపుట్టంబులచేఁ దళతళలాడునదియు నలుగడలఁ దలగడలు గలిగినదియు గోమలంబైనదియు నగు నొండాసనంబు తత్సింహాసనసమంబుగా నేర్పరుపవలయు. తత్ప్రాంగణమధ్యమంబునఁ దులసీమందిరంబుఁ గట్టవలయు. తద్ధరిమందిరబహిర్ద్వారంబున భద్రేభద్వయంబును సింహద్వయంబును గూర్చుండినట్లుగా లిఖింపందగు. తత్సువర్ణశిఖరంబున కెగువను దిగువను జక్రంబును ద్వారంబునందు హరినామంబులను గుడ్యోభయపార్శ్వంబులందు శంఖపద్మశార్ఙ్గగదలను నామందిరంబునకు దాపలఁ దూణీరంబును గుడివైపున బాణంబులను వెనుక నందకశతచంద్రహలముసలాయుధంబులను తత్సింహాసనపృష్ఠభాగంబున గోపికాగోమండలంబులను దదారోహణంబులను గోపకులను గవాటంబున జయవిజయులను దేహళిని గల్పతరువును స్తంభంబులందుఁ గల్పలతలును మఱియు గోడలయందు వీలయినచోటుల నెల్ల గంగాయమునాపులినబృందావనగోవర్ధనగోపికావస్త్రాపహరణ చిత్రకూట పంచవటీపరిత్యక్తజానకీహరణరామరావణయుద్ధ దశావతారచిత్ర నరనారాయణాశ్రమ పురపత్తన గ్రామక్షేత్ర యారణ్యానవకోమరనవకంబులను జిత్రతరంబుగాఁ జిత్రింపవలయు. ఇట్టి సుందరమందిరంబునందు ౭౯

క. మురళీధరు వక్రీకృత, వరదక్షిణచరణుఁ గృష్ణుఁ బరము నిజస
ద్గురుహస్తంబున శ్రుతిహిత, సరణిఁ బ్రతిష్ఠింపఁ జేయుఁ జను మేధావీ! ౮౦

ఉ. పిమ్మట నొజ్జ నిల్పినప్రతి విక్రమసుందరవిగ్రహంబు దాఁ
గ్రమ్మఱ నిల్పి భక్తిమెయి ఘ్రాణము తత్తులసీదళంబులం
దమ్మధువైరి దివ్యచరి తాళి వినన్ జెవులా హరిప్రసా
దమ్మున జిహ్వ యొప్ప సత తంబును సేవలఁ జేయఁగాఁ దగున్. ౮౧

తే. అట్లు సేవించువాఁడు భక్తాగ్రగణ్యుఁ, డని యెఱుంగుమ! రాజసూయాశ్వమేధ
శతసహస్రముల్ సైత మీ శౌరిసేవ, కీడు రావని నమ్ముమా! యిద్ధచరిత! ౮౨

ఆ. మఱియు నెవ్వఁడట్టి గురుని దర్శించునో, వాఁడు కోటిజన్మ పాపములను
విడిచి యంతమందు విష్ణుదూతానీత, రథము నెక్కి చనుఁ బరమపదంబు. ౮౩

తే. పార్థివేంద్ర! నరుఁడు బ్రాహ్మముహూర్తంబునందు మేలుకాంచి హరినిఁ బొగడి
గురుని పేరుఁ దలఁచి కుంభినిన్ మ్రొక్కుచుఁ, బుడమిపైని నడుగు లిడి కదంగి.

తే. నీరు డాఁకి యాసనమునఁ గూరుచుండి, కరములుత్సంగములయందుఁ గాల శ్వాస
మడ్డి మఱి స్వస్తికాసనమందు నొప్పి, జ్ఞానముద్రను వేసి యొజ్జను దలంచి. ౮౫

చ. అమలుఁడు వంశివేత్రధరుఁ డభ్రనిభుండు కిశోరరూపుఁడున్
గమలదళాయతాక్షుఁడు జగత్త్రయమోహనుఁడైన కృష్ణునిన్

విమలమతిఁ నతుల్ సలిపి వేఁడి యనంతరమందు బాహ్యదే
శమునకునేగి శౌచమిటు సల్పఁదగుఁ గృహి యోనరేశ్వరా! ౮౯

సీ॥ మంత్రపూర్వకముగ మన్నునుగైకొని, యుదకంబుతో లింగ మొక్కతడవ
గుదమును మువ్మాఱు బదిపరుల్ వామకరంబేడుపరులు కరములు రెండు
మూఁడేసిపర్యాయ ములఁబ్రతిపాదముఁ, శౌళనంబులఁశ్రద్ధ సలుపవలయు
బ్రహ్మచారియువన వాసియుదీనికి, నినుమడిగానాచ రింపనగును
తే॥ నలుమడిగయతివర్యుఁడు సలుపఁదగుఁద, దర్ధమును నిశ రోగిపాంధ ప్రతతిఁద
దర్ధమును, స్త్రీపదజులు తదర్ధమాచరింపవలయును యాదవోర్వీశ! యవల.
తే॥ ఆయురర్థసంపదలఁగాం త్యాదుల నిడ,వృక్షరాజంబు వినుతించి విమలకాష్ఠ
మొందుగొని దంతధావనము త్తరముగను, ప్రాచిగను కూరుచుండి సల్పంగవలయు
తే॥ అట్టిదంతధావనకార్య మందుఁ జనుఁడు, క్షీరికావటకార్పాస సిందుకాండ
కంటకీ బ్రహ్మవృక్షదుర్గంధయుక్త, తరువులను వీడవలెనని యెఱుఁగుమనఘ!
క॥ శౌచాచారరహితమును, జాచరితకృతులును వ్యర్థ మగు మఱి ముఖసా
మాచీన్యవిహీనునకుఁ ద్ర,యీచారిమమంత్రఫలము లెనయవు పిదపన్. ౯౦
ఆ॥ రవిని సన్నుతించి ప్రహ్లాదముఖులైన, విష్ణుభక్తవరుల వినుతిసలిపి
తులసిమృత్స్నఁగొనియొడలఁ బూసి దివ్యమా, వారియందు మునిఁగి భక్తితోడ.
సీ॥ యమునాది తేయాప గాష్టకపఠనంబు, నాచరించి యల మాయాపురంబు
కాశి నవంతిక కాంచీపురము నయో,ధ్యామధురాపురీ ద్వారకలను
శంబలగ్రామస్థ శౌరిమందిరము న,ఖండనందిగ్రామ కౌశలమును
నగ్రగణ్యమగు శాలిగ్రామగతమహా,యోగ మర్బుదనైమి షోత్తమకురు
తే॥ జాంగలోత్పలావర్తపుష్కలవనముల, దండకాటవి హేమవంతంబు సైంధ
వంబుఁ బృధులజంబూమార్గవనముఁ బెక్కు,సారులు సముచ్చరించుచు జలకమాడి.
ఆ॥ క్షౌమవటముఁగట్టి చక్రగాద్వాదశ,తిలకములను బెట్టి దివ్యమైన
యష్టముద్రికలను వాళిని ధరియించి, సంధ్యవార్చిమాన శౌచములను, ౯౩

వ॥ శ్రీహరిమందిరంబున కేగి ఘంట వాయించి జయశబ్దంబుఁ బలికి కర తలంబులఁ జఱచి యుత్తిష్ఠ! యుత్తిష్ఠ!యని గోవిందుని యోగనిద్రనుండిమేల్కొల్పి తన్ముఖంబున కంతకును మంగళారతిం జూపి దివ్యపక్వాన్నంబు నివేదించి పునః పునఃప్రణామంబు లాచరించి పంచామృతంబుల నభిషేకించి శుద్ధోదకంబున స్నానంబుఁ జేయించి దివ్యాంబరాభరణాదులతో మనసార నలంకరించి సుమనఃపుంజంబునం బూజించి ధూపదీపంబు లిడి భోగ్యాన్నం బర్పించి నీరాజనం బిచ్చి నానారసభాసురంబగు మహాభోగ్యాన్నంబును సమర్పించి భోగార్తికం బిడి యాహారిక

శయనంబు మనోహారంబుగాఁ గూర్చి తులసీవాసనావాసితంబగు తత్ప్రసాదంబును స్వీకరింపవలయు, మధ్యాహ్నంబున శంఖనాదంబుతో రాజాన్నంబును నివేదించి రాజభోగార్తి నిచ్చి యా మహాత్మునికి శయ్య వేయందగు సంధ్యాసమయంబున దుగ్ధాదులను నివేదనం బొనర్చి నీరాజనం బిడి మరల రాత్రియందు మంగళారతి యొసంగి మృష్టభోగంబును సమర్పించి శయనంబునకై దివ్యతల్పంబు గూర్పందగు. రాజసంబగు నీ రాజసేవను ప్రత్యహం బొనర్చువాఁడు పాపవిముక్తుండై తనకు సంబంధించిన శతకులంబులంగూడ నుద్ధరించి పరమపదంబుఁ జెందగలఁడు. మఱియు మానవుండు శ్రీకృష్ణజన్మాష్టమీ రామనవమీ రాధాష్టమ్యన్నకూటవామనద్వాదశీ నృసింహచతుర్దశ్యనంతచతుర్దశ్యాదులయందు మహాపూజ యా శ్రీహరికిం జేయం దగు. తత్పూజావిధానం బెట్టిదంటివేని వినుమని యుగ్రసేనున కిట్లు చెప్పం దొడంగె. ౯౫

## షోడశోపచారపూజావిధానము.

తే॥ స్నానమొనరించి శుభ్రవస్త్రములఁగట్టి, నిత్యనైమిత్తికంబుల నిష్ఠఁదీర్చి
శుద్ధమగు ప్రదేశంబును జూచి యందు, స్థండిలంబును నిర్మించి దానియందు.

ఉ॥ గొప్పగఁ గేసరంబులను గూడిన కర్ణికతోడ దివ్యమౌ
ముప్పదిరెండుఱేకులను బొందిన తామర నైదురంగులన్
దప్పక వేసి దానిపయిఁ దద్దరికైనను గద్దెఁగూర్చి యం
దప్పుడమర్చి సిరిన్ విరజ నా వృషభానుతనూజ రాధికన్. ౯౬

తే॥ ప్రాఁబలుకుపల్కులన్ నిల్పి వారినడుమ
నల్ల శ్రీకృష్ణు స్థాపించి యష్టపత్ర
ములను రాధాష్టసఖులను నిలిపి యష్ట
దళములన్ గృష్ణుచెలులను నిలిపి యవల. ౯౭

ఆ॥ షోడశదళములను సుందర శ్రీకృష్ణ,షోడశయుగసఖుల సొరిది నిలిపి
యల్లతమ్మిదరుల నబ్జగదాశంఖ,చక్రశార్ఙ్గఖడ్గ శరముల మఱి. ౯౮

తే॥ హలము ముసలంబు వనమాల నలఘుకౌస్తు
భంబు వంశి వేత్రముల శ్రీ వత్సనీల
వస్త్రపీతాంబరముల స్థాపనముఁజేయు
వలయుఁ బిమ్మట నవ్వాని పార్శ్వములను. ౯౯

సీ॥ గరుడాంక తాలాంకగరుడ కుముద కుము,దాఖ్య సుమతి రథదారుకులను
బల మహాబలులను బలుఁ జండునిఁ బ్రచండు, స్థాపించి వెండియు సర్వదిశల
దిక్పాలకుల నిల్పి ద్విపముఖ శివ విధి, పార్వతీ భారతీ వార్ధిజలను
షోడశమాతృకా సూర్యముఖగ్రహ,ములను విష్వక్సేన మూర్తి దుర్గ

తే॥ వహ్ని గమలాగ్రమందు స్థాపనము నర్చి
షోడశోపచారంబుల సొరిది సల్పి
యచలభక్తిని బ్రార్థించి యవని శిరము
సోఁకఁ బ్రణమిల్లఁ జెల్లునో సూరిగేయ ! ౧౦౦

సీ॥ ఆలింపుమా ! హరి యావాహనమునఁ బుష్పములాసనమున దర్భద్వయంబు
పాద్యంబునం దాకుపచ్చని గఱిక యర్ఘ్యమున విష్ణుక్రాంత ప్రసవములును
స్నానమున నుశీర చందనాగరు ఘనసార కస్తూరికా సహితజలము
మధుపర్కమందు నామలకకమలములు, ఘనధూపమందష్ట గంధములును

ఆ॥ దీపమునఁ గపురము దివ్యయజ్ఞోపవీతమును బచ్చనిది పటమునఁ బీత
వస్త్రముల్ దొడవుల బంగారు గంధంబు నందఁ గుంకుమ హరిచందనములు.

తే॥ అలరులన్ దులసీమంజరులును నక్షతలను దండులముల నివేదనమునందు
షడ్రసోపేతవివిధభోజనముల జలమునఁ గళిందజాజాహ్నవీవనముల మఱి.

తే॥ ఆచమనమందు జాతీఫలాదులు విడెమును మిరియాలు దక్షిణన్ హాటకము ప్ర
దక్షిణాన వలగొనుట తన్మహాను భార్తికంబున నుత్తమార్జ్యంబు మఱియు.

క॥ వినుతిని బ్రియయుతభక్తియు, వినతిని సాష్టాంగనమ్ర విగ్రహముప్పన్
వినుతద్వాదశవర్ణములను దగు మంత్రంబున శిఖ లలిఁగట్టితమిన్. ౧౦౪

క॥ హరిపూజాపరికరముల, దరినిడికొని కృష్ణునెదుటఁ దనరుచుఁ దత్త
త్పరమస్త్రుత్యాదితోక్తుల, వరుసగఁ బఠియించు చిట్లు పచరింపవలెన్. ౧౦౫

తే॥ దీనవత్సల ! గోవింద ! దేవవంద్య !, యాదవేశ ! గోలోకేశ ! యంబుజాక్ష !
రాధికేశ్వర ! దామోదర ! సుముఖమున, నిట్టి సింహపీఠిక నావహింపుము ! తమి.

తే॥ ఊర్ధ్వపృష్ఠమునన్ గెంపు లొప్పఁ జరణ
కమలములను వైడూర్యముల్ గ్రాల మెఱపు
వలె వెలింగెడి స్వర్ణకుంభములతోడఁ
గొదరు పీఠికఁ గొనుమ ! వైకుంఠనాథ ! ౧౦౬

ఆ॥ విశ్వరూప ! భక్తి బిందుసరస్సున, నుండి నేను పైఁడి గిండితోడఁ
దెచ్చినట్టి పాద్యమిచ్చెదఁ గొన నీకు, మ్రొక్కుచుంటి సర్వమునివరేణ్య !

తే॥ చందనోశీరమల్లికా చందనపరిమిళితమగు నీజలంబుతో జలకమాడ
ద్వచ్చరణపద్మముల కభివాదనముల, సలిపెదన్ దీర్ఘవరపాద ! జగదధీశ ! ౧౦౭

క॥ ఘనపీతాంబర ! మధ్యం, దినరవిశశధరభవంబు దివ్యము హృద్యం
బును నగు నీమధుపర్కం, బనుమానము వీడి యాద వాగ్రణి కొనుమా !

తే॥ పద్మకింజల్కరుచిరంబు పరమదుర్లభము స్వరచితంబు సర్వత్ర భాసురంబు
నైన పీతాంబరంబు మహాదరమునఁ, గొనుమ ! గోపాలకృష్ణ ! గోకులనివాస !

ఆ॥ జలము శ్రుతిఁ జదువుచుఁ♦జల్లి నైమిత్తిక, పంచకార్యములను♦బనివడునటు
త్ర్యాసురుండు స్వర్ణ♦కాంతివడికిన యీ బ్రహ్మసూత్ర మీవు♦పరమ! కొనుమ!

క॥ మణికనకమయముఁ గాల్యా,రుణతేజస్సనము మదన♦రుగ్రుచిరంబుల్
బ్రణుతమయరచితమగు భూ,షణమిది గొనుమయ్య! సర్వ♦జగదాధారా!

తే॥ సర్వభూభారపరిహార♦శౌండ! శుభక
రమును సంధ్యేందురుచిరంబు♦విమలకుంకు
మఘనసారపంకయుతంబు♦మండనకర
మైన యీ సుగంధంబుల♦నందుకొనుమ! ౧౧౪

మ॥ అనఘుండైన విరించనుండు మును బ్ర♦హ్మావర్తమం దెవ్వి సృ
ష్టిని జేసెన్ హరి యెవ్వి మంత్రజలసం♦సేకంబు గావించి వృ
ద్ధిని సల్పెన్ శివుఁ డెవ్వి రాక్షసులతో♦దిట్టంబుగాఁ బోరి కా
చెనో యా యక్షతల్ గ్రహింపు మిపుడో♦శ్రీరాధికానాయకా! ౧౧౫

క॥ తులసీమంజరులందగు, జలరుహమందారపారి♦జాతామరవృ
క్షలలితసుమములఁ గొనుమీ!, జలజాక్షా! జలజనాథ!♦జగదాధారా!

తే॥ చందనలవంగచూర్ణమి♦శ్రమును హార్మ్య
మంతఁ బరిమళింపఁగఁ జేయు♦నట్టిదియును
నసురమానవసుఖదంబు♦నైన ధూప
మిదిగొ యిచ్చెద శ్రీకృష్ణ!♦యీవు గొనుమ! ౧౧౬

క॥ జ్ఞానాకారము ఘనరస, ధేనుఘృతవర్తియుతము♦దివ్యంబు తమి
స్రానాశకమగు దీపము, జ్ఞానానందస్వరూప!♦కైకొనుమ! దయన్. ౧౧౭

తే॥ రుచికరంబును మ్రదస♦రుచిరముత్త, మామృతమనోహరంబు య♦శోమతీకృ
తము ఘనమగు నీనైవేద్య♦మమితదయను,గొనుమ! నందనందన! రమ్య♦కుందరదన!

ఆ॥ అధికకష్టముపడి♦యల్లగంగోత్తరి, యమృతకిరణశీత♦లామృతోప
మోదకంబు హాట♦కోరుపాత్రంబుతోఁ, దెచ్చియుంటిఁ గొనుమ♦దేవదేవ!

క॥ జాతీఫలకంకోలను,మాతత సురభీకృతామ♦లాచమనం బో
భూతదయాకర! రాధా,చేతశ్శతపత్రమిత్ర♦శ్రీహరి! కొనుమా! ౧౨౧

క॥ క్రముకైలా వర దేవకు,సుమఖాదిరజాతికోశ♦సుధ లాకులు రు
చ్యముగా భాసిల్లెడి నీ,తములముఁ గైకొనుమ! కృష్ణ!♦ధైర్యసుమేరూ!

తే॥ సర్వజనములఁ గ్రుటిలో వ♦శంబు జేసి,కొనెడి నీస్వర్ణమయదక్షి♦ణను గ్రహింపు
మష్టదిక్పాలపూజితా!♦యఖిలలోక,పాల! భక్తాలవాల! గో♦పాలబాల!

తే॥ ఉత్తమాజ్యాక్తపంచన♦వోరువర్తి, భాసురము మంగళకరంబు♦బరమదీప్తి
యుతమునైన యీమంగళా♦రతిని(గొనుమ,కృష్ణ! బ్రహ్మాండనాయకా! కృష్ణమిత్ర!

క॥ కరకర్ణశీర్షబాహా ♦ చరణేక్షణనామరూప ♦ సాహస్రములే
పరమున కుండునో యా యక్షరునకు యుగకోటిపతికి ♦ సత్ప్రద నతులన్. ౧౨౫

తే॥ సవనదానతపోవ్రత ♦ సత్యశౌచ, ధర్మతీర్థయాత్రాదిక ♦ త్సుకృతంబు
నిదుప్రదక్షిణంబులను గా♦వించుచుంటి, గనుమ ! కనులార కరుణ జ♦గన్నివాస!

తే॥ దేవ ! నావంటిపాతకి ♦ త్రిజగములను, లేఁడు నీవంటిపరముఁడు ♦ లేఁడుగాన
నిన్ను దీనతఁ జేరిన♦నన్ను నిపుడు, బ్రోవవేఁడితి ద్వారకా♦పురనివాస ! ౧౨౬

తే॥ సచ్చిదానందమూర్తివి♦శాశ్వతుఁడవ,గమ్యుఁడవు సర్వకారణ♦కారణుఁడవు
శాంతుఁడవు విదూరీకృతా♦సజ్జనుఁడవు, బ్రహ్మమగు నీకు మ్రొక్కెదఁ♦బరమభక్తి.

## —♦ శ్రీకృష్ణ దండకము. ♦—

శ్రీరాధికాలోల లీలావిలోలా త్రయీధర్మపాలా తొల్లిన్ ధారణీదేవి దుర్మార్గులైనట్టి భూపాలురన్ దైత్యులన్ రాకులన్ మోయఁగాలేక కన్నీరు మున్నీరుగా గాఱ జింతించి యోజించి రూపించి గోరూపముం దాల్చి యా సత్యలోకంబునం జేరి యబ్జాసనాసీనునిం గన్నులారంగ వీక్షించి ధ్యానించి భావించి జోతంబులన్ దేవ! నావిన్నపం బిద్ది యాలించి ప్రేమించి యెంచంగవిల్లాని నాయార్తి మాయించి రక్షింపవే యంచుఁ బ్రార్థింప నాతండు నాతల్లి నూరార్చి రేజోతి రేకంటు వేకంటి ముక్కంటి జేజేలతోఁ గూడి వైకుంఠలోకంబునం గుండు నాతమ్మికంటిన్ విలోకించి యాకార్యపీకష్టముల్ దెల్పి యాకేశవాలోచనన్ వించు నాదేవుఁ డగ్రంబునందుండి మార్గంబుఁ జూపించుచున్ దోడుగా రాఁ బథంబందుఁ దైవారు లెక్కింపఁగారాని పెక్కన్బ్రహ్మాండముల్ చిత్రముల్ భూసభోగోళముల్ బల్లెలన్ వీడులన్ మేడలన్ వాడలన్ బీడులన్ జేటలన్ దోటలన్ గానలన్ వాకలన్ గాంచు చారాధ్యమై యోగిసాధ్యంబునై సర్వకామప్రదంబై యఘుగ్రావవజ్రంబునై శ్రీనివాసంబునై నీకు వాసంబునై యొప్పు గోలోకముం జేరి యాలోనిఖర్జూరజంబీర మందార బృందారకాగాదిరమ్యంబుగానున్న నీకుంజమున్ జొచ్చి తేజోవిరాజత్సహస్రోరుపత్రాంచితాబ్జోర్ధ్వభాగోజ్జ్వలత్షోడశోచ్ఛ్రాయపత్రాంచ దంభోరుహాష్టాష్టపత్రోల్లసద్దివ్యపద్మంబునన్ స్వర్ణసింహాసనంబందు దేవాదిదేవుండవై పద్మనేత్రుండవై భూషణాలంకృతాంగుండవై పద్మనేత్రుండవై చండమార్తాండకోటిప్రభాభాసమానుండవై రాధికాభామినీరత్నయుక్తుండవై మేఘవర్ణుండవై యున్న నిన్నున్ విలోకించి యారా యటంచెంతొ హర్షించి దేవా! పరేశా! చిదానందరూపా! యుపేంద్రా! నమస్తే యటం చాదలల్ మేదినిందాఁక జోబిల్లు గావించి మాకుయ్యి నాలించి పాలింపుమో దేవ! యీ మేదినీదేవి దుఃఖంబుఁ ద్రోపాడి కాపాడుమో పీతచేలా! సుశీలా! యటంచున్ నుతిన్ సల్పఁగా నీవునున్ మెచ్చి యో వేల్పులారా! ధరన్ నాదు నేమంబునన్ మీరలందందు నారీతులన్ బుట్టుఁ డంచంపి నీలోకమందుండి

నీయన్న మన్నింప విన్నాణమైనట్టి బృందాటవిన్ భూమినిన్ దివ్యగోవర్ధనం బల్ల
కాళిందినిన్ బంపి భూభారముల్ బాప భూదేవులన్ బ్రోవఁ బుణ్యాత్ములన్ గావ
మూర్ఖాళి శిక్షింప వేదాల రక్షింప శీతంబునం బెండలన్ వానలన్ బెక్కుకష్టం
బులన్ జిక్కియున్ నిశ్చలాత్మన్ నినున్ గూర్చి ప్రార్థించి చేకొన్న సర్వేష్టముల్
దీర్పఁ గారుణ్యచిత్తంబుతోఁ గంసకారాగృహంబందు భీతిల్లుచున్నట్టి శ్రీదేవకీ దేవి
కిన్ దివ్యరూపంబుతోఁ బుట్టి నీతండ్రికిన్ దల్లికిన్ జింతలన్ బాపు తంత్రంబులన్ జెప్పి
గోగోపగోపీయుతంబైన శ్రీగోకులంబందునన్ జేరి యందున్న యా యోగమాయన్
వడిన్ దిగ్గి తత్కారకుంబంచి నందాదులన్ శ్రీయశోదాదినారీలలామంబులన్ లీలలన్
ఖేలలన్ జూపులన్ మాటలన్ జేతలన్ బ్రీతినిం జోద్యమున్ గూర్చి నీయంశతో
నొప్పు శ్రీరేవతీపుత్రుఁడౌ రాముతో నాడుచున్ గూడి యాక్ బాడుచున్ ద్రాగు
చున్ మెక్కుచున్ గోవులన్ గాయుచో ప్పారి యాగొప్ప బృందావనంబందు లీలా
విహారంబుఁ గావించి యారాధఁ బెండ్లాడి రాసంబులన్ ద్రిప్పి వంశి నీ వూఁదవే
గోపికల్ రా ననేకాకృతుల్ దాల్చి యావ్యాళిలోఁ గూడి యాటంబులన్ వారలన్
జేరి క్రీడింపవే మోదముం గూర్పవే పుణ్యతీర్థంబులన్ నెంబు గోపాంగనల బెత్తి వేవ్రే
లనున్ ద్రేతలన్ గావవే దావమున్ మ్రింగవే కాళియాహీంద్రుని మర్దింపవే తత్పరో
జాతు లర్థింప రక్షింపవే కోలకేశ్యాదిదైత్యేంద్రులన్ గూల్పవే వేగ నీకోటులన్
ధారణిన్ నిల్పవే వేదముల్ ధాతకీవిచ్చి సంప్రీతుగాఁ జల్పవే రాధికాగోపికాయూథ
నాథుండవై సద్విహారంబులన్ జేయవే పూర్వజన్మంబునం దెన్నొమార్గంబులన్
గొల్చి నీయాజ్ఞచే ద్రేతలై పుట్టియున్నట్టి మౌనీంద్రులన్ భక్తులన్ జూచి రక్షింపవే
దేవ! యస్వల్పుఁడౌ కంసునాహ్వానముం గొంచు నీలాంబరాక్రూరయుక్తుండవై
సాఁగి ప్రీతిన్ భవద్విశ్వరూపంబు మార్గస్థమౌ వాఁకలో గాందినీసూతికిన్ జూపి
తత్పట్టణం బొంది కుబ్జాదులన్ గాంచి సంతోషమున్ గూర్చి యానేడులోకంబులన్
సాటిలేనట్టి తత్కార్ముకం బట్టి భంగంబు గావించి తన్మత్తమాతంగమున్ ద్రుంచి
చాణూరకూటాదులన్ గూల్చి లోకంబుఁ జీకాకుగాఁ జేయు నాకంసుఁ బోకార్చి
శోకంబుతోనున్న యాయాదవశ్రేణులన్ బ్రోచి తద్బంధనంబందు దైవాఱు నాయు
గ్రసేనున్ దయన్ జూచి మన్నించి మన్నీడుగాఁ జేసి నీతల్లిదండ్రుల్ ముదం బొంద
వీక్షించి తత్కార మాయించి నీక్షేమముం దెల్పి యాగోకులం బెల్ల హర్షింపఁగా
నుద్ధవుం బుచ్చవే నారదప్రేరితుండైన శ్రీమ్లేచ్ఛనాథుండు బాటాడఁగాఁ బాటి భర్జిం
పవే తజ్జరాసంధు వేమాఱు నోడించి యంతంబునందట్టి భూదేవవాక్యంబు సత్యం
బుగాఁ జల్పఁ దచ్ఛైలముం దెక్కి యందుండి యబ్ధిస్థమౌ ద్వారకన్ జేరి తద్యాదవ
శ్రేణినిం జేర్చి కాపాడవే రుక్మిణీసత్యభామాదులన్ బ్రీతిఁ బెండ్లాడవే భౌమునిం
జంపి యవ్వాని కారాగృహంబందు బల్ కుందు భూజానిపుత్రీలలామంబులన్ వీడి

ప్రేమింపవే యుగ్రసేనుంబు తద్విశ్వజిద్యాగముం జేయ బోధించి తంత్రంబు
వాచించి దిక్కులెల్లలన్ గెల్వఁగా నీకుమారుండు వీరుండు భూమోహనాకారుఁ
డౌవారు నీమారుగాఁ బంపి యుద్ధప్రసాయంబులన్ జేయ నీవేగి మాత్సర్యభీమప్రతి
రోత్సాహసంపన్నులౌ నాశకున్యాది దైతేయులన్ జంపి యాకంతు దిగ్జేతగా సల్పి
తద్యాగరాజంబు రాజేంద్ర భోగీంద్ర దేవేంద్ర యోగీంద్ర పూజ్యంబుఁ బూర్ణంబు
నౌనట్లుగాఁ జేసి తద్వాంఛలన్ దీర్పవే సచ్చిదానంద రూపుండవై యప్రమేయుం
డవై యాదిమధ్యాంతశూన్యుండవై సర్వమాన్యుండవై వేదశాస్త్రాద్యగమ్యుం
డవై భక్తగమ్యుండవై నిర్మలాత్ముండవై నిర్వికారుండవై నిత్యశుద్ధుండవై నుత్య
బుద్ధుండవై స్తుత్యవేదస్వరూపుండవై ధ్యాతవై ధ్యేయమై ధ్యానమై భోక్తవై
భోగ్యమై భోగమై యొప్పు నీచెయ్వులన్ జూచి యాశ్చర్యముం బొంది సృష్టించు
నాధాతవంచున్ దయన్ బెంచు విష్ణుండవం చెల్ల దూలించు రుద్రుండవంచున్
మఱిన్ బెక్కుమార్గంబులన్ గాంచి యగ్గింతు రీలోకులో యీశ! లోకేశ! యా
లోచనం జేయ నవ్వారలున్నీవె కావా! సమస్తేంద్రియంబుల్ దగన్ నీవె కావా!
మహారాజ! నీయందె యీలోకముల్ పుట్టు నీయందె చెన్నొందు నీయందె డిందున్
సుమీ దేవరాజా! మహాత్మా! భవద్భీతి సూర్యుండు దీపించు సోముండునున్ వెల్గు
వాతంబు వీచున్ గృశానుండు మండున్ గృతాంతుండు శిక్షించు నాస్రష్ట సృష్టించు
విష్ణుండు రక్షించు రుద్రుండు మాయించు నింద్రుండు నాకంబుఁ బాలించు శేషుండు
నేలన్ వహించున్ గదా శేషి! నీమోమునన్ బ్రాహ్మణుల్ మూపులన్ క్షత్రి
యుల్ సక్థులన్ వైశ్యులున్ బాదయుగ్మంబునన్ శూద్రులున్ డెందమం దిందుఁడున్
గన్నులన్ సూర్యుఁడున్ వక్త్రమం దగ్ని సుత్రాములున్ బ్రాణమందున్ జగత్ప్రా
ణమున్ నాభి నభ్రంబు శీర్షంబునన్ స్వర్గమున్ వీనులన్ దిక్కులున్ గాళ్ల నీభూమి
నీరీతినే యన్నిలోకంబులన్ బుట్టి రాజిల్లవే యీమహారూపుఁగన్నట్టి నిన్నల్ల బ్రహ్మా
దు లెన్నంగలేరన్న నాబోటిపిన్నల్ నుతింపంగ యాత్రింతురో కో? పరంధామ!
వందారుమందార! గోవింద! రామానుజా! శ్రీధరా! మేశ్వరా! యీశ్వరాజేంద్ర
రాజేంద్రపూజావిరాజత్పదా! నీపదాంభోజముల్ గొల్చు డెందంబు నిన్మ్రొక్కు
శీర్షంబు నీగాథలాలించు కర్ణంబులున్ నీవరాకారముం జూచు నేత్రంబులున్ నీప్రసా
దంబులన్ గోరు వక్త్రంబును న్నిన్ను బూజించు హస్తంబులున్ నీమహామందిరంబుల్
ప్రవేశించు పాదంబులన్ నెమ్మి నాకిచ్చి కారుణ్యచిత్తంబుతోడన్ బ్రపన్నుండనౌ
నన్ను మున్నల్ల ప్రహ్లాదవైరోచని ద్రౌపదీపార్థదేవర్షి గాంగేయరుక్మాంగదాహీంద్ర
నందాంబరీషాదులన్ గాంచినట్టుల్ విలోకించి నాకామమున్ గోపమున్ లోభమున్
మోహమున్ గర్వమున్ మచ్చరంబున్ విడన్ జేసి మన్నించి రక్షింపవే భక్తచింతా

మణీ! దీనరక్షామణీ! నిర్జరగ్రామణీ! లోకచూడామణీ! యోయిక్కృష్ణా నమస్తే నమస్తే నమః. ౧౨౯

వ॥ అట్లు హరిం బూజించి నమస్కరించి నుతించి యనంతరంబున నమో నారాయణాయ యని ప్రాణాయామం బొనరించి ప్రణవపూర్వక కేశవాదినామంబులతో నాపాదమస్తకంబు నర్చించి తద్విధంబుననే తదీయసఖీసఖశంఖచక్రగదా పద్మాసి ధనుర్బాణ హల ముసలకౌస్తుభ వనమాలా శ్రీవత్సపీతాంబర నీలాంబరవంశీ వేత్రతాలధ్వజ గరుడధ్వజ రథదారుకసుమతి గరుడ కుముద కుముదాక్షనందసునంద చండప్రచండబలమహాబలాదులను, విష్వక్సేన వినాయక శివవిధి దుర్గాదిక్పాలవరుణ నవగ్రహమాతృకాదులను, దత్తన్మంత్రంబులతోఁ బూజించి నమో వాసుదేవాయ యను మంత్రంబుతో శతాహుతులను యగ్నియందు వేల్చి ప్రదక్షిణించి మహాభోగం బర్పించి నమస్కరించి ధ్యాయేత్సదా యనుదానితో ధ్యానించి క్రమ్మఱఁ బ్రణమిల్లి నీరాజనంబిడి ఘటీఘటావీణావేణుకాంస్యకరతలతాలమర్దలాదిజయధ్వానంబులొప్ప భక్తజనులతోఁ గూడి సత్కథాశ్రవణతత్పరుండై యనన్యప్రేమలక్షణభక్తితో నా హర్యగ్రమందు నాట్యం బొనర్చి సాష్టాంగదండప్రణామంబులం గావించి తన్మందిరంబం దా సుందరనందనందనునకు దివ్యశయ్య వేయందగు. ఇట్లా శ్రీకృష్ణసేవనొనర్చు పుణ్యాత్ముండు బృందారకులుసైత మర్చింపఁ దన్నాకపదంబుఁ బొంది క్రమంబుగా నత్యుత్కృష్టధామంబగు గోలోకంబున కేగి సుఖించు. యుక్తభుక్తిభక్తిముక్తికరంబగు శ్రీకృష్ణసేవావిధానంబు క్రమంబుగాఁ జెప్పితి. మఱియు నేమివినవలతువో తెలుపుమన నుగ్రసేనుం డా వ్యాసమహర్షి కిట్లనియె. ౧౩౦

మ॥ హరిరూపంబున నొప్పు మీవలన నా ♦ యబ్జాక్షపూజావిధిం
గరమాలించితి లోక మెన్నఁగఁ గ్రుధా ♦ గర్వవ్యథామోహమ
త్సరలోభాదిగుణప్రయుక్తమయి త ♦ ద్వైరాగ్య మావంతయుం
సరిగాఁ బొందదు తద్రమావిభున క ♦ ర్చల్ సేయ దెవ్వేళలోఁ. ౧౩౧

తే॥ మోహ మెక్కారణమున నీ ♦ భువనమందు
బుట్టెనొకో? మఱి యెట్టుల ♦ గిట్టగలదొ
కరుణఁ జెప్పగవేఁడితి ♦ దురితదూర!
బాదరాయణి! గుణమణీ! ♦ వ్యాసమౌని! ౧౩౨

## పరబ్రహ్మనిరూపణము.

చ॥ అనవుడు వ్యాసుఁ డిట్లనియె ♦ యాదవనాయక! యేవిధంబుగా
ఘనగగనాన నొప్పునుడు ♦ కాంతునిబింబము క్రింది నీటిలోఁ
గనుపడి కంపమొందినటు ♦ కారణకారణుఁడైన యా పరా
త్ముని ప్రతిబింబ మీ జగతి ♦ మోహదమై జనియించి యొప్పెడిన్. ౧౩౩

క॥ మాయాకాలమనంబులఁ, గాయజగుణములను మఱిఁ గు ♦ కర్మంబులచేఁ
బ్రాయముగ జనుఁడు బద్ధుం,డౌ యాదవనాథ! యిది ని ♦ రనుమానముసూ.

ఆ॥ అట్లు బద్ధుఁడైన ♦ యాతఁడు కాచస్సై,కతగుణములఁ గనులఁ ♦ గాంచి బాల
వారి సర్వములని ♦ భ్రమియించి మోహించి, సంచరించి యాద ♦ సంచరించు.

వ॥ ఇజ్జగంబు విశేషంబుగా రజస్తమోగుణమయంబును, గ్వాచిత్కంబుగా సత్వగుణమయంబును మోహమయంబును మనోవిలాసంబును, జంచలంబును, భ్రాంతికరంబును, నానావికారసంయుతంబునునై యలాతచక్రంబువలె నొప్పుచుండునని యెఱుంగుమన నుగ్రసేనుం డానందించి మునివరా! పండితులా శ్రీకృష్ణుని జపమార్గమం దెన్ని తెన్నుల నెన్ని ధ్యానింతురో తద్విధ్యాలక్షణం బెద్దియో తెలియఁజేయ వేఁడెదనని నమస్కరింప నా వ్యాసుండు ప్రసన్నవదనుండై యదువరున కిట్లనియె ౧౩౬

చ॥ జననమృతిక్షుధా ప్రభృతి ♦ షట్కవిరోధసఖిత్వ బాల్యయా
వనజరఠత్వకష్టసుఖ ♦ భావసమున్నతి తృట్సుధాధిరో
గనివహభీతు లెవ్వియు న ♦ ఖండుఁ డనశ్వరుఁడైన యా పరా
త్మునకణువేని లేవనుచు ♦ బుద్ధి నెఱుంగుము! యాదవేశ్వరా! ౧౩౭

సీ॥ కాకశరీరంబు ♦ గాక ప్రాణంబులు,గాక యింద్రియములు ♦ గాక మనము
గాక మనీషయుఁ ♦ గాక చిత్తంబును,గాక యహంకృతి ♦ గాక గుణము
గాక తన్మాత్రలు ♦ గాక శూన్యంబును,గాక స్థూలమును సూ ♦ క్ష్మమునుగాక
గాక హ్రస్వంబును ♦ గాక దీర్ఘంబును, గాక వర్ణంబులు ♦ గాక జడము

తే॥ కాదుకాదనునదికాక ♦ కాదుకాదు,కాదనెడి దానియందునఁ ♦ గాంచఁబడుచు
శాశ్వతంబయి యెయ్యది ♦ చక్కవెలుఁగు,చుండునో యద్ది పరమాత్మ ♦ యుర్వరేశ!

సీ॥ నిర్విశేషుండును ♦ నిష్కారణుండు ని,ర్వాణప్రదుండు ని ♦ రామయుండు
నిర్వికారుండును ♦ నిర్వికల్పుండని,ర్వాచ్యుండు పరుఁడు ని ♦ రంజనుండు
త్రిగుణాశ్రయుండును ♦ త్రిజగత్స్వరూపుండు,నమలాత్ముఁడు త్రిమూ ♦ ర్త్యాత్మకుండు
సంకల్పరహితుండు ♦ జగదేకదేవుండు, సచ్చిదానందుండు ♦ శాస్త్రయోని

తే॥ యాదిమధ్యాంతరహితుండు ♦ నప్రమేయుఁ
డక్షరుండు నంతర్యామి ♦ యతులితుండు
సర్వకారణాతీతుండు ♦ సాధుహృన్ని
వాసుఁడునుగాదె బ్రహ్మంబు ♦ పార్థివేంద్ర! ౧౩౮

తే॥ ఇట్టి పరమాత్మ తనలోన ♦ నెల్లజనము,చేష్ట లుడుగుచు శయనంబుఁ ♦ జెందునపుడు
గోచరింపక యొరుల క ♦ కుంఠితముగ, మేలుకొనిచూచుచుండునో ♦ మేరుధీర!

చ॥ స్ఫటికమునందు నెట్లితర ♦ వర్ణములేవియు సంక్రమింపవో
యెటు లనలానిలాంబరము ♦ లింధనధూళిఘటాళిఁ జిక్కవో
యటుల గుణత్రయంబునఁ బ ♦ రేశుఁడు సిక్కక సంతతంబు ను
త్కటముగ వెల్గు నిర్మలవి ♦ ధంబున సజ్జనవందనీయుఁడై. ౧౪౧

తే॥ వ్యంగ్యశాస్త్రపదస్ఫోట ♦ వాదలక్ష,ణాదులకు నట్టి పరమాత్మ ♦ యందనపుడు
లౌకికోక్తులఁ దెలియునే? ♦ లలితచరిత!, దేవకానుజ! ద్వారావ ♦ తీపురీశ! ౧౪౨

మానినీ వృత్తము.

కొందఱు వేళగఁ ♦ గొందఱుసేఁతగ, గొందఱు కర్తగఁ ♦ గొందఱు గో
విందుగఁ గొందఱు ♦ భీముగఁ గొందఱు, వేధగఁ గొందఱు ♦ వృత్రహుగాఁ
గొందఱు శూన్యుగఁ ♦ గొందఱు బ్రహ్మగ,గొప్పకతంబని ♦ కుంభిని ని
ట్లందఱు నారసి ♦ యన్నివిధంబుల, నాపరమాత్మను ♦ నందురుగా. ౧౪౩

వ॥ వెండియు గుణంబులకుఁ జిక్కక మాయ నంటక యింద్రియాంతఃకరణ చతుష్టయంబులకు గోచరింపక వేదములకు సైత మెఱుంగఁబడక త్రైకాలికాబాధ్యంబై యాపరమాత్మ ప్రకాశించు. అందు విస్ఫులింగంబు లగ్నియందు లీనంబై నట్లు సర్వంబును లయంబు బొందుచుండు. జనుండు విద్వాంసులచే వాసుదేవుండని చెప్పంబడు హిరణ్యగర్భునిం బరమాత్మతత్వంబుగాఁ దెలిసికొని మోహంబు విడిచి యసంగుండై సంచరింపందగు. చంద్రుం డేకకుండయ్యు నుదకపాత్రబృందంబునం బహుత్వంబు జెందుచందంబునను వీతిహోత్రుం డొక్కండయ్యు గాష్ఠసముచ్చయంబునందు వివిధత్వంబు గాంచినకరణిని నాపరమాత్మ యొంటివాఁడయ్యు స్వకృత దేహాదిబాహ్యాభ్యంతరంబులం బ్రవేశించి యనేకత్వంబుగాంచు. సూర్యోదయంబునఁ దమంబు నశించి గృహపరికరంబులు గనుపడినట్లు జ్ఞానోదయంబునం దమంబు నశించి పరమపదంబు గోచరించుచుండు. ఏకపదార్థంబు భిన్నభిన్నవృత్తులుగల యింద్రియంబుల కనేకవిధంబులైనట్లు తేజస్స్వరూపుండగు నాకేవలుండును భిన్నశాస్త్ర పారంగతులగు మహర్షులకు వివిధవిధంబులుగా వర్ణనార్హుండయ్యె. ఆపరంధాముండే యీ శ్రీకృష్ణుం డగుట నమస్కరించుచుంటినని చెప్పి వ్యాసుం డాయుగ్రసేను ననుమతిం గొని యాదవు లాలోకించుచుండ నంతర్హితుండయ్యె. ౧౪౪

శ్రీగర్గభాగవత పఠనాదిఫలము.

తే॥ జనక! యిట్లిప్డు నీకు వి ♦ జ్ఞానఖండ,మేనుజెప్పితి శ్రీగర్గ ♦ కృతను సర్వ
దోషహరము బుణ్యంబు జ ♦ తుష్పదార్థ,దమగు దివ్యకోశంబిది ♦ ధరణినాథ!

సీ॥ నయనపర్వ మొనర్చు ♦ నవఖండములతోడ, దనరారుచుండెడి ♦ ధరణికరణి
సర్గముల్ సేయఁగాఁ ♦ జను నవబ్రహ్మలఁ, బరగుచుండెడి పర ♦ బ్రహ్మమువలె

ప్రవిమలంబులయిన ♦ నవరత్నములతోడ, నతిశయించెడి నిగ్గ ♦ రాంగులివలె
నవ్యంబులైన త♦న్నవరసంబులతోడ, బాల్పారు శ్రీకృష్ణ ♦ మూర్తిమాడ్కి
తే॥ దివ్యనవఖండములతోడఁ ♦ దేజరిల్లెడి, గర్గభాగవతంబిది ♦ కలుషహరము
పుణ్యాకరమును బురుషార్థ ♦ భూరిదంబు, విశ్వవిజ్ఞానదమునయి♦వెలుఁగుఁగాదె.
ఆ॥ ఇద్దివిన్నవార ♦ లిహలోకసౌఖ్యముల్, బొంది గోజగతిసిఁ ♦ జెందఁగలరు
భీతుఁ డిద్దివినిన ♦ భీతిని విడుచును, బామరుండువినినఁ ♦ బండితుఁడగు. ౧౮౭
ఉ॥ ఇంబుగ వంధ్యయైనసతి ♦ యేనియు స్నానముఁజేసి దివ్యపీ
తాంబరముంధరించి పతి ♦ యాజ్ఞను గైకొని భక్తి నిట్టి గ్రం
థంబును విన్నచోఁ ద్వరను ♦ దజ్జలజేక్షణసామ్యపుత్రజా
లంబును గాంచు శోభనవి ♦ లాసము లొప్ప స్వధామమందునన్. ౧౮౮
తే॥ రోగి యిద్ది వినినచో నిరోగియగును, బేద యిద్ది యాలించిన ♦ విత్తవంతుఁ
డగును బద్ధుండు విన్నచో ♦ నట్టిబంధ, నంబునుండి ముక్తుండగు ♦ నవ్యచరిత!
సీ॥ క్షత్రియుండీకృతిన్ ♦ గార్తికమాసంబు, నందు నాలించిన ♦ నధికభక్తి
బార్థివులందఱు ♦ బలులిడి మ్రొక్కఁగా, సూతమాగధముఖుల్ ♦ స్తుతులొనర్ప
వారనారీమణుల్ ♦ బాడుచు నాడంగ, సుందరపుత్రికల్ ♦ సారిదిమెలఁగ
వింధ్యాచలోద్భవ ♦ ద్విపములు జెన్నార, సింధుతురంగమ ♦ శ్రేణియొప్ప
తే॥ నిత్యకల్యాణములుగల్గ ♦ నిఖలభూమి, మండలంబు వర్ణాశ్రమ ♦ మహితధర్మ
ములనునిలుపుచుఁబాలింపఁ♦గలఁడు రాజ, చంద్ర! యీవిషయంబు ని♦స్సంశయంబు
తే॥ ఎవఁడు రౌప్యఖురంబులు♦ హేమశృంగ, ములును దామ్రపృష్ఠంబును♦భూషణములు
బరగవత్ససంయుక్తగో♦ద్వయమును బ్రతి, ఖండమందిడునో వాఁడు♦ గాంచుఁగోర్కి.
ఆ॥ కారణంబులేక ♦ గర్గభాగవతంబు, వినిన సత్పురుషుని ♦ ఘన హృదయక
మలమునందు సతము ♦ మాధవుఁ డొప్పుచు, ధన్యతముగఁజేయుఁ ♦ దథ్యమిద్ది.
క॥ ఈరహి బహులాశ్వనకా, నారదుఁ డుపదేశమును నొ♦నర్చి యనుమతిం
గోరి నభోమార్గంబును, జేరెఁగదా శౌనక! ముని ♦ శేఖర! మఱియున్. ౧౯౩
క॥ జనకమహారాజీకృతి, విని ధన్యుఁడనైతినంచు ♦ వేమఱు స్వాంతం
బునఁ దలఁచుచుఁజెలఁగెను శ్రీ, వనజేక్షణభక్తిభరిత ♦ భావముతోడన్. ౧౯౪
తే॥ నీదుకోర్కినిఁ జెప్పితి ♦ నేను దీని, శౌనకా! యన్న నమ్ముని♦ తన్మునీంద్ర!
నాకు హరిభక్తిగల్గె ధ♦న్యత ఘటిల్లె, ననఁగ గర్గమహర్షియు ♦ ననియె నిట్లు.
మ॥ ధరణీభారనివారకుండు మధుర ♦ ధ్వానప్రతీత్యుజ్జ్వల
న్మురళీలోలుఁడు శూరవంశజలధి ♦ ప్రోద్యత్సుధాంశుండు స
చ్చరితుండున్ మునిశుద్ధమానససర ♦ శ్చక్రాంగభూతుండునౌ
హరి రక్షించుత మిమ్ము మమ్ము ననయం ♦ బానంద మేపారఁగాన్. ౧౯౫

తే॥ ఇట్లు సర్గవిసర్గవి♦హిత హరికథ, శౌనకాదులకుఁ జెప్పి ♦ సర్వమునులు
భక్తి సాఁగనంపఁగ ముని♦పటలతిలకుఁ,డైన గర్గుఁడు గర్గాహ్వ♦యాద్రి కరిగె.

శా॥ శ్రీమద్ద్వాదశయోజనాయతమహా ♦ సింధూజ్జ్వలద్ద్వారకా
ధామా! యోగిమునీంద్రసన్నుతపరం ♦ ధామా! శుభోత్సాహము
త్సామా! యాదవవార్ధిసోమ! యభయ ♦ శ్రీకృష్ణనామా! మహో
ద్దామా! దుష్టవిరామ! కామసమ! రా ♦ ధామానసాబ్జార్యమా! ౧౫౫

ఉపేంద్రవజ్రము.

నిరంజనా! నిర్గుణ! ♦ నిర్వికల్పా!, నిరీశ! నిర్వాణద! ♦ నిర్వికారా!
నిరీహ! నిష్కారణ! ♦ నిర్విశేషా!, పరాత్పరా! వైదిక ♦ భాగధేయా!

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చివుకుల
కులజలధికళానిధి, కోటమాంబాకామయ తనయ, లక్ష్మీదేవీ
సుబ్రహ్మణ్య దత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వ
నిశ్చయ, సుజనవిధేయ, శ్రీనివాసాపరనామధే
యాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన
శ్రీగర్గభాగవతంబందలి
విజ్ఞానఖండము
సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

హరిః ఓం తత్సత్

శ్రీకృష్ణార్పణమస్తు.

శా॥ భారద్వాజపవిత్రగోత్రజుఁడ నా ♦ పస్తంబసూత్రుండ సీ
తారామప్రియశిష్యుఁడఁ జివుకులో ♦ త్కృష్టాన్వయాబ్ధ్యబ్జుఁడన్
శ్రీరాధేశపదారవిందవిలస ♦ చ్చిత్తాళి నప్పయ్య నీ
ధీరప్రస్తుత గర్గభాగవతముం ♦ దెల్గించితిం జూ త్తిగాన్.

తే॥ ఐదువేలపై నిర్వదై♦దబ్దములును, గ్రాలఁ గలియుగమందున♦శాలివాహ
శకమునందు నష్టాదశ♦శతశరదల,పైని నలుబదియాఱేండ్లు♦వఱలు తఱిని.

క॥ రక్తాక్షివత్సరంబున, యుక్తవిజయదశమియందు ♦ నుర్వీజను లా
సక్తినిఁ జూడఁగ నీకృతిఁ, బ్రాక్తన పాఠంబుదోలఁగఁ ♦ బ్రకటించితిఁగా.

మంగళంమహత్.

శ్రీకృష్ణార్పణమస్తు.

శ్లో॥ "స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీంమహీశాః
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం లోకాస్సమస్తా స్సుఖినోభవంతు"

# తప్పొప్పుల పట్టిక.



| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౨ | ౩౧ | శ్రీకృషుండు | శ్రీకృష్ణుండు |
| ౩ | ౧౫ | తాకుముల్ | తాకులు |
| ౩ | ౧౯ | హితార్భకబాల | హితార్భక |
| ౩ | ౨౫ | బాద్యు | భాద్యు |
| ౪ | ౨౫ | బృందిష్టార్మి | బృందిష్ఠార్మి |
| ౭ | ౪ | రామరా | రామగా |
| ౧౪ | ౩ | నాంకతిస్థ | నాంతికస్థ |
| ౨౮ | ౧౮ | మారడమ్మ | మాడరమ్మ |
| ,, | ౨౯ | యశోల్లస | యశోలస |
| ౨౯ | ౨౨ | ధ్వంసబుల | ధ్వంసంబుల |
| ౩౩ | ౬ | గానవు | గావున |
| ౮౨ | ౪ | స్వర్గ్విణీ | । సగ్విణీ |
| ౮౬ | ౨౩ | లిల | లీల |
| ౫౫ | ౧౧ | గమునక | గంబున |
| ౫౬ | ౬ | స్పర్శ | స్పష్టి. |
| ౫౯ | ౧ | ,, | ,, |
| ౬౨ | ౬ | హాసుండౌట | హాస్తుండౌట |
| ,, | ౨౫ | తన్నిశాంత | త్వన్నిశాంత |
| ౬౩ | ౧౩ | రకార | యెరేఫ |
| ౬౬ | ౧౫ | ప్రకృతియె | ప్రకృతియై |
| ౭౭ | ౨౮ | నాజ్ఞ నవనిఁజేరఁ దలఁచి తొలుత సర్వ | నాజ్ఞ నవనిఁ♦ జేరదలఁచి తొలుత♦ |
| ౯౫ | ౭ | పర్గొల్లస | పర్ణోల్లస |
| ౧౦౮ | ౧౨ | మలనయను | మలనయమని |
| ౧౦౬ | ౧౧ | దక్షిణంబుగా | దక్షిణంబుగా |
| ౧౦౭ | ౨౧ | మహిళక | మహిళకుఁ |
| ౧౧౨ | ౨౬ | కారుణకారణిక | కారణకారుణిక |
| ౧౨౯ | ౧౫ | కొలుకూ | కొలువుకూ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౪౨ | ౨౨ | సుట్ట | సుట్టు |
| ౧౪౩ | ౧౭ | శ్రీధరుఁబర్దఁ బ్రహరించి | శౌరి వదునట్టులఁగొట్టి |
| ౧౪౭ | ౨ | యలరితివిగ | పొందితివిగ |
| ౧౬౨ | ౧౮ | కిర్తి | కీర్తి |
| ౧౬౩ | ౨౩ | జ్జాపురపతియ | జ్జపురనాథుఁడ |
| ౧౭౫ | ౨౮ | యటు | యటుల |
| ౧౭౯ | ౩ | ధది | దధి |
| ౧౯౮ | ౧౦ | క్షౌద్ర | క్షౌద్ర |
| ౧౯౯ | ౨౫ | క్షౌ వా | క్షౌహి |
| ౨౩౮ | ౧౦ | బ్రహ్మయ | బ్రహ్మమ |
| ,, | ౩౦ | ,, | ,, |
| ౨౮౦ | ౧౩ | కెగిన | కేగిన |
| ౨౯౨ | ౩ | సక్రమంబుగ | క్రమముగా దివ్య |
| ౩౦౫ | ౩౦ | మధురగవ్యాదుల్ | దధిపయస్సర్పుల్ |
| ౩౦౯ | ౨౬ | ద్దండ | ఉద్దండ |
| ౩౧౫ | ౮ | జెయంగ | జేయంగ |
| ౩౧౮ | ౪ | వాక్రువ్వ | వాక్రుచ్చ |
| ౩౧౯ | ౨౩ | బియ్య | బీయ |
| ౩౨౦ | ౨౩ | బాదరిస్థలం | బాదరాశ్రమం |
| ,, | ౩౦ | బాదర్యాశ్రమమున | బాదరకాననమున |
| ౩౨౧ | ౨౮ | నందనుండు | నందనుఁడు |
| ౩౨౩ | ౧౭ | గూడుయయుఁ | గూడుటయుఁ |
| ౩౨౪ | ౩౨ | నిర్ధి | ర్ధిని |
| ౩౨౮ | ౨౨ | ద్భార్యామణిఁ మైథిలా ! | ద్భామాలలామంబునఁ |
| ౩౨౯ | ౧౬ | ధాత్ర్యా | గోత్రా |
| ౩౩౦ | ౧౭ | క్షేమకరంబులాట | క్షేమదమాట నిష్ఠ |
| ౩౪౭ | ౧ | క్రమముగ | నెట్టన |
| ౩౫౪ | ౨౭ | తచ్చీరల | యా చీరల |
| ,, | ,, | చీరలఁ | చీరముల్ |
| ౩౬౧ | ౯ | ఇట్టుల | అట్టుల |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౩౯౯ | ౨౨ | లయ్యెను ఘోరరణంబు | మాత్ర మహారణమయ్యె |
| ,, | ౨౬ | నీదునో | నామనో |
| ౪౦౯ | ౩౧ | జెది | జేది |
| ౪౧౦ | ౨౩ | దంతవక్త్రుఁడు గఁదర్ | నాతఁ డాత్మగదఁనా |
| ౪౧౧ | ౧౪ | భయమిను | భయమిన్న |
| ,, | ౧౮ | డేసగింపు | డేవగింపు |
| ౪౨౦ | ౨ | కరుణతోడ | సదయుఁడగుచు |
| ౪౨౧ | ౧౨ | కాశ్వపి | కాశ్యపి |
| ౪౩౧ | ౧౩ | ముంగల | చెంతను |
| ౪౩౨ | ౧౫ | వఁమమరవలె | ఁవమమరవలె |
| ౫౭౨ | ౨౨ | భిన్నాంఘ్రిమై | ఛిన్నాంఘ్రిమై |
| ౫౭౩ | ౫ | ధనుఁవుంగొని టం | విలుఁబూనుచుఁ డం |
| ౫౮౯ | ౨౬ | ఁదద్బాణ | నాబాణ |
| ౯౧౬ | ౧౫ | బరుర్ఁబ్రహ్మర్ బలుర్ | బలుర్ఁబ్రహ్మంబునుర్ |
| ౯౨౫ | ౨౦ | శైకొనుమ ! దయర్ | సద్దయఁగొనుమా ! |
| ౯౩౪ | ౧౬ | యన వామునియుర్ | వర ! యన మునియుర్ |
| ౯౩౫ | ౧ | కరణేఁదనరి | సరణిఁదనరి |

☞ ఇంకను స న వ వ థ ధ ల ళ రేఫ శకటరేఫార్ధానుస్వారాది ప్రత్యయంబులను మన్నించి వలసినట్లు సవరించుకొని పఠింప దోషజ్ఞులను ప్రార్థించు చున్నవాఁడను. చి. అ. శా.



